Andhra University Series: No. 42

# ద్విపద భారతము

## సంపుటము 3

(భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు)

గ్రంథకర్తలు:

| | | |
|---|---|---|
| భీష్మపర్వము<br>ద్రోణపర్వము | ... | తిమ్మయ |
| కర్ణపర్వము<br>శల్యపర్వము<br>సౌప్తికపర్వము<br>స్త్రీపర్వము | ... | సోమన |

విద్వాన్.
గంటి జోగి సోమయాజి. ఎం. ఎ., ఎల్. టి.,
ఆంధ్ర విశ్వకళాపరిషత ప్రచురణ శాఖాధ్యక్షులు :



ఆంధ్రవిశ్వకళాపరిషత్తుచే ప్రచురితము

రాజమహేంద్రవరము : సరస్వతీ పవర్ ప్రెస్ నందు
శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావు గారిచే ముద్రితము.

**1950**

Price Rs. 15/-]    [వెల రూ. 15/-

మూడుసంపుటముల సెట్టు - వెల రూ. 35/-

# ఉపోద్ఘాతము

ఆంధ్రదేశమునందలి యమూల్యాంధ్రవాఙ్మయమును సేకరించి ప్రచురించుట కొఱకుగా, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు చాలకాలమునుండియు తంజావూరు మొదలగు స్థలములలోనున్న యమూల్యగ్రంథములకు నకలు ప్రతులను సంపాదించుచునున్నారు. వీరు ప్రత్యేకము 1938 వ సంవత్సరమునుండియు తంజావూరు సరస్వతీమహాలులోని తాళపత్రగ్రంథములకు ప్రతులను తయారుచేయించుచున్నారు. అట్లుసంపాదించిన యనేక గ్రంథములలో ద్విపదభారతమును సంస్కరించి ముద్రించుట కారంభించిరి. ఆకాలమున నీకార్యము సాగించుటకు అధ్యక్షులుగా శ్రీ సింగిరి లక్ష్మీకాంతంగారు నియమింపఁబడిరి. 1949 వ సంవత్సరము జనవరిలో వీరు ఉద్యోగమునుండి విశ్రాంతిపొందిరి. అప్పటికి ద్విపదభారతములోని మొదటిసంపుటము (అనగా ఆది సభా పర్వములు) ముద్రించి ప్రకటింపఁబడినది. రెండవసంపుటము ఉద్యోగపర్వాంతము వారిపర్యవేక్షణముననే వెలసినది. 1949వ సంవత్సరము అక్టోబరుమాసములో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రచురణశాఖకు నన్నధ్యక్షునిగా నియమించుటచే మిగిలిన గ్రంథమును నేను సరిచూడవలసి వచ్చినది. కర్ణపర్వము తుదిభాగమునుండియు స్వర్గారోహణపర్వాంతము పరిశీలించు నవకాశము నాకేర్పడినది.

ఈ ద్విపదభారత ముద్రణమున కాధారము చాలవఱకు దంజావూరిలోని తాళపత్రమాతృక యొక్కటియే. సౌప్తిక స్త్రీపర్వములకు తిరుపతిలో వేఱొక తాళపత్రమాతృకయుండఁగా దానిని తెప్పించి గ్రంథమును బరిశీలించి యాప్రతులయందలి పాఠాంతరములతో నా రెండుపర్వములను ముద్రించితిమి. తమ తాళపత్రమాతృకలను బంపి మా ప్రయత్నమును సఫలము చేసిన శ్రీ తిరుపతి వెంకటేశ్వర ప్రాచ్య విద్యాపరిశోధనాలయాధ్యక్షులకు కృతజ్ఞత.

ఈ ద్విపదభారత ముద్రణము నిర్వహించుటలో మొదటినుండియు సహాయులుగా శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు పనిచేయుచున్నారు.

వాల్తేరు
7-6-50

విద్వాన్ సోమయాజి,
ప్రచురణశాఖాధ్యక్షుఁడు.

# విషయసూచిక

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము



## భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము

## భీష్మపర్వము - తృతీయాశ్వాసము



## భీష్మపర్వము - చతుర్థాశ్వాసము

| విషయము | | పుటసంఖ్య |
|---|---|---|



## భీష్మపర్వము — పంచమాశ్వాసము

## ద్రోణపర్వము — ప్రథమాశ్వాసము

## ద్రోణపర్వము — ద్వితీయాశ్వాసము



## ద్రోణపర్వము — తృతీయాశ్వాసము

## ద్రోణపర్వము — చతుర్థాశ్వాసము

## ద్రోణపర్వము — పంచమాశ్వాసము

## కర్ణపర్వము - ప్రథమాశ్వాసము



## కర్ణపర్వము — ద్వితీయాశ్వాసము

## కర్ణపర్వము — తృతీయాశ్వాసము



## కర్ణపర్వము - చతుర్థాశ్వాసము

విషయము | పుటసంఖ్య

విషయము | పుటసంఖ్య



## శల్యపర్వము — ద్వితీయాశ్వాసము

## శల్యపర్వము — తృతీయాశ్వాసము



## సౌప్తికపర్వము — ప్రథమాశ్వాసము

## సౌప్తికపర్వము — ద్వితీయాశ్వాసము



## స్త్రీపర్వము — ప్రథమాశ్వాసము

## స్త్రీపర్వము — ద్వితీయాశ్వాసము

# ప్రథమాశ్వాసము

శ్రీరామచంద్ర, యాశ్రితవార్ధిచంద్ర, । సారసదళనేత్ర, శశిసూర్యనేత్ర,
పంకజగర్భసంభవ భవప్రముఖ । కింకరాస్తుత, దశగ్రీవసంహార,
అర్ణవదర్పాపహార, ఘనకుంభ । కర్ణాదిరాక్షసఖండనోద్దండ,
ఖండేందుధర చాపఖండనచండ, । కాండ పన్నగ, ఘనాఖండలవినుత,
దశరథరాజనందన, సార్వభౌమ, । అసదృశకీర్తి దిగంత విశ్రాంత,
పరమాత్మ, తారకబ్రహ్మస్వరూప, । ?జనస్తుత్య, జానకీచిత్తచోర,
శరణాగతుని నన్ను జాల రక్షించి । వరుసతో ?? దేవా! చిత్తగింపు.
జనమేజయుఁడు తొల్లి సకలభారతము । మునివల్లభునిచేత ముద మొప్ప వినుచు
వరుస నుద్యోగపర్వము విన్న వెనుకఁ । బరమహర్షమునతోడఁ బలికె సత్కథకు:
"అంభోజాక్ష, మాతాత లట్లు సంగ్రామ । మొనరించుకొఱకునై యుద్ధోర్విఁ గదిసి
తరువాత నేమివర్తనము గావించి? । రెఱిఁగింపవే! నాకు నింతయు." ననిన
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపింపఁదొడఁగె నా వృత్తాంతమెల్ల:
"కౌరవ పాండవాగ్రణు లివ్విధమున । భూరి కురుక్షేత్రమున దండు విడిసి
సమరసన్నాహంబు సమకూర్చుచోట । క్రమముతో నట నంబికాతనూభవుఁడు
గాంధారియును దానుఁ గనకపీఠమున । సంధిల్లఁ గూర్చుండి సంజయుఁ బలికె:
"జూదంబె వాదమై సుతుల కీరీతి । ఖేదమై యుంతలుపెట్టెఁ జూచితివె!
హరి వచ్చినప్పుడే యక్కటా సంధి । యనువారఁ జేయలేఁ డయ్యె రారాజు.
పాండవోత్తములకుఁ బద్మపత్రాక్షు । దండ గల్గుట కొంత తలఁపలేఁ డయ్యె.
ఏ నుపేక్షింపఁగా నిట్లయ్యె; నొకఁడు । మానుపనేర్చునే మఱి కర్మఫలము."

## ధృతరాష్ట్రుని కడకు వేదవ్యాసుఁ డరుదెంచుట

అనునంత నచటికి నరుదెంచె నమర । మునివంద్యుఁ డా వ్యాసమునివల్లభుండు.
కడునొప్పు నీలమేఘముఁబోలెఁ బల్ల । జడలు బాలార్కుని సఖ్యంబుసేయ
పుణ్యతీర్థోదక పూర్ణ పుణ్యైక । గణ్యకమండలు కరమున వెలుఁగ
దండధారుని సముద్దండ గర్వంబు । దండింపఁగల యోగదండంబు దాల్చి
చనుదెంచి యమ్మహీశ్వరునిచేఁ బూజ । లనువారఁ గైకొని యర్థి నిట్లనియె:

“కాలంబు డగ్గఱెఁ గాన భూపతుల । కాలంబు సమకూరె హస్తిపురీశ!
కురురాజు తన వృథాకోపంబె కాఁగ । పరబుద్ధి వినఁడు నిస్సార గర్వరేఖ.
ఏమిచేయఁగవచ్చు నిది యీశ్వరాజ్ఞ । యోమహీనాథ, నీవుఱక చింతిలకు.
వలనొప్పు నిట్టి దుర్వ్యాసంగంబు । తెలియఁ జూచెదవేని దృష్టి నీకిత్తు.
ఆ వాంఛ గలిగిన నడుగు వరమ్ము । నీ.” నన్న మునితోడ నృపుఁ డిట్టులనియె:
“ఎక్కుడు వాంఛచే నిట్టిఘోరాజి । చక్కఁ జూడఁగనోప సంయమితిలక!
అన్నదమ్ములు భూమికై పోరిరనఁగ । విన్నవారలకెల్ల వెఱఁగుగాదె!
ఈ వరంబొల్ల నా కిదొక్కవరము । దేవ, యీయవె! కృపాదృష్టి గల్గినను.
పాండవ కౌరవ ప్రధనవర్తనము । లొండొండ వినిపింప నొకనిఁ గల్పింపు.”
అనిన వ్యాసముని కృపార్ద్రచిత్తమున । ఘను సంజయునిఁ జూచి కనువేడ్కఁ బలికె:
“అనిలోని కేఁగి నీవరుదెంచి పతికి । వినిపింపు మచ్చటి విధమెల్లఁ దెలిసి.
ఆ రెండు తెగలవా రాడు వాక్యములు । వారి వర్తనములు వారి యెన్నికలుఁ
గలుగు రహస్యప్రకార భాషణలు । వలయు దివారాత్రవర్తన స్థితులుఁ
దలఁచిన మాత్రన నంతస్సీమలోనఁ । దెలియునట్లుగ నీకు ధీర, యిచ్చెదను.
మఱియు నవ్యాజోగ్రమ్ముల మహాయుధము । లెఱియఁ దాఁకక యుండ నిత్తునరంబు.
సమరవీక్షణకాంక్షఁ జనుదెంచు సురల । గముల రూపములు వాక్యములుఁ జిత్తములు
భావంబులును దేటపడునట్టి తెఱఁగు । వేవిధంబుల మనోవేగంబు నిత్తు.”
అని సంజయునకు మహావరంబిచ్చి । చనియె వ్యాసుఁడు స్వేచ్ఛావిహారమున.
అంత సంజయుతోడ నంబికాసూనుఁ । డెంతయుఁ బ్రీతితో నిట్లని పలికె:
“చూచితే! కురు పాండు సుతు లకారణము । భూచక్రమునకునై పోరుచున్నారు.
ఇదిగాక తొంటిభూమీశులు నిట్లు । మది మది నపనిక్కై మత్తులై పోరి
పృథివిఁ గూలినవారు పెక్కని విందుఁ । బృథివి నెట్టి విశేషబృందంబు గలదొ?
యిది నాకుఁ దెలియ నీవెఱిఁగింపు.” మనిన । సదమల వాక్ప్రౌఢి సంజయుఁ డనియె:

## సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరిణామంబు చెప్పుట

“జానొప్పు నీధరాచక్ర విశేష । మేనెంతవాఁడ నీ కెఱుఁగఁజెప్పఁగను.
విన నా యెఱిఁగినయంత చెప్పెదను । మానవేశ్వర, విను మహీ మహత్త్వంబు.
నానాప్రకారమై నడచు చరాచ । రానీకములు భూమి నవతారమందు;
నిందె వర్ధిలు పెక్కు నిందె యడంగు; । సందేహమే భూమి సకలంబు తాన.

అరసిచూడఁగ శబ్ద మాకాశగుణము ; । పరఁగ సమీరణము శబ్దస్పర్శములను ;
రూఢి శబ్దస్పర్శ రూపగుణంబు । లొలుపఁబెట్టియుండు నా తేజమునకు.
రుచిర శబ్దస్పర్శ రూప[1]రసంబు । లుచితంబులై యుండు నుదకంబునకును.
ఇన్ని గుణంబులు నెనఁగ గంధంబు । నన్నియై యొప్పారు వసుధకు నెపుడు.
అదిగానఁ బంచ[2]భూతాధికం బనఁగ । బొనరిన యీక్షోణిఁ బొగడ నచ్చెరువు.
మేరువనంగ భూమీధరం బొకటి । భూరి భయంకరాద్భుత పుణ్యభూమి.
వివరింపఁ బదియారువేల యోజనము । లవనిఁ గ్రుంగిన పాద మమ్మేరువునకు.
భ్రాజితంబుగ నెనుబది నాల్గువేలు । యోజనంబులు దాని యూర్ధ్వభాగంబు.
అట్టి మేరువు దక్షిణాంగంబునందుఁ । బుట్టె నుత్తాల జంబూవృక్ష మొకటి,
దివ్య తేజోభాగ్య దీప్తుల నడరు । సవ్య సుదర్శన నామకంబునను.
విస్తారమై రెండువేలు నేనూరు । ప్రస్తుత యోజన ప్రఖ్యాతి వొడవు.
దానిపండులు మహీస్థలి మహానినద ; నై నిరతము రాలి యవియుచునుండు.
ఆ రస మ్మొక్క యేరై మేరువునకు । భూరి ప్రదక్షిణంబుగ నేఁగుదెంచి
పొనర నుత్తర కురుభూములు చొచ్చి । వనధిఁ గూడుటఁ జేసె వసుధేశతిలక !
భూమి నత్తటిని జంబూనది యయ్యె ; । ఆ మహానది సోఁకి యచటఁ బైఁడయ్యె.
జంబూనదీతోయ సంసర్గమహిమ । జాంబూనదఖ్యాతి సంధిల్లెఁ బసిఁడి;
కానదీతోయంబు లానిన మనుజు । లేనాశమును జెంద రెఱుఁగరు ముదిమి.

... ... ... ... ... । ... ... ... ... ...

ఇట్టి సర్గమునకు హేతువై పరఁగు । నట్టి జంబూమహీజాఖ్యానమునను
బొలిచె నిద్దీవి జంబూద్వీప మనఁగ, । వెలసె సుదర్శనద్వీపంబు ననఁగ.
మొదలను లవణసముద్ర ముద్రితము । ఇది కమనొప్పారు నేమి చెప్పెడిది.
ఓదేవ, యీదీవి కుత్తరసీమఁ । బ్రోది గల్గిన మేరు భూధరంబునకు
నిటఁ బ్రదక్షిణముగా హేమకూటంబు । నట నిషధంబు హిమాచలేంద్రంబు
శ్వేతపర్వతమును శృంగవంతంబు । నాతరువాత నీలాద్రియు నమరు.
ఇట్టి శైలములకు నెల్ల రాజనఁగఁ । బట్టు గల్గిన మేరుపర్వతాగ్రమున
మునులుఁ గిన్నరులుఁ గింపురుష గంధర్వ । ఘన సిద్ధ సాధ్య[4]దిక్పతు లాదినైన

1. గుణంబు. 2. భూతాత్మకం 3. నుత్పాత. 4. దిక్పతులు నాదైన. (మూ)

దేవయోనులు మహాదివ్యసౌఖ్యముల । వేవిధంబుల ననుభవించుచుండుదురు.
మొనగట్టి తత్ప్రాంతమునఁ గర్ణికార । వనమున సకలదేవతలును గొలువ
హిమశైలపుత్రీసమేతుఁడై శివుఁడు । విపులసౌఖ్యంబుల విహరింపుచుండు.
మొదల జంబూద్వీపమునఁ గలయట్టి । సదమల వస్తువిస్తారంబు వినుము.
కరమొప్పఁ దొమ్మిది ఖండంబు లగుచు । వరుసంబులనఁగ నివ్వసుధలోఁ *బరఁగు.
ధరణీశ, శృంగవంతము మధ్యసీమ । వరుస నైరావత వర్షమై పరఁగు.
కీర్తి కెక్కిన శ్వేతగిరిపొంత పుణ్య । వర్తి హైరణ్మయవర్షమై పరఁగు.
తగిలి నీలాద్రి కుత్తరదక్షిణముల । నెగడె నారమణక నీలావృతములు.
జగదేక దేవతాస్థానమౌ మేరు । జగతీధరేంద్ర ప్రాచ్య ప్రతీచ్యముల
లాలిత కేతుమాలాఖ్యవర్షంబుఁ । జాల భద్రాశ్వవర్షమును శోభిల్లు.
ఉరుతర హేమకూటోత్తరమందు । హరి వరుషంబునా నలరారుచుండు.
సరి హిమవంతు పార్శ్వములఁ గింపురుష । వర్షంబు భారతవర్షంబు నమరు."
అనిన సంజయుఁ బల్కె నాంబికేయుండు: । "వినవలెఁ జెప్పవే! విశదంబుగాఁగ,
జలనిధులను సమస్తద్వీపములను । వెలయు ప్రభావంబు విశ్రుతక్రమము."
నావుడు నతఁడు భూనాథునిఁ బలికె: । "ఈ విధంబంతయు నెఱిఁగింతు వినుము,
రీతైన లవణవారిధి నట్టనడుమ । భూతి విఖ్యాత జంబూద్వీప మమరు.
మొదల నిక్షుసముద్ర ముద్రితంబగుచుఁ । బొదలెఁ బ్లక్షద్వీపభూమి యెంతయును.
తేనియ మున్నీరు తిరిగి కొల్వఁగను । ధీనుతి శాల్మలీద్వీప మొప్పారు.
భూపాల, ఘృతమహాంభోరాశి నడుమ । దీపితంబగు కుశద్వీపంబు పొలుచు.
దధి మహాంభోరాశి తను జుట్టికొలువ । నధిప, క్రౌంచద్వీప మలరారుచుండు.
క్షీరవారాశివేష్టితమై నిధాన । గౌరవంబగుచు శాకద్వీప మమరు.
అరుదైన శుద్ధోదకాంబుధి తన్ను । దిరిగిరాఁ బుష్కరద్వీపంబు చెలఁగు.
అమర నెన్బదివేలు నార్నూరు యోజ । నములు జంబూద్వీప నవ్యవిస్తృతము.
ధీర, చూడఁగ దాని ద్విగుణప్రమాణ । ... ... ... ... ...
మన శాల్మలీద్వీప మధికమై పరఁగు । ... ... ... ... ...
తెగువమై శాల్మలీద్వీపంబుకంటె । ద్విగుణమై విను కుశద్వీపంబు నెగడు.

* 'జంబూద్వీపము' కర్త అధ్యాహార్యము.

దానికి రెట్టియై తనరారుచుండు । జానొప్పఁగాను క్రౌంచద్వీపభూమి.
అందుకు నినుమడై యలరారు నెపుడు । క్రందుకొనంగ శాకద్వీప మధిప!
ఈరీతి నొండొంటి కెక్కుడై పుణ్య । సారమ్ములై మహాసౌఖ్యమ్ములగుచుఁ
బరఁగు నీదీవులఁ బర్వతమ్ములును । వర పుణ్యనదులును వస్తు సంఘములు
ధనధాన్య వస్తు వితానంబు దివ్య । మునులు దేవాలయంబులు ససంఖ్యములు.
అంతకుఁ గర్తయు [1]నాప్రహర్తయును । శాంతచిత్తుండైన సర్వేశ్వరుండు
డాకొన్న కపట నాటకసూత్రధారి । వైకుంఠపతి భక్తవత్సలుం డెపుడు
నగణిత కనకమయంబైన యట్టి । ... ... ... ... ...
భూతప్రభూతముల్ ఘూర్ణిల్లు చక్ర । చేతో జనప్రభాంచిత శకటమునఁ
గమలావినోద ప్రకార పరాయ । ణమునఁ గృపామూర్తి నటియింపుచుండు."
అనిన నద్భుతమంది యటఁ దలనూఁచి । జనపాలవరుఁడు సంజయున కిట్లనియె:
"క్రౌంచెంబులోపలఁ గొంచెమిా వరుస; । మించుకనేల తా రిం దేలవలసి
రణమిట్లు చేయఁ గౌరవ పాండవులకు । గణుతింప నగుఁబాటు కాదొకో తమకు!
లుబ్ధ[2]బుద్ధులొకింత లోఁగరుగాక । లబ్ధమెయ్యది బంధులను జంపుకొనఁగ?"
ననిన సంజయుఁ డను: "నవ్విల దేవ! । విను మింతయును నీకు విస్తరించెదను.
ధర లుబ్ధబుద్ధి నీతనయుఁడే కాని । యరయఁ బాండవులకు నత్యాశ లేదు.
నీబుద్ధి హరిబుద్ధి నీతి గైకొనక । సొలు కలుపుచే క్షితి దెచ్చుకొనియె.
వారు పూనికదీర్చి వచ్చినఁ గొనక । వారక తా బలవంతుఁడు వోలె
భువిలోని తగవునఁ బోనీఁగ వారలకు । నవరాజ్య మీకున్నఁ జంపకుండుదురె!
అట్టుండె నీవర్షమందు వర్తించు । నట్టి విభూతి వాయక యెఱింగింతు.
మలయశైలంబు శుక్తిమంతము వింధ్య । యలము హేమాద్రము పారియాత్రాచలంబు
తగుసహ్యబుక్షవంతములన గోత్ర । నగము లేదు చెలంగు నరనాథతిలక!
ఇందు నానాధాన్య హేమమాణిక్య । సందోహములు ఘటించఁగ ననువగును.
తగరంబుఁ గంచును దామ్రంబు నినుముఁ । దగు గంధ వస్తుసంతతి యిందు దొఱకు.
గంగయు సరయువుఁ గావేరి పెన్న । తుంగభద్రయు శతద్రువు తామ్రపర్ణి
తమస నర్మద వితస్తయు విపాశయును । యమున బాహుదయు నేత్రావతి నసఁగఁ

---

1. నాపహర్తయుఁ బ్ర. 2. బుద్ధుల కింత లొంగరు (మూ).

దలఁచినమాత్రఁ బాతకరాశినెల్ల । నలియఁజేసెడు పుణ్యనదు లనేకములు.
కాంచి శ్రీశైలంబుఁ గాశి వెండియును । సంచిత పుణ్యదేశము లనేకములు.
గాంధార కాంభోజ గౌళాంగ వంగ । సింధు కర్ణాట కాశ్మీర సౌరాష్ట్ర
పటు విదేహ త్రిగర్త పాండ్య సింహాది । ఘటిత దేశము లిందె గలవు భూపాల!
వరుస నష్టాదశవర్ణంబు లందు । వర పుణ్యసతులును వారకాంతలును
గమనీయ రూపరేఖా విలాసముల । నమరుదు రిందు నేమని చెప్పవచ్చు!
కావున దీనికై క్షత్త్రియవర్గ । మేవిధంబునఁ బోర కేల మానెదరు?
అన్నదమ్ములు తండ్రి యన లెత్తిపోయి; । యెన్నికఁ బోరాడి యేలుదు రుర్వి.
అదిగాన మనవార లవనికై యిట్లు । ఎదిరి పోరాడుట యెగ్గుగా దనఘ!"
అనిన సంజయుని వాక్యములకు మెచ్చి । మనుజేశుఁ డతని సమ్మానించి పలికె:
"రమణ, నీవింకఁ గౌరవ పాండు సుతుల । సమరంబుఁ జూచి యచ్చటి విశేషములు
వినిపింపు మాకును విశదంబుగాఁగ." । అనుటయు సంజయుఁ డాప్రొద్దె యరిగి
పది దివంబులు భీష్ము బవరంబు చూచి । పదునొకండవనాఁడు పతిఁ గానవచ్చి
యతని యంఘ్రుల నుత్తమాంగంబు మోపి । సతులు భీతిల నొక్కజాము వాపోయి,
యిదియేమి సంజయ, యిదియేమి యనఁగఁ । బదరి భీష్మునిపాటు పతితోడఁ జెప్పె.

## భీష్మ మరణమువిని ధృతరాష్ట్రుఁడు వలవించుట

చెప్పినఁ "బిడుగాటుచే" నద్రిగూలు । చొప్పునఁ బడి మూర్ఛసోఁకుగాఁ గూలి,
హాహాధ్వనులతోడ నంగనలెల్ల । నోహటించిన శిశిరోపచారములఁ
గొంత దెప్పిరియు డగ్గుత్తికవెట్టి । యంతంత నాతఁ డిట్లని ప్రలాపించె:
"హా జాహ్నవీపుత్ర! హా లోకమిత్ర! । హా జగన్నుతలీల! హా శౌర్యలోల!
హా [1]సోమకులచంద్ర! హా శౌరవేంద్ర! । హా సాధుగుణసక్త! హా విష్ణుభక్త!
ఎవ్వండు నినుగూల్చె! నెట్లు గూలితివి! । ఎవ్వఁడు రక్షించు నింకఁ గౌరవుల!
భృగురాము గెలిచిన బిగువెందుఁబోయె! । పగరగెల్చిన బాహుబల మెందుఁబోయె!
ప్రకటిత శస్త్రసంపద యెందుఁబోయె! । అకట! పాండవవార్ధి నడఁగితే భీష్మ!
పటువైన శాత్రవ ప్రాణవాయువుల । నెటఁ బ్రజ్వరిల్లెడి నీప్రతాపాగ్ని
కౌంతేయ కరముక్త కాండవర్షమున । నింతటిలో నాఱె నేమిసేయుదును!
పొసఁగ నాకెవ్వరు బుద్ధిచెప్పెదరు! । వసుమతి నింక నెవ్వనికి మ్రొక్కుదును!

1. సోమ. (మా)

ఇల జాహ్నవీ వంశ మింక నెక్కడిది! । తలఁప జూదంబకదా యింతచేసె!
వడి నిన్ను జంపినవాని చేతులకు । నడరిన కురుసేన లడ్డమే తండ్రి!"
అనియేడ్చి మఱియు నిట్లను సంజయునకు : । "అనఘాత్మ! యింతసత్యమె భీష్మపాటు!
భ్రమపుట్టి తప్పఁజెప్పవుగదా నీవు! । ఘనురోర్వ నతఁడేల సమయు నల్పమున!
కాదేని శౌరి చక్రము వైవవలయు ; । కాదేని శివుఁ డుదగ్రతఁ గూల్పవలయు!
ఒండేని నతఁ డేయకుండెనో గాక! । ఖండింప[1] నెట్లోపు గాంగేయు నొకఁడు!
సైంధవుం డెటపోయె? శకుని యేమయ్యె? । గాంధారికొడుకు లెక్కడనుండి రపుడు?
గురుఁడు తోడ్పడఁ డెట్లు? గురుతనూజాది । కురుసేన లతని దిక్కును జూడరైరె?
భూభుజోత్తముఁడుఁ గృపుండు నేమైరి? । ఏభంగిఁ బోరాడె నిరువాగు నపుడు?
బవరంబు నాకు నేర్పఱుతువు గా." అనిన । నవనీశుతోడ నిట్లనియె సంజయుఁడు :

## యుద్ధవిశేషములను సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

"ఏమని చెప్పుదు నిభపురినాథ! । ఈ మహాసంగ్రామ మెట్లు వర్ణింతు!
భారతయుద్ధంబు భక్తితో విన్న । వారికిఁ బుణ్యంబు వర్ధిల్లుచుండు.
మునుపు వేదవ్యాసముని కృపఁజేసి । వినిపింతు నే నీకు విస్తారముగను.
అనఘాత్మ, వినుము నిన్నా రాత్రి వీడు । కొనిపోయి నీపెద్దకొడుకు వేలంబు
చొచ్చితి ; నపుడు నీసుతుఁడు [2]కొల్వొచ్చి । మెచ్చుగా బీఠంబుమీఁద నున్నాఁడు.
హితులు మంత్రులుఁ బురోహితులుఁ దీర్పరులు । మతిమంతులఖిలసామంతులుఁగొలువఁ,
దఱిమి మృత్యువునైనఁ దంష్ట్రలు పెఱికి । విఱుగఁదోలెడిపాటి వీరయోధులును,
గణుతింప నింద్రునిఁ గైకొన నట్టి । మణి సువర్ణ కిరీట మకుట వర్ధనులు,
భద్రాత్ముఁడగు వీరభద్రునికంటె । రౌద్రభీకరు లతిరథ సమరథులు,
శలుఁడు శల్యుండు నశ్వత్థామ కృపుఁడు । కలశసంభవుఁడుఁ గేకయులు సైంధవుఁడు
దండనాథులుఁ ద్రిగర్తులును దుశ్శాస । నుండు బాహ్లిక వికర్ణులుఁ జేరికొలువఁ
జామరద్వయముచే సామ్రాజ్యలక్ష్మి । తామరతంపరై తన్నాశ్రయింప,
'కడియ కొత్తకు సముఖావహో' యనుచు । నదటు [3]నందడి వేత్రహస్తులు జడియఁ,
గొలువున్నవేళ నా కురురాజుఁ గాంచి । తలఁకక యేను బాదములకు నెఱఁగి
కొలిచియుండితి ; నంతఁ గురుకులేశ్వరుఁడు । పలికె దిగ్దేశభూపతుల నీక్షించి :
"నరనాథులార, పాండవులకు మనకుఁ । గరము భీకరమైన కదనంబు గలిగె.
ఇట్టిరణంబులో నీభీష్ముఁ డరులఁ । బట్టి చంపఁగఁ జలపట్టియున్నాఁడు.

1. నెట్లొప్పు 2. క్రొవ్విచ్చి. 3. సందుల. (మూ).

ఉగ్రుఁడైన శిఖండి నొక్కనిఁ జంప । [1]సుగ్రహమునఁ బాండుసుతులఁ జంపెడిని.
కావున మన మా శిఖండి మర్దనము । గావింపకుండుట కార్యమా తలఁప!
ఏమరియుండ[2]రా దిందఱుఁ గూడి । నేమించి యాశిఖండినె చంపవలయు.
అతిజతనముమీఱ నంగనాపూర్వు । క్షితి భీష్ముఁజేర[3]నిచ్చిన పని తప్పు.
రక్షచాలని మృగరాజేంద్రునైన । భక్షింపదే! నక్క బ్రదికితి ననుచు.
మదమెత్తి బెబ్బులి మఱచి నిద్రింపఁ । బొదివి తా గొఱ్ఱియైనఁ బొరిగొనకున్నె!
ఇతనిఁ గాచిన నితఁ డెల్లయోధులకుఁ । బ్రతిలేని సర్వాంగ రక్షయౌఁ గాదె!"
అని చెప్పి "యెల్లి రేపాజిసేయంగ । ఘనతర సన్నాహ కలితులై రండు
పొం" డని యనిచి భూభుజుఁడు లోపలికిఁ । జండ వేత్రకర ఘోషములతోఁ జనియె.
అంత సూర్యోదయంబైన భీష్ముండు । సంతోషమున రణోత్సాహంబు మెఱసి
కాలక్రియలు దీర్చి కాంచన రత్న । లాలిత భూషణాలంకారుఁ డగుచు
ధళధళాయితమాన తప్త సువర్ణ । మిళిత వస్త్రము మేన మెండుగాఁ గట్టి
శరచాప కవచాది సన్నద్ధుఁడగుచు । ఖర కర ప్రతిమాన ఘన తేజ మమర
వెడలెఁ గౌంతేయుల విజయంబుగోరి । తడయక భటకోటి తనుఁజేరి కొలువ.
అప్పుడు రారాజు నఖిలభూవిభులుఁ । దప్పక సంగరోత్సవమెల్ల మెఱసి
తమ తమ బలములుఁ దమ తురంగములుఁ । దమ మత్తగజములు దట్టమై నడువ,
భేరీ ధణంధణ పృథుల ఘోషముల । చే రౌద్రమై దిశల్ చిల్లులుపోవ,
[4]ఉఱుకు రథంబులు నొక్కొక్కయూరి । పఱపునఁ దముఁజేరి పదిలమై నడువ,
మెఱపుల తళుకునా మెఱయు పట్టెములుఁ । దఱుచైన బరిగోల దళములుఁ జెలఁగ,
ననదృశ ప్రభలు దైవాఱఁ గైసేసి । వెస దండనాథుని వెనుకొని చనిరి.
కౌరవపతియు సంగరకుతూహలము । చారుముఖాబ్జప్రసన్నత దెలుప
సుతులు సోదరులును జుట్టాలు సఖులు । హితులు మంత్రులుఁ దన్ను నెలమి సేవింపఁ,
జండతురంగ హేషారవంబులును । దండియౌ కరిబృంహితములు నుబ్బెసఁగ,
ననురక్తి నేకాదశాక్షౌహిణులును । దన కేతనచ్ఛాయఁ దగిలిరాఁ గదలె.
మఱియుఁ గాంచనరత్నమయరథంబెక్కి । మెఱసె సంగరమున మేటి ద్రోణుఁడును.
వృత్త చక్ర[5]హయోగ్ర వృషభాఖ్య కేత । నోత్తమ ఘనరథంబొనర నాకృపుఁడు,

---

1. సంగ్రామమున. 2. లేదిందఱు. 3. వచ్చిన. 4. నూరకరథంబు లొక్కొక్కవూరి
5. హయంగ. (పా)

మణి సింహలాంగూల మహితధ్వజంబు । ప్రణుతినొప్పెడు మహారథుఁడు ద్రౌణియును,
అతుల వరాహధ్వజాతపత్త్రముల । వితతుఁడై రణకళావేది సైంధవుఁడు,
శ్రీకర భూషణాంచితుఁడై గభీర । భీకరస్ఫూర్తి శోభిల్లు శల్యుఁడును,
దూరీకృతారాతి దుశ్శాసనుండు, । భూరివిక్రముఁడైన భూరిశ్రవుండు,
ఘనపరాక్రముఁడు త్రిగర్తనాథుఁడును, । అనఘవర్తనులు విందానువిందులును,
శూరులు బాహ్లీక సోమదత్తులును, । ధీరుఁడు మాహిష్మతీనాయకుఁడును,
మరు గౌళ కర్ణాట మగధ కాంభోజ । నరనాయకులును, గాంధారభూపతియు
ననువారు వీరు మహారథోత్తములు । ఘనతర సుభట సంకలితులై కదలి
నాగకేతనుని ముందట వెన్కఁ బార్శ్వ । భాగంబులను గూడి పయనమై చనిరి.
ఈరీతి నా కౌరవేశు సైన్యములు । ఘోరవైఖరిఁ గూడుకొని దిక్కులద్రువ
ఘన శతకోటి ముద్గర శూల ముసల । ధనురస్త్ర కుంత గదాదండ నఖర
పరశు తోమర భిండివాల చక్రాది । గురుతరాయుధ పంక్తి గుంపులై నడవఁ,
బ్రళయకాలాంబుద పటల ప్రమాణ । ఫలకసంఘంబు లుద్భటమై చెలంగ,
జనపాల రత్న కాంచన సముజ్జ్వలిత । ఘన కిరీటప్రభా ఘనతేజ మలర,
సురలకైనను దేరిచూడంగ రాక । కర ముగ్రమై యుండె ఘనధూళి పొదలి.
మఱియు భూషణ [1]వజ్రమహిమ హంసముల । తెఱఁగైన, హరినీల దీధితుల్ భృంగ
మాలికాకృతి నొప్ప, మాణిక్యకాంతి । జాలంబు పద్మవిశాలత దెలుప,
కురుసేన తామరకొలని చందమునఁ । బరికింప నొప్పె భూపా! యేమిచెప్ప.

## భీష్ముఁడు నిజయోధుల కుత్సాహంబు గలిగించుట

చని చని యారీతి సంగ్రామభూమి । గని ముందు విడియుచో గాంగేయుఁ డపుడు
తప్పక నిఖిలభూధవులను వరుస । రప్పించి యిట్లను: "రాజేంద్రులార!
జాలినిబడి యింటఁ జచ్చుటకంటెఁ । బోలఁ గురుక్షేత్రమునఁ బడుటొప్పు.
ఆజిఁ గూలుట సహస్రాశ్వమేథంబు । లోజఁ జేయుటగాదె యుర్వీశ్వరులకు!
నాఁ డన్నమాటకై నాతోడి కినుక । రాఁడయ్యెఁ గంటిరే! రాధేయుఁ డనికి.
పొసర నేలికసొమ్ము బుక్కముగాఁగఁ । దిని పోటుతరువాతఁ దేరకాఁడయ్యె.
తాను రాకుండినంతనె నాకుఁ గార్య । హాని పుట్టెడునొకో! యాజిమధ్యమున.
తనుఁ దోడుగోరునే! తటినీసుతుండు । ఘన భార్గవాస్త్ర విఖ్యాత కోవిదుఁడు.

1. వ్రజ.

అంధకారముఁ జింప నర్కుండు కుముద । బంధుని తోడాసపడునె! యెందైన.
అట్టుండె మీసైన్యమంతయు నిపుడు । గట్టి ముగ్గరములుగాఁ దీర్పుఁ" డనుచు
ననిచిన వారు సాహసభాషలాడి । చనిరంత నాత్మీయసైన్యంబులకును.
అట్టిచో గాంగేయుఁ డధిపతిఁ జూచి । పుట్టిన భయమెల్లఁ బోవ నిట్లనియె:
"కౌరవ్య, వెఱవకు; కౌంతేయవరుల । ఘోరాజిఁ గూల్చి నీకును జయంబిత్తు.
ఒకనాఁట వేవుర నురుకాంతి రత్న । మకుటవర్ధనులఁ జంపక పోనువిడువ.
నిజము పార్థులఁ జంపి నీచేత నుర్వి । ప్రజల నేలింతు నాపలుకు సాక్షితు."
అనిన సంతోషించి యహికేతనుండు । ననదండనాథుఁ గీర్తనచేసి పలికె:
"నేఁడుగదా భీష్మ, నీ ప్రతాపాగ్ని । వేఁడిమి నాతోడ వెడలనాడితివి.
తొలుతఁ గార్యము[1]చెప్పి తుదముట్ట దానిఁ । దలకొనుటెల్లఁ బెద్దల రీతిగాదె!
హరిహర బ్రహ్మాదులైన దేవతలు । పరిగణింతురు నీప్రభావపత్తనలు.
దానికిఁ దగఁ బాండుతనయుల గెల్చి । పూనిక నాకీవె భూమి యంతయును."
అని వెండియును బల్కెఁ: 'ననఘ, యీసేన । కనువైనయట్టి వ్యూహంబుపన్నింపు."
నావుడు నద్దండనాథుఁ డవ్విభుని । యానతి వహియించి యతిసంభ్రమమునఁ
దవిలి ద్రోణుఁడుఁ దానుఁ దాలకేతనము । నవవేదికాకేతనముఁ దేజరిల్ల
బలముల మెలఁగి యేర్పఱచి యేర్పఱచి । సొలవక నుఱిపోఁజులు దీర్చి తీర్చి
తూర్పు పిఱుందుగా దొరలను నునిచి । దర్పించి మొనలముందటఁ దాను నిలిచెఁ
బడమర మొగమైన భానుండుపోలెఁ । బడ[2]నాయితంబైన పండునుబోలె.
వలపటఁ గృపుని నశ్వత్థామ నునిచి । వలచి డాపటఁ గృతవర్మ మద్రపుల
వడి వెన్క భూరిశ్రవసుని బాహ్లీకు । నడుమఁ గుమాళ్లతో నరపతి నునిచి,
యతనికిముందటఁ బ్రతిజ్ఞాశీలుఁడైన । యతివీరు సంశప్తకాధీశుఁ బెట్టి,
మఱియు సామంతుల మగఁటిమి భటులఁ । దరువాతగా నిల్పి తగిన తావులను
గొలఁది[3]గానని యేనుఁగులకుఁ దేరులను, । పొలివోని యారథంబులకు గుఱ్ఱముల,
నాయుత్తమాశ్వంబులకు విలుకాండ్ర । నాయుధంబులవారి నటు నిల్వఁ బనిచి,
మానుషవ్యూహంబు మానుషాలోక । నానంద భయరౌద్రమైయుండఁ బన్ని,
నిజము దీనికి నిది నిర్ణయంబనుచుఁ । బ్రజల నియోగించు బ్రహ్మయుఁ బోలె
నందఱ నియమించి యుత్సాహోత్సాహ । కందళితాత్ముఁడై గాంగేయుఁ డొప్పె.

---

1. దప్పి తుదిముట్టొనేని. 2. నాయతము. 3. గా నియ్యేనుఁగులకు. (మూ)

ఇట్టి రాజవ్యూహ మొంగఱి సణఁగఁ | బుట్టినో యని భీతిపుట్టె లోకులకు.
అది లోకములమ్రింగ నభవుండు తెఱచు | వదనంబుఁబోలె నుజ్జ్వల భీమరేఖ.
కనుఁగొనవచ్చిన ఘన సిద్ధ సాధ్య | దనుజ గంధర్వ విద్యాధరాధిపులు
ఆసేన కడగట్టు హావణు గంభీర | మాసంభ్రమముఁ జూచి యాశ్చర్యపడిరి.

## పాండవయోధులు యుద్ధమునకు వెడలుట

అటమున్న ధర్మరాజతివైభవమునఁ | బటహ భేరీ భూరి భాంకార మడరఁ,
దుహినాంశు లీలఁ బెక్కు శోభినో యనఁగ | బహుభంగి ధవళాతపత్రముల్ వెలుఁగ
నురుభాగ్యమునఁ దన్ను నూపులం తేసి | ధరణీనాయకుల రథంబులు గొలువఁ,
దురగఖురోద్ధూత ధూళి యచ్చరల | శిరసుపూవులతోడఁ జెలుములు సేయ,
వరుసఁ గేతన మణివ్రాత దీధితులు | ఖరకర కిరణ సంఘములతో నొరయఁ,
గైసేసి రథమెక్కి కదలె నల్లడల | భాసిల్లు చతురంగబలములు గొలువ.
అతనివెంటనె గూడి యనిలసంభవుఁడు | ప్రతిలేని భూషణప్రభలు శోభిల్ల
సంగరం బాదవిన సంతోషమహిమఁ | బొంగారు భుజము లద్భుతముఁ బుట్టింప
డాకాల బిరుదు కూడక యెత్తురాప | భీకర మణిగండ పెండెంబు దాల్చి,
కౌరవనయన భీకర భూరి ఘోర | ధారల గద బాహుతలమునఁ దాల్చి,
క్రందొప్పఁ దన పరాక్రమము లందంద | వందిమాగధకోటి వర్ణనసేయ,
[1]హావణించి భేరి కాహళ శంఖ పటహ | రవములతో మహారథమెక్కి వెడలె.
ఇట్టి భీముని వెంట నింద్రనందనుఁడు | చుట్టును బహురాజసుతులు సేవింపఁ,
వెలఁగి దేవేంద్రుఁ డిచ్చిన కిరీటంబు | ధళధళాయత కాంతిఁ దరుణార్కుఁ బోల,
గరుడాంకచోదితోత్కట ధవళాంగ | హరి సమన్విత రోహణాద్రిప్రమాణ
కపికేతనాభీల ఘంటికాఘోష | విపుల ప్రభాభాను విస్ఫురద్రథము
నుదయాద్రి నెక్కు సూర్యుఁడుపోలె నెక్కి | కొదలేని ముత్యాల గొడుగులనీడఁ
దను నుత్తమౌజోయుధామన్యు లెపుడు | ఘన చక్రరక్షకఖ్యాతి సేవింప,
కాలకేయ నివాతకవచాది రిపులఁ | జాలఁ దిన్నట్టి యక్షయబాణములును,
కంటక త్రిపురారి కటకంతుశిరము | గెంటుగాఁ బగులఁ దాఁకిన గాండివంబు,

---

1. హావణైక. (మూ).

బావుగా నిర్జరప్రతతి మెచ్చునకు । దీవించి యిచ్చిన దేవదత్తంబు
ధరియించి వెడలె ముందఱ వేత్రకరులు । చరియించి సందడిజడియ బ్రేయఁగను.
క్రీడి పిఱుంద మాద్రీతనూభవులు । వేడుక మెయివెంప విభవంబు మెఱసి
తమ సౌకుమార్యంబు దర్శించి రాచ । గములు లజ్జించి శృంగారంబు లుడుగ,
లెక్కలేని రథావలియు భటావళియు । మిక్కిలి హయములును మిక్కిలి కరులు
బలిసిరాఁ జనిరి ద్రౌపది పగదీర్పఁ । గలిగె మాకనుచు విశ్వాసంబుతోడ.
వారివెంటనె కూడి వశిత శస్త్రాస్త్ర । పారీణుఁడైన సుభద్రాసుతుఁడును,
పౌరుష కోదండ బహుళ విద్యావి । శారదులైన పాంచాలసూనులును,
రసికులౌ తమ యీడు రాచకుమాళ్లు । వెసతోడ నేతెంచి వెంట నేతేర
శేషప్రమాణ విశేషతుండాగ్ర । భీషణ మత్తేభ బృందంబు నడవ,
హేషారవంబుల కిరవులై రత్న । భూషిత ఘోటకంబులు పెక్కు నడవ,
కన్నెకయ్యము నేఁడు గలిగె మాకనుచు । వన్నెమైఁ జనిరి సర్వబలంబు గొలువ.
ద్రుపదుండు ధృష్టకేతుఁడు మత్స్యదేశ । నృపుఁడు [1] శిఖండి శినిప్రవరుండు
ఘన చేకితాన మాగధ సహదేవు । లనువారు సప్తసంఖ్యాక్షోహిణీశు
లనికి రథారూఢులై మహోద్దండ । ధను రస్త్రకేతనోద్ధతులునై చనిరి.
మఱియు మాయాబలోన్మత్తుఁడై సేన । తఱచునఁ గదలె నత్తఱి ఘటోత్కచుఁడు.
గదుఁడు పాండ్యుండు కేకయులు శైబ్యుండుఁ । గదలిరి సేన లగ్గలముగాఁ గొలువ.
వెండియు ఘనులైన వివిధ దిగ్దేశ । మండలాధిపులు సామంతులు భటులుఁ
దమతమరథములుఁ దమ లాంఛనములుఁ । దమ సైన్యముల నొప్పి దర్పంబు మెఱసి
బిరుదడిండిమములు భేరులు గౌళ్లు । మురజకాహళములు ముంగలితిండ్లు
తమ్మటమ్ములు డోళ్లు తప్పెట్లు బూర । కొమ్ములు గిడిగిళ్లుఁ గోలాహలముగఁ
గనుఁగొను ఖచరుల కనుబాటు దాఁకు । నని యాతపత్ర సహస్రంబులాఁగ
బిరుదుటెక్కెంబులు భీకరధ్వజము । లరుణాంశునిభమైన యస్త్రశస్త్రములు
భూషణంబులు మహాద్భుత చామరములు । వేషంబులును నొప్ప వెడలి రాజికిని.
అప్పటి సంరంభ మధినాథ, యేమి । చెప్పంగవచ్చు ! విచిత్రమై తోఁచె.
ప్రాచిపయోధితోఁ బశ్చిమాంభోధి । యేచి పోరాడఁ బోయెడులాగు దోఁచె.
ఘన సైన్యధూళి యాకాశంబు నిండి । యనిమిషనామంబు లణఁచె లేఖులకు.
నలువై నయట్టి సేనాముఖంబునకుఁ । దిలకమై పాంచాలదేశేంద్రసుతుఁడు

---

1. శిఖండికిని ప్రధరుండు. (మా)

అగ్నికుండజుఁ డితండని తోఁప దేహ । మగ్నివర్ణమునఁ బాయక తేజరిల్ల,
ననువు లెఱింగి వ్యూహము గూర్చి విప్పఁ, । బనిమంతులగు వేత్రబాహులు గొలువ,
ఘనసైన్యసరిసిలోఁ గలహంస వోలెఁ । దనయుని శ్వేతకేతువు సంచలింప,
నటువచ్చు నిటువచ్చు నధిపు వీక్షించుఁ । దుటుములుగా సేనఁ దోలించు విప్పు
ధరణినాయకులఁ బంతంబులాడించు । దొరలతో భాషించు ద్రోణు నిందించు
యమసూతికడ వేత్రహస్తుఁడై నిలిచి । సమకొన్న సందడి జడియంగ ద్రేయు,
మితికి నజ్జును తేరిమీఁదికివచ్చు, । నతనితోఁ బంతంబులాడి మెప్పించు.
ఇట్టు ధృష్టద్యుమ్నుఁ డేతేర జముని । పట్టి కురుక్షేత్ర బహుపుణ్యభూమి
గడిసి కౌరవులనుగాంచి కట్టెనుట । మొదలనే తనసైన్యముల సల్పఁబనుచి
జయసూచకములైన చారునిమిత్త । చయములకెల్ల హర్షంబునొందుచును
అడియాలములతోడ నక్కడక్కడను । బుడమిఱేఁడుల నిల్పి భూమివల్లభుఁడు
ఇరువాగుఁ గలయంగ నీక్షించి యపుడు । పరమాదరమున భూపతుల కిట్లనియె :
"ఈ యాజి మనకింక నింద్రత్వ మొండెఁ । బాయని రాజ్యవైభవ మొండెఁ గలుగు.
ఒక్కట గురు... ...తరవా... .. । ... ... గానొప్పు నీసేనకంటె.
ఈసేన ఘనమయ్యె నెట్లొకో యింక । మో సనా వలదు నమ్ముఁడు క్రీడి గలఁడు.
కాలకేయ నివాతకవచులఁ జంపె; । శూలితోఁ బోరాడె; సురరాజు గెలిచెఁ;
జిత్రసేను జయించెఁ జెలఁగి కౌరవ్య । చిత్రసేను వధించెఁ జిత్రంబుగాను.
దివ్యాస్త్రలాభంబు దివ్యతేజంబు । నవ్యాహతంబు లీ యర్జునునకును.
మీ రెల్ల నల్పులే! మిహిరప్రతాప । పౌరుషాధికు లెదుర్పఁగరాదు మిమ్ము.
ఏభంగినైన నా కీ సేన గెలిచి । సౌభాగ్యముగ రాజసౌఖ్య మీవలయు."
అనిన వారలు తమ కర్హమౌనట్లు । వినుతిఁ బంతములాడి విభుని మెప్పించి
సమరసన్నాహంబు సమకూర్చుచోట । యమసూతి క్రీడి కిట్లను విన్ననగుచు :
"సహజన్మ, చూచితే! సర్పాంకు యత్న । మహహా యీసేనకు నధికంబు గూర్చె.
ఇదె మానుషవ్యూహ మింద్రాది భయద; । మదె భీష్ముఁ డున్నవాఁ డగ్రభాగమున.
ఏభంగి గెల్తుమో యెఱుఁగముగాని । యీభీష్ముఁ జూచి నాకిదె భీతి వొడమె."
అనిన నవ్వుచుఁ గ్రీడి యన్న కిట్లనియె : । "జననాథ, నీవు సంశయ మందనేల!
ధర్మంబుగలచోటఁ దాఁ జేరు జయము । ధర్మనాశకుల చెంతలఁ జేరదనుచు
వారక ద్రోణుండు వ్యాసుండు వినఁగ । నారదుం డొకనాఁడు నాకెఱిఁగించె.

కావున ధర్మంబుగలిగిన నిన్ను । ద్రోవక జయము చేరుట దుష్కరంబె!
అదియునుగాక మహాసత్వధనులు । ... ... ... ... ...
విరటుండు శంఖుండు విను ఘటోత్కచుఁడు । దొరలు వెండియును యోధులు ధురంధరులు
నీకు నున్నా ; రట్టి నృపులలో నొకఁడ । చీకాకుపడఁ గురుసేన మోదెడిని.
గాండీవ మిపుడు తెక్కలు వచ్చినట్లు । మండలేశ్వర, మాఱు మలయుచున్నదియు.
దొనలలో నస్త్రసందోహంబు వెడలి । పనుపు మమ్మని తీవ్రపడఁజొచ్చె నధిప !
వడముడి గద కౌరవవ్యూహమునకు । విడు విడు మనఁజొచ్చె వేగిరింపుచును.
దానిపై నీలావు తలఁపవుగాక । దానవానళినైన దండింపఁగలవు.
ఇట్టి నీవలిగిన నెవ్వండు నిలుచు ? । కొట్టివైపించెదు కురుసేన నేఁడు.''
అనిన సంతోషించి యధిపతి తెలిసి । యనిమిషేశ్వరుసూతి నపుడు వీక్షించి,
" మును కౌరవవ్యూహమునకుఁ దగంగ । ఘనతరవ్యూహ మొక్కటి పన్నఁబనుపు.''

## ధృష్టద్యుమ్నుఁ డచలవ్యూహము పన్నుట

అనిన నాతఁడు ద్రుపదాత్మజు నచల । మను మహావ్యూహంబు హావణింపఁ బనిచె.
పనిచినఁ బనిఁబూని పాండవమంత్రి । తననేర్పు మెఱసి యెంతయు మొనదీర్చె.
ఆ యచలవ్యూహమందున ద్రౌప । దేయు లుత్తరుఁడు మార్ద్రేయు లార్జునియుఁ
దను పరివేష్టింపఁ దా నగ్రభాగ । మున నిల్చెఁ దనర భీముఁడు రక్షగాఁగ.
జగతికి వ్రేఁగైన సైన్యముల్ గొలువఁ । దగఁ జేకితాన సాత్యకి సమేతముగ
జననాథ, మత్స్య పాంచాల వల్లభులు । తనరి రా దక్షిణోత్తర భాగములను.
నడుమ ఘంటాఘోషణస్ఫురద్ద్యుతుల । ముడివడ నేనుఁగుమొత్తముల్ గొలువ,
కనకరథంబెక్కి ఘనకీర్తు లనఁగఁ । జను ధవళచ్ఛత్రచామరల్ మెఱయ
వసుమతీసురులకు వస్త్రహేమంబు । లొసఁగుచు వారిజయోక్తులు వినుచు
ధర్మజుఁ డుండెఁ బంతములాడు దొరల । కర్మిలి నుచితవాక్యములఁ జెప్పుచును.
ఆతనిముందట నమరేంద్రసుతుని । చేత నెంతయు సురక్షితుఁడై శిఖండి
పరఁగ గంగాతనూభవుని కట్టెదుర । విరసంబుతో నిల్చె విల్లును దాను.
ధృష్టకేతుఁడు, సహదేవుండు మిగుల । స్రష్టలై వెనుకపార్శ్వములఁ గీల్కొనిరి.
ఇట్టచలవ్యూహ మెదిరికి భయము । చుట్టములకు జూడ సుఖమును నగుచుఁ
గరులు శైలములుగా, గంధర్వచయము । తరఁగలుగా, యోధతతి మీలుగాఁగ

గొడుగులు నురుగుగాఁ గుంభినీపతులు । జడిగొన్న మణులుగా శరధినిబోలె.
ఎఱుపుఁ దెల్పును నల్పు హేమవర్ణంబు । మెఱయు జోళ్లు ధరించి మేలైనదొరలు
ఆఁబోతులును బోలె నాసేనలోన । సాఁబాలు తారమై చరియించి రపుడు.
పడగలు భాస్కరప్రభ నభోవీధి । నెడగలుగఁగ జొపి యిరులు గ్రమ్మఁగను
బ్రహ్మసృష్టియుఁ బోలె బహురూపగతుల । బ్రహ్మాండభయదమై భాసిల్లె నధిప !
ఉర్విభారకులెల్ల నొకచోటఁ గూడ । నుర్విభారము శేషుఁ డోర్వలేఁడయ్యె.
ఇట్టిరువాగునందేర్పడఁ గూడి । పుట్టినవాఁడును బుట్టి బాల్యంబు
విడువనివాఁడును వృద్ధు రోగియును । బడఁతులుఁ దప్ప భూప్రజ యుద్ధమునకు
హావణుతో నేతెంచి.'' రని సంజయుండు । నవభంగి ధృతరాష్ట్రునకుఁ జెప్పె ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపింప నమ్మహీవిభుఁడు హర్షించి
తరువాతి దైన కథా ప్రసంగంబు । నెఱిఁగింపవే నాకు నింతయు ననిన,
సాకేతపురవాస, చతురవిలాస, । కాకుత్స్థకుల పూర్ణ కలశాబ్ధిసోమ,
మునియాగరక్షక, పురహర వినుత, । ఘనవిరాధచ్ఛేద, కామితఫలద,
జననాథ, జనకరాజాత్మజారమణ, । వనధిబంధన, రఘువల్లభ, శరణు.
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితమై భీష్మపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొక్కటి యయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీధరిత్రీజనాథ, జితదైత్యనాథ, । సాధుజనస్తుత్య, సత్యచారిత్ర,
ప్రవిమల గుణహార, భక్తమందార, । రవికులాంబుధిచంద్ర, రఘురామచంద్ర !
అవధారు మఱియు సంయమి చెప్పఁదొడఁగె । సవినయస్ఫూర్తి కా జనమేజయునకు :
ధృతరాష్ట్రుఁ డా రెండు తెఱఁగులవారి । వితతవర్తనములు విని కలంగుచును
పలికె సంజయుతోడ భయ మాత్మనిగుడ : । ... ... ... ... ...
"సరి నిట్లు గూడిన సైన్యద్వయమున । నురుగర్వరేఖయు నుబ్బు కడంక
యధికమై యెందుండె?" ననిన సంజయుఁడు: । "బుధపూజ్య, యీగుణంబులు రెంట సమము;
లైనను కృష్ణార్జునానుభావమున । నానేత్రముల కది యధికమై తోఁచె.
అనిలవశంబున నాసేనకరుల । ఘనమదధారల గంధ మేతేర
మత్తాళిగర్వంబు ప్రమంద నీకరుల । యుత్తుంగ మదధార లుప్పున దిగును.
ఆసేన వివిధ దివ్యాయుధప్రభల । మాసెను మనసేన మహితాస్త్రరుచులు.
ఇవియెల్ల నీసూనుఁ డిచ్చఁ గైకొనక । బవరంబునకు వచ్చు బరవసం బెఱిఁగి
దేవత లలర నొత్తిరి పాంచజన్య । దేవదత్తంబులు ధృతి నాదిమునులు.
ఆ మహాధ్వనులు గర్జాభావ మగుడు । నీమొన వర్షించె నెత్తురువాన.
చేతప్పి ధరవ్రాలు సేనాస్త్రతతులు । భీతి నవ్వానలోఁ బిడుగులఁ బోలె.
ఆనేల సైనికహారాళి రాలి । వానతారలవలె వర్తింపఁజొచ్చె.
ఇట్టి యుత్పాతంబు లేటికి మాను । నెట్టన కృపుఁడును నీసైన్యపతియు
గురుఁడును దేరులెక్కుచుఁ బాండవులకు । గురుతరాభ్యుదయంబు గోరుచునుండ.
అది యట్లు దగుఁగాదె! యన్యాయి గెలుపు । మదిఁగోర రార్యులు మాట లెట్లున్న.
అప్పుడు దుర్యోధనాదులు దిశలు । గప్పు తూర్యధ్వని గ్రందుకొనంగ
నాహవోత్సాహమై యాసైన్యయుగము । వాహానరవముల వరశస్త్రరుచుల
వీరభాషణముల విలుగోల పూన్కిఁ । దారాపథముఁ గప్పు దండియార్పులను
జడిగొన్న జడధియు జడధియుఁ దాఁకు । వడువు సంధిలఁ జేరవచ్చుచో దేవ,
తనహస్తమెత్తి మందాకినీసూనుఁ । డనియె నయ్యుభయసైన్యంబులు వినఁగ :

“ఒకమాట పల్కెద నో సేనలార! । ప్రకటించి, వినుఁ డిది బవరంబుపాడి.
ఒకనితోఁ బోరాడ నొకఁ డేయరాదు ; । వికటమూర్ఛితుండైన నెసఁ జంపరాదు ;
విరథు నిర్గత[1]చాపు విరిదలవాని । గిరి ప్రమాను ప్రుట్టి నెక్కనవాని మఱియుఁ
బడినఁ, గైదువు జాఱిపడిన, వెడంగు । పడిన, నాజికి వెలువడిన, భోఁబడిన,
బంటుఁ జంపఁగరాదు ; పతిసాజ్ఞయిదియు ; । వింటిమి వినమని విధము లెన్నకుఁడు.”

## ధర్మరాజు పాదచారియై భీష్మునియొద్దకుఁ బోవుట

అని సమయముచేసె; నాసమయమున । ధనువు జోడును డించి ధర్మనందనుఁడు
మోడ్చినకేలును మూర్ఖభావంబు । మూడ్చిన హృదయంబు నుడిగిన పలుకుఁ
బాదచారము నచ్చుపడఁ దేసడిగ్గి । మీఁదంతు చోరఁగ, సమీరనందనుఁడుఁ
దమ్ములు దొరలు మొత్తమున్నలై బలుని । తమ్ములు గూడి రా ధర్మజుఁ గదిసి
యతనిపూఁ పెఱుఁగక యద్ధి నిట్లనిరి : । “కతమేమి నీకిట్లు కదలిరా ననఘ!
ఎంతకార్యంబైన నేమున్నవార ; । మింతదీనత మీకు నిట్టు లర్హంబె!
పన్నిన పగతులపై నొంటి నిట్లు । సన్నాహములు డించి చనుట ధర్మంబె!
తేఁకువ పోనాడి [2]తిరుగుదే! మనదు । కాఁకకుఁ గాని యీ కౌరవులార్వ.
ఇందఱుఁ గలుగ నీకేల యీదైన్య! । మందఱు నినుజూడ, నరులు మమ్మాడ.
ఏలపోయెదు! నిలు మింతట.” ననుచు । నోలి భీమార్జును లొగి మాద్రిసుతులు
శైనేయ సౌభద్ర సైన్యేశముఖ్యు । లూనిన ధృతి నడుగ, నొకమాటయైన
నాడక యతఁ డేఁగ, హరి వారిఁ గదిసి । “ఓడక మీకేల యూఱ కిట్లడుగ?
ఈతని తలఁపు నాకెంతయుఁ దెలియు ; । ఇతఁడు భీష్ముని ద్రోణు నిట శల్య కృపుల
నాజిసేయ ననుజ్ఞ యడుగఁ బోయెడిని ; । రాజిల్ల నటుగాని రాదు జయంబు ;
మీరు నిల్చుట మేలు మెండయి పోక ; । ధారుణీనాథు చిత్తమువచ్చు దీన.”
అనిన భీమార్జునయములు సాత్యకియు । వనజనాభుఁడు తక్క వఱలినవారు
నిలిచి సన్నద్ధులై నృపుఁ జూచుచుండి ; । రలయక మఱికొంద ఱాసేననుండి
“శరణని వచ్చెఁబో శమననందనుఁడు! । కురునృపాలుండు గైకొనఁబోఁడుగాని.
అతఁడేల శరణను సర్జునాగజుఁడు! । ధృతి సంధిఁగోరి యేతెంచెనో గాక!
అదియు నేల తలంచు హరి గల్గియుండ! । పదిలుఁడై కురురాజుఁ బట్ట రానోపు.
పట్టిన మనమేల పట్టంగనిత్తు । మెట్టిదో కనుఁగొంద మితనిచిత్తంబు.”

---

1. జీవు. 2. తిరుగుదే మనల । కొంకను గాక......లార్వ. (మూ)

అనికిఁ గొంకఱు; గొంకక: "ఇట్లేల తలఁప! । వినుత ధర్మాధర్మవిదుఁడు ధర్మజుఁడు
ఏఁటికి వచ్చెనో! యీ భీష్మగజము । వేఁటాడ ననుపులు వెదక రానోపు."
అని పలుకుచునుండ నాయుధప్రకర । ఘనతర సన్నాహ గంభీరమైన
యల కురువ్యూహంబు యమసూతి సొచ్చి । తలఁకక భీష్మురథంబు డగ్గఱుచు
నామంబు నొడివి ప్రణామంబు చేసి । రామశిష్యునకు భూరమణుఁ డిట్లనియె:
"పెద్దకాలంబయ్యె భీష్మ, మిమ్మేను । దద్దయు నేఁడైన దర్శింపఁగలిగె.
కీర్తిమంతుఁడనైతిఁ గృతకృత్యభావ । వర్తనంబును గల్గె వసుధలో నాకు.
ఇవె సేన లేఁ గొన్ని [1]యొసఁగిన వెన్ని । సవరించి తెచ్చితి సంగ్రామమునకు.
పెనఁకువ మిముబోఁటి పెద్దలమీఁద । మొనలఁ దేఁగలసెను మూర్ఖభావమున.
దేవ, నిన్నెదిరించి తెంపుతో రణము । గావించువాఁడనై కడుభక్తి మున్న
యాజిసేయ ననుజ్ఞ యడుగ వచ్చితిని; । రాజ, మాకిదిగదా రణజయం." బనిన
లీల భీష్ముఁడు నవ్వి: "లెస్స వచ్చితివి; । మేలు, నీవిట నన్ను మించిరాకున్న
శపియింపఁ గలవాఁడ శమనకుమార! । చపలత లేదింకఁ జాల మెచ్చితిని;
అడుగుము వరమిత్తు నరుల నీకొఱకుఁ । బోడుమన్నఁ బోడఁగాని బొంకాడరాదు."
అనుటయు ధర్మ[2]రా "జట్లగుఁగాక; । ఘన కౌరవార్థమై కదనంబు నడపు;
హితమీవు తలఁపు మాకింతియచాలు; । ధృతి నింక నొకమాట దేవ, యడిగెదను;
గినియక నిను మాకు గెలుచు నుపాయ । మనఘాత్మ, కృపగల్గి యానతి యీవె!"
అనిన మోమున మందహాసంబు మొలవ । మనుమని వీక్షించి మగఁటిమిఁ బలికె:
"చేత విల్లుండిన శివ హరి బ్రహ్మ । దైతేయ యక్ష గంధర్వుల గెలుతు;
అట్టైన నీవు నన్ననిఁ బెడఁబాపు । దిట్టతనంబులు దెల్పెద వెనుక;
నిది వేళగాదు నీ విపు డేఁగు." మనిన । మదినుబ్బి తాతకు మఱియును మ్రొక్కి
'అరుల నిర్జింతుగా' కనెడు దీవనలఁ । బొరసి భీమాదులు పొదివి యేతేర

ధర్మజుఁడు గురు కృప శల్యుల చేత రణమున కనుజ్ఞాతుఁ డగుట

గురునకుఁ గృపునకుఁ గోరి శల్యునకు । నరపతి పాదప్రణామముల్ సేసి
యాజిసేయ ననుజ్ఞ యందఱ నడిగి । యోజతో వారి జయోక్తుల నలరి
గురుఁజూచి 'నాగెల్పు కోరవే!' యనిన । "నొరులు గోరఁగనేల! యోరాజ, నీకు;
నగధారి మంత్రియై నడపుచున్నాఁడు; । పగ యడంచి సుఖంబు పాటింతుగాక."

---

1. యొసవిన యెన్ని. 2. రాజట్లేలగాక. (మూ)

యనినంత గురునకు నతఁడు కేల్మోడ్చి । "విను మొకకార్యంబు విన్నవించెదను;
కినియకు మేరీతి గెలుతుము మిమ్ము? । అనిమిషేశ్వరుఁడు మీకడ్డంబుగాఁడు;
ఆనతియిచ్చి నన్ననుతుగా." ననిన । నానన్నాజ్ఞమున నవ్వారు నగ్గురుఁడు:
"కైదువుచేసున్నఁ గలకఁతుఁడైన । నాదెస రాలేఁడు ననసంగరముల.
పనివడి యేనొక ప్రాయోపవేశ । మున నస్త్రసన్న్యాసముద్ర నుండినను
చంపఁబుట్టినవాఁడు సంధిలైనేని । చంపుఁ; బ్రాయోపవేశములాగు వినుము.
పుట్టి యెన్నఁడు బొంకు పొరయనివాఁడు । బెట్టిదంబుగఁ బ్రాణభీతి వాక్యంబు
ననిమొనఁ బల్కిన నస్త్రసన్న్యాస । మొనరింతు." నని ద్రోణుఁ డున్నట్లు పలికి
'జయసిద్ధి నీకు నౌఁ జను' మన్నఁ గదలి । రయ మొప్పఁ గృపు ధర్మరా జంతఁ గదిసి
యతని వధోపాయ మడుగ సాహసము । గతిగూడకున్న, నాక్రమ మాతఁ డెఱిఁగి
దైవమిచ్చినయట్టి తన యవధ్యత్వ । మావిభునకుఁ దెల్పి "యని మిమ్ముఁగాతు;
సందియం బేటికి? జయసిద్ధి నిన్ను । జెందుఁ బో." మ్మని యంప శీఘ్రంబె యతఁడు
శల్యునిఁ గదిసి యంజలిచేసి పలికె: । "శల్య, నీతో మున్ను చాటితిఁ దెలియ;
కర్ణకఠోరవాక్యములఁ గయ్యమునఁ । గర్ణుచిత్తము నీరు గావింతు నంటి;
వది మఱవకు చాలు." ననిన శల్యుండు । "వదలక యిది చెప్పవలదు వేమాఱు;
జయసిద్ధి నీకు నీశ్వరుకృపఁ జేకు; । బ్రియముతోఁ జను." మన్నఁ బృథివీశ్వరుండు
హోతల వరియించి హోమంబుకొఱకు । నాతత సన్నద్ధుఁడగు యజ్వఁబోలెఁ
దలయెత్తి ప్రజచూడఁ దమ్ములు గొలువ । నలయక వైరిసైన్యములోన వెడలి
వచ్చుచో, నది చూడవచ్చి కర్ణుండు । పచ్చికదిబ్బపై బలములుఁ దాను
బార్థులఁ గ్రీఁగంటఁ బాఱఁజూచుచును । అర్థిమైనుండంగ, హరి వానిఁ గదిసి
"పోరాడి భీష్ముండు పొలియునందాఁక । నూఱట నున్నాఁడ వోకర్ణ, నీవు.
నిలుకాల సూర్యుండు నిలువఁడుగానఁ । దలకొనఁదగు నీకుఁ దండ్రివిధంబు.
కౌరవార్థరణంబు గలిగినదాఁకఁ । జేరి పాండవులకుఁ జేదోడుగమ్ము;
పురుషార్థివని నిన్ను బొగడు లోకములు; । చిరకీర్తి శరవిద్య చీరువో దింత.
పన్నగధ్వజుఁ డేమి పాండవు లేమి । యెన్నంగ సరి నీకు నే తెంతుగాక."
అనినఁ గోపమువచ్చి యంగాధిరాజు । కనలుట యెదిరికిఁ గానరానీక
ధనువుతోనే ప్రాణధార పోయుటలు । వినవె కౌరవులకు! విశ్వమెఱుంగ.
ఏనసంతుండనే యిరునాల్కలేదు; । దానవాంతక, పొమ్ము ధర్మజుఁ గూడ.

మాలోని జగడంబు మాని నీకుఁ గడన | నేల! మీలోని కేనేల వచ్చెదను!"
అనిన మెచ్చిన భావ మతఁడు నటించి | చనుదెంచె; నిచ్చట శకునినందనుఁడు
చని చని నిలిచి నీసైన్యంబుచూచి | యనియెను గేలెత్తి యందఱు వినఁగ:
"అపుడు వింటిరి వినమునక నామాట | నృపులార, వినుఁడు సంధిలె రణద్వయము.
మా విజయమునమ్మి మామాట నమ్మి | రానలసినవారు రండు వచ్చినను.
తోడఁబుట్టినవారితోడి మున్నసలు | వేడుకఁ జేయుదు వేఱు సేయకను
ఇపుడు వచ్చుటయు మే లిదివేళ." యనిన | నృపు లూరకున్నచో నీపుత్రుఁ డొకఁడు
అనఘు, వైశ్యాపుత్రుఁడగు యుయుత్సుఁడు | తనకోఁజుఁ దాను గాంధారేయు విడిచి
విఫలవృక్షము పక్షి విడిచి వేవేగ | సఫలవృక్షము చేరు చందంబు దోఁప
ధర్మజుఁ గూడినఁ దా నన్నయట్లు | సగ్మిలిఁ బాలించె నతని ధర్మజుఁడు.
సవతితల్లిసుతుండు సతము గాదనుట | సువిదితమయ్యె నీసుతుల కారాక.
అంత ధర్మజుఁడు రథారూఢుఁ డగుచుఁ | గాంతి దిక్కులఁ బర్వఁ గవచంబుఁ బూని
తూణీర కార్ముకాదులు ధరియింప | రాణమై నఖిలతూర్యములు ఘోషించె.
హస్తిబృంహితములు హయహేషితములుఁ | బ్రస్తుతిధ్వనులు నంబరమెల్లఁ గప్పె.
అంతఁ దమ్ములు యోధు లరదంబులెక్కి | యంతంతఁ గవచశస్త్రాదులు పూని
పరగి పూర్వవ్యూహభావమై నిలువ, | నిరువాగుప్రజలు ననేకమార్గములఁ
బాండవు లరులచేఁ బడునట్టి పాట్లు, | అండజధ్వజు సంధి కనిచిన క్రమము,
హరిఁబట్టఁ గురురాజు హాపణించువిధము, | గురు భీష్మ కృపు లాడుకొనిన వాక్యములు,
హరి పాండవులకుఁ దోడైన క్రమంబుఁ | బరిగణించిరి మృత్యుభయ మాత్మఁగదుర."
అని సంజయుఁడు చెప్ప నాంబికేయుండు: | "వినుము కౌరవ పాండవేయ సైన్యములు
భూరి కురుక్షేత్రమున దండుగూడి | యేరీతిఁ బోరాడి రిల సంచలింప?
తలపోయ మోక్షప్రదంబైన చావు | కలుగుట యల్పమే కర్మజీవులకు?
గంగనాడఁగనేల గయఁ జేరనేల | రంగైన యోగమార్గములఁ బోనేల
సన్యసింపఁగనేల సవనకర్మములు | విన్యసింపఁగనేల విను మిట్టిచోట
స్వామికార్యార్థమై చచ్చినభటుల | కేమార్గమున ముక్తి యెదురుగా వచ్చు?
వీరలకథ నాకు వివరింపు." మనిన, | ఆ రాజవరున కిట్లని చెప్పఁదొడఁగె:
"పాండవవ్యూహంబు పరికించి నృపతి | గుండియబెదర [1]నగ్గురుఁ గానఁబోయి,

---

1. కన్గొని రాజుపోయి | ద్రోణశిష్యుండును ద్రుపదసూనుఁడును. (మూ).

"ద్రోణ, నీశిష్యుండు ద్రుపదసూనుండు । శాణాది మెచ్చంగఁ బన్నిన యొడ్డు
చూచితే! యీనేర్పు సురలకు లేదు; । రాచపుంజములు నే రచియించినారు.
శైనేయ మాత్స్యుఁ పాంచాలురు చేకి । తానుండు పురజిత్తు ద్రౌపదేయులును
ఘనుఁడు పాండ్యుండు శిఖండి హైడింబు । లొనర యుధామన్యుఁ డుత్తమౌజుండు
నభిమన్యుఁ డాదిగా నందున్న యోధు । లభినవోత్సాహులు [1]హరిసరోషములు.
అదిగాక భీమార్జునాభిరక్షితము; । త్రిదశులకైనను దృష్టింపరాదు.
మన మొనఁగల యోధమండలి నెల్ల । మును నిన్ను గృపుని భీష్మునిఁ జెప్పనేల!
భూరిశ్రవుఁడు ద్రోణపుత్రుండు శల్యుఁ । డారయ భగదత్తుఁ డనుజవర్గమును
శకుని భోజాధీశ సైంధవ ప్రముఖు । లకలంకబలులు మహాత్ములున్నారు.
ఉండిన నేమి వారోపుదు రణముఁ, । బాండవసేన యే పట్టున నాకు.
కావున మీరెల్ల గాంగేయు రక్ష । గావింపుఁ డట్లైనఁ గలుగు జయంబు."
అనుచోట సింహనాదాను తరమున । జననాథ, భీష్ముండు శంఖమొత్తినను
ఈరేడుజగములు నిట్టట్టు పడియె; । తాఱుమాఱయ్యె విధాతృమంత్రములు.
అంత శంఖధ్వని నాదముఁ జేయఁ । గొంతయైన భయంబు గొనరు పాండవులు.
ఉభయదళంబులు నొక్కటఁ దూర్య । విభవంబు మొఱయించి వివిధయత్నములఁ
దలపడుచున్నంత దైత్యారి యొత్తెఁ । బలితాజన్యంబు పాంచజన్యంబు.
శతమఖసుతుఁ డంత సంప్రీతి నొత్తె । ధృతలోకచిత్తంబు దేవదత్తంబు.
గుణి భీముఁడును నొత్తె ఘోరతమీఱ । రణభూమిఁ జెవికి వేండ్రంబు పౌండ్రంబు.
[2]శస్త్రమైన యజాతశత్రుండు నొత్తె । విస్తరింపఁగ నంత విజయంబు జయము.
నమితవైరివిభూతి నకులుండు నొత్తె । [3]శమితారిరోధి శేషమును ఘోషమును.
దినకరద్యుతి సహదేవుండు నొత్తె । మనుజ బాష్పదమైన మణిపుష్పకమును.
తక్కటియోధులుఁ దమతమ ధృతికి । నిక్కగా శంఖంబు లెలమి నొత్తినను
జగముల జనులు మూర్ఛాప్రభావమునఁ । దెగిపడ్డ తనువులై తెలిసిరవ్వేళ.
కవ్వడి యవ్వేళ గాండీవధనువు । నెవ్వడితో నెత్తి నెమ్మిఁ సారించి
పలికెఁ గృష్ణునిఁజూచి: "పద్మపత్రాక్ష! । నిలుపుము పోనీక నీ తురంగముల.
తెలియ నిందెవ్వరు దివురుచున్నారొ! । తొలుత నా కెవ్వనితోఁ దాఁకవలెనొ!

1. హరిణరోషములు. 2. శాస్త్ర. 3. శమిత. (మూ).

ఏతూపులకు నెవ్వఁ డేపాటి యగునో! । చూతము రథ మొక్కచో నిల్పు." మనిన
హరియుఁ బార్థుఁడు చెప్పినట్లు సేయుటయు । శిరమెత్తి పార్థుఁ డాసేన వీక్షించి
సఖులు బంధులు నందు సాంబాలు నున్న । ముఖవికాసముదప్పి మోహించి యపుడు
గాండివ మటుపెట్టి ఘనుఁడు గూర్చుండి । పుండరీకాక్షునిఁ బొసఁగ నిట్లనియె:

అర్జునుఁడు స్వజనసంహారమునకు శంకించి మోహావిష్టుఁ డగుట

"ఇందు నిందఱు విందు లిందీవరాక్ష, । మందునకును శత్రుమాత్రుండు లేఁడు.
పిన్నలు మామలు పెద్దలు తండ్రు । లన్నలు ముత్తాత లనుజులు సుతులు
వియ్యంకు లార్యులు విద్యాగురులును । నెయ్యురు వీర లేన్నృపుని జంపుదును!
చండాలుఁడునుగూడఁ జాలఁ డీపనికి; । పండితోత్తమ, నన్ను బనుతురే యిట్లు!
ఒకగూటిపిల్లల మొకయీడువార । మకట! యిందఱిఁబట్టి యణఁపనోపుదునె!
నేఁగాక చేతులు నిముపైనఁ దల్లిఁ । గౌఁగిలించెడువారు గలరె తక్కొరులు!
చెనఁటి కౌరవుఁ డింత చేయుఁగాకేమి । మనకైనఁ గొంత ధర్మము త్రోవ వలదె!
నిశిత చక్రమువైచి నీవైన వీరి । విశసింతుగాని నే విశిఖంబు దొడుగ."
అనిన పార్థునిఁజూచి యబ్జనాభుండు । తనకార్య మనువుగాఁ దలఁచి యిట్లనియె:
"ఎక్కడి కృపవుట్టె నీవేళ నీకు? । తక్కుము మనకు బాంధవుఁ డెవ్వఁ డిందు?
బంధుసంకల్పంబు పరమమూఢులకు । నంధపరంపరై యరుదెంచుచుండు.
ఇతఁడు బంధుఁడు నాకు నితఁ డన్యుఁడనుట । మతిలోన నెలకొన్న మమతసత్త్వంబు.
ఆ మమత్వము డించి యఖిలబాంధవుల । నీమాఱు చూడుమా యెట్లున్నవారో!
వారును దమ కర్మవశమునఁ బుట్టి । రేరీతి నటుపోదు; రిట మ్మాన్పరాదు.
నీవు చంపుటయును నీచేత వీరు । చావు పాలగుటయుఁ జర్చింప మిథ్య.
అనుపాటి యగులీల నా జగన్మయుఁడు । తనువిశేషంబులు ధరియించు విడుచు.
సుర నర వృక్షాది సుభగదేహములు । పురుషున కెపు డెన్నిపో వెన్నిరావు!
లలి జీర్ణవస్త్ర మొల్లక క్రొత్తచీర । వెలయఁ దాల్చినమాడ్కి నినుము జీవుండు
ఆరయ వార్థకమగు మేను విడిచి । సారెకుఁ జొచ్చు శైశవమైన తనువు.
కావున దేహవికార మేమియును । జీవాత్మ సోఁకదు; జీవుఁ డద్వయుఁడు
నిత్యనిశ్చింతుండు నిత్యనిర్మలుఁడు । సత్యసంకల్పుండు శాశ్వతుం డతఁడు.
జీవాత్మ చెడునను చీఁకును గలఁడె! । జీవుఁ డెవ్వఁడుగాఁడు చింతింప నేను.
ఏను లీలార్థమై యీసృష్టిమైనఁ, । బూని చరాచరంబులు నిందులోనఁ
బుట్టినయట్లగుఁ బోయినట్లగును । గట్టియైనట్లగుఁ గరగినట్లగును.

ఏగతిఁ బోదునో యేది లోకంబొ । నేగ దెన్నఁడు నని వేఁగినట్లగును
కలవోలె నీచింత గలుగుఁ గాకేమి । తలఁప జీవుఁడు శుద్ధతనుఁడు కౌంతేయ!
ఘనములు పైఁబొఱఁ గమలాప్తుఁడున్న । యనువున నుండు దేహములేఁగ నాత్మ.
విశ్వాస మొప్ప వివేకివై చూడు । విశ్వంబు నాకంటె వేఱు గా." దనుచు
మఱియు నధ్యాత్మమర్మములఁ బార్థునకుఁ । దెఱఁగొప్ప నజ్ఞానతిమిరంబు మాన్పి
బంధుకృపా[1]సక్తిఁ బాపి పోటునకు । బంధునిఁ గావింపఁ బార్థుఁ డుప్పొంగి:
"యీవు శ్రీగురుమూర్తి నేను శిష్యుండ । దేవ, నాకడఁగె సందేహంబులెల్ల.
ఏచిన వేడ్కతో నేను మీమూర్తి । చూచెదఁ గృపతోడఁ జూపవే నాకు.
అందు ననేక మహాదేవగణము, । లందు ననేక మహామునిశ్రేణి
పొడ గానవచ్చు; నద్భుత చరాచరము । లుడుగక చూపవే యోకృష్ణమూర్తి!
మిము నెఱింగెద నన్న మెఱయు నజ్ఞాన । తిమిరంబుచేఁ గానఁ దీఱ దెప్పుడును.
నేఁడు భాగ్యవశాన నిన్నెఱింగితిని; । వేఁడితిఁ జూపవే విశ్వరూపంబు!
మును యశోదాదేవి ముమ్మాఱు చూచె । నన విందు నీదు దివ్యాకారవిధము.
నన్నును జూడవే నవకృపాదృష్టి । నన్నెగల్గిన భక్తవత్సల!" యనిన,
హరియుఁ గ్రీడికి దివ్యమగు దృష్టినిచ్చి । నిరుపమగతిఁ జూడ నిజమూర్తిఁ జూపె.
అందు ననేక సప్తాంబురాసులును । మందరాది సమస్త మహితశైలములు,
శంఖచక్ర గదాసిశార్ఙ్గ సంఘములుఁ । బుంఖానుపుంఖమౌ భుజములు నమరె.
జయ విజయులు మఱి శాంభవీదేవి । నయమొప్ప శ్రీలక్ష్మి నయభక్తిఁ గొలువ,
ఘన నవబ్రహ్మలేకాదశ రుద్రు । లనిమిషేశ్వర వహ్ను లమరి రంగముల;
అశ్వినీదేవత లంతక వరుణ । విశ్వులు వసువులు వెలసి యూరువుల.
బహుసమస్త మకుటాగ్రభాగంబులందు । రహి కెక్కఁ బెక్కైన రవిమండలములుఁ,
బరగిన రోమకూపముల సంధులను । గురుతర బ్రహ్మాండకోటులుఁ బొడమె.
అభినవ వృష్ణి భోజాంధక వీరు । లుభయపార్శ్వంబుల నొప్పారి రపుడు.
కటిమేఖలమున నక్షత్రలోకంబు । ఘటిత మౌక్తికభాతిఁ గరము శోభిల్లె.
ప్రళయాగ్నులునుమండెఁ; బ్రళయవాయువులు । నెలకొనె; నుత్పాత[2]నిచయంబు వొడమె;
సురదుందుభులు మ్రోసె; సురపుష్పవృష్టి । గురిసె; ధరిత్రి సంక్షోభించె నపుడు.

---

1. సక్త. 2. నియమంబు లొడమె. (మూ)

నారద సనక సనందనాదులును । బారాశరాది తాపసరాయణులు
గరుడ విద్యాధర ఖచర తుంబురులుఁ । బరమవైష్ణవులును ఫణికులేంద్రులును
జయజయధ్వనులతో సన్నుతుల్ సేయు । భయదోగ్ర విశ్వరూపంబు చూడనొప్పె.
అప్పు డర్జునుఁడు సాష్టాంగప్రణాము । మప్పరమాత్మున కతిభక్తిఁ జేసి:

అర్జునుఁడు శ్రీకృష్ణుని దివ్యరూపంబు గనుఁగొని స్తుతించుట

"సర్వజ్ఞ! సర్వేశ! సర్వభూతాత్మ! । సర్వంసహాధార! శరణంబు నీకు.
దేవ! దేవకీపుత్ర! దేవేంద్రవంద్య! । నీవిశ్వరూపంబు నేర్తునే చూడ!
సరిగాదు రవిసహస్రము దీనిరుచికి ; । సరిగావు గగనలక్షలు నున్నతికిని ;
అమరు లీమూర్తిలో సణఁగుచున్నారు ; । కమలాసనుఁడు నిందుఁ గలియుచున్నాఁడు ;
చంద్రార్కనయనదంష్ట్రాకరాళములు । సాంద్రాననము లిందు సంఖ్యకు మీఱె.
అంబరాభరణంబు లవి పెక్కు గంటి ; । ముంబరంబగు శిరంబులనెల్లఁ గంటి ;
అదె నిన్ను జూచెద రఖిలదేవతలు ; । నదె నిన్ను బొగడెద రఖిలసంయములు ;
వారక నీముఖోజ్జ్వలవహ్నులందు । వారె కౌరవులెల్ల వచ్చి కూలెదరు ;
ఏ నిన్ను మఱచితి నెవ్వరో యెఱుఁగ । వీనులారఁగఁ జెప్పవే! వణంకెదను."
అనినఁ గృష్ణుఁడు పల్కు: "నర్జున, యేను । ఘనలోకసంహారకరుఁడఁ గాలుండ.
నీవు కయ్యంబు మానితివేని రిపుల । నే వధించెదనని యేఁగుదెంచితిని.
కావున వీరి నేఁ గడతేర్తు వినుమ ; । నీవును నిచ్చమై నిలిచిన నిలుము.
ఆసతో వచ్చిన యస్త్రదేవతలు । నీసమరము గోరి నేఁడు నున్నారు.
అడిచి పార్థా! విడుప నవి యెల్ల వేల? । వడి నరాతులఁ జంపి వసుధ గైకొనుము."
అనినఁ గవ్వడిపల్కు: "నట్ల చేసెదను ; । నను గటాక్షింపుము నాతప్పు లోర్చి.
మనుజుఁగాఁ జింతించి మందెమేలమున । ననఘ, యేమంటినో! యాద్యుండ వీవు.
మిమ్ము సఖుండని మేనబావనుచు । నమ్మి నవ్వుదు లోకనాయక, యెఱుఁగ.
ఉర్వివా రీమూర్తి నోపరు చూడఁ । బూర్వప్రకారమై పొడసూపు." యనినఁ
గరుణాసమేతుఁడై గరుడవాహనుఁడు । నరునికై తొంటి మానవమూర్తి దాల్చి
చెన్నార నొగలిపైఁ జేర్కోలఁబట్టి । యున్నవసగవుతో నాక్రీడిఁ బలికె:
"ఏమహాత్ములకైన నెఱుఁగఁ జొప్పడని । మామూర్తి చూచితే! మనుజేంద్ర, నీవు.
సమరంబులో బంధుసంజ్ఞ శాత్రవుల । సమయింపఁ జాలుదా చాలవా?" యనిన
నతఁడు సిగ్గున నుత్తమాంగంబు వాంచి । వితతాయుధము పట్టి వెన్నుని జూచి
మఱియు నధ్యాత్మమర్మము లనేకములు । తెరవాయిగొని యడిగి తనసొమ్ముఁజేసి

హరిభక్తి ముక్తికి నాధారమనియు, । హరిభక్తి భాగవతానందమనియు,
హరిభక్తి వేదవేదాంతార్థమనియు, । హరిభక్తి యతిరహస్యమునుగాఁ దెలిసె.
విను మిట్టి తెఱఁగులు వినఁ గనుంగొనఁగ । జననాథ, వ్యాసప్రసాదంబు నాకు.
అనయంబు నేను విన్నంత కన్నంత । వినిపింప నిదె కంటి వింటివే?" యనిన
నతఁ: "డేను వింటిఁ గృతార్థుండనైతి; । సుతుల సంగర మింక సువ్యక్తముగను
వర్ణింపు మునుము నెవ్వరు తాఁకి?" రనిన । వర్ణించె నతఁడు నవ్వసుధేశ్వరునకు.
మునుపు తాఁకినవాఁడు మూర్ఖు నీసుతుఁడు ; । వెనుకఁ దాఁకిరి పాండవేయు లుగ్రమున.
అప్పటి సంరంభ మమరేంద్రుఁడైనఁ । దప్పక యొక్కింత దర్శింప నోడు.
బలధూళి యొకటి యేర్పఱుపరాకుండె ; । బలఘోష మొకటి యేర్పఱుపరాకుండె.
గొడుగులుఁ బడగలుఁ గోలలఁ ద్రెవ్వి । కడునాడు మింటిపై గ్రద్దలలోన.
మొనల నెత్తురుటేర్లు ముంచు నన్నుచు । వనధి డాఁగఁగఁ బోలు వలయాద్రిగుహల.
పొడు పట్టు పొరిగొను పోనీకు పొదువు । మడు వ్రేయు మనుమాట లఖిలంబు నిండె ;
సకల దిక్కుల కస్థి శల్య కపాల । శకటాంగములు ద్రెవ్వ చప్పుళ్లు పరఁగె ;
ఘనతర శస్త్రాస్త్రఘట్టన లెసఁగె ; । అనలకణంబు లయ్యాజిఁ గ్రిక్కిఱిసె ;
చఱచి దిక్కులఁజొచ్చు సమయతూర్యముల । బెరసె దేవస్త్రీల పెండ్లితూర్యములు ;
తొండంబు లొండొంటితోఁ జుట్టి పెనఁగు । శుండాలములపోరు చూడ వ్రేఁగయ్యె ;
రథికులు తలపడి రౌద్రశస్త్రాస్త్ర । మథిత పరస్పర మకుటాగ్రులైరి ;
పటహ భేరీ శంఖ భాంకార[1]ఘోష । ఘటితమ్ములై దిశల్ కంపింపఁదొడఁగె.
ఆ మహారణములో నాభీష్మురథము । నేమిఘోషము మించి నేల చించుచును
జరియింప భీష్ముచేఁ జదియు తేరులును, । ధర వ్రక్కలై వ్రాలు దంతావళములు,
తుత్తుమురై నేలదొరుఁగు నశ్వములు, । మొత్తములై త్రెవ్వి మ్రొగ్గు కాల్బంట్లు
పడిమొను దొరలునై పాండవసేన । తడఁబడఁ దొడఁగినఁ, దనపేరు వాడి
వడముడి భీష్ముతో వచ్చు సైన్యముల । నడిమికిఁ దనతేరు నడిపించి కడిమి
గద వ్రేసెఁ గొందఱు గడిదలల్ వగిలి । ముదురు నెత్తురుఁ గక్కి మొగి వెన్కఁ ద్రొక్కె.
వెన వ్రేసెఁ గొందఱ విశిఖవేగమునఁ । [2]గసిమసంగినరీతిఁ గడిమిమైఁ గూల.
అదలించెఁ గొందఱ నాగ్రహోద్వృత్తిఁ । జదికిలఁబడి కుంద సైన్యముల్ మ్రంద.

---

1. ఘోర । ఘటితమై. 2. కసిమంబు చెడినేల. (మూ)

కరిచొచ్చి విఱిచిన కదళీవనంబు । కరణి వాయుజుఁ డిట్లు కడిమిఁ బెంపొంద,
దుర్మర్షణుండును దుశ్శాసనుండు । దుర్ముఖుండును మఱి దుష్ప్రహర్షయుఁడు
చిత్రసేనుఁడు వృషసేనుఁడు చారు । చిత్ర వివింశతి చిత్రదృక్కులును
బురుమిత్రుఁడును మహీభుజుఁ డాత్మమెచ్చ । శరమహావృష్టిఁ గీచకవైరిఁ దాఁకి
జ్యాఘోషములు దిశాచక్రంబు గప్ప । నాఘూర్ణితాత్ములై యప్పుడు గవియఁ
గవలు సైన్యపుఁడు శిఖండి సౌభద్రు । లపనీధవునితమ్ము లాదిగా దొరలు
పవనసూనునకుఁ దోడ్పడి రట్టిచోట । నవఖండములుఁ దూలె నాఁటి యుద్ధలికి.
ఇటుచూడఁ గౌరవ్యులే గెల్తురనఁగ । నటుచూడఁ బార్థసైన్యము గెల్చుననఁగ
నుభయ బలంబులు నొక్కటఁ దాఁకె । విభులర్థిఁ బురికొల్ప విధి కేళిసల్ప.
కరిఘంటికాధ్వని ఘనఘోటకముల । యురుహేష మసిఘట్టనోత్థంగరవము
భేరీమృదంగాది భీషణధ్వనికిఁ । దారెక్కుడై మ్రోసె దశదిక్కులద్రువ.
ఉదయించు నెత్తుట నొదుఁగు వెండియును । ఉదయించు నెత్తుట నొదుఁగు రజంబు.
అయ్యుదయాస్తమయంబుల విధము । చయ్యన నెఱిఁగించె సంసారవిధము.
కమలబాంధవుఁ బ్రోఁకు కప్పారుధూళి । నమకొన్న రాహువుచందంబు దోఁపఁ
ద్రిదశులఁ గప్పిన తెల్లనిధూళి । కదనోర్వి కొకమేలు కట్టునై తోఁచె.
ఖచర కాంతలఁ జేరు కట్టెఱ్ఱధూళి । యుచిత హల్లకపంక్తియొప్పు దీపించె.
పస దిశాభిత్తులఁ బట్టినధూళి । పసిఁడి పూఁత విధంబు భాసిల్లఁ జేసె.

## భీష్ముని ప్రథమ దివస యుద్ధము

అప్పుడు నీపుత్రుఁడలర భీష్ముండు । తప్పక దారుణాస్త్రముల వర్షముల
యమసూతి సేనాగ్ని నార్పఁజేయుటయు, । నమరేంద్రసూనుఁ డాయతిరథు నంత
గాండీవ నిర్ముక్త కాండప్రచండ । చండాంశుకరముల సరి నాక్రమింపఁ
బరశురామునిచేతఁ బరఁగిన శరము । లురురాజుకలకలం బొర్వవన్నట్లు
శాంతనవోన్ముక్తశరములు పాండు । సంతతి నెల్ల జర్జరితంబు చేసె.
కినిసి సాత్యకి యంతఁ గృతవర్మఁదాఁకి । ధనువును జోడును ధరపాలు చేయ
నతఁ డొండువింట శరావళిఁ దొడిగి । ధృతి నేసె సాత్యకి తిరుగుడు పడఁగ.
కోసలుం డభిమన్యు ఘోరాజిఁ జెనకి । యా సుభద్రకుమారు నలుగులఁ గప్పి
తానును గర్ణుచందంబు వహించి । రా నన్నగతిఁ బోయె రణభూమి విడిచి.
భీమసేనుని మనభీముండు దాఁకి । భీమాస్త్ర శతముల బిట్టు గప్పినను
అతఁ డీతనిమార్గణావళి నఱికి । కేతు చాప చ్ఛత్ర కృపణుఁ గావించె.

యువరాజు నకులుని నుగ్రోగ్రబాణ । నవతి గ్రుచ్చిన నల్గి నకులుఁ డా ధూర్తు
నింతి ద్రౌపదిఁ దొల్లి యీడ్చిన కేలు । వ్రంతలుగా నేసె వజ్రబాణముల.
ధృతి దుర్ముఖుఁడు సహదేవునిఁ దాఁకి । శిత [1]శిలీముఖములు చిచ్చులు గురియ
నరువది నాటిన నన్నియు నాటి । నఱికె దుర్ముఖు తేరు నకులానుజుండు.
శమనతనూజుండు శల్యునిఁ దాఁకి । యమితాస్త్రములఁ గప్ప నతఁడు తద్ధనువు
నఱికిన, వేఱొక నవచాప మెత్తి । వఱపె నమ్ములు మద్రపతిమీఁద నృపుఁడు.
శరగురుఁ దాఁకి ధృష్టద్యుమ్నుఁ డారు । శరముల విలుద్రుంపఁ జాలఁ గోపించి
గురుఁ డొండు ధనువునఁ గోలలు దొడిగి । యరి ముంచె గిరిని దోయధి ముంచినట్లు.
మాగధ సహదేవు మగటిమిఁ దాఁకి । భోగి భోగనిభుండు భూరిశ్రవుండు
శరములఁ దద్భుజాస్తంభంబు నొంప । నురము నొంచె నతండు నుగ్రాస్త్రతతిని.
ధృతి బాహ్లికునిఁ దాఁకి ధృష్టకేతుండు । శతసంఖ్య గడచిన శరముల గ్రువ్వ
నతఁడు నట్టిశరాళి నాతనిఁ బొదువ । శతమఖవృత్రుల సరిఁబోలె రణము.
అలయలంబసునకు హైడింబుతోడఁ । దలపాటు గల్గుచోఁ దరులును గిరులు
వరుస నెక్కడినుండి వచ్చెనో కాని । తరమిడిఁ దండోపతండమై యపుడు
సమరాంగణము శరీరములును నిండఁ । దముఁ గానరాదు ప్రతాపాగ్ని గాని.
నెఱయ నీగతి శిఖండికి ద్రోణజునకు । నెఱచిచ్చుకోలల యేట్లాట బలిసె
పలు తెఱంగుల మాత్స్య భగదత్తులకును । జగతికి వ్రేఁగైన సంగ్రామ మొదవె.
చెలఁగి సుశర్మకుఁ జేకితానునకుఁ । గలిగె నుద్దామ సంగర కుతూహలము.
బవరంబు శకునికిఁ బ్రతివింధ్యునకును । వివిధాస్త్ర వితతుల విరివియై నడచె.
ఆయతరణము శ్రుతాయువునకును । రాయుచుఁ గల్గె నిరావంతుతోడ.
ధరఁ గుంతిభోజుతోఁ దత్సుతుతోడ । నరుదయ్యె రణము విందానువిందులకు.
కైకొని యేవురు గాంధారపతులుఁ । గేకయు లేవురుఁ గినిసి మార్కొనిరి.
తివిఱి నీతనయుండు దీర్ఘబాహునకుఁ । బవరముత్తరుతోడఁ బ్రభవించె నధిప!
నుతగతి నకులసూనుఁడు పేరువాడి । యతిఘోరముగఁ దాఁకె నయ్యులూకునిని.
వెండియు వీరులు వెస నిందునందుఁ । దండతండంబులై ద్వంద్వయుద్ధములు
సుర సిద్ధ సాధ్యులు చూచి యాశ్చర్య । భరితులై వినుతింపఁ బాటించి రధిప!

1. శిత. (మూ)

వేటుకోలల భంగి నేర్చినమగలు । కోటాన కోటులు గుంపులై తాఁక
నెక్కడ చూచిన నెక్కడి ఘోర । మిక్కయ్యె నని తోఁప నేట్లాడిరపుడు.
ద్విరదరదంబులు తేరుల నొగలు । నరిఁదాఁకి విఱిఁగెడు చప్పుళ్లు బెరసె.
వారణ హయరథవ్రజము పైఁబడినఁ । బోరాట నోడుఁగక పొడుచు కాల్బంట్లు,
నిరుపమ రథమహానివహంబు మీఁదఁ । దురగ రత్నంబులఁ దోలు రావుతులు,
హరి కాలుబంటు తేరన కుర్విఁ గలయఁ । గరిచేతఁ ద్రొక్కించు [1]కడిఁది మావంతులు,
రథికులఁ జంపి యారథముల కుఱికి । రథిని మార్కొను మహారథికులుఁ గలిగి,
గదలు మోములఁదాఁకి కదుములుగట్టి । యుదరి వెన్దిరుగుచునున్న యేనుఁగులు,
బిరుదుకోలల నేదు పెరిగినట్లయ్యెఁ । బరఁగ మిన్నులమీఁదఁ బాఱు గుఱ్ఱములు,
నొకహస్త మెడలిన నున్న హస్తమునఁ । బ్రకట శాత్రవు మీఁదఁబడి పొడుచువారుఁ,
దల ద్రెవ్వినను మున్న తా దృష్టి యిడిన । తులువపైఁబడి పొడ్చి తూలెడువారు,
నిజవాహనంబు ద్రుంచిన నవ్యవాహ । భజనఁ బల్మఱునిల్చి పరుఁగూల్చువారు,
ఖండంబు లయ్యును ఘనతర భ్రుకుటి । [2]యుండ నోడుగఱచు టుడుగనివారుఁ,
దారు నొచ్చియును బాండవులకుఁ దోడు । పోరాడువారునై భూరిభంగులను
దళములు పోర, రథంబులుపాఱి । నలసిన తలలుఁ జూర్ణములైన విండ్లుఁ
గరుల ద్రొక్కుల నేలఁగలిసిన భటులు, । వరుసఁ దుత్తుమురైన వాలుగుండెలును,
హరిఖురాగ్రముల నుగ్గైన బొమ్మికలు, । నురుగతిఁ ద్రెవ్విన యూరుకాండములు
వీరాసి నిహతిఁ ద్రెవ్వియు రథమీఁడ్చు । తేరి గుఱ్ఱములునై దృష్టింప రణము
శరశయ్య నిక్కెక్కు శాంతనవుండు । పరమార్థమన్నట్లు భటులట్టి శయ్య
నెక్కిన చోటునై యింపార, సూర్యుఁ । డెక్కె మిన్నను పట్టపేనుంగు [3] వీపు
కొడుకు వచ్చెనో రాఁడో ఘోరాజకనుచుఁ । బొడవెక్కి వీక్షించుపోల్కి దీపింప.

## భీష్ముఁడు పాండవవీరుల నొప్పించుట

అపుడు దుర్యోధనుండనుప దుర్ముఖుఁడు । కృప వివింశతి శల్య కృతవర్మలనఁగ
నేవురుదొరలు వీరెలమిఁ బంచాగ్ని । భావంబు వారు విస్ఫార తేజముల
గాంగేయుకెలఁకులఁ గదిసి శాత్రవుల । భంగపెట్టుచు బరాబరి నేయునంతఁ,
దన తాలకేతువు దశదిశావీధి । వనమునఁ దోఁప దేవవ్రతుండలరి
తాలముం దఱుము వాతూలముఁ బోలె । వేలములకు సైన్యవితతిఁ బోఁదఱిమి,
పాంచాల కేకయప్రముఖులు వాఱ, । సంచిత వ్యూహపార్శ్వములైన వారి

1. కలిత మావుతులు. 2. యొండె వురకుట. 3. రింపు. (మూ).

మూఁకలకుఱికి యమ్మొనలెల్ల విప్పి । యాఁకొన్నపులి యాలకాది కొన్నట్లు
వెన్నడించియు, జోడు విల్లుఁ బతాక । యెన్న రథ్యము సూతునిలకు వ్రాల్చియును,
వారి తూపులవాన వరుసఁ దోడ్తోన । వారించియు ననూనవైఖరిఁ దాఁకి,
యెక్కడఁజూచిన నెదుటఁ బార్శ్వములఁ । బెక్కండ్రు భీష్ములు బెరసినట్లుండెఁ
బ్రజలను బుట్టించి బ్రహ్మయావ్రేఁగు । నిజలీలఁ జెఱుప జన్మించినాఁ డనఁగ.
దాయలఁ దమసందు దట్టమై వివిధ । సాయకమయముగా శరములేయుచును
నేమి[1]చాళులు వట్టు నెత్తుటఁ దడుపు । భూమీశ, భూమిఁ దూపులనారునాటు
సురపూలవృష్టి నచ్చుగ నెరువుగట్టుఁ । బోరిపోరి రథవేగమున నెలుగువెట్టు
విమతులు ధరఁబడ్డ విజయఫలంబు । క్రమ మొప్పఁ గొను భీష్మకర్షకుండడర.
భయమంది భగ్నమై పాండవబలము । లయకాల మిదియని లజ్జను విడిచి
వడగండ్లఁ జిగురాకు వ్రయ్యలైనట్లు । తడఁబడి తలచెడి [2]తట్టాడి తలఁకి
చిందఱవందరై చివికి చీకాకు । నొందుచు [3]నొకనిపై నొకఁడు వ్రాలుచును
మందాకినీసూను మార్కొను మగలు । మందునకును లేకమగఁటిమిఁ బాయఁ
దల్లిగారగు సుభద్రాదేవి కడుపు । చల్లఁగాఁ బుట్టిన సౌభద్రుఁడపుడు
కర్ణికారపతాక గలిగి సువర్ణ । వర్ణరథ్యముల నుజ్జ్వలమైన రథము
నెక్కి శౌర్యము రూఢికెక్కిన భీష్మ । ... ... ... ... ...
మద్రాధిపతిఁ బదిమార్గణంబులను । భద్రాత్ముఁ గృతవర్ముఁ బదిమార్గణముల
ఘనుఁడు వివింశతిఁ గాండవింశతిని, । అనువొప్పఁ గృపుని నూఱంబకంబులను,
దుర్ముఖుఁ బదియారు తూపుల నొంచి । మర్మంబు లగలించి మఱియంతఁ బోక
నారాచవర్షంబు [4]నాదేయుమీఁద । వారక కురియింప, వారలు మెచ్చి:
" యితఁడు మహావీరుఁ డెవ్వరికంటెఁ; । బ్రతివచ్చుఁ గ్రీడికిఁ బౌరుషస్ఫురణ.
ఆర్వుర నణఁచు సంయమిపోలె మనల । నార్వుర శరవిద్య నడఁపుచున్నాఁడు.
వాల నిచ్చినఁ గాదు వారికి వారు । చేలావుపస వీనిఁ జెండాడుటొప్పు. "
అని సూతునొక్కఁడు హయములనొకఁడు । ధనువొక్కరుఁడు కేతుదండ మొక్కరుఁడు
ఘనరథం బొక్కఁడు కవచ మొక్కరుఁడు । తునుమాడఁ జొచ్చినఁ దోడ్తోన నతఁడు
నన్నిటికన్ని చయ్యనను గైకొనుచు । మిన్నేటిసుతు విల్లు మెఱుఁగుటమ్ములను

---

1. చోళ్ళువట్టు. 2. దట్టమై. 3. నొకటిపై నొకటి. 4. నాద్యేయు. (మూ).

విఱిచిన విఱుగక వీఁడెంతయనుచు । నఱమంట పిడుగునై యఱగన్ను మెఱయ
సమరనదీసూనుఁ డభిమన్యు నపుడు । సమయించు తలఁపున శక్తి వైచుటయు,
నది మూఁడు శరముల నార్జుని దునిమి । నదిసూను కవచంబు నఱికిన, నలిగి
కృతవర్మ మద్రేశ కృప వివింశతులు । ధృతి దుర్ముఖుఁడు భుజోద్రేకంబుతోడ
బాణాష్టకంబులు బాణసప్తతులు । బాణశతంబులు బాలుపై నేయ
నంతలో భీష్ముఁ డస్త్రాది సన్నాహ । దంతురంబైన రథంబెక్కి వచ్చి
సాయకత్రయమున సౌభద్రు నురము । వాయువు లడమూడ వ్రయ్యలు వాపి
[1]పాఱవాతమ్ములు ఫాలదేశమున । నాఱు నాటినఁ బ్రాణ మల్లలనాడి
కోపధూమ్రాక్షుఁడై గోత్రారిమనుమఁ । డేపుచేవయు నాత్మ నినుమడింపంగఁ
గ్రొత్తగా మిన్నేటికొడుకెత్తికొనిన । యుత్తాలతాలాంక మూర్వీఁ గూల్చుటయు
రాజుచిత్తము పాండురాజుసైనికుల । నాజిలో గెల్వరాదని కొంత దెలిసె.
ఆర్చెఁ బాండవసేన యాహవలక్ష్మి । యార్చివుచ్చిన భావముండె నీమొనకు.
సౌభద్రుపై నంపజడి శల్య కృపులు । వేభంగి నడరింప వేగంబె వచ్చి
పావని యాబాణపటలంబు విప్పి । దేవవ్రతుని విల్లు ద్రెవ్వనేయుటయు,
నతఁ డొండువింట నస్త్రావళి దొడిగి । ప్రతివీరు సింగంపుఁబడగ దున్మాడి
యంబకత్రయమున నభిమన్యు గ్రుచ్చి । పంబి పైపై వచ్చు పరసేనఁ బఱప
వారి సైన్యపుఁడును వరుసఁ గేకయులు । వైరాటు లిరువురు వారి తండ్రియును
బవనజ పార్థసంభవులకు మిగిలి । దివిజ నదీసూను తే రాక్రమించి
శక్తి కుంత ప్రాస చక్ర గదాది । శక్తిఁ దోమర సహస్రంబులు గురిసి
కృతవర్మ మద్రేశుఁ గృపు వివింశతిని । ధృతి దుర్ముఖుని గుంపు తెరలఁ దోలుచును
ఎడనెడ భీష్మతో నేట్లాడుకొనుచు । వడముడి వడిమెచ్చ వ్రాలుచో, నందుఁ
గరిఘటాపటలితో గర్వంబుతోడ । ధరణీశుఁ డలర నుత్తరకుమారకుఁడు
శల్యుపైఁ గవిసి విశల్య దోశ్శక్తిఁ । గల్యంశజుంతును గలసేన చూడఁ
గరిఁగొల్పి నారాచ ఘనవృష్టి గురిసి । హరుల సూతునిఁ జంపి యరదంబు నఱికి
యురుచాపయష్టియు నూనంబుచేయ । దరహాసమొప్ప మాత్స్యుని జూచి యతఁడు :
"గోగ్రహణమునాఁడు కురుసేనమీఁద । నుగ్రతచూపిన యోధవా!" యనుచుఁ

1. పాఱ. (మూ).

ప్రళయకాలమునాఁటి భాస్కరప్రభలఁ । గిల కిల నవ్వెడి ఖేటకంబొకటి
యుత్తరుమీఁదఁ బ్రయుక్తివై చుటయు । నత్తుంగ రుచి నది యుడువీథిఁ గప్పి
దొరకెఁ గాలున కిది తొలిముద్ద యనఁగఁ । బరిమార్చె నుత్తరుఁ బ్రాభవోత్తరుని.
అతఁ డిట్లు కూలిన నాతని కరిని । ధృతిఁగూల్చి శల్యుండు తేరొక్కఁ డెక్కె.
తమ్ముఁ డిట్లీల్గినఁ దానల్గి శంఖుఁ । డమ్మద్రపతిఁదాఁకి హస్తిసంపదను
పరమేఘకులముతో వజ్రగిరీశు । నిరవొప్పఁ జెనకఁ బోయినలాగు దోఁప
ఘోరభంగిఁ గడంగి కులిశోపమాన । దారుణాస్త్రములఁ బ్రతాపించి యేయ,
నమ్మేటికి భీష్ముఁ డమితరథాశ్వ । సమ్మర్దమున నట్టి శంఖుని కరుల
నిసుకఁ గట్టిన బొమ్మరిండ్లు వేడుకకు । వెసఁ గాళ్లఁ దన్నెడి వెఱ్ఱియుఁ బోలె
ఘీంకారమునకు [1]దిగ్భిత్తులు పగుల । శంకలేక వధించు సంచు తా నెఱిఁగి,
"యోడకుం డోడకుం డో యోధులార! । క్రీడి వచ్చితి మీకు గెలుపేమి ప్రాఁతి!
యటుచూడుఁ" డని మార్గణావళిఁ బఱుపఁ । బటుభంగి నధిప, నీబలములలోనఁ
జిద్రుపలయ్యెడు తేరుఁ, జెడిపాఱు హయము, । నదవదయగు బంటు, నఱఁగు గజంబు,
ధూళిపాఱు పతాక, త్రుంగెడి గొడుగు, । గాలిఁబోయెడు విల్లుఁ గలుగవచ్చినను
అయ్యొడ్డు దోసపం డవిసినయట్లు । చయ్యన విచ్చె వాసవముఖ్యు లలర.
నరుఁడంత నిలువక నారి సారించి । సురనదీసూనుపై స్ఫురణమై నిగిడె.
ఇరువురుఁ దలపడ నీక్షించు ప్రజకు । హారి హారి దాఁకిన యాచందమయ్యె.
ఇట్లిరువురుఁ దాఁక నిరువంక దొరలు । పోట్లాట కెక్కిరి భూపాల, వినుము.
అప్పుడు భానున కపరాహ్ణమయ్యె; । నెప్పటిశంఖుపై నెక్కె శల్యుండు.
గజయుద్ధమునకోర్చి కలకలంబోర్చి । నిజ[2]శరంబుల మాత్స్యనికరంబు దఱిమి
విరటు శతానీకు వెస [3]వెన్నడింపఁ । దిరమైన మద్రేశు తెగువకు వెఱచి
పదఘట్టనల భూమిభాగంబు వగులఁ । జెదరి శంఖుఁడు చేరె సేనానికడకు.
శంఖుఁ డిట్లొదుఁగుట శాత్రవభటులు । శంఖంబులొత్తుట చక్క వీక్షించి
నరుని భీష్ముండు తృణంబుగా నెన్ని । కురిసెఁ గోలలవాన గుణఘోష[4]మడర.
నరుఁడు నాభీష్ముఁ దృణంబుగా నెన్ని । పోరి పోరి బహుశరంబుల వెల్లిగొలిపె.
ఇరువురిరణమున కీ యుగంబెల్ల । సరిచాలదని తోఁచె శస్త్రాస్త్రములును.

1. దిగ్దంతులు. 2. శిఖంబుల. 3. వెన్ను. 4. మనఁగ. (మూ).

వడినంత భీష్ముండు వాసవితోడి । బెడిదము చాలించి పెరత్రోవ నిగిడి
ద్రుపదుసేనకుఁ దేరు దోలించి యతని । యపరిమితోగ్రసైన్యంబులనెల్ల
నెండినవనమున కెగసి కార్చిచ్చు । మండెడుకైవడి మదగజ తురగ
రథ పదాతిచయంబు రౌద్రబాణాగ్నిఁ । బృథివిపాలొనరించి పేర్చి వెండియును
ఘనుఁడు కేకయపంచకము సేనకుఱికి । సునిశితాస్త్రంబులఁ జూర్ణంబుగాఁగ
నాలోడనముచేసి యంత విరాటు । నాలుగుదెగల సైన్యము మారికొనఁగ
యడయాలములతోడ నార్పులతోడ । గొడుగులతోడ నెక్కుడు తేర్లతోడఁ
బెక్కుదిక్కులఁ బర్వ పృథివీశుసేన । నొక్కదిక్కుగ నొత్తి, యోధులు వణఁకఁ
బాండుతనూజులు పరికింపుచుండఁ । జండిమ[1] నెఱపుచోఁ, జండభానుండు
"ఎనయఁ దేజము చూప నితండు చాలుఁ । బునరుక్తి యే" నని పోయినయట్లు
భానుఁ డంబుధి గ్రుంకెఁ బాండవాస్యముల । తోన పంకజములు దురదుర మొగిడె.
కౌంతేయ భీత్యంధకారంబుతోన । యంతంతఁ బర్వె నయ్యంధకారంబు.
రారాజు పులకాంకురంబులతోన । తారలు పొడమె నెంతయు నభోవీథి.
రమణ భీష్ముని యనురాగంబు తోడ । నమరె సంధ్యారాగ మపరదిక్కునను.
అప్పుడు కురువీరు లాజిచాలించి । విప్పుమోముల భీష్మువినుతించుకొనుచు
వేలంబులకు [2]నేఁగ వినుము పాండవులు । నాలంబు చాలించి యరిగి రిండ్లకును.
అని యిట్లు తొలినాఁటి యాజిలో భీష్ముఁ । డొనరించు పౌరుషంబొగి సంజయుండు
ఇట నాంబికేయున కెఱిఁగించె ననుచు । నట ముని జనమేజయక్షితీశునకుఁ
జెప్పిన నారాజు చెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గథ[3]చెల్లె నెఱిఁగింపుమనినఁ
గౌశల్య గర్భదుగ్ధాబ్ధి శుభ్రాంశ! (?) । ఈశాన సంస్తుత్య! యింద్రారిభయద!
పాలిత దివ్యోగ్రబాణసంపన్న! । నీలాంబుదశ్యామ నిర్మలదేహ!
సనకాది మునివంద్య! సచ్చిదానంద! । మనువంశతిలక! రామా! మీకుశరణు.
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్ర దీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితమై భీష్మపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె రెండవది.

1. నెఱపుతో. 2. వీరు. 3. లెల్ల. (మూ).

# తృతీయాశ్వాసము



శ్రీకంఠ కమలజార్చిత పాదయుగళ! । నాకేశవందిత నవ్యచారిత్ర!
లోకరక్షక, భక్తలోల, శరణ్య. । నీకు మ్రొక్కెద రామనృప, చిత్తగింపు.
అవధారు మఱియు సంయమి చెప్పఁదొడఁగె । నవినయస్ఫూర్తికి జనమేజయునకు.
ఆరీతి భీష్ము పరాక్రమంబునకు । సారస్యవిముఖుఁడై శమన నందనుఁడు
నాఁటి నిశావేళ నరనాథులెల్ల । వాటంపు భక్తిఁ గొల్వఁగఁ గొలువుండి
శౌరికిట్లను: " నిన్ను శక్రజునమ్మి । పోరిలోఁ బ్రజలఁ గోల్పోవుచున్నాఁడ.
బాణారి బాణాది బాణసంపదకు । ద్రోణుమెచ్చులు గన్న తూపులపసకు
బ్రమసి యేఁ గౌరవపతితోడి యనికి । సమకొంటిఁ గాక యీచల మెవ్వఁడెఱుఁగు.
ఇతఁడు శాత్రవహింస కేనోప ననిన । ధృతి నొక్కవిధము సంధింపనే యేను!
ఆపగాసుతు మర్త్యుఁడని యుంటిఁ గాని । నాపాలి మృత్యువై నటియించు టెఱుఁగ.
ఉత్తరుం డీల్గె లో కోత్తరుం డొకఁడు । క్రొత్తగా నిదె నేఁడు గూలె సైన్యంబు."
అనినఁ గృష్ణుఁడు పల్కె 'నశ్లీలతలఁప! । ఎనయ నీయెడఁ గ్రీడి హిత మేల మఱచు!
ఎల్లింటిరణమున నీక్షింపు మితని; । చల్లనై యీరాత్రి శయనింతు గాక.'
అనిన సంతోషించి యవనీశ్వరుండు । వనజనాభుని నంచి వాసవి నంచి
యనిలజు నంచి సైన్యపు నంచి సకల । జననాథులను నంచి చనియె లోపలికి.
ఆరాత్రి దొర లాత్మ నాపగాతనయు । పౌరుష మొకతృణప్రతిమగా నెన్ని
"యెప్పుడు వేగునో యీనాళ్లు జాలు! । తప్పక యుగములై తాఁదోఁపఁదొడఁగె."
అనునంతఁ బక్షద్వయము నూఁచి విద్రిచి । యొనయ నించుకనిక్కి [1]యిలఁ దోఁకఁ జీఱి
చంచుపుటము విచ్చి చరణాయుధంబు । కొంచక కొక్కరొక్కో యని యార్చె.
వదలె విటగ్రీవ వనితాకరములు ; । [2]ప్రిదిలె సుప్తిసుఖంబు పృథివి జీవులకు.
భటుల నాజికి లేపఁ బఱతెంచె ననఁగఁ । బటు [3]గుణత్రయముతోఁ [4]బయ్యెర వెట్టె.

## ద్వితీయ దివస యుద్ధక్రమము

అంతఁ దూర్యరవంబులంతంతఁ జెలఁగ । నంతక ప్రియసూనుఁ డరుణోదయమున
నిత్య కృత్యాచార నియమముల్ దీర్చి । దైత్యారి సాత్యకి తమ్ములు సఖులు

1. యలదోకచీర. 2. పృథిజె. 3. గణ. 4. పయ్యద. (మూ).

బాంధవులును వీరభటులు నందనులు । బంధుర చతురంగ బలములుఁ గొలువ
రథనేమిరవ ధనుర్జ్యాఘోష హస్తి । పృథు ఘంటికారావ భేరీరవముల
నేల వ్రక్కలువాఱ, నిబిడహుంకృతుల । వేలుపులలుకంగ వేడ్కతో నడచి
రుధిరోగ్రమైన కురుక్షేత్రమునకు । నధికసంపద వచ్చి యచ్చట నిలిచి,
శమనసూనుఁడు గాన సాత్త్విక ముద్ర । సమకొన్న విధ మొప్ప శార్ఙ్గి నీక్షించి,
"పన్నిందుమా యొద్దు పరభీకరముగఁ । బన్నుగా" ననునంతఁ బాంచాలసుతుఁడు
"ఎనయఁ గ్రౌంచవ్యూహ మిం వేళఁ బన్ని । నా నేర్పుచూపెద నవభంగి" ననుచు
నట్టి యొద్దునకుఁ దానందు గళంబు । పట్టున నుజ్జ్వల ప్రభలతో నిల్చె.
తోన పాంచాల మాత్స్యులు నయనములు; । తా నుగ్రుఁడగు చేకితానుం డురంబు;
నొగి భీమసౌభద్రు లుభయపక్షములు; । మగధ కేకయ రాజమణులు దేహంబు;
ద్రౌపదీసుతులు సాత్యకియుఁ బాదంబు; । లా పౌండ్ర పాండ్యేశు లచట జంఘలును;
శంబరాంబష్ట దశార్ణ కిరాతు । లిన్మాడ్కిఁ గేకయు లెడనెడ నమర,
హూణ హైడింబ దైత్యులు శిఖండియును । రాణతోఁ గవలు గోత్రధ్వంసి సుతుఁడు
శిబిచైద్యులాదిగా సేవింపఁ గడిమిఁ । బ్రబలుఁడై పాండవాగ్రణి వెన్నునగుచు
నిలువఁ గ్రౌంచవ్యూహ నివహంబు చూడ । నలువకు లోచనానందమై యుండె.
ఇట రౌద్రగతిఁ గౌరవేశ్వరుండనికిఁ । బటహ తూర్యంబులు బహుభంగి మ్రోయఁ
జతురంగ సేనా విశాలుఁడై వచ్చి । శతమఖసుతుఁ జూచి సైన్యంబుఁ జూచి
గురు భీష్మ కృప శల్య గురుపుత్ర శకుని । కురుకుమారశతంబుఁ గొమరొప్పఁ బలికె:
"గారుడవ్యూహంబు గావలె మనకు; । వైరి నందులఁ గాని వారింపరాదు.
అలరి యయ్యొద్దు సర్వాంగభాగముల । నిలువుఁడా మీరు మీ నేర్పుల మెఱసి.
మీమీ బలంబులు మిమ్ము సేవింప । నీమాడ్కి నిలువుఁడా యేను జూచెదను."
అని వారి నట్టి వ్యూహాకృతి నిల్పఁ । బనిచిన భీష్ముఁడేర్పఱుప నేర్పఱుపఁ
దలకు ముక్కునకు దోర్ద్వయమున కలఘు । గళమునకును మహోగ్ర శరీరమునకు
... ... ... ... ... । ... ... ... ... ...
తమ్ములు భీష్ముఁడుఁ దానును రాజు । నమ్మిన జయముతో నడుమ నున్నంత,
[1]ననుచరుల్ జోదులు నంతంత నిలువ । నది గారుడవ్యూహమై కాన నొప్పె.

1. ననుజాతో. (మూ)

తూర్య స్వనంబులు తోరమై దిశల । సూర్యప్రభలతోడఁ జుట్టుముట్టఁగను
జేసూపి రారాజు సేనలఁ దఱుమ । నాసూటిఁ బగవారు నలమి పైఁబడగఁ,
బోరు ఘోరంబయ్యెఁ బురుహూత నగర । వారాంగనల యిండ్ల వాఁకిళ్లు తెఱవ
... ... ... ... ... । కేళీకలాప ధిక్కృత వేగమగుచు,
నారద వీణా రణ ద్రామనామ । పూరిత సకల నభోభాగ మగుచు,
పటహ నిస్సాణ నిర్భరనాదజాత । పటు దిశావలయ దర్పధ్వంసమగుచు.
ఆ రణంబున భీష్ముఁ డానాఁటిరణము । కారణంబుగ నేచి కౌంతేయకోటిఁ
గొంచక చించిసఁ గొదుకుచు సేన । కంచుమించై పాఱ గళములు నఱికి
దొరల నందఱఁ దోలి తొప్పరలాడ । నరుఁడు నారాయణునకు నిట్టులనియె:
"బావ, చూచితె! శూన్యభావన నన్ను । నీ వీరవరుఁ డెన్ని యిటు మన సేన
నాహుతిఁగొనఁజొచ్చె; నటు మనరథము । మోహరింపఁగఁజేయు మురవైరి, తగును."
అనినఁ గృష్ణుఁడు రథంబాత్రోవఁ దెచ్చె; । అనిమిషనదిసూతి కర్జునుతోడ
నని ఘోరమై చెల్లె నప్సరో యక్ష । దనుజ గీర్వాణ గంధర్వులు పొగడ.
రామునిచేఁ గొన్న రౌద్ర బాణములు, । భీమునిచేఁ గొన్న భీకరాస్త్రములు,
నిరువురు నాటుచో నిరువురుఁ గొంత । సురఁగరు సోలరు శూరత పెరుఁగ.
నరుని తూపులు తాఁకి నదిసూను పడగ । యరదంబు విలు జోడు నడఁగినఁ జూచి
కలఁగి కౌరవులెల్ల గాంధార శల్య । కలశజులాది (గాఁ గల యోధులెల్ల)
నేయుదు రవి క్రీడి యొంతయుఁ దునుము; । పాయుదు రిటఁ గూడఁబడుదురు; మఱియు
నందఱికందఱై హరిసూతి పెనఁగఁ । జిందఱవందఱై క్షితిప, నీదొరలు
గాంగేయరక్షకై కడఁగి వచ్చియును । సంగరమునువీడి చయ్యనఁ దొలఁగ,
శరముల బలములఁ జక్కుగా నఱుకు । నరుప్రతాపమునకు నరనాథుఁ డులికి
దేవవ్రతునిఁ జేరి తెగువ నిట్లనియె: । "ఓ వీర, పాండవేయుల గెల్తుననుచు
సేనలు విన నాడి సేనానితనము । (పూనిన నీదగు) భుజశక్తి గాన.
వాల నిచ్చితిగదా వాసవి నింత! । [1]తోలనిచ్చితిగదా దొరల నీరీతి!
బవరానఁ గుత్తుకబంటివై శివుని । మివిలిన శరవిద్య మించుచుండియును
ధృతి నిన్నుగావ నే తెంచు సైన్యముల । నితఁడు (వెన్నాడుచు నిట్లు) మోఁదెడిని.

---

1. తోలవిచ్చితివి. (మూ).

గురుఁడాదిగా వీని కోలలఁ బగిలి । విరథులై శిరములువీడఁ బాఱెదరు.
ఇట్టివాఁడవు కర్ణ నేటికి వెడలఁ । గొట్టితి రణభూమిఁ గొంతోపకుండ ?"
అనిన నించుక నవ్వి యాపగేయుండు : । "జననాథ, నీమాట సకలంబు నిజము.
సేన.....................డ్డు । కానవు నాపరాక్రమ మింకఁ జూడు."
అనుచు గాండివపాణికై తేరుగడప, । జనపతి తాను సాహసస్ఫురణఁ
గృతవర్మ గురుపుత్త్ర కృపులతో నెక్కి । యతిఘోర శరవృష్టి నర్జునుఁ బొదువ
మహిమఁ బార్థునకు ధర్మజ భీమ నకుల । సహదేవు లాహవోత్సాహులై యొదవి
భీష్మపై నెక్కొన, బెడిదమై రణము । గ్రీష్మ భాస్కర కరాకృతిఁ దేజరిల్లె.
అందు గంగాసూతి హస్తకౌశలము । పొందుగఁ బురుహూతపుత్త్రుని మేన
నమ్ములు గ్రుచ్చిన, నపుడు రక్తములు । చిమ్మిన గ్రో(వితోఁ జిమ్మినట్లు)గసె.
నరుఁడు భీష్మునినేయు నారాచకోటి । గరళాగ్నికణములు గ్రక్కుచు నడరి
యతని విల్లును జోడు నరదంబుఁ గాల్చు । నతనికి నవియెల్ల నరుదెంచు మఱియు.
నరుఁడుగ్రుంచు రయంబు నది (సూతి వాని) । వరుసఁదెచ్చు రయంబు వసుధకేర్పడదు.
ఇద్దరు సరిఫత్తు రిషువిద్య నసఁగ । నద్దరిపాటుగా నాపగేయుండు
క్రొవ్వాఁడితూపున గోవిందునురము । రువ్విన, నలివేడి రొంపినెత్తురులు
(క్రుంకుభానునిపోలెఁ) గొన మింటికెగసె । మంకెనపూచాయ మఱపించునాడ్కి.
ఆతతాగ్రహగుణవ్యగ్రుఁడై నరుఁడు । తాతఁజూచి యురంబు దశవిశిఖములఁ
దూలనేసిన నొడల్దూలియు నతఁడు । తాలిమి వదలక దర్పంబు (మెఱసి)
వింట నగ్నులకంటె వేంద్రంబులైన । కంటకాస్త్రములు లక్షలసంఖ్య దొడిగి
దయలేక నరునేయ, దాక్షిణ్యమాత్ర । మయిన లేక నరుండు నాభీష్ము నేసె.
అయ్యంపవెల్లువ నమరలోకంబు । వ్రయ్యునో ! లోకంబు వడిఁ దడఁబడునో !
చుక్కలు డుల్లునో ! సూర్యునిరథము । చిక్కునో ! యని చలించిరి సురాసురులు.
అప్పుడు మధ్యాహ్నమయ్యెఁ గెంధూళి । గప్పి సంధ్యాకాలగతి మింటఁ దోఁచె.

## ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిఁ దలపడి విరథుఁ డగుట

ద్రోణుపై ద్రుపదపుత్త్రుఁడు తేరు పఱపి । బాణవర్షములఁ గప్పఁగ నాతఁ డలిగి
వాని సూతచ్ఛత్త్ర వాజివర్గంబ । నోనేసి యార్వ, ద్రోణున కల్గి వాఁడు
శితబాణవృష్టి వర్షింప వర్షింప, । నతఁ డంత నాశీవిషాకృతి తూపు

వేఁడిమంటలు గ్రక్క వేవేగఁ దొడిగి । వాఁడిచూపులు దోఁప వాని వీక్షించి
పాండవసేనాని, పడితిగా కనుచుఁ । జండవైఖరి నేయఁ జలియింప కతఁడు
నది రెండుచేసిన, [1]నాపిశేషములు । మదిమెచ్చి పొగడిరి మనవారు వారు.
శరగురుఁ డంత ధృష్టద్యుమ్నుఁ డట్లు । శరము డంబునఁ గ్రుంపఁ జయ్యన నలిగి
శక్తి బాహుశక్తి సమకూర నెత్తి । రిక్తాశ్వుమీఁద ఘోరముగ వైచుటయు,
మూఁడుతూపుల నది మోడుగా నఱికి । వాఁడితూపున గ్రుచ్చె వాఁ డస్త్రగురుని.
అంతఁ బోవక శక్తు లతఁ డొకనూఱు । దొంతిపెట్టిన వైవఁ, దోర్దోన గురుఁడు
పరమాణువులుగాఁగ బాణంబుచేసెఁ । గురువంశతిలక, యాశ్చర్యము లినుము.
వెండియు సేనాని వివిధోగ్ర భంగిఁ । జండ కాండంబులు సంధించి గురుని
నుఱుగని నెత్తుట నోలలాడించె. । నడిమికి నవ్విల్లు నఱికి ద్రోణుండు
సారథిఁ దునిమి యశ్వములఁ జెండాడ । నారథి నాథుఁడు నరదంబు డిగ్గి
గద త్రిప్పివైవ, నంగద దాని గురుఁడు । చిద్రుపలుగా నేసెఁ జిఱునవ్వుతోడ.
వాలును బలుకయు వాఁడంతఁ గొనుచుఁ । గాలాంతకుని రీతిఁ గదిమి పైఁబడిన
నా వాలుఁ బలుకయు నలిగి యాచార్యుఁ । డావాలవలె నుండ నన్నియు నఱికి
"చేతికి లోనయ్యె సేనాని జముని । వాతఁ ద్రోసెద" నని వాలెత్తు నంతఁ,
గరిఁగావ నేతెంచు గరుడాంకు పగిది । నరుదెంచి భీముఁ డయ్యాచార్యుఁ దాఁకి
క్రూరాస్త్ర యుగళంబు గుండియ నాటి । వైరథ్యుఁడగు తన వాహినీ పతిని
నొండొక రథమున నునిచిన, నంత । మండుచుఁ గురుపతి మారుతిమీఁదఁ

## భీముఁడు కళింగ సైన్యము నుఱుమాడుట

కరి ఘటాపటలాధ్యుఁ గాళింగనాథుఁ । బరువడి మణిమంతుఁ బంపఁగా నతఁడు
పవనజు ముందట బలములలోన । వివిధ గదశ్రేణి వెల్లిగాఁ గొలిపె ;
అవి భీము బలముచే నర్ధము గూలె ; । దవులక యున్న యర్ధము దాఁగిపోయె.
మణిమంతుఁ డేనుఁగు మారుతి మీఁద । నృణిమంతుఁడై కొల్పి చేవేఁడి నూప
గద వేసి యవ్వీరుఁ గాలునిఁ గూర్చి । మదకరి నుగ్గాడె మార్గణౌఘములఁ.
శూరుఁ డాతని పట్టి శుక్రదేవుండు । మారుతియరదంబు మహిఁ గూలనేసి

1. యా విషాణములు. (మూ).

కుంతాగ్రములవంటి కోలలఁ బొదువఁ । గౌంతేయుఁ డవ్వీరు గదవ్రేసి చంపె.
అంతఁ బేర్చి శ్రుతాయువను కళింగుండు । కౌంతేయు వాలంపగమిఁ జుట్టుముట్టి
వెడఁద తూపున విల్లువిఱుగ నేయుటయు, । వడముడి బొమముడి వడినిడి కడిమిఁ
బలుకయు వాలును బాణద్వయమున । వెలుఁగ శాత్రవ బాణవితతిఁ ద్రుంచుచును
ద్రోచి యెక్కిన, వానితోఁ బుట్టువొకఁడు । ప్రాచీశ నిభమూర్తి భానుమంతుండు
ఐరావతముఁ బోలు హస్తిపై వచ్చి । మారుతి నుగ్రతోమరముల నైన,
నిభము కొమ్ములు ద్రొక్కి యెక్కి యాభీముఁ । డభియాతిశిరము ఖడ్గాగ్నిలో వ్రేల్చి
దంతి ప్రాణము గొని ధరణికి దాఁటి । యంత శ్రుతాయువు నరికట్టు కొనిన,
నతఁడును దనసేన కర్థిఁ జేవీవఁ । జతురంగ రంగ ద్విశాలమై యదియు
మొగిళులు పూర్ణసోముని జుట్టుముట్టు । పగిది వాయుజు మీఁదఁ బడిన, నజ్జోదు
పాదచారము నొంటిపాటును నైన । నాదెస చూడక యధికరోషమున
నాసేన నసిధార నటునిటు చెదర । వ్రేసియుఁ గరవాల విద్య పెంపునను
గరిశిరంబులు వ్రేయఁ గ్రందైన మెదడు । కరవాలమున నంటి కడుభార మైనఁ
బడగలు తునుకలై పడ వ్రేసి వ్రేసి । వడముడి యాగ్రేఁగు వారించుచుండు.
సారథి రథ రథ్య సహితంబు గాఁగఁ । దేరులు నఱకుచో ధృతిఁ జేతిహేతి
మొక్కవోయిన నశ్వముఖమున నపుడు । గ్రక్కున నతఁడు ఖడ్గమువాఁడి వెట్టు.
డాసిన నృపకిరీటములకు విసర । [1]సేన వోయిన చోట నితఁడు ఖడ్గమునఁ
గాలుబంట్లను జక్కగా వ్రేసి వ్రేసి । చాలంగ నయ్యేన చక్కంగఁ బెట్టు.
గాలిచూలి రీతిఁ గాళింగబలము । నాలంబులోఁ గూల్ప నబ్బిరుసునకుఁ
జలియించి సూర్యుఁడు జాఱె ననంగ । నలవి పెట్టినయట్టు లపరాహ్ణ మయ్యె.
అంతఁ గళింగుపై ననిలనందనుఁడు । [2]హంతకాఁడై తాఁక నుంకించు చోటఁ
గేతు కార్ముక రథ్య కీలితంబైన । యాతేరు సారథి యవసరం బెఱిఁగి
ముందట నిడిన భీముఁడు రథంబెక్కి । యందుఁ జాపముఁ బూని యమ్ములఁ దొడుగ,
నాయువు డగ్గఱి యాశ్రుతాయువును । సాయక నవతిఁ గీచకవైరి నేయ,
నవి ద్రుంచి యొకబాణ మనిలజుఁ డేయఁ । బవిలి మూర్ఛ మునింగి పడియె నయ్యోధుఁ;
డతఁడిట్లు మూర్ఛిల్ల నాతని రథము । హితుఁడు సారథి యాజి కెడఁగల్గఁ దఱిమె ;

1. నాస. 2. ఖంత (మూ).

కర్ణధారుఁడులేని కలముఁను బోలె । ఘూర్ణాయమానమై కుందెఁ దత్సేన.
ఇట్టి భీముప్రతాప మీాక్షించి యేటి । పట్టి మారుత పుత్రుపైఁ గడంగుటయు,
నతనికి నడ్డమై హాఁ సహోదరుఁడు । ధృతిఁ జేకితానుండు ధృష్టకేతుఁడును
విరటుండు పాంచాలవిభుఁడు వెండియును । దొరలు శిఖండియు దురదురఁ దాఁకి
వాలికతూపుల వాన [1]ముంచుటయుఁ, । గేలిని జేయుచుఁ గిమ్మీరవైరి
దేవవ్రతుని మీాఁదఁ దేరు దోలించి । యావీరు శరవృష్టి కాత్మ భేదిలక
పరశు తోమర గదా ప్రాస ఖడ్గాది । పరిణద్ధ శరపంక్తిఁ బఱపిన, నతఁడు
బలములతోడ నబ్బాట కోటినెల్లఁ । గలగుండు వెట్టి శిఖండిఁ దప్పించి
యంత భీముని తేరి హయముల నెల్ల । శాంతనవుం డొండుశరమున నఱికి
సింహనాదముఁ జేయఁ, జెదరక భరత । సింహము గదగొని సేనాని మీాఁదఁ
గవియుచో, సాత్యకి ఖండించి నొంచె । దివిజనదీసూను తేరిసారథిని.
సూతుఁ డిట్లీల్గ వాజులు భీష్ముతోన । యా తేరు గొనిపోయె నాజికిఁ దొలఁగ.
అట్టిచో బకవైరి యాగ్రహంబునకు । నెట్టివారలు నిల్వ కేఁగిరి తొలఁగి.
జననాథ, వినుము ధృష్టద్యుమ్నుఁ డపుడు । కనుఁగవ నొక్కఁ-నికాసంబు పొడమి
బకవైరి కిట్లనుఁ: "ప్రభువ, నీవిచట । నొకముహూర్తము చూచుచుండుము నన్ను;
కౌరవతతికి నాకడిమి చూపుదును; । ధీర, డిగ్గుదుగాక తేరు నీ." వనుచు
డించి పగ్గము లుగ్గడించి నుజ్జగము । ముంచి తూర్యంబులు మ్రోయుచుండఁగను
కృప గురుసుతులఁ దాఁకిన, వారు నతనిఁ । గుపితులై కప్పిరి ఘోరాస్త్రవితతి.
అపుడు ద్రోణజుని రథ్యముల సారథిని । ద్రుపదాత్మజుఁడు చంపఁ, దొడఁగి ద్రోణజుఁడు
కృపురథంబెక్కి- నిష్కృప నంపవాన । ద్రుపదజుఁ గప్పఁ దోడ్తోఁ గప్పె నతఁడు.
ఇరువురిచేత నట్లితఁ డొంటిఁ బడిన । హరిపౌత్రుఁ డచటికి నరదంబు పఱపి
మించిన రామ సౌమిత్రులఁ దొల్లి । కొంచక తాఁకిన కుశుఁడును బోలె
ననుపమ శరకోటి నాక్రమించుటయుఁ, । జనుదెంచి శల్యుఁ డా సౌభద్రుఁ దాఁకి
యేఁబదికోలల హృదయదేశమున । నేఁబదిగంట్లుగా నేసి బిట్టార్చి
విల్లుద్రుంచిన, నొండువింట సౌభద్రుఁ । డెల్లగాఁ బదితూపు లేఁబది దొడిగి
మద్రేశు మూర్ఛానిమగ్నుఁగా నేసి । యుద్రులు చలియింప నార్చె; నార్చుటయు

1. ముంచియును - గెలిమి లేనిచో. (మూ).

సారథి తోలఁగించె శల్యు సంగ్రామ । ధారుణి కెడగల్గ ధరణీశ, వినుము.
అత్తఱి లక్ష్మణుండనఁగ నీపౌత్రుఁ । డుత్తరాప్రియుఁ దాఁకి యుగ్రబాణములు
చెరివె నకాలపుష్పిత పలాశంబు । తెఱఁగు రక్తములు సంధిల సేనలార్వ.
అట్టిచో సౌభద్రుఁ డతనివక్షఁబు । గట్టితూపుల నేర్పుగదుర నేయుటయు
నడరించె నొకబాణ మభిమన్యు విల్లు । నడిమికి విఱుగ నీ నందనాత్మజుఁడు.
విల్లట్లు విఱిగిన విజయు కుమారుఁ । డల్లన నగుచుఁ జయ్యన నొండువింట
శేషజిహ్వాలువోని శితపుంఖములను । భీషణాకృతి నేసి పెద్ద నొప్పింప
నాత్మజు నొప్పికి నధిప, నీతనయుఁ । డాత్మసంతాపింప నభిమన్యుమీఁద
నరదంబు వోలింప, నతనికిఁ దోడు । గుఱుఁ డావగేయుండు గురుతనూభవుఁడు
కృపుఁడు మద్రవిభుండు కృతవర్మ శకుని । నృపులు వెండియుఁగూడి సితితాస్త్రతతులఁ
దను నేయ, నర్జునతనయుఁ డందఱకు । నినుమిక్కుటమై పోరె నీక్షింప సురలు.
అపుడు దవ్వులనుండి యా క్రమంబెల్లఁ । గపికేతనుఁడు గాంచి గ్రక్కున రథము
నీసైన్యతతులపై నిగిడించి మించి । యేసిన నాలమ్మ లెన్ని యోగాని
యెవ్వానిఁ జూచిన నేనూరు వాఁడి । చివ్వలు నాటని శిశువైన లేఁడు.
నరపతి సర్వసేనలకుఁ జేచూపి । నరునకుఁ దోడ్పాటు నడువంగ ననుప,
నది సింజినీరావ హయఖురారావ । రథిని ఘంటారావ రథరావములను
దట్టమై నడచినఁ దావకబలము । దట్టమై నడచినఁ దలపాటు గలిగె.
నవధూళి సూర్యమండలముఁ గప్పుటయుఁ । గవిసెఁ జీఁకటి మిన్ను గానరాకుండ.
హయఖండ భటఖండ హస్తిఖండముల । రయమొప్ప వెడలిన రక్తధారలను
ధూళి యడంగినఁ దోఁచె నీమొనలఁ । జాల నర్జును బాణసంపత్తిఁ జెదరి
తునిసిన శరచాప తూణీర ఖడ్గ । ఘన కపాల కిరీట కవచ కేతువులు,
నలిసిన హయశిరోనాగయోధాంగ । సలలిత భూషణ చర్మాస్థితతులు,
తుమురైన రథచక్ర తోమరచ్ఛత్ర । విమల శిరస్త్రాణ వీరయోధులును.
పోరు ఘోరంబయ్యెఁ బురుహూత తనయు । దారుణాస్త్రములకుఁ దలఁకి నీబలము
మొనకట్ట తెగిపాఱ ముందఱ గాన । వెనుక చిక్కను నిల్వ వెరవులు మాలి
తెమలిన నరుఁ డొత్తె దేవదత్తంబు; । భ్రమపుట్ట హరి యొత్తెఁ బాంచజన్యంబు.
అప్పుడు గురుఁ బల్కె నావగేయుండు: । "చెప్పఁ జిత్రముగదా జిష్ణుని మహిమ!
రథికుఁ డర్జునుఁడు సారథి కంసమర్ది । ప్రథనవిక్రమ మెంత పాటింపరాదు!

మురువుగాఁ ద్రిపురారి మూఁడవకన్ను । తెఱచినట్లు ప్రభావదీప్తినున్నాఁడు.
మనపౌఁజు నాజికి మరలింపరాక । విను విచ్చి పోఁ జూచె; వీరవర్గమును
వెనుకముందై పోయె వేలంబుకడకు. । .. ... ... ... ...
వివ్వక నిలిచిన వీరవర్గమును । నొవ్వమై నాజికి నూల్కొల్పరాదు.
వేఁడిమి చాలించి వేగ భానుండు । మూఁడుమూర్తుల పొత్తు ముప్పేట ద్రావె.
సేనలఁ [1]దివిపించి శిబిరంబుకడకు । మానవేశ్వరుఁ గొంచు మరలుట మేలు."
అని చెప్పుకొని భీష్ముఁ డాప్రకారమునఁ । జనియె వేలములకు సైన్యముల్ గొలువ.
పాండవేయులుఁ దమ బలములఁ ద్రిప్పి । మెండైన యార్పుల మిన్నుముట్టంగఁ
జివురుఁదోరణములఁ జెలువైన సంధ్య । దవిలి వచ్చెనఁగంగఁ దనసుహాళంబు
చొచ్చిరి మదినుల్కి చొచ్చి కౌరవ్యు । లిచ్చల నరుశౌర్య మెన్నుచునుండ.

## తృతీయ దివస యుద్ధము

అంత నిద్రాసుఖం బాహవశ్రాంతి । నంతపెట్టఁగ రాత్రి సంప్రీతిఁ బుచ్చి
వేగ భేరీధ్వాన విహ్వలాహ్వాన । మై గభీరంబైన యహికేతుసేన
చనుదెంచి సంగరస్థలి నిల్చుటయును, । దననేర్పు మెఱసి మందాకినీసుతుఁడు
గారుడవ్యూహంబు ఘటియింప నమర । భారకుండై ముక్కుపట్టు తానయ్యె.
ఆచార్య కృతవర్మలచట నేత్రములు, । నాచార్యసుత కృపు లచటిశిరంబు,
శల శల్య భగదత్త శకసింధు సాల్వ । బలభుజు లెల్ల నేర్పడి తన్ను గొలువఁ
దమ్ములతోఁ గూడి ధార్తరాష్ట్రుండు । వెమ్మచు వీ పయ్యె విహగాధిపతికి.
విందానువిందులు విను సూరసేను । లందు బాహ్లికుఁడును నట వాలమైరి.
లీలమై మగధ కళింగ వల్లభులు । కీలించినట్లు దక్షిణ పక్షమైరి.
కోసల కర్ణాట కుకురాధి పతులు । భాసిల్ల డాకాలి భావమై రథిప !
తక్కిన రాజులు తమకు నిమ్మైన । యిక్కువ నెడనెడ నేర్పడునంత
నటఁ బాండవానీక మాజికి నడచి । పటహ కాహళ శంఖ పణవాదు లొలయ
బలపతి ధర్మజ ప్రముఖుల నడిగి । దళముల నర్ధచంద్ర వ్యూహముగను
బన్నుచో, మాగధపతియుఁ బాండ్యుండు । నెన్న భీముఁడుఁగూడి యావ్యూహమునకు

1. దీపించి. (మూ).

దక్షిణశృంగమై తగ నుండిరంత. । దాక్షిణ్య మొప్ప మాత్స్య ద్రుపదులును
గాశ కరూశ కేకయులు నీలుండు । నా శృంగమునకుఁ బ్రాపై నిల్చి రధిప !
పరఁగ శిఖండి సౌభద్రులుఁ గవలు । హరి సహోదరుఁడు మున్నైన యోధులును
ద్రౌపది కొడుకులుఁ దన్ను సేవింప । భూపతి నడుమయ్యెఁ బొసఁగ నొడ్డునకు.
హైడింబుఁడాదిగా నసురసైన్యంబు । తోడ సమస్తయోధులు నిల్చిరచట.
జగదేకనిధిచేయు సారథ్యమునకుఁ । దగుచు డాపలికొమ్ము తానయ్యె నరుఁడు.
నరనాథ, యుభయసేనలు నిట్లు పన్ని । సరభస వాద్య ఘోషంబులతోడఁ
దలపడి సందడిఁ దాసేన పోర । బలధూళి దివిఁ గప్పె భానునిఁ గడచి.
యామహాధూళి లక్ష్యము గానరాక । నామధేయములు వినం జాటి చాటి
తాతల పేళ్లును దండ్రుల పేళ్లు । భీతిపుట్టఁగఁ జేయు బిరుదుల పేళ్లు
సాధకంబగు పా ... ... ల పేళ్లు । బోధించి బోధించి పొడుతు రొండొరుల.
భీమసేనునిచేత భీష్మునిచేత । నీమొనలామొన లేర్పాటు లేక
దేవాసుర క్రందు దీనికి సరియె । భావింప ననుపోటు పాటించి రధిప !
ఆయెడ గురుపుత్రుఁ డాచార్యుఁ డాప । గేయుండు శల్యుండు కృతవర్మ శకుని
యమసూనుసేనపై నడరినఁ జూచి । [1]కమలి వాయుజుపట్టి కరువలిపట్టి
ద్రౌపదేయులుఁ జేకితానుండు శైబ్యుఁ । డాపౌఁజుపైఁ బడ నని ఘోరమయ్యె.

## దుర్యోధనుఁడు భీమునితోఁ బోరి మూర్ఛిల్లుట

రాజరాజప్పుడు రథ సహస్రముల । వాజిలక్షలఁ గూడి వాయుజుమీఁద
హైడింబుమీఁద బిట్టడరినఁ జూచి । క్రీడి ధర్మజుఁడు వీక్షింప నీబలముఁ
దఱుమఁ జొచ్చుటయు, గాంధారబలంబుఁ । దఱుమఁ జొచ్చిరి పార్థతనయ సాత్యకులు.
శకుని సైన్యంబంత శైనేయు రథము । శకలంబు లొనరింప సాత్యకి వచ్చి
యభిమన్యు తేరెక్కి, నయ్యిరువురకు । సభయరణంబయ్యె శకునితో నధిప !
కౌరవపతి యంతఁ గరువలి సుతుని । ధీరతతోఁ దాఁకి తీవ్రబాణములఁ
గప్పిన, నగుచు న గ్గంధవాహజుఁడు । విప్పైన క్రొవ్వాఁడి వేఁడితూపొకటి
యురము నాటినఁ, బ్రాణమూటాడి నృపతి । సరగునఁ దేరిపైఁ జదికిలఁ గూలి

1. కమల వాలిని పట్టి కమలినిపట్టి. (మూ).

సొమ్మవోయినఁ, దేరు సూతుండు గొనుచు । నమ్మహీపతితోడ నరుగఁ జొచ్చుటయు,
బలములు విఱిగి దోర్బలములు దఱిగి । నలువంకఁ బఱఘట్టనల నేలయద్రువ
నలుగువైచినవాఁడు నభయ మన్వాఁడుఁ । బులు గఱచినవాఁడుఁ బోలనివాఁడుఁ
దలవీడుకొనువాఁడుఁ దగఁ దొట్రువాఁడుఁ । బలవించువాఁడునై పాఱఁ జొచ్చుటయు,
సైన్యేశ సౌభద్ర శరముల శకుని । సైన్యంబు లొకవంక సడిఁ బాఱఁ దొడఁగె.
వడముడి యార్పుల వాసవాత్మజుని । [1]పెడచేతి యేట్లచే భీతిరెట్టించి
బలములు నిలునక పాఱెనే గాని । కలశజ భీష్మ వాక్యము లొల్లరైరి.
అంత భూపతి కొంత యామూర్ఛ దెలిసి । యంతంతఁ జెదరు సైన్యములను జూచి
యదలించి తఱుము భీమార్జునద్వయముఁ । బదుగొప్ప నీక్షించి సారథిఁ జూచి :
" యోరి, వైరులు నిక్క నుఱుకీర్తి ద్రుక్క । నేరమి మాకెక్క నీవు నారథము
రణభూమిఁ బాపఁ గారణమేమి సూత !। గణుతింప వైతె నాక్రమ మింత ! " యనుచు
రణభూమి నడిమికి రథముఁ దోలింప । గణనకు నెక్కుడై ఘనుఁడ, నీ మొనలు
దండితోఁ దమసుయోధనురాక కలరి । యొండొండఁ గూడి యుద్ధోర్విఁ గ్రిక్కిరిసె.
ప్రథనంబునకు మఱి బలము నమర్చి । పృథివీశ్వరుఁడు ద్రోణభీష్ములఁ గదిసి,
" యెన్నఁ బాండవకోటి కీ రల్లకునికి । మున్న యేఁ గానక మోసపోయితిని.
అలిగినఁ ద్రిజగంబులడ్డమే మీకు ! । నలువొప్ప నిట్లుండె నాతలవ్రాఁత.
బలవంతు రాధేయుఁ బ్రల్లదంబాడి । కలనికి రానీక కంకు వెట్టితివి.
ఆప్తుల వలెనుండి యహితంబు దలఁచు । తప్తచిత్తుల నమ్మఁ దగవును గలదె !
భయమేది పాండవ పక్షపాతకులు । అయగారులార, మిమ్మన నేమి గలదు ! "
అనిన భీష్ముఁడు మందహాసంబుతోడ : । " మును నీకుఁ జాటనే మొనయవుగాక.
శ్రీభర్త నమ్మించి చేపట్టఁ గాన । బీభత్సు నాజి నభేద్యంబు గెలువ.
నాకైకా దర్జును నర నాగ నాక । లోకవాసులకు గెల్చుట దుర్లభంబు.
విగతాయువులు మున్న వృద్ధులు పుట్టి । నెగడనివారు నిర్ణీతిబుద్ధులును,
ప్రథిత శస్త్రాస్త్రులఁ బాండునందనులఁ । బ్రథనంబులో గెల్చుబలియురుగలరె !
ఐనను నీవు నన్నడిగితి గాక । నానేర్పు చూడుము నరనాథ, యేను
జండికాదేవికి శరదేవతలకుఁ । బాండవసేనల బలియిచ్చువాఁడ. "

---

1. పెడతటి యెల్లచే. (మూ)

నని పల్కి కెంజాయ యఱకంట నంట । జననాథ, భీష్ముండు సంభ్రమించినను
శంఖంబు లొత్తిరి సకల కౌరవులు । పుంఖానుపుంఖమై భువనంబు గలఁగ.
తూర్యస్వనంబులు తోడ్తోన నిగుడ । శౌర్యసారంబైన శమనజు మొనయు
నార్చి శంఖములొత్తె రనిన బిడ్డలకుఁ । గూర్చినచీకు పల్కును సంజయునకు :
“ అధిపుతోఁ బంతమున్నాడిన భీష్ముఁ । డధికత నరున కెట్లాజిలోఁ జూపె ?
ఈకథావిధము నాకెఱిఁగింపు. ” మనినఁ । జేకొని కథ యిట్లు చెప్పె. సంజయుఁడు :

### భీష్ముని విజృంభణమునకుఁ బాండవయోధులు తల్లడిలుట

“మార్తాండబింబంబు మధ్యాహ్నసమయ । వర్తితోగ్రప్రభావర్తియైనపుడు
తానును నట్టిప్రతాపంబు దాల్చి । భూనాథ, మీతండ్రి భుజశక్తి మెఱసి
హరిసూతిఁ దాఁకుచో నతనికిఁ దోడు । కురురాజు శల్యుండు కుంభసంభవుఁడు
భూరిశ్రవుఁడు ద్రోణపుత్రుండు మఱియుఁ । గౌరవవీరులు గాంగేయుఁ గడచి
క్రీడిపైఁ గవిసినఁ, గీచకారియును । హైడింబ పాంచాలి హరిసహోదరులు
నభిమన్యుఁ డాదిగా నక్కడి దొరలు । రభసంబుతో నెక్కి రౌద్రభావమున
భాగీరథేయుని బలముల నెల్ల । భాగశేషంబుగాఁ బరిమార్చునపుడు
హుంకారములును మహోగ్ర మత్తేభ । ఘీంకారములు ధనుఃక్రేంకారములును
జెలఁగె ; నప్పుడు తునిసిన మస్తకములు । నలినలియైన కందములు బాహువులును
బొడిపొడియగు చాపములుఁ జామరములుఁ । బడుగొడుగులు రక్తవాహినిఁ దేలు.
కొఱప్రాణములతోడఁ గొని నక్కలేఁగి । బొఱియలఁదుఱిగిన పోటుమానుసులు
పలవింపఁ బాతాళపతి ధాత్రివ్రేఁగు । కలయ శౌరికి విన్నవించినట్లగును.
గ్రీవలు దెగి వెలికిలఁబడు హరులు । వేవేగఁ గాళులు విద్రుచుకొన్నపుడు
రిపుహరికేఁగుచో యముఁ డడ్డపడిన । జరణాబ్జములఁ దన్ను చందంబు నెఱపు.
అరదంబు లిలఁగూలి యాజిఁ గాల్వురకుఁ । జరియింపఁగారాని చందంబు చేయు.
గుంపులు గట్టెడి క్రొవ్వాఁడి మగలఁ । బెంపుతోఁ బేర్పేరఁ బిలుచుచు నపుడు
నీ సైన్యనాథుండు నిలయోగ్ర కృత్తి । వాసో విలాసుఁడై వైరి సైన్యముల
మాయ పన్నినయట్లు మంత్రించి నట్లు । ధీయుక్తిఁ గలగాంచి తెలిసినయట్లు
జ్ఞానాగ్ని నొకఁడు విశ్వము వ్రేల్చినట్లు । భానుభాను సమాన పాత బాణముల
వంచియు వ్రాల్చియు వ్రక్కలించియును । దుంచియుఁ దెంచియుఁ దుమురుచేసియును

జించియు నొంచియుఁ జీకాకుపడఁగ । లంచియు బాణజాలముల భీష్ముండు
పరమేష్ఠి విశ్వరూపము చూపినట్లు । పరమేశ్వరుఁడు వీరభద్రుఁడైనట్లు
చూడ భాషింప మిసుంగరాకపుడు । ... ... ... ... ...
పరియలై పసచెడి పరసేన విఱిగి । పఱవఁ[1]బైపైని బటాపంచలగుచుఁ
దేరెక్కడనో లక్ష్యదృష్టి యెక్కడనో । యూరాక యెవ్వాఁడో యతఁడెట్టివాఁడో
తెలియక [2]దిటతప్పి దిగ్భ్రమ [3]చెందఁ । జెలరేఁగి కౌంతేయుసేనల మోఁది
గంగకీతఁడుగల్గుఁ గాకేమి రక్త । గంగాశతము నేఁడు గలిగించె ననఁగ,
నితనికిఁ గౌంతేయు లేమున్నవారు । ధృతి నేఁడు త్రిజగంబుఁ దినకపోఁడనఁగ,
భీష్మపావకు రాఁజఁ బెట్టినవాఁడు । ఊష్మపాద్దైన దుర్యోధనుఁడనఁగ,
నెక్కడి గాండీవి యెక్కడిభీముఁ । డెక్కడి హరి శిని యెత్తికోలునకు
ననఁ బెచ్చు పెరిగిన, నాపగేయునకు । నెనసి భస్మంబెయ్యా నేలక్ష్యమైన.
చూచుచుండిరిగాని శూరులపై నలుగు । పూఁచిన ప్రాణి యప్పుడు గల్గకుండె.
తేరి పగ్గంబులు దృఢముగాఁ బట్టి । శౌరి యప్పుడు సవ్యసాచి కిట్లనియె :
“ గెలుతునందువు భీష్మకృపగురుద్రౌణి । శల శల్య యుతముగా శత్రుసైన్యముల ;
నెన్నఁటికో గల్గు నీదైన రణము ! । సన్నిధిగానని చండి పెట్టుదువు.
ఆపగేయుఁడు మిమ్ము నాహుతి గొనఁగఁ । జూపెదెన్నఁడు లావు శూరైకతిలక ! ”
అనినఁ గ్రీడి : “ యదేల యాతని మీఁదఁ । జననిచ్చి చూడుమా సర్వజ్ఞ, రథము.
శరవృష్టి నార్పెద శాంతనవాగ్నిఁ । బరికింపు.” మనిన న ప్పద్మనాభుండు
నేమి ఘోషము వార్ధి నేమిఁ బగుల్ప । నామహావీరుపై నరదంబు పఱప,
రణకాంక్షతో మీరు రండు రండనుచు । గుణఘోష మిగులొత్తఁ గురుపితామహుఁడు
శిత[4]శరాంబుద వృష్టిఁ జీకట్లు గలుఁగ । నతని యుగ్రాముల రయంబు వాకట్టి
హరి నంపవెల్లిఁ జేయూర్ప రాకుండ । హరిసూను రక్తమయంబుగా నేయఁ,
దననొప్పి తడవక దైత్యారి హరుల । ననికిఁ గాల్కొనఁజేసి యరదంబు గడప
వడిఁ గ్రీడి యొక పాఱవాతి బాణమున । నడిమికి సేనాధినాథు విల్విఱువ
నతఁ డొండు విల్లెత్త నదియును దునిమె; । ధృతిఁ బార్థుచే విండ్లు తెగె నూఱుదాఁక.
అంత మహోగ్రుఁడై యతఁడొండువింట । సంతత పటు దంష్ట్రలనఁగ బాణములు
పఱపె; నన్నియును దప్పఁగ శౌరిరథము । పఱపఁబట్టి యతండు బ్రతికెనే కాని.

---

1. పైపైఁబడఁ బరపంచలగుచు. 2. దృఢ. 3. చెదర 4. శరాంబుధి. (మూ)

మఱియు భీష్ముఁ డపూర్వ మార్గణ విద్య । మెఱసి పాండవులు మూఁకల గ్రుచ్చుటయుఁ,
దాత నొల్లనియట్టి తలఁపున మనమునఁ । దాతని నేయుచో నపరాహ్ణ మయ్యె.
హరి యప్పు డిట్లని యాత్మలోఁ దలఁచెః । " సమరస్థుఁడైన భీష్ముని బాణంబుల నొచ్చె;
కరలాఘవంబు గంగాతనూజునకుఁ । బెరుగుచున్నది గాని బీరువోదింత.
పాండవసైన్యంబు పాఱెడిఁగాని । దండనాథునిఁ దాఁకు తలఁపైన లేదు.
తాఁకుటెట్లు తదీయ దారుణాస్త్రములఁ । దేఁకువచెడి నొచ్చి తిరుగుడువడియె.
కురుపితామహుఁడేయు కోలలవలన । నురుమూర్ఛ గదిరిన ట్లున్నాఁడ నేఁడు.
గురుసేన రిపుసేన కొలువమి యెఱిఁగి । నరుమీఁదఁ బొదువుచున్నది పలుదెసల.
ఇట్టైన గాంగేయుఁ డీక్షణమందుఁ । బట్టిన తనబాణ పఙ్క్తిఁ జెల్లించు.
ఈ దురవస్థలో నేనూరకున్నఁ । గాదు కార్యం." బని గణుతించుచోట,
నిప్పులు గ్రక్కెడు నిష్ఠురాస్త్రములఁ । గప్పె వెండియుఁ బొడ్డ గాంగేయుఁ డలుక.
గురు కృప కృతవర్మ గురుపుత్ర ముఖ్య । కురుయోధవరులు ఫల్గును జుట్టుముట్ట,
నావేళ సాత్యకి యుత్తర్తి చూచి । దేవవ్రతుని దాఁటి తెగిపాఱుచున్న
యోధులకిట్లను: "ఓవీరులార ! । యేధర్మవిధము మీకిట్లు పాఱుటలు ?
క్రమ్మఱఁ దల్లుల గర్భంబు దూఱ । నిమ్మాడ్కిఁ బోవుటో! యెఱిఁగింపుఁ డింత.
అనఘులార, యనిత్య మధ్రువము ప్రాణ । మనుమాన పంచందమున మున్ను వినరె !
ఏ నున్నవాఁడ లక్ష్మీశుఁడున్నాఁడు । మా నరుఁడున్నాఁడు మరలి రం." డనిన
శౌరి తమ్మునిఁ బల్కెః "సాత్యకి, నీకు । నీకీర్తి మరలింప నేమి కారణము !
లీలతో భీష్ముఁ దేలింప రారాజు । భూలోకమేల నొప్పారునె యేఁగల్గ!
కడు నొచ్చెఁ గటకటా కౌంతేయసేన ! । నుడియింప[1]నో పమాన్ల త్రిప్పెదవు!
కవ్వడి తానొచ్చెఁ గలసేన విచ్చె । నివ్వేళ భీష్ముండు హెచ్చియున్నాఁడు.
ఇట రాజు తలఁకెడి నేనూరకున్నఁ । బెటులుఁగార్యంబు నా పెంపు వీక్షింపు.
పట్టి కౌరవకోటి భస్మీకరింతు; । నెట్టన భీష్ముని నీఱుగావింతు."

## శ్రీకృష్ణుఁడు భీష్ముఁ దలపడఁ బోవుట

నని చేతిములుకోల నవనిపై వైచి । యనుపమ భయదాట్ట హాసంబుతోడ
నొగల పగ్గంబులు నతలీలవిడిచి । భుగులున నవయపంబుల మంటలెగయ

1. నోపవు. (మూ).

ఘనరథం బప్పుడు దిగ్గన డిగ్గి నుఱికి । తనచేత చక్రమెంతయుఁ దేజరిల్లఁ
గన్నులు కెంపారుగతిఁ గ్రాఁకుదేర । కన్నుల చెమటూర సంపెలజాఱఁ
బీతాంబరము దూలఁ బింఛంబు ద్రేల । నేతెంచు హరిఁ జూచి యెల్లకౌరవులు
సింహంబుఁ బొడగన్న జింకలు పోలె । సింహాస్త్రమూర్తిఁ జేకుత్రై పాఱఁ,
గమలజాండము హల్ల కల్లోలమగను । గమలంబుగా మింట నక్షత్రముల్ రాల
విల్లు చక్కఁదగిల్చి వెసఁ గేలు మొగిచి । యల్లన గాంగేయుఁ డరదంబు డిగ్గి,
“పరమేశ, పరమాత్మ, పాండవవరద, । నరహరి, నరకారి, నన్నేలురాజ,
రావయ్య చంపుము రాక్షసవైరి ! । భావింప నేఁడుగో ఫలియించెఁ దపము.
అర్జునుచే నెన్నఁడగు నింక గెలువ । నిర్జితుఁ జేసెఁ బో నిజమహాస్త్రంబు.
భక్తవత్సలుఁడవై పరఁగ నీకిట్లు । భక్తుండనైన నాపై నల్గఁ దగునె!
అలిగి నన్నేమి సేయుంగ నోపుదువు । జలజాక్ష, నీపదాబ్జములు దలంప.
ఖండితవైరివక్త్రింబు చక్రంబు । దండితో నను దాఁకి తప్పిపోఁ గలదె!
తాఁకిననేమి నీదాసుండ నేనుఁ । దేఁకువఁ జూడరాదే యిన్విధమున!
అదియేల నీచేత నడఁగు వారలకు । వదలని వైకుంఠ వైభవంబబ్బు.
ఏ నిట్టులల్గి నీవేతేర వలసి । పూని యేసితిఁ బాండుపుత్రుల నొవ్వ.
అలఘువర్తన, యేఁ గృతార్థుండ నైతి ; । కలుగునే! యీచావు కాశ్యపాదులకు ?
ఇది నిగ్రహంబుగా దిది యనుగ్రహము ; । ఇదెకంఠ మదెచక్ర మెత్తవే దేవ!
ఘనతర సంసారసాగరములోఁ బడితి ; । ననుగటాక్షింపవే నారాయణాఖ్య!”
అనునంత గాండీవి యచటికిఁ బాఱి । తనలావు కల్మి నాతని బల్మిఁబట్టి
దీనుఁడై యిట్లను: “దేవ, నీకిట్లు । రానేల ? నా పరాక్రమ మెందుఁబోయె ?
రథికుఁ డొక్కొకవేళ రణములో నొచ్చుఁ । బ్రథితాత్మ, తప్పుగాఁ బట్టుదురయ్య!
అరివధకై నన్ను నాయత్తపెట్టి । కరమున నీకుఁ జక్రము దాల్పఁదగునె!
ఈ వలిగెడిపాటి కేమున్న వాఁడు! । దేవవ్రతుండెంత తెగ నీకుఁదగునె!
అటఁ బోయి తేని సాత్యకిఁ బంపినాఁడ । విటరమ్ము నానత్త్వ మింక వీక్షింపు.”
అని తెచ్చి నొగలిపై నచ్యుతు నునిచి । యనిమిషేంద్రకుమారుఁ డపుడువిల్లెత్తె.
అసురారి పాంచజన్యంబొత్తెఁ గ్రీడి । దెసలు భీతిల నొత్తె దేవదత్తంబు.
ఆమహాధ్వనికిఁ దూర్యములు మ్రోయించి । నీ మొనల్ పార్థుని నీలవర్ణునిని
భూరిసాయకములఁ బొదువుచుఁ గదిసి । ఘోర వైఖరి నార్వఁ గోపించి యపుడు

ఎండినవనము దహించు చిచ్చనఁగ । గాండీవి బాణ శిఖాచ్ఛటావళులఁ
గాలుపఁ జొచ్చినఁ, గౌరవేశ్వరుఁడు । వేలుపునదికొడుకు విను మద్రవిభుఁడు
భూరిశ్రవసుఁడును బుధహితుకొడుకు । భూరిసాయకములఁ బొదివి నొప్పించి
శక్తి తోమర గదా సప్తనారాచ । శక్తి నొత్తిన, నల్గి జంభారిసుతుఁడు
శరములు శరములఁ జక్కుగా నఱికి । సురనాథు ఘనశక్తి నడిమికి నఱికి
గంగాత్మజుఁడు వైచు గద నేలఁగలిపి । భంగమేర్పడ శల్యుపటుశరాల మఱఁచి
భూరిశ్రవుండు నేర్పున నేయు సప్త । నారాచముల నలినలిచేసి యార్చి
యభిమంత్రితము చేసి యైంద్రాస్త్రమేయ । నభినవజ్వాలల నది మిన్ను ముట్టి
యాయుధకులమెల్ల నర్థి నీనుచును । బాయమై భవదీయబలములఁ గాల్చెఁ.
మందాకినేయుని మఱియును నస్త్ర । సందోహముల వియచ్చరులెల్లఁ బొగడ
నాటి, శల్యుని విల్లు నడిమికి నఱికి । నూట భూరిశ్రవు నొగిలించి మించి
రారాజు వక్షంబు రంధ్రంబుగాఁగ । నారాచ మేసి క్రన్నన మూర్ఛపుచ్చెఁ.
పుచ్చినఁ జూచి నీపుత్రులాగ్రహము । ఇచ్చలఁ బిచ్చిల నింద్రజుఁ బొదివి
యలుగులఁ బెట్టుచో, నైంద్రాస్త్ర మహిమ । నిలువనేరక కుంది నీపౌఁజులెల్లఁ
గెడయు గుఱ్ఱము లొడ్డగెడవైన రథము । లడఁగు కాల్బంట్లు నుగ్గైన యేనుఁగులు
విఱిగిన విండ్లుఁ ద్రెవ్వినచరణములుఁ । జిరిగిన గొడుగులై చెడి పాఱె నధిప !
ఆసేనలోనఁ గేశావళి నాచు, । భాసిల్లఁ బ్రేగులు పడగలు నురుగు,
సరసమస్తిష్కమాంసంబు పంకంబు, । సరిఁ దేలుచున్న యాస్యములు పద్మములు,
అడగొన్న గొడుగులు హంసలు నగుచు । నిడివిఁ బాఱఁ దొడంగె నెత్తురుటేర్లు.
హరినరుల్ శంఖంబు లావేళనొత్తి । పరఁగించి యార్చినఁ బగిలె నీమొనలు.
అప్పుడు తనయింటికరుగ[1]ని రథికుఁ, । డెప్పుడు మెడలూడ్వ నెఱుఁగని హరులు,
సంతపెట్టని ప్రాఁతచనువు, వీడ్కొనిన । సంతటఁ గలుగు నిరాధార రథము
నపరాబ్ధిమునుఁగ, నయ్యంధకారమున । నృపులు కయ్యముమాని నిజసేనలెల్లఁ
దివియించి యిండ్లకుఁ దిరిగి వచ్చుచును । దివిజేంద్రసుతు శౌర్య తేజోబలములు
కొనియాడువారును, గురుభీష్మకృపుల । యనదతనంబున కడలెడువారు
నగుచు నందును నిందు నధికప్రతాపు । లగు మహావీరు లత్యానంద నటనఁ

1. నీరథము. (మూ).

జంచలాక్షీజన చారుకరాగ్ర । కాంచన చామర గంధాద్యమైన
యుపచారముల కంటె యుద్ధంబులోని । యుపచారములు మేలు అరులచే ననుచు
నిద్రించి రారాత్రి నిజశిబిరముల । రౌద్రప్రతాపులు రాజరత్నములు.

## చతుర్థ దివస యుద్ధము

అనయంబు నపుడెల్లనయ్యె నత్తూర్పు । కనక భేరులు మ్రోయఁ గన్నులు తెఱచి
శౌల్యక్రియలు దీర్చి కౌరవు లనికిఁ । గల్యాణగతి వచ్చుగడియ మున్నాడి
వెడలె గాంగేయుఁ ; డవ్వీరునితోడ । వెడలిరి ద్రోణ వివింశతి కృపులు.
మఱియు బాహ్లిక శల్య మగధాది నృపులు । నెఱి వచ్చిరయ్యాజి నెలవున కపుడు.
పాండవ బలమును బయనమై వచ్చి । యుండుట నవ్వేళ నుభయబలములుఁ
దలపడె నాయుధతతి వేఁడి మెఱుఁగు । లల కాలమానసంహతి ముంచుకొనఁగ.
ఆర్పుల దిగ్వర్గ మల్లలనాడ । దర్పించి వివిధాయుధములఁ బోరుచును
ఆమొన లొత్తిన నట్టటు పోవు । చీమొన లొత్తిన నిట్టటు వచ్చు
చోహారిసాహారి నూర్మిమాలికల । యూహకుఁ దగియుండె యుద్ధరంగమున.
అప్పుడు గాంగేయుఁ డర్జును మీఁద । నుప్పొంగు కినుక మహోగ్రుఁడై కవియ
నతనితోడ నృపాలుఁ డాచార్య యుగము । కృతవర్మ శల్యుండుఁ గినుక బాహ్లికుఁడుఁ
గూడఁ నెక్కొనఁ, బార్థు కొడుకందఱకును । జూడఁ జూడ నకాల సూర్యుఁడై తోఁచి
పదిట నారింట ముప్పదిట నేనింటఁ । బదునూఁట వేదనాస్పదులుగా నేసి
వారి తూపులు దుర్నివారనిజాస్త్ర । ధారలఁ దునుమాడి తనప్రతాపాగ్ని
వెలుఁగొంద, భీష్ముండు వీర్యగర్వమున । బలభేదిపౌత్రు చాపము దునుమాడి
యర్ధచంద్ర శరాన నపుడు తానేయు, । నర్ధచంద్రధరారియాత్మజుం డలిగి
క్రుమ్మరించె శితాస్త్రకోటి నీమొనల. । బమ్మరింపఁగ భీష్ముపై నారి మ్రోయ
నతఁడు విల్లునుమాడి యశ్రమలీల । నతివృష్టి శరవృష్టి నవ్వేఁ బొదివె.
ఇరువురుఁ దలపడి యిట్లేయునపుడు । శరపక్షపవనంబు జగమాక్రమించె.
భూప, నీతనయుండు భూరిశ్రవుండుఁ । జాపశిక్షకుపట్టి శల్యనందనుఁడు
మదగజంబులు నాల్గు మదగజవైరిఁ । బొదివినగతిఁ దన్ను బొదివిన, నలిగి
శల్యనందను విల్లు చక్కుగా నఱికి । శల్యద్వయము ద్రౌణిచనుమర నాటి,

భూరిశ్రవసు నంపబొమ్మగాఁ జేసి । సీరిసత్త్వని జిత్రసేను నొప్పించి
యార్చిన, నలిగి యయ్యర్జునాత్మజునిఁ । గార్చిచ్చుతునుకలు కౌరవభటులు
పేనికమొత్తంబు లిరులు గ్రమ్మంగఁ । బూని యెక్కినఁ, జూచి పురుహూతసుతుఁడు
ఆపగేయునితోడ నాజి చాలించి । సీపోఁజుపైఁ దేరు నిగిడించె నపుడు.
పతి యంతఁ ద్రైగర్తపతిఁ గేకయులను । గృతవర్మ కృపులను గ్రీడి[1]కోల్తలకుఁ
బురికొల్ప వారితోఁ బోరెడు పార్థుఁ । బరికించి పాంచాలపతి తనూభవుఁడు
ఆతనిఁ గడచి రయంబు శోభిల్ల । వే తేరుగడపించి వినుతులఁ దాఁకి
సేనలు నలుగడఁ జెదరి పాఱంగ । భాను భానుసమానబాణముల్ పఱపి
కృపు మూఁడు శరములఁ గృతవర్మఁ బదిట । విపుల త్రిగర్తేశు విశిఖవింశతిని

## ధృష్టద్యుమ్నుఁడు శల్యు నందను మడియించుట

గ్రుచ్చి యార్చిన, శల్యుకొడుకు కట్టియెడను । వచ్చి ధృష్టద్యుమ్ను వాలంపవాన
గుప్పఁ జొచ్చిన, నప్పఁ గోపంబు మదము । ముప్పిరిగొన సైన్యముఖ్యుండు వాని
శరములు దునుమాడి చాపంబు నఱికి । హరుల సూతునితోడ నరదంబు నఱికి
కవచంబు దునిమినఁ, గడిమోని బీర । మివురొత్త నవ్వీరుఁ డిలకు లంఘించి
పలకయు వాలును బాహుద్వయమున । వెలుఁగొంద నీసేన వికసించి చూడఁ
గాంచనకశిపుండు కంఠీరవాఖ్యు । నంచితోగ్రగతిఁ దాఁకునాకృతి దోఁపఁ
గదిసిన, వాని యగ్గలిక సాహసము । త్రిదశులు పొగడిరి దివి పిక్కటిల్ల.
ఎఱకలు గల శేషుఁ డితఁడని తోఁపఁ । బఱతెంచు నమ్మద్రపతి కుమారకుని
యాయుమ్ములకుఁ బాఱ నమ్ములు పఱపి । పాయక పాంచాలపతికుమారకుఁడు
వాలును బలకయు వ్రయ్యలు వాపి । పోల నొండొకకోల భువిఁగూల్చె వాని.
తనయుని నీరీతి ధరఁగూల్చు ద్రుపద । తనయుని దండింపఁదలఁచి శల్యుండు
పెరుఁగు వింధ్యాద్రిపైఁ బిడుగులవాన । గురియు మేఘుఁడువోలె ఘోరాస్త్రవృష్టి
గప్పిన, నతఁడును గప్పె మద్రేశు । నిప్పులుగ్రక్కెడు నిష్ఠురాస్త్రముల."
అని సంజయుఁడు చెప్ప నాంబికేయుండు । మనమున సంతాపమగ్నుఁడై పలికె:
"బెడిదపు విఱుగులఁ బెద్దచాపులును । విడువక నాయోధవితతి సేకాని

1. కోలలకు. (మూ)

వినఁబడ దా పాండవేయ సైన్యముల । ఘనతర విజయ విక్రమములే కాని.
ఇదియును దైవికం బేమనఁగలదు ! । తుది నింతవట్టునే దుర్నీతినుహీను !
కొడుకు కర్ణాదులఁగూడి దుర్నీతి । కొడఁబడి పాండవేయులఁ బాసి చెడియె.
ఏయుపాయంబుల నేము పాండవుల । రాయిడి గెల్చువారముకాము యిపుడు.
ఏ వినఁగలవాఁడ నేవార్తమైన । వేవేగ నెఱిఁగింపు వెఱవక." యనిన,
"నా తరువాతివృత్తాంతంబు వినుము । భూతలాధిప, యిట్లు పుత్రుఁ డీల్గుటయుఁ
బాంచాలనందనుపై నల్గి శల్యుఁ । డంచితలీలల నస్త్రంబు లేయ,
నతఁడును బ్రతిసాయకావళి నేయ, । నితరేతరాస్త్రభూయిష్ఠపై జగము
గరళాగ్ని చేఁ దొల్లి గ్రాఁగిన కాఁక । భరియింపుచో, మద్రపతి పెచ్చు పెరిఁగి
ద్రుపదాత్మజుని విల్లు దునుమాడి రథము । విపులపైఁ బడనేయ, వీక్షించి యలిగి
సౌభద్రుఁ డరదంబు శల్యుపైఁ బఱపి । యాభీలగతి నేయ, నతని కోల్తలకుఁ
గౌరవుం డనుప వికర్ణుఁ డన్వాఁడు । భూరి పరాక్రమస్ఫురణ శోభిల్ల
దుష్ప్రవహుం డనువాఁడు దుర్మర్షణుండు । పుష్పాస్త్రసదృశరూపుఁడు దుర్ముఖుండు
సరి భీమబల వివింశతి పురుమిత్ర । పురజిత్తు లనువారు భువి నంచలింప
నొక్కటఁ గవిసిన, నుల్లంబు చేవ । యెక్కఁ దొవ్వుంద్రతో నింద్రపౌత్రుండు
అంతకాకృతిఁ బేర్చి యాలంబు సేయు । నంతకు, విలుగోల యరదంబుఁ బడగ
సంధించుకొని వారి సైన్యనాయకఁడు । గాంధారిసుతులపైఁ గవిసి నోనేయఁ,
బుత్రశోకం బాత్మఁబొదల నాద్రుపద । పుత్రుపైఁ గినుక నప్పుడు శల్యుఁ డడరె.
అదిగని మాద్రేయు లరదంబు లతనిఁ । గదియఁ దోలించి విక్రమగర్వరేఖ
మేనమామయురంబు మెఱుఁగువాలంప । సోన గూర్చిన, మూర్ఛజొపినట్లగుచుఁ
దెలిసి శల్యుండు మాద్రేయద్వయంబుఁ । దలపడి పోరుచో ధరణీశ, వినుము
విపులసేనలఁగూడి వెస విరాటుండు । ద్రుపదుండు మాద్రిపుత్రులకుఁ దోడ్పాటు
చేయ డగ్గఱిన, నీసేనలు దొరలు । నాయెడ శల్యుసహాయులై కవియ
నాజి ఘోరంబయ్యె ; నప్పుడు దివస । రాజొప్పె గగనమార్గము మధ్యసీమ.

## భీమసేనుఁడు మాగధు గజానీకము మడియించుట

అప్పుడు గదఁజూచి యరిసేనఁ జూచి । యుపొంగు కినుక వాయుజుఁ డాత్మలోన
"నీ కలకలములో నేను నాప్రతిన । జోక చేసెదఁగాక చుట్టాలు మెచ్చఁ

దడయనేటికి" నని తేఁకుతేఁకు [1]పాఁప । పడఁగఁగట్టినవానిపై నడపింప,
నాకథ లెఱింగి నీయగ్రనందనుఁడు । ప్రాకట గజసహస్రములతో మగధు
నతనికి నెదురంప, నరుదెంచు దంతి । తతిఁ జూచి యా వృకోదరుఁ డాగ్రహమున
గదగొని యరదంబు గ్రక్కున డిగ్గి । కుదియక కరుల మార్కొను పూనికతోడ
నిలమీఁదఁ జరియించు నెఱకలతోడి । కులశైలములను మార్కొను వజ్రిపోలె
సింహనాదంబు చేసిన నమ్మదేభ । సంహతి మూర్ఛిల్లి చాపకట్టయ్యె.
అంకుశాహతులచే నట నిల్చుచోట । నుంకించి ద్రౌపదేయులు మాద్రిసుతులు
సౌభద్రుఁడును వారిసైన్యనాయకుఁడు । నా భీమునకు సహాయత గోరి నిలిచి
దంతావళంబులఁ [2]దవులు మావంతుల । గొంతు [3]క్రోవులు ద్రెంచు కోలలు పఱప,
మగధాధిపతి యభిమన్యుపై దంతిఁ । దగిలి డీకొలుప, నాతఁడు నారసమునఁ
బచ్చి ముత్తెములొల్క భద్రేభశిరము । వ్రచ్చె; నామగధుఁ డవ్వాసవిసుతునిఁ
దోమరంబున వైవఁ, దూలక యతని । చామరంబు సిడంబు శరమున నఱికి
సౌభద్రుఁ డతనివక్షమునఁ బాఱమ్ము । వేభంగి నెత్తురు వెడల నేయుటయుఁ,
గెడసె దంతియు వాఁడుఁ గీలూడిపడిన । నెడ ప్రతిమలు పోలె వీక్షింప సురలు.
కాంచనమయ పుంఖ కాండజాలమునఁ । బాంచాలజుఁడు ద్రుంచె భద్రేభతతుల.
పవనజు పటుగదా ప్రహతులఁ గరులు । కువలయంబునఁ దన్నుకొనుచుఁ గూలెడివి,
తొండంబు లొండొండ తునిసి తూలెడివి, । బొండాలుగను మధ్యములు విఱిగినవి,
హత్తిన మెదడులో నాణిముత్యములు । మొత్తమైపడఁ గుంభములు విఱిగినవి,
గుండియలవిసి గగ్గోలుపాటొందవి । కండలతోడ రక్తములు గ్రక్కెడివి,
మోఁకాళ్లు తునుకలై మ్రొగ్గి ఘీంకృతులఁ । దేఁకువల్ చెడిపడి తెరలెడునవియు,
బిరుదు కొమ్ములు విఱిగి పిడియేనుఁగులకు । సరి వచ్చి యెమ్ములు చదిసి పోయినవి,
ధృతిమాలి దిర్దిరఁ దిరిగెడు నవియు, । నతి భీతిఁ బాఱెడు నవియును నగుచు
రణపిశాచముల మార్గములైన సురలు । ప్రణుతించి రందంద పవననందనుని.
గజపురాధీశుండు గజముల మఱియు । నిజరణోత్సాహంబు నెఱయఁ బుత్తెర
విసువక తనతోడి వీరులుఁ దాను । గసిమసంగుచు వచ్చె గంధవాహజుఁడు.
తోయధి యుప్పొంగఁ దురగముఖాగ్ని । పాయక తోడ్తోన [4]బావుకొన్నట్లు

---
1. పరప. 2. దరళ. 3. గోళ్లు. 4. బావు. (మూ)

ఏనిక వేటాడి యిభరక్తపంక । కేళిలఁగడ లోకభీతి గావింపఁ,
దానును నెత్తుటఁ దగవొప్పఁ దోఁగి । భూనాథ, యముని వోడ్డబూనినయుఁ బోలెఁ
బొవని కౌరవపారణ నేఁడు । గావించుననితోఁపఁ గలహించుచోట
నిలువక కౌరవనికరంబు వ్రేఁగు । పలుమాఱు కౌరవాళి పఱపుచుండఁ
ద్రుపదపుత్త్రాదులు తొలఁగక భీము । ననభీముసైఁ జేరి యుభయపార్శ్వముల
శిత శరౌఘములచే శత్రుసేనాంగ । హతిఁ జేయుచుండిరి హర్షింప నృపతి.
అంత నీసుతునాజ్ఞ నడరి పైకొనిన । దంతి రథాశ్వ పదాతి వర్గమును
గుడి మ్రింగు నతనికి గుడిసంది పిండి । వడియ మన్నట్లు పావని లెక్కగొనక
బాహాగ్రనిహతులఁ బదతాడనముల । నూహింప భయమైన యురముతాఁకుటల
నూరుబంధనముల నుగ్రహుంకృతుల । దారుణ కిరణ గదా ప్రహారములఁ
జదికిలఁ బడఁ ద్రెళ్ళఁజావ మూర్ఛిల్లఁ । జదియంగఁ జదియంగఁ జాపకట్టుగను
గౌరవ సేనలఁ గలగుండు పెట్టి । మారుతి కరి [1]తుంగమడుఁగీదినట్లు
విహరింప, నీ సేన విఱిగి వెన్నిచ్చి । బహుభంగి నివ్వెఱపడిన మాత్రమున,
నేమి మహాధ్వని నింగి భేదిల్ల । భీముపై సరదంబు భీష్ముండు దఱిమి
వివిధాస్త్రకోటులు వెల్లిగొల్పుటయు, । జవమొప్ప నెడసొచ్చి సాత్యకి కడిమిఁ
గురుపితామహు మన్నిగొననెన్ని కొన్ని । శరములేయుఁ, బలంబు సాధింప వచ్చి
యసుర యలంబుసుఁ డను మహావీరుఁ । డసురారితేజమ్మునని నంబంద యేయ,
బాణారితమ్ముఁ దప్పలలభోజనుని । బాణాష్టకంబునఁ బగిలించుచోటఁ,
బోరాట కెడసొచ్చి భూరిశ్రవసుఁడు । నారాయణానుజు నారాచ నవతి
గ్రుచ్చవచ్చిన, [2]వాని కోల్తల కలిగి । యుచ్చిరుఁడును గ్రుచ్చు తమాత్రమున
నాసౌమదత్తికి ననుజులుఁ దాను । బాసటయై వచ్చి ఫణికేతనునకు
శైనేయునేయ, నచ్చటఁ బాండవులును । వానికి బాసటై పఱివచ్చిరధిప!

### భీముఁడు దుర్యోధనునితోఁ బోరి మూర్ఛిల్లుట

అప్పుడు నీకుమారావళి మీఁద । నుప్పొంగు కినుక వాయుజుఁడు గడంగ
నల్ప జంతువులపై నధికరోషమునఁ । గల్పాంత కాలుండు గవిసినట్లైన
[3]పిఁగిరి తమ్ములు; విభుఁడట్టిచోట । నీఁగక కిమ్మీర విద్వేషిఁ దాఁకి

1. తురంగ. 2. నతని కోలల నలిగి 3. విరిగిరి. (మూ)

చనుమరఁ దొమ్మిదిచండకాండములఁ । జొనిపిన, నతఁడాత్మఁ జుఱచుర మండి
ధీరుఁడై సారథి తెచ్చిన రథము । బోరన నెక్కి యార్పులు నింగిముట్టఁ
బది నారసములచేఁ బార్థివు నొంచి । పదరఁ గేతనినూఱుఁ బదిట నొప్పించె.
నీసూనుఁ డరువది నిశితబాణముల । నా సమీరాత్మజు నతని సారథిని
[1]నంచి శింజినిమ్రోయ వానిచాపంబు । ద్రుంచి యార్చిన, బకద్రోహి బిట్టలిగి
వేవేగ వేఱొకవింట సాయకము । పావకాకృతి మండఁ బఱపి యాక్షణమ
కౌరవుచాపంబు ఖండింప, నతఁడు । మారుతిపై నుండి మఱియొండు వింట
శేషజిహ్వయుఁ బోని చిచ్చఱకోల । భీషణగతి భీము బిట్టునాటించ
మ్రొగ్గె రథంబుపై మూర్ఛిల్లి యతఁడు । ప్రగ్గెఁ బాండుతనూజ సైన్యంబు లపుడు.
అప్పుడు సౌభద్రుఁ డా ద్రుపదజుఁడు । తప్పక ద్రౌపది తనయు లేవురును
రథచక్రములు మ్రోయ రయమున వచ్చి । పృథివీశ్వరుని [2]నంపవెల్లువ ముంప,
నంతలోఁ దెప్పిఱి యనిలనందనుఁడు । వింతగా నెఱమంట వెడగంట నంట
నురగాంకుమీఁద బిట్టుఱుకు యత్నంబు । దొరలెఱింగియుఁ గేలు దొనలకు రాక
గజవైరిఁ దాఁకు దిగ్గజములువోలె । గజ గజ వణఁకిరి గజపురాధీశ!
అప్పటి కపరాహ్ణమైనచో నేమి । చెప్ప నీ తనయులు సేనాధిపతియు
జలసంధ సమ సులోచన విచిత్రులును । అల సుషేణుఁడు తమసాలోలుపులును
విను దుష్ప్రధర్షణ వికటు లుగ్రుండు । మన దీర్ఘబాహుండు మన దీర్ఘరథుఁడు
భీమబాహుండును భీమరథుండు । భీముండు ననియెడు పేళ్ళవా రపుడు
ఒత్తరించుచు భీము నొగిఁ బొదువుటయుఁ, । దత్తఱింపుచు నీదు దళములు చూడ
మృగసమూహంబుపై మృగరాజు గవియు । తగవున వాయునందనుఁడును గవిసి
వలిగాఁగ నొకట సేనాపతిఁ దునిమి, । జలసంధు మూఁటను జంపి యుద్ధతిని,
సమరభీకరమైన చండబాణములఁ । గుమతి సులోచనాఖ్యుని మూఁట నొంచి,
నొకకోల నుగ్రుని నుగ్రాద్రికి నిచ్చి, । యొకకోల భీమబాహుని రూపుమాపి,
పరి భీమరథు నైదుశరముల వ్రాల్చి, । యిరువదేనిట భీము నిలఁ బిల్కుమార్చి,
దీర్ఘబాహుని మూఁట, దీర్ఘరథాఖ్యు । దీర్ఘనిద్రితుఁ గాఁగ ద్విశతిబాణములఁ
గెడపిన విఱిగి తక్కిన కుమారకులు । వడముడి జమునిఁగా నగచి యందఱును
గావవే గాంగేయ! కావవే! యనుచు । దేవవ్రతునిచూటు తెగిదూఱ, నతఁడు :

1. నొంచి శింజినిమ్రోయ వాని చాపంబు. 2. గప్పె పెల్లువ. (మూ)

"మీ రారితేరు కిమ్మీరారి కేరి । పై రాకమానరు పైరాకయున్న!
కురుకుమారకులార! కురుయోధులార! । కాకికొనుఁ డాజికిఁ; బొడుఁడు శాత్రవుల;
లీలఁ గౌరవులపాలిటి భద్రకాళి । నై లావుమాపె నీయనిలసంభవుఁడు;
నా కలదినముల నామాట మీకు । చేకొనుఁ" డని ప్రోడి చేసినచోట
భగదత్తుఁ డప్పు డప్పావనిమీఁద । నగము బోలెడు దంతి నడిపించి కడిమి
రథములు మెదియ వారణములు చదియఁ । బృథుల తురంగమబృందంబు చిదియఁ
ద్రొక్కించుచును దొడ్డతూపుల భీము । ఠక్కునఁ డేయుచో రాజేంద్ర, వినుము
అభిమన్యు ముఖ్యు లయ్యనురేశుమీఁద । నిభరాజుమీఁద ననేక బాణములు
గుప్పిన, జేగురుకొండ చందమునఁ । దప్పక బహురక్తధారలఁ దోఁగి
గజమును వాఁడును గడివోసి వాఁడి । భజనతోఁ బాండవబలముఁ దోలుచును
భీమాదియోధుల భీషణాస్త్రములు । దోమకాళ్లవిధంబు దోపంగ నగుచు
రాహుకేతుయుగంబు రవిమ్రింగఁ గడఁగు । దాహంబుదోఁప వాతజుమీఁదఁ గడఁగ,
మనసేన లుబ్బి సమ్మదముతో నార్చె. । జనపతియును జయోత్సాహంబుతోడ
దొరలును దాను వాతూలజుమీఁద । సరదంబు లడరించునంతమాత్రమునఁ
బాఱఁజొచ్చె నృపాల, పాండవసేన; । పాఱఁజొచ్చెను దైత్యు బలుతూపు లెందు.

ఘటోత్కచుఁడు మాయాబలంబునఁ గౌరవసైన్యముపై విజృంభించుట

అప్పుడు హైడింబుఁ "డకట! మాతండ్రి । కిప్పుడు గానఁట యేనేల!" యనుచు
మాయాబలంబున మదకరి నొకటి । నాయెడ నైరావతాకృతిఁ బన్ని
యిట్టి యేనుఁగుమీఁద నింద్రభావంబు । నెట్టన తాఁబూని నిజసేనలెల్ల
నమరులై వెంటరా ననువులుచేసి, । క్రమ మొప్పఁ దోడి దిగ్గజములో యనఁగ
హిమకరరుచులు నాల్గేసి దంతములు । నమిత దుస్సహ మదోద్యద్గంధకములు
కొనమింటి పొడవులు గోత్రకుంభములుఁ । దనరి నిజేభసంతతి వెంట నడవఁ,
బనివడి తోడి దిక్పాలవేషముల । నొనరి దైత్యులు వెంట నోలి నేతేర,
ఘన వజ్రహస్తుఁడై కొంతేయతతికి । ననికిఁ దోడే తెంచు నమరేంద్రుఁ డనఁగ
మనసైన్యముల [1]మారిమసఁగెను బవన । తనయాదు లానందధన్యులై చూడ.

---

1. మీద మసగుచు. (మా).

కౌరవపతిమీఁది కడఁకఁ జెల్వ | కారణంబులుఁ దాను వరుస మాయసుర
యుద్ధంబు వచ్చిన హైడింబుఁ డతఁడు | ద్రోణునారసములు దొరఁగించి నొంచి
ఘోర మాయాదంతి కొమ్ములు నాట | ... .. ... ... ...
ఘీంకారములకు [1]దిగ్భిత్తులు పగులఁ | బంకించి పాతె మా భద్రజగంబు.
కరి పాఱు [2]కనుకని కని భీమసుతుండు | కురుపతిపై దంతి గొలుపుట యెఱిఁగి
గురుఁ జూచి మిన్నేటి కొడుకప్పుడిట్లనియె : | "కురురాజుపై దంతిఁ గొలిపెడి నసుర ;
మనమింక నడ్డింప మరలింప కున్నఁ | బనితప్పు; దొరలేల పైఁ బడరకట!
భగదత్తుఁ డిద్దైత్యుపనకు నిల్చినను | తగవు దప్పి గజంబు తాఁ బాఱుఁ దొడఁగె.
కరియూథములు మీఱుఁగడియుఁడు కదియుఁ | డరిదిరక్కను గెల్వ." ననిచాటిచెప్పి
తాముస్న గడఁగి రథంబుఁ దోలింప, | దీమసంబునఁదోడి తేకుల వారు
గురు శల్య ముఖ్యులు కూడనఁ గడఁగి | శరపరంపరలు నిశాచరు మీఁద
నగ్గలం బేయుచో, నటఁ బాండవులును | దగ్గన హైడింబుదెసఁ బన్ని వచ్చి
కురుసైనికులఁ దాఁక ఘోరమై యాజి | సరవి దేవాసురసమరంబు మించె.
అందు గంగాసూతి యతిఘన, గీర్వాణ | బృందంబు గొనియాడ భీకరాస్త్రములఁ
గనువు గొట్టిన యట్లు కౌంతేయబలముఁ | దనపేరువాడి యెంతయు విచిత్రముగఁ
జంపుచో, హైడింబు సామజ ప్రతతి | యింపారఁ గపట దిగీశులుఁ దాను
నలుఁగడ రిపుసేన నలియఁ ద్రొక్కుచును | గెలయు వీరులఁ దలక్రిందు సేయుచును.
గొమ్ముల రథములు గ్రుచ్చి నల్దెసల | కిమ్ములుగాఁ బాఱవైచుచుఁ జెలఁగ
గురుఁ బల్కె మిన్నేటి కొడుకు వెండియును : | "సురవైరితో నాజి చొప్పడదిపుడు;
ఇనుఁ డస్తగిరికేఁగె; నెల్లి ప్రొద్దునను | చనుదెంచి యుద్ధశేషము నడపుదము.
నేఁటికిఁ బోదము నృపుఁ దోడుకొనుచు ; | గాటంపు ధూళితోఁ గ్రమ్మెఁ జీఁకట్లు."
అని సేన [3]దివిపించి యతిభీతుఁడైన | జనపతిఁ గొంచు నివేశములకు మరలి
చనిన, శంఖాది ఘోషంబులతోడఁ | దనరారు సింహనాదంబులతోడ
వర వంది జనుల కైవారంబుతోడ | సరసులై హైడింబు సన్నుతింపుచును
జనిరి పార్థులు నివాసములకు నఖిల | జనవల్లభుఁడు గొల్వఁ సంప్రీతి" ననుచు
నాలవనాఁటి రణప్రసంగంబు | పోల సర్వంబుఁ జెప్పుట చెవులార

1. దిగ్దంతులు. 2. మనుమనికరి. 3. దీపించి (మూ).

విని యాంబికేయుండు వెలవెలఁ బాఱి । తనతలంచిన యట్టి తలఁపులుగాక
పలికె సంజయు: "నెన్ని భంగుల మనకు । గెలుపు లేని విధంబు గినిసి చెప్పెదవు.
కొండగా నేఁజూతు గురు భీష్మ కృపులఁ । బాండవులకుఁ దృణప్రాయులెట్లైరి?
దండనాథత్వంబు తారు వాటించి । భండనంబునఁ జేయుపౌరుషంబెద్ది?
లేదుగెల్పు; లలాట లిఖితమో; దీని । కేది కారణము నాకెఱిఁగింపు." మనిన
నతఁ డిట్లు చెప్పె: "నీవడుగ నేమిటికి? । మఱి నీకుఁ దెలియని మార్గంబు గలదె!
విను ధర్మవృద్ధియు విభవంబు నిజము । వినయంబుఁ గలవారు వెలయఁ బాండవులు.
ఈ నాల్గు గుణముల కెడమైన నీదు । సూనులు జయసిద్ధిఁ జెందుట యెట్లు. (?)
[1]వెనుకను విదురుచే వేయుభంగులను । వినిన యర్థంబిది విస్మృతి యేల!
కొడుకులు దుర్నీతి కోరి చేయంగ । నుడుపనైతివి నీకు నున్నదే [2]జయము!
తొలినాఁటి రణమున దుర్యోధనుండు । బలభేదిసుతునిచే భంగంబు నొంది
యారాత్రి నీవిప్పుడడిగినయట్లు । కౌరవవృద్ధు డగ్గఱి యడుగుటయు,
నతఁడానతిచ్చిన యర్థంబు నీకు । హితమతి నెఱిఁగింతు నిభపురినాథ!

## కృష్ణార్జునులు దుష్టసంహారమునకై జన్మించిన నర నారాయణులని సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

కౌరవేశ్వరుఁ బల్కె గాంగేయుఁ డపుడు: । "వారికిఁ గలవాఁడు వాసుదేవుండు;
అతఁడున్నచోట జయం బేమిచోద్య! । మతఁడు సర్వోత్కృష్టుఁ డాదిదైవంబు;
తన్నెఱింగి భజించు తద్జ్ఞులఁ బ్రోచు; । తన్నెఱుంగనివారు ధరణిఁ బెక్కండ్రు;
అట్టివారికిఁ గదా యాపదలెల్ల; । నట్టన వారిలో నీవునొక్కఁడవు.
ఇతనిఁ బాండుకుమారు లెఱిఁగిభజించి । కృతకృత్యులైనారు గెలుపు దుర్ఘటమె!
సరకు సేయవు నీవు సకలంబు వినుము । కురురాజ, మును హిమకూటశైలమున
సుర సిద్ధ సాధ్య [3]రక్షోయక్షగరుడ । పరివృతుండై పద్మభవుఁడు కొల్వుండి
మణిమయంబైన విమానంబు నొకటి । ప్రణుతాంతరిక్షమార్గంబునఁ గాంచి
యట పోయి చూచుచో నందు విష్ణుండు । వటపత్రశాయి విశ్వంభరాధిపుఁడు
దేదీప్యమానుఁడై దివ్యులు గొలువ । వేదనాదములతో విలసిల్లుచుండఁ

1. కొరవకు. 2. జమున. 3. యక్షోరక్ష. (మూ).

గాంచి మ్రొక్కి నుతించి కరములు మొగిచి । కాంచనగర్భుండు ఘనభక్తిఁ బలికె:
"నీరజనాభ, యే నీనాభిఁ బుట్టి । యీ రేడుజగము లే నెఱిఁగినపాటి
కలిగించినాఁడ ; రక్షకుఁడవై నీవు । నిలువరింతువు గాక నిఖిలైకవంద్య !
అవధరించితివె ! మర్త్యంబున కిపుడు । దివిజవైరులు డిగ్గి దీవు లేలుచును
మనుజాకృతులు దాల్చి మానుషక్షోభ । మొనరించుచున్నవా రుర్విఁ గ్రిక్కిఱిసి.
యదువంశమునఁ బుట్టి యఁణపవే వీరి ; । త్రిదశకార్యం బిది దేవతారాధ్య !
నరుఁడు మిత్రుఁడు నీవు నారాయణుఁడవు । నరుడును నీవు మాన్పరె భూమిబ్రేఁగు."
అని బ్రహ్మప్రార్థింప నట్లకాకనుచు । దనుజారి వోయె నంతర్ధాన గతిని.
అప్పుడు కొలువువా రాబ్రహ్మఁజూచి, । "యిప్పుణ్యు లెవ్వరో ! యిరువురున్నారు ;
తేజోభిరాములు దేవ, నీ పనికి । నోజతో మైకొని యుడువీధిఁ జనిరి
యానతి యిం." డన్న నా దివ్యతతికిఁ । బూని బ్రహ్మయుఁజెప్పెఁ బూర్వాపరంబు :
"వీ రాదిమునులు వివేకింప నరుఁడు । నారాయణుఁడు వీరి నామధేయములు.
త్రైలోక్యవంద్యులు ధరణీభరంబు । తూలింపఁ గపట దైత్యులఁ ద్రుంచివైవ
ధరఁ బుట్టుఁ డని యేను దద్ద ప్రార్థింప । గురుకృప నా రియ్యకొనిపోయినారు.
దేవకార్యములెల్లఁ దీర్తురు వీరు ; । వివిధంబుల డిగ్గవిడువ రాశ్రితుల ;
తమ్ము నొల్లనివారి దయలేనివారి । నిమ్మహి వధియింతు రిమ్మహామునులు."
అని చెప్పి యజుఁడేఁగె నాత్మీయపురికిఁ; । జనిరి దివ్యులు యథాస్థానంబునకును.
ఈకథ మునులచే నేవింటిఁ దొల్లి । నీకుఁ జెప్పితి నేఁడు ; నీవును నింక
నయ్యాది మునులతో నాగ్రహంబుడిగి । నెయ్యంబు వాటింపు నేఁడైన నీవు.
మునులు నీకీబుద్ధి మును చెప్పినారు. । వినఁ జెప్పెఁ బలుమాఱు విదురుండు బుద్ధి.
కౌంతేయులును మీరుఁ గలిసివర్తింపుఁ । డెంతయు హితమిది యెల్లవారలకు.
ఆశ్రయింపుము కృష్ణు నతనిఁ గౌంతేయు । లాశ్రయించిరె కాదె ! యధికులై రాజి.
ననిన దుర్యోధనుం డామాటలెల్ల । వినియును వినమిగావించెఁ గావునను
మీకేల నీతులు ! మీకేలబుద్ధి ! । చేకొని యోర్తురే చేటుపాటునకు !
విను మిట్లు శిబిరప్రవేశంబు చేసి । ఘనులు కౌంతేయులుఁ గౌరవోత్తములు
నిండ్రించుచో రాత్రి నీ పెద్దకొడుకు । విద్రుమాధరులు సేవించు సేవందు
నాలవట్ట మసహ్యమని మానుమనియె । గాలికుమారుఁ డక్కడఁ బుట్టుననుచు.

## పంచమదివస యుద్ధము

వేగి సన్నద్ధులై వీరుసు వారు । [1]ఆగుబ్బతిలఁగఁదూర్యములు ఘోషింప
మిన్ను దాఁకినధూళి మిహిరునిఁ గప్ప । నన్ని దిక్కులుఁగప్ప నస్త్రదీధితులు,
ఆర్పుల శేషాహి యల్లల నాడ । నేర్పులు పతులతో నెఱపుచు నడచి
కలను జొచ్చినచోటఁ గౌరవులప్పుడు । బలముల మకరికాభావంబు పొఁజు
గావింప డేగమార్గమునఁ బాండవులు । భావింపఁ దమసేనఁ బన్ని ; రందునకు
శిరము పట్టి భీమసేనుండు నిలిచె ; । సరి ముఖంబయ్యె ధృష్టద్యుమ్నుఁ డెలమి ;
కన్నులై రందు శిఖండి సాత్యకులు ; । చెన్నుగా వీపయ్యె జిష్ణుని కొడుకు ;
వాసవి మెడయయ్యె ; వామపక్షతకు । డాసె మత్స్యపుఁడు ; నెట్టన ద్రుపదుండు
కైకేయులందు దక్షిణపక్షమైరి ; । కైకొని యురమయ్యెఁ గార్ష్ణిరుఁడందుఁ ;
దనరిరి కవలు పాదద్వయంబునకు । నొనరిరి ద్రౌపదేయులు పిఱుఁదునకుఁ ;
దక్కటియోధులు ధర్మనందనుఁడు । నొక్కట నిగిడి ర య్యుభయపార్శ్వముల.
వ్యూహంబు లిట్లు మహోత్పాతజనన । బాహుళ్యములు గాఁగఁ బన్ని యిర్వాగుఁ
దలపడి శరవహ్ని దందహ్యమాన । బల భంజనోద్యాన వాటికా ప్రౌఢిఁ (?)
బోరాడె నన్యోన్య భూరిరక్తౌఘ । పారిప్లవచ్ఛత్ర బహుపతాకముగ.
ఒగి నట్టి మకరికా వ్యూహంబు చొచ్చి । మగఁటిమిఁ గిమ్మీరమర్ది యుప్పొంగి
మకరికాభంగంబు మారుతి తొల్లి । ప్రకటవైఖరిఁ జేయు పగిదిమైఁ గలఁచి,
జాహ్నవీసుతుఁ దాఁకి సరవిమైముంప । ... ... ... ... ...
మండి బాణాగ్ని సమ్మారుతిమీఁద । మండింపఁ దొడఁగినమాత్ర నర్జునుఁడు
శంతనుసుతుఁ దాఁకి చాపంబు నఱికి । వంతుగా నురమున వాలమ్ము పఱపి
యతని సేనలనెల్ల నాహతప్రహత । హతముగాఁ గలఁచుచో, నతఁ డొండువింట
దివ్యాస్త్రములు దొడి దివ్యులు చెదర । సవ్యసాచిశరీరసంధులు గ్రువ్వ
నతఁ డట్టి చాపంబు నడిమికి నఱికి । శితశరంబుల భీష్ముఁ జింపఁ జొచ్చుటయు
నాచార్యుఁ గదిసి యిట్లనుఁ గౌరవుండు : । "నీచేవ నీతేవ నేఁడుగా కొపుడు
పట్టి పాలార్చెదు పాండునందనుల. । ఇట్టియుపేక్ష నీ కెన్నఁడు మాను ?

---

1. ఆ గుబ్బలగుచు. (మూ)

వలెనన్నఁ ద్రిజగమ్ము వాలమ్ము మొనను । నిలుపుదు రఘుపతి నిలిపిన ట్లబ్ధి.
దండనాథుని బాణతతులఁ గైకొనక । చెండఁ జొచ్చె బలంబు జిష్ణుండు వాఁడె.
ఒప్పరికించుట యుచితమే !" యనిన । నప్పలుకుల నొచ్చి యాచార్యుఁ డనియె :
"కినిసి గాంతేయుల గెలువరాకునికి । వినఁ జాటనా! నీకు వినవైతిగాక.
భువి సముద్రములోన బుట్టువైవంగఁ । దవిలినంత జలంబు దవిలినట్లేము
మాచేత నైనంత మాత్రంబు పెంఁగి । చూచెద మామీఁద శుభ మీశ్వరాజ్ఞ."
అని మొనగడచి ద్రోణాచార్యుఁడడరఁ । గని పార్థుసేన లక్కాఁకకుఁ గాక
వీఁగుచో, సాత్యకి వెఱవకుఁ డనుచుఁ । దాఁ గడంగి శితాస్త్రతతి ద్రోణుమీఁద
[1]భాద్రపదాంబుద ప్రకట వర్షముల । యుద్రేకభంగి నేయుచు విల్లు దునుమ
నగుచు వేఱొక వింట నారాచశతము । తెగకుఁ దెచ్చి గురుండు తెగకు నాకనుచు
శైనేయు నేయ భుజంబులు నుసురుఁ । బీనవక్షముఁ గంఠబిల ముచ్చిపోయి
తూలఁజొచ్చుటయు, వాతూలనందనుఁడు । గాలివేగంబునఁ గదియంగ వచ్చి
ద్రోణుఁ గుంభద్రోణ దుర్వార ఘోర । బాణజాలముల నొంపఁగఁ, జూచి యలిగి
గాంగేయ శల్యు లాకలశజాతునకు । నంగదఁ దోడ్పడి యనిలజుమీఁదఁ
జండకాండాఖండ శతములు పఱప, । గాండీవిసుతులు నొక్కటఁ గృష్ణసుతులు
నుగ్రకాండముల నయ్యోధులఁ బొదివి । నిగ్రహించిరి తమనేర్పులు మెఱసి.
అప్పుడు నీయోధు లట్టిట్టుపడఁగఁ । బట్టిన ముష్టిఁ జాపంబు గర్జిల్ల
గాంగేయుఁ దాఁకి శిఖండి యుత్పాత । భంగి నేయ, నతండు బవరంబు మాని
పడఁతితోడి రణంబు పాడియే యనుచుఁ । బొడపువ్వు గన్నట్లు బోరనఁ దొలఁగి
పోయినఁ, గురురాజు బుద్ధిలో వగచి । యామెడఁ దెఱపికి ననువుగా నపుడు
ఆచార్యుఁ బురికొల్ప, నతఁ డస్త్రవిద్య । ఖేచరతతిమెచ్చఁ గినిసి యాతనిని
నేయు ; నేసినతూపు లితఁడు ఖండింపు ; । నేయు వెండియుఁ దూపు ; లితఁడు ఖండించు.
"విలువిద్య నితనితో వీడాడలేక । తొలఁగె నింతియకాక ద్రుపదజునందు
నేతప్పు గాంగేయుఁ డెన్నినాఁ!" డనుచు । నీతికోవిదులాడ సిగిడి శిఖండి
ద్రోణుఁ దూపులఁ గప్పి, ద్రోణుండు నతని । ప్రాణంబునకు నల్గి పాఱవాతమ్ము

1. భద్రాసరాంబుద. (మూ)

చను మొఱనాటి మూర్ఛామగ్నుఁ జేయఁ । గొనిపోయె రథచోదకుండు వానిరథము.
అత్తఱిఁ గౌంతేయు లాగ్రహవ్యగ్ర । చిత్తులై కవియ, నీసేనలుఁ గవియ
సందడి కయ్యంబు శంఖ నిస్సాణ । దుందుభి పటహాది తూర్య ఘోషముల
నతిభయంకరమయ్యె నాహతప్రహత । చతుర సైనిక శస్త్రసంధానరూఢి.
జ్యాలతాధ్వనులు గర్జాలీల గాఁగ, । రాలెడు [1]రక్తధారలు వృష్టి గాఁగ,
వెస ఖడ్గరోచులు విద్యుతుల్ గాఁగఁ, । బొసఁగ ధరాధూళిపోలె మేఘమును.
రావణుఁ జంపిన రణభూమి పోలె । నేవంక బాహువు లేవంకఁ దలలు
నెడనెడ నెండిపోయిన ద్రాక్షపొదల । బెడఁగున దీపించు ప్రేగుకుప్పలును,
పరఁగు ముత్యాలచిప్పలు నోళ్లు విచ్చు । కరణి నోళ్లను విచ్చు ఘనముఖంబులును,
గాడ్పున విఱిగిన కదళీవనంబు । చాడ్పున ధరజాఁగి చదియు పెన్దొడలు
మెండుకొన్న రణంబు మృత్యుంజయోగ్ర । తాండవాడంబర స్థలము దానయ్యె.
అట్టిచో భీష్ముండు ననిలనందనుఁడు । నిట్టడి ప్రముఖులై(?) యిరువంక నిగిడి
పోటునకెక్కుచోఁ బొదివి నీసుతులు । కోటికాల్బంట్లతో ఘోటకద్విరద
లక్షతో సామంతలక్షతో భీము । నక్షీణగతిఁ దాఁకి యాజి నిశ్శంకఁ
గత్తుల సురియల గదలఁ గుంతములఁ । నత్తళంబుల ఖేటకాస్త్రశస్త్రములఁ
గప్పిన, మొగిళులు గప్పిన నగము । చొప్పున భీముఁ డాచోదకు నోర్చి
గదయును దాను నక్కడుపుల కుఱుకఁ । జెదరి యమ్మూర్తి వీక్షింపను వెఱచి
కోల పైఁబడ్డఁ గాకోలకులంబు । పోలికఁ బఱచ, భూభుజుఁడు పోనీక
గాంధార యవన త్రిగర్త సౌవీర । సింధు కాళింగాది సేనలఁ గూర్చి
శకుని వికర్ణ దుశ్శాసన ప్రముఖ । సకల మహావీర సాంగత్యమునను
జేవీచి పనిచినఁ, జెదరక యెక్కి । పావని పార్థులపై నాజిసేయ.
వెన్నుదన్ని యదల్చి విప్వచ్చుఁ డార్వఁ । బన్ని చేది కరూశ పాంచాల ముఖ్య
బలములతో సైన్యపతి కురురాజు । బలములపై నెక్కి పఱపె బాణముల.
వారటు గుంపులై వచ్చిన నల్గి । వీరులు విందానువిందు లన్వారు
కాశిరాజు నెదిర్చి కడునొప్పు సమర । కౌశలంబు నముంబుగాఁ బోరి రథిప!

1. దంత. (మూ)

## ద్వంద్వ యుద్ధము

అంత జయద్రథుం డనిలనందనుని, । అంత వికర్ణాఖ్యుఁ డా సహదేవు,
మఱి చిత్రసేననామకుఁడు శిఖండి, । నెఱి విరాటసుతుండు నీ యుగ్రసుతుని,
దనరార నకులుండు త్రైగర్తవిభుని, । విను చేకితానుండు విష్ణుసోదరుని,
క్రీడిసూనుఁడు ధృష్టకేతు, సుమిత్రు । హైడింబుఁడును గూడి యధికయత్నమున
నరిపఁ దాఁకిరి సాళ్వకేకయులు । నరుస నేమనిచెప్ప వారిసత్త్వములు!
అపుడు ధృష్టద్యుమ్నుఁ డాచార్యుఁ దాఁకె; । కృపుఁ దాఁకె సుమసూతి; క్రీడి భీష్మునిని
దాఁకెను; ద్వంద్వయుద్ధం బిట్లు మెఱయఁ, । దాఁకె సేనలు రెంటఁ దనులోనఁ దాము.
శరఘట్టనంబుల జనియించి వహ్ని । మరలించె మధ్యాహ్న మార్తాండగుచుల.
రథములు తాఁకిన రయమునఁ గరులు । పృథివి బొంగరములై బిరబిరఁ దిరుగు.
ద్విరదంబు లొండొండ దివియుచో రథము । లురవడి సిఱిగి యుద్ధోర్విలోఁ జెదరు.
హరి ఖుర నిహతి వ్రయ్యలువాఱి చెదరి । ధరణి నేర్పడవు పదాతివర్గములు.
కాలుబంట్ల ప్రచండ కాండవర్షములఁ । గీలాలమయములై గెడయు గుఱ్ఱములుఁ
గలిగిన సంగరాంగణము దివ్యులకు । ఫలియించె ననిమిషభావ మీక్షింప.
అప్పుడు భీముని యాహవక్రమము । చెప్ప నాశ్చర్యమై సేనఁ గారింపఁ,
గరమల్గి భీష్ముఁ డాగంధవాహజుని । గరళ పావక శిఖాకార బాణముల
నురము శిరంబు బాహువులు విదారింపఁ । గరువలి సుతుఁడును గద వడి నేయఁ
జూచి సాత్యకి మొడసాచ్చి యాభీష్ము । వే చక్రమును బాణవితతి నొప్పింప
నతఁ డట్టితూపుల నాతని నొంచి । శితశరంబున సూతుశిరముఁ ద్రుంచుటయుఁ,
బతి చావఁ[1]గా నతుఁ బరువైన యట్లు । హితుఁడు సారథి చావనిటఁ దేరిహరులు
రథ మెత్తుకొనిపోయె నధికయత్నములు । వృథచేసి యితరాశ్వతతి ఘోషింప.
"పట్టుఁ డడ్డము రండు బలువిడి గూడ । ముట్టుఁ" డంచు బలంబు మోహరింపంగ
సాత్యకి విన్ననై జడియుట చూచి । సత్య శాంతనవుండు శాంతనవుండు
ఏయక గాంగేయుఁ డింతయు సరకు । సేయక తొలఁగి తత్సేనఁ జెండాడఁ
గనుఁగొని విరటుండు కడుకోపమెత్తి । యనిమిషనదిసూను నదలించి తాఁకి
మత్స్యముఖాకార మార్గణసమితి । మత్స్యగంధీశుకుమారుని నొంపఁ,

---

1. గుమతులు. (మూ).

బులి కోలలేసినపోల్కి నాభీష్ము | డలుక రెట్టించి మత్స్యాధీశుమేన
నవ విశిఖంబులు నాటి నారాచ | సహితిఁ దేరును విల్లు నడిమికి నఱికి
పాదచారు నొనర్చ, బాధఁ దద్దేనకు | నాదట సిగుడుచో సర్ధమార్గమున
గురుసూతి యడ్డమై "కుంతిజ, ఘోర | శరవృష్టి నాతోడఁ జూపింతుగాక.
పూర్వమత్సర మిటఁ జూపుమనఁ బోదు | గర్వివై తొలఁగక కవియుదు గాక."
అని ఘోరశరవృష్టి నర్జునుఁ బొదువఁ, | గినుక నాతని విల్లు క్రీడిదున్మాడి
జోడొక కేల విజ్జోడుగానింప | నోడక గురుపుత్రుఁ డొండొకవింట
నెఱపిడుగులఁబోలు నిష్టురాస్త్రములు | పఱపి, కృష్ణునిమేన ఫల్గునుమేన
సునిశితాస్త్రంబులు చొనుప, నర్జునుఁడు | కనుఁగొని సవ్యి యల్కఁ గాలుద్రవ్వి
గురుసూతి సంధించుకొనిన చాపంబు | శరచక్రమున రెండుగా సంహరించి
యొడలెల్ల నోడుగా నుగ్రబాణములు | వడినేసి యంతఁ గవ్వడి కృపదలఁచి
యకట బ్రాహ్మణు నొంపనైన దేమనుచు | సుకృతి వాసవి యొండుచోటికి మరలి
గాంధారసేనతోఁ గలహించుచోట, | బంధురోత్సాహుఁడై పావని యచట
భీష్మపై నురుకోపభీష్ముఁడై యపుడు | గ్రీష్మార్కు మొగిలడ్డగించు చందమున
ధీరత చూపుచో దేవ, నీసుతుఁడు | మారుతసుతునిపై మార్గణావళులు
నిగిడింప మగిడించు ; నృపతి వెండియును | నిగిడింప మగిడించు నృప, కీచకారి.
ఈభంగి సంగ్రామ మిరువురు నడప | శోభితతనుల తాశూరులఁ జూచి,
వగపుట్టి తమలోన వారికి వారు : | "జగదేక సౌభాగ్య సదను లిర్వురును;
ఆంబికేయుని లోభ మకట! వీరికిని | ముంబరంబుగ రణంబునఁ బోరవలసె.
యుద్ధోర్వి నొకనిచే నొకఁ డీల్గుఁ గాని | బద్ధవైరుల కేని (బ్రదుకంగఁ దెరువు!)
ఒకఁడిందు రాజు వేఱొకఁడు దైత్యారి; | యొకఁడిందు గుఱుతైన యుర్వరవాఁడు."
అనుకొని; రంత పన్నాంశుని గావ | ననిమిషనదిసూనుఁ డనుజవ్యయమును
వచ్చి వాయుజుమీఁద వాలంపవాన | విచ్చలవిడి గుప్ప వీక్షించి యపుడు
సౌభద్రుఁ డెడసొచ్చి శాతాతిశాత | భూభయంకరబాణములు కోటిసంఖ్య
లడరించి యందొక్క యనుజుని రథము | పడగతో ఖండించి బాణత్రయమునఁ
బురుమిత్ర, నిన్నేల పోనిత్తుననుచు | నురము నొనేసిన నొఱఁగి మూర్ఛిల్లె.
చిత్రసేనుని విల్లు ఛేదించి యింద్ర | పౌత్రుఁడు వాలమ్ము పఱపి బిట్టార్చె.

సురనదీసూను వక్షోవీథియందు । శరపంచకము నాటి చాల నొప్పించి
సారథిఁ జంపి యశ్వములఁ జెండాడి । నారథికుఁడు వేగ నన్నియుఁగూర్చి
లయకాల శూలి లీలా విభవముగ । నయుత ప్రయుత నియుతాపారసంఖ్య
శరములేయుఁగఁ బ్రతి శరము లార్జునియుఁ । బరఁగించి రారాజుపై తేరు పఱప,

## అభిమన్యు లక్ష్మణ కుమారుల ద్వంద్వయుద్ధము

నుతగతి శుభలక్షణుండగు లక్ష్మణుఁడు । హతవైరి నీపౌత్రుఁ డభిమన్యుఁ దాఁకి
శరముల మేను జర్జరితంబు సేయ । హరి మేనయల్లుఁ డుగ్రాకారుఁ డగుచు
నారు నారాచంబు లతని వక్షమునఁ । దూఱంగ నేసి కేతువు విల్లు దునిమి
రథ రథ్యములఁ ద్రుంప, రారాజుకొడుకు । పృథివికి లంఘించి బీరంబు చెడక
శక్తి బాహాశక్తి సమకూర నైవ । ముక్తాఘురిత బాణముల నది త్రుంచి
యమ్ము లంతంతకు నగ్గలంబేయ । నిమ్మాడ్కిఁ గాదని యెత్తిఁగి యాకృష్ణుఁడు
జమునిముందఱఁ బట్ట జంతువు నొక్క । ప్రమథుఁ డెత్తినభాతి బాలుని నెత్తి
తన తేరిపై నిడి తద్దవేగమునఁ । జనిన, భీష్ముఁడు కోపసంభ్రమమునను
గాంతేయసేనపైఁ గడఁగి నిస్సార । కాంతారమున నగ్ని గవియుచందమున
శరవహ్ని దొరఁకొని సంహరింపఁగను, । హరిసోదరుం డాగ్రహాభీలుఁ డగుచు
సేనలతో భీష్ముఁ జేరికిఁ గొనక । భూనభోంతరము తూపుల రాశిగాఁగ
ధర యట్టి ముట్టడఁ దలఁకెడిభంగి । నురు రజోరూపమై యుడువీథిఁ బ్రాఁక
మనసైన్యముల మారిమసఁగి గాంగేయు । తనువున భీకరాస్త్రము లారు నాట
భూరిశ్రవసుఁ డల్గి పూర్వవైరమున । నా రథికునిఁ దాఁకి యలుగు లన్నియును
ఖండించి తనువునఁ గాండద్వయంబు । చండిమ నాటింపఁ జలి యుంప కతఁడు
పుట్టత్రవ్వి ఫణీంద్రుఁ బుట్టించునట్లు । గుట్టుతో నొడలఁ బ్రేవులు ద్రెళ్లనేసి
ధనువు ఖండింప నాతఁడు నొండుధనువు । గొని కృష్ణసోదరుఁ గని కాడనేసి
సారథిఁ దునుమ, నశ్వములకుఁ దాని । సారథియై నేత్రసరణి కెంపార
దాయ మేనెల్ల రక్తమునఁ గెంపార । సాయక శతసహస్రములేసి యార్వ
నోరి, నీకేలరా! యుద్ధ మిట్లనుచు । నారాచ మొక్కటి నాటిన, వఢిని

దలదిమ్ముగ వట్టి యస్త్రము చేయివదల । బలువిడి సాత్యకి బలములు కడఁగి
సోమదత్తకుమారుఁ జుట్టుముట్టుటయు, । నా మహాసేన మహాసేననిభుఁడు
మునుకొని రెండును మూఁడును నాల్గు । తునుకలై పడఁ బెద్దతూపులు పఱపి
నీ మొన లానంద నిభృతులై యార్వ । సోమదత్తసుతుండు శూరత నెఱప,
హరిసోదరుని సూను లాగ్నేయ ముఖ్యు । లరయఁ బదుండ్రు గర్వాంధులై యపుడు
భూరిశ్రవసు తేరు పొదివి యిట్లనిరి: । "దారుణాస్త్రముల మాతండ్రి నొప్పించి
బలములఁ దునుకలై పడ నేసి నీవు । నలిరేఁగి వాలుచున్నాఁడవు మిగుల.
ఎక్కటి నీతోడ నేము మాలోన । నొక్కని నియమించి యొసఁగెద మనికి.
ఎవ్వండు గావలె ? నేరికొ." మ్మనిన । నవ్వుచు నతఁ: "డిట్టి నగుఁబాటు గలదె !
అందఱుఁ గూడి రం డటుగాని రణము । పొందు గా." దని గర్వపూర్వకంబునను
శరవృష్టి ముంచుచో జడియక పదురు । నరిరాజు శరవృష్టి నంకిలిచేసి
విల్లు ఖండింప నవ్విభుఁడు వేఱొక్క । విల్లు గైకొని వృష్ణివీరుల విండ్లు
పదియునొక్కటఁ ద్రుంచి పదురకంఠములు । పదియును బలియిచ్చెఁ బదిదిక్కులకును.
భూరిశ్రవసుఁ డిట్లు పుత్త్రులఁ దునుమ । భూరిశోకము కోపమును బెనఁగొనఁగ
విమతుపై సాత్యకి వెసఁ దేరుపఱపి । గమగమ గాలునాఁకట భంగమైన
కాలసర్పంబున గతి మండు తూపు । లాలీఢతరపాదుఁడై యంతఁ బఱపఁ
గురువంశజుఁడు నట్టికోలలు పఱపి । యిరుసులతోడఁ దేరిలఁ గూలనేయ
నతఁడును నతనితేరాభంగి నఱికి । వితతాస్త్రముల జోడువిల్లును నఱక,
నసివైచి సీజ్ఞాతి యాతనిజోడు । వెన విల్లుఁ దున్మి యుర్వికి డిగ్గ నుఱికి
గదగొని పఱతేరఁ, గడఁగి సాత్యకియు । గదగొని యతిశీఘ్రగతి నుర్వి కుఱికి
కౌరవ భీము లీగతి దారుణముగఁ । జేరి చేయుదురని చెప్పినయట్లు
పాదచారమును సంపాదించి కవియ । యాదవుఁ బట్టించి యనిలనందనుఁడు,
సోమదత్తజుని నీసుతుఁడు పట్టించి, । యేమఱక రథంబు లెక్కించుకొనిరి.
అప్పటి కపరాహ్ణమయ్యె నట్లైన । నిప్పుచాయ మొగిల్లు నిగుడకమున్న
బలములు తమ బాహుబలములు వదలి । తొలఁగునో యొకసన్న దోలెద ననుచు
నరికట్టుకొని పార్థుఁ డరిసేన నేయఁ । గురుపతి యానదికొడుకు కన్నెఱిఁగి
మేలేరి పోర నమ్మిన యుర్వ్యదేను । వేల తేరులవారి వెసఁ బురికొల్పఁ,

గామించి లేఁబూరి గనుఁగొన్న బసనఁ । జేసాఁడి మదిఁ బొంగు సితఁ డట్లు పొంగి
శరవేగ రథవేగ సన్నానోవేగ । కరవేగములు దేవగణము కీర్తింపఁ
దునుకలు తుమురును ధూళిపటంబు । నొనరించి యాసేన నువ్వ్రొత్తుగొనఁగ
నిది రథ మిది రథ్య మీతండు రథికుఁ । డిది యిట్టి దని నిర్ణయింప నేర్పఱుప
వసముగాక కృతాంతు నంటసా లనఁగ । వసుధ మూఁపట్టుచో వనజాప్తుఁ డంత
శ్వేతవాహన [1]కృత్త సేనాంగరక్త । ధాతు ధారాసిక్తతనుఁడును బోలె
నరుణత్వ మేర్పడి యస్త్రాద్రి వ్రాలఁ । దరునీడములఁ బక్షితతులును వ్రాలఁ
గలశజుఁ గదిసి గంగాసూతి పలికెః । "బలములఁ [2]దివిరింపఁ బాడి యింతటను;
ఇట్టి సంధ్యావేళ నిండ్లకుఁ బోక । యెట్టు మానఁగ సేన్య నీరణశ్రాంతి?"
అని వేత్రకరులచే నాత్మీయబలము । ననిమిషనదిసూనుఁ డర్థి మరల్పఁ,
దారు నవ్విధమున దళములఁ ద్రిప్పి । చేరి రంత నివేశసీమఁ బాండవులు.
నాఁటితో నైదుదినంబుల రణము । వాటమై వర్తింప వారును వీరు
నా రాత్రి వివిధ విద్యావినోదములఁ । జారుభోజనమాల్య చందనాదులను
నారీ కుచాలింగన వినోదములను । జారు సౌఖ్య విభూతి సలిపి రెంతయును.
అని సంజయుండు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పిన నారాజు చెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు." మనినఁ
బొలుపొంద నయోధ్యాపురవరాధీశ! । వలనొప్పఁగా మాల్యవంతప్రవేశ!
దక్షిణసింధు బంధన! జగద్రక్ష! । పక్షీంద్రవాహన! పద్మపత్రాక్ష!
భువన మోహనరూప! భూరిప్రతాప! । భవబంధన సకోప, బ్రహ్మస్వరూప!
అనవరతంబు నిన్నంతరంగమున । వినుతింతు రఘురామ! విభవసుత్రామ!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయ స్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్రి । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
రచితమై భీష్మ పర్వమున నాశ్వాస । మచితార్థయుతముగా నొప్పె మూఁడవది.

1. కృత్తి. 2. దిరిగింప. (మూ).

# చతుర్థాశ్వాసము



శ్రీపరంధామ, భాసిత పుణ్యనామ, । అపదామపహర్త, యఖిలైక భర్త,
భుక్తి ముక్తిత్రాత, భువన విఖ్యాత, । భక్తలోకశరణ్య, [1]భరతాగ్రగణ్య !
అవధారు మఱియు సంయమి చెప్పఁదొడఁగె । సవినయ స్ఫూర్తి గా జనమేజయునకు:

## పంచమ దివస యుద్ధక్రమము

ఆరాత్రి వేగించి యమ్మహాభరత । వీరులు సంధ్యాది విధులెల్లఁ దీర్చి
కలనికి నడచుచో గాండీవి యచటఁ । బలికె ధృష్టద్యుమ్నుఁ బార్థివుండలర:
“ మనసేనఁ బన్నుమా మకరికావ్యూహ । మనిమిషేంద్రునికైన నాశ్చర్యముగను.
ఎచ్చోట నెవ్వాని నిడవలె నతని । నచ్చోట నిడుము నీ కనువైనయట్లు.”
అనినఁ బార్థుఁడు తాను నాసైన్యవిభుఁడు । ఘన మకరీ మస్తకస్థానమెక్కి
కవల నేత్రస్థాన కలితులఁ జేసి । పవనజుఁ దుండంబుపట్టున నిలిపి,
యోడక ద్రౌపదేయులఁ బార్థసుతుని । హైడింబు నలకపోలాకృతి నిలిపి,
శైనేయ సహితుఁడై శమన నందనునిఁ । బూని కంఠాకృతిఁ బోలుపుగా నిలిపి
యున్నచో, మనవారు నురుచతురంగ । సన్నద్ధులై వచ్చి సమర స్థలమునఁ
దమసేన నర్ధచంద్ర వ్యూహముగను । సమకట్టి రది చెప్పశక్యమే నాకు!
చక్కఁగా వ్యూహ మీశ్వరు జటాజూట । మెక్కఁగ నర్హమై యుంపారె నధిప!
అప్పుడు బిట్టార్చి యతిఘోర ధూళి । యుప్పతిల్లఁగఁ దాఁకె నుభయసైన్యములు.
పొడు పట్టు పోరిగొను పోనీకు పొడువు । మను వ్రేయుమనుమాట లఖిలంబు నిండె.
సకలదిక్కుల నస్థిశల్యకపాల । శకటాంగములు ద్రెవ్వ చప్పుళ్లు నెసఁగె.
ఘనతర శస్త్రాస్త్రఘట్టన నెసఁగి । యనలకణంబు లాహవభూమి నిండఁ
బోరాడఁ దొడఁగి రప్పుడు దివినుండి । వారక చూడంగ వచ్చినయట్టి
ఘన కిన్న రోరగ గరుడ గంధర్వ । ముని సిద్ధ సాధ్యుల మూఁకలు బెదర.
ఘను లిందు నందును గలయోధులపుడు । అని చేసి రాఘోర మలవియే చూడ.

---

1. భక్తా. (మూ)

## భీముఁడు దుర్యోధనుని మూలబలము నుక్కడఁచుట

ఆవేళ నీసేన నట్లిట్లు గలఁచు । పావనిపై నల్గి పన్నగధ్వజుఁడు
తన మూలబలము నంతయుఁ జూచి వారు । వినఁగఁ దానెలుఁగెత్తి వేర్వేఱ పిలిచి
పనిచిన, వారు నార్భటములతోడ । ననిలజుపైఁ బఱుఁడని చేయి వీచి
దంతి రథాశ్వ పదాతి [1]లక్షలను । ఎంతయుఁ బొంగారి యిలకు వ్రేఁగగుచు
జలదకులంబెల్ల సమకాలరేఖ । జలజాప్తుఁ బొదివిన చందంబు తోఁపఁ
జుట్టుముట్టిన, వాయుసుతుఁడు కోపమున । నిట్టిచో రథము నా[2]కేలయటంచు
సూతునిఁ బల్కె : "విశోక, నారథము । వాతప్పకిట కేను వచ్చునందాఁక
నిచ్చోట నిడుకొని యీవుండు." మనుచు । నచ్చుగా గదఁగొని యవనికి దాఁటి
వాసి యేనుఁగుల కుంభముల తుండంబు । లూఁచి కొమ్ములు వీపులువ్రొత్తు చేసి,
కదిసి తేరులఁ దురంగములఁ జక్రములఁ । దుది రథికుల సారథుల నేలఁ గలిపి,
కడఁగి కుమారవర్గము పాఱఁ బాఱఁ । బెడమరించి హరించె బిరుదుటెక్కెములు.
గదవైచు నది యోధకంఠంబులెల్లఁ । గుదియనివెస సూచకోఁతగాఁ బాఱు.
అక్కడఁ దాఁదోఁచు నదితిరుగవైచుఁ । దక్కటి యోధుల తలలిట్లు దునియు.
ఈభంగిఁ దనమూర్తి యిరువంకఁ దోఁప । [3]నీభటాళి గదోగ్రనిహతి నడంగ
భీముండు లయకాలభీముఁడై యుండి । యీ మాడ్కిఁ బోరుచో, నెఱుఁగమిఁ జేసి
యూరక గుండియ లూటాడి నట్టి । కారణంబున వారి ఘన సైన్యవిభుఁడు
ఆచార్యుతోడి కయ్యంబు చాలించి । వేచని వాయుజు వెదకుచో నతఁడు
తేరిపై లేకున్న దీనుఁడై యతఁడు । సారథిఁ గదిసి : "యోసఖుఁడ, నిన్నొకటి
యడిగెదఁ జెప్పవే! యనిలజుఁ డెందు । నడచె? మాన్పఁగదయ్య నాతల్లడంబు.
శత్రుమధ్యము మిది సాహసి మొదల । నేత్రోవఁ బోయెనో యిట నిన్ను విడిచి?"
అనిన విశోకుఁ డిట్లనె సైన్యపతికి : । "వినుము వైరులు వెల్లివిరిసిన ట్లపుడు
చుట్టుముట్టిన గదాశోభితుండగుచు । నిట్టిచో నన్నిడి యేఁగె నొక్కఁడును."
అని భీముఁ డేఁగిన యాత్రోవఁ జూపఁ । దనరథం బతఁడందుఁ దఱిమించునపుడు
ఒఱిఁగిన తేరులు నుర్వరమీఁద । నఱవఱలైన గజావయవములు
మొదిఁగిన హయములు మేనిల బ్రుంగి । తుదమొదల్ దెలియని దొరలును గలన

1. అక్షణముల. 2. కెక్కడిదియనుచు. 3. నిజ (మూ).

వ్రాలిన పడగలు వడి రక్తనదులఁ । దేలెడు డొక్కలుఁ దరితీపులాడు
తేరి గుజ్జములునై ధీరుండు కీచ । కారి వోయిన త్రోవ యతి ఘోరమగుచు
భాసిల్ల నాచొప్పుపట్టి సైన్యేశుఁ । డాసమీరాత్మజు నచ్చోటఁ గాంచి,
"పాదచారంబునఁ బరులపై నొంటి । చే దోడు వా దోడు చీరక యిట్లు
ఏతెంతురయ్య! మేమెన్నఁటికింక! । నీతోడు మాకెల్ల నీతోడె గలది.
ఇట్టిచో నిదె యేను నేతెంచినాఁడఁ; । గొట్టి వేతువుగాక కురుసేన." ననిన
నతఁడు సంతోషించి, "యవునురా సైన్య । పతివి గాఁదగుదువు పాండవులకును.
కౌరవయోధుల ఖండించుకొనుచు । నీరీతి వచ్చితి నిది వేడ్కనాకు.
నీవు వచ్చినరాక కేను మెచ్చితిని; । నీవంటి హితకారి నెవ్వనే గలుగ!
పన్ని పట్టుక కురుపతి వీఁడె వచ్చి । యున్నాఁడు కొందమా యొక దెబ్బ వీని.
డప్పి జనించెఁ బుట్టదుగాని యుడక; । యిప్పు డెక్కడిదాహ మిందుర." మ్మనుచుఁ
గౌరవవిభునిపైఁ గదియుచో, నథపుఁ । డారథికులమీఁద నధికవీరులను
దమ్ముల ననుప మొత్తమ్ములై వారు । హుమ్మని కడఁగి వాయుజు సైన్యవిభునిఁ
బొదివి యేయఁగ, వాయుపుత్త్రుఁడా బలము । గదఁ జెదరఁగ [1] వ్రేయఁ గడిఁది సైన్యపుఁడు
వెసఁ బ్రమోహనమను విశిఖమాచార్యుఁ । డొసఁగినయది మంత్రయుక్తి సంధించి
సకల శాత్రవుల లక్ష్యము చేసి యేయఁ । జకితమైనట్టి యస్త్రప్రభావమున
భ్రామి పెట్టఁగఁ బారవశ్యంబునొంది । యా మంది చాపకట్టై నేలవ్రాలె.

వ్రాలిన నూఱట వాయుపుత్త్రునకు । నాలోన సిద్ధించె; నాసమీపమునఁ
గైరవకువలయ కమల కల్హార । సౌరభగంభీర [2]జలమైన మడుఁగు
చొచ్చి నల్గడల వీచుల గాలి విసరఁ । జెచ్చెర జలము దోసిటఁ బట్టి పట్టి
బండి బండెడుకూడు పట్టెడు కడుపు । నిండఁ బానము చేసి నిజతృష్ణ నార్చి
పరితుష్టుఁడై సైన్యపతిఁ గూడ వచ్చి । యురుతర నిశ్వాస మొనరించుచోట,
వెసఁ దన సన్నిధి విడిచి సైన్యేశుఁ । డుసుఁగుట కాచార్యుఁ డొక్కింత రోసి
ద్రుపదు నయ్యెడఁ గాంచి తొంటివైరమున । విపులవైఖరిఁ బోరి విఱిచి పోఁద్రోలి,
మెఱసి ధృష్టద్యుమ్నుమీఁది రోషమునఁ । దఱిమి యాతని రణోర్వరఁ దేరు గదిసి
బలము ప్రమోహన బాణంబు మహిమ । నిల వ్రాలియుండుట యీక్షించి వగచి

1. వ్రేయు కళది. 2. జలనమై. (మూ).

గానికిఁ [1] బ్రజ్ఞాఖ్య బాణ మౌషధము । గాన ప్రయోగించి గ్రక్కునఁ దెలిపి
మా వాహినులుఁ దాను నట ద్రుపదజునిఁ । బావనిఁ దాఁకి నిర్భర బాణవృష్టి
ముంచినఁ, బ్రతిబాణముల గదాహతుల । మించరి నొప్పింప, మెండు కీ లెసఁగి
రుకుమారుల గుంపు కురుసేన గుంపు । నిరువురిపై నెక్కె నెట్లొకో యనుచుఁ
గి ధర్మజుఁడు ద్రౌపదేయులఁ గవల । నొగి యుధామన్యుని నుత్తమౌజునిఁ
కయులను ధృష్టకేతుని జూచి, । "జోక సహస్ర వాజులఁ గూడి మీరు
రసూతి ద్రావున నడచి సైన్యపుని । గిరుపలిసుతుఁ గాచు క్రమ మెన్నవలయు.
రుఁడు సామాన్యుఁడే! కురుకుమారకులు । దొరతురు ఱల్పులె! మీరుతో ద్రోఁచనుఁడు."
ని పురికొల్ప వా రనివార్యవృత్తిఁ । జని భీమసేను ధృష్టద్యుమ్నుఁ గదిసి
మలక్ష్మణులకు రణ సహాయముగ । నా మహాకపివీరు లరిగిన త్రైరి.
వేళ ద్రుపదజుఁ డనిలజుఁ బలికె: । "నీవు కాల్నడ నిట్లు నిండు కోల్తలను
ంచరించుట గాదు చయ్యనఁ గేక । యూంచిత రథ మొక్క యనుచు నెక్కించె.

## ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిపైఁ దలపడుట

ప్పుడు మధ్యందినార్కుని రుచులఁ । గప్పెడు దివ్యమార్గణముల గురుఁడు
ంతేయ సేనలఁ గలఁపఁ జొచ్చుటయుఁ । గౌంతేయసేనాని కడునల్గి వానిఁ
తిశరంబులఁ ద్రుంచి పదినారసముల । హతి ఱొమ్ము నొప్పింప, నతఁడు బిట్టల్గి
ను దున్మాడి యాతని శరీరమున । సునిశితాస్త్రంబులు చొనుప, సేనాని
వేగ వేఱొక్క విల్లు సంధించి । దావాగ్ని కీలలు దట్టించు నట్టి
సముల నాచార్యు సారథి నొంచి । యురు రథాశ్వములలో నొకటి చంపినను
క్కున నొకవాజిఁ గట్టించి గురుఁడు । పెక్కు మాఱమ్ములు బిరుసుగాఁ దొడిగి
నాని కార్ముకచ్ఛేదంబు చేసి । వాని యశ్వంబుల వ్రయ్యలు వాపి
డు కేతనమును జూర్ణంబుచేసి । యోడక సారథి నసువులఁ బాపి
ంచాల, పకుమని ప్రళయాగ్ని శిఖల । మించిన తూపేయ, మిన్ను నేలయును
చుచు నది వచ్చువేళ నత్తూపుఁ । బూఁచి త్రుంచె సుభద్రపుత్రుఁ డివ్వలను.
ంచి తే రెడలిన ద్రుపదజుఁ దనదు । కాంచన రథ మెక్కఁగాఁ జేసి తొలఁగె.

---

[1] జ్ఞానాస్యదళ యౌషధంబు. (మూ).

[1]ఏలిక లిప్తైన నితర సైన్యములు । మేలు చేయగ ద్రోణు మెయికొన లేక
వీఁగెఁ బానని మెచ్చి వీరోత్తములకు । మూఁగి నిలువక యా ద్రోణుభీతి.
"అనిలజునకు నిప్పు డరదంబు లేదు; । తన సైన్యములను బాఱె దశదిశలకును,
ఇది వేళ నా." కని యిభరథకోటిఁ । గదిసి తా నుగ్రుఁడై కౌరవేశ్వరుఁడు
నిప్పుపై మఱి కారిమహంబు గవియు । చొప్పునఁ బవమానసూనుపైఁ బొదివి
యేయుచో, నతనికి నింతలో రథము । ధీయుక్తి సారథి తెచ్చెఁ; దెచ్చుటయుఁ
బర్వతాగ్రము సింహపతి యెక్కినట్లు । గర్వి తెచ్చిన తేరు పావని యెక్కి
నెఱిచిచ్చు తూపు లనేకంబు లప్పుడు । పఱపి దూరంబుగా బలములఁ దఱిమి
కురుపతి నొనేయఁ గోపించి యతఁడు । సుగుణతర నారాచముఖంబు వొడిగి
బకవైరి వక్షంబు పగులనేయుటయు । బకవైరి భీకరాంబక దళనమున
నురగకేతను మూరు నురము నెత్తురులు । దొరఁగ నేసినఁ, దోడుతోడన యతఁడు
పదిపదు లతిశితాంబకములు పఱపి । యదయుగుండియ వక్ష మా భుజద్వయము
ననుకు నెత్తుట నోలలాడ నేయుటయుఁ, । గనుఁగవ నురురక్త కలితుఁడై యతఁడు
కినిసి యా రాజుపై ఖేచరుల్ వొగడ । సునిశితాస్త్రంబులు చొనుపుచు నుండె.
అంతలో నొకరథం బాయత్తమైన । నెంతయు వెస నెక్కి యిట ద్రుపదజుఁడు
కలశజుతో నల్లకల్లోలమైన । కలహము దొడఁగొని కడుఁగడువడిని
దూపులేయు నితండు దును మాడె నతని । చాపదండము జోడు శకుని కేతనము.
అతఁ డొండు వింట ద్రోణాచార్యదత్త । శితశరకోటిచేఁ జించెఁ దత్తనువు
ఈరీతిఁ బోరుచో నిటఁ గుమారకులు । మారుతిఁ బట్టెడుమతి మెన్ని వచ్చి
యన్నకు ముచ్చాడి యటునిటు గదియఁ । గన్నతెంగి సుభద్రనాదిలిసుతుఁడు
కేకయు[2]లును ధృష్టకేతుఁడు ద్రుపద । జాకుమారులు నగ్నిజాకుమారునకు
నరి వచ్చి నీపుత్రసమితిపై నేయ । నఱక వేభంగి వాయుజుఁడును గూడి
తఱిమిన నీదు నందనులు డెందముల । నఱిమిన భయముల నందంద పఱచి
వెంటఁ బెట్టు బకారి వీరుచేఁ దప్పి । [3]బం టొక తెరువునై పాఱిరి యకట!
పట్టిన గద తొక్క పబ్బంబు పెట్ట । నట్టుకొట్టితి బ్రహ్మ నాకు నీడయ్యె.
అనునంత సేనా సహాయుఁడై నృపతి । యనిలజుఁ డాదిగా నచటి యోధులను

---

1. నేరికి నిల్లైన. 2. లను దుష్ట. 3. యొండొక. (మూ)

దానికిఁ [1] బ్రజ్ఞాఖ్య బాణ మహౌషధము । గాన ప్రయోగించి గ్రక్కునఁ దెలిపి
యా వాహినులుఁ దాను నట ద్రుపదజునిఁ । బావనిఁ దాఁకి నిర్భర బాణవృష్టి
ముంచినఁ, బ్రతిబాణముల గదాహతుల । మించరి నొప్పింప, మెండు కీ లెఱిఁగి
కురుకుమారుల గుంపు కుసుసేన గుంపు । నిరువురిపై నెక్కె నెట్లొకో యనుచుఁ
దెగి ధర్మజుఁడు ద్రౌపదేయులఁ గనల । నొగి యుధామన్యుని నుత్తమౌజసునిఁ
గేకయులను ధృష్టకేతుని జూచి, । "జోక సహస్ర వాజులఁ గూడి మీరు
నరసూతి ప్రాపున నడచి సైన్యపుని । గురువలిసుతుఁ గాచు క్రమ మెన్న వలయు.
గురుఁడుసామాన్యుఁడే! కురుకుమారకులు । దొరయ నల్పులె! మీరుతో డ్తోఁచనుఁడు."
అని పురికొల్ప వా రనివార్యస్ఫూర్తిఁ । జని భీమసేను ధృష్టద్యుమ్నుఁ గదిసి
రామలక్ష్మణులకు రణ సహాయముగ । నా మహాకపివీరు లరిగిన నైరి.
ఆవేళ ద్రుపదజుఁ డనిలజుఁ బలికె: । "నీవుకాల్నడ నిట్లు నిండు కోల్తలను
సంచరించుట గాదు చయ్యనఁ గేక । యాంచిత రథమెక్కు మనుచు నెక్కించె.

## ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిపైఁ దలపడుట

అప్పుడు మధ్యందినార్కుని రుచులఁ । గప్పెడు దివ్యమార్గణముల గురుఁడు
కౌంతేయ సేనలఁ గలఁపఁ జొచ్చుటయుఁ । గౌంతేయసేనాని కడుసల్గి వానిఁ
బ్రతిశరంబులఁ ద్రుంచి పరినారసముల । హతి జొమ్ముసొప్పింప, సతఁడు బిట్టల్గి
ధనువు దున్మాడి యాతని శరీరమున । సునిశితాస్త్రంబులు చొనుప, సేనాని
వేవేగ వేఱొక్క విల్లు సంధించి । దావాగ్ని కీలల దట్టించు నట్టి
శరముల నాచార్యు సారథి నొంచి । యురు సిథాశ్వములలో నొకటి చంపినను
గ్రక్కున నొకవాజిఁ గట్టించి గురుఁడు । పెక్కు మాఱమ్ములు బిసుసుగాఁ దొడిగి
సేనాని కార్ముకచ్ఛేదంబు చేసి । వాసి యశ్వంబుల గ్రయ్యలు వాపి
జోడు కేతనమును జూర్ణంబుచేసి । యోడక సారథి నసురుసోఁ బాపి
పాంచాల, పశుమని ప్రళయాగ్ని శిఖల । మించిన తూపేయు, మిన్ను నేలయును
వేఁచుచు నది వచ్చువేళ నత్తూపుఁ । బూఁచి త్రుంచె సుభద్రపుత్రుఁ డీష్వలను.
త్రుంచి తే రెడలిన ద్రుపదజుఁ దనదు । కాంచన రథ మెక్కఁగాఁ జేసి తొలఁగె.

---

1. జ్ఞానాస్యదళ యౌషధంబు. (మూ).

[1]ఏలిక లిప్త్రైన నితర సైన్యములు । మేలు చేయఁగ ద్రోణు మొయికొన లేక
వీఁగెఁ బానని మొన్ని వీరోత్కరాళి । యాఁగిన నిలువక యా ద్రోణుభీతి.
"అనిలజునకు నిప్పు డరదంబు లేదు; । తనసైన్యమును బాఱె దశదిశలకును,
ఇది వేళ నా." కని యిభరథకోటిఁ । గదిసి తా నుగ్రుఁడై కౌరవేశ్వరుఁడు
నిప్పుపై మక్కి శానివహంబు గదియు । చొప్పునఁ బన గానసూనుపైఁ బొదివి
యేయుచో, నతనికి నింతలో రథము । నాయుక్తి సారథి తెచ్చెఁ; దెచ్చుటయుఁ
బర్వతాగ్రము సింహపతి యెక్కినట్లు । నరిఁ దెచ్చిన తేరు పావని యెక్కి
నెఱిచిచ్చు తూపు లనేకంబు లుప్పు । పఱపి దూరంబుగా బలములఁ దఱిమి
కురుపతి నొచ్చెయఁ గొప్పించి యపుడు । నురుతర నారాచసమూహంబు వొడిచి
బకవైరి వక్షంబు పగులనేయుటయు । బకవైరి భీకరాంబక దళితమున
నురగకేతను మోఁదు నురము నెత్తురులు । దొరఁగ నేసినఁ, దోడుతోడనె యతఁ
పదిపదు లతిశితాంబకములు పఱపి । యదరుగుండియ వక్షమూ భుజద్వయము
నసుకు నెత్తుట నోలలాడ చేయుటయుఁ, । గనుఁగవ నురరక్త కలితుఁడై యతఁడ
కినిసి యా రాజుపై ఖేచరుల్ వొగడ । సునిశితాస్త్రంబులు చొనుపుచు నుండె.
అంతలో నొకరథం బాయత్తమైన । నెంతయు వెసనెక్కి యిట ద్రుపదజుఁడు
కలశజుతో నల్లకల్లోలమైన । కలహము దొడఁగొని కడుఁగడువడిని
దూపులేయ నితండు దునుమాడె నతని । చాపదండము జోడు శకుని కేతనము.
అతఁ డొండు వింట ద్రోణాచార్యదత్త । శితశరకోటిచేఁ జించెఁ దత్తనువు
ఈరీతిఁ బోరుచో నిటఁ గుమారకులు । మారుతిఁ బట్టినుమత మొన్ని వచ్చి
యన్నకు మున్నాడి యటునిటు గదియఁ । గన్నెఱింగి సుభద్రగాదిలిసుతుఁడు
కేకయు[2]లును ధృష్టకేతుఁడు ద్రుపద । రాజకుమారులు నద్రిజాకుమారునకు
నరి వచ్చి నీపుత్రసమితిపై నేయ । నుఱక వేభంగి వాయుజుఁడును గూడి
తఱిమిన నీదు నందనులు డెందముల । నఱిమిన భయముల నందంద పఱచి
వెంటఁ బెట్టు బకారి వీరుచేఁ దప్పి । [3]బం టొకతెరువునై పాఱిరి యకట!
పట్టిన గద నొక్క పబ్బంబు పెట్టి । నట్టుకొట్టితి బ్రహ్మ నాకు నీడయ్యె.
అనునంత సేనా సహాయుఁడై నృపతి । యనిలజుఁ డాదిగా నచటి యోధులను

---

1. నేరికి నిల్లైన. 2. లను దుష్ట. 3. యొండొక. (మూ)

దలపడి యేయుచోఁ, దపనమండలము । విలసిల్లె నపరాహ్ణవేళ చూపట్టె.
అప్పుడు కృపునకు నకులసూనునకుఁ । జెప్ప నాశ్చర్యమై చెల్లె రణంబు.
శరవృష్టియే కాని జనులమూఁకలకు । నిరువురఁ గానరా దేమి చెప్పెడిది !
తొరఁగిరి తునిసిరి తునుములైన తూలి । రిరువురు నని మ్రోసె నిందును నందు.
పటికిఁ దోడై యంతఁ బఱతెంచి రథిప, । సుతగతిఁ జిత్రసేనుఁడు వికర్ణుఁడును.
అయ్యిరువురఁ దాఁకె నభిమన్యుఁ డపుడు । వ్రయ్య విచ్చ నడంగ వారిసైన్యములు.
కర్ణు పెన్నుద్ది వికర్ణుఁ డన్నీల । వర్ణు మేనల్లుని వక్షంబు చాయఁ
దూపులు పదునాల్గు దూఱ నేయుటయుఁ । గోపాంధుఁడై పార్థుకొడుకు కక్కుచూరు
తేరి గుఱ్ఱంబులఁ బ్రదెవ్వ నేయుటయుఁ । దేరు డిగ్గి యతండు దివ్యవేగమునఁ
జిత్రసేన రథంబుఁ జేరెఁ; జేరుటయుఁ । జిత్రసేనుని దాఁకి జిష్ణునందనుఁడు
సేనలతో వానిఁ జెలఁగి నొప్పింప, । భూనాథ, ద్రౌపదిపుత్రు లవ్వేళ
నురగకేతనుఁ దాఁకి యురగాభిరాము । శరము లేసిరి మేను జర్జరితముగ.
నీ కుమారుఁడు నేసె నిశితాస్త్రవితతి । నా కృష్ణసుతులపై నమరులు వొగడ.
అత్తఱి గాంగేయుఁ డరిసైన్యజలధిఁ । జొత్తెర నవ్వీరుఁ జూడను నోడి
సింహపోతముఁ గన్న జింకలు వోలె । సంహతి విచ్చి భూస్థలి దాఁటి పాఱ,

### తెరలిన సైనికుల నర్జునుఁడు మరలించుట

నోడకుఁ డోడకుఁ డున్నాఁడ ననుచుఁ । గ్రీడి యప్పుడు కపికేతువుఁ దానుఁ
బొడచూపి భీష్ముతోఁ బోరాడె; నప్పు । డెడ సొచ్చి నీసేన లింద్రజుఁ బొదువ
నృప, వారిసేనయు నీసేనఁ బొదువ । నపుడు ఘోరంబయ్యె నన్యోన్యరణము.
అట్టి రణోత్సాహ మాడుచున్నట్టి । యట్టలే పివరించె నంతరిక్షమున.
సేనలు బహురక్తసింధు మధ్యమున । యానపాత్రములుగా నరదంబు లొడ్డి
యవి ద్రొక్కుకొని పోరి రస్త్రసంజనిత । వివిధాగ్నికణములు విపులమై పర్వ.
లలి నొక్కఁ డొకని నోలలు చాటి చాటి । పిలిచి పిల్చి రణోర్విఁ బెనఁగిరి కడిమి.
రవి యంత వీరవర్గము చించి చించి । దివికేఁగ నేఁగఁ జిందిన రుధిరముల
నెఱ్ఱనై డాఁగఁ బోయిన భావమునఁగ । జఱ్ఱన నస్త్రాద్రి చఱులకై జాఱె.
ఇతఁడు గ్రుంకకమున్న యేఁ బగదీర్చి । కృతకృత్యభావంబు గీల్కొందు ననుచు

వేవేగఁ బోఁ దేరు విభునిసన్నిధికిఁ । బావని తోలించి పల్కెఁ గేలెత్తి :
"బహుకాలమునుండి ప్రార్థించుకోర్కి । యహికుండలుఁడు నేఁడు హత్తించె నాకు.
గొంతి సంకటపాటు గొంతి కోడలికిఁ । జింతింప మీరు చేసిన యపకృతులుఁ,
గొలువులోపల నులూకునిచేత మున్నుఁ । బలికించు పరుషంపుఁ బలుకులఫలము
నేఁడు [1]వెలారింతు నిలు పాటిపోక । వాఁడిమి వదలనివాఁడవు మొదల.
దుర్యోధనుండను దొడ్డపేరొకటి । శౌర్యమూలంబయి చనుదెంచె నీకుఁ
జత్తు గా." కని నాల్గుశరములు నాటి, । తుత్తుమురుగ విల్లు తూపున నఱికి
యస్త్రాంతరము దాల్ప ననువీక భయద । శస్త్రుఁడై సూతు నశ్వముల ఖండించి
పిడుగునోరనిపించు భీకరాస్త్రంబు । దొడిగి యేసిన, మూర్ఛదొరసి రారాజు
నురురోహణాచలం బొఱఁగినయట్లు । ధరమీఁద నొఱఁగినఁ, దటుకున వచ్చి
సైంధవుఁ డెడసొచ్చి సైన్యంబుఁ దాను । గంధవాహజునిఁ గేకయుల సౌభద్రు
ద్రౌపదేయులఁ దాఁకి తన బాహుబలము । [2]దీపింపఁ బెనఁగిన దేవ, యావేళఁ
జిత్రసేనుండును జిత్రదర్శనుఁడుఁ । జిత్రాక్షు పురుమిత్ర చిత్రబాహులును
నందోపనందు లెన్నఁగ [3]సులోచనుఁడుఁ । గ్రందైన రథనేమి రవములతోడ
నభిమన్యుఁ దాఁకి సాయకసహస్రములు । రభసవైఖరి నేయ, రవళి గైకొనక
యందఱ నైదును నారుబాణముల । నందంద నాటి బలారిపౌత్రుండు
[4]అర్చిన, మున్ను తన్నాజి మార్కొనిన । కార్చిచ్చుతునక వికర్ణుఁ డవ్వాఁడు
పోయినరథమును బోయిన విల్లు । నాయితంబుగఁ బూని యరుదెంచెఁ గాన
నతని నవ్వుచు భీషణాస్త్రసంతతుల । వెత గుడువఁగ నేసి విల్లు దున్మాడి
సారథి హయపంక్తిఁ జట్టలువాప । నారథికుఁడు నొచ్చి యాజి వెల్వడియె.
అత్తఱిఁ జిత్రసేనాది కుమాళ్లు । తత్తరించి వికర్ణు దశకు శోకించి
సౌభద్రుతో ఘోరసమరంబు సేయ । శోభిల్లు ద్రౌపదిసుతు లదిచూచి
కోపించి యప్పుడా కురుకుమారకుల । నాపోశనము గొన ననువు చింతించి
తాఁకిన రథముల ధరణిఁ గూల్చియును । వీఁక నొక్కొక్కని విల్లు దున్మియును
ఛత్రపతాకలు చక్కుచేసియును । గాత్రసంఘుల సాయకముల గ్రుచ్చియును
దఱిమి యెక్కిన సిగ్గుదలఁచి నీసుతులు । విఱుగక యేసిరి వీరి నందఱను.

1. వెళ. 2. దీపింప బెనగిన. 3. సుచారుండు. 4. అచ్చిన. (మూ)

అందు శతానీకుఁడగు శతానీకుఁ । డెందును దానన్నై యెగచెఁ గౌరవుల.
అతనిచేఁ దునియని యరదంబు గజము । నతనిచే గెడయని హయముఁ గాల్బంటు
వెదకిన లేదయ్యె విను శతానీకు । విదితప్రతాపంబు విశ్వమోహనము.
అంత నాతనికి సహాయులై సకల । కౌంతేయయోధులు క్రందుగా నెక్కఁ
గౌరవభటులు నాకరణి నెక్కుటయుఁ । బోరు ఘోరంబయ్యె భువనంబు లగల.
రవి యంత రణభూమి రాలినమణుల । భువనాంధకారంబుఁ బోఁగొట్టనోపు
నేనేల యని వార్ధి నిటదూఱె ననఁగఁ । దా నస్తమించె సంధ్యాదేవి పొడమ.
అంధకారంబు రజోంధకారంబు । బంధురమ్మై నేత్రపదములఁ గప్పఁ
గౌరవ పాండవ గణములు రణము । బోరన సేనాధిపులు మాన్ప మాని
కరదీపికాకోటి కరముల వెలుఁగ । నరుదెంచెఁ దమ తమ యావాసములకు.”
అని యిట్లు సంజయుం డారవనాఁటి । యనుపమ రణవిధం బర్థిఁ జెప్పుటయు
నాంబికేయుఁడు పల్కు: “నట్లు రారాజు । బంబిన భీముచేఁ బడి కడునొచ్చి
యమూర్ఛదెలిసి యెట్లాజికిఁ గడఁగె? । నుమ్మలికము మాను నొగిఁ జెప్పు.” మనిన
ననువుగా సంజయుఁ డాంబికేయునకు । వినిపించె: “నీకథ వినుము సర్వమును.
బకవైరిచే నిట్లు పటుమూర్ఛఁ జెంది । యొకభంగి రారాజు నొయ్యన దెలిసి

## భీష్మ గాంధారేయుల సంవాదము

యారాత్రి భీష్ముతో నల్లన పలికె: । “ఏరీతి చెప్పుదు మా యావు మొగ్గరము
పన్నుదు పాండవభటు లది పగులఁ । గున్నదు రెట్టిదో దైవ నిర్ణయము!
అదియును గాక బకారి మీయెదుట । నదయుఁడై నన్నింత యలజడి పెట్టె!
నిను గాని పాండవనికరంబు గెలువ । మనమున నమ్మదు మందాకినేయ!
అది బొంకు సేయ నీకభిరతి గాక । యెదిరి యెవ్వరు నీకు నింద్రాదులందు!”
అనిన నవ్వుచు భీష్ముఁడధిపతిఁ బలికె: । “నిను నుపేక్షింతునే! నేరవు తెలియ;
ఒడలు లోముకొనక నాయోపినయంత । నడపుదుఁ గయ్యంబు నలువ కానంగ.
పాండుసూనుల గెల్వ బ్రహ్మకునైన । నిండదు తపమని నీమనంబెఱుఁగు.
ఓర సేయక నీకు యుద్ధజయంబు । గోరుదు నటుగానఁ గురురాజతిలక!
వగవకు.” మనిన నవ్వుగ పాటి నృపుఁడు । నగరిలో సుఖనిద్ర ననిచి వేకువను

## సప్తమదివస యుద్ధక్రమము

బ్రయతుఁడై యాజికిఁ బయనమై తాను । రయ మొప్పఁ బోవుచో రథినీవిభుండు
మండలాకృతిఁ బర్వ మనసేనఁ బన్ని । మండలాధిపుఁ డందు మధ్యసీమమున
నిలిచి యందుఁ గుమారనివహంబు దొరల । వలసిన యెడలందు వారక నిలుప
మెఱవడి [1]నాయొష్ణ మిహిరమండలము । తెఱఁగున నాయుధదీప్తి నిండుటయు,
నటఁ బాండుసుతులు నయ్యాజికి వెడలి । భటుల నద్రివ్యూహభాతిఁ బన్నించి
తూర్యధ్వనుల మిన్ను తూఁటులువోవ । శౌర్య ప్రధానులై జయ మాత్మ నెన్ని
ప్రతిసేనఁ దాఁకి నిర్భర నిరాఘాట । చతురతఁ బోరుచో, జగదీశ, వినుము
ద్రోణుఁడందు విరాటుతోఁ దలపడియె; । ద్రోణసూతి శిఖండితోడ మార్కొనియె;
రాజు ధృష్టద్యుమ్ను రణవిద్యఁ జెనకె; । నోజతోఁ దాఁకె శల్యుఁడు మాద్రిసుతుల;
తొడగి విందానువిందులు యుధామన్యుఁ । దొడరిన, నృపకోటి దొడరె నర్జునుని.
చిత్రసేనుఁడు దుస్సేను, వికర్ణుఁ । జిత్రవైఖరిఁ దాఁకె జిష్ణునందనుఁడు.
పగగొని కృతవర్మ పావనిఁ దాఁకెఁ; । భగదత్తుఁ దాఁకె నేర్పడ ఘటోత్కచుఁడు.
పూని సాత్యకి యలంబుసు వేకఁ దాఁకెఁ; । దాను బైకొనెఁ జేకితానుపైఁ గృపుఁడు.
తొడరెను ధృష్టకేతును సోమదత్తి; । యొడరె ధర్మజుఁడు శ్రుతాయువుతోడ.
పెక్కండ్రు రాజులు భీష్మపై నడరి । రొక్కట గిరిపైఁ బయోదముల్ పోలె.
ఎక్కటికయ్య మిట్లిందును నందుఁ । దక్కక కలుగుచో ధవళవాహనుఁడు
హరిఁ జూచి యిట్లను: “ననఘ, నామీఁద । ధరణీశు లెందఱో తఱిమిరి తేర్లు.
అటు చూడుమీ మదీయాస్త్రవేగమున । నెటు వీరలగుదురో! యీవె మెచ్చెదవు.
భీష్ముఁ డొడ్డిన యొడ్డు భేదింత మనెడు । నూష్మ మెవ్వనియందు నుదయింపవెఱచె.
ఈ యొడ్డుపననమ్మి యెల్ల కౌరవులు । రాయ నోపుదురు సంక్రందునినైన”.
అని సాయకావళి నారాచమూఁక । పెనఁగొనఁ బఱపినఁ, బెకలకమ్మూఁక
బాణంబులకుఁ బ్రతిబాణంబు లేసి । బాణారిమఱఁది నంపఱవెల్లి ముంపఁ,
గురుసేన యార్పులుఁ గురురాజునవ్వుఁ । బరికించి కినిసి బీభత్సు మేఘంబు
గ్రాలి దానై చండకాండ సింధువులఁ । దేలియాడ బలంబుఁ దివుటమై నేసి
ద్విరద సంహతిఁ గూల్చి తేరుల నఱికి । తురగ పదాతులఁ ద్రుంచి తూటాడి

---

1. న యొండు. (మూ).

పఱపిన భగ్నమై బలము సర్వమును । వెఱచి భీష్మునిమాటు వేదూఱుటయును,
తానని వచ్చిన దైత్యుల కబ్ధి । లోనిచ్చుగతి రాజలోకంబునకును
అభయదానముచేసి యాపగేయుండు । విభుఁడు మెచ్చఁ గిరీటి వెసఁ దాఁకి యేయ
రాజుల గమిఁజేరి రారాజు పలికె: । " తేజంబు మీ కేల తివిచి పట్టయ్యె ?
పురుహూతతనయుతోఁ బోరాడు భీష్ముఁ । బరికింపరా బాహుబల మెన్నఁడింక ? "
అనిన సిగ్గు నరేంద్రు లాత్మఁ బాలించి । యనిమిషేశ్వర సూతి కడరి రెంతయును.
అప్పుడు గురుఁడు మత్స్యాధీశుఁ జెనఁకి । కప్పులు పడ నస్త్రకోటులు పఱపి
మఱియు విరాటుని మహితచాపంబు । శరమొక్కటను ద్రుంచి సారథి నొంప,
నతఁడు వేఱొకవింట నాచార్యువిల్లు । ధృతిఁ గేతుదండంబుఁ దేరి సారథిని
నొప్పించి గురుమేను నొప్పించి హరుల । నొప్పింప, నతఁడు కన్నులఁ [1]గెంపుదేర
గురుఁడు విరాటుని ఘోరబాణముల । విరథునిజేయు, వేవేగ నానృపతి
శంఖుని తేరెక్కి శంఖుండుఁ దాను । పుంఖానుపుంఖాస్త్రముల గురునేయ,
దొడ్డనారసముల ద్రోణుఁ డా శంఖు । నొడ్డెల్లఁ గొనియాడ [2]నురము నాటుటయు,
విల్లునమ్ములు జాఱవిడుచుచు నతఁడు । త్రెళ్లె మత్స్యబలంబు దీనులై పఱవ.
కొడుకిట్లు చావఁ గన్గొని విరాటుండు । వడిఁ బాఱె సీయోధవర్గంబు లార్వ.
అట్టిచోట శిఖండి యాచార్యసుతుని । గట్టి ఫాలముచాయ కాండత్రయంబు
నాటిన, నతఁ డల్గి నాల్గింటఁ బడిట । మూఁట నేడింటను ముమ్మూఁట నతని
తురగ కోదండ కేతుచ్ఛత్ర సూత । హరణంబు చేయు, వాఁ డరదంబు డిగ్గి
పలకయు వాలును బాహుద్వయమున । వెలుఁగ ద్రోణజుఁ డేయు విశిఖంబులెల్లఁ
బలకచే జడియుచుఁబఱతేర, నితఁడు । పలక యారమ్ముల భగ్నంబు చేసి
వానిచే వెలుఁగొందు వాడి పట్టెంబు । పూని రెండుగ బాణములచేత నఱికె.
నఱికి యంతటఁ బోక నవవిశిఖములఁ । దెఱవపుట్టగు వాని దేహంబు దూఱ
ద్రోణజుండేయ నత్తునక శిఖండి । పాణి నాయుధముగాఁ బట్టి మంత్రించి
వైచిన, నది నుంత వ్రయ్యలు గాఁగ । నాచార్యసుతుఁడేసె నధినాథ, వినుము.
అపుడు భీష్ముఁడు నవ్వ నాజిచాలించి । ద్రుపదజుఁ డొండొక దొర తేరి కరిగె.

1. గప్పు. 2. నురుము. (మూ).

## ధృష్టద్యుమ్నుచే దుర్యోధనుఁడు విరథుఁడగుట

పాండవ సేనాధిపతికి రాజునకు । భండనం బొదవుచో బాణాలవాన
యురు శింజినీ ఘోష మురుములు గాఁగ । గురిసె రక్తంబు వాఁగులుపట్టి పాఱ.
అట్టివర్షంబులో నధినాథు విల్లు । నట్టన నడిమికి నఱికె సైన్యపుఁడు.
అతఁడు వేఱొకచాప మందకమున్న । శిత[1]భల్లమున సూతు శిర ముత్తరించి
గొడుగును బడగయు ఘోటకంబులను । గెడపెఁ, గురురాజు ఖిన్నుఁడుగాక
పలకయు వాలును బట్టి యాక్షణము । యిలకు దాటి విరోధి కెదురుగా నడవఁ,
జయ్యన పఱతెంచి శకుని యవ్విభుని । నయ్యెడఁ దొలఁగించె నర్థిఁ దేర్చి.
అట నలంబుసునకు హరిసోదరునకుఁ । కటువిశిఖంబుల బోరసైనప్పుడు
సాత్యకి ధను వర్ధచంద్రబాణమున । దైత్యుండు దునుమాడి [2]తనవేరు వాడి
వాలమ్ములను వృష్ణివరుశరీరమునఁ । గీలింపఁజొచ్చినఁ గినిసి సాత్యకియు
నొండొకవింట దైత్యుని శరాసనము । ఖండించి వానియంగము లుచ్చిపాఱఁ
బాఱమ్ము లెనిమిది పఱప రాక్షసుఁడు । కోఱల దావాగ్ని గుములుకొనంగఁ
దనమాయ గైకొని దశదిశావీధి । ధనువులు దీపింప దారుణాస్త్రముల
హరిసోదరుని గ్రువ్వ నా మాయలెల్ల । శరవహ్నిఁ గాల్చి రాక్షసుఁ జిక్కుపఱచి
పాఱదోలిన శినిప్రభు పరాక్రమము । మీఱి కీర్తించిరి మింటివారెల్ల.
వాయుజుతోఁ గృతవర్మ సంగరము । చేయ నప్పటివాడి చెప్ప నక్కజము.
వెస నేదు పెరిగిన విధ మిర్వురకును । నొసపరియై యుండు నుగ్రబాణముల.
అంతఁ జేమిగిలి బకారి యవ్వీరు । నంతఁ జంపి హయాళి నటమున్న చంపి
యరదంబు [3]విల్లు సాయకవహ్నిఁ గాల్చ । బిరుదు వాఁడితనానఁ బెనఁగరాదనుచుఁ
దన పరాక్రమముఁ గ్రోధముఁ గట్టిపెట్టి । మొగలార్వఁ గృతవర్మ మొగమీఱకపోఁడె.
మన కరిఘటల నమ్మారుతాత్మజుఁడు । తన తేరు పఱపి మోఁదఁగవచ్చె." ననఁగ
నమ్మహీపాలుఁ డిట్లను సంజయునకు : । "నమ్మి కూర్చుంటి రణస్థలి వినఁగ ;
కర్ణశూలములుగాఁ గౌంతేయ జయము । వర్ణించెదవుగాని వాఙ్మాత్రమైనఁ
గురురాజువిజయంబు గొనియాడవైతి ; । గురు భీష్మ శల్య ముఖ్యులు నీకుఁ బగయె ?"
అన విని యతని కిట్లనియె సంజయుఁడు : । "మన యోధులెన్న సామాన్యులుగారు ;

---

1. ఫల్లమున సూతి. 2. తను పేరు దాఁటి. 3. లిట్లు. (మూ).

తమయోపుకొలఁది యుద్ధమునడపుదురు ; । వినుతసైన్యముఁజొచ్చి వీఁకఁబొఱుదురు ;
జలధిఁజొచ్చిన యేర్లచందమై రూపు । దెలియరాకుందురు దేవ, మీమొనలు.
ఇంతయు నీకృతం బేమనఁగలదు ? । సంతసింపక విను సమరక్రమంబు.
విందానువిందులు వెస నవంతీశు । లందు యుధామన్యు నవలీలఁ దాఁకి
విరథులై యతనిచే విండ్లును విఱిగి । శరములు గాడి జర్జరితులై చనిరి.
భగదత్తుఁ డేనుఁగుపై వచ్చి రిపులఁ । బగులఁ ద్రొక్కించుచోఁ బాఱెడు బలము
నదివాఱ నడ్డమై నగమజ్జలంబుఁ । గుదురుకొల్పినమాడ్కిఁ గుణి ఘటోత్కచుఁడు
ఆధారమై నిల్పి యాహాస్తినయన । వీధికి సింహమై వీఁటఁ దోఁచినను,
భీతి నక్కరిరాజు పెడమొగంబిడిన, । వాతూలపౌత్రుఁ డావైపునఁ జొచ్చి
బాణాష్టకమునన భగదత్తు నేయఁ । బ్రాణంబు తూలియుఁ బడక యయ్యసుర
తలచూప కొదిఁగెడు దంతికిఁ గాక । వలకారమున నేయు వైరికిఁ గాక
సోమరియయ్యును సునిసితాస్త్రముల । భీమజు నొప్పింప, బీరువోకతఁడు
చామరంబులచేత సవరణలైన । తోమరంబులు నైవఁ దొడ్తొన వాని
నరకతనూజుండు నఱికి యాదైత్యు । విరథుఁగా బహుబాణవితతు లేయుటయుఁ,
బాఱక దైత్యుం డపారవైచిత్రి । జాఱక యొకశక్తి సంధించి వైవ,
భగదత్తుఁ డది త్రుంచి బహుసాయకములు । తెగగొని యేయ దైతేయుండు బెగడి
నముచి వజ్రాయుధునకుఁ బాఱినట్లు । సమరసన్నాహంబు చాలించి పాఱె.
పాఱిన నద్దైత్యబలము నల్దెసలు । దూఱెఁ గౌరవసేన దొరఁకొని యార్వ.
కవలు శల్యునిఁదాఁకి కాండవర్షములు । నవభంగిఁ గురియుచో నగుచు శల్యుండు
నకులు తేరొకకోల నడిమికిఁ దునుమ । భ్రుకుటి భీమాస్యుఁడై బోరన నతఁడు
సహదేవు [1]తేరెక్కి చండనారాచ । మహనీయవర్షంబు మామపైఁ గురియ,
శల్యుఁ డొక్కమ్మున సహదేవు విల్లు । కల్యంశజుఁడు మెచ్చ ఖండించి యార్చె.
నకులుఁ డప్పుడు దొడ్డ నారసంబొకటి । వికటార్కరుచి [2]మీఱ వేగ సంధించి
యందుఁ గొంతయు రక్త మంటక మున్న । వింసు ఱొమ్మునఁ గాడి వీఁపున వెడల
నేసిన మూర్ఛిల్లి యెన్నఁడో చేవ । పాసిన పీనుఁగుపగిది శల్యుండు
వ్రాలినఁ దేరు సారథి తొలుకొనుచుఁ । జాలదూరము పోవ, శంఖంబులొత్తి

1. తేరికి. 2. మీఁదు. (మూ).

కవలు నీసేనల[1]గము లవియంగ । శివమెత్తి చేసిరి సింహనాదములు.
మిత్రుఁడప్పుడు దేవ, మింటి కెన్నడుగు । సూత్రపట్టిన యట్లు శోభిల్లు చుండ
దళములు తమనీడ దాగు త్రొక్కుచును । జలమునఁ బోరుచో శమననందనుఁడు
ఆయువు దలఁక శ్రుతాయువు మేప । సాయక నవకంబు చతురుఁడై పఱప,
వాఁడవి మరలించి వాలమ్ము లైదు । పోఁడిమి నారాజుఁ బొందఁ గీలించి
విల్లు ద్రుంచిన నొండువింట నారాజు । త్రెళ్ళ నేసెను వాని తేరి గుఱ్ఱముల.
హరుల నిట్లు వధించి యంతటఁ బోక । ధరణీశుఁ డతని కేతనముఁ జాపంబు
నఱికి వరాహకర్ణముఁ బోని యలుగు । పఱపె వానియురంబు పఱియలు వాఱ.
అంత వేఱొక తేరి కలనడ వచ్చి । యంతకాత్మజుని శ్రుతాయువు తాఁకి
వెండియు విరథుఁడై విల్లువోనాడి । కాండంబు లెక్కక (కడువడిఁ) బాఱె.

## చేకితాన కృపాచార్యుల ద్వంద్వయుద్ధము

ఉబ్బును ద్రుక్కును నొగి నిందు నందు । [2]నుబ్బ శ్రుతాయువు నోరగినచోటఁ
జేకితానుఁడు [3]కృపుఁజెనకి బాణముల । నాకుల పఱపుచో నతఁడు కోపించి
వానిగుఱ్ఱంబుల వధియింపఁ జేకి । తానుండు కృపు తేరు ధరఁగూల్చి యార్చి
వెనుకకు లంఘింప, వెంటనె కృపుఁడు । చని వానిఁ బదియారు శరములు నాట,
వాఁడొక గదవైచి వడిఁ గృపాచార్యు । వాఁడిమిఁ బాపుచో వదలక యతఁడు
నట్టిగదాదండ మవలీలఁ దునుమఁ । జెట్టతనంబునఁ జేకితానుండు
నరదంబుపైనున్న యసి యశ్రమమున । ధరియించి కృపునిపై దాఁటుకొనంగ,
నాకృపాచార్యుండు నసిపాణియగుచుఁ । జేకితానుని వ్రేయఁ, జేకితానుండు
కృపునేయ నిరువురి కీలాలజలము । తపనబింబముదాఁక ధారలై యెగసె.
నిట్టి వ్రేటులచేత నిరువురు మూర్ఛ । పుట్టి మేదిని వ్రాల బోరన వచ్చి
కరకర్షుఁడను రాజు ఘనుఁ జేకితానుఁ । బరఁగ నగ్గాంధారపతి కృపాచార్యు
ధృతిఁ బట్టి తమతమ తేరులమీఁదఁ । జతురులై యిడుకొని చనిరి భూపాల!
తెగువ భూరిశ్రవోధృష్టకేతులకు । మగఁటిమిఁ గయ్యంబు మఱి గల్గుచోట
నొడళ్ళుల నేతూపు నోపదు కాడ । నడుమనే తమలోన నజ్జువుఁగాని.

---

1. గవల దీయంగ – శివమతి. 2. సుబ్బి సుతాయువు సారగిన. 3. నృపు. (మూ)

ఒక యింద్రధనువర్థి నుదయించునప్పుడు । ప్రకటమౌ వృష్టి కుంభద్రోణలీల ;
ధరనింద్ర ధనువులు తగ కెంపు వాడువ । శరవృష్టి యెట్టిదో శక్యమా పొగడ !
ధీరత నిటువోరి ధృష్టకేతుండు । భూరిశ్రవుని బాణముల కోడి పాఱె.
నొగులంగఁ జిత్రసేనుఁడు వికర్ణుఁడును । దగ యువరాజు పార్థుఁ దాఁకుచోట
నరసూనుఁ డీరాజనందనత్రయము । విరథులఁ గావించి విశిఖవేగమున
మృతులఁజేయఁ దలంచె మీఁదట భీము । ప్రతిన యెట్లోయని పరికించెఁ గాని.
ఆ తెఱంగున వాజి నభిమన్యుచేత । నీ తనూజులు చాల నిక్కృతి నొందుటకు
వగచి భీష్ముఁడు కూడ వచ్చి వారలకుఁ । దగు రథత్రయ మిచ్చి తాను ననేక
రాజవర్గములు నింద్రజభ్రాతుతోడ । వాజి సేయఁగఁ బార్థుఁ డావలినుండి
పలికెఁ గృష్ణుని: “ రణప్రౌఢు లీ నృపులు ; । తలఁప బాలుఁడు సుభద్రాతనూభవుఁడు;
ఆపగేయప్రతాప మాజిభీకరము ; । వేపోయి సాధింతు వీరి నందఱిని.
పెక్కండ్రు యోధులు పిన్నవానికి । నొక్కటఁ గదిసిరా రుచితమె యకట ?
యటఁ దేరు గదలింపు. ” మనినఁ గృష్ణుండు । పటు నేమిరవము భూభాగంబు నిండఁ
దేరట నడపుచోఁ, దేఱి సుశర్మ । యారథికుని త్రోవ కడ్డ మేతెంచి
యర్జును మార్కొన్న, నతఁడింత నవ్వి : । “ నిర్జింపవలెనన్న నీవెంత నాకు !
నొంటి వచ్చితి సేననొకచోటఁ బెట్టి ; । బంటవై నిలువుమీ పాఱినఁగాదు. ”
అని ఘోర శరవృష్టి నాతని నతని । ఘనసూతు రథతురంగములఁ గప్పుటయు,
గతిగూడి యంతలోఁ గౌరవసేన । శత లక్షశతములై శక్రజుఁదాఁకి
వెసనేయ నవ్వాసవికిఁ దలకడచి । పసగల పాండవభటు లేఁగుదెంచి
దొరసి కౌరవసేనతోఁ దలపడిన । ధరణీశ, మిగుల సందడి కయ్యమయ్యె.
ఆయాజి నెసఁగు రజోంధకారమునఁ । గాయు గూబలఁబోలె ఘోరఘూంకృతులు ;
అమిపార్థము గ్రద్దలాడెడి ననఁగ । నామీఁదఁ బిల్లదీపై యట్టలాడె ;
ఎఱ్ఱరేగడినేల యేరులనంగ । [1]వఱ్ఱోడి నెత్తురు వాగులై పాఱె.
గాండీవి రాచమూఁకల కప్పుడుఱికి । శుండాలతతిని వ్రచ్చు మృగేంద్రుభాతిఁ
గేతనంబులు వ్రాల్చి కింకిణుల్ నఱికి । సూత రథ్యంబులఁ జూర్ణంబుచేసి
మహీ నాతపత్రచామరకోటిఁ గూల్చి । బహుభంగి నస్త్రచాపముల నుగ్గాడి

1. వఱ్ఱుడి. (మూ)

వర్మంబు లిటఁ జించి వసుధేశు హృదయ । మర్మంబు లస్త్రసంపదలచే గ్రుచ్చి
చించియు నొంచియు జీవనాశములు । త్రుంచియుఁ బటహాదుందుభు లణంచియును
వంచియు వ్రాల్చియు వ్రక్కలించియును । బంచశైలె పాఱంగఁ బరసేనఁ దఱిమి
మడుఁగుచొచ్చి కలంచు మాతంగమనఁగ । నడరి పోరాడుచో నపరాహ్ణమయ్యె.
అంత సన్నద్ధుఁడై యా త్రిగర్తేశుఁ । డెంతయుఁ బార్థున కెదిరించుచోట
నము లందుఁ ద్రైగర్త చక్రరక్షకులు । రమణ ముప్పది రెండు రథములవారు
దేవేంద్రనందనుఁ దివిరి తాఁకుటయు । నా వీరుఁడును మందహాసంబు చేసి
యరువదినాల్గు సాయకముల వారి । శిరములఁ దున్మివైచిన, సుశర్మ్ముండు
కూలిన భటులఁ గన్గొని యల్గితేరు । తోలించి పార్థునితోఁ దలపడినఁ,
జూచి యాతనికెడచొచ్చి శిఖండి । యేచి పోరాడె ననేకభంగులను.
పార్థుఁడప్పుడు తనపైఁ బూనివచ్చు । పార్థివేంద్రుని సింధుపతిని గైకొనక
కడఁకతో వానిఁ గ్రీఁగంటఁ జూచుచును । నడచె భాగీరథీనందను మీఁద.
అదిచూచి ధర్మజుండటు తనువెనక । వెదకి వచ్చిన మద్రవిభునిఁ గైకొనక
సహజన్ములగు వాయుసంభవ నకుల । సహదేవయుతము వాసవికిఁ దోడగుచుఁ
దానును నడచి యత్తటినీకుమారు । పై నెక్కుటయుఁ జూచి పన్నగధ్వజుఁడు
సైంధవాశ్వత్థామ శల శల్య కృపులు । బంధు భావనఁ గొల్వఁ బఱతెంచి యార్చి
యాపగా సుతునకు నటనెడసొచ్చి । యాపగఁ బాండుపుత్రావళిఁ దాఁకి
వెఱవక పోరుచో, వినుము శిఖండి । పఱతెంచి భీష్ముపై బాణంబు లేసి
యార్చిన లెక్కసేయక వాని భీష్ముఁ । డోర్చి యొండుదలంప నొల్లక యపుడు
తగ [1]నాచికొన్న చందమున విల్నఱికి । బెగడించుటయు, వాఁడు బీరంబు వదలి
భూతంబు సోఁకినబుద్ధి నుండుటయు, । నాతఱి ధర్మరా జల్లంతఁ గవిసి
యితని పంతపుమాట లెత్తిపెట్టుచును । గతిగూర్చి భీష్ము డగ్గఱఁ బురికొల్పఁ
దానును గడఁగి మద్రపుఁడు భీష్మునకుఁ । బోసీక పాంచాలపుత్రు నదల్చి,
"మూడగాఁడవు నిన్ను దోడరుట దోష; । మీఁడుగాని రణంబు లేల మీకిట్లు?
అదె పాఱు." మని యొకయస్త్ర మేయుటయు । నది నడుమనె త్రుంచి యాశిఖండియును
వారుణాస్త్రంబేయ, వారణకొఱకు । సైరణమతి లేక శల్యుండు నలిగి

1. నార్చు. (మూ).

తవిలి యట్టి శరంబు తానునేయుటయు । నవి రెండు శాంతంబులయ్యెఁ బోరాడి.
అపుడు భీష్ముండు ధర్మాత్మజుఁ దాఁకి । విపుల కేతువు విల్లు విఱిచి యార్చుటయు,
మదసింహభాతి నమ్మారుతాత్మజుఁడు । గదగొని రథము దిగ్గన డిగ్గనుఱికి
గజముపై గజవైరి గవిసినయట్లు । గజపురాధిపునిపైఁ గవియుట చూచి
యెడసొచ్చి సైంధవుఁ డేనూరు తూపు । [1]లడరించె మెఱుఁగుల యాటపట్టుగను.
వడముడి గద నట్టి వాలమ్ములెల్ల । జడియుచుఁ గదిసి యాసైంధవు తేరి
తేజులఁ జదియమోఁదిన వాఁడుతొలఁగి । యాజి వేఱొక్కని యరదంబు నెక్కె.
అంతటివాని కిట్లలజడియైనఁ । జింతా విషణ్ణులై చిక్కిన దొరలు
ధృతి సేయ నవి గోష్పదప్రాప్తిఁ గైకొనక । ... ... ... ... ...
వడముడి గదత్రిప్పి వాని వైవంగ । వడి నది పిడుగుకైవడి వచ్చుటెఱిఁగి
యిది తనమీఁదనే యేతెంచు ననుచు । నొదిఁగిరి నీయోధు లొడళులు వడఁక.
అట్టిచోఁ బలకయు నడిదంబుఁ గొనుచు । గుట్టుపోనాడి నీకొడుకుఁ గుఱ్ఱయును
అరదంబు డిగి పాఱ, నాగద వాని । యరదంబు సారథి హరుల నుగ్గాడె.
చెడి యిట్లు పాఱిన చిత్రసేనునకు । [2]నెడయిచ్చెఁ దెంపరైయిట వికర్ణుండు.
ఆనహోయంబున యమసూను విరథుఁ । జేసి గాంగేయుఁ డాక్షితిపుని మేను
నంపవెల్లువ ముంప నతఁడు ధైర్యమునఁ । గంపింప కొక శక్తి కరమునఁ దాల్చి
నదికుమారుని వైవ నడుమనే దానిఁ । బది తునియలు చేసెఁ బ్రభువ, నీతండ్రి.
అంత మాద్రేయుని యరదంబు మీఁది । కంతకాత్మజుఁ డేఁగ నతఁడు వెన్నాడి
పోయి మాద్రేయుని బొదివి మహోగ్ర । సాయకంబుల నొంపఁ జలమొప్ప నృపతి
యా శాంతనవుతోడి యాహవక్రియకు । నాశాంతనృపుల రండని చేయి వీవఁ,
గౌంతేయసేనలోఁ గలరాజు లెల్ల । నంతకాకారులై యార్చుచుఁ గడఁగి
యుదయవేళఁ బతంగు నుగ్ర రాక్షసులు । పొదివినగతి భీష్ముఁ బొదివి యేయంగ
రాజులఁ బొరిగొన్న రామబాణములు । యోజించుకొనిన మహోగ్రుండు గాన
నట్టి బాణావళి నా రాజసమితి । గిట్టి వధించు గాంగేయునితోడ
ననిచేయఁ గవియ డాయను వ్రేయఁ జెనక । మొనకట్టలేక భూముల రాజులెల్లఁ
జిక్కులు వడి యొండు చేష్టలు మాని । వెక్కస వడఁ బాండవేయులఁ జూచి

---

1. లెడలించె. 2. నడయిచ్చి దెంపరై. (మూ)

ఖండితారాతి శిఖండి యిట్లనియె : "భండన పాండిత్య బలశాలి నేను ;
ఈవృద్ధు నాకెంత ! యాక్షేపింపు." డనుచు । దేవవ్రతుని సన్నిధికిఁ దేరువఱవ
నిష్టభోజనములో నీఁగఁ గన్నట్లు । దృష్టింప రోసి యాదిత్యునిఁ జూచి
నారాయణస్మరణము చేసి తొలఁగి । చేరి సృంజయ సేనఁ జెండాడఁ దొడఁగె.
అంత ధృష్టద్యుమ్నుఁ డాచార్యబలము । నంతకాకారుఁడై యణఁపఁ జొచ్చుటయు
విందానువిందు లవ్వీరునిఁ దాఁకి । క్రందించి రతని సారథిని గుఱ్ఱముల.
ఈరీతి విరథుఁడై యితఁడు శైనేయు । తేరెక్క, సైన్యంబు దృష్టించి నృపతి
యిరువురికై తమ యెల్లసైన్యములఁ । గరసరోరుహసంజ్ఞ గలయఁ జేయుచును
దానును దఱిమిన, ధార్తరాష్ట్రుండు । సేనల కారీతిఁ జేసన్న చేసి
తమ్ములుఁ దాను మందాకినీసుతుఁడు । నమ్మూఁకపై నెక్క నంతలో, నరుఁడు
శర బడబానల జ్వాలాముఖమునఁ । గురుసైన్యవారాశిఁ గ్రోలఁజొచ్చుటయు,
గురుఁ డడ్డపడి బాణకోటి నపార్థు । హరులఁ గేతన [1]సూత హరులఁ గప్పుటయు,
భయమేది యాద్రోణుప్రాపున నెక్క । రయ మొప్ప నపుడు కౌరవసేనలెల్ల.
ధర్మనందనుఁ డంతఁ దనసైన్యములను । నర్మిలి నెలుఁగించి యాజికి నడుప
నిరువాగుఁ బెనఁగి యనేకమార్గములఁ । బోరిపోరిఁ బోరుచో భూకంపమయ్యె.
ఇది యిట్లు గంపింప నెంత వ్రేఁగగునో । మొదలి పాముననని ముచ్చట చెప్పఁ
బాతాళకుహరంబు ప్రాపించె ననఁగ । వే తోయనిధిఁ గ్రుంకె వేఁడివెలుంగు.
సంజచే మిగులఁ గెంజాయ వెలుంగ । నంజుడురాసులు నసలు భూతములు
బహుభంగిఁ దమలోనఁ బాళులు తెగక । కుహనారణంబు మాఱొక్కని చేయుటొప్పె.
కొఱప్రాణములతోడఁ గూయి కూయనఁగ । వెఱవక నక్కలు వెడ వీనుఁగులను
ఈడువ వారివారే తెంచి పెనఁగు । లాడెడు కలకలం బం దుగ్రమయ్యె.
ఇట్టిపోరునఁ ద్రిగర్తేశాది నృపులఁ । బట్టి సాధించిన ప్లవగకేతనుఁడు
సైంధవాది నృపాలసమితి సాధించి । బంధురోన్నతి వచ్చు పవనసూనుఁడును
దమయన్న సన్నిధిఁ దలసూపుటయును । సమర మానృపతియుఁ జాలింపఁ బనిచి
సేనలఁ దిగిపించి శిబిరంబుకడకు । నాననంబులఁ దెల్వి యలుగులువాఱ
... ... ... ... ... । ... ... ... ... ...

---

1. సూత్న. (మా)

ఇద్ధయుద్ధము నేఁటి కేఁడునాళ్లయ్యె । బద్ధవైరుల బోర పట్టలేదనుచు
రయమొప్ప వచ్చి యారాత్రి వేఁగించి । పయనమై మఱునాఁడు భానూదయమున

## అష్టమదివస యుద్ధక్రమము

రణభూమిఁ జొచ్చి కూర్మవ్యూహ మమర । గణము నుతింప గంగాసూతి వన్నె.
కౌంతేయులును నట్టిక్రమమున వచ్చి । యంతంత వివిధతూర్యములు ఘోషింప
శృంగాటకవ్యూహసృష్టి సేనాని । యంగద సృజియింప నాజి గైకొనిరి.
ఇట్లు సన్నద్ధమై యిరువాగుఁ గదిసి । ముట్టి సంజ్ఞాభేరి మ్రోయించి యపుడు
తలపడి దోర్దండ తాండవితాసి । కలిత ఘట్టనల సంగ్రామోర్వినెల్లఁ
బొగలేని మంటలు పుట్టి తచ్ఛిఖలు । గగనమండలిఁ బ్రాఁకఁ గమలాప్తుఁజోఁక
వెదక దివ్యులమూఁక, [1]పృథివి యక్కాఁకఁ । గదల, గాడ్పెడదాఁక గరళమై వీఁకఁ
బోరాడునెడ సైన్యములఁ బుట్టి ధూళి । ధారుణిఁ గప్పు రక్తము లది విప్పు.
అపుడు భీష్ముండు యోధావళిఁ గడచి । తపనీయ రథమహాధ్వని దిక్కు లద్రువఁ
గాంతేయసేనపైఁ గవియ నాసేన । సంత విచ్చినయట్లు జల్లన విచ్చి
తెరువులు పట్టుచో దేవ, వాయుజుఁడు । శరచాపహస్తుఁడై సాహసస్ఫురణఁ
దాత నెదిర్చి శస్త్రంబుచే నతని । సూతు వధించి యార్చుటయు, గుఱ్ఱములు
వెస భీష్మునరదంబు వెనుకకీడ్చుటయు । దెసచెడి పాఱె నద్దెసల నీమొనలు.

## భీముఁడు, సునాభుఁ డాది కురుకుమారుల నుఱుమాడుట

అట్టిచోట సునాభుఁ డను నీకుమారుఁ । డిట్టలంబుగ భీము నెక్కటిఁ దాఁకి
ప్రళయాగ్ని శిఖలతోఁ బ్రతిమైన తూపు । లెలమి నేసిన భీముఁ డితనికి నల్గి
భల్లంబు పట్టి నీపట్టి శిరంబు । డొల్లనేయుటయు, నిష్ఠుర గర్వరేఖ
నతని సోదరులు బహ్వాశియన్వాఁడు । ధృతిఁ గుండధారుఁ డాదిత్యకేతుండు
నపరాజితుఁడు విశాలాక్షపండితకు । లుపమింపరాని మహోదరాఖ్యుండు
నను కుమారకు లేడ్వు రనిలజుఁ దాఁకి । సునిశితాస్త్రంబుల సోనగాఁ గురియ,
నతఁడు కోపాంధుఁడై యఱనెలకోలఁ । బ్రతినకు లోనైన బహ్వాశిఁ దునిమి,
క్షురికాముఖంబునఁ గుండధారాఖ్యు । శిరము తాళీఫలస్థితి నుత్తరించి,

1. పృథివియె కాక. (మూ)

విపుల నారాచంబు వెసఁ బ్రయోగించి । యపరాజితుని శిర మట్టితోఁ బాపి,
భ్రాంతి నారాచంబుఁ బఱపి యాదిత్య । కేతు గుండియ పెల్లగించి ధరించి,
చండనారాచ విస్రంభపాతమునఁ । బండితకాఖ్యుని ప్రాణంబు గెడపి,
యఱిముఱిఁ [1]బాఱవాఁతమ్ము ఘోరముగఁ । బఱపి విశాలాక్షు ఫాలాక్షుఁ గూర్చి,
[2]నేరుపు దైవాఱ నిశిత క్షురప్ర । ధార మహోదరు తల నేలఁగూల్చి,
యార్చిన బెదరి కుమారాళియెల్లఁ । గార్చిచ్చుఁగన్న మృగంబులై చనిరి.
"కొలువులో నితఁ డాడుకొన్న ప్రతిజ్ఞ । తలకూర్ప కేల యంతట జాఱవిడుచు!
విదురుని పలుకులు వినిన నేఁడిట్టి । సదమద మొదవను; జనపతి చెఱిచె;
కొడుకు దుర్నీతియే గొనియాడి యాడి । కడుపడిఁ గులహాని గావించుకొనియె."
అని తమలో మాటలాడిరి ప్రజలు ; । వినవయ్య నీవిట్టి వృత్తాంత మెల్ల.
వాయుజుచేత దేవర, చాల నిట్లు । పోయినతమ్ముల భూపతి చూచి
చాల దైన్యము నొంది సైనికోత్తముల । నాలోన భీముతో ననిచేయఁ బెట్టి,
గాంగేయుఁ గదిసి గద్గదకంఠుఁడగుచు । నింగితంబు గలంగ నిట్లని పలికె:
"తాత, బకారి నాతమ్ముల నెల్లఁ । జేతుల తీఁటవోఁ జెండాడునపుడు
చూచుచుండితి గాని చొర వడ్డపడవు ; । నీ చేత నైనంత నెఱపవు కడిమి;
వగలేదు శోకంబువాఁడవు గావు; । బెగడ కెల్లారిఁ జంపించువేడుకయె!
చెల్లఁబో నన్ను పేక్షించితి గాక । బల్లిదుండవు నీకుఁ బాండవులెంత!
భావింపఁ గౌంతేయ పక్షపాతంబు । మీ విద్యగాదె! నమ్మినవాఁడు చెడఁడె!
నియతి నాఁడేడ్వురు నేఁడేడ్వురకట! । ప్రయమైరి తమ్ములు వాయుజుచేత.
సంధిలో హరిబుద్ధిఁజనని యాతప్పు, । గాంధారివాక్యంబు గడచినతప్పు
తప్పునే నాకు వృథాగర్వి." కనుచు । ... ... ... ... ...
నేడ్చినఁ దోఁడేడ్చి యెలమిఁ బాంచాలి । నీడ్చిన రాజుతో నీ భీష్ముఁ డనియె:
"ఇది పూర్వకాల మనేకభంగులను । జమకొప్ప నీతోడఁ జాటనే పుత్ర!
మారుతి కగపడ్డ మనకుమారకులఁ । బోరిలో విడిపింపఁ బోలదెవ్వరికి ;
దీనికి శోకింపఁ దీరదునీకు ; । మానుప వచ్చునే మఱి యీశ్వరాజ్ఞ!
నీవు వీరస్వర్గ నిర్వాహసుఖము । [3]భావింపు మధముగాఁ బలుకులు మాను.
నేను నుపేక్ష నాయిచ్చలో లేక । పూని పాండవులతోఁ బోరాడువాఁడ.

1. బోక వా. 2. కేతువు. 3. భావింప ధనముగా. (మూ).

జయమగుటయుఁ బరాజయమగుటయును । నియతి దైవవశంబు నీకోర్వవలయు
ననిపల్కె." నని చెప్ప నాంబికేయుండు: । "మనకేటి జయమింక మరణమే జయము.
రోహణ [2]వింధ్య మేరువులఁ గైకొనని । మోహాపుఁ గొడుకుల ముద్దుప్రాయమున
బలియిచ్చుచున్నాఁడఁ బవనసూనునకుఁ । దలఁప నాబ్రదుకేల దైవికంబేల.
గురుఁడు భీష్ముండును గురుకుమారకుల । దురములోఁ గాపాడ దొరకమి యెట్లు ?
జనని చెప్పినబుద్ధి జనకునిబుద్ధి । వినని దోషమునుమీ విషధరాంకునకు.
తడయక నేనింకఁ దలపోయుటెల్లఁ । గడచన్న నీళ్ళకుఁ గట్ట యిడ్డట్లు.
ఆవాక్యకథలెల్ల నట్లుండ నిచ్చి । యీవు సంగరభంగి నెఱిఁగింపు మింక.
ఆజిఁ గుమారు లిట్లగుట వీక్షించి । యేజాడఁ బని నిర్వహించె భీష్ముండు ?
తెలివి యేరీతి సంధిల్లె రాజునకు ? । బలిమితోఁ గృపుఁడెట్లు బవరంబుచేసె ?
కలశజుండేలావు గావించె ?" ననినఁ । బలికె సంజయుఁడు భూపాలశేఖరుని :
"అప్పుడు భీష్ముండు భయంకరాకార । విపులాట్టహాసుఁడై వెస భీముమీఁదఁ
దేరు దోలింప నత్తీవ్రత చూచి । దారుణాటోపుఁడై ధర్మనందనుఁడు
పురికొల్పఁ బాంచాల పుత్రశిఖండి । హరిసోదరులు భీష్ము నరికట్టుకొనిరి.
అట మున్న పతియాజ్ఞ ననిలజుమీఁదఁ । దిటముమై యెక్కిన దొరల నిందఱిని
ద్రౌపదిసుత చేకితాన మత్స్యపులు । నాపార్థుఁడును గూడి యరికట్టుకొనిరి.
కవలు హైడింబుఁడు గాండీవికొడుకు । నవనీశుతమ్ముల నరికట్టుకొనిరి.
ఇత్తెఱంగున యోధులిందఱు మూఁడు । మొత్తంబులై కయ్యములు చేయుచుండఁ
బాంచాల బలములపైఁ గలశజుఁడు । సంచితకోపుఁడై శరవృష్టి గురియఁ
బండి కోయఁగనైన పైరుపై మొగిలు । కుండతో జడివాన గుప్పినట్లుండె.
వడముడి గాంధారవల్లభు కరుల । బెడిదుఁడై గదఁ బ్రేయఁ బెకలి యా ఘటలు
గట్టి చీఁకటిగుంపు కమలాప్తకిరణ । ఘట్టనఁ జెడిపోవుకరణి రూపడఁగె.
తగఁ జొచ్చి గుఱ్ఱపుదళములఁ గవలు । తెగ వేయఁ దునుకలు తెట్టువగట్టి
వాఁవిరి రక్తంబు వాగులై పాఱఁ । ద్రోవఁ బోరాదు తేరులకు యోధులకు.

### ఇరావంతుఁడు గాంధారసతులఁ జంపి యలంబుసునిచే మృతుఁడగుట

అప్పు డిరావంతుఁడను క్రీడితనయుఁ । డొప్పఁ దొల్లియులూచి కుదయించినతఁడు
తురగ సందోహంబుతోడఁ దానొక్క । తురగరత్నము నెక్కి దోర్దండ చండ

కరవాలుఁడై చొచ్చి కౌరవభటులఁ | దరమిడి ఖండించుతఱి వానిమీఁద
శకుని సోదరులైన శర్మవంతుఁడును | శుకుఁడు నార్జవుఁడు గజుండును వృషుఁడు
వడి గవాక్షుండను వాఁడు నశ్వముల | బెడఁగుతోఁ గరవాలభీషణులగుచు
రారాతిఁ దాఁకిన రవళిఁ దాఁకుటయు | మీఱి ఖడ్గాగ్నులు మెఱసె దిక్కులను.
శతముఖపౌత్రు నశ్వములు గాంధార | పతుల యశ్వముల నేర్పడఁ దలపడిన
నిత రేతరము చేయు హేషితంబులకుఁ | బ్రతి హేషితములిచ్చె భానుగుఱ్ఱములు.
అంకవన్నియలతో నంకవన్నియలు | పొంకముగల కళ్ళెములకుఁ గళ్ళెములు
బాహులు బాహులు బంధనలైన | సాహసింపఁగరాని సందడి యయ్యె.
రాతులు తమలోన రణవిద్యఁ బెనఁగి | హేతిఘట్టనఁ ద్రెవ్వి యిల [1]బ్రుంగుచోట,
గాంధారు లార్వురు గాండీవిసుతుని | గ్రంథులుగా సెలకట్టె వాటులను
గడలపోటులఁ జక్రగదల వ్రేటులను | గడు నొత్తరించినఁ గలఁగక యతఁడు
తురగంబు నచ్చోటు తొలఁగ దాటించి | సరవి సింగిణి[2]వెంట శరములు పఱపి
కార్త్తికేయుండు రాక్షసులఁ జెండాడు | మూర్త్తితో [3]నయ్యారుమువ్వుర నొంచె.
అటమున్న [4]వ్రేటుల నాటులఁ జాల | లటపటమైనఁ దల్లడముచే హయము
గిరి గూలునట్లు సాగిలఁబడి చాన | ధరకు గాండీవినందనుఁ డర్థి దాఁటి
వారేయు వాలంపవాన యాఖడ్గ | ధారచే జడియుచు జడియక తిరుగ
శకుని తమ్ములు నిర్విచార మిట్లన్ని: | "రకట! భూచారి నేయఁగరాదు మనకు;
మనము నుర్వికి డిగ్గి మార్కొని వాని | ననువుగా వధియింత." మని వారు డిగ్గి
చుట్టుముట్టి కిరీటిసుతుని బిట్టేయ | దిట్టతనంబుచేఁ దెమలక యతఁడు
పట్టిన హేతితో భ్రమరిగాఁ దిరిగి | కొట్టిపోవైచె నార్గురి మస్తకముల.
వైచి యార్చినఁ జాల వగచి కౌరవుఁడు | లోచనాంబుజములలోన నీరూర
శూరు నలంబుసుఁ జూచి యిట్లనియె: | "చోరి కంటివె యిందు సేనల నఱుక
వినవవి త్తటమీఁద విజయునిసుతుఁడు, | మసిచేసె నా మేనమామల వీఁడు.
కలహించి వీని నాకన్నులయెదుటఁ | బొలియించి మాంసంబు భుజియింతుఁగాక."
యని పంపువెట్టిన నట్లకాకనుచు | దనుజుండు దనమాయఁ దలఁచి రప్పించి

1. బొంగులైన. 2. విరటు. 3. నయ్యారు మువ్వుర నొంచ్చె. 4. వ్రేట్లనాట్లఁజాల. 5. చోరగంటి సేనిందు. (మూ).

యండజకులునిపై నడరింప నదియు । రెండుసైన్యములవారికిఁ గానరాక
యయ్యిరావంతుని యశ్వసేనలకుఁ । జయ్యనఁ బ్రతిసేన సవరించి తెచ్చి
పోరాడఁజేసి భూభుజులెల్లఁ జూడఁ । గౌరవకార్యంబు గావించి పిదప
నాసైన్యములు దాను నస్తమించుటయు । వాసవి కొడు కొంటివాఁడయ్యె ననుచు
నెక్కటి నతనితో నీయలంబుసుఁడు । గ్రక్కున దలపడి కాండత్రయంబు
భుజమధ్యమున నాటఁ బొలివోని కడిమి । భుజగవంశ్యుఁడు ఖడ్గమున వాని వ్రేసి
ధనువు ఖండింపఁ బ్రతాపించి యసుర । ఘనతరఖడ్గంబు గైకొని వచ్చి
విజయజు ఖడ్గంబు విఱుగ వ్రేయుటయు, । భజన గోల్పోక యప్పన్నగకులుఁడు
తనచేతి తునుక నద్దైత్యుకంఠంబు । దునుఁగవైచిన జీవి దొలఁగిన వాఁడు
వినువీధి దనుజుఁడై వేఱొక్కవింట । సునిశితాస్త్రంబులు చొనుపఁ బార్థుఁడు
నొచ్చి కోపించి తానును మింటికెగసి । యచ్చోట దైత్యువిల్లవలీల విఱిచి
పెనఁగులాటకుఁ జొచ్చి బిగియించి దైత్యు । ననువునఁ బడఁద్రోవ నవనిపైఁ దొరిఁగి
యసుర నొచ్చియు నట్టహాసంబు చేసి । వెసఁ గిరీటితనూజు వెతకుచో నతఁడు
తల్లివంగడమునఁ దాఁగన్న మాయ । నల్లోకసర్పమై యోజనసీమ
గైకొని విషవహ్ని గ్రక్కు నేత్రములు । జోఁకతోఁ బెనుగాలి జుఱ్ఱు నాసికయు
దిగ్గజంబులఁ బట్టి తిగుచు నాలుకయు । నగ్గిరిగుహపంటి యాననబిలముఁ
బవనలోకముఁ బ్రాకు పడగయుఁ గల్గి । పవిలి నీపుత్రుని పడగయు వణఁకఁ
బన్నగకులకోట్లు బలసి సేవింప । నున్నచో నమరారి యురగారి యగుచు
నడరి పైఁబచ్చు మాయాపన్నగముల । నొడిసి యన్నిటిమ్రింగి యోధులుచూడఁ
జేతికి లోనైన జిష్ణునందనుని । యాతల యసిఁద్రుంచి యాతలవైవఁ,
బన్నగాకారంబుఁ బాసి యయ్యోధు । [1]పున్నమచంద్రునిఁ బురడించుచుండె.
మింటిచక్కటికెక్కి మిహిరుఁ డావేళఁ । గంటికి [2]వేండ్రమై కనుపట్టె.” ననిన
నంజయుఁ బతి పల్కె: “సంజయా, వైరి । భంజనం బొనరింప భయహారంబయ్యె.
కురుకులంబు నులూచికొడు కింత చొచ్చి । కలఁచెను మాయావి గావున మొదల.
ఇంతటివాఁ డాజి నీల్గినపిదపఁ । గౌంతేయు లెట్లు సంగరము గైకొనిరి?
ఎఱిఁగింతుగాక నా కింతయు.” ననిన । నెఱిఁగింపఁ దొడఁగె మహీపతి కతఁడు:

---

1. పున్నమి. 2. వేత్రపై. (మూ)

## ఘటోత్కచుఁడు కౌరవసైన్యము నుఱుమాడుట

"అని నిరావంతుఁ డిట్లనఁగుట చూచి । యనయంబు కోపించి హైడింబుఁ డపుడు
అసురనాయకులు గజారూఢులగుచు । వెసఁ దన్ను సేవింప వీరవైఖరిని
గరమున శూలంబు ఘనతరద్యుతుల । నురుతర ప్రళయసూర్యుల నీనుచుండ
మనసేనఁ జొచ్చి సామజభటాశ్వముల । గొనికొని యందంద గుదులుగుచ్చియును
అభ్రంకషములైన హస్తుల గముల । విభ్రమంబునఁ దేర్లు విఱిచి యొట్టుచును,
అంతకాకారుఁడై యరుదెంచు కీచ । కాంతక సుతుఁజూచి యధిపతి కడఁగి
గంధబంధుర మదాంధ గంభీరవేది । బంధురవ్యూహ సంపద నెదుర్కొనిన,
నతనికిఁ దోడు వంగాధినాథుఁడును । శతసహస్ర గజేంద్రసహితుఁడై గవియఁ,
గొండఁ దాకు బకారికొడుకు కాగజముల । భండనోగ్రబలాగ్రపతులును దాను
నిదితల యిదితొండ మిది దంతయుగళ । మిది పాద మని నిర్ణయింపరాకుండ
రోలఁ గుమ్మినయట్లు రూపుమాపుటయుఁ, । గాలాంతకుఁడు పోలెఁ గౌరవేశ్వరుఁడు
వేఁడి నారసములు వింట సంధించి । వాఁడి రక్కసిగుంపు వచ్చుచో నందుఁ
దొడిఁబడ వేగవంతుఁడు నేలఁ గలిసె; । ... ... ... ... ...
... ... ... ... ... । బలియు విద్యుజ్జిహ్వు ప్రాణంబు వోయె;
యముని పాలయ్యె బహ్వాశియన్వాఁడు; । సమసెఁ గరాళలోచనుఁ డనువాఁడు
ఈరీతి నిజమంత్రులీల్గఁ గిమ్మీర । వైరిపుత్రుఁడు క్రోధవహ్ని మండుచును
నగము వంటి శరాసనము ధరియించి । వికళిత(?)భ్రుకుటియై విభున కిట్లనియె:
"పాడియు సత్యంబుఁ బరహితోన్నతియుఁ । దోడునీడైన పార్థుల నట్లు సభను
భంగపెట్టిన నీకుఁ బాడియు నిజ ము । నంగ నక్కట వీసమంతైన లేదు.
ఆ తెఱంగున వారి నలయించు ఫలము । చేతులఁ బడఁగఁ జేసెద నీకునేఁడు."
అని పల్కి కృష్ణసర్పాకృతిఁ బరఁగు । సునిశితాస్త్రముల నా క్షోణీశు నొంచె.
నొంచినఁ దెమలక నుతశక్తి నతఁడు । కాంచన పుంఖ ప్రకాండ వర్షములు
వింట నిర్వదిరెండు వేవేగ దొడిగి । కంటకు వక్షంబుఁ గాడనేయుటయు
నాయెట్ల మూర్ఛిల్లి హైడింబుఁ డొరఁగి । ధీయుక్తి వేవేగఁ దెలిసి రోషమునఁ
గల్పాంత సమవర్తి కర కాలదండ । కల్పమై మృత్యుసంకాశమైనట్టి

1. అభ్రంకషములైన అస్త్రుల. (మూ).

శక్తి నా నృపు బాహుశక్తి వైచుటయు । దిక్తటంబులఁ బర్వు తేజంబుతోడ
నది ఘోర ధారాభయంకరంబగుచు । నది భాను భాసమానాకారమగుచు
నది లోకపాల లోకాభీలమగుచు । నది ఫాలనేత్ర నేత్రానూనమగుచు
నేతేర వంగకుఁ డిభముపై వచ్చి । యా తీవ్రతరశక్తి కడ్డంబు నిలువ
నది వచ్చి కరిప్రాణ హరాహుతి గొనుచుఁ । ద్రిదశులు చెదర ధాత్రీధారఁ గూలె.
వంగుఁ డక్కరి డిగ్గి నడిఁ బాఱిపోవ । నంగదఁ గరిపక్ష యాయెడరునను
నీ సేన నొక్కఁడైన నిలువక తొలఁగ । వాసి పట్టునను భూవరుఁ డంత నిలిచి
నర సిద్ధ సాధ్య కిన్నరులు నుతింప । నరుదైన యొక్క రౌద్రాస్త్రమేయుటయు
నక్కజమై వచ్చు నమ్మహాశరము । చెక్కులుగా దైత్య సింహుండు చేసి
యనుపమ మణిభూషణాంచితంబైన । తనువున నారాచతతి నాటి యార్వ,
నదివిని గాంగేయుఁ డతి సంభ్రమమున । నెదిటి పౌఁజుభరాన నేతేర రాక
యాచార్యుఁ డాదిగా నచటి యోధులకు । నేచిన రవళిఁ జేయెత్తి యిట్లనియె :
“ ఓద్రోణ! యోకృప! యోచిత్రసేన! । యోద్రోణనందన! యోసింధురాజ!
వాఁడె హైడింబుండు వసుధేశుఁ దాఁకి । వాఁడిమి నెఱపెడు వలసినట్లెల్ల.
మాన్యుఁ డీయోధు సామాన్యుఁడే! దనుజ । సైన్యంబుఁ దాను నసాధ్యుఁడెవ్వారికి.
[1]తొడిఁబడకుండ నెత్తుఁడు కౌరవేంద్ర! । అడరి యేయుఁడు దైత్యు. ” నని యొత్తి చెప్ప
గురు జయద్రథ బాహ్లికులు బృహద్బలుఁడు । గురుపుత్ర కృపులు మక్కువ వికర్ణుండు
పొరిఁ జిత్రసేనుండు భూరిశ్రవసుఁడు । సొరిది వివింశతి సోమదత్తులును
ఎన్న నవంతి దేశేంద్రులు ననఁగఁ । బన్నిరువురు వీరు పౌరుషప్రియులు
తరమిడి తమతమ దళములు గొలువ । గురుతరస్ఫూర్తినేకోద్యోగమునను
బోరన తమరథంబులు దోలుకొనుచుఁ । గౌరవేశ్వరు సమ్ముఖంబున నిలిచి
యనివార్య శరవృష్టి నపరాహ్ణవేళ । దనుజునిఁ గప్పుచోఁ దలఁకక వాఁడు
నిలిచి పోరాడుచో, నృప, వానియొద్దఁ । గల సైన్యమును దాఁక ఘనమయ్యెఁబోరు.
తొంటి దేవాసుర తుములంబు వింటిఁ । గంటి నిప్పటి దైత్య కౌరవ్యరణము.
బకవైరిసుతుఁడంతఁ బన్నిరువురకు । నొకఁడు చాలి మహాశరోగ్రత నెఱపఁ
గొందఱి సూతులు గోల్పోయిరసువు; । కొందఱి హయపంక్తి కుతలంబు పట్టె ;

1. తోడుపడ. (మూ)

కొందఱి రథములు గునికిల పడియె ; । కొందఱి ధనువులు గొనకొని విఱిగె ;
కొందఱి తనువులు కోలలఁ జిఱిగె ; । నందఱు నిర్విణ్ణులైరి భూపాల !
అంత నందఱు సాధనావళి గూర్చి । యంతకాకారులై యా దైత్యు మీఁద
వాలంపజడిముంప వాఁ డోర్వలేక । తూలుచు సైన్యంబుతో మింట నణఁగి,
హాహారవము సేయ, నమ్మహాధ్వనుల । నూహింప బ్రహ్మాండ మూరక పగిలె ;
పగిలెఁ గౌరవసేన ; పార్థివుగుండె । పగిలె ; శేషుం డొదిఁగె ; పాతాళ మగలె.
అత్తఱి యమసూనుఁ డాధ్వని చెవులఁ । జొత్తెర మారుతి సూనునిఁ గదిసి,

## భీముఁడు ఘటోత్కచునకుఁ దోడగుట

" భీమ, నీసుతుఁ డుగ్రబిరుదు హైడింబుఁ । డే మొకో వాపోయె నిట నోర్వనోపు.
కౌరవేశ్వరునకుఁ గలయోధులెల్ల । వారిక యచ్చోట నదలకున్నారు.
గుంపులుగాఁ గూడి కురువీరులెల్ల । నొంపుచున్నారొ సూనుని ఘటోత్కచుని !
ఎప్పటినుండి వీరిట్టు పోరెదరొ ! । గుప్పనోపు నితండు కురుసేన నొవ్వ.
ధవళాశ్వునకుఁ ద్రిగర్తలతోడి రణము । తొవకి రారాదు ప్రొద్దును గ్రుంకఁ బోయె.
పోవయ్య యింతటఁ బుత్రుఁ గాచుటకు । వేవేగ. " ననవుడు విని వాయుసుతుఁడు
తేరు తోలించి యద్దిక్కున నున్న । వీరులఁ దన బాణ విద్య నొప్పించి,
భూరిశ్రవసు మూరు భూరిబాణముల, । మూరిఁబోవ వికర్ణు మూఁడు బాణములఁ,
జిత్రసేనుఁ బదేను చిత్రబాణముల, । ధాత్రి వివింశతి దశబాణములను,
తగ బాహ్లికుని బృహద్బలు రెంట నొకటఁ, । బగతు నవంతీశుఁ బదర వింశతిని,
ద్రోణుమూఁట జయద్రథునిఁ బదారింట । ద్రోణజ సోమదత్తుల నూటఁ బదిట
నొప్పించి యార్వ ద్రోణుం డొక్కరుఁడును । దప్ప సమస్తయోధప్రకరమును
విండ్లు పోనాడియు విఱిగిన బండి । కండ్లు కానఁగరాని కండ్లునై చెదరి
తోడిసైన్యముఁ [1]దానుఁ దొలఁగెను దేవ ! । రూఢి నప్పటి భీమురువ్వు లెట్టివియొ !
ఇట్లు కౌరవయోధు లెవ్వరు నిలక । చిట్లి పాఱిన భీమసేనుండు నగుచు
సింహనాదము సేయఁ జెలఁగి యద్దైత్య । సింహుఁడు దివినుండి సేనయుఁ దానుఁ
బొడచూపి యచ్చోటఁ బోవకయున్న । బెడిదు ద్రోణాచార్యుఁ బృథుధైర్యుఁ దాఁకి

1. తాము తోడ్దొలంగి. (మూ).

చొచ్చి యాతనివిల్లు చూర్ణంబుచేసి, । యచ్చోట నృపుఁ డుండ నతనికై తాఁకి,
యతని పన్నగకేతు వవలీలఁ బెఱికి, । మృతుఁజేయఁ దలఁచుచో, మిన్నేటికొడుకు
సకలయోధులుఁ దాను స్వామికిఁ దోడు । ప్రకట సేనాసహస్రములతో వచ్చి
హైడింబుఁ దాఁకిన నప్పటిరణము । చూడ నోడిరి సురాసురకోటులయిన.
ఆ మహాకలకలం బాలించి నరుఁడు । దామోదరునిఁ జూచి తగవొప్పఁ బలికె:
"శౌనిపొమ్ము మన తేరు కురుసేనమీఁద ; । వనజాక్ష, త్రైగర్తవరుఁ డోడిపాఱె.
అవె శరాగ్నులు తోఁచె నచట నెవ్వారి । బవరంబొ కాని యుత్పాతమై యిపుడు.
మన హిడింబాసూతి మాటలై చెవికి । వినవచ్చె, నచటికి వెసఁ బోవవలయు."
అని పలికిన శౌరి యతులవేగమున । మనసైన్యములమీఁద మఱఁది రథంబు
నడపుచో నతఁడు బాణప్రవాహములు । నడపఁజొచ్చినఁ జూచి నరకాత్మజుఁడును
గాంగేయ కృపులు త్రైగర్తనాథుఁడును । రంగుమీఱఁగ నెదుర్పడిరి క్రీడికిని.
శైనేయుతో శల్య శల వికర్ణులును । బూని భోజుఁడు నలంబుసుఁడు మార్కొనిరి.
అనిలజుం డడరిన నస్త్రగురుండు । ఘనతఁ గుమారవర్గము మారుకొనిరి.
కలశసంభవు ప్రాపుగల ప్రతాపమున । నలయక నీకుమారావళి యెక్కి
మారుతాత్మజు మేన మహనీయ ఘోర । నారాచధారలు నలుగడ నింపఁ
గొలఁదిమాలిన నెయ్యిగ్రుమ్మరింపంగఁ । జెలఁగి నాల్కలుగ్రోయు శిఖిఁబోలె నతఁడు
మండి మహోద్దండ మార్గణవిద్య । నిండారఁ జూపిన నృపచంద్ర, వినుము
కుండభేదిశిరంబు కుంభినిఁ ద్రెళ్లె ; । నుండె ననాధృష్యుఁ డుసురువోనాడి ;
కనకధ్వజుఁడు రెండు ఖండంబులయ్యె ; । తునిసె విరావికుత్తుక మృదులీల ;
మఱి సుబాహుఁడు పోయె మఘువుకొల్వునకు ; । నెఱి దీర్ఘబాహుండు నేలపాలయ్యె ;
తిట్టినగతిఁ గూలె దీర్ఘలోచనుఁడు ; । పట్టీక పెఱవారు పాఱిరి విఱిగి.
కరియూథములఁ దోలు కంఠీరవంబు । కరణి నీ మొనల బకధ్వంసి తోలి
యార్చె ; నప్పుడు గ్రుంకె నరుణగభస్తి, । కార్చిచ్చు కెంజాయ గగనంబు డాయ.
పెనుగాలి నంటిన ప్రేతవస్త్రములు । ఘనకటిసీమ నీర్కావిదోత్రముగ,
నున్నతి భుజముల నునుచుకొన్నట్టి । సన్నపుఁ బ్రేవులు జందెముల్ గాఁగ,
మొల్లదోయిళ్లను ముంచి యొండొరులఁ । జల్లెడు కీలాలజలము లర్ఘ్యముగ,
మాటిమాటికి వీరమండలిఁ బొగడు । మాటలు ప్రణవాది మంత్రముల్ గాఁగ
వివిధభూతావళి విప్రులు పోలె । సవితగ్రుంకఁగ నిట్టిసంధ్యలు వార్చె.

తమ్ములు సమసిన తాపభారమున । నెమ్మి నింటికిఁబోక నీపెద్దకొడుకు
సేనలఁ బురికొల్పఁ జెలఁగి పార్థులును । సేనలఁ గొలుప నాసేనలు దాఁకె.
బలిసి పూర్వాపర పవనవేగమున । లలి నిండు నందుఁ దొలంకు కడళ్ల
క్రమమొప్ప వారాసిగతి సంగరాంగ । ణము పొల్పె నప్పుడు సేనల యొప్పులాట.
తునిసిన తొడవులు దొరఁగిన విరులు, । పెనఁగొన్న కవచముల్ ప్రిదిలిన వలువ,
గతిభంగమునుగల్గి కదనోర్వి యపుడు । రతికలహాంత వారస్త్రీని బోలె.
అప్పుడు తిమిర మండందుఁ బర్వుటయుఁ । జప్పనైన రణప్రసక్తి చాలించి
సేనలఁ దిగిపించి సేనాధిపతులు । మానవనాథు సమ్మతిఁ బాళెములకుఁ
జనుదెంచి రందఱు సమరదినంబు । లెనిమిది నేటితో నీడేరె ననుచు.''
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యామీఁద । నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు మనిన
శరణాగతత్రాణ! జానకీరమణ! । కరుణాఢ్య! సత్యసంకల్ప! సర్వజ్ఞ!
అతులితవిఖ్యాత! ఆద్యంతరహిత! । క్రతుకర్త! క్రతుభోక్త! కామితఫలద!
నీలమేఘనిభాంగ! నిగమాంతరంగ! । వాలి వానరభంగ! వర జయోత్తుంగ!
సుజనరంజన! రామ! సుమహితోద్దామ! । విజయంబు రఘురామ! విజయాభిరామ!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితమై భీష్మపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె నాలవది.

# పంచమాశ్వాసము



శ్రీకంజదళనేత్ర, సీతాకళత్ర, । ప్రాకట శుభగాత్ర, భవ్యచారిత్ర,
లలిత మన్మథ కోటి లావణ్య దివ్య । కలితవిగ్రహ, నిత్యకల్యాణ, రామ !
అవధారు మఱియు సంయమి చెప్పఁదొడఁగె । సవినయస్ఫూర్తి జనమేజయునకు :
"ఆరీతి నగరికి నరిగి రారాజు । గారాబుఁదమ్ములు గడచన్న వగను
జాలఁ జెమర్చి దుశ్శాసనుఁ జూచి । "యీలోనఁ గర్ణుని నీవు సౌబలునిఁ
దోడితె" మ్మని యంచి తోడియోధులను । వీడుపట్టుల కంచి వెన్నెలబయటఁ
గస్తూరి నమరిన కమ్మని విరులు । విస్తరించిన రత్నవేదిక మీఁద
సింహాసనంబుపై జెలువైన యువతి । సంహతి గొలువ విశ్రాంతి నున్నంతఁ,
గర్ణగాంధారులఁ గపటలక్షణులఁ । దూర్ణవైఖరిఁ దెచ్చి దుశ్శాసనుండు —
సన్నిధిఁ బెట్టిన సముచితంబైన । మన్నన మన్నించి మనుజేశ్వరుండు
వారల కిట్లను : "వాహినీ సుతుని । పోరుచూచితి ; ద్రోణుపోరుచూచితిని ;
బ్రాఁతిగా వారెల్లఁ బాండవపక్ష । పాఁతులుగాని నాపనివారు గారు.
అయ్యపేక్షలఁ గదా యష్టావశేష । మయ్యె నాబలము లోయ్యన వచ్చివచ్చి.

... ... ... ... ... । ... ... ... ... ...

తగ నాడు మాట ముందఱనయ్యె వెనుక । దగరను గాథయుఁ దలకూడె నాకు.
ఏమి సేయఁ గలాఁడ నిటమీఁద ?" ననిన । నామహీశ్వరుఁ బల్కె నంగాధిరాజు :
"పగయెంత దేవరబంట నేఁగలుగ ! । తెగఁ జూచువాఁడఁ గౌంతేయులనెల్ల.
తేకుము గాంగేయుఁ దేకుము ద్రోణు । నీకార్యహానికి నృప, వీరలాను.
కురుకుమారకు లిట్లుకూలుచోఁ దారు । పరికించుచెల్లఁ [1] దప్పక మోసపఱాను.
ఎల్లి పార్థులలోన నిద్దఱి ముగురిఁ । ద్రెళ్ల నేయక మాన దేవ, నీయాన.
మానుపు రణమింక మందాకినేయుఁ, । బూనుపు మీఁదకుఁ బవళింప నరుగు."
మని పలికిన నాత్మ నధిపుఁడుప్పొంగి । యనుజునిఁ జూచి "యెయ్యన నీవు నేను
నావగేయుని యింటి కరిగి పోటునకు । రేపు రాకుండఁ బ్రార్థింత మాతనిని."

1. చెప్పక భీమసేను. (మూ)

## దుర్యోధనుఁడు భీష్ముని నిష్ఠురములాడుట

అని చెప్పి సౌబలు నంగాధిపతిని । జనపతి వీడ్కొని సముచిత స్థితిని
వివిధ సౌరభవస్తు విన్యాసవిభవ । నవపరిమళ భవ్య సన్నుతోయముల
జలకమాడి సుగంధి చందనంబొడలఁ । బలుచగాఁ బన్నిటఁ బదనిచ్చి యలఁది,
చిత్తినిజవరాలి చిత్తంబు కంటె । మెత్తనై వెన్నెల మేళాపమైన (?)
వెలిపట్టు ధరియించి వేల్పుసొమ్ములను । నెలఁబెట్టు తొడవులు విలసిల్లఁ దొడిగి,
కమ్మని నెత్తావి గంధతుమ్మెదల । రమ్మను విరులు శిరమ్మునఁ దుఱిమి,
బాలసూర్య ప్రభాపటలంబు నేలఁ । జాలు కిరీటంబు సంప్రీతిఁ దాల్చి,
తమ్ములు దొరలు మొత్తమ్ములై కొలువఁ । గొమ్మలు నలుఁగడఁ గుంచియ లిడఁగ,
రసిక సౌరభ్య పరంపరాభరణ । విస్ఫురిత నవతైల విపుల మైనట్టి
కరదీపికా కోటి గదిసి యేతేర । సురగాంక రథమెక్కి యొయ్యనఁ గదలి
యటఁ దొలంగు తొలంగు మని వేత్రకరులు । పటుగతి సందడి పాయ ద్రోయఁగను,
పలుమాఱు పాఠక పఠన క్రమంబు । పులకాంకురంబులు పుట్టించుచుండ,
నోలి [1]హెగ్గడికాంద్ర హుంకారరవళి । శైలరంధ్రంబులఁ జరియింపుచుండ
మందాకినీ సూను మందిరంబునకు । నిందువంశాధీశుఁ డీరీతి వచ్చి
ద్వారదేశమున రథంబంత డిగ్గి । గారాపు తమ్ముని కరమూఁదుకొనుచుఁ
గక్ష్యాంతరంబులు గడచి [2]కృష్ణైక । లక్ష్యచిత్తుని భీష్ము లాగొప్పఁ గాంచి,
యతని పాదములపై నొసల చేర్చి । యతఁడు పెట్టించిన యర్ఘ్యపీఠమున
గురుభక్తి దైవాఱఁ గూర్చున్న యంతఁ । గురు పితామహుఁ బల్కెఁ గురుకులేశ్వరుఁడు:
“ఏమయ్య భీష్మ, నన్నిట్లుపేక్షింప? । నేమయ్య పార్థుల నెచ్చనిచ్చితివి?
నీవు పల్కిన పల్కు నీటిపై వ్రాఁత; । గావున ధర్మజు ఖండింప లేవు;
మొగ మిాక భీముని మోదఁగ లేవు; । తగఁ జూచిచూచి యింద్రజుఁ గూల్పలేవు;
మొదల మాద్రేయుల ముద్దాడఁబోదు; । ఇదియేమివిధమన్న నిన్ని చెప్పెదవు.
అమ్ములు ప్రయము సేయని లోభగుణమొ! । మమ్ముఁ దానోడించుమార్గమో యెఱుఁగ.
పట్టి పాలార్చెదు పాండునందనుల । నిట్టి నీ హృదయమే నెఱుఁగ నమ్మితిని.

1. నహిాగాల. 2. కన్యైక. (మూ)

తెగువ నీ యెనిమిది దినములలోన । మగఁటిమి నేమేలు మాకుఁ జేసితివి ?
అన్నియు నయ్యె నీవాజి చాలించి । మన్నింపవే నన్ను మనికితపడక.
వచ్చితి నారాక వమ్ము గానీక । ఫుచ్చవే కర్ణునిఁ బోటున కెల్లి.
వాఁడొక్కరుఁడె నాకు వశ్యుఁడుగాని । నేఁడెల్ల మీరు మీ నేర్పుల వారు.''
అనిన నమ్మాటలమ్మెత్త మనోవీథి । ననయంబు నొప్పింప నటఁ గొంతసేపు
ఆనతవదనుఁడై యతఁడూఱకుండి, । నీనందనులఁ జూచి నిట్టూర్పుపుచ్చి
[1]పలుకు నోరికి రాక పలుకకపోని । బలవంతమున నిట్లుపలికె భూవిభుని :
" అక్కటా ! నాచేతనైనంత నేను । మిక్కుటి సాక్షిగా మోఁదుదు రిపుల.
నరుని భీముని నిల్పు నాప్రయాసంబు । హరియొక్కఁడెఱుఁగు నాయాత్మయునెఱుఁగు ;
మకుట వర్ధనుల భూమండలేశ్వరుల । వికట శౌర్యుల నిత్యవేవురఁ ద్రుంతు.
ప్రాణవంచనలేక పడిన పాటెల్ల । రేణువు చేసి యీరీతి నాడితివి.
దైవబలంబు చెందని పురుషులకు । నేవెరవున జయంబీడేర నేర్పు ?
కాదువో పార్థునిఁ గదనోర్విగెలువ । నాదివిష్ణునకైన నలవియే మొదల ?
కపటనాటకుఁడు రక్షకుఁడైన కృష్ణుఁ । డుపకారి పార్థు యొద్దనె యుండ
నిట్టి పార్థుని గెల్వ నెవ్వరి తరము ? । పట్టును బట్టి నోఁబలికితి నన్ను
పాల్పడ్డ వేల్పులఁ బొఱంగఁ ద్రోలి । కాల్పఁడే వాసవు ఖాండవవనము !
బవరంబులోపల భవుని మెప్పించి । తివుటమైఁ [2]బడయఁడే దివ్యబాణములు !
గంధర్వులకు నోడి కర్ణుండు నీవు । బంధుసమేతంబు పట్టువడంగ
వడిఁ గయ్యమున గెల్చి వాడిచే మిమ్ము । విడిపించుకొన్నాఁడు విజయుఁడోఁగాఁడో !
నిను నన్నుఁ గర్ణు మున్మిడి ద్రోణుఁ గృపుని । మనసేనలను గెల్చి మత్స్యేశుపురిని
వడిఁబట్టువడిన గోవ్రజము నొక్కరుఁడ । విడిపించుకొన్నాఁడు విజయుఁడోఁగాఁడో !
అతుల పాంచాలీ స్వయంవర వేళ । నితరుల కెడయీక యిషువిద్య నెఱపి
తెఱవఁ గైకొని యెల్లదేశాధిపతుల । విఱుగఁ గొట్టినవాఁడు విజయుఁడోఁగాఁడో !
ఇట్టి బలాఢ్యుతో నిన్నాళ్లు నేను । బట్టి పెనఁగితి బలము గోల్పడక.
అది యెఱుంగక నన్ను నాడితి నొవ్వ । వెదక నిట్టివిగదా విభులచిత్తములు !
ఈడుగాని విరోధ మీవు పాండవుల । తోడఁ దొడంగితి ; తొడఁగిన నేమి
వారి వీరిని జూపవచ్చునే ! నీవ । పోరాడుదువు గాక భుజశక్తిగొలఁది.

---

1. పలికె నోరి కిరాత. 2. బడియుండె (మూ).

అనిపల్కి మఱియు నిట్లను రాజుఁజూచి : । " ఏను నాకుగాండీవి విజువ దుర్ఘటము.
ఇతనికోప, శిఖండి నీక్షింప నోప ; । నితరుల సాధింతు నెందఱినైన.
అటుగాక పాంచాల యాదవ మాత్స్య । లట చేది మగధ పాండ్యాదులు నన్ను
నడరి తాఁకినఁ ద్రుంతు నదియుఁ జూచెదవు ; । కుడువఁ బోవుచు నేలకూరాకులడుగ ;
పోసఁగఁ బార్థుల కొక్క పోరామి దెత్తు ; । పసనెల్లి నాబాహుబలమున హెత్తు.
ఈపాటి పనికి నీవిట్లు రానేల ! । వేపొమ్ము నగరికి విభు మూర్తి. " యనిన
డెందంబులో నూఱడిల్లి రారాజు । మందిరంబున కేఁగి మంత్రుల భటులఁ
దమ్ముల ననిచి యంతఃపురంబునకు । సమ్మదంబున నేఁగి సౌభాగ్య లీల
నవరత్న కీలితోన్నత మహాస్తంభ । వివిధ కేళీకూల విశ్రాంతభూమి
దివ్యాంబరచ్ఛన్న దేదీప్య మాన । భవ్య కర్పూర దీపప్రభామిళిత
రచిత సద్గంధ సౌరభ [1]పూర్యమాణ । ఖచితైక మృదుతూలికా తల్పమునను
గుంకుమగంధులు కొమరొప్పఁ జేరి । కంకణ ఝణఝణత్కారంబు లడర
నోయారములతోడ నుపచారవిధులు । చేయ నెంతయు సౌఖ్యసిద్ధిఁ జెన్నొంది
యారాత్రి నిద్రించి యమ్మరునాఁడు । భేరులు ఘోషింపఁ బ్రియముతో లేచి
నిత్య కృత్యంబులు నిష్ఠతోఁ దీర్చి । ప్రత్యంత నిజమూలబలములు గొలువ
ఘనరథారూఢుఁడై కదనోర్వి కేఁగి । తన సైన్యపతిఁ జూపి తదజ్ఞులఁ బలికె :

## నవమ దివసయుద్ధ క్రమము

ఇతఁడు శాత్రవసేన నెల్ల వధించి । నుతగతిఁ బాండుసూనుల గెల్తుననుచు
నీరాత్రి పల్కినాఁడెల్ల భంగులను । ఈరథికోత్తము నింక నిందఱముఁ
గదిసి లావులుచూపఁ గలవార. " । మనినఁ [2]గొమకక దొరలియ్యకొని రట్టిపనికి.
అమరనదీసూనుఁ డాత్మలో నతని । తమకపుమాటలఁ దలపోసి పోసి,
" వీని పక్షంబైన వెజ్జి నేఁగాక । యేనాటఁ గల. " రని [3]యెంతయు నొచ్చి
యనికిఁ గర్ణునిఁ బంపుమనిన వాక్యంబు । తనమది బాణమై తన్నుగారింప
సమరసన్నాహంబు చప్పనై యున్న, । నమరనదీసూను నాత్మకీలెఱిఁగి
ధరణీశుఁ డతని కుత్సాహంబు పొడమ । ... ... ... ... ...

1. పూర్ణమాన. 2. గొదగక. 3. యిన్నియు నోర్చి. (మూ)

“ మనమెల్లఁ గురుపితామహుని చేరువను । మొనకట్టి రణయత్నమున నుండవలయు.
వారకీతనికి నిర్వది రెండువేలు । తేరుల వీరులు తేరిముచ్చట్లు
నుండంగవలయు ; శల్యుఁడు గురుకృపులు । వెండియుఁ గురువీరపతతి సర్వమును
గాంగేయుకడకు శిఖండి రాకుండ । సంగరక్షయి యవశ్యము నుండవలయు.
వెనుకకు భీష్ముండు వినిపించెఁ గాదె । తనకు శిఖండికి దవ్వైన తెఱఁగు.
నేఁడు వాఁ డితనిసన్నిధికి రాకుండఁ । బోఁడిమిఁ గాచుట పుణ్యంబు మనకు.”
అనుటయుఁ దమ్ములయ్యధిపువాక్యంబు । విన నియ్యకొని ; రట్టివేళ నానృపులు
అట సర్వతోభద్రమను మహావ్యూహ । మెటువంటివారికి నిలనసాధ్యముగ
నిలిపిన నొడ్డుసన్నిధిఁ దాను గృపుఁడు । కలశజ కృతవర్మ గాంధార నృపులు
సైంధవ శల్యులు సరవిఁ గుమారాళ్ళు । బంధురంబుగ సైన్యపతి నిల్చి రధిప !
తన వలపట సోమదత్త బాహ్లికులు । సనఘుండు ద్రౌణి విందానువిందులును
బన్ని ; రా భీష్ము దాపట హాలాయుధుఁడు । నున్నతిఁ ద్రైగర్త భోగిఁ గృతాయువును
భగదత్తుఁడును గానఁ బడి నిల్చిరంత. । జగదీశ్వరుండు సుశర్మ శలుండు
నాయలంబుసుఁడు వ్యూహమునకు నడుమ । వేయిపోఁజులఁ గూడి విలసిల్లిరధిప !
అంతఁ గౌంతేయులు నాజికి వెడలి । శంతనసూనుని సర్వతోభద్ర
ఘటన వీక్షించి యీగతి బలవ్యూహ । ఘటన యొక్కటి దీర్తుగాక నీవనుచుఁ
బాంచాలసూనుని బనుప నాతఁడును । మించిన తననేర్పు మెఱసి యచ్చోట
సైన్యవిన్యాసంబు సమకూర్చునపుడు । ధన్యశౌర్యుఁడు కపిధ్వజుఁ డొప్పఁ బలికె :
“ పాంచాల, చూచితే! పరులమొగ్గరము ; । మంచికయ్యము నేఁడు మనకుఁ గాఁగలదు.
ఆపగేయుని తేరి కఖిలవీరులును । బ్రాపునై నిలిచిరి పదిలంబుతోడ.
ఈతని నందఱు నిట్లు రక్షింప । నీతండు [1]జయసిద్ధి యీనున్నవాఁడు.
ఇంక నీవు శిఖండి నితని కట్టెదుర । నంకురితోత్సాహమై యుండఁ బన్ని
యతని సంరక్షణం బందఱుఁ జేయు । మతముగా వ్యూహం బమర్తుగా.” కనిన
నతఁడు విరాట సాత్యకులు దాపటను, । నుతిఁ గేకయాభిమన్యులు వెలుపటను,
మనుజేంద్రుఁ గవలతో మధ్యభాగమున । విను ద్రౌపదేయుల వెనుకను నునిచి
యొలమి గాంగేయు కట్టెదుర శిఖండి । నిలిపి, పార్థుఁడు దాను నెఱి ఘటోత్కచుఁడుఁ

1. జయనిధినున్నవాఁడు. (మూ)

బావనియును వాని బలసి యేమఱక । వేవచ్చుగతి చేసి పిను సైన్యపభుఁడు
ఎడనెడఁ దగువారి నియోద్ధు గలయ । నడిమి దేవాసుర లీక్షించి మెచ్చ.
ఇట్లు సన్నద్ధమై యిరువాగు నభము । ముట్టి తూర్యంబుల మ్రోఁతలు చెలఁగఁ
గవులకుఁ బ్రణుతింప గణుతింపరాని । జవమునఁ దాఁకి యార్జనమునఁ బోరఁ
నభిమన్యుఁ డావేళనరుణాశ్వరథము । రథనంబుతోడఁ గౌరవ సేనమీఁద
నడపించి దూఁదిపై నడచు పావకుని । వడువున నిజబాణవహ్నిఁ గాల్పంగ,
నొకబాణ మతనిపై నోపదు నాట, । నొకరథం బతనిపై నోపదు నిగుడ,
నొక యోధు నతనిపై నోపఁడు గవియ, । సకట సామాన్యుఁడే యభిమన్యుఁ డధిప!
అతనిచే నీసైనికావళి యెల్ల । హతముగావచ్చిన నధిపతి కలఁగి
యసుర నలంబుసు నప్పుడు పలికె : । "వసముగా దభిమన్యు వారింప మనకు

అలంబుసుఁ డభిమన్యునిపైఁ గవియుట

నరున కెక్కుడు గాని నవవిక్రమమున । సరిగాఁడు మనుజకేసరి యగుఁగాని;
ఇట్టివాని నడంప నీవె యోపధము ; । ధట్టించి పాండవతతి కేమెచాలు."
ననిన ననేకదైత్యావళిఁ గూడి । దనుజుండు ధవళాశ్వతనయునితోడ
దనుజ సేనలుఁ దానుఁ దాఁకిపోరాడ । ... ... ... ... ...
నలుగులు దూఱని యసురమూర్తులకుఁ । గలఁగి పాఱఁగఁ జొచ్చెఁ గౌంతేయబలము.
అదిచూచి ద్రౌపదేయావలి కినిసి । త్రిదశేంద్రపౌత్రు తేరికి నెడసొచ్చి
దైత్యసేనల నెల్ల ధరఁ గూల్పఁ, బ్రథమ । దైత్యుండు వారినందఱ నేయ, వారు
క్రూరనారాచ మగ్నునిఁ జేయ, నపుడు । తేరిపై మూర్ఛిల్లి త్రెళ్లె నయ్యసుర.
త్రెళ్లి యంతనె తేఱి దితిజవల్లభుఁడు । విల్లుగైకొని వారి విపుల కేతువులు
పెల్లైన గొడుగులు పృథులాశ్వచయము । దుల్లిపోవఁగఁ బలుతూపుల నేసి
ధనువులు నడఁగ నస్త్రమ్ములు తొడిగి । తనువుల నైదైదు తాఁకించి యార్వ,
నోడకుఁ డోడకుఁ డున్నాఁడ ననుచుఁ । గ్రీడితనూజుఁ డాకితవుపై నడరె.
వీఁడు రాక్షసుఁ డస్త్రవేది పార్థజుఁడు । వాఁడి కయ్యంబిట్లు వర్తిల్లఁ గలదు
చూడ రండని సురాసుర సిద్ధ సాధ్యు । లాడంబరము సేయ నయ్యిరువురును
వివిధ పర్వతవృష్టి వీరాస్త్రవృష్టి । నవ మహోరగవృష్టి నారాచవృష్టి
దంభోళివృష్టి గదాశక్తివృష్టి । సంభృతోద్ధతిఁ బోరి జడియక యంత

నితరేతరాస్త్ర సంభృత రక్తసిక్త । పతితాంగ భయదులై వీరహాసములు
సేయుచో, దైత్యుఁడాజిష్ణుజుమీఁద । మాయాబలంబున మబ్బుపుట్టించి
బాలుని లోచనపథము గప్పుటయు, । బాలుండు నదివిప్పె భాస్కరాస్త్రమున.
అసుర వెండియు మాయలతనపైఁ బన్న । విసువక దివ్యాస్త్ర విద్య నన్నిటిని
బాలుఁడు తోడ్తోన భంజించివైచి । వాలమ్ము లడరింప నాఁడోర్వలేక
యసుర పాఱినఁ బాండవానీకమార్చె; । వసుధేశ, కౌరవావళి చిన్నవోయె.
అప్పుడు గాంగేయుఁ డధిక రోషమున । నప్పిన్నవానిపై నతిరథశ్రేష్ఠ
శతములుఁ దాను నుజ్జ్వలరేఖ నడర । శతమఖపౌత్రుఁ డాసమితి గైకొనక
యందఱ కందఱై యాజి సేయంగ । నం తనుధృతికి నానందించి నరుఁడు
ఆపగేయునిమీఁద నడర, నుప్పొంగి । భూపాల, యిర్వాగుఁ బోదిరి నిద్దఱును.
అట్టి సంకుల యుద్ధమందు సౌభద్రు । గిట్టి తాఁకఁగఁ బోవు కృపునిఁ బోనీక
సాత్యకి శరసహస్రముల నొప్పింప । నత్యంత రయముతో నరుదెంచి ద్రౌణి
శైనేయు శరసహస్రములఁ దానొంచి । జానొప్ప నొకకోలఁ జాపంబు దునిమి
యార్చిన, నొండు విల్లతఁడు ధరించి । కార్చిచ్చువంటి మార్గణము సంధించి
యేయ, నేటున ద్రౌణి హృదయంబు పగిలి । యాయువు కలదో లేదన మూర్ఛపోయి
తేరి కంబంబుపై దేహంబు నిలిపి । ధీరుఁ డంతన మూర్ఛ దేఱి కోపమున
నుత్పాతకేతువు నొరవెట్టుతూపు । తాత్పర్యచిత్తుఁడై ధనువునఁ దొడిగి
శైనేయ, పడుమని జవ మొప్ప నేయ । దాని నమోఘాస్త్రధారఁ దున్మాడి
హారితమ్ముఁ డట్టి సాయక సహస్రముల । గురుతనూభవు ముంప, గురుఁ డెడచొచ్చి
యతని విల్లు పతాక యాతపత్రంబు । శతఖండములు సేయఁ, జయ్యన వచ్చి
యర్జునుఁ డెడచొచ్చి యపుడు గాండివము । గర్జిల్లఁ దూపులఁ గప్పె సద్గురుని."
అని సంజయుఁడుపల్కఁ నాంబికేయుండు: । "మును ద్రోణుతో యుద్ధమున ధనంజయుఁడు
ఎదురు గానన్నవాఁ; డితఁడును నరుని । నెదురకు మన్నవాఁ డెన్నఁడు నాజి.
ఆమాట మఱచెనో, యట్టిప్రతిజ్ఞ । తామరసాక్షుండు తా మాన్పినాఁడొ!
గురువు తోడనె గుటగుట లనుమాట । పరికింపఁ గలిగె నీపార్థులయందు.
పైపాటుగా వచ్చి పార్థుఁడగ్గురుని । నేపాటు గావించె నెఱిఁగింపు." మనిన

## అర్జునుఁడు ద్రోణాచార్యునితో యుద్ధము సేయుట

నెఱిఁగింపఁ దొడఁగె వాఁడిట్లని: "రణము । తఱువాత గురుఁడగుఁ దండ్రి తానగును
సుతుఁడగు హితుఁడగుఁ జూడనున్నదియె! । గతి శూర్పవలెఁ గాక క్షాత్త్రధర్మంబు.
కావున శిష్యునిఁ గావంగ వచ్చి । యేకంట గురునేల యీతండు విడుచు?
వినుము ద్రోణునిమీఁద విజయుఁడిట్లడరి । మునుకొని నారాచములు మూఁడుపఱపి
యంప తెట్టువ ముంప నతఁడు భేదిలక । నొంపఁజొచ్చె శిలాశిత సాయకముల.
అంత నింతటఁ బోవదాజి యూదొరల । నెంతటఁ బెట్టునో యేఁగోదు ననుచుఁ
గ్రీడిపైఁ బడఁ గడంగిన పతిఁగడచి । యేడుశోల్ల త్రిగర్త లెడసొచ్చి నరునిఁ
బొదివిన, నతఁడల్గి పోఁద్రోవరాని । మదరిపుగణముపై మారుతాస్త్రంబు
తొడిగి యేసిన సేన తూలముభంగి । వడిఁ దూలి పాఱుచో, నాఁగించి గురుఁడు
పర్వతాస్త్రంబేసి పటు వాయుబాణ । గర్వరేఖ యడంచెఁ గౌరవ్యులలర.
గాండీవి యలిగి త్రైగర్త కులంబుఁ । జండ నారాచ వర్షంబునఁ బొదువఁ
బతి యంతఁ గృపశల్య బాహ్లీక పతుల । ధృతిఁ గూడి నరునేయఁ, దెమలక యతఁడు
కరవీరదళ సాయకముచేత భీతి । కర వీరదళ సాయకములు ఖండించి,
కలశజుండాదిగాఁ గల యేవురకును । దలమునుకలుగాఁగ దర్పించె నధిప!
నరుఁడిట్లు దర్పింప నాథ, యీవలను । సురనదీసూనుండు శూరత మెఱసి
శమనజుకడనున్న సైనికోత్తముల । సమయింపఁగాఁ జొచ్చెఁ [1]జలము రెట్టింప.
పోరిపోరి గాంధార భూరిశ్రవసులు । దురము మాద్రేయులతోఁ దలపడిరి.
భగదత్త కాళింగ పతులయూథములు । జగము పట్టని దంతి సమితియుఁ దారు
కరువలితనయుపైఁ గవియ నజ్జోదు । శర శరాసనములు చయ్యన డించి
గదగొని రథముడిగ్గఁగ, మూర్తిచూచి । మదగజఘటలెల్ల పదముల నడిగి
యంత నంకుశముల నాఁగ నాఁగంగ । నెంతట నిలువక [2]యేఁగె నభ్భీతి.
కరులిట్లు పాఱినఁ గాళింగపతియు । నరకసూతియుఁ బోక నానాస్త్రసమితి
వాయుజుఁ బొదివిన, వారి వాయుజుఁడు । నాయతగద పైవ నాయుద్ధ మమరె.
అంతలో నక్కడ యమసూనుభవుఁడు । శంతన సుతుతోడి సమరంబు తనకుఁ
గడు బెడిదంబైనఁ గడిఁది నానృపుఁడు । ముడివడి దిక్కులు మొగ మెత్తిచూచి,

1. సైనికోత్తముల. 2. యేఁగినభీతి. (మూ).

భీమునిఁ బొడఁగాంచి భీతి నిట్లనియె : । "భీమ, చిక్కితి రావె భీష్మునిచేత ;
రథము ఖండించె సారథి నుక్కడంచె; । వృథచేసెఁ దూపులు విల్లుమున్మాడె ;
హయములఁ ద్రుంచె; దేహంబెల్ల రక్త । మయము గావించె; సామర్థ్యంబుఁ బెంచె.
ఏకాధ్వరము సేయ నెత్తికొన్నాఁడు । భీకరాకృతిఁ [1]దొంటిభీష్ముండు గాఁడు.
చెల్లఁబో నాసేన చించుచు మట్టి । మల్లాడుచున్నాఁడు మాయపుఁదాత.
దేవేంద్రజునకైనఁ దీరదీవేళ ; । కావవె యీవేళఁ గడనుట్టు." ననిన
భీముండు లయకాల భీముఁడై పేర్చి । భూమీశు దశ చూచి భుజశక్తి పెంచి
భగదత్త కాళింగ భర్తలతోడి । జగడంబు చాలించి చయ్యన నపుడు
నెత్తురు జొత్తిల్ల నిజశరీరంబు । తత్తరింపఁగ వసంతాగమవేళ
నిగురు వెట్టినమావి యిదియని తోఁపఁ । దగ వచ్చె ధర్మనందనుని సన్నిధికి.
అతఁడిట్లు రాకున్న యంతకుమున్న । పతిరక్షకై మత్స్యపతి సైన్యపతులు
నాశిఖండియు ద్రుపదాధీశ్వరుండు । నాశుగంబుల భీష్ము నలజడి పెట్టి
[2]యూసానఁ దలలు పోనాడు కొన్నార । యాశిఖండి కతాన నది తప్పెఁ గాని.
కందుపోలె శిఖండి గలుగుటఁ జేసి । యందఱితోడి కయ్యము భీష్ముఁడుడిగి
కౌంతేయముఖ్యుపైఁ గదలించె నరద । మంత భీముఁడు చేర నదియుఁ జాలించె.
భీమసేనుండంత భీష్మసన్నిధికి । భూమీశ రక్షకై పోవుట చూచి
పులియున్న గవికి నాఁబోతు డగ్గఱిన । నిల నమ్మవచ్చునే! యేఁగుఁడందనుచు
ధృతిఁ గేకయ ద్రౌపదేయ శైనేయు । లతి సంభ్రమమునఁ దోడైరి భీమునకు.
అంత నక్కడి యోధు "లకట భీష్మునకు । నింతఁ బోదు శిఖండియెదురుగాఁ దొడఁగె.
విలు గోల యతనికై విడిచి యయ్యోధు । తల గోలుపోవునో దాయలచేత !
కాతము రండని కలశజ ద్రోణి । గౌతమ శల్యాది గణ మొక్క మొగిని
ఆపగేయునకుఁ దోడాలంబు సేయ, । నీపాఁజు నాపాఁజు నేకమై గవిసి
నిస్సాణ పటహడిండిమ భేరిశంఖ । నిస్వర దారావ నీరంధ్రగతిని
బోరాడుచో మింటిపొడుపు మధ్యాహ్న । ధార చూపట్టె నాధారమై దివికి.
నెత్తురుటేరులు నింగితోరాయ । మొత్తులాడఁగ రాక మొనలనాయకులు
తేరు గుఱ్ఱము దంతి తెప్పగా నెక్కి । పోరాడఁ జొత్తురు పొగడ దేవతలు.

1. తోటి. 2. యాశాశ. (మూ).

కలిగె నెత్తురు జొత్తు గజ భట తురగ । ములు కింక సమరంబు ముగియునోయనుచు.
వైరంబు తలపెట్టి వచ్చినదంగ । నారదుం డేతెంచె నభము చక్కటికి.
ఇట్టి ప్రజాక్షయం బీక్షించు ప్రజలు । నెట్టన తమలోన నృపులు వినంగ:
" బుట్టఁ గాదని పుట్టు పుట్టియుఁ గడిచి । కట్టి సుఖంబుండఁ గానక ప్రజలు
ఈ చావు చత్తురే! యిది ధృతరాష్ట్రు । మోచిన పనిగాని మోసంబు గాదు.
జూదమాడఁగ నేల! చుట్టాలలోన । వాదులాట యదేల! వైరంబులేల!
ఎంతటిదోకదా యీరాజ్యకాంక్ష! । యెంతకాలము నిల్వ నెన్నిరి తమ్మి!"
అనుకొని రామాట లందఱు వినియు । వినని వారైరి మీవిధము లెఱింగి.
కౌరవ కౌంతేయ గణములు గడఁగి । పోరాడుచో వాయుపుత్రుని రథము
సారథి తెచ్చినఁ జండదోర్దండ । చారు గదాదండ సమరంబు మాని
ధనువు గైకొని బాణతతుల బాహ్లీకుఁ । జెనకి యాతని తేరు క్షితిఁ గూలనేసె.
చిత్రమై సౌభద్ర చిత్రసేనులకు । ధాత్రి వణంక యుద్ధము గల్గుచోట,
చిత్రసేనురథంబు జిష్ణునందనుఁడు । పత్రపంచకముచేఁ బడనేసి యార్చె;
నకులమారుఁడు దుర్ముఖాఖ్యు తేరెక్కి; । నకులజమైన కయ్యము చక్కవినుము.
ద్రుపదజుఁ డావేళ ద్రోణునిఁ దాఁకి । విపులాస్త్రముల నొంప వెడనవ్వుతోడ
నతని విల్లును జోడు హయముల సూతు । శితశరంబుల నుగ్గుచేసె నగ్గురుఁడు.
సైన్యంబుఁ దాను సుశర్ముండు నరు న । నన్యమౌ రణకాంక్ష నప్పుడు తాఁకి
యతని నంబుజనాభు నగచర[1]ధ్వజము । శితశరప్రతతి నొంచినఁ జూచి నరుఁడు
కాలకేయ నివాతకవచులఁ గూల్చు । వాలిక తూపుల వానిని బలము
ముంపఁ జొచ్చిన,సైన్యములు వాఁడు విఱిగి । యంపశోలలు వైచి యరిగెలు వైచి
ధనువులు విడిచి రథంబులు విడిచి । పెనఁకువ తలఁ జిచ్చుపెట్టు నన్నట్లు
తెగము ప్రాణములెంత తీపన్నయట్లు । మగిడి వచ్చిన నొట్టు మా కన్నయట్లు
చిందఱవందలై చీకులై పఱవ । నందంద హారి నవ్వె; హారి నూతి నవ్వె.
ఆవేళఁ గ్రీడిపై నలిగి యేతెంచు । దేవవ్రతుని పూన్కి దెలిసి యయ్యెడకు
శైనేయుఁ డేతెంచి చండకాండముల । సోన నాతని ముంప, నుసిశితశక్తి
శైనేయుపై వైచి శాంతనవుండు । శైనేయ, యింతటఁ జనుము నీవనుచు

1. ద్వయము. (మూ)

పైచిన, నతఁడది వదలక పట్టి । వైచెఁ గ్రమ్మఱి సైన్య వల్లభుమీఁద.
అతఁడది మూఁడు[1]సాయకములఁ దునిమి । శిత శరౌఘంబుచే శినిపౌత్రు నొంచె.
అంతఁ బాండవసేన లా భీష్ముఁ బొదివి । కుంత చక్రాసి శక్తులు మొదలైన
నానాస్త్రముల నొంప నాగకేతనుఁడు । సేనానియునికి వీక్షించి కలంగి
యువరాజుఁ బల్కె: "నీవూఱక యున్న । నవుసె సంగరజయం; బటుగాన నిప్డు
గాంధారుఁడును నీవు గ్రక్కున పొందు । సింధుతనూజాతు చేయూఱటకును."
అనిన వారిరువురు నడచుచో ధర్మ । తనయుండుఁ గవలు నుద్ధతి వారి కడర
సర్పకేతుఁడు చాలఁ జలమరి గాన । దర్పించి యయ్యన్నదమ్ముల మీఁద
రాతులతోడ సర్వము సాజమైన । వీతిపుంజము పదివేల కేర్పఱచి
పురికొల్ప,నది నభంబునకు దాఁటుచును । దొరయఁ ద్రొక్కినచోటఁ ద్రొక్కఁ గేఁగుచును
భంజళి వల్గన భ్రమరి మార్గముల । రంజిల్లుచును బరాక్రమలీలఁ జొచ్చి
కౌంతేయసేనలఁ గలఁగుండు పెట్ట । నంతకాత్మజుఁ డల్గి యనుజులుఁ దానుఁ
బటుతర శరపరంపర పరఁగింపఁ । గుటిలాశ్వ పటలంబు కుత్తులు వదలి,
మోఁకాళ్లు తునుకలై మునిఁగి త్రెళ్ళియును, । వీఁక వాగెలు త్రెవ్వి విచ్చిపాఱియును,
నిడు[2]పొడవులు వ్రస్సి నేలపాలయ్యె, । మెడ నడుములు త్రెవ్వి మితికి లోనయ్యె,
గుండెలు నలిగి నగ్గుచు నూచమయ్యె । నిండు రాతుల వైచి [3]నెప్పళాలయ్యెఁ
గీటకంబులు పోలెఁ గిచ్చళ్ళు గొన్న । ఘోటకంబుల పాటు కురురాజు చూచి
యాదరంబున శల్యు నప్పుడు పలికె: । "ఏది జయంబు నాకీ వూరకున్న ?

## దుర్యోధనుఁడు శల్యునిఁ బాండవులపైఁ బురికొల్పుట

సొలవక నీలావు చూపకయున్న । నిలువు పీఠక మెక్కు నేఁడు ధర్మజుఁడు.
నీవు వేలాద్రివై నిలువక యున్నఁ । బోవును జయలక్ష్మి బోరన వెడలి."
యనిన శల్యుఁడు పాండవాగ్రజుఁ గవల । నని మొనఁ దాఁకి ఘోరాస్త్రశస్త్రములఁ
జిక్కులు పడ నేసి చెలఁగి యిట్లనియె: । "ఎక్కడఁ బోనిత్తు నేనింక మిమ్ము?

---

1. సాకంబుల. 2. పారలు వృష్టి. 3. నెప్పనేలయ్యె. (మూ)

ఎక్కడ గెల్చినా రెచ్చోటఁ గీర్తి । దిక్కుల నిడినారు దేవాంశులార ?
ఏలికలై ధాత్రి నేలఁజూచెదరె ? । చాలుఁ గౌరవుసేనల్ను జయము మీ కగునె ! ”
అనుచు ధర్మతనూజు నతనిసోదరుల । ననిశితాస్త్రమ్ములఁ జుట్టుముట్టుటయు,
బీభత్సుఁ డావేళ భీముండుఁ దాను । భూభర్తముందట బోరన నిలిచి
శరవార్ధి నొక్కట శల్యు ముంచుటయు, । గురు భీష్ము లాదవి యక్కోలలు నతికి
యిషువృష్టి ముంచుచో నిరువాగు నపుడు । విషనిధి విషనిధి విధమునఁ దాఁకి
యాజి గావించుచో నపరాహ్ణమయ్యె । రాజేంద్ర, విను మిట్టి రణ మెందుఁగాన.

### భీష్ముఁడు విజృంభించి పాండవసేనల నుఱుమాడుట

ప్రొద్దుదిక్కునుజూచి పోరాట బయట । గద్దించు కౌంతేయగణమును జూచి
భీష్మసింహము పెచ్చుపెరిగినభంగి । నూష్మతో విసుతేభయూథంబు చొచ్చి
చతురంగసైన్య మస్తకములు డొల్ల, । సతు లాతపత్ర సంహతి పెల్లగిల్ల
సరుపతాకావళి యువ్వెత్తుగాఁగ, । తురగ[1]యూథములు నెత్తుటఁ దొప్పదోఁగ,
దెగి బండికండ్లను దిశలకుఁ బఱవ, । నొగిలి పదాతులు నోళులఁ దెఱవ,
నాగదంతంబులు నలుగడఁ జెదర, । రాగెవాగెలు ద్రెవ్వి రౌతులు బెదర,
గాలుమానుసులు వ్రక్కలువాసి తూలఁ, । గీలూడి విపుల కింకిణు లుర్విరాల,
నేనికతుండంబు లిలఁ వ్రాలి నవియ । నోనైసదారల యీలువులెల్లఁ బొలియ,
మేనిభూషణములు మేదిని బ్రుంగ, । నానాస్త్రశతతతి చూర్ణములై యడంగ,
వెన్నడించిన నాజి విడువక దొరలు । మిన్నేటికొడుకుపై మిన్నక కవిసి
చేయార్పవచ్చినఁ జెలరేఁగి యతఁడు । సాయకంబులవాన జడివట్టఁ గురిసి
పవనజు ధర్మజుఁ బదిటఁ బదింటఁ । గవల నాల్గిట మూఁటఁ గపికేతుఁ బదిట
నా భీమసుతు మూఁత్ప్యనెదింట నొకట । ద్రుపదు యుయుత్సునిఁ దొమ్మిదిటఁ బదిట
సౌభద్రు శైనేయు సామూఁటఁ బదిట, । ద్రుపదాత్మజులను బదూఁటఁ బదూఁట
నొప్పింపఁ, బాండుసూనులసేన కడిమి । ముప్పిరిగొనుచు భీష్మునిపైని బడినఁ,
బడనీక ద్రోణుండు బాణప్రవాహ । మడరించి వాఁగుల నాఁగుచునుండ
నట్టిసేనలు సొచ్చి యాపగేయుండు । కట్టల్క రౌద్రరేఖావైభవమున

1. నాథుల. (మూ)

బాహుగర్వమున నిర్భరమదోద్వృత్తి । సాహసంబున మహాశౌర్యసంపదను
ఘోరంబుగాఁగఁ బ్రేగులు జార్చి జార్చి । భూరిభుజాస్తంభములు చెల్గి చెల్గి,
మురియుచుఁ జెదర నెమ్ములు రాల్చిరాల్చి, । తఱచు నెత్తుట వసంతము లాడియాడి
చట్టలు నాము మాంసము చెక్కి చెక్కి, । అట్టుగా వెఱచి పాఱఁగఁ ద్రోలి ద్రోలి,
యజితలీలల గుండియలు చెండి చెండి, । గిజరుగాఁ దలలు పగిల్చి పగిల్చి,
యిల నృసింహుఁడుపోలె నెందైనఁ గలిగి । బలువిడి నుగ్రరూపంబు చూపుచును,
ఘుటికసిద్ధుఁడుపోలెఁ గొండొక చెడక, । నిటలాక్షుఁడునుపోలె నృత్యమాడుచును,
ఘనదవాగ్నియుఁబోలెఁ గడుఁ బొదలుచును, । బొనరఁ బ్రవాహంబుపోలెఁ ద్రెంచుచును,
పూని వీణాపాణిపోలె మీటుచును, । సూనరిపోలె నజ్జుగ నఱకుచును,
గుఱి హాలికుఁడుపోలె గుంపు విప్పుచును, । బోరి పోరి గ్రహవేధపోలెఁ దాఁకుచును,
శరవర్షమేఘమై చర్చింప నొక్క । శరపయోరాశియై సైన్యసంహార
నిరతిఁ బదాతుల నీఱుసేయుచును, । గరి సమారూఢుల గండడంచియును
తేరులొక్కటఁ గడతేఱఁ జేసియును, । దేరిచూడఁగ రాక తేజంబు కడిమి
రథచిత్రగతుల నుర్వర పెల్లగిలఁగ । రథమహాధ్వని దిశల్ రంధ్రముల్ సేయ
రణమెల్లఁ దానయై రక్తప్రవాహ । రణితంబు భువనాంతరాళంబు నిండ
నల పదునెనిమిది యక్షోహిణులును । నిలుచునే యితనికి నేఁడని తోఁప,
కారంబుగా రాచకట్టులు దురిగి । భూరిప్రతాపాగ్ని పుటముగా నూఁది
సాయకమయముగా సచరాచరంబు । చేయఁజూచిన యాదిసిద్ధుండు పోలెఁ
దలయూఁచి పలుమాఱు ధాత మెచ్చుచును, । జెలఁగి రారాజు గర్జించి యార్వఁగను
జరియించుచో, వారి సైన్యంబులెల్ల । శరములఁ దుమురయ్యెఁ జక్కయ్యె ధూళి
పటమయ్యెఁ బగిలియెఁ బలు[1]వ్రయ్యలయ్యెఁ । జిటిలియెఁ బెటిలియెఁ జీకాకుపడియెఁ
బగుల నా సేనలోఁ బార్థుఁ డెక్కడనొ! । నొగిలిన ధర్మతనూజుఁ డెక్కడనొ!
భీముఁ డెక్కడనొ! దీపింపక తలల । వాము లొండెను రక్తవైభవంబొండెఁ
బ్రేవు తెట్టువలొండెఁ బిశితాస్థివసల । ప్రోవులొండెనుగాని పొడగానరాక
సురనదీసుతుఁ డిట్లు శూరత మెఱయ, । మరలుప మానుప మగ లెందులేక
కరిమధ్య వి[2]నిబద్ధ ఘంటికావళులు । గిరినిభ తురగాంక కింకిణీచ్ఛటలు

1. వచ్చ. 2. మధ్యఖండి. (మూ)

దుందుభి పటహాది తూర్యచయంబు । గ్రందైన శరచాప ఘనగుణశ్రేణి
ధారుణిఁ బడి యూపుదప్పఁ జెండాడె । నార మేలని దివ్యు లభినుతి సేయ.
వాహనారూఢుల వధియించులావు । లూహింపఁ గిరిసొచ్చి యుపపసితతులు
కొనరారఁ [1]గొండాడి కొమ్ములు పెఱచి । వెస మోడుపఱచిన విధమున నుండు.
తల డొక్క కేల్గాలు ధరణి నేర్పడక । కలగలుపై యున్న కరులును హరులుఁ
జండికాదేవికి సకల మాంసములు । వండఁగఁ దఱిగిన వడువున నుండు.
గ్రొవ్వాఁడి తూపుల గుంపులై త్రెవ్వి । కవ్వలు [2]వడు వెలిగొడుగులు చూడ
నాశుగ నిహతిచే నటు నిటు పడిన । కాశసంహతికి సంకాశమై యుండు.
శరములఁ ద్రెవ్వి భూషణ చామరములు । పొరిపొరి బహువర్ణములఁ బడ్డ యొసలు
కవిసి యులాయంబు కలఁచు కల్హార । కువల యాంబుజముల కొలనయి యుండె.
ఇట్టు పాండవసేన నితఁడు చేకొలఁదిఁ । గొట్టి చాఁగ నైన గోవిందుఁ డలిగి
నరుఁ జూచి పల్కె : “ధనంజయ, కంటె! । సురనదీసూనుని శూరతక్రమము;
నిమిషమాత్రములోన నీసేన నెల్ల । నణుయింప నున్వాఁడు చాటి చెప్పెదను;
ఇవ్విధం బెఱిఁగియు నేల యుపేక్ష? । నొవ్వదే ధర్మసూనుని చిత్తవృత్తి?”
అని చెప్ప వినియును నమ్మాటలెల్ల । విననివాఁడై క్రీడి విన్ననై యున్న
వెండియు హరి పల్కె: “విరటుపాళెమున । నుండి సంజయుతోడ నొగి వెనుకకును
ఏనును వినుచుండ నేమంటి క్రీడి? । మానవచ్చునె నాఁటిమాటలక్రమము?
ఒరులు నవ్వకయుండు నునికి మే.” లనిన । నరుఁ డిట్లు చెప్పె మనంబు కందెల్ల :
“చంపుటకేఁ బ్రతిచంపక మానఁ; । జంపుచో బాంధవచక్ర మింత యును.
బంధుచక్రముఁ జంపి పడయు రాజ్యంబు । బంధమేకాక లాభము భంగి యగునె!
ఐనను నీవు నాకద్వైతబోధ । మాననిచ్చితిఁ గాన నాప్రభావమున
నరివధ చేసెద ; నాభీష్మమీఁద । నరుగ నిమ్ము రథంబు యదువంశతిలక!
ఈతని నారణం బీక్షింప సురలు । కౌతుకులైనారు కానంగ వచ్చు.”
అనినఁ గృష్ణుఁడు నట్లు నాతనిరథము । చననిచ్చె గాంగేయు సమ్ముఖంబునకు.
అదిచూచి వారిసైన్యముదైన్య ముడిగి । త్రిదశేంద్రసుతుఁగూడి దిట్టతనమున
గాంగేయు తేరిపైఁ గవిసిన నతఁడు । పొంగుచు దివ్యాస్త్రములు ప్రయోగించి

---

1. గ్రొడ్డాడి. 2. వలివేలి. (మూ).

యూఁనేనఁ బఱపి బిట్టార్చి హుంకార । భాసురుఁడై వచ్చి పార్థునిఁ దాఁకి,
"అర్జున, చూచి పోరాడుమీ నిన్ను । సర్జింపరాదని నృపులు చెప్పుదురు.
సురగరుడోరగాసుర సిద్ధ సాధ్య । నరుల గెల్చిన యట్టి పహాణు మానిసివి.
అడరితి నీమీఁద ననఘాత్మ, నన్ను । నడఁచి నప్పుడుగా జయంబబ్బు." ననుచు
ఘోర నారాచ సంక్షుభితాంగుఁ జేసి । నారాయణుని నట్ల నాటి నొప్పించి
వెండి మేడలవంటి చెలిమావురముల । గుండియ లుచ్చిపోఁ గోలలు పఱపి,
మైదుతూపుల వానరాంకంబు నాటి, । యా దివ్యరథమెల్ల నమ్ములఁ బొదువ,
రథ తురంగములు తీవ్రత యోర్వలేక । [1]శిథిలీకృతంబులై చిక్కులు పడుచు
విముఖంబులైన వేవేగఁ గృష్ణుండు । సమకొన్న తననొప్పి సరకుగాఁ గొనక
ఘోటకంబుల నూలుకొనఁ జేసికొనుచు । మేటి భీష్మని మీఁద మెరమెరతోడ
నరదంబు పఱపిన, నర్జునుండొక్క । శరమున గాంగేయుచాపంబు నఱికె.
నఱికిన నతఁడొండు నవశరాసనము । తఱచు దీప్తుల నింద్ర ధనువుతో నొఱయ
దొరికించుకొని తూపు తొడగక మున్నె । నరుఁ డదియును ద్రుంచె నారాచధార.
తునిమిన నింద్రపుత్రుని మెచ్చియతఁడు । ధనువు వేఱొక్కటి దాల్చి యవ్వింట
రాముచేఁ గొన్న నారాచ సప్తకము । సోమార్క వహ్నిరోచులుగ్రమ్మఁ దొడిగి
నరుని వక్షోవీధి నాటనేయుటయుఁ, । గరలాఘవము పోయి గర్వంబు దఱిగి
రక్తాయమానుఁడై రశ్మిగుందియును, । భక్తవత్సలుఁ డున్న ప్రాంతంబుగాన
సొలయక నిలిచి భీష్మనిమీఁద నస్త్ర । జాలము పరఁగింప సైన్యంబు లెల్ల
"ఆపగేయుఁడు నొచ్చె; హరిసూతి నొచ్చె; । వేహాయవలె నిదివేళగా." దనుచు
నాజి సేయకయున్న యన్నిభావములు । రాజీవనేత్రుండు రాణతోఁ జూచి,

## శ్రీకృష్ణుఁడు తేరు డిగి భీష్మనిపైకిఁ బోవుట

"యూరకే నేనున్న నుచితంబు గాదు; । సారథ్యమిఁకేఁ జాలుఁ జంపుదురిపుల;
తప్పెఁ గార్యము పోటుతడకట్టఁబట్టె; । తుప్పపట్టకయున్నె తూపులింతకును;
అవియేల మునికోల నడఁచెద." ననుచు । ధవళాశ్వముల డించి తనపని డించి
పదరుచు నొగలిపైఁ బగ్గముల్ వైచి । యదువంశ తిలకంబు యష్టిచేఁ గొనుచుఁ
గిటి శేష కచ్ఛప క్షితిధర కుంభి । పటలి పాతరలాడఁ బగుల నీమొనలు

1. శిదిలియంబులె. (మా).

అవనికి [1]లంఘించి యంతంతవెనుకఁ । దవిలి పార్థుండు రాఁ దనువు చెమర్ప,
'వడి మసుమని మీఁద వలదాగ్రహంబు । విడు' మని పాదారవిందంబు [2]గంగ
చిందెననంగ నూర్జితంపు ముత్యాల । యందియల్ ఘల్లుఘల్లని మ్రోయుచుండ,
పీతాంబరము జాఱఁ బింఛంబు జాఱ । జాతైనతొడవులు జవముచే జాఱ
గంగాతనూజుపైఁ గవియుచోఁ, నతఁడు । పొంగుచు సంతోషపులకముల్ నిండ
"హరిహరి! గోవింద! యచ్యుత! యమిత! । మురవిరోధి! ముకుంద! ముచికుందవరద!
రావయ్య మృతి తృణప్రాయంబు నాకు ; । నీవు చంపుదునంట! నేఁ జావలేనె!
విరజ యెవ్వఁడెఱుంగు విష్ణులోకంబు । తెరువు లెవ్వఁడెఱుంగు దేవేంద్రవంద్య!
కానఁబోయెడి తీఁగె కాళ్లఁబెనంగె ; । నే నిన్నుఁ గలిసెద నేయవే తెగను.
వేమాఱు నీకింత వేఁగైన నేను । భూమియుండిన నేమి పోయిన నేమి ?
పడఁజాలఁ బడఁజాల భవమహాంబుధి । కడలేదు కడలేదు కావవే తండ్రి!
వచ్చెదు పోయెదు వధియింప వెపుడు ; । మెచ్చుగా నిండదో మిగిలి నాతపము ?
దాసునిఁ గృపఁజూచు తలఁపున నీవు । భాసిల్ల వచ్చితి భళిరె నా సామి!
చెచ్చెర నీవు వేచేసి చంపంగఁ । జచ్చుటయో జన్మసాఫల్యమౌట."
అనునంత నర్జునుం డామహావిష్ణు । వెనువెనుకనె డాసి వెసనిల్వఁ బట్టె
నీతఁడు తగులక యీడ్చుకొనుచు । [3]నాతతగతిఁ గొన్నియడుగులు గడవ
నడుగులఁ బదిలంబు నాత్మసత్వంబు । నెడలంగ గాండీవి యెట్టకేలకును
శౌరి నిల్వఁగఁ బట్టి చాల దైన్యమున । నీరెలుఁగునఁ బల్కెఁ : "నేమయ్య కృష్ణ!
ఆజి మానఁగలాఁడనని బాస పల్కి । రోజించితివి నన్ను యుద్ధకార్యమున.
సత్యవాదివి నీవు సరణి దప్పినను । సత్యమెక్కడఁ బోవు జగదేకవరద!
ఏనుండ నీతని కెట్లెత్తుకొంటి? । వేఁట డయ్యారే యెవ్వారు నాజి?
ఎగ్గులుమోప నన్నిట జాఱవిడక । దిగ్గున రావయ్య తేరిమీఁదికిని.
హితమేది భీష్ము నేనెంత నొంచెదనొ । ధృతిఁజూతు రావయ్య తేరిమీఁదికిని.
నీవులేని రథంబు నేనెక్క వెఱతు । దేవ, రావయ్య నా తేరిమీఁదికిని."
అని యని ప్రార్థింప నమ్మాటలకును । వనమాలి నవ్వుచువచ్చి తేరెక్కె
పార్థునిఁ దేరెక్కఁ బనిచిన నతఁడు । నర్థిఁ దేరెక్కి శరాసనంబెత్తి
దేవదత్తంబొత్త దేవ, నీ మొనలు । జీవంబులెడలి మూర్ఛిలి తన్నుఁ గొనఁగ

1. బంపించి. 2. గలఁగ. 3. నాతని. (మూ).

నప్పుడు ప్రళయకాలాంతకు పగిది । నిప్పులు కన్నుల నిగుడ మీతండ్రి
యార్చి శేషసమంబులైన బాణములఁ । జేర్చి యా సేనలఁ జేటెత్త నేసి
[1]గాలిధూళులఁ బుచ్చి ఘనుఁ డంతఁ బోక । వాలికతూపుల వనమాలి నరుని
నొప్పించి భీమసేనుఁడు మొదలైన । యప్పాండవానీక మతిభీతిఁ జూడ
యాదవబలమును నా మత్స్యబలము । చేదిబలంబును సింధుబలంబుఁ
బాంచాలబలమును బలిసి పైఁబడిన । సించుక దయలేక యా శాంతనవుఁడు
క్షితి బలుమానిసి చీమలతెట్ట । ధృతిఁ గాలఁబ్రాకిన తెఱఁగు దీపింప
మార్గణంబుల దూపుమాపుచునుండ । భర్గు రెండవకన్ను పడమటఁ గ్రుంకె.
ప్రొద్దుగ్రుంకినఁ బెద్దపొద్దు పార్థులకు । నద్దేవనదసూనుఁ డరుగఁడై తోఁచె.
'ఆపగేయునిచేత నడఁగి పాండవులు । [2]వేపట్టిప్రత్తురో వీకులై నన్ను
నొదిఁగెదఁ గాక పయోధి' నన్నట్లు । చనురొప్ప రవి యిట్లు చరమాద్రి నొదిఁగె.
యమునూతి యట్లు సంధ్యాప్రవర్తనము । తనుసైన్య మట్లున్న దైన్యంబుఁ జూచి
కుందుచుఁ దలయూఁచుకొని వెచ్చనూర్చి । చెందినవగఁ గొంతసే పూరకుండి
'ధృతి నిప్పటికి సేనఁ ద్రిప్పుటే కార్య । గతి యని తలపోసి ఘనుఁ డట్టిపనికిఁ
దగువారి నియమించి తాతచే మిగుల । నొగిలిన తమ్ములు నొగిలిన దొరలు
వెడజూదమున నాఁడు విఱిగిన పిఱుగు । తడవి వెండియువచ్చెఁ దమకని తోఁప.
మానంబుతోఁ గొల్వ మానవేశ్వరుఁడు । సేనానివేశంబు చేరె దైన్యమున.
నీతనూజులు నిట నిజసేనఁ ద్రిప్పి । కౌతుకంబున భీష్ము కడిమి మెచ్చుచును
మ్రొక్కుచుఁ దెలివిమోములఁ బిక్కటిల్ల । మక్కున వచ్చిరి మందిరములకు.
దురమున యమునూతి తొమ్మిదోనాఁడు । కురుసేన కిట్లు నుగ్గులుగాఁగ విఱిగి
యారాత్రి నొంటిమై ననుజులుఁ దాను । నారాయణుండున్న నగరికిఁ బోయి
యుచితాసనంబుల నున్నచో సొలపు । పచరించి హరిఁజూచి పలికె ధర్మజుఁడు :
"చూచితిగా నేఁడు సురనదీతనయుఁ । డేచి సేనల నెదురెందును లేక
చెండాడె; నేమిచేసిన మాను వగపు? । అండాన నెల్లి యేమని వత్తు ననికి?
ఇప్పుడు నాత్మలో నితనిరౌద్రంబు । డెప్పరంబై తల్లడింపంగఁ జొచ్చె.
ఆఖండపరశువో! యాఖండలుండో! । యేఖండములఁ గాన నింతటివాని!

1. గాలిధూళ్లు. 2. ప్రేపట్ట ప్రంతురో. (మూ).

సర్వాంకుఁ డింకేటి సత్వంబులేక । దర్పించి మనతోడఁ దానెట్లు పోరు?
కావున నాకునై కలసేనలెల్లఁ । జావంగ నేటికి సమరంబు చాలు.
అటుగానఁ దపమున కరిగెద ముక్తి । ఘటియించు పుణ్యాలఁ గనుఁగొందు నధిప!
కడునొచ్చె నిదె నాకుఁగా నీబలంబు ; । కడపట సమరముఖంబున కీక
యొద్దనే యిడుకొని యుండెద ; దీని । కెద్ది హితంబు నాకెఱిఁగింపు దేవ!"
యనిన నించుక నవ్వి హరి నృపుఁ బలికె: । "విను నీకుఁ దపమేల? విపినంబులేల?
అనుజులు నీకు మహాప్రతాపాఢ్యు । ఘను లరి భంజనక్రము లున్నవారు ;
ఏనున్నవాఁడ నీకేల యీవగపు? । భూనాథ, విమతులఁ బోరిగొందుగాక.
పగవకు నరుఁడు దేవవ్రతుమీఁదఁ । దెగఁ జాలకున్నను దెగువనై నేను
బగ యణఁగించెదఁ బట్టక నన్ను । దగిలి చూడుము చాలధైర్యంబు పట్టి.
సంజయుతో సవ్యసాచి యేవినఁగ । [1]నెంజిలిమాటలు నెఱి నాఁడెఁ గొన్ని.
అవి వెలారింపక యతఁ డేలమాను? । నవనీశ, యేనేల యవి మాననిత్తు?
అవిగాక యేనును నాడితిఁ గొన్ని । వివిధవీరోక్తులు వినఁగ సంజయుఁడు.
అవియేల నరుఁడు సేయక పోవనిచ్చు । నవనీశ, యీకార్యమంతయు." ననిన
నారాజు తనకోపమంతయు మాని । శౌరికయ్యము[2]మాట జాఱ నిట్లాడె:
"రణ మహాభార నిర్వాహణ విద్యకును । గుణిఁ బార్థుఁ జాలించి గోవింద, నీవు
తన సహాయకగదా! తలకొంటి మొదల; । అనిసేయు మాట లిట్లాడుట తగవె!
ఆపని యట్లుండె, నాది కాలమున । నాపగేయుండు నాకనురక్తితోడఁ
గౌరవకార్యంబు గావించునప్పుడు । కోరుదు హితమని గుణమాడినాఁడు.
నవఖండ రాజ్యంబు నాకు నీవలసి । తవులాటముగ నాడెఁ దాత యీమాట.
మముఁ దండ్రితరువాత మక్కువఁ బెంచి । విమతుల రాయిడి వెల్లిఁ గాపాడి
కడపట రాయిళ్లు గలిగినయపుడు । విడువఁ జాలనితాత వెదకినఁ గలఁడె!
ఇట్టి పుణ్యాత్ముని నిలఁ గూల్చియైనఁ । బట్టంబు గైకొనఁ బదరెడు మనసు.
కాల్పనా యీ వృథా క్షాత్ర ధర్మంబు! । బేల్పట్ట విధి నన్ను బెనఁచినాఁ డిందు."
అనిన నచ్యుతుఁ డాత్మ నతఁడు గాంగేయుఁ । గనుఁగొనఁ బోయెడు కథలు మున్నెఱిఁగి
దేవవ్రతుఁడు తన్ను దిక్కిగిరమ్మనిన । యావాక్యమున కేఁగునదియును నెఱిఁగి
ధర్మజుఁ బలికె: "నీతలఁ పెల్లలెస్స ; । ధర్మాత్ముఁడగు భీష్ము దర్శింపఁ బొమ్ము.

1. నేఁజీరి. 2. చోటు. (మూ)

నీవు గానఁగఁ బోయి నెయ్యంబులాడి । యావీరు నేఁడాజి నాఁపగ యున్న
నేనఁ జూర్ణంబుగాఁ జేయు సజ్జోగు; । దీని నెఱింగి చింతింపు హితంబు.
నీవిప్పు డరుగుము నిజసాధ్యోపాయ । మావీరుఁ డెఱిఁగించు నది తప్పరాదు.
మనమందఱము గుప్తమార్గంబుగాఁగఁ । జని యమ్మహాత్ముని చరణపీఠమున
శిరములు మోపి నిశ్చింతత నెట్టి । వర మడిగిన నిచ్చు వరదయామూర్తి.
అతఁడు చెప్పినత్రోవ నందఱు నడువుఁ । డితర మేటికి ?" నన్న నిది కార్యమనుచు

పాండవులు రహస్యప్రకారమున భీష్మునియొద్దకుఁ బోవుట

వంచనావృత్తి నెవ్వరుఁ గానకుండ । నెంచఁ గృష్ణునిఁ గూడి యెల్లపాండవులు
సౌమ్య వేషములతోఁ జనుదెంచి భీష్ము । రమ్య హర్మ్యస్థలి రయమొప్ప నెక్కి
సముచితగతిఁ జొచ్చి జాహ్నవీతనయు । మమతపెంపునఁ గాంచి మక్కువ మ్రొక్క
నత్యాదరంబున నతఁడు దీవించి । ప్రత్యేకకుశల సంప్రశ్నలు చేసి,
"హరి పూర్వకముగ నిట్లందఱు నిచటి । కరుదేరఁ బనియేమి ? హరిశౌర్యులార !
ఏమిగావలె వరం బెఱిఁగింపుఁ." డనిన । దామోదరుని బుద్ధిఁ దలఁచి ధర్మజుఁడు
అవనత వదనుఁడై యప్పుడిట్లనియె : । "దివిజనదీపుత్ర, తిరుగకు వరము ;
ఏ వరంబున రాజ్యమేతెంచు నాకు । నే వరంబున సేన యిటు నాకు నిల్చు ;
నా వర మిమ్మన్న నతఁడు చింతించి, । "భూవర, యే నాజిఁ బోరాడునపుడు
నీకు రాజ్యమురాదు నిలువదు ప్రజయు । నాకు నీవరమును నడపను వలయు ;
నానాక్రమంబుల నన్ను నిర్జించి । పూనుము శుభములు భూనాథతిలక !"
అనిన నంజలిచేసి యారాజు పలికె : । "నిను గెలువఁగరాదు నిర్జరాదులకు;
నిప్పుడు చూచిన నీవు మనుష్య । చొప్పు దాల్తువుగాని శూరత నాజి
మిక్కిలి చేదోయి మిక్కిలి కన్ను । నెక్కినగోరాజు నిల దాఁచి హరుఁడు
పోరాట కేతెంచుఁ గొల్కి నుండుదువు । తేరిచూడఁగరాదు దేవ, నిన్నపుడు.
ఇచ్చట నీకృప యేమాశ్రయింప । వచ్చితి మెఱుఁగనివారము గాము.
ఇట్టి నిన్ను జయింప నేదియుపాయ ? । మెట్టైన నది నాకు నెఱిఁగింతు గాక."
అనిన భీష్ముఁడు నవ్వి, "యదియట్ల తగును ; । నను గెల్వఁగాదంటి నరనాథ, నిజము,
అది యెఱింగియు గెల్వ నను వడిగెదవు ; । తుదిఁ జెప్పకుండుట దోషంబు నాకు.

విల్లు వట్టుచునుండి యేను మేను దొల్లి । యెల్లరు వినఁ నిర్ణయించిన ప్రతిన.
జోడుఁ బుచ్చినవాని, స్రుక్కుచు శిరము । వీడినవానిని, వెలఁదినై పుట్టి
పురుషత్వ మట మీఁదఁ బొందినవాని, । ధరణిపైఁ దనయాయుధముఁ బెట్టునతని,
[1]నిడము వంచినవాని, స్త్రీపేరు తనకు । నడవ నుండెడువాని, సందనహీనుఁ,
దోడఁ బుట్టినవాఁడు దొరకని యతని । నోడుదు నాజిలో నొగి నెదిరింప.
నారినై మునుపుట్టి నడుమఁ బౌరుషము । చేరినట్టి శిఖండి సేనాని మీకు.
అతఁడు తొల్లిటి జన్మమందును మగున. । హితము చెప్పెద మీకు నింద్రజుఁడాజి
వాని మున్నిడుకొని వచ్చి యే నేటు । గూలినతరువాత మఱి నొంచునేని
పడుదు; నంతన బంధుపరివారయుక్తిఁ । బడుదురు కౌరవభటులు మీచేత.
ఇది నాకునపకార మీవుగాదనక । వదలక సేయుము వచ్చుఁ గోరికలు.
అనయంబు నిందు దోషాదోషచింతఁ । బనిలేదు మీకు నాపనుపునఁ గాన."
అనిన వా రట్లు కాకని సాఁగి మ్రొక్కి । కనుఁగవలను బాష్పకణములు దొరుఁగ
నింతదయామూర్తి నింత సర్వజ్ఞు । నింతటిపురుషార్థహితుఁ గాన మనుచు
మనసున శోకంబు మడతలు గొనఁగ । మనుములు తాత సమ్మతి వీడుకొనుచుఁ
దమపాళెములకు నందఱుఁ బోవుచోటఁ । గమలనాభునిఁ బల్కెఁ గాండీవధరుఁడు:
"సంసారభారంబు చాలించెఁ గాన । హింసకు నను బెట్టె నీపుణ్యాధనుఁడు.
వంచన నితని సర్వరఁ గూల్చి యేను । బంచపాతకులలోఁ బడఁగలవాఁడ.
బాలుండనై ధూళిపటలిలో నాడ । నాలింగనముచేసి యటఁ దెచ్చి నన్ను
బాండుఁ బోలిన బాహుబలుఁడు వీఁడనుచుఁ । బుండలించిన తాతఁ బోనాడఁ గలనె!
అక్కటా! తండ్రి లేఁడనకుండ మమ్ము । నొక్కలాగునఁ బెంచి యుర్వి యేలించి,
నేఁడును హితమాత్మ నెఱపెడు తాత । వాఁడి తూపులఁ జంపువాఁడను గలఁడె!
గురుని ధర్మజ్ఞుని గుణి వయోవృద్ధుఁ । బరమశౌర్యు దయాళుఁ బరతత్త్వవిదుని
సురనదీసుతుఁ జంపఁ [2]జొచ్చునే మనసు! । బిరుదుతో సేనఁ జంపినఁ జంపుఁ గాక."
అనినఁ గృష్ణుఁడు నవ్వి యర్జునుఁ బలికె: । "విను రాజవై బుద్ధి విడుతువే నీతి!
క్రూరతఁ బోర్చి శత్రుల రోయకణఁచి । ధారుణిఁ బ్రజలచేఁ దగుపాలుగొనుచుఁ
క్షాత్త్ర వ్రయంబు దప్పని ధర్మరతియుఁ । జిత్రసాహసము ప్రసిద్ధి రాజులకు.

1. శిరము. 2. నేర్చునే. (మూ)

అదియును గాక నీ వాపగాతనయుఁ । గదనంబులోఁ జంపఁగలవాఁడ వనుచు
నాఁడితి వీమాట లఖిలంబు నెఱుఁగ; । పాడియే యిమ్మాట ప్రతి వాల్కనికి ?
పలుకులేటికి భీష్ముఁ బరిమార్చుటకును । నలువ నిన్ను సృజించినాఁడు మేదినిని."
అనినఁ గవ్వడి పల్కు: "నట్లైన నాజి । నెనయ శిఖండి మున్నిడుకొని యేను
నితరుల నేయుదు; నీతఁడా భీష్ము । ధృతిఁగూడి యేయును దెగువతోఁడుతను.
వాహినీతనయుండు వాసిచేఁ గాని । దేహంబు విడువఁడు దేవతాఘటన."
అనిన నవ్వి మురారి యాక్రీడిఁ బలికె: । "అనఘ, మంచున సూర్యుఁడణఁగునే యెందు!
వలలకుఁ దగులునే వాలుసింహంబు! । చెలఁదినూలునఁ బోయి చిక్కునే గరుడి!
కమ్మని గాడ్పునఁ గదలునే కొండ! । యిమ్మహాబలుఁ జంప నీతనితరమె!
నీయేట్లకును గాని నీతాత వజ్ర । కాయంబు దునియదు కడపటిమాట.
ఆచార్యు మెప్పించి యాతని కృపను । నీచేతఁ దగిలిన నిశితబాణములఁ
దెలిసి నీవు శిఖండి దీముగా నొడ్డి । బలిమి నేసినఁ గాని పడఁడు భీష్ముండు."
అనుటయు ననుమాన మర్జునుండుడిగి, । "ఘనుఁడ, నీవాక్యంబు గాదన వెఱతు;
అప్పటి కొకకార్య మయ్యెడుఁ గాక । చెప్పనేటికి ?" నన్నఁ జెలఁగి రందఱును.
వినుము భూవర, పాండవేయు లీరీతిఁ । జనుదెంచి శిబిరంబు సంప్రీతిఁ జొచ్చి
జలజాక్షు నిజ నివాసమునకు ననిచి । తలకొని తాముసు దమ తమ యిండ్ల
ననిచిరి సుఖనిద్ర నారాత్రి." యనిన । జనలోక విభుఁడు సంజయుఁ బల్కె నిట్లు:
"పౌరుషోపాయంబు పాసి పాండవులు । శౌరి వాక్యముల వంచనకు లోనగుచు,
గౌరవార్థవిధేయు గాంగేయుఁ జంపఁ । గోరి రెంతసుఖంబొ కువలయాపేక్ష!
ఏయకుండెడువాని నేయఁ బార్థులకుఁ । జేయి యెట్లాడె నూర్జితశౌర్యులయ్యు ?
వినిపింపు తెరువాతి వృత్తాంత." మనిన । జనవల్లభునకు సంజయుఁ డిట్టు లనియె:

## భీష్ముని దశమదివస యుద్ధక్రమము

"అరుణోదయమ్మున నమ్మఱునాఁడు । పరివార సహితులై పాండునందనులు
వెడలి మొగ్గర మర్థి విరచించు చోటఁ । బుడమిఱేని యనుజ్ఞఁ బూని సేనాని
మొనకు దండి శిఖండి ముందట నిలిపి, । ఘనపార్శ్వముల భీముఁ గవ్వడి ననిచి,
ద్రౌపదేయుల సుభద్రాతనూభవుల । దాపట వెలుపటఁ దగనుండఁ బనిచి,

యానికటములఁ గృష్ణానుజుఁ జేకి । తానుల నిల్వ, నందఱకు ముందఱను
దానును దన సహోదరులును మాద్రి । సూనుండు మఱి ధర్మజుఁడు నిల్చిరధిప !
వీరి సూరెల మత్స్యవిభుఁ డాదిమైన । ధారుణీశుల నిల్పి దండనాయకుఁడు
కేకయులను ధృష్టకేతుని [1]నిశము । గైకొని ముంగలగా నిల్పె నధిప !
గట్టి మొగ్గర మిట్లు గావించియప్పుడు । నెట్టన బహుతూర్య నినదంబుతోడఁ
గాంతేయు లేతేరఁ, గౌరవాధీశు । లంతకుమున్న కయ్యమునకు వెడలి
గాంగేయు నగ్రభాగంబున నిలువఁ । ... ... ... ... ... ...
గాంభోజ మద్రదేశ గాంధారముఖ్యు । కుంభిపీపతు లంతఁ గూడి సైన్యముల
రాజుచుట్టును రామరక్షమై నిలువ । రాజేంద్ర, మీ మొగ్గరం బిట్లు గూడి
కదిసిన రెండు మొగ్గరముల నస్త్ర । [2]భిదుర ఘట్టన వహ్ని పృథివివేంచుచును
అన్యోన్య ఖడ్గధారాహత ప్రహత । విన్యస్త శోణితావృతలోక మగుచు,
నితరేతరాహ్వాన హింకృతధ్వాన । వితత ప్రతిధ్వాన విపులాద్రియగుచు
రణము చెల్లఁగఁ బరాక్రమశాలి భీష్ముఁ । డణిమాదిగుణ మార్గణావళి పఱపి
ప్రకట శాత్రవ సహస్రముల మబ్బాము । లకుఁ దెచ్చుచో నందు లయమైన విండ్లు,
విఱిగిన పడగలు, ప్రీలినజోళ్లు, । చిఱిగిన గొడుగులుఁ, జీకాకుగాఁగఁ
గెడసిన హయములుఁ, గీలూడిధాత్రిఁ । బడిన తేరులు, ద్రగ్గఁబడిన యేనుఁగులుఁ,
గాల్గాలఁ బెనఁగిన కాల్బంట్లు, దిశలు । నాల్గు దాఁటిన రక్తనదులును గలిగి,
లయకాల రుద్రలీలా తాండవోగ్ర । భయద ప్రతాప సంభ్రమమయ్యె రణము.
కనుఁగొని యార్చి శిఖండి యాభీష్ము । నొసర మార్కొని నాల్గునుగ్రబాణముల
నాటిన విముఖుఁడై నవ్వుచు భీష్ముఁ: । " డేటికిఁ దిరుగుదువీవు కయ్యముల ?
మడఁది పుట్టుసుగాక మగపుట్టుఁ గాక । యెడ కాటమైన పుట్టిట్లు మోసెదవు ?
ఆఁడు చందము చెందినట్టి నీవెంత । వాఁడిచూసినఁ జూపు వనిత, యేనలుగ.
ఓశిఖండి, తొలంగు మోసి! ఖండింప । నాశయే యాతిని నాట దాసికివి?
[3]పంపులు పడి వచ్చి పాండవసేనఁ । జంపనీయక యేడ సంగడమైతి?"
వనినఁ గోపించి వాఁడనియె భీష్మునకు: । "నను నేల యాడుచందము చెందె నంటి!
వాడలిలో నగమిట యువిదయైనాఁడు । మృడుఁడు లోకులకింత మెత్తనై నాఁడె!

---

1. నితల 2. బిరుదుకట్టిన. 3. పప్పులు. (మూ).

ఆఁడదియే పోరె నది సత్యభామ; । యాఁడదిదయై పోరె నది భద్రకాళి.
ఏనును నీతోడ నిప్పుడు పోరి । మేనితోఁ బాపెద మేటివై నిలుము.
ఇరవొప్ప నృపతుల నిరువదియొక్క । తరముల నారి నంతకుఁ గూర్చినట్టి
పరశురాముఁడ కీవు ప్రతి ననుకొందు. । ... ... ... ... ...
ధృతి నన్ను గెలువుము దీల్పడిపోక. । ... ... ... ... ...
ఆరయ మగవాఁడవైన నీవొక్క । నారాచ మేయుము నామేను నాట.
ఏయు మేయుకయున్న నే నిన్ను దీవ్ర । సాయకంబులు నాటి సంహరించెదను.
ఇమ్మైన నిన్ను నే నిలఁగూల్పకున్న । నమ్మిక నేఁ బట్టినది విల్లుగాదు."
అనుచు వెండియు భీష్ముఁ జతఁజేయుచుండ । ననిమిషేంద్రతనూజుఁ డాత్మ నుప్పొంగి,
"వింతయైనది నేఁడు వీని చందంబు; । శంతనుసుతునకుఁ జావు కాలంబొ!
ధర భీష్ముఁ బ్రదెక్కుచు దైవంబవీనిఁ । బెరరేచి యాడించె బీరంబు లిట్లు.

## అర్జునుఁడు ప్రోత్సహించి శిఖండిని భీష్మునిపైఁ గవియించుట

ఏను నీయుత్సాహ మినుమడింపంగఁ । బూని పల్కెద." నని పురుహూతసుతుఁడు
ఓరా శిఖండి! నేఁ డడరియున్నాఁడ । వారాసి ఖండింపు మాపగాసుతుని.
మానకు మీ వైరి మండలితోడ । నూనవేంద్రులు నగ మగమాటలాడి.
వెనుకకుఁ బోకుమీ వీరెల్ల నన్ను । ఘనత నొత్తుకయుండఁ గాపాడునాఁడ."
అనియె నప్పుడు; భీష్ముఁడప్పుడు తొలఁగి । చని బల్మిఁ బాంచాలసైన్యంబుఁ దాఁకి
కలఁప నయ్యెడఁ జొచ్చి కౌంతేయుబలము । బలభేదినందను ప్రాపున నెక్కి
కురుసేన నాహుతిగొనుచుండఁ జూచి । కురుపతి మిన్నేటికొడుకును డాసి,
"కటకటా! నీవుగల్లఁగ నాబలంబు । ఇటు కొల్లఁ బోవునే యితరులచేత!
ఈ వూరకున్నచో నెవ్వారు దీనిఁ । గావఁ బ్రోవను దిక్కు కఠినవ్రతాప!"
అనిన దేవవ్రతుం డారాజుఁ బలికె: । "వెనుకకు నీసేన వెనఁగాతుఁ బ్రోతు;
తఱుగని యట్టి సత్యము నేఁడునాకుఁ । దఱిగినట్లున్నది దైవకృతంబొ!
నిత్య వేవుర వర్ణనీయ సాహసుల । మృత్యువునకుఁ జేర మీఱెడువ్రతము
నీకొక్క నేఁటితో నిప్పుడు తీఱె. । నాకు నీచేయు మన్నన దొడ్డయప్పు.
నేఁటిచందముచూడ నృప, వారునన్ను । మీఁటుదురో వారి మీఁటుదో పాఱి.

ఒసర నీ కెంటిలో నొక్కటి నిజము; । విను వారి నే మీఱఁబోవఁగను సంశయము.
మర్త్యమాత్రులచేత మడియరు వారు; । మర్త్యమాత్రులచేత మడియను నేను;
నరనాథ, యట్లయ్యు నాచేతి బలువు । పరికింపుమీ." యని బాహుగర్వమునఁ
బటుతర వివిధాస్త్ర పావకశిఖల । నటు నిటు వైరిసైన్యాటవిఁ బొదివి
కౌంతేయపరులకుఁ గనుఁగొనరాక । యెంతయుఁ గ్రూరుఁడై యితఁడగ్నిఁబోలె
వెలుఁగుచు నాసేన వెసఁ గాల్చుచోట । బలు గాడ్పుచండమై ప్రభువ, నీ మొనలు
తోడైనఁ దొడఁగి 'నిర్ధూమధామంబు' । జాడ సేయఁగఁ, జూచి చైద్య పాంచాల
పాండవ యాదవ పాండ్య కేకయుల । దండనాథు లెదిర్చి తఱిమిఁ బేర్చి
ధార్తరాష్ట్రబలంబుఁ దఱిమిన వ్రేలు । దూర్తమవర్ణ రాసి తుటుములంబు బలసె.
అట్టిచోట శిఖండి నాక్రీడి చూచి: । "చుట్టుముట్టుఁడు భీష్ముఁ; జొరుము పోటునకు;
ఏనున్నవాఁడ నీకేల శంకింప? । నీ నిర్ణయములేల నెఱపవు తెగవు?
ఈతని పనియెంత యీవటు నిలువు । శాత సాయకములఁ జంపెద నేను."
అనిన మాటలు విని యఖిలసేనలకుఁ । దనచేయి ద్రుపద నందనుఁ డెత్తి పలికె:
"మన యోధులందఱు మందాకినేయు । నినుపుఁ డమ్ములవెల్లి నిశ్శంకఁ బొదివి.
ఇంద్రజుండున్నవాఁ డీ సమీపమున; । నింద్రాయుధముఁ బోలు నీతనివిల్లు;
ఏనున్నవాఁడ మీకేల కొం." కనుచు, । సేనాధిపుఁ బల్కె జిష్ణుండు తాన:
"ఏవింటి నిదివేళ యీభీష్మునడఁప । నీవంటి వానికి నేలయుపేక్ష!
తోడుగలప్పుడే తొడఁగి శాత్రవుల । నోడఁజేయక యున్కి యుచితమే!" యనిన
గణనకు నెక్కుడై కౌంతేయభటులు । గుణనినాదములు దిక్కులునిండఁ గవిసి
యేయుచో వారితో నిట్లను భీష్ముఁ: । "డాయువులొల్లరో యజ్ఞానులార!
భారమతులు మీరు పాఱక యేల । తూఱవచ్చెదరు మృత్యువుకోఱలోన ?
కొలఁదులఁ బోవు నాకోలలు గుండ్ల । కొలఁదులు మీకు గ్రక్కున నెక్కఁదగునె?"
అని యనివారణ నాభీష్ముఁ డేచి । తనువులొల్లనివారి దళముల నేసె.
మహితాత్ములపుడు ధర్మజ భీమ నకుల । సహదేవులును సైన్యసంరక్షకుండు
కేకయులును ధృష్టకేతు సాత్యకులుఁ । జేకితానుఁడు మాత్స్య జిష్ణునందనులుఁ
బాంచాలి కొడుకులుఁ బరఁగ మాగధుఁడుఁ । బాంచాలుఁ డాదిగాఁ బసనైన దొరలు
ఏకయత్నంబున [1]నెక్కుచో, నిచట । నీకుమారులును ద్రౌణియు ద్రోణ కృపులు

1. నొక్కుచో. (మూ)

భూరిశ్రవసుఁడు కాంభోజ సైంధవులు । సార బల ప్రౌఢి సమరయత్నమున
గాంగేయునకుఁ దలకడచి యాదొరల । సంగరించి యొనర్చి రాహవక్రీడ.
ఇట శిఖండినిఁ గ్రీడి యెదురుగా నొడ్డి । తటినీకుమారుతోఁ దలపడఁ గడఁగఁ
దొడిఁబడ నెడసొచ్చి దుశ్శాసనుండు । వడిఁ గ్రీడి వాలంపవాన ముంచుటయు
సరకుగాఁ గొనక వాసవి దంతిముఖుఁడు । విరులవానఁ జెలంగువిధమునఁ జెలఁగి
సానఁబట్టిన నారసము లక్కుమారు । మేన ముప్పదిగ్రుచ్చ మిగుల నొచ్చియును,
యువరాజు ఫాల్గునియురమున నైదు । పవులక హరిమేనఁ బదియు నాటుటయు
నగుచు నర్జునుఁ డవి నఱకి యయ్యనుజు । మొగమున నాలుగమ్ములు నిల్వ నాటి
విల్లు ద్రుంచిన నొండువిల్లు వాఁ డమరు । లెల్ల మెచ్చఁగఁ దాల్చి యింద్రజు మేన
నారాచములు సంప నలిఁద్రుంచి యశనిఁ । గ్రూరాస్త్రముల మూర్ఛఁగూర్చె నర్జునుఁడు.
అప్పు డాతనిఁదెచ్చె హయచోదకుండు । తప్పక భీష్మురథంబు మాటునకు.
భూవర, విను మద్రభూపతి దొడర । నావేళఁ బద్మనాభానుజుతోడ,
అరయ సుదక్షిణుం డభిమన్యుతోడ, । సరిద్రౌణి మత్స్య పాంచాలురతోడ,
ధృతి సహదేవుతోఁ గృపుఁడు, నమ్మాద్రి । సుతు నన్నతోడ నచ్చుగ వికర్ణుండు,
దొరయ ఘటోత్కచుతోడ దుర్ముఖుఁడు, । పోరి పోరి భీముతో భూరిశ్రవసుఁడు,
నంత ధర్మజుతోడ నస్త్రగురుండు, । వింతగాఁ బోరాడ వెలసెఁ గయ్యంబు.
అన్యోన్య కేతనాయత ఖండనములు, । అన్యోన్య సూతసంహార కర్మములు,
అన్యోన్య జవనవాహన హరణములు, । అన్యోన్య చాప సాయక భంజనములు
కలిగి యామొక్కటికయ్యంబు చూడఁ । బ్రళయకాలాభీలభంగి దీపించె.
మెఱయు బాణార్చులు మెఱుఁగులు గాఁగ । నుఱుకు మహార్వ్యధ్వను లుఱుములు గాఁగ,
నారక్తధారాళి యత్యంతవర్ష । ధారలుగాఁగ, యుద్ధము మేఘసమయ
మహిమ దానై యుండె మనుజేంద్ర! దాని । మహిమ యేమని చెప్పవచ్చు మాటలను.
అట్టిమేఘుఁడు తన్ను నాక్రమించుటయు । గిట్టిసరణము వీక్షింపలేదనుచుఁ
దప్పించుకొన మింటితల యెక్కెనన । నప్పుడు మధ్యాహ్నమయ్యె సూర్యునకు.
ఒగి నంతలో మూర్ఛ యువరాజు తెలిసి । మగుడ వచ్చి కిరీటి మార్కొని కడిమి
నారాచశతకంబు నాటి యారీతి । నారాయణుని మేను నాటెను, నలిగి
రారాజు తమ్ముని నురంబునఁ గ్రీడి । నారాచశతకంబు నాటి బిట్టార్చి
పాంచాలి నీడ్చిన బాహుదండంబు । ద్రుంచెదనని తూపు తొడుగుచో, శౌర

వారించి యిట్లను: "నాయుజు సూడు । మేరదప్పి యిదేఁ మీఁదఁబుచ్చెదవు?
మొండి కూడొల్లక మును వీఁడు మూఁగియు । గాండీవి, భీముని గద చిన్నఁబోదె!
నొంచిపుచ్చుము వీని నొంచవు లే!'' లనిన । సంచితశరపంక్తి యతఁడును బఱపి
యువరాజు రథము విల్లుగుత్తరధ్వజము । కవచ సూత హయాళిఁ గడు మాపుమాపి,
నుగ్గవిచేసి వంచుటయు నాఁ డలిగి । దగ్గఁ గృతవర్మ తేరెక్కె నధిప!
ఇటఁ గిరీటి శిఖండి నెదుటిడి భీష్ముఁ । బటు విశిఖంబులఁ బొలాడవలసి
యతని ముందఱ నేన నతిఘోర విశిఖ । శతములఁ బొదువ, నచ్చటికి ద్రోణుండు
భీషణ భ్రూభంగ పిచ్ఛిలక్రోధ । రూషిత నేత్రసరోజుండై [1]యుడర
నెడసొచ్చి సేనాసమేతుండై జముని । కొనుకు ద్రోణుని తోడ ఘోరాజి సేయ

## ద్రోణుం డశ్వత్థామను భీష్మునకుఁ దోడంపుట

అతఁ డంతఁ దనపుత్రు నల్లనఁ బలికె: । "సుతుఁడ, నాయుల్లంబు చొరదు పోటునకు;
తతిదప్పె దివ్యాస్త్రతతి; మంత్ర తంత్ర । గతి తప్పె; పడఁకెఁ గార్ముకయష్టి;
[2]చేతులు సేయవు చెప్పినయట్లు; । భీతియయ్యెడు; నాత్మఁ జేటెత్తెఁ గడఁక.
ధవళ[3]వాహుఁడు నేఁడు తనపూని కీర్చు । ధ్రువమని మనసులోఁ దోఁచుచున్నదియు.
అటు నిక్కచూచుమా యాతని మునుము । పటుభంగి నేపాటు పడుచున్నయదియొ!
కూలెడు హయములు, [4]కుంభముల్ పగిలి । వ్రాలెడు గజములు, వసుధ రూపఱిన
తేరులు, నుగ్గులై తెగిన పదాతి । వీరులునై చూడ వెఱపు సేయుచును
బ్రలయకాలాంతకు పళ్లెంబులోని । కలగంపు బోనాలకరణిఁ జూపట్టె.
పడిన బలంబులఁ బ్రాణానిలంబు । లుడువీథి మొయిలుల నుండంగ నీవు.
మఱి సైన్యముల మీఁద మలయుచు గ్రద్ద । పఱియలఁ జొచ్చె నుత్పాత సూచనగ.
కడలేని వేల్పుల కన్నీరువోలె । నుసుపరంపర రాలుచున్నది ధరను.
ఈ చావుశకునంబు లింత భీష్మునకు । నేచావు తెచ్చునో యింద్రజుచేత!
రోషాగ్ని ధర్మపుత్రుని వదనమున । భీషణాకారమై పెద్దయుఁ దోఁచె.
తెగి కవలను ద్రౌపదేయులఁ గూడి । మగఁటిమిఁ బోరు ధర్మజు డించి నీవు
రారాజుతోడ శీఘ్రము పోయి భీష్ము । తేరికి రక్షయై దిక్కుల మెలఁగు.

1. యతఁడు. 2. చేతలు. 3. వాహనుఁడు. 4. కుంచెముల్. (మూ).

నలువొప్ప మనకుఁ బ్రాణంబులు దాఁచు । కళవి గాదది స్వామికార్యంబు కళది(?)
గణుతింప నాసుపాటుగా నేఁడు.” మనిన । గుణి ద్రోణి గురువాక్యకుశలుఁడై పోయె.
అక్కడ భీముఁ డయ్యర్జును ప్రూన్కి । యిక్కడగాఁ జెల్లుచో నేనును గొంత
తోడు చేసెదనని తురగరత్నములు । వేడుక నచటికి వేగఁ దోలించి
గాంగేయు ముందటి గౌరవసేన । భంగపెట్టెడి చేతిబరువు వీక్షించి
కృత వర్మ భగదత్త కృప శల్య సింధు । పతి చిత్రసేను లేర్పడ వికర్ణుండు
వినుము దుర్మర్షణ వివిందానువిందు । లనఁగ నిట్టి పదుండ్రు ననిలజుమీఁద
నొక్కట నెక్కు యత్యుగ్రబాణములు । పెక్కుభంగుల నేయ బెదరక యతఁడు
వడగండ్ల వాన దిగ్గజముగ్రైకొనని । వడువునఁ గొనక దుర్వారుఁడై వారి
నొప్పింప, వారును నొప్పింప, నిముస్మ । దప్పాట యీక్షించి ధవళవాహనుఁడు
తటుకున నచ్చోటు దఱయంగ నుఱికి । పటు శిలీముఖ[1]పాత బలముచే వారి
ధనువుల ప్రోవులుఁ దఱచైన తూపు । తునియలు పడగలతుమురును నాత
పత్ర ఖండములు నాభరణ రేణువులుఁ । జిత్ర చామరలవ శ్రేణిని క్షోణిఁ
గప్పిన, నీక్షించి కౌరవరాజు । తప్పక యా యన్నదమ్ములమీఁద
సపరివారముగ సుశర్మమున్నైన । నృపులఁబెక్కండ్ర నంచిన వేగ వారు
తొంటి పదుండ్రును దోడుగా వారి । నంటఁగఁ దాఁకి గుణారావ మెసఁగ
దంభోళి నిభ శరోత్కరములఁ బొదువ । సంభృతాటోపులై జడియక వారు
శ్రావణ ఘనములై శరమహావృష్టి । నా వీరకోటి వ్రయ్యలువాఱ నేయ
నుర్వీశ్వరుఁడు చూచి యుగ్రుఁడై పనిచె । సర్వ సైన్యములను శత్రులమీఁద.
ఈ రీతి మొనలెల్ల నేచి పైఁ బడిన । ఘోరాహవంబైన కొలఁది వీక్షించి,
అభిమన్యు సాత్యకు లాదిగా రథికు । లభినవోత్సాహులై యహితులమీఁద
సేనాసమేతులై చెలఁగి యెక్కుటయు । భూనాథు నందులోఁ బొడగానరాక
కడఁగి భీష్ముఁడు నేమి ఘర్ఘరారావ । కలితమైన రథంబు గాండీవిమీఁదఁ
దఱిమిన నఱిమి యోధవ్రాత మెల్లఁ । బఱపైన కెంధూళి భాస్కరు గ్రింగ
నందడిగా నెక్కి జాహ్నవీతనయు । నందంద యేయుచో నలిగి యమ్మేటి
దశ దిక్కులందు “శతం భీష్మ”యనెడి (?) । విశదోక్తి నిజముగా వెసఁ గానవచ్చి

1. వ్రాత. (మూ)

రథము వేగంబు నారాచ వేగంబు । పృథివి నెన్నిక కెక్కఁ జేర్చి యేయంగ
డొల్లెడు శిరములు డుల్లు కేతువులుఁ । ద్రెళ్ళెడు హయములు దివిఁ బ్రాఁకు భటులుఁ
గూలెడు గజములు గుండియలవిసి । వ్రాలెడు దొరలునై వారి సైన్యములు
స్రగ్గుడు మగ్గుడై సవచెడి సమసి । [1]గగ్గులకాడై కకావికలైనఁ
బరికించి దయపుట్టి భాగీరథేయుఁ । డరుదారఁ దనలోన నప్పుడిట్లనియె:
"సమరోర్విలో శత్రుసైన్యంబులెల్ల । సమయించి సమయించి చదిసినట్లయ్యె.
వచ్చు వెండియుఁ బాఱు వైరిసైన్యములు । హెచ్చు వెండియు వచ్చు నేలికలనుప.
వేసరి నట్లయ్యె విభవంబు మీఁది । యాస తా నెట్టిదో యహితేతనునకు!
ఏను దా నెన్ని నాళ్ళీ శరీరంబు । బూని మోవఁగలాఁడఁ బుట్టె వేసటయు.
నాఁటి బాల్యము పోయె; నముము నీముడిమి । నాఁటిన నది మర్త్యునకు వ్రేఁగు గాదె!"
అని నిశ్చయించి సైన్యముఁ దోలుకొనుచుఁ । జని యట్టు భీష్ముండు శమనజుఁ గదిసి
నిరతి నొయ్యనఁ బల్కె: "నృప, యేను ధరణి । నరుఁడనై పుట్టిననాఁట నుండియును
జంపితి రిపుల హింసకు నోసరిలక; । యెంప శక్యంబుగా దింక వేసరితి.
ఇంత వధింపఁ గా నేకార్య మయ్యె? । జంతువు తనచావు చర్చింపఁ డకట!
ఇంక శిఖండి మున్నిడుకొని మీరు । కొంకక యిందఱుఁ గూడి నన్నేసి
యమరలోకమునకు ననుపుట మేలు; । క్రమమొప్ప మనుములు గల ఫలం." బనుచుఁ
జెప్పి సంగ్రామంబు సేయుచు వచ్చు । చొప్పునఁ దమనేఁచఁ జొచ్చె భీష్ముండు.
అట సైన్యపతికి నిట్లనియె ధర్మజుఁడు: । "తటినీకుమారుపై దండుతోఁ గూడి
యేక యత్నంబున నెక్కి యేయుటకు । జోక సేయుము దాని సూచించె నతఁడు.
వాయు సూనుఁడు నీవు వాసవాత్మజుఁడు । నేయుఁడు మీనేర్పు లిన్నియు మెఱసి.
ఇందఱు మనముండి యిటు సేయకున్న । మందాకినేయుని మఱి గెల్వరాదు."
అనిన నత్తెఱఁగు వాఁ డనిలజనరుల । వినఁ జేసి మాత్స్యాది వీరుల నెల్లఁ
జేసూపి భీష్ము నుస్థితి నాక్రమింపఁ । జేసిన, వారును జిష్ణువాయుజుల
ప్రాపున వెఱవక బలనాథుఁ దాఁకి । తూపులేసిరిగాసి దూరదొక్కటియు.
అప్పుడు నరపతి [2]యనుజులుఁ దాను । దప్పక దొరలనందఱిఁ గూడికొనుచుఁ
గాంగేయ యోధవర్గముఁ దాఁకి సమర । మెంతయుఁ జేయుచో నిరువాగునకును
ఘోరయుద్ధంబయ్యె గురునకు నైన । నారణస్థితి యెన్న నలవి గాకుండ.

---

1. గగ్గుల కాటక కాచీకలైన 2. నరులును. (మూ).

అందు నీసుతునొంచె నభిమన్యుఁ డడరి; । యిందు ద్రోణి కలంచె నెలమి సాత్యకిని;
అందు సాత్యకి శల్యునలుగుల గ్రుచ్చె; । నిందు వివింశతి నేసెఁ బాంచాలుఁ;
డందు నలంబుసు నాఁగె హైడింబుఁ; । డిందు యుధామన్యుఁ డెదిరె వికర్ణు.
నతి భీష్ము నీరీతి నొంపను బెంప । నిత రేతంబుగా నిందును నందు
దొరలు వెండియు నిట్లు దొరకొని పెనఁగఁ । గరిపురాధీశ్వర, ఘనమయ్యెఁ బోరు.
అప్పుడు నరుఁడు సింహముఁ బ్రతిసింహ । ముప్పుఁ దాఁకినమాడ్కి నుగ్రుఁడై భీష్ముఁ
దాఁకఁ బోవఁగఁ మహోద్ధతి యువరాజు । వీఁకఁ బోవఁగనీక విశిఖవేగమున
నడ్డపెట్టిన, వాని నాయంబుచాయ । దొడ్డనారసమునఁ దొలిగట్ట నేసి
విల్లుఁ బతాకయు విఱిచి నరుండు । ద్రెళ్ల నేసెను సూతుఁ దేరి గుఱ్ఱముల.
అంతట యువరాజు హతగర్వుఁడగుచు । శంతనుసుతుమాటు చయ్యనఁ జొచ్చె.
భగదత్తుఁ డప్పుడప్పార్థుఁ బోనీక । పగులక వెలిదంతిపై వచ్చి తాఁకఁ,
దండివాహన మిది తగదు నీకనుచు । వేంద్రంబుచూపిన విధమునఁ గ్రీడి
చిల్లగోలల మేను చించిన దంతి । తెల్లఁదనముమాని ధృతి నెఱ్ఱనయ్యె.
వాఁడంతఁ బాంచాలవాహినిమీఁద । వేఁడిమి ప్రకటింప వెనఁబోయెఁ దొలఁగి.
గాండీవి యపుడు శిఖండిఁ[1] గన్గిఱిపి । దండాధిపతి నేయఁ దలకొల్పుటయును
నిలిచి వాఁడును నేయ నీయోధులపుడు । బలభేది తనయుపై బాహుగర్వమునఁ
జెల్లేసి యార్చిన బీభత్సు నంప । వెల్లిలోఁ బ్రుంగిరి వేతసాకృతిని.
వెనక శిఖండి యేసిన తూపులైన । ననువొప్ప భీష్ము దేహముఁ దాఁకి తాఁకి
విఱుగును బద్మాక్షి వృద్ధుపై మనసు । విఱిగెడు విధమున విశ్వంభరేంద్ర!
అతని నేయక మందహాసంబుతోడ । నితరుల నేయుచు నితఁడూరకుండు.
గాండీవి యిట్లు శిఖండి నాడింప । మండుచు యువరాజు మఱియును వచ్చి
ఆ యర్జునునిఁ దాఁకి యమరులు మెచ్చఁ । బాయక యేయుచోఁ బలికె నర్జునుఁడు:
"తొడుకైన నొకమాట తొలినఁ బోవు; । గడుసైన నొకపరి గాదన్నమాను;
చేదిక్కు శునిమైన ఛీయన్నఁబోవు; । నీచాత్మ, నీకొక్కనికి సిగ్గులేదు.
విసువక తాఁకెదు విఱిగి పోయెదవు; । పొసఁగునే యిది వీరపురుషలక్షణమె!
ఇంకఁ బాఱినఁ బాఱనీను వధింతుఁ । గొంకక నిలు" మని ఘోర బాణములు
ఏయఁ దానును గ్రీడినేసి నీసుతుఁడు । చేయూడ కంతలోఁ జెదరుట చూచి

1. గ సురికి. (మూ).

నరునిపై సకలసైన్యంబుల నృపతి । పురికొల్ప నవి వార్ధి పొగరెత్తినట్లు
ఏచి నేలయు మిన్ను నేకమై నవ్య । నాదిపైఁ గపిసినఁ జలియింప కతఁడు
దివ్యాస్త్రతతులు సంధించి సవ్యాప । సవ్యధారల నేయ, జడియు కా మొనలు
పతికార్యమని నిల్చి ప్రతియేసి ప్రేత । పతి కార్యపరులైరి బలిమి నాక్షణము.
అప్పుడు భీష్మునేయఁగ నుపాయంబు । చెప్పిన నరుమాటఁ జెలఁగి శిఖండి
దొనలు శూన్యములుగాఁ దూపులు తొడిగి । యనిమిషనదిసూను నంటించి యార్చె.
నృపచంద్ర, యాలోన నీ పెద్దకొడుకు । కృపుని శల్యుని వికర్ణుని వివింశతిని (?)
మూఁకగాఁ గూడి భీష్మున కెడసొచ్చి । వీఁక నర్జును నేయ వీరినేగురను
విరథులఁ జేసి యవ్విజయుండు విప్పఁ । గుసురాజు గదిసి యుక్తులఁ గెలుపుగదుర
ననుజరత్నంబుల నాజానుభుజుల । ననుపను సేనాసహాయులతో వారిఁ
బులిమీఁద మృగములఁ బురికొల్పునట్టు । బలభేది సుతుమీఁదఁ బనిచిన, వారు
పురుహూతసుతుఁ దాఁకి పోరుచో వారి । యురుతరసైన్యంబు నొక్కెడఁ గవిసి
సందడిగాఁ బోర సంతోషదృష్టి । మందాకినేయుఁ డా మనుజులఁ జూచి
కనికరంబున వింట ఘనఘోరమైన । యనలాస్త్ర మరులసైన్యముఁ గాల్పఁదొడఁగి
యేయుఁ జూచి శిఖండి నెదుట వీక్షించి । యా యత్న మటుపెట్టి యాతలఁ దొలఁగి
యచ్చోట మగధమత్స్యాది బలంబు । వచ్చి వాల్చి తెరల్చి వధియించుచుండఁ
గరములు శిరములుఁ గంఠనాళములుఁ । జరణంబులును నిండె సమరభాగమున.
ఇతని మార్కొనువీరుఁ డింక లేఁడనుచుఁ । జతురంగబలములు చలియించె నధిప !

## శతానీకుఁడు భీష్మునితోఁ బోరి మడియుట

అప్పుడు భానున కపరాహ్ణమైన । నుప్పొంగి శీతవాయువులు పైఁబొలయ
నరిఘోరమూర్తి శతానీకుఁ డనఁగ । విరటుని తమ్ముఁడు వెన భీష్ముఁదాఁకి
నెఱయ నూర్వినేమి నినదంబె కాని । తెఱచైన శరవృష్టిఁ దనుగానరాక,
వాహినీసుతు కాళ్లు వడఁకెడిపాటి । సాహసోన్నతి నూవ, నైరింపకతఁడు
విల్లు పతాకయు విచ్ఛిత్తిచేసి । యల్లన సూతుని హయములఁ దునిమి
యతఁడు వైచినశక్తి నవలీల నఱికి । యతనిని నఱికె మహాచక్రధార.
ఇట్లు శతానీకు నిలఁగూల్చి భీష్ముఁ । డట్టిపెంపున సైనికావళినెల్లఁ
బడుగు పేకయునుగా, నడియాలుగాఁగ । నిడియును బొడియుఁగా, నెఱచి యొనర్చి

యార్చి శంఖంబొత్తి హరి క్రీడిఁ బలికెః । "నేర్చిన శరవిద్య నేఁడేల దాఁప?
చూరఁబోయె బలంబు సురిగిరి దొంటు । పాఱెడిరక్తంబు పలలంబు బలిసె.
త్రిప్పి త్రిప్పి శిఖండి ధృతి నొడ్డనేల? । నొప్పనాదో భీష్ముఁ గుటిలారి భీష్ము."
నని యెచ్చరించిన ననుమూన ముడిగి । విను ము గాండీవపాణి విల్లు సారించి
మందాకినేయు నమందశస్త్రాస్త్ర । సందోహమునఁ గప్పి సారథి రథ్య
రథ కేతనాతపత్రమ్ముల నొంప । రథము తోలి శిఖండి రభసాన నుండి
సంగరంబునఁ దాను సవతుల నాని । సంగడిఁజొచ్చి యస్త్రముల్ లేయుచోటఁ
దెగి వానినేయక దేవవ్రతుండు । తగువైన సనసిష్ఠ తన్ను ద్రెక్కొనఁగ
మిన్నకయున్నచో, మేగకుమీఱి । యన్నాకపతిసూనుఁ డనుపమాస్త్రములఁ
దాత దాల్చినయట్టి ధనువు ఖండింప । నాతత క్రోధులై యర్జునుమీఁద
శల శల్య కృప వివింశతి చిత్రసేన । జలసంధ కృతవర్మ సైంధవ శకుని
భగదత్తు లాదిగా బహుబాణపంక్తి । సగిడించుచును శిఖండిని నాక్రమించి,
"ముట్టుఁడు నరుని భీష్ముని కడ్డపడుఁడు । పట్టితెండు శిఖండిఁ బాఱనీ." కనుచు
సేనాముఖంబులై చెలరేఁగి తఱుము । నానాముఖంబులై నరనందనుండు
పవనతనూజుండుఁ బాంచాలిసుతులు । కవలు సాత్యకి ఘటోత్కచ ధర్మసుతులు
విరటుండు ద్రుపదుండు వీరసైన్యపుఁడు । నరునకుఁ దోడు సేనాసమేతముగఁ
గడచిరి వీరమండలి నాక్రమింప; । నడుగిని రణమయ్యె నుభయవాదులకు;
నేపురాణములందు నేలోకమందు । నీపాటి సంగ్రామ మేనది గాన.
అందులో గాండీవి యర్థినందఱకు । [1]నందఱై యెదురు యోధావళినెల్ల
నెఱి నైంద్ర వారుణాగ్నేయాది శరము । లక్షిముఖిఁ బఱపి బాహుశక్తిఁ బరఁగి,
తెఱపినూపి శిఖండి తెగి భీష్మునేయు । తెఱఁగు చేసి యతండు దివ్యాస్త్రములను
వెన భీష్ముఁ డెత్తెడు విండ్లనేకములు । భసితంబులుగఁ జేసె బాణాగ్ని నధిప!
అంతఁ గిరీటిపై నతఁ డొకశక్తి । నంతకదండచండాకృతిదాని
నెడపక కొలిమిలో నెఱ్ఱఁగాఁ గాలి । వెడలిన లోహంబు విధమైనదాని
వడిఁ బ్రయోగింప, సజ్జ్వాలావిభూతిఁ । దడయక యతిరథ ధవళవాహనుఁడు
తడఁబాటులేక యెంతయు విచిత్రముగ । నడుమనే తునుమాడె [2]నవవిశిఖముల.
తునిమి యాభీష్ము సూతుని గేతనంబు । దునిమిన, నాత్మలో దుఃఖంపకతఁడు

1. నందరికందరై యోధాళి. 2. నవ్విశిఖముల. (మూ).

ఇట్లు వితర్కించె: "నేఁ బాండుసుతుల । నెట్టన గెల్వఁగనే నిటువంటి క్రతువున!
నలినాభుని రక్షణము కల్గఁబట్టి । యెలమి 'లింగముమీఁది యెలుక' లై వారు.
నారాయణునిగూడి నడురేయి వచ్చి । వీరు నన్నుఁ జయించువిధము ప్రార్థింపఁ
జెప్పకపోదని చెప్పితి దీనిఁ । జెప్పకోఁ బనిలేదు చెడునె దైవాజ్ఞ!
సమర ముపేక్షించి శాంతిమై నుండి । సమసెద నాకు భూషణ మివ్విధంబు."
అని తలంపఁగ వేల్పులతని పూఁపెట్టేఁగి, । "యనఘ, నీకిది తెన్ను యఖిలసమ్మతము
అమృతత్వ మిది నీకు" నని యాడుకొనిరి. । వినులుఁడై భీష్ముండు విని నేను వింటి
నెవ్వరు వినరు నాకిది మహా[1]వరము । నివ్వెఱపడకె యన్నియుఁ జెప్పినను.
అతఁ డిట్లు నిశ్చయం బాత్మలోఁ జేయ । నతిసూక్ష్మ శీకరాన్విత పవనంబు
కమ్మనై యల్లన గాంగేయుమీఁద । నిమ్ముల రణఖేద మీటాఱఁ బొలిసె.
సురదుందుభులు మ్రోసె సురపుష్పవృష్టి । గురిసె నప్పుడ దనన్యగోచరంబుగను.
... ... ... ... ... । ... ... ... ... ...
ఏనూరకుండిన నిదియేటి మెచ్చు । గా నేరదని యెన్ని గాంగేయుఁ డపుడు
ఒక్కవిల్లెత్తిన నుఱక శిఖండి । పెక్కుబాణంబు లాభీష్ముపైఁ బఱపి
యని గాడకున్న లజ్జావిష్టుఁడగుచు, । ధవళాశ్వుఁ డీక్షించి దరహాస మొదవి

## శిఖండిని మున్నిడుకొని యర్జునుఁడు భీష్ముని దునుమాడుట

మొఱుఁగారు వాలిక మేలు క్రొత్తమ్ము । నెఱగొన్న శేషాహి కెనయైనదానిఁ
దటినీకుమారుని తనుశాలలోనఁ । బటుగతి నించుచోఁ బగిలెఁ దత్తనువు.
ప్రజలును బగిలిరి భరతవంశమున । సుజనహింస జనించెఁ జూడ నాదనుచు.
కలని మెచ్చులకు గాంగేయుఁ డానరుని । నలుగుల వానచే నాక్రమించినను
ఎంతకుఁ బెట్టునో యీవానయనుచు । నంతరాత్మఁ గలంగి యమరేంద్రసుతుఁడు
ఏచి యవగ్రహం బింద్రచాపంబు । వేచెరిచినమాడ్కి వృద్ధుచే నున్న
చాపంబు దునిమిన శాతభల్లముల । నాపుణ్యమూర్తి రక్తాంగుఁగా నేయ
వాసవి తమకెల్ల వారింపరాక । యాసమీపమున నాయాసులై యున్న
నీకొడుకులఁ జూచి నృపుఁ బల్కె నతఁడు: । "నాకు వశముగాదు నరు పరాక్రమము;

1. వ్రతము. (మూ).

వచ్చేమై విల్లు దాల్చిన వాని నాజి । దేవదానవులకు దృష్టింపరాదు;
ఒక మర్త్యమాత్రుండె యోర్చు నివ్విగు! । సకల నరుండు నారాయణసఖుఁడు.
ఇతఁడు కోపించి విల్లెత్తినచోట । నితరుఁడు విల్లెత్త నెంతటివాఁడు!
వీనిఁ బాసిన పాండవేయులనైన । నే నిమిషములోన నెక్కి ద్రొక్కుదును."
అను నెడ గాండీవి యాగ్రుపదజుని । ధనువుపొందిక పిఱుందన ధనువునిచ్చి
వాఁ డేయుచున్న భావము దోఁప భీష్ము । వాఁడిశారసముల ప్రక్కలింపంగ,
నంచిత రామసాయకములఁ బసులు । క్రౌంచశైలముఁబోలె గంగాసుతుండు
ఒడలు తూఁటులువోయి యువరాజుఁ బలికె: । "[1]కడు వాఁడిమైఁ గాడఁగా బాణతతులు
కవ్వడితూపులుగాక శిఖండి । కివ్వాఁడి సెలగోల లెన్నఁడు గలిగె!
క్రన్ననఁ [2]గర్కటిగర్భమై పగులు । చున్నది నాదేహ మొగి నివి గాడి.
మహి యమదూతలై మడిపెడి నుసురు; । మహితవిషాగ్నులై మడపెడు మూర్ఛ.
ఇట్టి దీప్తాకృతి యీ లక్ష్యశుద్ధి । యిట్టి ముష్టిదృఢత్వ మితరుల కెద్ది?"
అంచు నాతఁడు శక్తి నర్జును వైనఁ । ద్రుంచె నర్జునుఁ డది తుత్తుమురుగను.
వాలును బలుకయు వాహినీతనయుఁ । డాలోనఁ గైకొని యరదంబు డిగ్గ.
తోన యా రెండును దుమురుగా నటికి । సేన కిట్లని చెప్పెఁ జెయ్యెత్తి క్రీడి:
"ఏనున్న వాఁడ మీ రాయిచ్చ భీతిలక । పూని మీ యాయుధములను గైకొనుచుఁ
బైపడి పొదువుఁడు భాగీరథేయుఁ । జూపుఁడు మీలావు సొరిది కోలంది."
అనిన నార్చుచు సేన లనుపమతూర్య । నినదంబు దివిముట్ట నీ సైన్యనాథుఁ
బొదువుచోఁ, రాజాజ్ఞఁ బొదివి నీబలము । నెదురునై తాఁకుచో నిరువాగునకును
ఘోరయుద్ధంబైన గోత్రారిసుతుఁడు । కౌరవయోధుల ఖండింపఁదొడఁగె.
ఆ సత్త్వమునఁ జొచ్చి యమసూతిసేన । భాసురంబుగ మహాప్రబలమై గూడి
హరివాఁడు నడకవాఁ డరదంబువాఁడు । కరివాఁడు గదవాఁడు ఖడ్గంబువాఁడు
అసివాఁడు లగుడివాఁ డా యష్టివాఁడు । ముసలంబువాఁడునై ముసురుగ్రమ్మ్రుచును
ఒకటొక్కటియు దూఱ నొండొంటి రాయు । సకలాంగముల భీష్ముఁ జాల గ్రుచ్చుటయు
నలుగులకుప్పయై హరి హరి యనుచు । నొలసి భూస్థలికినై యొఱగె నజ్జోదు.
జగతి సోఁకక పడె శరశయ్యమీఁద । నగుమొగంబునఁ దాను నాథ, మీతండ్రి

1. కడువాఁడికాఁడు. 2. కర్కటభర్గమై. (మూ).

దక్షిణాయనమని తలఁచి ప్రాణములు । రక్షించి నీసేన రక్షింపలేక.
దక్షిణాయన మిది తగును జీవింప । దక్షత నెఱుఁగ నితనికిఁ జెప్పుదము
అని కొంద ఱమరులు నా వియత్తటిని । పనుపున హంసరూపములైన మునులఁ
జనుదెంచి నిలిచిన జాహ్నవీసుతుఁడు । తనబుద్ధిలో వారి తలఁపెల్ల నెఱిఁగి,
"హితులార, మీకృప నింతయుఁ దెలియ । మృతియన్న నాయాజ్ఞ మీఱరా వెఱచు.
వరము సత్యవతీ వివాహంబునాఁడు । కరుణించె శంతను క్ష్మాపతి నాకు.
సరి నవధ్యత్వ మిచ్ఛామరణంబు । నరయంగ నావశంబై యుండు నెపుడు.
ఉత్తరాయణవేళ యోగ్యంబు మృతికి । నుత్తములార! నేనుండెద బ్రతికి."
అనిన సంతోషించి యరిగిరి వారు. । విను మహీనాథ, యవ్విధమప్పువేళఁ
బడిన గాంగేయుని పాటు వీక్షించి । వడినార్చె కౌంతేయ వాహినీధ్వనియుఁ
బటహ నిస్సాణ నిర్భర నినాదములు । నట దేవకోటి హాహామహాధ్వనులుఁ
బ్రతిసేన విఱిగి తీవ్రతఁ బాఱు రవళి । వితత కౌరవయోధ విప్రలార్తరవము
నేకమై బ్రహ్మాండ మెంతయు నిండె; । భూకాంత, యేమిచెప్పుదు నిట్టివిధము!
విను ద్రోణునకు వీపు విఱిగినట్లయ్యె; । తనలోన ఖిన్నుఁడై ద్రౌణి ఘూర్ణిల్లె;
హాహాయనెఁ గృపుఁడు; భూవరుఁ డాదియైన । నీపుత్రు లేడ్చిరి నేలపైఁ బొరలి.
అప్పుడు భీష్మ మహాప్రతాపార్కు । చొప్పున గ్రుంకె నా సూర్యుఁ డపరాబ్ధి.

## కౌరవ పాండవ యోధులు శరతల్పగతుఁడైన భీష్మునియొద్దకు వచ్చుట

అంత దుర్యోధనుం డనుజులు దొరలు । నంతతో నాయుధావళి యటుపెట్టి
మరపులు మాని వే మరువులు నూడ్చి । యరుదెంచి కురువృద్ధు నంతంతఁ గదియఁ
దారును నిబ్బంగిఁ దగఁ బాండుసుతులు । ధారుణీశులు గొల్వఁ దాత డగ్గరిరి.
పార్థుఁ డొక్కఁడు ధనుష్పాణియై యరిగె; । పార్థివ, యీకథాపద్ధతి వినుము.
ఆరీతి నిరువాగు నన్యోన్య రోష । దూరులై శాంతులై దుఃఖంబు లడర
నుభయపార్శ్వంబుల నుండి సేవింప । నభినవానందుఁడై యాపగాసుతుఁడు
కొలిపించుకొని యుండి కురురాజుఁ బలికెఁ: । "తలక్రింది కొక్క యాధారంబు వలయుఁ
గలుగు నె?" ట్లనవుడుఁ గడు మృదుత్వంబు । గల తలగడఁ దేను గౌరవ్యుఁ డనుప
నవ్వుచు భీష్ముండు నరుఁ జేరఁ బిల్చె. । కవ్వడియును బాష్పకణములు దొరుగ
గాండీవ మటుపెట్టి కదియవచ్చుటయు । దండితో నీతండ్రి ధవళాశ్వుఁ బలికె;

“తలదిక్కు భారమై ధరియింపరాదు; । తలగడగా నస్త్రము సేయు.” మనిన
నాఁడేయ నోడియు నతని యాజ్ఞఁ గాను । మఱిఁ గొంకుచును వేగ మరలి విల్లెత్తి
యల్లటు దొలఁగి మూఁడమ్ము లేయుటయుఁ । బెల్లుగా నది భీష్ము పెడతల నాటి
చక్క నొదల నెత్తి జగతిఁ బుంఖంబు ।లొక్కట మోచిన, నుప్పొంగి యతఁడు
ఈ తలగడ యొప్పె నీశయ్య ననుచు । నాతనిఁ గొనియాడి యాపగేయుండు
మనుమలఁ జూచి నెమ్మనమున మోద । మినుమడియై తోఁప నిట్లని పలికె:
“అక్కున కుత్తరాయణ మగుదాఁకఁ । దార్కొని ప్రాణముల్ ధరియింప వలయు;
కలుకోట పెట్టించి కావలిఁ బెట్టి । బలసి విచారింపఁ బరిచారకులను
వెర వెఱింగినవారి వెసఁ బెట్టుఁ డనినఁ । గురుపాండుసుతు లియ్యకొని రట్టి పనికి.
అంత వైద్యులు చేరి యతని దేహమున । వింతగా నెలకొన్న విశిఖ వేదనకు
మంత్రించుచో హరిస్మరణంబు కంటె । మంత్రంబు లేదని మఱి వారి ననిచి
తగు గీత వాద్య వేదధ్వనుల్ వినుచు । జగదేకపుణ్యుండు సంప్రీతి నుండె.
“ఇప్పుడు శరముల నేప్పులు పుట్టి । డప్పి జనించెఁ దెండా నాకు జలము.
శరతల్పగతునకు సదమల దివ్య । శర సాధితోత్తమ జలములు గాని
చిఱు బుద్ధి మీరు తెచ్చిన యుదకంబు । అరయ నాస్వాదింప నర్హంబుగాదు.
నీళ్ళు దెమ్మనినఁ గిన్నెళ్ళతో రెండు । వీళ్ళవారు “నిదేల వెఱ్ఱి దవ్వెదరు?
అర్జునుచేఁ గాని యనియును గల్ల । దర్జున, లె.” యన్న నతఁ డర్ధి లేచి
చెలఁగి తాతకుఁ బ్రదక్షిణముగా వచ్చి । నెలకొని మ్రొక్కి గాండీవము సారించి
దివ్య తేజోమయ దీప్తాస్త్ర మొకటి । దివ్యవల్లభ సమంత్రితముగాఁ దొడిగి,
యేసిన నది భూమి నెంతయు గాడి । భాసురచ్ఛాయ సుపావనంబైన
తోయంబు లమృతతోయంబు సరిసు । శాయత్తమగుచు నయ్యస్త్రమార్గమున
భాగీరథీయునిఁ బరికింప గంగ । యీగతి వచ్చెనో యిచటికి ననఁగ
ధారగా [1]నెగసి మందాకినీసుతుని । నోర జాఱిన నర్జునుని మెచ్చె శౌరి;
పొగడిరి సురలు; భూభుజులెల్ల నతనిఁ । బొగడిరి; ఘన దుందుభులు మ్రోసె దివిని.
పులకిత దేహులై పొంగి కౌంతేయు । బలములు సంతోషపారవశ్యమున
నార్చి శంఖములొత్తి రా మహాధ్వనులు । పేర్చి దిక్కులు నిండెఁ బిక్కటిల్లుచును.

---

1. నెసరి. (మూ).

విను నీకుమాళ్లు నిర్విణ్ణులై లజ్జ । పెనఁగొన్న ముఖములు పృథివికి వంచి
ధవళాశ్వ మదిలోనఁ దారు కీర్తించి । రవనీశ, యేమందు నర్జును మహిమ!
ధృతి నట్టిజలములఁ దృప్తుఁడై భీష్ముఁ । డతి మోదితాత్ముఁడై యర్జునుఁ బలికె:
"కోదండరామ, ఫల్గున, [1]మహామేరు । కోదండవిజయ, నీకు నసాధ్యమేది!
అవధానములనేర్పు లాశ్చర్యవిద్య । లవుర! నీకేకాక యన్యులతరమె!
మునినాథుఁగా నిన్ను మును నారదుండు । వినిపింప వినియుందు వీరాగ్రగణ్య!
నారాయణుఁడు లోకనాటకకర్త । శ్రీరమణీభర్త చెలికాఁడు నీకు.
ఇట్టి మీ రిరువురు నేకమైయుండ । నెట్టికార్యములైన నీడేర్పు టెంత!
ఏనెంత చెప్పిన నీ కురురాజు । మానఁడు మీమీఁది మాత్సర్యచింత;
అక్కటా బంధుమిత్రామాత్య సహిత । మొక్కట ధరఁగూల నున్నాఁడుగాక.
పుడమిలో సగఁబాలు బుద్ధితో మీకుఁ । బుడికిన నింతేసి పుట్టునే పనులు!"
అని యూరకుండి దీనాననుఁ డగుచు । జననాథ, వెండియు జాహ్నవీసుతుఁడు:
"ఓ ధర్మరాజ, దుర్యోధన, మీరు । సాధుపద్ధతిఁ బోరు చాలింపరయ్య!
ఏలిపోయెడిఁగాక యెవ్వఁడే నుర్వి; । చాలు ననిత్య మీ సంసారసుఖము.
మానరే యుద్ధంబు మఱి కొందఱైన । మానవనాథులు మడియకుండుదురు."
అనిన వారేమియు ననక తాతకును । వినయంబుతో మ్రొక్కి వీడ్కొని కదలి
పోవుచో, నటఁ బాండుపుత్రులు హర్ష । భావులై విజయ సంగరకళాస్ఫూర్తి
నాయుధంబులు తొంటియట్ల ధరించి । పాయక తము నెల్లబలములు గొలువ
గొడుగులుఁ బడగలుఁ గోటానుకోటు । లుడువీథిఁ గప్పి వాయువుఁగూడి మెలఁగ
దుందుభి పటహాది తూర్య ఘోషములు । క్రందుగా దిశలెల్లఁ గప్పుకొనంగఁ
గర్పూర కరదీపికాసహస్రములు । దర్పంబునకు నొక్కదండి పుట్టింపఁ
జనుచోటఁ గృష్ణుండు శమనజుఁ జూచి । ఘనతరహర్షంబు గానరాఁ బలికె:
"గరుడోరగామర గంధర్వ సాధ్య । వరుల కసాధ్యుఁడై వర్తించు భీష్ము
ధరఁగూల్ప నెవ్వరితరము దుర్వార । కరసత్వులగు మీకెకాక భూపాల!
కురుశేష మాహుతిగొని యింక భూమి । పరిపాలనముఁ జేయు పట్టంబు దాల్చి;
సంతోషమూర్తివై సకలభాగ్యముల । నెంతయు విహరింపుఁ డిది మాతలంపు."

1. మహామ్మేరు. (మూ).

అనినఁ గృష్ణునిజూచి యధిపతి పలికె: । "నిను జేరినార మిన్నిట నేమికొఱత?
మమ్ముఁ జేరనివారి మహితసూత్రంబు । బొమ్మల నాడించుపోల్కి నాడించి
చేకొని యిట్లు శిక్షింపుచుందుదువు । డాకొన్న కపటనాటక సూత్రధార!"
అనుచు నొండొరుల నిట్లభినుతింపుచును । వినుత మాగధ వందివితతి కీర్తింప
హరిపుత్ర ధర్మజు లనిలజయములు । హరియుతంబుగ వచ్చి రావాసములకు."
అన సంజయుని బల్కె నాంబికేయుండు: । "విన నోర్చెఁగా నిట్టివిధము నాయాత్మ;
యినుమునఁ జేసిరో యీశరీరంబు! । ఘన శోకవహ్నిచేఁ గ్రాఁగుచున్నదియు.
దైవాజ్ఞ దాటంగఁ దరమె యొక్కరికి? । వేవిధంబుల నాకు వినకపోవశమె!
అట్లుండెఁ; గురుపతి యాతరువాత । నెట్లు సంగరమున కేతెంచె మగిడి?
వాహినీనాథు నెవ్వనిఁ జేసె? నప్పు । డూహింపఁ గర్ణుఁ డేయూరికిఁబోయె?
ఎఱిఁగింపుమా మాకు నెంతయు." ననిన । నెఱిఁగించె విభునకు నెంతయుఁ దెలియ:
విను కౌరవేంద్రుఁ డవ్విధమున మరలి । చనుదెంచి నిజనివాసము ప్రవేశించి
కొలువుండి దొరల వీడ్కొలుపక భీష్ముఁ । దలఁచి యాతని ఘోరదశకుఁ జింతించి,
"యక్కటా! యిట్టిమహాత్ముఁ బోనాడి । యిక్కడ రణములో నే నిల్చుటెట్లు!
పరులకుఁ గుత్తుక బంటియై రణము । నెఱపు సాహసమూర్తి నేఁడెందుఁ గలఁడు?"
అని వగచియు నాతఁ డాత్మలో మఱియుఁ । దనయిష్టసఖుని రాధాసూనుఁ దలఁచి
బహుళ మేఘచ్ఛన్న పద్మాప్తుఁగన్న । విహిత పద్మముఁ బోలె వికసించి నృపుఁడు
కర్ణుఁడొక్కఁడు నాకుఁ గలఁడు శాత్రవులఁ । దూర్ణవైఖరి వాఁడె దునుమాడ నోపు.
వగవ నేటికి నని వానిఁ దోడ్తేర । జగదీశుఁ డనిపినఁ జని వేత్రకరులు:
"రాధేయ, రారమ్మ రాజు మమ్మనిచె; । సాధు భీష్ముఁడు గూలె శరశయ్యమీఁద.
అధినాథుఁ డింక నేఁడఖిలసేనలకు । నధికారిగా నిన్ను నలరింపఁ గలఁడు.
ఇందఱు నీరాక కెదురుచూచెదరు । నందనయుతముగా నడతెంతుగాక."
యనిన సంభ్రమముతో నతఁడును వచ్చె । జననాథుఁ డున్న యాస్థానభూమికిని.
వచ్చి యవ్విభు దీన వదనంబుచూచి । యచ్చుపు భక్తి నిట్లని పల్కె నపుడు:
"నీబంటు నేఁగల్గ నీకేల వగపు? । ప్రాబల్యమైన నీపగ యణంచెదను.
దేవవ్రతుని పెంపు తీఱిన నేమి । దేవ, నా సంగర స్థితియును జూడు.
చెలఁగి పాండవసేనఁ జెండాడునపుడు । ప్రలయ కాలాంతక ప్రభఁ బేర్చువాఁడ.
పోయెద గాంగేయుఁ బొడగాంచి రణము । చేయ ననుజ్ఞగాంచిన నాకు జయము."

## కర్ణుఁడు భీష్ముని యొద్దకేఁగి రణమొనర్ప ననుజ్ఞ వేడుట

అన విని రాజుచే ననిపించుకొనుచుఁ । జని కర్ణుఁ డారణస్థలి మధ్యసీమ
మునుపు పాండవ వీరముఖ్యులయత్న । మున ఘటించిన శిలీముఖమంటపమున
శరమయ గాత్రుని జాహ్నవీ సుతుని । హరి పద ధ్యాన సహాయుఁ డౌ వాని,
ఘన విభవానురాగంబు చాలించి । తనురక్తి విభవంబు వాల్చినవాని,
యోగనిద్ర మురారి యురగ తల్పమున । బాగొందుగతి నంపపానుపుమీఁదఁ
గనువ్రాల్చి హరినామకథలు పాఠకులు । వినిపింప వినుచున్న వీరాగ్రగణ్యుఁ
గని భక్తితో మ్రొక్కి ఘనశోకవార్ధి । మునిఁగి యాహారవములు చేసియతఁడు:
"ప్రకట కీర్తివిధేయ, భాగీరథేయ, । యకట నిక్కితి మమ్మరయ నెవ్వారు?
మానుగా బ్రోవవే మమతతో నన్ను! । నేను జేసిన తప్పు లెన్నియు మఱచి;
యురు సుధారసధారలొలుకు నీదృష్టి । నిరవొప్పఁ జూడవే! యేను గర్ణుఁడను."
అనినఁ గన్నులు విచ్చి యంగాధినాథుఁ । దను జేరఁ బిలిచి మందాకినీసుతుఁడు
ఆలింగనము చేసి, "యన్న రాధేయ! । పోలంగ వచ్చితి పొసఁగ నన్నరయ.
బుద్ధి చెప్పదు గాక పుత్రునితోడ । బద్ధ కోపుఁడఁ గాను బగవాఁడఁ గాను.
అదియును గాక నీ యవతారవిధము । మొదల వేదవ్యాసముని నాకుఁ జెప్పె.
నీ తండ్రి పాండుఁడు నీతల్లి గొంతి । నీ తోడ నావృత్తంబు నేఁడు చెప్పెదను.
మున్ను గొంతికి మంత్రమున సూర్యువలనఁ । గన్నియవయసునఁ గన్న బిడ్డఁడవు.
కావున నుత్తమ క్షత్రియ, నిన్ను । నే విధంబుల నెందు వేఱుగాఁ జూడ.
ఒకమాట వినుము నే నుభయవాదులకు । సకల రీతులఁ బోరు చాలింపుఁ డనుచు
బుద్ధి చెప్పితి; వారు పోయిరప్పటికి; । బద్ధంబుగా నది ప్రతివాల్పు నీవు.
హరిసహాయులఁ బాండవావలి గెలువ । హరిహర బ్రహ్మలకైన దుర్ఘటము.
మనసుయోధనుఁడు నీమాట గాదనఁడు; । చను మిద్విధము సర్వజనసమ్మతంబు;
వారింపవయ్య దుర్వార సంగరము. । వీరమండల మేల వెలితి చేసెదరు?"
అనినఁ గర్ణుఁడు పల్కె: "నది మున్న వింటి; । విను తాత, యేఁ బాండవేయుండ నగుదు.
ఎంత చెప్పినఁ జెప్పు మేనొల్ల నింకఁ । బంతంబు చెడినట్లు పార్థులఁ గలియ.
ఇంత రణంబు నాకెన్నఁడు దొఱకు? । కొంతైనఁ దీర్చెదఁ గురురాజు నెగులు.
బహుభంగి మీకిట్టి భాషలాడుటయు । సహజంబు లవి మాకు జరుగవు గాని,

ఖండింతుఁ దండింతు గాంగేయపరుల । నిండింతుఁ గౌరవ్య నిజ మనోరథము.
ఇంక రణానుజ్ఞ యిచ్చి నన్ననుపు । శంకింప వల." దన్న జాహ్నవీసుతుఁడు
ఒక కొంతతడవ వూరకుండి యిట్లనియె: । "వికల కయ్యంబీవు విడువవేనియును
ఆజిసేయుము నీకు నాజ్ఞ యిచ్చితిని. । రాజు నేమఱకుము రణములో నెప్పుడు;
మారుతి మనరాకుమాళ్లపై కుఱికి । మూరఁ జంపెడివేళ మఱియుద్ధపడుము (?)
నరుఁడు మిక్కిలి కోపి నారాచవృష్టి । గురిసినఁ బోకుమీ గుండెపట్టైన; (?)
చనుము ధర్మాత్మజయేత్సంగరే." యనుచు । సనిచిన రాధేయుఁ డాప్రొద్దెవచ్చి
కొలువు వివ్వకమున్నె కురురాజుఁ గదిసి । పలికె నుత్సాహంపుభాషలు దోఁప:
"దండాధిపతి లేక ధరణీశ, మనకు । దండితో సేన యుద్ధమునకుఁ జనదు.
ఎవ్వండు గలఁడొకో యీయోధ వితతి । నొవ్వకుండఁగ రక్ష నూల్కొల్ప మేటి ?"
అని విచారించి ద్రోణాచార్యుఁ జూచి । మనుజేశు వీక్షించి మఱియుఁ గర్ణుండు:
"సాక్షాత్కరించిన శంభురూపంబు । దక్షుఁడితండు వో దళముల నడుప!
జయమేమి బ్రాఁతి నిశ్చయముగానతనిఁ । బ్రియముతోఁ బ్రార్థింపు భీష్మునిమాఱు."
అనిన భూపతిలేచి యాచార్యుఁ గదిసి । తనకేలు మోడ్చి యెంతయు భక్తిఁ బలికె:
"ఖండిత రిపుధైర్య, కార్ముకాచార్య! । దండాధిపతివి కాఁదగుదీవు నాకు.
తాతల్లె తర్వాత దాయలచేత । భీతి నొందకయుండఁ బేర్చి రక్షింపు.
నీ పరాక్రమమెల్ల నెఱపి నీవిద్య । చూపుము నీకు శిష్యుల గెల్చుటెంత!
నన్ను మన్నించి సైన్యముల రక్షించి । యిన్ని కార్యంబుల నీడేర్పు." మనుచు
జాఁగిలి మ్రొక్కిన జననాథుఁ జూచి । బొంగొప్ప నిట్లని పలికె ద్రోణుండు:
"అట్టిద కాక మహాప్రసాదంబు; । గట్టిగా నీయాజ్ఞ గాదన నెపుడు.
కృతవర్మ యున్నాఁడు కృపుఁడున్నవాఁడు । హితశాలి రాధేయుఁడే యున్నవాఁడు.
ఏనుగాకుండిన నేమి మన్నింతు । గాన భూవర, నన్ను ఘనుని జేసితివి.
కొట్టి పాఱఁగవైతుఁ గుంతినందనుల । నిట్టిచో నీచిత్త మేను బట్టెదను."
అనిన సంప్రీతుఁడై యధిప, నీసుతుఁడు । కనక కుంభముల గంగా తీర్థజలము
దెప్పించి యాప్రొద్దె దీపికానిచయ । మొప్పార మదిలోన నుత్సాహ మెసఁగ
భయద భేరీశంఖ [1]పటహానిస్వాణ । చయమును జయజయ స్వనమునుఁ జెలఁగఁ

---

1. భయద నిస్సాణ. (మూ).

పుణ్యాహవాచన పూర్వంబుగాఁగ । బుణ్య వేదధ్యానములు రంగుమీఱ,
వివిధ దిగ్దేశభూవిభులును దాను । నవనీశుఁ డాచార్యు నభిషిక్తుఁ జేసి
వరవస్త్రభూషణ వ్రజలాంఛనములు । తురగ రథేభ బంధురముగా నిచ్చి
పసనైన సేనాధిపతుల భూపతుల । వసుధేశుఁ డాచార్యు వశము చేయుటయు
విను మెల్లయోధులు విజయము నమ్మి । మునుకొన్న సంతోషమున నుండిరధిప!
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు ।- నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మీఁద । నెవ్వారుఁ గథ చెల్లె నెఱిఁగింపు మనిన.
( ఈ *పుణ్యకథ నెవ్వరిల వ్రాసి చదివి । యోపిక వినిపింప నుపభక్తి వినిన
నట్టి వారికిని నూఱశ్వమేధములు । నెట్టన చేసిన నిజఫలం బబ్బు
చింతితసిద్ధి సుస్థితి భాగ్యసుఖము । సంతయు సిద్ధించు హరికథగాన.
అని యిట్లు సూర్యవంశాధీశు పేర । జనలోక రక్షాభిజన వీరు పేర
మండిత శాత్రవ మత్తభూపాల । శుండాల కేసరి శుభమూర్తి పేర
హరినామ సంస్మరణానందు పేర । శరణాగతాభిరక్షణ శీలు పేర
బ్రహ్మకల్ప స్థాన్యబహుకీర్తి పేర । బ్రాహ్మణాశీర్వాద ఫలవర్తి పేర
విభవ నిర్జిత దేవవిభు పేర శాహ । విభు పేర సకల ప్రవీణుని పేరఁ
బృథు రసోక్తంబైన భీష్మపర్వంబు । ప్రథిత విష్ణుకథా ప్రబంధంబుగాన
వ్రాయించె నింబాజి వరమతీయుతులు । మాయురే యని పలుమాఱును మెచ్చ
నిటలాక్ష పదపద్మ సహితప్రసన్న । పటుచిత్తుఁడైన కుప్పయమంత్రిచేత.
ఎందాఁక రవిచంద్రు లెందాఁక జలధు । లెందాఁక తొలి మిన్ను లెందాఁక నలువ
లెందాఁక శైలజాధీశు సత్కీర్తి । యందాఁక నిది పూజ్యమై యొప్పఁగాక.)
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితమౌ భీష్మపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొప్పె నైదవది.

* ఈకుండలీకృతభాగము తంజావూరి వ్రాయసకాఁడగు కుప్పయమంత్రిచేఁ బ్రక్షిప్తమైయుండును – ఈ తీరుగాన క్కడక్కడఁ గొన్ని పర్వములలోఁ జూపట్టుచున్నది. వివరములను ఉపోద్ఘాతములోఁ జూచునది.

# ప్రథమాశ్వాసము



శ్రీరత్నయుతవక్ష, సితసత్కటాక్ష, । కారుణ్యనిధి, రామ, [1]కౌసల్యరామ,
కపివరు సేనానిఁగాఁ జేసి నడచి । రిపుల సాధించు శౌరి! చిత్తగింపు.
జనమేజయునకు వైశంపాయనుండు । మును వినిపించిన ముఖ్యమార్గమున
నకథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:
వర్ణాధిపతులార, వ్రతులార, మీకు । వర్ణింతు ద్రోణపర్వము కథ వినుఁడు.
శంతనుతనయుండు సమరోర్విఁ బడుట । యంతయు సంజయుం డాంబికేయునకు
వినిపించి మఱియు నవ్విభుఁడు దన్ననుప । నని చూడఁబోయి వృత్తాంతంబు లరసి
యరుదార నంత నేనవనాఁటిరాత్రి । యరుదెంచి యతని కిట్లని చెప్పఁదొడఁగె:

## యుద్ధవిశేషములను సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

"అయ్య, నీపనివింటి ననిఁ గనుఁగొంటి । నయ్యెడనైన వృత్తాంతంబు వినుము.
నియ్యాజ్ఞఁ దలమోచి నీపుత్త్రుకడకుఁ । జయ్యన నేఁ జన్న సమయంబునందు
సొలసి కోలలవారిఁ జూచి రారాజు । బలముల రప్పింప బ్రమసి యాసేన
తరువుగూలిన పక్షితతియునుబోలె । శరధియింకిన మత్స్యసంఘంబుఁ బోలెఁ
[2]బురుషాశ్రయములేని పొలఁతియుఁ బోలె । సురనదీసుతుఁబాసి స్రుక్కుచు వచ్చి
సన్నిధి నిలిచినఁ, జాలశోకమున । విన్ననై తొలినాఁటి విఱుగు దలంచి
తలత్రిప్పుకొని కొంతతడవు చింతించి, । "నిలువ నెక్కడివాఁడ నేఁడు కయ్యమునఁ!
గర్ణుండు నాపట్టు గలఁడు ప్రాణమున; । జీర్ణుండఁ గానేల? చింతింపనేల?
యాతనిఁ దోడితెం." డని హాస్తిపురికి । దూతలఁ బనుప నద్దూతలు వోయి:
"రారాజు పిలిపించె రమ్మయ్య నీవు; । ఘోరాజిలో నిన్న గూలె భీష్ముండు;
ఆతండు వడక నీ వనిసేయ నంటి । వీతరువాత నిన్నడుగ నయ్యెడిని.
వసుమతి భటులు నీవచ్చునందాఁక । దెసలకు నోళులు దెఱచియున్నారు."
అనిన భీష్మునివార్త కాత్మలో వగచి । తన పుత్త్రమిత్ర బాంధవులతోఁ గూడ

1. కాశ్యప. 2. పురుషాలయము. (మూ).

సేనలఁ గొని మన శిబిరంబుకడకు । రా, నెదురుగ నెల్లరాజులఁ బుచ్చి
యా కర్ణవదన చంద్రాలోకనమున । శోకాబ్ధి యుప్పొంగ స్రుక్కుచు వచ్చి
యాతని యఱుత నొయ్యన గౌఁగిలించి । భూతలం బద్రువ వాపోయెఁ; బోయినను
గర్ణుఁ డాతని బాష్పకణములు దుడిచి: । "యర్ణవగంభీర, యడలకు మిట్లు;
ఏ నీకుఁ గలుగుట యెన్నటికింక? । మాన్పఁగలవాఁడ మహి వైరిభయము;
చక్కాడఁ గలవాఁడఁ జక్రి నెచ్చెలుల; । స్రుక్కక నన్నింత చూడుము చాలు;
చనియెద భీష్ముని సంగరానుజ్ఞఁ । గొనియెద." ననుచును గురుభక్తిఁ బోయి
కలుమంటపంబులోఁ గాండతల్పమున । నలసి నెత్తుట నోలలాడెడువాని,
బెడఁగునొప్పులఁ గ్రాఁగి పింజలవెంట । వలయు గ్రొవ్వుల ఘోరవపుఁడైనవాని,
నెగయునూర్పుల గండ్లనెత్తురు వెడల । డిగ్గనూర్పులేక బెట్టిదమైనవాని,
గట్టియోర్పుల నాడుగఱచుక [1]యముని । ముట్టడకై పూనమున నున్నవానిఁ
బాడగాంచి పురపురఁ బొక్కుచు నతని । యడుగులఁ దలమోపి యక్కర్ణుఁ డనియె:
"అక్కటా! భీష్మ, యిట్లైతివి! మాకు । దిక్కెవ్వరున్నారు? తేర్పవే దొరల!
ఆ శాత్రవులు వ్రాల రాహవక్షోణి; । నీ శరశయ్య నీకిట్లెక్కఁదగునె!
ఇంక నెక్కడికయ్య! మెక్కడిరాజ్య! । మింకఁ గౌరవవర్గ మేముఁ బోయెదము.
అకట! గాండీవిని నా గదాపాణి । నొకఁ డొట్లుగెలుచు నీవుండినఁగాని!
అరి ఘోరతిమిర మార్తాండప్రచండ । శరము లెక్కడవోయె జాహ్నవీతనయ!
నీకుఁ దోడ్పడనైతి నిమఁ గూడనైతి । నాకు నెక్కడిపోరు నరనాథ, నేఁడు!
పడియెదఁ బాండవ బడబాముఖమునఁ; । గడిగెద రణవార్ధిఁ గల కల్మషముల;
తరమిడి నాచేయు తప్పులు మఱచి । కరుణాఢ్య, చూడవే! కర్ణుని నన్ను."
అనిన [2]నోరార్చుచు నరుణంబులైన । తనలోచనంబు లాతఁడు విచ్చిచూచి
యంగాధిరాజు నొయ్యనఁ గౌఁగిలించి: । "సంగరంబునపోటు చాలించుకర్ణ!
బిరుదనై యేచును బెనఁగితిఁ గొంత; । హరిగల్గఁ బార్థుల నని గెల్వరాదు;
చచ్చెద రూరక సకలకౌరవులు; । ఇచ్చల మాన్పవే! యీపు కయ్యంబు;
చెప్పెద వారలచేతిని రణము, । తిప్పవే! । కౌరవాధిపుని [3]మనంబు."
అనినఁ గర్ణుఁడు మందహాసంబు చేసి: । "ధనువును విల్లును తాత, యెన్నటికి?
ఏనుండి నృపతుల నేల చాలింతు? । (పూని శాత్రవులను బొరిగొందుఁ గాక)

1. యమరు. 2. నోరూరుచు. 3. రణంబు. (మూ).

ఏటికి వలదన ? నెప్పుడు నీవాఁడ ; । మాటయాడితి వీవు మఱి విసంగాని.
ఇనుఁడదె పొడతెంచె; నింకఁ గయ్యమున । కనుప్రుము పోయెద." నని మ్రొక్కుటయును
బొసఁగ భీష్ముఁడు పెద్దప్రొద్దు చింతించి, । "పనలక నీవును మానవేనియును
బావని నణఁచి బీభత్సుని నణఁచి । భూవరు నాజిలోఁ బూని రక్షించు.
పులి లేళ్ల కుఱుకఁ జొప్పున నాతఁ డుఱుకు । నలిగి కుమాళ్లపై నప్పు డేమఱకు.
దురమునఁ గదిసి యోధులు వీఁగునపుడు । తరమిడి నీవొప్పి తడవకుమయ్య.
'అదెగెల్చి రదెగెల్చి' రని పాండుసుతులఁ । బ్రిదశులు పొగడుచోఁ దెమలకనిలువు."
మని బుద్ధిచెప్పి రణానుజ్ఞ యిచ్చి । యనిపిన, నుప్పొంగి యంగాధిరాజు
వివిధతూర్యంబులు వెసమ్రోయఁ గదలి । [1]నివిడిన గొడుగులనీడ నేతెంచి
మానవేశ్వరుఁ బల్కు: "మనకింక నొక్క । సేనాధిపతిలేక సేన నూల్కొనదు;
[2]కలఁడొకో ? గాంగేయుగతి నాజిలోన । మలయుచు రిపుకోటి మర్దించుమంత్రి ?"
అనిపల్కు యుత్సాహ మానసాబ్జమునఁ । దనరార మఱియు నాతఁడు రాజుఁజూచి
"అక్కట! మఱచితి నాచార్యుఁడుండె; । తక్క కీ వతనిఁ బట్టముఁగట్టు లెమ్ము.
దినకర తేజుండు దివ్యాస్త్రవేది । మనకు నాతఁడు గల్గ మఱి చింతయేల ?"
అనుటయు 'నదికార్యమా' నని నృపతి । గొనకొన్న వేడ్క నగ్గురుఁ జేరఁబోయి
భూరి ప్రదక్షిణంబుగ వచ్చి మ్రొక్కి । గారాము ధైర్యంబుఁ గానరాఁ బలికె:

## ద్రోణాచార్యుల సర్వసేనాధిపత్యము

"[3] ఆనతరిపురాజ, యాచార్య, నీవు । సేనాధిపత్యంబు సేయంగవలయు;
పెద్దవాఁడవునీవు భీష్మునిమాత్ర; । ఇద్దెస నుడుకార్ప నెవ్వరున్నారు ?
చేయక చేసిన సేనాధిపతివి; । నీయాజ్ఞ కెప్పుడు నిలుచు నాబలము.
పడుచోట భీష్ముండు పౌరుషంబెల్ల । నొడఁ గట్టుకొనిపోఁడు మీకిచ్చుఁగాని;
తగుఁగాదె సూర్యుండు తాఁ గ్రుంకుచుండ । నిగిడినకాంతి నగ్నికి నిచ్చుటెల్ల.
సమ్మతింపుము సర్వసమ్మతం." బనిన । నమ్మానవాధీశు నతఁడాదరించి:
"నీచిత్తమెట్లుండె నృప, యట్లచేయు; । నాచేతనైనంత నడపెద మొనల.
గాంధారుఁ డున్నాఁడు కర్ణుఁ డున్నాఁడు । సింధురాజున్నాఁడు చిక్కవు పనులు.

1. నివిరిన. 2. కలదకో. 3. అనతి. (మూ).

చీకాకుపఱచి ప్రాల్చెద శత్రుకోటి ; । నాకు శిష్యులుగారె నరుఁడు భీముఁడును !
ఏను నేర్చినవిద్య యెన్నటికింక ? । కానిమ్ము భయము శోకము మాను.” మనినఁ
గనక కుంభంబుల గంగాజలంబు । జనపతి తెప్పించి సంప్రీతి వెలయఁ
బంచపల్లవములుఁ బంచవల్కలముఁ । బంచామృతంబులు బ్రాఁతిఁ దెప్పించి
సరవిఁ బుణ్యాహవాచనము సేయించి । వరవస్త్ర వాహనావలిఁ బూజచేసి
మంత్రపూర్వకముగా మఱి ద్రోణుమీఁదఁ । దంత్రజ్ఞుఁ డభిషేకధార వర్షించి
ఫాలపట్టంబునఁ బట్టంబు గట్టి । మాణిక్య చందన మణులఁ బూజించి
యాతపత్రము నడి[1]యాలము రథము । నాతత గజ తురంగావలి నిచ్చి
సేనాధినాథులఁ జేతికిచ్చుటయు । నానందమున నాడె నఖిలసైన్యములు.
ఆనేర్పునకుఁ దగ నాచార్యుఁ డిట్లు । సేనాధినాథుఁడై సేన రక్షించి,
యంతకాంతకుఁబోలి యరిసేన మెదిపి । కుంతిసూనుల నొక్కకోలకుఁ దెచ్చి
దురములో నభిమన్యు ద్రుపదు విరాటుఁ । బొరిగొని మఱియు భూభుజుల నుగ్గాడి
యంత నంతకసూనుఁ డాడువాక్యముల । నెంతయు మూర్ఛిల్లి యిలమీఁదఁ బడినఁ
బాంచాలతనయుండు పఱతెంచి యతనిఁ । బంచత నొందించెఁ బటుఖడ్గధార.
ఏనును నీతోడ నిది యేర్పఱింపఁ । బూని వచ్చితి.” నన్న భూపాలుఁడులికి :
“ఏమంటి సంజయా ! యేమంటి వకట ! । ఆ మహావీరుండు నణఁగెనే నేఁడు !
అతని యౌన్నత్యంబు నతని సత్యంబు । నతని పాండిత్యంబు నకట ! నేఁడణఁగె.
ఆరయఁ గల్లకేలా రోయువిట్లు ! । నోరెట్లు గలిగె ద్రోణుఁడు చచ్చెననఁగ !
సూతజా ! రణమింకఁ జూడకుఁ బోయి । నీ తెచ్చు వార్తల నెత్తురూరెడిని.
ఏనిట్లువణఁకెద నీవార్త వినిన । సూతుఁడెట్లయ్యెనో శోకాగ్ని !” ననుచు
నాచావు తనదిగా నాత్మఁ జింతించి । సూచిత ఘనమూర్ఛఁ జొక్కినఁ గదిసి
నాతులు చేరి యన్నరనాథునకును । శీతల క్రియలోలిఁ జేయఁ జేయంగ
గుబ్బునఁ దెలిసి డగ్గుత్తికవెట్టి । గుబ్బతిల్లఁగ నేడ్చెఁ గురురాజుతండ్రి :
“అన్న, ద్రోణాచార్య ! యక్కటా ! నీవు । మన్నన మముఁగోరి మమునాశ్రయించి
ప్రాకృతుండును బోలెఁ బ్రాణమిచ్చితివి; । నీకార్ముకప్రౌఢి నేర్చెనే యణఁగ !
ఏమని తలఁచితో యీవునందనుని ! । ఏమని విడిచితో యినుమువంటొడలు !

1. యాలపు. (మూ)

ఆ యంగకాఠిన్య మా బ్రహ్మతేజ । మా యనుష్ఠానంబు లావినేకములు
పరమేశ్వరునకైన భావన కాదవు । (దూరములో నీవట్లు దునియుట తెలిసి)
నరుఁడెంత పొంగెనో నాఁడు కయ్యమున ! । హరి యెంత మెచ్చెనో యనఘ, నీమృతికి !
గుణధామ, నీవిట్లుకూలినవెనుక । రణమఁట ! యింక రారాజు నేమందు !
చచ్చినఁ గాదలేదు సంయమీశ్వరులు । చొచ్చెదులోకంబు చొరుమయ్య తండ్రి ! ”
అని విలపించి యిట్లను సంజయునకు : । “ మనయోధు లెందఱు మడిసిరో నేఁడు ?
నలి నెందఱణఁగిరో నాతనూభవులు ? । కలన నేమయ్యెనో కర్ణునికోలఁది ?
భ్రమసి యెట్లోదిఁగెనో పన్నినబలము ? । క్రమమునఁ గయ్యమేర్పఱతుగా.” ననిన
సంజయుఁడిట్లను : “ స్వామి, నీమనము । రంజిల్ల నేనెట్లు రణము వర్ణింతు ?
ఆ పాండవులు గెల్చిరనవలె నాకు ; । నీపుత్త్రు జయము లేనిది చెప్పరాదు ;
జూదంబులోఁ బాండుసుతుల యోటమికి । మోదించి నేఁడిట్లు మునిగినఁ జనునె !
చెప్పెదవిను మట్లు సేనాధిపత్య । ముప్పుఁబూనిన ద్రోణుఁడుప్పొంగి పలికె :

### ధర్మజుఁబట్టియిచ్చునట్లు ద్రోణుఁడు దుర్యోధనునకు వరమొసఁగుట

“ కురురాజ, మీ తాతఁగూల్చిన చిచ్చు । శరవృష్టి నార్పెద సైఁపుమీ నేఁడు.
నా బాణమహిమ లెన్నఁడుఁ జూప నీకు । నీ బలంబులఁ గాచి నేఁడు చూపెదను.
అనఘుండు కృపుఁడుండ నటుకర్ణుఁడుండ । నను బెద్దచేసి, సేనలకు నన్నిటికిఁ
బతిఁ జేసితివిగానఁ బరితోషమయ్యె ; । హితమతి వరమును గిచ్చెద.” ననిన :
“ పాండవాగ్రజు నాకుఁ బట్టి తే చాలు । నొండొల్ల.” ననియె నా యుర్వీశ్వరుండు.
అడిగిన మదిస్రుక్కి యవ్వికారంబు । వెడలనీక గురుండు వెడవెడ నవ్వి
దుర్యోధనునిఁ బల్కె దొరలెల్ల వినఁగ : । “ కార్యంబు గానక కడవ నాడితివి ;
అతనిఁ బట్టఁగ నీకు నయ్యెడిదేమి ? । అతివేగమునఁ జంపుమననేరవైతి ;
వేమిసేయంగ నీవిట్లు దెమ్మంటి ? । ధీమర్మ మెఱిఁగింపు మెఱిఁగెద.” ననిన :
“ ఏ నేలచంపింతు ! నింత మూఢుఁడనె ? । చానేల యిచ్చు నచ్చట శౌరి యతని ;
నీదైనకడిమి నా నృపుఁ దెత్తువేని । జూదమాడింతు నిచ్చోఁ దొంటియట్లు.
సౌబలుఁ డున్నాఁడు జయసిద్ధి గలుగు । నీబుద్ధిఁ దెమ్మంటి నెఱుఁగు ధర్మజుని.”
అని కౌరవేశ్వరుండాడినమాట । విని : “ క్రీడియున్న నవ్విభుఁ బట్టరాదు ;

ఆపార్థు నెత్తైన నని నుండనీక । పాపుము తొలఁగ నాప్రతిన చెల్లింతు.
సాగరోదక మెల్లఁ జల్లిన సిరప । సోగసుత్యాము దేర సులభమైనట్లు,
సరి నుగ్రరోచులు శాంతిపొందుటను । నరుణబింబము చూడ నలపియైనట్లు,
నిజమంత్ర మహిమ లన్నియు జాఱఁ జూచి । ద్విజుని ధిక్కృతి సేయఁ దివిజేన యట్లు
ఒక్కచోటికిఁ గ్రీడి యొదిఁగినఁ జాలుఁ । జిక్కురా." యనిన నాక్షితిపాలుఁ డలరి
యతి శౌర్యుఁ డాచార్యుఁ డాడిన ప్రతిన । చతురంగ సేనలోఁ జాటంగఁ బనిచి
యనుపమోత్సాహుఁడై యాచార్యుఁ బలికె : । "మునలు దీర్తువు గాక మొగ్గరంబునకు;
జలజాప్తుఁడుదయించి జామున కెక్క; । బలిమిఁ దాఁకుదుగాక పాండునందనుల."
అనిన ద్రోణుఁడు విని యర్థిఁ దేరెక్కె । ఘన తూర్యముల మ్రోఁత గగనంబు గప్ప
క్షితిపులు సేనలు సేనాధిపతులు । నతివేగఁ గూడిరా నాజికి వెడలె.
కౌరవసేనపైఁ గలువాన గురిసె; । వారణంబులు మ్రొగ్గె; వాజులు ద్రగ్గె;
పడగలన్నియుఁ జిక్కుపఱచె వాయువులు; । పిడుగులు పడఁజొచ్చెఁ బృథివినెల్లెడల;
గురుని టెక్కెము మీఁద గూబ కూర్చుండె; । సొరిది నెత్తురువాన చోద్యమై కురిసె.
కొఱగాని శకునముల్ కురుసేనలోనఁ । దఱచైన వెఱవక దండనాయకుఁడు
శాకట వ్యూహంబు సంధించె: నందు । నాకర్ణుఁ డొప్పారె నగ్రభాగమున;
వానికి ముందట వాజివైభవము । గానుపింపఁగ నిల్చె గాంధారరాజు;
చెచ్చెఱఁ గాళింగ సింధులఁ గూడి । వచ్చె వికర్ణుఁడు వలపటిదెసకు;
జానొప్పఁ గృతవర్మ శలవివింశతుల । తో నిల్చె దాపట దుశ్శాసనుండు;
చిత్రసేన సుశర్మ శిబి సూరసేన । ధాత్రిపు లంతంతఁ దను జుట్టికొలువ
ద్రోణునిమాటున ధూమకేతువన । రాణమీఱఁగ నిల్చె రారాజు నడుమ.
అంత నంతకసూనుఁ డటమున్న గురుని । వింతలాగు ప్రతిజ్ఞ వేగుచే నెఱిఁగి
యింద్రసూనున కది యేర్పఱించుటయు । సాంద్రప్రభక్తి నంజలిచేసి యతఁడు :

ద్రోణుని ప్రతినకు వెఱవవలదని యర్జునుఁడు ధర్మజునకు ధైర్యముగొలుపుట

"ఉర్వీశ, నే నీకు యుద్ధరంగమున । సర్వాంగరక్షుఁడై చనుదెంచుచుండ
గురుఁడేల గురుఁగన్నగురుఁడు వచ్చినను । గురుసింహ, నిను బట్టుకొన నెట్లువచ్చు!
నాకులు నోపరు నను నిన్ను బాప; । వ్యాకులమే!" లన్న వసుధేశుఁడలరి

దుందుభిపటహాది తూర్యముల్ మొరయ । నందఱుఁగొనుచు ఘోరాజికి వెడలి
పక్షిభాగున సేన పన్నించుచోట । వీక్షింప ముందట నింద్రజుఁడొప్పె;
ఆతనికెలన సేనాధినాథుండు । హేతి జాల జ్వాల లేర్పడ నిలిచె;
మారుతి గవలుఁ గుమారవర్గంబు । వీరులు విరటాది వితతబంధువులు
దండాధినాథులుఁ దక్కటి నృపులు । మెండుగా విడిసిరి మెఱసి యెల్లెడల;
గాంభీర్యమునకుఁ దగంగ ధర్మజుఁడు । సంభృత బలుఁడొప్పె సైన్యమధ్యమున.
ఈరీతి వ్యూహంబు లిరువాగుఁ బన్ని । పోరాడఁ దొడఁగి; రప్పుడు దివినుండి
కనుఁగొనుచుండిరి గరుడ గంధర్వ । ముని సిద్ధసాధ్యులు మొదలైనవారు.
అప్పుడు బిట్టార్చి యతి ఘోరఘూర్ణి । యుప్పతిల్లఁగఁ దాఁకి రుభయసైన్యములు.
'పొడు పట్టు పొదిగొను పోనీకు పొదువు । మడు కొట్టు' మనుమాట లఖిలంబు నిండ
సకల దిక్కుల నస్థిశకల కపాల । శకటాంగములు ద్రెవ్వ చప్పుళ్ళెసంగ
ఘనతర శస్త్రాస్త్రఘట్టన నెసఁగి । యనలకణంబు లాహవభూమి నిండ
హుంకారములతోడ నుబ్బులతోడ । జంకెలతోడ నిశ్శంకఁ బోరాడ
నా మహాసేనలో నాచార్యు రథము । నేమిఘోషము గల్గి నేల చించుచును
ఆకాశమునఁ బక్షి కడ్డంబు లేక । గైకొని చరియించుగతి యచ్చుపడఁగఁ
గరి దాఁకి విఱుగక, గదఁ జక్కువడక, । యొరు తేరిఁ గదలక, యానంబు గాక
సెగ నొగ బెళుకక, చెనకి చేయూక, । మగుడుట నిగుడుట మహిఁ గానరాక
చరియింప గురుసచేఁ జదియు తేరులును, । ధర ద్రక్కలై ద్రాలు దంతావళములుఁ,
దుత్తుమురై ధరఁ దొరుఁగు నశ్వములు, । మొత్తమునై త్రెవ్వి ద్రొగ్గు కాల్బలముఁ,
బడియెడు దొరలునై పాండవసేన । తడఁబడఁదొడఁగియు ధైర్యంబుకలిమి
గురుని మార్కొని యేయు గుంపులుగట్టి; । పరఁగి పాఱియు నిల్చుఁ; బైఁబడి వ్రేయు;
నెడ త్రెవ్వియును గూడు నెదిరించు నొంచు; । నడఁపరాకయుఁ ద్రోచి నడచుఁ గయ్యమున.
అప్పుడు గగనమధ్యమున మార్తాండుఁ । డొప్పార, ధర్మజుఁ డొక్కింత యలిగి
'యడ్డపెట్టుఁడు గిట్టుఁ డాచార్యు' ననుచు । నొడ్డుకర్తకుఁ జెప్ప నొదుఁగక యతఁడు
కవ్వడి తోడుగాఁ గలశజుఁ దాఁక । నవ్వడి పొడగాంచి యఖిలకౌరవులు
వసుధాధిపుని యాజ్ఞ వారిపైఁ బడిన । నెసఁగి పార్థుబలంబు నెక్కె; నెక్కినను
ఆజి ఘోరంబయ్యె; నందు నంగాధి । రాజుతో విరటుఁ డుగ్రతఁ దలపడియె.
మహిత శస్త్రాస్త్ర భీమంబైన రణము । సహదేవునకుఁ గల్గె శకునితో నపుడు.

అనుపమభుజవీర్యుఁడగు వివింశతికి । ననిలజునకు నయ్యె నతిఘోరరణము.
ఘోనర శిఖండికి భూరిశ్రవునకు । ఘనపరాక్రమములకుఁ గలిగెఁ గయ్యంబు.
నవకోపమున శల్యునకు నకులునకు । బవరంబు గలిగె నప్రతిమరౌద్రమున.
ఆ కీర్ణశరముల ననువిందుతోడఁ । జేకితానున కప్డు సిద్ధించె రణము.
హైడింబునకుఁ గల్గె నయ్యలంబుసుని । తోడ మాయాప్రౌఢి దొరయు రణంబు.
పెనఁకువ గుణఘోష భీషణంబగుచుఁ । దనరె సుశర్మ సుత్రామసూనులకు.
ధీరతఁ గృపునకు ధృష్టకేతునకు । ధారుణి యుగ్రమువంగఁ దలపాటు గలిగె.
చతురవిక్రము లిట్టిసందడిలోనఁ । గృతవర్మయును సాత్యకియుఁ దలపడిరి.
పగ దెగవలెనని పాంచాలపతియు । భగదత్తుఁడును దలపడిరి ఘోరముగ.
అట్టి సంకులమున హయహేషితములు । ... ... ... ... ...
రౌద్రంబులైన వారణబృంహితములు । ఛిద్రితదిశలైన శింజినీధ్వనులు
నుర్వి కోర్వఁగరాని యుగ్రహుంకృతులు । సర్వభూతాట్టహాసంబుగఁ జెలఁగె.
నింగిని నొరసిన నెత్తురుటేరు । సంగరంబునఁ బాఱె జగతి కంపెసఁగ.
అంత దుర్యోధనుఁ డభిమన్యుఁ దాఁకి । వ్రంతిగా నొకకోల నక్షంబు నాఁటి
నఱిమి యొండొకకోల నారి ఖండింప, । నెఱచిచ్చుగతి మండి యింద్రపౌత్రుండు
వేఱొక్క శింజిని వింట సంధించి । పాఱమ్ముదొడిగి యప్ప్రభుసూతుఁ జంపి
రథికుపై నట్టిమార్గణమె సంధింప । రథవేగమున జయద్రథుఁ డెడసొచ్చి
యిలఁ దేరు కుప్పగా నిసుసులు నఱుకఁ, । బలకయు నడిదంబుఁ బట్టి యజ్జోదు
సైంధవు తేరికి జవమొప్ప దాఁటి । సంధించి హరులతో సారథిఁ జంపె.
వెస వాఁడు గదఁ దన్ను వ్రేసెను; వ్రేయ । నసిదట్టి మూర్ఛవో నాతనిఁ గొట్టి
తలపట్టి యీడ్చునంతట శల్యుఁ డెఱఁగి । యలయక నకులుతో నాజి చాలించి
గదగాని యాత్రోవఁ [1]గదలినంతటనె । మదిలోన వివరించి మారుతాత్మజుఁడు
నెటుపోదువని తాఁక నిరువుర కపుడు । పటుగదారణమయ్యె భటులు లోలిఁ జూడ.
పూఁపులుఁ జూపులుఁ బొసఁగఁ గ్రుంగుటలు । డాపులుఁ ద్రోపులు డాసి వ్రేయుటలు
నలవులు సొలవులు హస్తలాఘవము । లల వాట్లు పోటులు నందుఁ గ్రందయ్యె.
ఒంటికొమ్ములతోడి యుక్షద్వయంబు । గెంటక పోరాడు క్రియ నల్లు పోరి
యల్లుండు మామయు నన్యోన్యహతులఁ । ద్రెళ్లి మూర్ఛిల్లుచో ధృతిఁ గృతవర్మ
మద్రేశుఁ గొనిపోయె మారుతి [2]విగత । నిద్రుఁడై గదఁబూని నిలు నిలు మనఁగ.

---

1. గద లెడు.గదలు. 2. వినఁగ. (మూ).

అంతఁ బాండవసేన లాభీమసేను । నెంతయుఁ బొగడుచు నెసఁగు ధైర్యమున
నొత్తుక నడవ, దుర్యోధనాదులును । మొత్తమై కవిసి యమ్మొన నిల్వలేక
వెనుకకు వీఁగుచో, వీక్షించి ద్రోణుఁ । డనుపమకోపుఁడై యపరాహ్ణవేళ
ఘనసేను వృషసేనుఁ గర్ణునిసూను । ననిఁ బాండవులకు వ్రేఁగై పోరువాని
వీఁడు బంటౌనని వినుతించి రథము । వాఁడిమి నతని నవ్వలికి దాటించి

### ద్రోణుఁడు పాండవసైన్యముపై విజృంభించుట

నలి నెదిర్చినవాని నకులనందనుని । బలిమి శతానీకుఁ బాఱంగఁగొట్టి,
తఱిమి వెండియుఁ దోఁడి ద్రౌపదేయులకుఁ । జుఱచుఱ వేఁడిమిఁజూపి స్రుక్కించి,
గతదయ యవన కేకయ వీరభటుల । శతసహస్రములఁబట్టి చట్టలువాపి,
పఱతెంచి తాఁకిన పాంచాలసుతుల । నఱువదియార్వుర నందంద మెదిపి,
హైడింబుసేనల నసురనాయకుల । వేడుకఁ బదునాల్గువేల నుక్కణఁచి,
వికటంబుగాఁ దగ వెల్లిబాణముల । నకలంక రిపుచక్ర మాక్రమించుచును
ఇభకుంభ శకటాంగ హేమకిరీట । సుభటాశ్వపటలంబు చూర్ణంబుగాఁగ,
గరళాగ్నికణములు గ్రక్కుడు శివుని । వెరవున శరములు వెదచల్లుకొనుచు
నరిసేనవిచ్చి యయ్యగ్రభాగమున । నరదంబుతోఁ బాండవాగ్రజుఁ గాంచి
పైపడి యతనిచాపముఁ ద్రుంచివైచి । యేపుమీఱిన దృష్టి నిషువులు గురియ
సుకుమారు లాధర్మసుతు చక్రరక్షు । ప్రకటించు నృపతు లేర్పడ ద్రోణుఁ దాఁకి
నిమిషమాత్రము పోరి నిలువక పడిన । గమికొని ద్రోణుఁ డక్కౌంతేయుఁ గదిసె.
అత్తఱి దొరలెల్ల నతని కడ్డంబు । సొత్తెంచుటయు వాఁడిచూపులఁ జూచి
నకులుని నాలుగు నారాచములను । నకులాత్మజుని నైదు నారసంబులను
విరటుని దొమ్మిది వేఁడితూపులను । బరువిడి సాత్యకిఁ బది సాయకములఁ
బవమానతనయుని బాణాష్టకమునఁ । దవిలి, ధృష్టద్యుమ్ను దశవిశిఖములఁ
దూలించి వెండియు దొరలను నేసె. । ఆలోన ధర్మజు నతఁడు డగ్గఱిన
నడరి యు[1]గంధరుఁ డనురాజు గురున । కెడసొచ్చి పోరాడి యినుమునై కూలె.
శీఘ్రత నారీతి సింహసేనుండు । వ్యాఘ్రదంతుఁడుఁ బోరి వసుమతిఁ బడిరి.
‘అదె పట్టెఁ బట్టె ద్రోణాచార్యుఁ డధిపు; । నదె తీఱెఁ దీఱె నాయన బాస’ యనుచు

1. గాంధారు. (మూ).

## అర్జునుఁడు ద్రోణునాఁగి కౌరవసైన్యము నుఱుమాడుట

భటులొక్కట్రమోఁతగాఁ బలుకఁ గల్పాంత । చటుల మేఘారంభ సంరంభలీలఁ
గపికేతు ఘనరావ గాండీవారావ । విపుల శంఖవిరావ విక్రమక్రీడ
భ్రూభంగ విభ్రమాద్భుత ముఖోద్దామ । శోభి దివ్యకిరీట సురుచిరస్ఫురణ
నద్భుతక్రోధియై యచ్చోటఁ గ్రీడి । యుద్భవించినమాడ్కి నుర్వీశునెదుట
నమ్ములిమ్ములఁ గప్పి యాచార్యుతనువు । గ్రమ్మిన బహుబాణగ్రంథిగాఁ జేసి
ముట్టడ విడిపింప, మున్నాడి యొకనిఁ । బట్టఁ బదుండ్రుగాఁ బఱచి కౌరవుల
శాతాస్త్రముల ముంప, జడియక నరుఁడు । సేతువుదెగి పాఱు చెరువునుబోలె
హత్తిన హరిసహాయత్వ మేర్పడఁగ । నెత్తిన రణభూమినెల్లఁ దా నగుచుఁ
బదియు నూఱును వేయి పదివేలు లక్ష । పదిలక్ష యొక్కొక్కభటు నుచ్చిపోవ
విశిఖప్రవాహంబు వెడలించునపుడు । పిశితపుఁ బంకంబుఁ బ్రేవు పంకంబు,
తలపుచ్చె గుదులు రక్తంబుల నదులు, । నలిఁగ్రొవ్వు నసలు బాణమ్ముల యిసుముఁ,
బాలితధ్వజములు బహుళాస్థిరజము । లాతపత్రలవంబు లాహారవములుఁ
దొట్టినపునుకలుఁ దొడవులతునుక । లిట్టలంబుగ నాజి నెల్లను బర్వె.
అంత [1]నీ శరవార్ధి యపరాబ్ధి మ్రింగు । నింతట నిటఁ జొత్తు నే నన్నయట్లు
దినపతి గ్రుంక, నక్తీంద్రాస్త్రతిమిర । పునరుక్తి భావమై పొడసూపెఁ దమము.
అప్పుడు కురుయోధు లట దైన్యవృత్తిఁ । దప్పి పాఱినవారిఁ దగఁ గూడుకొనుచుఁ
బతియును సేనాధిపతియును ద్రిప్ప । నతిరయంబునఁ బోయి రావాసమునకు.
అట దుందుభులు మ్రోయ నార్పులుసెలఁగఁ । బటుజయోత్సాహులై పాండవబలము
విజయునిఁ బొగడుచు విజయుసేవించి । నిజనివాసములకు నెమ్మితోఁ జనిరి.

## ద్రోణుని ద్వితీయదివస యుద్ధము

గురుఁ డంత మఱునాఁడు కోపంబు సిగ్గు । బెరయ నల్లనఁ జేరి పృథివీశుఁ బలికె:
"క్షితిప, నీకే మున్ను చెప్పితిఁ దెలియఁ; । బ్రతిన చెల్లదునాకుఁ బార్థుఁ డుండఁగను.
అతనినొక్కనిఁ బాపు మంతనే ధర్మ । సుతునిఁ బట్టెద నేఁడు సుర లడ్డపడిన.

1. విశారాబ్ధి. (మూ)

కలఁడొకో మనలోన గాండీవధరునిఁ । దొలఁగఁ ద్రోల్కొనిపోవు దొర కయ్యమునకు!
నతఁడు నావాఁడు పొ.'' మ్మనిన సుశర్మ । పతిసమ్ముఖమునఁ జాపముఁ దానునిలిచి
"నను బంపు ధాత్రీశ, నరునిఁ బాపుటకు । ననయంబు నోపుదు నాజి నిల్పుదును.
ఘోరాజిలోనఁ దోడ్కొని చన్న పిదప । నూరక నరుగెల్తు నొండేని చత్తు.
చావక గెలువక చనుదెంతునేని । భూవర, విను నాదు భూరిప్రతిజ్ఞ.
వెరవేది మధువుద్రావినవాని గతికి । (శరణార్థిఁ జేపిడి చనువాని గతికిఁ)
జనువాఁడ.'' నని యగ్నిసాక్షిగానాడి । తన మూఁడుకోట్ల రథంబుల దొరల
మగఁటిమిఁ గేరళ మాళవ ద్రవిళ । మగధ కాశ్మీర భూమండలాధిపుల
నెట్టన నారాయణీయ గోపకుల । గట్టి మొత్తంబుగాఁ గైకొని మ్రొక్కి
విభుఁడు ద్రోణుఁడు వేడ్కవీడ్కొల్పఁ గదలి । త్రిభువనంబులు భీతిఁదెమలనార్చుచును
కౌంతేయుసేన డగ్గఱఁ బోయి నిలిచి । యొంతయుఁ బసఁ 'గిరీటీ!' యని పిలిచి
'చూత మేఁ బిలిచినచోటి కొక్కఁడవు । నేతేర నోపుదో యెక్కటిఁ బోర?
నిన్ను నేయుటగాని నేరుపుగాదు ; । నిన్ను వ్రాల్చుటగానినెఱి కీర్తిగాదు ;
గోగ్రహణమునాఁడు కురుసేన నొంటి । నిగ్రహించిన నీవు నేఁడు రావలయు ;
నోపకుండినఁ జెప్పు మొకమాట.'' యనినఁ, । గోపశోకము లాత్మఁ గొనరనర్జునుఁడు
యమసూనునకుమ్రొక్కి: "యక్కటా! నిన్ను । వినుతులు పట్టెడు విధమీవిధంబు;
తమ చావులకుఁ దెగి దాయలు పిలిచి ; । రమరంగ దీని కెయ్యది యుపాయంబు?
చెదరక నిన్ను గాచెదనన్న నాకుఁ । బొదివి వైరులు పిల్వఁ బోకుండరాదు ;
పోదునో!'' యనుటయు భూపాలుఁ డలికి : । "ఏ దిక్కు గలదని యేఁగెదు నాకు?
నీవు గల్గఁగఁ దప్పె నిన్నఁటి చావు ; । వావిరి గురుఁ గావ వశమె యేరికిని?
రాధేయ శల్యుల రణమెఱుంగుదువు ; । క్రోధి యశ్వత్థామ గుణమెఱుంగుదువు ;
భగదత్తుఁ డనువాని బలిమెఱుంగుదువు ; । పగలువో మనసేన పాటెఱుంగుదువు ;
ఏమని పొమ్మందు నిపుడు ని.'' న్ననిన । నా మానధనుఁ డొక్కయనువు చింతించి
కౌంతేయుఁ బతిఁ బల్కెఁ గరమునఁ జూపి: । "చింతింపకుము సత్యజిత్తుండు వీఁడె
పాంచాలకుండు దోర్బల ధురంధరుఁడు । నించిన రణములో నిను గావనోపు ;
జయమేది యితఁడాజిఁ జచ్చినయపుడు । రయమొప్ప మఱిపొమ్ము రణమానపడక.''
అనుటయు నొడఁబడి యర్జును ననిచి । జనపతి సంగరస్థలిఁ జేర నడిచి
దండాధిపతిఁ జూచి 'తగఁ దీర్తు గాక । మండలార్థంబుగా మనసేన' ననఁగ

నతఁ డట్లు కావించె; నంతఁ గౌరవులు । చతురంగ సేనా విశాలురై కదలి
కలశజు పనుపున గారుడ వ్యూహ । కలితాత్ము లగుచోటఁ గర్ణసౌబలులు
కురుభూమి యాళుల కూటువప్రజలు । గరుడపుచ్ఛాకృతిఁ గానంగనైరి;
వెలయ నశ్వత్థామ విందానువిందు । లిల వామపక్షమై యేర్పడి రందు;
కురురాజు తమ్ములుఁ గొందఱుదొరలు । గరుడ దక్షిణ పక్షగతిఁ గాననైరి;
వెన్నున నమరిరి వివిధదేశేంద్రు; । లున్నతి ముఖలీల నుండె ద్రోణుండు;
'పగదీర్తు నే' నని పంతంబుతోడ । భగదత్తుఁ డేనుఁగుపై నెక్కెనడుమ.
ఈ రీతి జోకమై నిరువాగుఁ గదిసి । యారూఢ సమర తూర్యంబులు మ్రోయ
గంగయు యమునయుఁ గలిసి కల్లోల । సంగతిఁ బోరాడుసరణి నొండొంటఁ
గలిసి పోరాడుచోఁ గలశజుఁ జూచి । పలికె ధృష్టద్యుమ్నుఁ బాండవాగ్రజుఁడు:
"బ్రాహ్మణుచేఁ బట్టువడిపోవ నాకు । బ్రహ్మ లిఖించెనో ఫాలభాగమున!
సత్యజిత్తుఁడు నీవు శైనేయ భీము । లత్యంత సన్నద్ధులై కావుఁ." డనిన
"వారలీ పనికెంతవారు నాచెంత । నోరాజ, ననుజూడు యుద్ధమధ్యమున;
సత్యజిత్తుండేల? శైనేయుఁడేల? । సత్య మెవ్వరునేల? శంక యే?" లనుచు
ద్రోణుపై ద్రుపదపుత్త్రుఁడు బిట్టుగవియఁ । బ్రాణాంతకుని నాజిఁ బరికింప నోడి
పెఱతెరువునఁ దేరు వే పంచి యతని । యురుసేనఁ జెండాడుచుండె నగ్గురుఁడు.

## అర్జునుఁడు సంశప్తకులపైఁ దలపడుట

అటఁ గ్రీడి ధర్మరాజట్లు తన్ననుపఁ । బటువేగమునఁ బోయి పదియోజనములు
[1]సంశప్తములు పల్కి [2]చనుదెంచినట్టి । సంశప్తకాఖ్యుల శత్రులఁ గాంచి
హరితోడనిట్లను: "నదెకంటె దేవ! । పరులు నాబాణాగ్నిఁ బడఁగోరి రిచట;
అన్నఁ బాయుట నాకు నరుదయ్యెఁగాక । పన్నిన వీరు నా పండువు గాదె!
త్రిప్పుదురథములు దివ్యాస్త్రవృష్టిఁ । గప్పుదు దిశ లంధకారంబు గప్పఁ
బఱపుము రథ." మని భక్తితోఁజెప్ప । మెఱుపులీఁగె రయంబు మెఱయఁ గృష్ణుండు
ఇలరోహణాద్రికి నెనయైన రథము । వెలయ సేనామధ్య వీథిఁ దోలుటయు,
నెప్పుడు తునిసెనో యెఱుఁగరాకుండ । నప్పుడు మూఁడువేలరదంబు లొఱఁగె;

1. సంశోపములు. 2. చనుదేరఁబట్టి. (మూ)

గజలక్షయును నేలఁగలసె? గుజ్జనులు । నిజముగా నొకకోటి నీఱయ్యెఁ జూడ.
పదివేల సుభటులు పాండవాస్త్రములఁ । జదియుచో నప్పుడు సుశర్మ భీతిలక
దొరలతో నఱు మంగదురము బాణాగ్ని । పరిచుంబితాస్త్రమై బహుభంగిఁ బరఁగె(?)
అందు నందఱు నూఱు నారును వేయు । క్రందుకోలల వహ్నికణములతోన
హరి హరులను గ్రీడి నాతపత్రంబు । హరికేతనముఁ గప్పె, నప్పృష్ఠఁ దలిగి
వికటాస్త్రముల వైరివిశిఖంబు లణఁచి । సకలయోధుల నస్త్రజలధినోలార్చి
విచ్చుచుఁ బొదువుచు వివిధమార్గముల । వచ్చుచుఁ ద్రచ్చుచో, వారుఁ బోరాడి
లయముగాని జయంబు లవమైన లేని । భయమునఁ బాఱుచోఁ బలికె సుశర్మ:
"పాఱక నిలువుఁడు బలులార! మేర । మీఱితి రెటఁ బోయె మీ బాసలెల్ల?
ఇతఁడింతవాఁడని యెఱుఁగరే మొదల? । గతశంక నెందుఁ బోఁ గలదింక మనకు?
[1]ఎగిరెడు విశిఖంబు లెఱుఁగఁ డీతండు । తగ మనుష్యుఁడుగాని దైవంబు గాఁడు;
పొదువుఁడు పొదువుఁడు పోనీకుఁ." డనుచు । నదలింప నారాయణాఖ్య గోపకులు
పదివేవు రాహవప్రౌఢిమఁ దిరిగి । యదువంశు విధువంశు నమ్ముల ముంప,
మయుఁడు మున్నిచ్చిన మాయాశరంబు । నియతి నర్జునుఁడు సంధించియమ్మూఁక
లక్షించియేసిన, లలినొకఁడొకని । వీక్షింప వేర్వేఱ యింద్రజుఁ డగుచుఁ
దోఁచినఁ, దమలోన దొమ్మిగాఁ బోరి । యా చతుర్భుజు లీల్గి రమరులు నవ్వ.
అట నందు హతశేషు లర్జునుఁ గదిసి । యట నటనీడ్చుచో నమ్ములవాన
యంచిత నరమేఘ మచట మిక్కిలియు । వంచిన హతులైరి వార లాక్షణమ.

## సంశప్తకు లెల్ల రొక్కుమ్మడి నర్జునుఁ బొదువుట

అంత నల్లఁ ద్రిగర్త లఖిల సంవీరు । లంతంత నిక్ష్వాకులట శిబిపతులు
మఱియుఁ గేరళ దుండి మాళవ మగధు । లరవాయి గొనక సాహసమునఁ జొచ్చి
హరివాఁడు నడవాఁడు నరదంబువాఁడు । కరివాఁడు గదవాఁడు ఖడ్గంబువాఁడు
నసివాఁడు లగుడివాఁ డాశక్తివాఁడు । ముసలంబువాఁడునై ముసురు గ్రమ్మినను,
బహుళ [2]దూర్వాంకుర ఫల పత్రపుష్ప । పిహితవిఘ్నేశుఁడై [3]పెంపొందె నరుఁడు.
పోయెఁ గ్రీడి యడంగిపోయె ననంగ । వేయు విధంబుల వినువీధి మ్రోసె.

---

1. ఎగరెండు ... లెఱుఁగునొయితఁడు. 2, దుర్వానంద. 3. వే పొంది. (మూ).

కాలుచేయాడ వెక్కస మప్పుడగుచు । నా లోకనాయకుం డర్జునుఁ బిలిచి,
"నాయన్న, నరుఁడ, యున్నాఁడవే బ్రదికి! । యేయుక్తిఁ బాయుద మీ సంకటమును?
కరమున నన్ను జక్రముఁ దాల్పనీవు; । పరుల కెవ్వా రడ్డపడియెడువారు?
పలుకవే! యొకమాట భయమయ్యె." ననిన । మెలపునఁ గ్రీడి 'యేమీ!' యని పలికి
యనిల బాణంబున నాసంకటంబు । మును [1]పుచ్చి కూడినమునుము [2]విప్పంగ
రథముచెక్కులు గాఁడి రక్తంబు వడిపి । పృథివిఁ గూలిన యశ్వబృందంబు గలిగి,
చదిసి యచ్చులువచ్చి సందులఁ బడినఁ । గదలనేరని బండికన్నులు గలిగి,
యొకతేరు వాఱఁగా నొరసుళ్లు నచ్చి । యొకతేరు తునుకలై యొఱగుట గలిగి,
కూలురూపును దన్నుకొనియెడురూపుఁ । బోలఁ ద్రెవ్వెడురూపుఁ బొరలెడురూపు
రూపుదప్పినరూపు రూపింప వికృత । రూపమై యొరలెడి రూపును గలిగి
యరులు గీడ్పడి; రంత నక్కడ గురుఁడు । వెరవొప్ప నాజిష్ణు విష్ణులు లేక
యొదుఁగంగ రిపుసేన నొత్తుచో, వారు । నదలించి [3]నిల్వఁ బో రతిఘోరమయ్యె.
అందు మహారథు లతిరథశ్రేష్ఠు । లిందలి సమరథు లిట నర్ధరథులు
క్రోధాగ్ని వెసనొక్కకొలఁదులై పెనఁగ । నాధరాధూళి యాశాగ్రంబు ప్రాఁకి
తనకుఁగాఁ ద్రెవ్విన ధారుణీధవుల । ననుపఁబోయిన ధాత్రియన బిట్టువచ్చి
కరి ఘటా భటకోటి ఖడ్గరక్తములఁ । బరిలూనమయ్యె నేర్పడియుండె మింట. (?)
తక్కక కురురాజు ధర్మజుమీఁద । నెక్కనిమ్మన సేనలెక్కను వడిని.
అరయఁ గాల్బంటుపై హరి, హరిమీఁదఁ । గరి, కరిమీఁదఁ బొంకపుఁదేరు వాఱ
ప్రగ్గు, ప్రగ్గినఁ బోకమఱియుఁ [4]బైఁబడును; । అగ్గలించి బలంబు లాహవకాంక్షఁ
దేరులు ద్రోల్లునై ధృతిద్రెవ్వ రథికు । లారయ ప్రాలుదు రవ్వలి తేర్ల.
ఆయుధంబులు దీసినప్పుడు పరుల । వేయుభంగులతోడ ద్రేయుకాల్బంట్లు,
నెమ్మి మాంసము క్రొవ్వు నెఱసి రక్తములు । నుమ్మలించిన [5]చోట నొఱగు గుఱ్ఱములు,
కరియూధములు త్రొక్కి కాన్పింపరాక । దొరసి యా పంకంబుతో మెట్టువడును.
వదలి పీనుఁగులెల్ల వరదఁబో రక్త । నదులు వాఱిన నేల నలి నాక్షణంబు
ఎఱ్ఱనికెంధూళి [6]మొగసిప్రాలంగ । నిఱ్ఱింకు[7]లింకె నయ్యెడ యుద్ధభూమి.
వీరహాసోల్లాస వివశ భావమున । నా రాజ భటరాజి యట్లాజిసేయ

---

1. విచ్చి. 2. విప్పనఁగ. 3. నిల్చుచో. 4. బైపైల. 5. తోంటి. 6. నెసఁగి. 7. లింకినయుద్ధ మధ్యమున. కెడు, (మూ)

నమ్ముతాఁకనిమేను, నసివోని రథము, । సొమ్మవోవనిబంటు, సొరుగని హయము,
ప్రక్కవాఱనివిల్లు, వడఁ[1]కని గొడుగు, । నిక్కదప్పని జోడు, నీల్గని గజము,
పొడిగాని కత్తియుఁ, బొలియని తలయు, । విడియనిచెక్కెంబు, నెసఁగని ధూళి,
పడని బొమ్మిడికయుఁ, బఱివోని గదయుఁ । దడవిన నాసేనఁ దఱచు లేకుండె.
అంత ద్రోణుఁడు పాండవాగ్రజుఁబట్ట । నెంతయుఁ గదియుచో, నెలుఁగిచ్చి చొచ్చి

## సత్యజిత్తు ద్రోణు నెదిర్చి మడియుట

సత్యజిత్తుఁడు సవ్యసాచి పెన్నద్ది । సత్యంబుకలిమి నాచార్యునిఁ దాఁకి
తూపుల సరదంబు త్రోచిరాకుండ । నాఁపిన, మెచ్చి యయ్యతిరథోత్తముఁడు
విలుద్రుంప, వేఱొక్క విలుదాల్చి యతని । నలుగులఁబెట్టుచో, నతనిబంధువుఁడు
విలసితోత్సాహుండు వృకుఁడనువాఁడు । తలమీఱి కలశజుఁ దాఁకియుగ్రతను
బాణాంబురాశి ముంపఁగ, ద్రోణుఁ డతనిఁ । బ్రాణంబుతోఁ బాపెఁ బటువిశిఖమున.
అంత నొండొకచాప మా సత్యజిత్తు । కౌంతేయసేనకుఁ గడిమిరాఁ [2]దాల్చి
చిత్రజల్లునుబోలెఁ జిత్ర[3]వానంప । [4]మొత్త మా ద్రోణాంగములు నిండనేయ,
నా సత్యజిత్తుతో నాచార్యుఁ డపుడు । చేసిన కయ్యంబు చెప్ప నచ్చెరువు.
తనువైన ధనువైన ధౌరేయమైన । దోసమైనఁ బెసమైన దోకిసమైనఁ
గరమైన నురమైనఁ గంకటంబైన । నిరుసైన శిరసైన నెమ్మొకమైనఁ
దాఁకనిబాణ మద్ధరయందు లేదు ; । కాఁక యేమనిచెప్ప ఘటికాద్వయంబు !
అంత ద్రోణాచార్యుఁ డా సత్యజిత్తు । నంతకుఁ గూర్చిన, నాత్మలో నులికి
తమ్మునివాక్యంబు దలఁచి ధర్మజుఁడు । ముమ్మరంబగు భీతి మొనలెల్లఁ గడచి
పాఱుచో, వెనువెంటఁ బాఱు నాద్రోణుఁ । జీరుచుఁ బాండవసేనాధిపతుల
మరణంబునకుఁ దెగి మలసి మార్కొనిన, । 'శరణంబు వీరి కెచ్చటి' దని గురుఁడు
భృగురాముచేఁ గొన్న బిరుసునారసము । లొగిఁ బరంపరలేయ, నోర్వక వారు
'నిదెవచ్చె! నదెవచ్చె! నెటఁబోద!' మనుచుఁ । గదుపులు కదుపులై కదనంబువిడిచి
రిత్తరథంబులు రిత్తయేనుఁగులు । నెత్తురుఁ గనుపట్ట నిలువక చనిన,
నాదెస దళమంత ననిలవేగమున । దూదితెట్టయుఁ బోలె ద్రోణుచేఁ జెదర
'నోడకుఁ డోడకుఁ డో సేనలార! । చూడుఁడు న' న్నని సూర్యదత్తుండు

---

1. కడు. 2. నార్చి. 3. చిత్రమై. 4. మొత్తమై. (మూ).

విరటుతమ్ముఁడు తాఁకి నెస ద్రోణుచేతఁ । బరువడి చిద్రుపలై పడిసమాత్రమున,
క్షేమనామక చిత్రసేన నామకులు । హేమకిరీటు లయ్యెడ ద్రోణుఁ దాఁకి
శరపరంపరలు వర్షముగాఁగఁ గురిసి । గురుచేతఁ దునుకలై కూలి రాక్షణమ.
అనువార వసుదాముఁ డంతక్షేమ్ముండు । ఘనుఁడు సుమిత్రుండుఁ గలశజుఁ దాఁకి
సుడివడ్డ తరువులచొప్పున వారు । పొడవడంగిరి కురుభూపతి యార్వ.
అంత 'ద్రోణునిచేత నదె చిక్కెఁ జిక్కెఁ । గౌంతేయుఁ' డను మ్రోఁత గగనంబునిండ
రాధేయుఁ జూచి కౌరవరాజు పలికెః । " ఈ ధర్మజుని కింక నెక్కడి జయము!
ఈవేళ ద్రోణుని యేపు వీక్షించి । పావనియును పీఁడె పాఱుచున్నాఁడు.
శైనేయుబలము ధృష్టద్యుమ్ను బలముఁ । గానరాక యుడంగెఁ గడిమియులేక.
తనబలంబును జూచి తనపాటు చూచి । మనమెంత కుందెనో! మానాథ్యుఁ డితఁడు;
బవరంబులోఁ దన్నుఁ బార్థుండు విడిచి । యవలఁబోయినదోష మక్కటా! గలిగె.
... ... ... నతని కేమయ్యె. । ... ... ... ... ...
ఇతని ప్రాణంబున కెట్టట్టిమగలు । హితమతిఁ దమ ప్రాణ మిచ్చుచున్నారు.
నరునిసమాను లున్నతమహాబలులు । దొర లీ మహారాజు ద్రోణున కేరు?
హెచ్చుటికలు గల్గి యిచ్చ ద్రోణునకుఁ । బుచ్చుట తగుఁ దోడు పొందైన వారల."
అనునంతఁ దగులక యరిగెడు ధర్మ । తనయు ద్రోణుఁడు మహాధ్వనితోడఁ బిలిచి,
" నిలు పార్థ, పట్టుట నిను జంపఁ గాదు । కలదు నమ్మము వేఱెకార్యంబు మాకు.
చావరు మంత్రులు సైన్యంబు తెగదు । పావని నీ సుతప్రముఖు లున్నారు.
తెమలుదురయ్య యుధిష్ఠిరా యిటుల! । సమరంబు విడుచుట చందమా నీకు?
పెద్ద గంగెద్దువై బిరుదంబు విడిచి । యిద్దెసఁ బాఱిన నేఁ బాఱనీను.
అనినఁ గోపాగ్నియు నమ్మానధనుఁడు । నొనరిన శౌర్యంబు నూఁతగా నిలిచె.
శశివర్ణహారులతోఁ జంద్రికాధవళ । శశికేతనముతో నజాతశత్రుండు,
రురువర్ణహారులతో రుచిరమాణిక్య । హరికేతనంబుతో ననిలసూనుఁడును,
హరి[1]తవాజులతోడ నంబరాభరణ । శరభకేతనముతో సరి నకులుండు
కస్తూరి[2]వర్ణయుగ్యములతో నసిత । హస్తిపతాకతో నతనితమ్ముఁడును
దిరిగి బిట్టార్చిరి; దిరిగి సైన్యములు । గురుమీఁద నఖిలదిక్కుల ముంచుకొనినఁ,

---

1. శత్నములతో. 2. రాజయోగ్య (మూ).

కురురాజు యోధులు గొలువ నచ్చటికి । గురుఁ డానఁబోవ సంకులయుద్ధమయ్యె.
ధృతిమతి నకులుతో దుశ్శాసనునకు, । క్షితి సహదేవుతో సింధురాజునకుఁ,
దొవకి ధృష్టద్యుమ్నుతో ద్రోణాజునకు, । భువి శతానీకుతో భూరివర్మునకు,
దొరయ వార్ధక్షేమితోఁ గృపునకు, । దొరఁకొని శ్రుతకీర్తితో వివింశతికి,
అరయ శిఖండితో నంగరాజునకు, । విరటుతో విందానువిందనాథులకుఁ,
దూఁకొని యభిమన్యుతో లక్ష్మణునకు, । నా కేకయులతోడ నటఁ గేకయులకు,
నల ఘటోత్కచుతోడ నాయలంబుసుకుఁ, । దొలుత యుయుత్సునితో సుబాహునకుఁ
భువి మణిమంతుతో భూరిశ్రవునకు, । ... ... ... ... ...
వడముడితోడ భూవర, సౌబలునకు, । నడరిన ప్రమథునితో నా బాహ్లికునకు,
దొరయ సేనాబిందుతో నులూకునకు, । దొరఁకొని ధర్మజుతో నుద్రసతికి,
నలుక సాత్యకితోడ నంతభోజునకు, । నిల క్షత్రధర్ముతో నిజపుత్రునకుఁ
దలపాటు గలుగుచోఁ దపనమండలము । విలసిల్లె నాకాశవీథి నెన్నడుమ.
అప్పుడు కురురాజు హస్తీంద్రు నెక్కి । తప్పక రథికులై తమ్ములు గొలువ
ఘోరఘంటల మ్రోఁతఁ గుంభిని యదువ । మారుతాత్మజుమీఁద మదగజకోటి
కొలిపిన, నమ్మహాక్రోధి కోపించి । తలకొన్న గదతోడ ధరణికి డిగ్గి
[1]ఖర కరుఁ డయ్యంధకారంబు విప్పు । పరుసునఁ గరి ఘటాపటలి మోఁదఁగను
ధారల బహురక్త ధారలుప్పొంగఁ । జారుకుంభంబునఁ జదిసెఁ గుంభములు.
కాండఘట్టన దంతి కాండంబులురలె; । తుండాగ్రహతిఁ ద్రెవ్వెఁ దుండమండలులు.
బెరసి యంతటఁ బోక భీముండు వాని । శిరమున ముత్యాలు చెదరఁ దన్నియును,
వెలకిలఁ ద్రోచియు విఱుగఁ ద్రోఁచియును । బలిమిఁ గొన్నిటిఁ గొట్టి పాఱవైచియును,
దలలు తొండములతో దంతముల్ మెఱయ । నులిమివైచియు నుగ్గునూచముల్ చేసి
వానికి నధిపుఁడౌ వంగాధినాథు । నానవోఁబొడిచి ప్రాణత్యాగిఁ జేసి
యెదుటఁ గౌరవరాజు నీక్షించి కినుక । నదలించి మూర్చ్ఛ 'హాహా పోకు!' మనుచు

భగదత్తుఁడు సుప్రతీకముఁ బఱపి పాండవసేనలఁ గలంచుట

గదియఁ దేరఁగ, నది గాంచి యుగ్రాంశు । విదళించు నిజదీప్త విభవంబుతోడఁ
గొండలు విరివిగా గోరాడి వెండి । కొండ దిమ్మలఁబోలు కొమ్ములతోడ,

1. కరముల. (మూ)

ఘుర్ఘురికా ఘోర ఘంటానినాద । నిర్ఘాత భీత సైనిక పంక్తితోడఁ
బెడగొండలను నాల్గు పెనఁచిరో యనఁగఁ । గడువిప్పు పొడవొప్పు గాత్రంబుతోడ
గర్జిల్లు సుప్రతీకంబను గజము । పర్జన్యనిభుఁడైన భగదత్తుఁడెక్కి
భీముపైఁ గొలిపిన, బెదరి ధర్మజుఁడు । తా మున్నుగా నెల్లదళములు నెక్కి
యాకరినేయంగ, నదియుఁగైకొనక । భీకరాకారమై పెలుకుఱఁ జొచ్చి
ఘనరథంబులు కొన్ని కరమునఁ బట్టి । వినువీధిరథములు విసరివైచియును,
బటులీల మోపుగాఁ బట్టి యేనుఁగుల । నటుచూపి యిటుచూపి యవనివైచియును,
జాపకట్టుగఁ బట్టి సైనికోత్తముల । నేపోయి యుసులతో వ్రేసియు నిట్లు
కలగుండువెట్టుచోఁ, గౌంతేయుసేన । నిలువక పాఱునో, నిలిపి భీముండు
స్యందనాగ్రంబెక్కి సారథిఁ బలికె: । "పొందొంద గజముపైఁ బోనిమ్ము రథము;
సొరిది మున్నను గజాసురవధచేయు । హరునిఁబోలుదు." నన్న నట్లకాకనుచు
నరదంబు సారథి హస్తిపైఁ దఱుమఁ । దురగంబులెక్కక దూరదూరమునఁ
గరికరశీకర కాండ వర్షమునఁ దిరిగిన, । భీముఁ డాతేరొప్ప డిగ్గి
కరిమీఁదఁ బర్వతాగ్రముఁ దెచ్చివైవ । శిరముపట్టది తాఁకి చిద్రుపలై రాలె.
అంత దశార్ణదేశాధీశ్వరుండు । కౌంతేయ హితముగాఁ గరిమీఁద నడరి
యసిగొని కుంభమధ్యమునకు దాఁటఁ । బొనఁగ ఱొమ్మున వ్రేసి పోనీక గజము
శినిపౌత్రుఁ డా భీమసేనునిఁ గడచి । తనసేన గజముపైఁ దఱిమి యేయఁగను
అమ్మహాత్ముని తేరు హస్తిరాజపుడు । కొమ్మునఁ బొడిచి యుక్కునఁ బాఱవైన
విరథుఁడై సారథి వేఱొక్క రథము । పరికించునెడ వాని బలమును గూడి
రాజిల్లు నభిమన్యు రథముతోఁ బట్టి । యోజ నాయతసీమ నొగిఁ బాఱవైచి
నిలువక భీముపై నిగుడుచో, సైన్య । కలకలం బాలించి గరుడాంకుఁడచట
సమలమా సంశప్తకాఖ్య సైన్యంబు । సమయింపుచున్న వాసవి కిట్లనియె:
"ఏమొకో! మనసేన నింత అంతయ్యె? । భూమీశుఁ బట్టెనో పొదివి ద్రోణుండు!
ఏ సైన్య నాయకుఁ డీల్గెనో! దొమ్మి । నేసిరో కౌరవ సేనాధిపతులు!
అసురుల సాధింప నమరులు దొల్లి । రసికతఁ జేసిన రథసాధనంబు
సుప్రతీకము వాయుసుతునిపైఁ గవియ । నప్రతీకారమై యడరెనో ప్రోఁత!
ఇంతట నటఁబోయి యెఱిఁగి రాకున్నఁ । బంతంబు గా." దన్నఁ బార్థుండు గలఁగి,
"తలఁపమైతిమి ధర్మతనయు సంకటము; । వలసిన రణ మెంతవలసినఁ గలదు;

ఘనులు త్రిగర్తులెక్కడఁ బోయిరేమి? । ఘన వీరధర్మ మెక్కడఁ బోయెనేమి?
బావ, నీవటు తేరు పాఱని." మ్మనిన । నావిష్ణుఁ డటుసేయ నాక్షి శాత్రవులు
లావొప్ప ముప్పదిలక్షల రథము । లా వీరవరునకు నడ్డమై నిలువ
నిజరథవేగంబు నిలువకయుండ । విజయుఁడా రథరాశి విన్నానేయుచును
మఱియును గుంపులై మాతంగ కులము । నెఱిఁజొచ్చు లాశ్వికనికర మాఁగినను
జెదరఁ జిక్కులువడఁ జెడిపాఱఁ జరియ । గుదియఁ గుప్పలువడఁ గూలచేయుచును
గలహోర్వ్వి వెడలఁ ద్రిగర్తరాజనియె: । "నిలు నిలు గాండీవి, నీకుఁ బోరాదు;
ఇనుఁ డస్తగిరిచేరఁ; జేము వొమ్మనము; । నిను బిల్వఁగొన్నారు; నీవు గెల్వవును;
యమసూతి రక్షింప నొక్కఁడే గలఁడు; । సమరధర్మంబు విచారింపు." మనినఁ
దూలిపోవరు కాలితొక్కుఁగు పేరుచు । నాలకుఁ బులివోలె నతఁడందు మఱలి
లలివెల్లి దువ్వకోలలు ముంచినట్లు, । కలువాన వృక్షశాఖలు వ్రాల్చినట్లు
కరువలి మొయిలు వ్రక్కలుచేసినట్లు, । హరిచింత దురితాద్రి నటఁ ద్రుంచినట్లు,
చిలుక కెంజిగురాకుఁ జీల్చినయట్లు, । మొలపేది హరి గిరుల్ మెదిపినయట్లు,
వంచియు వ్రాల్చియు వ్రక్కలించియును । ద్రుంచియుఁ జించియుఁ దూలనేసియును
వారించి తిరుగుచో, వాయువేగమున । నా రథికుని రథం బక్కఱ కొదవ
సామజ భీముల సందిఁ బెట్టుటయు । దామోదరుని నేర్పు తడవిరి సురలు.
అర్జున భగదత్తు లప్పుడొండొరుల । నిర్జించు తలఁపుల నిష్ఠురాస్త్రముల
జల్లుపోరాడెడునరణిఁ గప్పఁగను । అల్లార్చు కరముతో హస్తిరాజపుడు
అగముల గముఁల బైనడరి వైచినను । మగఁటిమి నింద్రకుమారుపైఁ బడిన
దైత్యుల నమృతంబు దప్పించునట్లు । దైత్యారి నరునిరథంబు దప్పఁగను,
ఘనపార్శ్వములఁ దెచ్చి కదియింప, నరుఁడు । కినిసియు మృదుభాషఁ గృష్ణునకనియె:
"ఒక్కవ్రేలెడు నేల యొసఁగించి నన్ను । దక్కవభటునకుఁ దగ వైరియెదుట
వెన్నుఁడ, నిన్నాడ వెఱతునుగాక । నన్నిట్లు [1]తొలఁగింప నరకారి, తగునె!

### అర్జునుఁడు భగదత్తుతోఁగూడ సుప్రతీకమును మడియించుట

కరిసన్నిధికిఁ దేరు గదియింపు." మన్న, । "హరినుత, యెఱుఁగవే హస్తి ప్రశస్తి;
దివ్యగజంబిది; దేవతార్థంబు । భవ్యుండు నిర్మించెఁ బరమేష్ఠి మొదల.

1. తొరగింప. (మూ).

అసురులఁ బెక్కండ్ర నడఁచె నీగజము ; । పసనారసములేసి భంజింపు." మనుచు
సమ్ముఖంబునఁ దేరు చక్రి దోలుటయు । నమ్మదగజముపై నసుర బిట్టార్చి
నచ్చినమ్ముల నరనారాయణులను । గ్రుచ్చుచుఁ గపి భూతకోటి వ్రచ్చుచును
బనతోడఁ జొచ్చినఁ, బార్థుండు వాని । పసిఁడికట్టులవిల్లు భగ్నంబు చేసి
యేనుఁగు పక్కెర యినుముగా నేయ, । దానవుండతని యుద్ధతి సైఁపలేక
యంకుశంబున వైష్ణవాస్త్రమంత్రంబు । సంకల్పితము చేసి శక్రజుమీఁద
వైచిన [1]నది వైరి వాతూల [2]మథన । వాచాల వలపుంఖ నలవుమై నిగుడ (?)
సర్వతోముఖ శంఖచక్ర గదాసి । దుర్వహ మణిదీప్తి ధుర్యమైనిగుడ,
పగ్గంబులటు ముడ్చి పద్మనాభుండు । దిగ్గనలేచి యాతీవ్రాస్త్రమునకు
నెదురు నిల్చిన, వచ్చి యిందిరాపతికి । నది పుష్పమాలయై యలుత వెలింగె.
అప్పుడు హరిసూతి హరిఁజూచి కినిసి : । "ఎప్పుడే నిటుమాన వేమిసేయుదును !
ఏ నస్త్రముల కస్త్రమేయలేకున్న । దానవుచేఁ జచ్చుటగ వొప్పుఁగాక
యుఱక సిగ్గునఁ జావనోర్తునే!" యనినఁ । జెఱునవ్వు దళుకొత్త శ్రీకృష్ణుఁ డనియె :
"దేవాసురులకైనఁ దెమలని వీని । నీవెంత నదరంట నేసియు నీకు
జగదేకవీర, లజ్జకుఁ బనియేమి ? । తగవీను కథల విధంబెఱింగింతు.
హరి తొల్లి యోగనిద్రావసానమున । నురగేంద్రు శయ్యపై నున్న వేళకును
విశ్వంభరాదేవి విభుచిత్త మెఱిఁగి । విశ్వమోహనమైన వేషంబుతోడ
నోయారమున భాస్కరోదయవేళఁ । బోయి యావిభుఁబొందెఁ ; బొందినక్షణము
కాలదోషమున రాక్షసుఁడగు నరకుఁ । డాలోన నిరువుర కర్థి జన్మించి
హరిచేత నీవైష్ణవాస్త్రంబుగాంచి । సురపతికైనను స్రుక్కక తిరిగి
తనయుండుగాన నీతనికిమ్మహాస్త్ర । మొనర నిచ్చెను దంతియుక్తంబుగాఁగ ;
దీని కడ్డములేదు తేరులుదెగిన । గాని మిన్నకపోదు ఖండించుఁగాని.
నీవు దంతిని వీని నిష్ఠురాస్త్రముల । వేవేగ నడఁపుము వెఱచె సైన్యములు;
పూని సంధ్యాకాలమును జేరవచ్చె ; । దానవుఁ డతిఘోర దర్పపీడితుఁడు."
అనుచుఁ గూర్చున్నచో హరి యాజ్ఞఁ గ్రీడి । ఘనముష్టి నుద్దండ కాండంబు దిగిచి
గజకుంభ మధ్యంబు గాఁడనేయుటయు । విజయాస్త్రధార న వ్వేదండవరుఁడు

1. నరిశైర. 2, మదన.(మూ)

హరివజ్రధారచే నంజనాచలము । ధరమీఁద ప్రాలుచందమున ప్రాలి యా
ఆక్రింపఁ బడిచచ్చె హయసహస్రములు । జోక దంతిశతంబు సుభటు లక్షయును.
కరి యిట్లు ఘీంకార కలితమై చావ । నరకజుం డవనినా నాకిపుఁ బోవ
నంబరచారియై యసుర ఖేలకము । డంబునఁ గొనియెఁ గాండవ ప్రోత్రిపోత.
సవ్యసాచి యొనర్చు శరపంజరములు । దివ్యాలు ఘోషింప ద్రెవ్వ వేయుచును,
గపికేతనంబు భీకరలీల ద్రేయఁ । గపికేతుఁ డతని ఖడ్గమున ద్రెవ్వ నేసె.
రౌద్రాస్త్రమునఁ బోసి రథిదివి జనఁక । భద్రంబుగా నంటఁ బటునస్త్రిలిలిపి,
కడఁగి విరాధుపై గారుడాస్త్రంబు । విసువు రాముఁడువోలె నేసనేసి యాతఁడు
కురుసేనవివ్వంగ క్షోణి విలపింపఁ । కురురాజు కేలుపాపఁ గంభిని నాలె.
అంతలో నపరాహ్ణమయ్యె; నయ్యును । గాంతేయుసేనలు కనుసంగసయున
నరుఁడున్నయవ్వడె కొండము జయంబనుచు । బరువిడెఁ బైపైని బరఁగి యెక్కినను,
గురు కృప కృతవర్మ గురు[1]సుత శల్య । కురురాజ కర్ణముఖ్యులు దలకడచి,
నేమి ఘోషంబులు నిగుడ సంగ్రామ । భూమి ధూళిమునుంగఁ బొరివిఁక నెక్క
భగదత్తుఁడీల్గినపగ నచ్చలంబుఁ । దెగి చంపఁ ద్రోణుఁగినఁ, దెమలక నరుఁడు
గాండీవఘోషంబు గగనంబు చింపఁ । జండకాండంబుల జడివెట్ట నపుడు
దొరలెల్ల రథములు దునిసి చాపంబు । లురిసి పెక్కుములూడి యూనంబుగలిగి
సూతరథ్యములీల్గి జోళులు చిరిఁగి । యే తెరువునఁ బోవ నేయున్నఁ జేత
చిందఱవందరై చెడిపాఱె నపుడు । ముందఱఁగానక మ్రొగ్గుచు మరలి
'మముఁగావు రాధేయ, మముఁ గావు' మనుచు । రమణ మఱుంగు చొరంగ సజ్జోదు
తమ్ములుఁ దనయులుఁ దనుజుట్టికొలువఁ । గిమ్మనవైరిపైఁ గ్రీడిపై రథము

## కర్ణార్జునుల యుద్ధము

కలుపించి తఱిమినఁ గర్ణార్జునులకుఁ । గలిగె లోకైక భీకరమైన రణము.
రామ రావణులన రవిజ శక్రజులు । నా మేరువింధ్యద్వయముఁ బోలిరపుడు.
ఇరువురి నడుమ నయ్యెఘుమెట్టనాగున్న । లరుదుగఁ బర్వెఁ గ్రోధాగ్నులంతట.
వచ్చుశరంబును వడిఁ బోవుశరము । నచ్చటఁ దెగియూడ నయ్యెఁ గ్రిక్కిఱిసి.
ఘనచండ గాండీవ కాలపృష్ఠముల । నినదంబులకుఁ గాక నింగి బిట్టువిసె.
తొఱఁగిరి తునిసిరి తునియలై రనఁగ । నిరువుర ముంచు న య్యెఘు ఘోరవృష్టి.

1. మాన. (మూ).

రథచిత్రగతుల ధరాధూళి పర్వె । శిథిలచేష్టలఁ దమ్ము సేనలు చూడ.
పవిముఖ కర్తరి భల్ల నారాచ । వివిధాస్త్రముల దివ్యవిశిఖసంతతుల
నసి ముసల ప్రాస హల కులిశములఁ । గసమస నిరువురుఁ గయ్యంబుసేయ
గదగొని భీముఁడక్కర్ణ సోదరులఁ । బదివేవురను గిట్టి పటుపరాక్రముల
... ... ... ... ... । ... ... ... ... ...
... ... ... ... ... । నెంత వారికినస నిలఁ గూలనేసి
సింహనాదముసేయఁ జేసువననుజ । సింహులఁ గానక చెదరి కర్ణుండు
చేతులాడక క్రీడిచేతి శస్త్రముల । ఘాతకుఁ గాక సంగరభూమివిడిచి
పాఱె 'ధర్మజునల్లు పఱపు చోపాగ్ను । లాఱునే' యన్నట్లు హరి మెచ్చియార్వ.
అంత సూర్యాస్తమయంబైన నృపతి । చింతావివర్ణుఁడై సేనలఁ ద్రిప్పి
రణముచాలించి వారణములక్రిందఁ । దృణముకంటెను గ్రుగ్గి త్రెళ్లినభటుల,
దివ్యాస్త్రధారలఁ ద్రెవ్వి సద్దెసల । నవ్యయగతినొప్పి యణఁగు తేరులను,
గదలచేఁ దలలు వ్రక్కలు వాసి యొఱగి । యొదవ ముత్యములొల్కుచున్న యేనుఁగుల,
మూఁతులు మోపుక ముదుగు పక్కెరల । యూఁతచేఁ జచ్చియునొఱగని హరుల,
కొఱప్రాణములతోడ ఘోరపిశాచు । లుఱక మ్రింగఁగఁ గుక్షి[1]నొదుఁగు రౌతులను,
వ్రేలాడి వేట్లను వెడగన్ను వెట్టి । లీల వ్రాలుచు నావులించు మావఁతులఁ,
బెక్కు భూతంబులు పీకుక తినఁగఁ । జక్కనై ధరవ్రాలు సారథికులను,
నిండి మొండై పాఱు నెత్తురుటేర్ల । గుండుగూలిన రాజకోట్లఁ గన్గొనుచు
వేలంబులకుఁబోవ, వేట్కఁ బాండవులు । నాలీల నట వోయి రావాసమునకు.
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయు క్షితిపతికిఁ
జెప్పిన గతిఁజెప్పఁ జెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గతచెల్లె నెఱిఁగింపుమనిన
శరణాగత త్రాణ సద్ధర్మబిరుద! । కరిరాజభయ తమః ఖండనాదిత్య!
భార్గవగర్వ నిర్భగ్న ప్రవీణ! । భర్గధనుర్దండ భంజనోదగ్ర!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్ర దీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత ద్రోణాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగఁ బ్రథమాశ్వాసమయ్యె.

1. లుఱక. (మూ).

# ద్వితీయాశ్వాసము



శ్రీజలజాతాక్ష, చిరకృపాధ్యక్ష, । రాజిత గుణసాంద్ర, రఘువంశచంద్ర,
రావణు లోకవిద్రావణుఁ జంపి । దేవ! చెప్పెద వినోది! చిత్తగింపు.
అక్కథకుండు శౌనకాది సంయముల । కక్కథాపూర్తి యిట్లని చెప్పఁ దొడఁగె:
"ఇరువాఁగు నీరీతి నేఁగి యారాత్రి । సురుచిర నవభోగ సుఖసుప్తిఁ గడపి
[1]వేగెననఁగఁ జేసి పటు గోల జోడు । రాగె వాగె మనోహరము చేసికొనఁగ (?)
నిట ద్రోణుఁ జేరి నాగేంద్ర [2]కేతనుండు । కుటిలంపుఁ జిత్తుండై కొమరొప్పఁ బలికె:

## ద్రోణుని మూఁడవనాఁటి యుద్ధము

"అక్కట! నమ్మితి నాచార్య! నిన్ను ; । చిక్కని నీబాస చెల్లింపవైతి;
అరులపై నిజముగా నలుగవు గాక । సురలగెల్తువు పాండుసుతు లెంతవారు!
తెలియంగ నీబాస తిరుగఁ బాటింప । నలయుదు నే."డనిన "దేవా! యింతవలదు;
సారెకు సారెకుఁ జనుదెంచు క్రీడి । నోరాజ, కానవే! యుద్ధంబు విడిచి.
అతని కిక్కడ ప్రాణ మక్కడ బొంది; । ప్రతిన త్రిగర్తల బచరంబు వృథయు.
ఒక్కడనే తాఱకుండ నిక్కడికి । నక్కడికిని దేరు హరి చేర్పఁగలఁడు.
ఇప్పుడేమిటఁ దప్పి! నేఁ దప్పమాట; । నప్పార్థుఁ దొలఁగింపు మధిపుఁ బట్టెదను."
అని ద్రోణుఁడాడుచో నా సుశర్ముండు । జనపతి కుద్దామ శౌర్యుఁడై మ్రొక్కి:
"తపనుండు గ్రుంకుచుండఁగ నర్జునుని । నృప, యిటు రానీను నేఁడని పోయి
హరిసూనుఁ బిలిచిన, నప్పుడు యోధులకు । నరపతి రక్ష వినంజాటి పోయె.
అటు పాండునందను లరుణోదయమునఁ । బటహాభేరులు మ్రోయ బలముఁ బన్నించి
పూఁవు చక్కనగాఁగఁ బోరికి నడచి । యాపట్టు గదియుచో నటమున్న గురుఁడు
తొల్లి దేవాసుర తుములంబు నాఁడు । పెల్లుగా గురుఁడు గల్పించిన యట్టి
యొడ్డు నేఁడు జయార్థ మొనఁగూర్తు ననుచు । గడ్డరితనమునఁ గదనరంగమున
వదుసలు మెఱయ భూవరులు రేకులును, । సరవిఁ గుమాళ్లు కేసరవలయములు,

1. వేగినగతిరు. 2. నందనుఁడు.(మూ.)

శకుని రాధేయ దుశ్శాసనుల్ గొలువ । వికసిల్లు భటులతో విభుఁడు కర్ణికయు,
నరుణ మాల్యాంబరాభరణాంగరాగ్యములు । దొరఁగు పరాగ సందోహంబు గాఁగ
నుగ్రపద్మవ్యూహ మొప్పించి యందు నగ్రమునఁ దానుండ నరియుఁ గ్రక్కొనఁగ
పాండవ సేనలు పైపైని నొక్కి । మొండొండ యార్పు లేయుచుఁ, సద్గురుండు
[1]పాండొండఁగ మహాగ్ని భుగభుగ నెగయ । వందంద బహుభీషణాస్త్రంబు లేసి
విప్పఁదోలినఁ, బోక వృష్ణివీరుండు । సహాయుమనుతుఁడు సేనాధినాథుండుఁ
గవలు కుమారనగ్నను కుటోత్కచుఁడు । వివిధ దేశేంద్రులు విభుఁడును దఱిమి
యేసినఁ గోపించి యులూకుని మున్ను । గాసిన శరము లా రాజులమీఁద
గురుఁడు నూఱును వారుఁ గొని కాఁడనేయుఁ । దెసవులు గానక [2]తిరితీపులాడి
పెనఁగి పద్మవ్యూహ భేదనంబునకు । నను వెంచుఁ గానక యటు నిటు చెదరి
తనలోన ఖిన్నుఁడై ధర్మనందనుఁడు । తనయుని నభిమన్యుఁ దగఁ జేరఁబోయి
మాట నోటికి రాక నుడియుఁ జిత్తమున । నాటిన లజ్జ మిన్నకయ పోనాడి,
యనయంబు భీతిఁ గార్యంబు కక్కురితిఁ । దన వద్ది యోధులు తలవంపఁ బలికె :
" ఓ రాకుమార, నీ వీ యొద్దు విప్ప । నేఱుతు వానేర్పు నెఱిఁ జూపవన్న !
విద్యచ్ఛుకొడుకవు వినయశీలుఁడవు । నన్నుఁ బాటిది నూన్ని ననుఁ గావుమన్న !
ఎచ్చోటఁ గౌరవు లెచ్చోటఁ గర్ణుఁ । డెచ్చోట శల్యాదు లీమొగ్గరమునఁ ;
జొచ్చి విదారించి చూర్ణంబుసేయ । నిచ్చోట నోరుఁగాన నే నిన్నుఁ గాని ;
నీవుఁ బ్రద్యుమ్నుండు నీ తండ్రినరుఁడు । గోవిందుఁడునుగాని కొలుప రీ మొనకు.
నీవు చొచ్చినగండి నిఖిలయోధులము । వేవేగ చొత్తుము విరిని యేర్పడఁగ ;
ఇది నేఁడు చింపక యేఁగిన మనల । మదినొవ్వ నార్చుచు మఱి శత్రుఁడార్చు. "
అనిన నాతండు మహాప్రసాదంబు ; । జననాథ, ననుజూడు సైన్యంబుఁ జొరఁగఁ ;
ద్రుంతుఁ గదల్చు యోధుల వ్రక్కలింతు । ముంతు నమ్ములనెల్లి మునుమందఁ బ్రజలు.
ముడివడఁ జించి యీమొన సొరఁగాని । వెడల నుపాయంబు వినఁ దండ్రిచేత ;
అప్పటి కొకకార్య మబ్బదే ! " యనిన । నప్పావనియుఁ బల్కె : " నల్లేల పుత్ర !
తెలిపి నీవించుక దీర్చినఁ జాలు ; । వఱద సొచ్చినయట్లు వత్తు మందఱము.
నిన్నొంటి విడుతుమే నేఁటిపట్టునను ! । గ్రన్ననఁ జొరఁ ద్రోవగానము గాని. "

---

1. పాండపాండ 2. తిండీపు. (మూ)

అనిన సారథిఁ జూచి యభిమన్యుఁడనియె: । "చననిమ్ము మన తేరు చక్క ద్రోణునకుఁ;
దల్లిదండ్రులు మెచ్చ ధర్మజు నాజ్ఞ । చెల్లింతు నితఁడు పెంచిన ప్రాభవమున.
చాయచూపినఁ దేరు చయ్యన దూఱఁ । జేయుమీ నేర్పులు చెప్పితి నన్ను!"
అనిన సుమిత్రాఖ్యుఁడను సూతుఁడనియె: । "వినుము నీతోఁ జొచ్చి వీరు రాలేరు;
చొర నెఱుంగుదుగాని చొచ్చి యాయొడ్డు । మరలి రానేరవు మఱియు భేదించి;
కాదు కార్యంబిది; కవ్వడి విన్న । వాదగు; మఱి పిన్నవాఁడవు నీవు;
పెరసి యెఱుంగవు పెక్కుహావములు; । కురువీరు లెంతటి కుశలులో చెప్పుము!
లీల నర్జునుఁ డిందు లేనిచో రిపులు । బాలుని నిను జంపఁ బన్ని రీ పన్ను;
వలదు సాహస." మన్న వానిఁ గోపించి । చలము నుత్సాహంబు జమలింప నతఁడు:
"నాదు సూతుఁడవయ్యు నడికెద వకట! । ఏది నా కెదు రెందు నింద్రాదులైన?
బాతలింపక తేరు పాఱ ని." మ్మనిన । నాతఁ డొండాడ కయ్యాచార్యు మీఁద
వే తేరుఁ దోలిన వెంట సైన్యములు । నేతేర మనసేన యిల నొత్తినడవ

## అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించి ప్రవేశించుట

అతిఘోరరణమయ్యెఁ. నంత నాచార్యు । ధృతి [1]దాఁకి యార్చి యా దివిజులు చూడ
వాతవాఁడి మెఱుంగు వాలిక తూపు । లాతనిపై నేయ నబ్బిరుసునకుఁ
దనతూపు లెక్కక ధనువు పోనాడి । తనువు చిల్లులు వోవఁ [2]దడఁబడుచున్న,
గురు లఘుగతి దాఁటి కురుసేన బెదర । నరిగి పద్మవ్యూహ మజ్జోదు చొచ్చె;
చొచ్చిన నార్పులు సురపురిఁ గప్పె. । నచ్చుగాఁ గురుసేన లభిమన్యుఁ బొదివి
జలద కులంబెల్ల సమకాల వృష్టిఁ । గులగిరి ముంచిన కొలఁది నవ్వీరు
మిగిలి బిట్టేయ, న మ్మేటి విల్కాఁడు । తగనట్టి వృష్టి వృథావృష్టి చేసి
జ్యానాద [3]హరినాద శంఖనాదముల । భూనభో మధ్యంబు పుక్కిలించుచును,
గారాకుగతిఁ గర్ణికార కేతనము । తారాపథంబెల్లఁ దానై చరింప,
వసుధ వీరరస ప్రవాహమో యనఁగ । వెనవెల్లి విరిసిన విషధియో యనఁగ,
మండలీకృత చాప మార్తాండ బింబ । చండాస్త్ర రోచులు జగమాక్రమింపఁ,
జల్లఁజల్ల జలంబు జల్లనఁ జెలమ । పెల్లూరుగతి సేన పెరుగు నంతటను,

1. 'అభిమన్యుఁడు' అధ్యాహార్యము 2. 'ద్రోణుఁడు' అధ్యాహార్యము. 3. సింహనాదము (మూ).

జట్టలు వాపియుఁ, జదియ సేసియును, । పొట్టలు వ్రచ్చియుఁ బొరలు చించియును
గొంతులు నఱికియు గుదులు గ్రుచ్చియును । ప్రంతలు సేసియు వ్రాల సేసియును
జిక్కులు వఱచినఁ జెదర నా సేన । యొక్కఁడు వీఁడని యుద్దండవృత్తిఁ
గరవాల ముసల ముద్గర భిండివాల । శరజాల తోమర జాల వర్షముల
బిరుసు చూపిన, నల్గి బీభత్సు కొడుకు । పరిఘోల పోటుల భగ్నదేహములఁ
గలఁగక తొలఁగక గరిగంట గాక । యులయక సొలయక యాయుస్త్రములకుఁ
దెమలక సంధాన దృఢముష్టి సౌష్ఠ । వములఁ దేరులు విరుగ వాజులు నొవ్వఁ
గరుల డొక్కలు డొల్లఁ గాల్బురు ద్రెవ్వఁ । బరఁగ నెమ్ములు వ్రాలఁ బడగలు గాల
సూతులు తెగిపాఱ జోళ్లెల్ల జాఱ, । నాతపత్రము వ్రీల నాఁదలల్ వీడ
ధనువులు మెదుగ మధ్యంబులు చదియ । ఘనహేతువిడియ యుగ్యంబులు చదియ
బహురక్తముపొంగ బలములడంగఁ । గుహనాస్త్రతతులేయఁ గుట్టులు వదలి
దొరలు నిల్వఁగలేక త్రోచిపోలేక । పరువడి విచ్చియుఁ బాయవిచ్చియును
ఖండఖండములయ్యుఁ గడికండలయ్యుఁ । బుండు ప్రాయములయ్యుఁ బొడిపొడియయ్యు,
వెఱచియు నఱచియు వెసఁ జిక్కువడియుఁ । బఱచుచో, నట్టి సౌభద్రుని మీఁద
క్షితినాథుఁ డదరఁ జూచినకథ లెఱిఁగి । యతిభీతి నాచార్యుఁ డటఁ దేర ద్రిప్పి,
"యోకర్ణ! యోశల్య! యోకృపాచార్య! । యోకృతవర్మ! మీ రూరకున్నారు;
మొదలి రా జభిమన్యు మనుజున వాఁడె; । యొదవుఁడు పొదువుఁడీ యుగ్రపుజోదు;
నుతికెక్కు కృష్ణార్జునులకుఁ గయ్యమునఁ । బ్రతివచ్చుఁ దొంటి సౌభద్రుఁడు గాఁడు.
వెఱఁగులఁబడక నొప్పికి నోహటిలక । తెఱుమఁడు మెఱుమఁడు దారుణాస్త్రముల."

## తనపై నెత్తివచ్చిన కురుయోధుల నభిమన్యుఁడు గండడఁచుట

అనిన రాజును దోన నడర నయోధు । లనివార్యు నభిమన్యు నలుకమైఁ దాఁకి
క్రొవ్వాఁడి యమ్ములు కోటులకొలఁది । నవ్వీరుఁ దెరలంగ నాఁగవైచినను,
అమ్ముల నభిమన్యుఁ డయ్యోధవరుల । యమ్ము లాహుతిచేసి యంతటఁ బోక
తడఁబడ నెడనెడఁ దా వైచుగదలఁ । జిడిముడి పడి సేన సేనపైఁ బడఁగ
నొడ్డెల్ల భేదించి యొక్కొక్కకోల । జిడ్డునెత్తురుగాఱఁ జివ్వన వెడల
వాఁడు వీఁడని యాత్మ వగవఁ బ్రొద్దేది । వేఁడితూపులవాన విడువక కురియఁ

గాఁడె నశ్వత్థామ( గాండపంచకము; వినుపక కృపుఁ దాఁకె నిశితశతంబు;
సరవిఁ గర్ణుని నాటె శతసహస్రంబు; పటిఁగ శల్యుని నాటె బాణలక్షయును;
ఆసదీఱఁగఁ జించె హార్దిక్యు నాటు; శాకించెఁ బెలుచ దుశ్శాసనుఁ ద్రిశతి;
బరు లుచ్చిపోవ సౌబలుని నిన్నూటను; నొరసి సైంధవు గుచ్చె నొకయాఱునూర్లఁ;
దనువు చేరొన సోమదత్తి నిన్నూటం; ముసిఁగె రాజసుతుఁ డొమ్మన్నను రెండువేలు;
తక్కటియోధులఁ దగ నాఱునూఱు ; (సుక్కింప, నక్కమాటని మగఁటిమికి
సలుగులపటుచు మహాయోధులెల్ల ; సలుపక పాఱిరి నేల గ్రక్కదల.
అంత సౌభద్రుపై నాచార్యుఁ డడర ; నంత నింతఁ గుమారు లాదొరలెల్ల
సేనతో రథ శంఖ శింజినీరవము ; నినుచు నేసిన, సంక్రందపౌత్రుండు
వదలించి యా సేన నటుంగఁ గోల ; లదయుండై విగిడించి యంతటఁ బోక
సారంబులైన యక్షయ్యాస్త్రముల ; నారాచ ఘనకర్మ నఖరభల్లములఁ
గల్పాంతమేఘునికరణి వర్షింప ; నల్పనస్త్రమువోలె నాసేన మసఁగె.
అందు నశ్మంతకుండను సాల్వనృపతి ; డెందమింపుగఁ గిరీటిజు నాక్రమించి
తగ నేయుచో, వానిఁ దగ నొకకోల ; నగుచు నాక్షుని ద్రుంచి నలిఁగొత్తి నడవ
బాణాక్షయంబుగాఁ బాండుపౌత్రునకు ; ద్రోణకర్ణులతోడ దురమయ్యె నపుడు.
పరశురామాస్త్రంబు భావంబుచూపి ; విరచించి బహుబాణవితతుల నపుడు
తెగిచూపి రిపువుల దివ్యాస్త్రమహిమ; మగఁటిమి నతఁడు నడుమనె ద్రుంచుఁగాని;
నూత కోదండ వాజుల నొంచిచూపి ; ఘాతఁ జావిఘము సేయఁగనీఁడు గాని.
ఇట్టు పోరాడుచో నిరువురఁ గడచి ; నెట్టన నెక్కిరి ని కుమారకులు.
వారిని వాఁడి దీవ్రప్రదరముల ; శౌరియల్లుఁడు గర్వశాంతిగా నేసి
దుర్నివారణ నొక్కతూపున మఱియుఁ ; గర్ణుని గర్వంబు ఖండించి యంత
ద్రోణునినట్ల నెత్తుట జొత్తుగట్టి ; బాణధారాప్రౌఢి పరఁగించి యూర్వ
నా యిరువురు నొచ్చి ; రంత నీ సుతులు ; పాయలువాఱ సౌభద్రుండు దఱిమి
మించిన రిపుల [1]దామెనకట్లు నఱకు ; [2]సంచున నఱకుచో, శల్యుండు దాఁకి
బలు[3]వింటఁ దెగఁబాఱ పాఱవాతమ్ము ; లలుకమై జడిగొన్న, నభిమన్యుఁ డపుడు
పిడుగులువర్షించు బెడిదంపుమొగిలు ; నుడివడ వడిఁదాఁకు నుడిగాడ్పువోలె

---

1. దామేకట్లు. 2. చంచు. 3. నిండు. (మూ).

నా శల్యు నమ్ముల నటఁ జిక్కుపఱచి । యా సుశర్మ్ముని తమ్ము నర్థితోఁ దాఁకి
పోనీక శరములఁ బొదివి సమస్త । సేనలు చూడంగ శిశువు వ్రేల్మిడిని
విగతాశ్వు విరథుని విచ్ఛిన్న చాపు । విగతజీవునిఁజేయ విచ్చె సైన్యములు."
అని సంజయుఁడు పల్క, నాంబికేయుండు: । "వినఁజోద్య! మెన్నఁడు వినమిది క్రొత్త
రాజు పొమ్మనిన గర్వమున సౌభద్రుఁ । డేజాడ నరిగె? నింకేమనవచ్చు!
చెలఁగి యిట్లు కుమారసింహంబు నడవఁ । గలిగినే వాని నాఁగఁగ నొక్కఁ జోదు?
వినిపింపు సంగ్రామ విధమెల్ల." ననిన । జనలోకపతికి సంజయుఁ డిట్లు పలికె:
"మొన లిట్లు విచ్చిన మూర్ఖులై ద్రోణ । తనయుఁడుఁ గర్ణనందనుఁడుఁగర్ణుండుఁ
గృతవర్మ కుంభజ కృపులును మద్ర । పతియు సౌబల బృహద్బలు లాదిగాఁగఁ
బతి నమ్మఁగలయట్టి భటులెల్ల సైన్య । శతకోటి సంఖ్యతో సౌభద్రుఁ దాఁకి
శరవహ్నిఁ బొదువుచోఁ, జాపమధ్యమునఁ । బరివేష మధ్యస్థభానుఁడై శిశువు
అర్జునదశకంబు హరిశతకంబుఁ । బర్జన్యలక్షయుఁ బ్రభవించె ననఁగఁ
జిమ్మెఁ గేతువులూడ శిరములు గాఁడ । నెమ్ములు గొనికాడ నిషుపరంపరలు;
చొనిపె వాజులు ద్రెళ్ల సూతులు డొల్లఁ । గనకభూషలు డుల్లఁ గఠినభల్లములు;
పఱపెఁ దేరులు మ్రొగ్గఁ బలువిండ్లు స్రగ్గ । నెఱరాతు లిల మ్రగ్గ నిడు నారసములు;
ఏసె జోళ్లులు వ్రాల నిభములు వ్రీల । సీసకంబులు వ్రాల జిలుగంపసోన;
కురిసె నెత్తురులూర గొడుగులువాఱ । హరిశిరంబులు తాఱ నర్ధచంద్రములు.
ఈరీతి నరుసూతి యేపును బ్రాపు । దారుణ రణ[1]మహాోద్ధతి నుత్తరింపఁ
గొంతవైనను నిల్వ గుండియలేక । వంతలఁ గొవ్వులు వడిసి యద్దొరలు
సేనానమేతులై చెదరినఁ జూచి । పోనీక యడ్డగింపుచుఁ గ్రీడిసుతుఁడు
పగిలి పాఱెడుమందఁ బశులవాఁ డెఱిఁగి । మగిడించుగతిఁ [2]ద్రిప్పె మగతనంబునను.
శిశువునై యుండి చొచ్చిననేమి వ్యూహ । మశనివోలెఁ జరింప నబ్బిరుసునకు
మదిమెచ్చి గురుఁడు సామంతులఁ బలికె: । "అదెచూడుఁ డన్న లా! యభిమన్యురణము
... ... ... ... ... । ... ... ... ... ...
వలెనన్నఁ బొడుతురు; వానికడ్డంబు । గలదె! యెల్లరుగాక కార్యక్రమంబు;
సేనాధిపతులెల్లఁ జెడి బెండువడిరి; । కానము వీనితోఁ గలహించు దొరను;

---

1. రణోద్ధతి నుద్ధరించి. 2. గొప్ప. (మూ).

ఏకాధ్వరముసేయ నెత్తుకొన్నాఁడు ; । మీకు మీకె కాఁగి దొమ్ములకేఁ బోరుఁ." డనినఁ
గంటఁ గెంపరు దేరఁ గారవుండనియె : । "వింటికే వీరలార! విమతు నెక్కించి
దండాధిపతిపల్కు తగవులు ; భటులు । గుండియలవియు నీ కటికిలోక్తి వినిన ;
తా నాత్మశిష్యుని తనయు నీభంగి । రానిచ్చెఁగాక చొరఁగ రాని వశమె !
వచ్చిన నేమి యెవ్వరు రారు వెనుక ; । చొచ్చి పట్టించుఁడీ సుకరాజు పౌత్రు."

## దుశ్శాసనుఁ డభిమన్యుచే మూర్ఛితుఁ డగుట

అనిన దుశ్శాసనుఁ డధిపతిఁ బలికె : । "పసివడ నేఁటికిఁ బలువు రొకనికి ?
నన్నుఁ జూడుఁడు చాలు సరసూతిఁ జంపి । క్రొన్నెత్తు రిల భూతకోటికిఁ గర్పింతు."
అని పంతమాడి సైన్యముచూడ నతఁడు । కనకచక్ర రథంబు గదనోర్వి మెఱయ
నేమి మార్వ్రోగ కంఠ నినదఘోషమున । నామేటిఁ దాఁకిన, నగ్నియై మండి
తొడుగుట దివియుట దురములోఁ దూపు । విడుచుట దెలియక వెసఁ గ్రీడిపట్టి
వానిని రథమును వాలంపవెల్లి । లో నోలలార్చి విల్లును జోడుఁ ద్రుంచి
మెఱుఁగు నారసములు మేనేర్పులడర । గఱులబంటిగ గ్రుచ్చి కదనోర్వి వ్రాల్చి
యతని కిట్లను : "నోరి! యన్యాయకారి ! । హితమేది పాంచాలి నీడ్చిన ద్రోహి !
మిమ్ము బకారికి మీఁదెత్తియుండ । మమ్మేల వేఁడెను మరణదానంబు ?
అన్నఁగూడుక మాయలర్థి మామీఁదఁ । బన్ని నింతియకాక పట్టిచూచినను
బొడిచిన నాటునో ! పోలనీపోటు ; । నడువుము నేఁటికి నాబారిఁ బడక."
అనునంత నంగరా జచటికిఁ బాఱి । ఘనమూర్ఛ నొందిన కౌరవుఁ బట్టి
రథముపై నిడినంత, రథికులుగూడి । ప్రథనంబుచేసిరి పార్థజుతోడ.

## పద్మవ్యూహంబుఁ జొచ్చు పాండవుల సైంధవుఁ డడ్డగించుట

ఇటఁ బాండవులు ద్రోణుఁడెదుట లేకున్నఁ । దటుకున విజయనందను చొప్పువట్టి
కూడి వ్యూహముదూఱఁ గూడనిలజ్జఁ । బీడితులగుచు నబ్బిడ్డచే మున్న
యొడ్డును బొడువునై యొఱగిన వారుల । నడ్డమై తునిసి పమ్మైన యేనుఁగుల
నారయ మాంసమయంబైన భటులఁ । దేరులపైనుండి త్రెవ్విన రథులఁ
దెగ నాఱుమొగములఁ దెగిన రథ్యముల । నొగి శరంబుల నొచ్చి యొఱగిన భటులఁ

గింకిణీ [1]గుచ్ఛంబు గ్రియనొక్కఁగోలఁ । గొంకక సమసూతకులముఁ గన్గొనుచు (?)
స్రుతరక్త నదు లీఁదుచును మాంసశైల । తతు లెక్కుచును గేతువండాటవులను [2]
భూతలంబ్రమవ నార్పులతోడఁ దఱిమి । యేతేర, విఘ్నమై యింతలోపలను
రమణీయ రత్న వరాహ కేతనము, । విమలేందు నిభమైన వెలిపట్టుగొడుగు
వలమాన బాలార్కవర్ణ వాహములు । [3]వెలుఁగొండ నెఱరించి వన సింధురాజు
తా మున్ను వనములో ద్రౌపదిఁ బట్టి । భీముచే నొకమాటు కీముఁగ్రై గ్రుదికి
సిగ్గున నటఁబోక శివునకుఁ దపము । తగ్గక యొనరించి త్ర్యక్షుపాదమున
నొగిఁ బ్రీతి సేసిచో నొకనాఁటిజయము । వగవఁ బార్థుల గెల్చువాఁడయ్యెఁ గాన
దైవాజ్ఞకతమున దాయకాప్రౌద్ధు । చేవమూప రణంబు సిద్ధించెఁ గాన
భావరత్నము వోలెఁ బట్టంగరాక । భూమిభుజుని బోలెఁ బొలియింపరాక
తన నీడయునుబోలె దాఁటంగ రాక । మనసు మార్గమువోలె మఱి కూడరాక
యేవంకఁ దానయై యేసి బిట్టార్చి । లావు సేయఁగ, నాసిలగ్గకుఁ గాక
తనువులు నొచ్చియుఁ దల రాయిసేసి । కొని యర్జునాత్మజుఁ గూడెదు కాంక్షఁ
[4]దఱిమి చొచ్చిన, వాఁడు తనపేరు వాఁడి । చిఱచిఱఁ జిమ్ములు చిందు బాణముల
దొరల మహాభీతి దొరల నేయుచును । మఱలఁ బాఱఁగ, నంత మారుతి తాఁకి
వాని కేతువు విల్లు వర్మంబు[5] గొడుగుఁ । బోసేయు, నొకవిల్లు పుచ్చుక వాఁడు
నతని కేతువువిల్లు నజ్జోడు గొడుగు । క్షితిఁ గూల్చి సూతు మూర్ఛితుఁ జేయు, నతఁడు
( సాత్యకియరదంబుఁ జయ్యన నెక్కె ) । సాత్యకియును ఘోర శరవృష్టిఁ బొదివి
విలువిద్య నేమియు వీడాడలేక । తొలఁగిన ధర్మపుత్త్రుఁడు -చోద్యమంది
విల్లుభల్లంబును విఱువ, వేఱొక్క । విల్లుగైకొని వాఁడు విభుఁ జిక్కుపఱచె.
అప్పుడు వానిపై నధిపుసైనికులు । ముప్పది లక్షల మూలబలంబు
కత్తులు శూలముల్ కంకటంబులును । గత్తళంబులుఁ బ్రాస ఘనకేతనములు
ముసల ఖడ్గంబులు ముద్గరంబులును । మిసమిస మెఱవ సమ్మోదిని యొరవ
సైంధవుఁ బొదివిన, సమరకల్యాణ । బంధురుఁడై వాఁడు భవు కృపామహిమ
నందఱ కందమై యందు రౌతులకు । నంద రాని మహాప్రయత్నంబు మెఱయఁ

---

1. గుచ్ఛంబు. 2. 'దాఁటి' అధ్యాహార్యము. 3. వెలిగొండ. 4. దమిచొచ్చి నావాఁడు.
5. జోడు. (మూ).

బడు కాంభికయును బాహ్యంబు నబ్బంబు(?). నడఁకుచు నటఁబోయి మత్స్యేశుఁడటుమి
కుంతి భోజుని సేన గుదిగొని యటకి, । నంతటఁ బట్టోఁ జేకితానుని బఱపి,
యుత్తమౌజు శిఖండి నోహంగులు నాజి । మొత్తి, యుధామన్యు మూలకు నొత్తి
తోడరి ధృష్టద్యుమ్ను ద్రుపదు బాణాగ్ని । నడికించి, నించి ఘటోత్కచు దంచి,
లలి ద్రౌపదీపుత్త్రులకుఁ గేశపులకుఁ । జల మొప్పఁ గవలకుఁ జాల వర్షించి,
యార్చి పైఁబడిన బాహాధురంధరులఁ । నార్చిచ్చుతునకలఁ గసిమసంగుచును,
అల జాలమువోలె సంకేట మెనఁగి, । తూల సేనల నేర్పు-తోడ నిల్పఁగను,
సూనుని దలమొత్తి చూడనుకేక । వానితోఁ బోరాడవలసెఁ బార్థులకు.
అభిమన్యు శరముల సంతతిఁ జెదరి । యుభయ భాగంబులనున్న సేనలను
గూడుక నీపెంక్తికొఁనుకు సత్త్వమున । నోడక పాండవేయులఁ దాఁకి పెనఁగె.
ఇట రాజు తనతమ్ములఁడిట్లు సౌభద్రుఁ । బటుశరంబుల నొంచు భంగికిఁ గినిసి
మొనలకు మున్నాడి మూర్ఛభావమున । ననుజులుఁదానుఁ గయ్యమున కెక్కినను,
[1]దోలఁగకఁ గర్ణుఁడద్రోణకు మున్నాడి । బలు నారసపువానఁ బార్థుజుఁ గప్పె.
అతఁడు సూతుని జంప నలిగి సారథ్య । కృతి వాఁడు దానయ్యె కేలిఁ గర్ణుండు
పటుశక్తి వైవ నప్పార్థజుమీఁద । నటు నొక్క-శరమున నడి త్రుంచివైచె.
ప్రాసంబువైచె నబ్బలునిపై రవిజుఁ; । డా సవ్యసాచిజుం డది వ్రాల్చె నసిని.
చక్రంబు గొని వైచె సౌభద్రు నతఁడు; । సక్రోధుఁ డది వేగఁ జదిపె శూలమున.
ఈరీతి మత్తియు ననేకబాణములఁ । బోరాడునెడఁ గ్రీడిపుత్త్రుఁ డా కర్ణు
డెబ్బదికోలల డెందంబు నాట । [2]నుబ్బు నెత్తుటిలోన నోలాడె వాఁడు.
ధరయు మిన్ను వెలుంగ ధారాళబహుళ । శరములేసియు నొందు సాధ్యంబుగాక
యలసెఁ గర్ణుండని యభిమన్యుమీఁద । బలి యను రాజు సంభ్రమలీల నెక్క-,
విలుగోల వెనుగ్రాల వెస నవలీల । బలిఁ బట్టి సంగ్రామ బలివెట్టి యతఁడు
అంగాధిపతికినై యంగలించుటయు, । నంగద నిలువక యతఁడు వాఱినను
హతశేషులనుగూర్చి యపుడు పదాతి । శతముతోడ రథాశ్వశతములతోడ
గురు నృపాలుఁడు వచ్చి కోలాహలమునఁ । గరము భీతిలి యొదుఁగఁగఁ జొచ్చె నంత.
అప్పుడు రణకాంక్ష నందంద తఱిమి । యప్పార్థసుతుఁడు సైన్యముఁ గూడ ముట్టి

1. దలఁచుచు. 2. నుబ్బున నెత్తుట నోలలై వాఁడు. (మూ).

శాత వజ్ర ప్రభా చటుల బాణముల । నాతతగతి నేయ నాహవస్థలిని
బలువుపైఁ ద్రెవ్విన భద్రనాగములు । ములుముండ్రములు సేయ మ్రొగ్గిన హరులు,
బలుఁడొక్కచెక్కలై పడిన తేరులును, । [1]విలునమ్ములును జాఱవిడిచిన భటులు,
నోడక తెగిపడ్డ యోధులమీఁద । నూఁకొనం గూలియున్న ఘోటములు,
నానిన గుజ్జుపుట్టలమీఁదఁ । బీనుఁగుపెంటలై ప్రిదిలిన భటులు,
భూరి మాంసపుఁబొంపి బ్రుంగుడువడిన । యారూఢ రత్నమహాకిరీటములు,
వడిఁబాఱు నెత్తురువఱద గండములఁ । బడిన [2]ప్రకోష్ఠక బాహుదండములు,
మెడ మోఁదుగంటులమీఁదను మునుఁగఁ । బడఁ దొఱగిన యాతపత్రఖండములు,
కాంచన మణి వీరకటకముల్ మొరయఁ । బంచుగాఁ దెగి చిక్కువడు చరణములు,
మొండెమై రవుతులు మూసికొనంగ । నిండెలఁ దొరఁగిన హేతిఖండములు,
వాలిన మెదడుదిబ్బల నూఁదినట్లు । కీలూడి కెడసిన కేతుదండములుఁ,
గనకభూషలురాయఁ గాల్కలఁ బెనఁగి । తునిసి నెత్తుటఁ దొప్పదోఁగిన దొరలుఁ,
బెందికెలగు కంఠబిలములనుండి । క్రందుగా దివిఁ బ్రాఁకు రక్తధారలును,
వాకుదప్పఁగ వ్రాలి వలఁ జిక్కినట్లు । మ్రోకులఁ బ్రేవుల ముడివడ్డ తలలు,
నజ్జుగా నాల్కలు నడిమికిఁ గఱచి । పిజ్జునఁ దన్నుక ప్రీలు రథ్యములుఁ
దఱచయ్యె; నప్పుడు తపనమండలము । నెఱివేఁడి పసనెక్కె సింగి చక్కటికి.

## వృషసేనుఁ డభిమన్యుఁ దాఁకి మూర్ఛితుఁ డగుట

అప్పుడు వృషసేనుఁ డభిమన్యుమీఁద । ముప్పిరిగొను రోషమునఁ దేరు ద్రోలి
యమ్ములపస గొనయమ్ము సారించి । యెమ్ములేయఁగ, నొప్పి యెన్నక యతఁడు
సారథి భంగంబుఁ జాపభంగంబు । నా రథికుని కేతనాశ్వభంగంబు
రౌద్రవక్షోవిదారణమును జేయ । నుద్రేకగతి వాఁడు నొకశక్తి వైచె;
గదవైచె శూలఖడ్గంబులవైచె. । ఒదిఁగి వాఁ డవి ద్రుంప నొడలెల్ల నొంప
... ... ... ... ... । ... ... ... ... ...
వాఁడట్లు పాఱిన వచ్చి పార్థజునిఁ । గాఁడి రసాతిరేకమున వసాతి
యడ్డమై తాఁకిన నభిమన్యుఁ డతని । దొడ్డనారసమునఁ దునుమాడి యార్చి

1. వల. 2. ప్రకంటక. (మూ).

యచ్చటి నృపులు మహాస్త్రసంయుతులు । నచ్చుపిచ్చుఁ దన్నుఁ గదిసిన, వాని
నెఱయ నేరులఁ బ్రావు కెరఁటిగోలెఁ । గఱచు మిడుతల నాల్చు దావాగ్నివోలె
జంతువారణసేయు జముఁడుపుగోలెఁ । బంతసూగిన యుష్ణ వివిధార్కుఁ జూచి
యని నేను గర్ణుండ నని, నేను గృపుండ । నని, నేను ద్రోణుండ నని యు, శల్యుండ
నని, దున్నసేనుండ నని, నేను నేఁ ; దనుచును, నశ్వత్థాము నదుకొని నెఱచి
యధికులు వాదుఁగుచో, నంత శల్యాజుఁడు । విధి తన్ను బ్రేరేప విజయుజుఁ దాఁకె
రారాజు మదిమెచ్చ రణమొనరింప । నా రుక్మరథుపైని నభిమన్యుఁ డలిగి
చట్టలతోఁన గుత్తక మున్నెఁగూల ; గట్టి హాజనుల్పల ఖండించివైచ,
వగనొంది పలువురు వాని నెచ్చెలులు ; మంగటిమి హెచ్చైన మారొంగువారు
సారథి రథ రథ్య సహిత మజ్జోను । నారసంబులవాని నడకొని ముంపఁ,
గవ్వడిచేఁ గన్న గంధర్వమాయ । యవ్విధుఁ డడరించి యపుడు వారలకుఁ
దముఁ బెక్కుబలములు తాఁకినట్లగుచు । భ్రమయుచుఁ జొచ్చి సౌభద్రుఁ డద్దొరల
నూఁచకోఁత యొనర్చ నొకట మొండెములఁ । బాచె మస్తకములు పడి యావులించి.
అంత రా జతని సాహసవృత్తి కలిగి । యంతంతనున్న సైన్యముఁ గూడఁదిగిచి
కరటి ఘంటా తురంగమ కింకిణీక । నరకఁత రథనేమి నాదముల్ బెరయ
నకరుణ ఘనజన్యు నభిమన్యుఁ దాఁకి ; వికటాస్త్ర పటుశస్త్రవిద్యఁ బైఁబడినఁ,
దనబారిఁ బడిపడి దట్టమైయున్న । ఘనసేనఁ బోనీక గాండీవికొడుకు
అంగఖండముల రథాంగఖండముల । సంగతి వస్త్రభూషణ శకలముల
హతహస్తి హయ విశృతాకార తతుల । నతవీర సుభటుఁడైన ట్లాజిఁ గప్పి,
బలములఁ జదిపి, భూపతి యొత్తిపాఱ । నలుగులఁ బఱపుచో, నాభయంబునకు
'నోడకుఁ డోడకుఁ డోకఁ డింతె' యనుచుఁ । గూడి కొందఱు రాచకొడుకులు నిగిడి
ప్రిదిలి రాతనిచేతఁ జెను[1]చొఱ నోరఁ । బ్రిదిలిన చిఱుచేవ పిండునుబోలె.
అట్లు సత్యశ్రవుం డాదిగా నృపులు । చిట్లుట రారాజు చేరుట చూచి
శాల్వ వణంక సంగములు చెమర్ప । నొల్లిండఁగా సీకనూజులు విఱిగి
పగిలి పైపైఁ బాఱఁ బతి చూచి వగచి । మగిడి కోల్తలసేయ మది సీనువుట్టి
పరఁగ సౌబల బృహద్బల కర్ణకృపులు । గురు కృతవర్మలు గురుతనూభవుఁడు

1. జొర. (మా).

సరవి శల్యుండు దుశ్శాసనాదులను । నెఱియ యత్నంబుల నెక్కిన, నతఁడు
శాకులు మెచ్చ నసాకుల లీల । నీకంతో బోరాడె వినుము రాజేంద్ర!

## లక్ష్మణకుమారుఁ డభిమన్యునితోఁ బోరి మడియుట

పెలుచ గొబ్బునఁ బేర్చి పెల్లార్చి యేయ । నిలుపు నుబ్బును లేక నీయోధు లోడఁగ
నపుడు లక్కనుఁడు సర్వాంకుని సుతుఁడు । నృపుఁడు శంకింప సైనికుఁడు జంకింప
నిలువక సౌభద్రు నృపపుత్త్రుఁ దాఁకి । కలహంబు లోకభీకరలీలఁ జేయఁ
బుత్త్రమోహంబునఁ బోరాక తిరిగి । ధాత్రీవిభుఁడు తానుఁ దమ్ములు దొరలుఁ
"బాఱు పట్టు వధింపు పరుని సాధింపు । మీఱు వ్రా" ల్వనుమాట మెఱయ డగ్గఱిన,
నంతకు లక్కను నక్కుమారుండు । నంతకునకు నిచ్చి యంతటఁ బోక
తనకు బిట్టుఱికిన, ధార్తరాష్ట్రుండు । తనయు పోకకు బాష్పధారలు గ్రమ్మ
నభిమన్యు నేసె సాయక సహస్రముల; । నభిమన్యుఁ డవి ద్రుంచె నశ్రమలీల.
మఱియుఁ గోపాంధుఁడై మనుజేంద్రుఁ డేయ, । బిరుదు దెచ్చుక యోధ బృందంబు నెక్కి
యర్జునాత్మజు నేయ, నతఁడు కోదండ । గర్జా మహోగ్రుఁడై కనుఁగొనరాక
పెక్కు తెఱంగులఁ బెక్కు బాణములఁ । బిక్కటిల్లఁగ నేసి పిఱిఁదికిఁ దోలి
"వెనుకదిక్కాలించి వెఱ్ఱిపాండవులు । నను గూడి రారైరి నడుమ నేర్పెరో!
కలకలంబయ్యెడుఁ గడుఁగడు నచట; । తెలిసి వచ్చెదఁగాక తిరిగి యిం." దనుచు
శూరులు వనమఱి చూడ నీ మనుమఁ । డారేఖ నిగుడుచో, నదలించి యపుడు
ఎదుట నేనల వెల్లి యిభములుఁ గవియఁ । జదలఁ గళింగ నిషాదులు పర్వి
తేరాక్రమించిన, దేవేంద్రుమనుమఁ । డూఱట యెఱుఁగని యురురణక్రీడ
దొడ్డనారసములు దొడిగి యాకరుల । నడ్డంబు నిడుపు వ్రయ్యలు వాపి వాపి
కరి ఘటలకు వెన్క గాటమై వచ్చు । తురగ యూధము గాలి ధూళులఁ గలిపి
చండనిషాదుల శతలక్ష సంఖ్య । చెండాడెఁ; గాళింగసేనఁ దూలించె.
అంత సారథి పల్కె నవసరం బెఱిఁగి: । "ఇంతట వెడలుట యిది కార్యరేఖ;
కడమని నడుమని గానరా దెందు; । వెడలుపు నిడుపని వెడలరా దెందు;
భూవరుఁడు దలంకుఁ బొద్దును బోయెఁ; । బోవలె నెయ్యది పోఁ ద్రోవ మనకు?
మొనలు మిక్కిలివచ్చి మూఁగకమున్న । మనల మిక్కిలిదప్పి మలఁగకమున్న
మొనలు గాల్కొని చుట్టు ముట్టకమున్న । ... ... ... ... ...

యొడఁజూచి చించుక యీయొద్ద మనము । వెడలుట మిక్కిలి విక్రమక్రమము.
చట్టలు వాపితి సైనికోత్తముల ; । మట్టి మల్లాడితి మండలాధిపుల ;
విచ్చితి కర్ణాది వివిధోగ్రభుజుల ; । దెచ్చితి రారాజు దిక్కు మొక్కునకు.
తొంటి దేవాసుర తుములంబునందు । వింటి నేఁడగులావు వింట లే దెందు.
వేమాఱు నీచేత విఱిగిన వెనుక । నేమి తలంతురో యింకఁ గౌరవులు !
కావున సైంధవు గలకల సంజ్ఞఁ । ద్రోవఁజూచుక గెల్పుతోడ నింతటను
గాంతేయ వీరులఁ గలియుట యొప్పు ; । నెంతయు నలసితి నేను నీ యాన ;
తెగినయట్లున్నారు తెగరు కౌరవులు । తెగఁ బాఱ సిదిగాని తెఱపిలే." యనిన
'కురుశేష మాహుతి గొనక యేచేల । మరలుదు?' నని యభిమన్యుండు పలికి
సైంధవుపైఁ దేరు సారింప, నెదిరి । గాంధార రాజును గర్ణుండుఁ గృపుఁడు
గురు కృతవర్మలు గురుతనూభవుఁడుఁ । బరఁగ శల్యుఁడు బృహద్బలుఁడు నదల్చి
సరి నుగ్రమృగములు శరభంబు గూన । నరికట్టుకొన్న యా యనువునఁ బెనఁగ
నందఱ శరములు నతఁడు వారించి । యందంద నఱువదియమ్ముల గురుని
బలియు నశ్వత్థామఁ బదిసాయకముల । నలువది నాల్గు బాణంబులఁ గర్ణు
వెసఁ [1]బదేనమ్ముల విను కృతవర్మ । ... ... ... ... ...
... ... ... ... ... । పోఁడిగాఁ ద్రిదశాస్త్రముల బృహద్బలుని
నాఱు నిర్వదినాల్గు నమ్ముల శల్యుఁ । దూఱించి, కృపు తేరు దునుమాడి యార్చె.
అందఱు భయముల నస్త్రముల్ మఱచి । సందడి పడఁగ, వాసవపుత్త్రుఁ దాఁకి
పరభీకరుఁడు సూర్యభానుఁడన్ రాజు । శరవేణికలఁ గప్పి శక్యంబు గాక
యతని నారాచ ధారాచమనమున । మృతుఁడైనఁ దత్సేన మెదిసెఁ ద్రోద్రోన.
అదిగాక ద్రోణ కర్ణాదుల బలము । పొదివి భగ్నంబయ్యెఁ బురుసింహుచేత ;
వడి [2]మేఘవేగ సువర్చసులట్లు । కెడసి రాగతిఁ జంద్రకేతుండుఁ బడియె.
అంతఁ [3]గ్రోధవిలిప్తులైన భూపతులు । దంతి భీకరులు బృందారకు లనఁగ
నవ్వీరుఁ దాఁకి సహస్ర ఖండములఁ । దెవ్వి ; రప్పుడు పాఱె దెసచెడి సేన.
నృపుఁడంత [4]నరదంబు నెక్కి చేవీచి । యపుడు పాఱెడుసేన నటు మరల్చినను
ఆవీరవరుని బాణాసన విద్య । నెవ్వని యత్నంబు నెక్కడింతయును.

---

1. బదిరేసునమ్ములఁ గృతవర్మ. 2. మోఘులెగసు వర్చలులట్లు. 3. గ్రోధనపుత్రులైన. 4. తనసేన రథమెక్కిచూచి. 5. నృపుఁడుపాఱెడుసేన నిలుమని వించె. (మూ).

కర్ణుఁడంతటఁ గర్ణికారకేతనుని । దుర్నివారత చూచి తొలఁగక నిగిడి
పెనఁగి యించుక సేపు భీమాస్త్ర భిన్ను । తనుఁడయ్యె నతని శస్త్రములు చింపఁగను
శాంతుఁడై యొఱగెఁ; గోసల బృహద్బలుఁడు । సంతతధారాస్త్ర జటిలుఁడై తాఁకి
సౌభద్రు నూతాశ్వ సహిత రథంబు । చేభంగి నొంచి యష్టోరు బాణముల
బ్రక్కలై వ్రాలిన, వాని బంధువులఁ । జక్కాడె నార్జుని శతసంఖ్య నపుడు.
మఱియు మాగధుని నశ్వంతకనాముఁ । దఱిమి యార్జుని ద్రుంచి, తగనొక్కకోల
నురమును నొకకోల నూరువు వెడలఁ । దొరఁగించి తూలించె దుశ్శాసనునిని.
శకుని తాఁకిన వాని సకలసంభ్రమము । నొకకోల దిగ్రమింగి యుగ్రుఁడై యతఁడు
అట్టహాసముచేసె; నతని కోల్తలకు । నెట్టివాఁడును నిల్వ నెక్కుడివాఁడు!
అర్జుని యీరీతి నాజిఁ గౌరవుల । నిర్జించియును దృష్టి నెగడక యంత
రారాజు తేరికి రా, రాధకొడుకు । చేరి ద్రోణునిఁ బల్కెఁ జిత్తంబు వణఁక:
"ద్రోణ, యెన్నఁడు నిట్టి దురము నేనెఱుఁగఁ । బ్రాణాతురము వచ్చె బలములకెల్ల.
తలపడి చూచితి ధవళాశ్వుతోడఁ; । గలహించి చూచితిఁ గడు భీముతోడ;
నించుక నిటు నొవ్వ; నిప్పు డీతనిని । వంచనఁగాని గెల్వఁగరాదు మనకు.
భటుల మానము వోయెఁ బలుమాఱు విఱుగ; । నిటువంటివాఁడు పోనిచ్చునే మనల!
ఇందఱుగాఁ గూడి యేకయత్నమున । మందఁ జేసినఁగాని మడియఁడు వీఁడు;
ధర్మంబు లెన్నినఁ దప్పఁ గార్యంబు; । నిర్మలయశ, యింక నీ చిత్త." మనిన
ఆచార్యుఁ డిట్లను: "అది నీవు మాకు । సూచింపనేటికి సూతజ, తెలియ?
వలనేది మీవంక వ్రాలిన మాకుఁ । దలపోయ నున్నవే ధర్మమార్గములు!
ఈవు విల్ ద్రుంచిన నే సూతుఁ ద్రుంతు; । నావల కృపుఁడు రథ్యములఁ జెండాడు;
కన్నవారము మఱి కన్నట్టులేయు । నున్నతి గొనుఁ గాని యొదుఁగఁడు వీఁడు;
ఇది నీవు యోధుల కెఱిఁగించి తోడఁగు । పిదప నార్జుని యెంత పెనఁగినఁ బెనిఁగె;
కవచధారణ విద్యకలిమిఁ గయ్యమునఁ । బవులఁడు మనమెంత పగులనేసినను."

## కర్ణాదియోధవర్గము వంచనచే నభిమన్యు మడియించుట

అని సైనికులకెల్ల నది చెప్పఁ బనిచి । యనుపమ యత్నులై యపరాహ్ణవేళఁ
గలశాబ్ధి విహరించు కలభంబు ద్రిమ్మఁగఁ । దలఁచు నుగ్రగ్రాహ తతివోలె వారు
తలపడి రణధూళి దశదిశావీథి । నెలకొన సౌభద్రు నృపరుద్రుఁ దాఁక

నప్పుడు గలకాఁక యది వీరి కనుచు । నప్పాఁపు గానక యాతఁ డాభటుల
బాణాగ్నిహోత్ర వైభవమునఁ గాల్పఁ । బ్రాణభీతియు సిగ్గుఁ బొరయఁ గర్ణుండు
వెనుక చుట్టుకవచ్చి విజయనందనుని । ధనువు భీకరభల్లధారఁ దున్మాడె;
ఆలోన గురుఁడు రథ్యమ్ములఁ దునిమె; । నాలోనఁ గృపుఁడేసె నడఁగ సారథిని;
శరము లేసిరి నిల్చి శల్యహార్దిక్య । గురుసుత శకుని బాహ్లీకు లాదిగాఁగ,
విరథుఁడై చాపంబు విఱిగి ఘోరాస్త్ర । భరితుఁడై విస్తరింపఁగ రాక యతఁడు
పలకయు వాలును బాహుదండముల । నలిఁగొని మింటికి నవలీల దాటి
యట వచ్చు శక్తుల నమ్ముల గదలఁ । బటు శూలములఁ దాఁకి పడఁ జెదరించి
యెట వ్రాలునో యని యెల్లరు నోముఁగఁ । బటులీలఁ గుంభకాష్ఠి నమ్ములయుఁ,
దునుమాడు నెడఁ గని ద్రోణుఁ డస్త్రాలు । ఘనమార్గమునఁ జేసెఁ; గ్రన్నన డుబ్బులక

... ... ... ... ... । ... ... ... ... ...

నవియును నిష్ఫైన నర్జునాత్మజుఁడు । తవులక చక్రంబు తన తేరి మీఁద
నున్నచోఁ గైకొని యుద్ధవీథి కెగసి । కిన్నరుల్ గంధర్వ గీర్వాణ వరులు
మొదలైన దేవతల్ మున్ను గీర్తింప । (వదనంబు క్రోధవిహ్వలమై చెలంగ)
నొడలి శోణిత ధార లుర్విపై నురలి । తడవ మండలగతిఁ దార్క్ష్యుఁడై తిరిగి
యెట్టి యభ్యాసమో యిది యని తోఁప । నిష్ప్రతి యని వింత యింతయు లేక
ధర వ్రాలి గురుని ముందట మహాసేన । దొరఁకొని నఱకుచోఁ, దొరలెల్లఁ గవిసి
చయ్యన వ్రయ్య నచ్చక్ర మేయుటయు, । నయ్యుక్తి గదగొని యతఁడు బిట్టార్చి
జడియక గవిసి యశ్వత్థామ మీఁదఁ । బడిన నాతఁడు వాఁడెఁ బ్రాణంబు వలసి.
అతనిసూతు రథంబు హయులఁ జెండాడి । బ్రతివీరతతి ఘోరఘోషుఁడై యతఁడు
భీమాస్త్రముల నేమపెరిగినయట్లు । రోమాంచమైనట్లు రూపుమాపట్ట
గాంధారుఁ గెలఁకులఁ గాంచి యచ్చటికి । సంధింపకో, వాని సంబంధు లెయిది
విపుల తేజులు సప్తవింశతి సంఖ్య । నృపతులు హతులైరి నీ పౌత్త్రువలన.
అతఁ డంత వీరరసాతిరేకమున । గతికిఁ గాల్గెలు రాకయుఁ దీవ్రగతిని
1దడవి వసాతేయ దశకంబుఁ జదిపి, । కడఁగి కేకయ సప్తకంబును గెడపి,
2తుమురయ్యు నిందఱఁ దునుము పీడనఁగ । సమసియు నింకఱఁ జమపుపీడనఁగ

---

1. యడలివసాతియ్యు. 2. తునుమయ్యు. (మూ)

నలసినవారి హాస్యముగఁ బల్కుచును, । దెలిసి తాఁకినవారిఁ ద్రెవ్వనేయుచును
జరియింపఁ, గదిసి దుశ్శాసను కొడుకు । శరకోట్లునేయంగ సౌభద్రు నొడల
నేసాయకము నాట నెఱుఁగనిచోట, । నేసాయకము లేక యితఁడు నగ్గదను
ఆతని రథసూత హయముల మెదుపఁ । జేత వాఁడును గద శీఘ్రంబె గొనుచు
జగతికి దాఁటి నిశ్శంక నవ్వీరథుఁ । దగుచాయ నేయ నాతఁడు తప్పఁ గ్రుంగి
పదపడి తా వ్రేసెఁ; బ్రభువ, మీవాఁడు । గదకట్టె యొకవ్రేటు కరమునఁ గొట్టె.
పోసఁగ నేమనిచెప్పఁ బులి పేదవడినఁ । బసులవాఁ డెక్కునన్ పలు కొప్పఁగాక
సౌభద్రుఁ డెట్లు? దౌశ్శాసని యెట్లు? । వేభంగి రణమెట్లు? విను మిట్లు పెనఁగి
శ్రాఁకమై నిద్దఱు గదలెత్తి వైచి । తాఁక మేదిని వ్రాలి తవిలిరి మృతికి.
భేరీరవంబులు బెరయ నవ్వేళఁ । గౌరవు లార్చిరి గగనంబు నూఁగ.
నెత్తుటఁ బేసిన నీలాలకములు, । మొత్తులఁ జెదరిన ముత్యాలసొమ్ము,
వాలుగుండెలఁ బట్టి వ్రస్సిన యురము, । లీలమై దొరఁగి వ్రాలిన కన్నుఁగవయుఁ
గలిగి విమాన భగ్నంబునఁ బడిన । కలికి వేలుపుఁ బోలె గాండీవికొడుకు.
అట్లున్నగతికి భూతా క్రోశ మయ్యెఁ; । జిట్లిరి విహతులసేనాధిపతులు.
తరలు భూషా మణి తారలు చెదరఁ । దను రక్తరాగ సంధ్యారాగసీమఁ (?)
గ్రొన్నెలగతి వ్రాలు గొమరు సౌభద్రుఁ । గన్నారఁ జూచి పొక్కనివారు లేరు.
కరిశైల నరనక్ర కరవాల మీన । హరిభంగ రుధిరాప్పు లమరు దుగ్ధాబ్ధి
యోగనిద్ర మురారి యున్నయట్లున్న । యా గుణోత్తముఁ జూచి యడ లెట్లుగాదు?
కూలిన యఱపీనుఁగుల యార్తరవముఁ, । గాలువలై పాఱు ఘనరక్తరవము,
దివి నట్టలాడి మేదినిఁ బడు రవముఁ, । బవిలి యోధులు భీతిఁ బాఱెడురవము
సౌభద్రుఁడున్నట్లు సమరమున్నట్లు । నాభూమిఁ దోపించె నాటోపమునను.
అంత హాహాధ్వను లడర నామృతికిఁ । గౌంతేయ సేనలు కదనంబు విడిచి
తవిలి పాఱిరి శోక దందహ్యమాన । వివశాత్ములై మిన్ను విఱిగినట్లగుచు.
అంత సైంధవుఁ డుబ్బి యార్వ నీసేన । నెంతయు సంతోష మినుమడింపంగ
నిక్కము తోడుగా నిలిచి ధర్మజుఁడు । చక్క సేనలఁ బిల్చి సన్నలు చేసి
"ఇనుఁడు గ్రుంకఁడు నిల్వఁ డేల పాఱెదరు? । మనకేల భయ మభిమన్యుపాటునకు?
వాఁడు పాండవులకు వాఁడిరా రిపుల । వేఁడిఁ జెండాడి యావిధిఁ బడ్డ నేమి?
వారార్చినను గెల్చువారము మనము; । చేరుఁ డిప్పుడె రాజుఁ జిక్కెంత." మనఁగ

దెలివి పాండవసేన తిరిగి మీసేనఁ । దలపడి పోరుచోఁ దపనుండు గ్రుంకె.
గ్రుంకినఁ బ్రాణేశుఁ [1]గూడఁ బ్రతీచి । కుంకుమ మాడెనాఁ గొమరొప్పె సందె.
హరియల్లుఁ డీల్గ రేవాడిన భంగి । నరుణుఁ డంబుధిఁ గ్రుంక నఖిలభూతములుఁ
దలఁకి తారు శివారుతంబుల తోడ । [2]నెలుఁగు పుచ్చిన మాడ్కి నేతెంచె నప్పుడు.
నెత్తుటఁ దోఁగిన నేలయు నపుడు । లత్తుక నలికిన లాగయ్యెఁ జూడ.
శవభక్షణము సేయు శకుని పిశాచ । రవములు లోక భైరవములై మెఱసె.
సరినంతఁ దోషరోషంబుల తోడఁ । గురుపాండవుల సైనికులు వేలములకు
నడతెంచి సమర సన్నాహంబు లూడ్చి । యడలున సాంధ్యకృత్యము లొనరించి.

## అభిమన్యుమృతికి ధర్మజుఁడు శోకించుట

రందు ధర్మజుఁ డాత్మ నధికశోకమునఁ । గుందుచు దొరల వీడ్కొలుపన మఱచి
యొంటి వస్త్రముతోడ నుర్విఁ గూర్చుండి । కంట బాష్పములొల్కఁ గరుణవిస్ఫురణ
నూనిన వేడినిట్టూర్పులు నిగుడ । సూనుఁ దలఁచి యర్జునుని దలంచి
మోము గదల్చి భీముఁడు మొదలైన । సామంతులకు లజ్జ జనియింపఁబల్కె :
"ఒచ్చెమయ్యెఁ గుమారునొప్పించి మనము । వచ్చితి మచటఁ గావఁగ ననువు గాక
అది యెఱుఁగక లోకు లాడుదు ; రింకఁ । గదన మేటికి ! రాజ్యకథయు నేమిటికి !
పోదుఁ దపంబుండఁ బుణ్యాశ్రమముల ; । జోదులు పొందు మీ క్షోణుల కింక.
ఏమని యుత్తరంబిత్తు నర్జునున ? । కామహాత్ముఁడు వచ్చి యభిమన్యు నడుగ ;
అల్లుని నడిగిన హరికి నేమందు ? । చెల్లఁబో ! యిదియు నేఁ జేసినకీడు.
ధరయేలుకాంక్షఁ బద్మవ్యూహ మేను । జొరుమంటి బాల్యంబు చూడక సుతుని.
'వెరవునఁ జొరఁగాని వెడలిరానెఱుఁగఁ । దెరు' వని వాఁడాడెఁ దెలియలేనైతి !
బెబ్బులికూన గోబృందంబుఁ జొచ్చు । గబ్బున వైరిచక్రముఁ జొచ్చి యొకఁడె
యెన్ని తేరులు గూల్చె ! నెందఱఁ గాల్చె ! । నెన్నఁడు వింటిమే యింతటివాని !
'చొరుము నీ వెంటనే చొచ్చెద' మనఁగ । సరిగె నామాటకు నక్కటా ! నమ్మి.
ఏచిన ముట్టడ నెంత నా కెదురు । చూచెనో ! యితరుండు చొరఁ డెవ్వఁ డందు.
తనయునిఁ జంపించు తలఁపునఁగాదె । యొనరంగ సైంధవు నొడ్డె విధాత !

1. గూడినప్రతిచి. 2. యెళవు వచ్చిన. (మూ)

ఎగ్గులాడఁ గీడేమి యేమెందుఁ జొత్తు! । భగ్గునఁ బోవాకో ప్రాణవాయువులు!
సంచిత సత్పుణ్యజాలులైన । సింహాక యాతుఁడే యాశోకహీన!
నామాత్రమునఁ జేసి! సాంగతికన వచ్చి । నోముల గాఁగలవాఁడో! యిదినాకు చింత.
పురుహూతతుల్యుఁడై కైనఁ బోరాని తీర్చు । పురుహూతసుతునకా పుత్రశోకంబు!
ఒక్కనిఁ బెక్కురు ఘోరాధములు పొడిచి । చక్కాడిరని విని శక్రనందనుఁడు
కురుకుమార కులంబుఁ గూల్చెఁ; గూల్చినను । సరియైన మరణమే సౌభద్రునకును!"
అనుచు మూర్ఛితుఁడై సందడిఁ బట్టి । జననాథుఁ దెల్పి యచ్చట నిల్వఁబెట్టి
శాంతిగాఁ జెప్పి; దప్పుటకి వ్యాసుఁడు । సంగత సుఖకథా చతురుఁ డేతెంచి
యుతనిచేఁ బూజితుండై పల్కఁదొడఁగె: । "క్షితిప, యేమున్నది చింతింప నింత?
తోఁచినప్పుడె చావు దొడఁగు జంతువుల; । కా చావు మఱియు మర్యాదతో రాదు;
ముప్పనమునఁ జచ్చు ముత్తాత నిలుచు; । క్రమ్మరవ్వయుఁ జచ్చు గర్భస్థుఁ డుండు;
బలవంతుఁ డీల్గు దుర్బలుఁడు చావకుండు; । నిల నధార్మికుఁ డుండు నీల్గు ధార్మికుఁడు.
చావు లెందును లేవె! సౌభద్రుఁ బోలు । చావురా; దిటు వైరిచక్రంబు వ్రాల్చి
పరమ సంయములకుఁ బ్రాపింపరాని । నిరుపమగతిఁ గాదె నీ పుత్రుఁ డేఁగె!
శమియింపు తొల్లి సృంజయుఁడను రాజు । శమియించె నారదసంయమి పలుక.
వినిపింతు నది నీకు విను [1]యమతనయ!" । అని తగ నా యితిహాసమ్ము చెప్పె:

## సువర్ణనిష్ఠీవి చరిత్ర

సృంజయుఁ డనువాఁడు శివునకుఁ దొల్లి । సంజాత భక్తితో సంతాన కాంక్షఁ
దపముండి మెప్పించి తగ నిట్లు నడిగె: । 'త్రిపురారి, పుత్త్రు [2]నర్పింపుము నాకు.
నెఱి వాని మల మూత్ర నిష్ఠీవనముల । మెఱయు బంగార మిమ్మి దిన దినము;
ఇది నాకు వర.' మన్న నిచ్చె నీశ్వరుఁడు; । పదపడి యతఁడట్టి పట్టిఁ బుట్టించె.
వానికిఁ బేరు సువర్ణ నిష్ఠీవి । నా నిచ్చి పెనుచుచు, నానాఁటఁ బసిఁడి
కూడఁబెట్టి గడించి కోట్లకొలంది । యోడక బ్రదుకంగ, నోర్వలే కపుడు
కడు ముచ్చిలించి దొంగలు వానిఁగొనుచు । నడవికిఁ బోయి యొయ్యనఁ బొట్టవ్రచ్చి
కాంచనం బటఁ బొడగానక పోవ । సంచిత భీతి సృంజయుఁడును వెదకి
వనమున సుతుఁగాంచి వాని దహించి । తన వీటి కరిగి యెంతయును జింతింప

---

1. శమ. 2. నర్థింపుము. (మూ)

నను బోలె నచటికి నారదుఁ డేఁగి: । “ ఓనురాజ, యేటికి వేఁగఁ జిత్తమున?
పోయెడు పిండంబు పోవు నెప్పుడును; । ఈయన కొలఁదులే యిటుఁ జన్న నృపులు.

## షోడశ మహారాజ చరిత్ర

సంవర్తుఁడను మహాసంయమి సవన । సంవిధానంబులు సకలంబు నడపఁ,
పురుహూతముఖ్యులు బొందితో వచ్చి । చరియింపఁ గాఁ, దగుసామగ్రి మెఱయ
క్షితిఁ బెక్కుక్రతువులు చేసె మరుత్తు; । అతఁడు పోయెను గాక యవని నున్నాఁడె!
కనక [1]పాత్రీన సక్రములతో వ్రజి । పసివడి యేఁటేఁటఁ బసిఁడి వర్షింప
నర్థుల కయ్యర్థ మర్థి నిచ్చుచును । బార్థివముఖ్యుఁడై బహు పుణ్యాసముల
ననిశంబు నశ్వమేధాది యాగముల । నొనరించినట్టి సుహోత్రుఁడున్నాఁడె!
కనకాశ్వములు వేయి కరులొక్కవేయి । కనకంబుతోఁ గన్యకలు నొకలక్ష
(గనక శృంగంబులుగల పశుల్ కోటి) । యొనర విప్రుల కిచ్చి యోరంత ప్రొద్దు
సాంగంబుగాఁ జేసె సకల యజ్ఞములు । నంగుఁ డాతఁడు పోయె నవనిపై లేఁడు.
తే రెల్లదీవులఁ దిరిగిరా నెచట । వైరి మాత్రము లేక వాజిపేయములు
భవుఁడు వెచ్చము నడుపఁగఁ బెక్కుచేసి । కువలయ సురులకుఁ గోటికోట్లిచ్చి
యడిగిన నిజమాంసమైన నర్థులకుఁ । బుడికి యిచ్చిన శిబి బొంది నున్నాఁడె!
హరువిల్లు విఱిచి మృగాక్షికై పూని । శరనిధిఁ గట్టి రాక్షసరాజుఁ గొట్టి
విశ్వంబు తనరాజ్యవిభవంబు గోర । నశ్వమేధ శతంబు లనపేక్షఁ జేసి
బ్రదుక బ్రాహ్మణులకుఁ బదివేల కోట్లు । మొదవుల నిచ్చె రాముఁడు భువి నేఁడి?
తాతలు గతిలేక తపసి శాపమున । భూతిమై పడియున్నఁ బోయి యొక్కఁడును
మించినతపమున మిన్నేరు ధరకు । డించి మోక్షము సంఘటించె వారలకు;
చేసె జన్నములెన్నొ; చెల్లఁబో! నిట్లు । రాసి కెక్కిన భగీరథుఁ డున్నవాఁడె!
తను జేరి గరుడ గంధర్వులు గొలువ । ధనములఁ బ్రజనెల్లఁ దనయట్ల దనిపి
యున్న పర్వతముల నాజ్యవు నదుల । మన్నకాలము విప్రమండలిఁ దనిపి
వాసవుగతి నూఱు వాజిపేయములు । చేసె దిలీపుఁ డీక్షితి నున్నవాఁడె!
పురుహూతుకరమునఁ [2]బుట్టునాజ్యంబు । సురభి చేఁపినపాలు జుఱ్ఱి వర్ధిల్లి

1. పాత్రివనవక్ర. 2. బుటినిత్యంబు (మూ)

యవనికి డిగ్గి యేకాతపత్రముగ । నవనియేలుచుఁ బెక్కు యాగముల్ చేసి
న్యాయమార్గంబున నడపి భూప్రజలఁ । బోయె నా మాంధాత భువినేఁడు గలఁడె!
తొల్లి దేవాసుర తుములంబునందు । నెల్ల దైత్యుల గెల్చి యింద్రు మెప్పించి
శుక్రుని యల్లుఁడై సుచరిత్రుఁ జారు । విక్రమాఢ్యుఁ గులంబు వెలయించు వానిఁ
బట్టిగాఁ గాంచె నేర్పడ దివ్యమహిమ; । నట్టి రాజు యయాతి యణఁగఁడా పుడమి!
దానధర్మంబులుఁ దగ వైరిజయము । నే నృపాలుని కంటె నెల్లగాఁ గలిగి
దుర్వాసుతోనైనఁ దొడరి సత్యమున । గర్వింపనోపి, చక్రము పనిసేయ,
వారాసివలయిత వసుధ పాలించె । నారాజు నిలిచెనే! యంబరీషుండు;
అరుణుని నడిగి ధర్మాసక్తి గాంచి । ధరఁ గొంతక్షేత్రంబు తనపేరఁ బరఁగఁ
గడఁగి ముప్పదియారు ఘన యోజనములు । వెడలుపు నిడుపుగా వేదిఁ గట్టించి
యందు యాగముచేసె నయుతవర్షములు । ప్రమందక మానెనే! మహి నట్టిగయుఁడు.
అలర భార్యలు లక్ష, యందు నొక్కొక్క । వెలఁదికి వేవురు వేవురు సుతులు
నట్టి గృహస్థుఁడై యఖిలయాగములు । పట్టిన ధనమిచ్చి పలుమారు చేసి
నాకి వీడన విమానంబెక్కి తిరిగి । చాకుండ నేర్చెనే శశిబిందుఁడైన!
విడువక యిరువది వేవురు వండఁ । బుడమిపై నిష్టాన్నములు ప్రజ కిడుచు
ధృతి మమ్ముఁ దొలుత వధింపవే యనుచుఁ । బ్రతిపశువును వచ్చి ప్రార్థింపఁ గ్రతువు
రంతిదేవుఁడు చేసె రమణ నాతేఁడు । లంత రాజును నిత్యమై యున్న వాఁడె!
కలభంబు శరభంబుఁ గంఠీరవంబు । సులభంబుగాఁ బట్టి శూరత నెక్కి
తపసులచే సర్వదమన నామంబు । నృపులు మెచ్చఁగఁ గాంచి నేల యేలుచును
ధరఁ బెక్కువాజిమేధమ్ములు చేసి । భరతుఁ డంతటిరాజు వడకుండఁ డయ్యె.
రమణ రథంబులురాఁ బోవవలసి । సమతలంబుగ నుర్విఁ జమరినరాజు
గోరూపధారిణిఁ గుంభినిఁ బిదుక । మేరువుఁ బనిచిన మిహిరప్రతాపి
తనపేరు పృథువుగా ధరణిలో మనిన । ఘనుఁడు పృథుండట్టి క్రతుకర్త వేఁడి?
వేసరకయ గార్తవీర్యుని గెల్చి । రాసిననృపుల నిర్వది యొక్కమారు
అడపి ధారుణి నాలుగంచులు గెలిచి । కడపట నాభూమి కశ్యపుఁ జేర్చి
రాజయోగ్య మహాధ్వరంబులు చేసి । యా జామదగ్న్యుండు నడఁగెనో లేదొ!
కావున నెంత మీ కనక నిష్ఠీవి! । భూవర, వగవకు బుద్ధి నాతనికి.'
అని చెప్ప సృంజయుం డాత్మఁ జిచ్చారి । ముని నంచినట్టివి మున్నును గలవు.

వీరధర్మమునఁ ద్రెవ్విన తనయునకు । వీర, ధర్మముగాను విను మిట్లు వగవ.
తమ్ములుఁ దనయులు దండాధిపతులు । నెమ్మి జయ ప్రాప్తి నీకు నీఁగలరు.
ఆసుఖంబు దలంపు మనుశాంతి," ననిన । వ్యాసవాక్యంబుల వగలాఱి నృపుఁడు
కడుభక్తి ముని నంచి క్రమ్మఱ నాత్మ । వడఁకెఁ గవ్వడికైన వగఁ దలపోసి.
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యామీఁద । నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు." మనిన
సాకేతజన మోక్షసరణి సోపాన ! । నాకలోక భయాపనయన ప్రవీణ !
పరమ యోగానంద భరితాంతరంగ ! । స రమారమణి నిత్యసంస్తూయమాన !
కనక సీతా యోగ కల్పితయాగ ! । జనకనృపాల రక్షాసిత చరణ ! (౧)
గుహదత్త నౌకానుకూల విహార ! । బహుజనాశ్రిత తుంగ భక్తాంతరంగ !
ఇది సదాశివ భక్త హితగుణాసక్త । సదయ స్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతి మద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత ద్రోణాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగ ద్వితీయాశ్వాసమయ్యె.

# తృతీయాశ్వాసము



శ్రీ మందిరాకార, శీలితాకార, । కోమలోత్పలధామ, కోసలరామ !
వారిధి వ్యూహంబు వడిఁజొచ్చి యసుర । వైరి వధించు దేవా ! చిత్తగింపు.
జనమేజయునకు వైశంపాయనుండు । మును వినిపించిన ముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె :
ఆరీతి వ్యాసుని ననిచి తా నాత్మ । నారాజు పొగులుచున్నంత, నక్కడను
అనికి వైరులుపిల్వ నరిగిన క్రీడి । వనజాప్తుఁ డపరాబ్ధి వ్రాలునంతకును
ఎండినవనము దహించు పావకుని । చండిమ నరిగి సంశప్తక కులము
పొరిగొని శంఖంబు పూరించి యంత । హరితోడ భయచేష్ట నప్పు డిట్లనియె :

**అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తములఁగని కృష్ణునకెఱిఁగించుట**

" దనుజారి, యేలొకో తలఁకె నుల్లంబు ! । అనిఁ బట్టునడఁడు గదా ధర్మసుతుఁడు !
కడుఁగడు మనసునఁ గళవళంబయ్యె ; । పడఁడు గదా యొక్క పాండవుఁ డందు !
అనయంబు నెడమకన్నదరెడి ; నేమి । వినఁ గల వారమో విషమపు వార్త !
హరుల వేగమె తోలు." మని వచ్చివచ్చి । నరస నొక్కట నిల్చి సంధ్యలు వార్చి
కదలివచ్చుచుఁ దొల్లిగల పెంపు సొంపుఁ । జెదరి చేడ్పడియున్న శిబిరంబుఁ జొచ్చి
పలికెఁ బార్థుఁడు: "కృష్ణ, ప్రజలు నాతోడఁ । బలుక రిదేమొకో ! పగిలి చూచెదరు!
ఏమొకో ! వీణాదు లేమియుఁ మ్రోయ ! । వేమొకో ! యభిమన్యుఁ డెదురుగ రాఁడు ;
కొడుకులు కుశలులొకో ! చెప్పఁ గదవె ! । కడు నాత్మ చేవెట్టి కలఁచి నట్లయ్యె. "
అని యిట్లు పనవుచు నధినాథు నగరు । వనజాక్షుతోఁ గూడ వాసవి చొచ్చి
యనఘు, మోసాల నొయ్యనఁ దేరుడిగ్గి । వనమాలి గొనిపోవ వణఁకుచుఁ బోయి,
యొకచోట ధర్మజు నురుకాంతి చెదరి । సకల మంత్రులుఁ గొల్వ సభనున్నవాని
వీక్షించి, యచ్చోట వెదకియు సుతుని । వీక్షింపలేక నివ్వెఱఁగంది యందు
నడుగులు తొట్రిల్ల నంగంబు వదల । నొడలు చెమర్ప నయ్యోధులఁ జూచి
"యేను మీ దైన్యంబు నిందభిమన్యుఁ । గానని శూన్యంబుఁ గాంచి పొక్కెదను ;

ఎక్కడఁబోయె వాఁడెందుఁ బొమ్మంటి? । రక్కట! చూపరే యభిమన్యుఁగొడుకు;
అలుకఁ బద్మవ్యూహమాచార్యుఁ డొడ్డ । మొలఁగి చొచ్చెనఁ జింప మీచేతఁగాక
[1]మితిచెడఁ ద్రెక్కొను మీ రాజ్య కాంక్ష । నతనిఁ బొమ్మనరుగదా! యందుమీఁద
శిశువు ఘోరాజిఁ జొచ్చిన ప్రౌఢ గాఁడు. । వశమె యొక్కనికి సన్వైరుల గెల్వ?
వినియె నాచేతఁ బ్రవేశింప ననువు । వినఁ డందు సిగ్గను విధి పేఁడు తొల్లి.
కొఱ దీర్చి మహి వీఁడు గూలనిమ్మనుచుఁ । దఱిమి త్రోపరుగదా దాయల చేత?
చొచ్చి మీ రొకరైనఁ జుట్టును లేక । వచ్చి వైరుల వ్రాల్చి వ్రాల్చి చేనొవ్వ
నడరి కౌరవుల యన్యాయ యుద్ధమునఁ । బడఁడుగదా [2]మీఁదఁ బ్రాణంబు లేక?
సాత్యకి యుండి ధృష్టద్యుమ్నుఁ డుండి । ప్రత్యక్ష మనిలజ పాంచాలు రుండి
విరటుఁడాదిగ నుండి వేవురుండి । యరుదార రక్షింపరైతిరి సుతుని.

భోగకాలమున రాఁ బోఁ గొన్న ఋణము । నీఁగువాఁడు నృపాజ్ఞ నెఱపుగా కేమి(?)
ఆతని కొఱకుఁ గారైతిరి మీరు; । చేతి యస్త్రములేమి శృంగారమునకొ!
ఒకఁడైన నందు నయ్యొడ్డున కేఁగ । రకట! మీ సంగరాభ్యాసంబు లేల?
కాట కోటీల(?) నిక్కడ మిమ్ము నమ్మి । పోటాసఁ బోయితిఁ బుత్త్రుఁ గోల్పడితి;
అపకీర్తి తెచ్చెనో? యటుగాక కొంత । రిపుల నాజిని సంహరించెనో మించి?
ఒకఁడు వి ల్లొకఁడు తే రొకఁడు రథ్యములు । నొకఁడు సారథి మఱియొక్కఁడు జోఁడు
నీ భంగిఁ ద్రుంచిన నెఱుఁగము గాక । సౌభద్రుఁ డొకనిచే సమయునే యనిని!
ఆ యుగ్రమైన కర్మారంభ వేళ । దాయ లేఁగలనని తలఁపకుందురె!
అభిమన్యు నతిధన్యు నభిమాన మాన్యుఁ । ద్రిభువన సౌజన్య దీనతా శూన్యుఁ
గొడుకుఁగా నను బెట్టుకొన నేలయిచ్చెఁ? । గడు కృపమాలిన కష్టదైవంబు."
అని వాని తలకట్టు నతని రూపంబు । వినయంబుఁ దలపోసి విజయుండు మఱియు:
"ఓ వంశవర్ధన! యోవైరిమథన! । ఓ విష్ణుసమశౌర్య! యో మానధుర్య!
ఓ కవ్వడిప్రాణ! యోజగత్త్రాణ! । ఓ కుమారోత్తంస! ఓ యనవద్య!
ఎన్నఁడు పొడగాంతు నే నింక నిన్ను? । ఎన్నఁడు నీసేవ కేఁ బాత్రమగుదు?
భద్ర, సుభద్ర నీ పడిన పాటులకు । విద్రుమాధరి యెంత వేఁగ నున్నదియొ!"
అని చదికిలఁబడి యతఁడు ధర్మజునిఁ । గనుఁగొని గద్గదకంఠుఁడై పలికె:

---

1. ప్రమితిజడ. 2. మీకు. (మూ)

"హితమతి నీకుఁగా నెచ్చోటఁ గూలె? । సుతుఁడు నా కచ్చోటు చూపింపుమయ్య!
ఆ మేను విడిచి యెట్లరిగెనో ప్రాణ! । మేనని ఖాలుండు నెడలెనో మేను!
జగమెల్ల వెలిఁగించి చరమాబ్ధిఁ బడిన । భగుఁ బోలకుండునే పడిన నా సుతుఁడు!
ఏడు దీవుల ముంచి యీఁదిన వార్ధి । జాడ నుండకయున్నె సౌభద్రుఁ డడఁగి!
తను ధూళి దుడుతు మస్తకము మూర్కొందు । నెనయఁ గౌఁగిటఁ జేర్తు నెఱిఁగింపవయ్య.
ఇంతముట్టడ నాకు నెఱిఁగింపవైతి! । పంతమె? నే వచ్చి పాపుదు నగులు;
అన్యాయ మన్యాయ మనుమాట యప్పుడు । సైన్యంబులో మ్రోసె శౌరి యాలింప;
ఏను విన్నాఁడ; నేఁ డిచట అంతయ్యె; । రానైతి నకట! నా రణకాంక్ష కాల."
అని వేఁడి నిట్టూర్పు లందంద నిగుడఁ । గినుక నూఱకయున్న క్రీడి నెవ్వరును

## కృష్ణుఁ డర్జునునకు శోకోపశమనంబుగాఁ బల్కుట

బలుక భీతిలియున్నఁ, బద్మాక్షుఁ డొయ్యఁ । ... ... ... ... ...
బలికె నిట్లని "నీకుఁ బాఁడియే క్రీడి! । సలుపుము దుఃఖింపకు నీ సహోదరులు
తగ్గుదు రింతకుఁ దగు మాటలాడు; । మగ్గలికయు లావులన్నియు సమయు.
చావనవచ్చునే సౌభద్రు చావు! । వేవేగ వెలితిగా వేసె శాత్రవుల
ఆయుధజీవులమగు మన కింకఁ । జేయనున్నదె చింత! చెప్పకు మింత.
తన్ను బోలినవారు తమ్ములు చావ । నెన్నఁ నే కురురాజు? హితమేమి లేదో?
మరణ మెచ్చట లేదు? మనము తప్పితిమొ? । పరిశాంతి నొందుము పగ చూచుకొనుము."
అనినఁ దమ్ములఁ జూచి యన్నలఁ జూచి । యనిమిషేంద్రకుమారుఁ [1]డాప్తులఁ జూచి:
"వినవలెఁ జెప్పరే! వివతు లవ్వీరు । ననిలోన గ్రమ్మింగిన యా ప్రకారంబు;
తమకు నున్నదిగదా! తగినలా." గనిన । యనుసూతి యశని కిట్లని చెప్పఁ దొడఁగె:

## అభిమన్యుఁడు గూలిన తెఱఁగు ధర్మరా జర్జునున కెఱిఁగించుట

"సంశప్తకుల నీవు సాధింపఁ బోవ, । సంశయింపుచు మేము సమరోర్విఁ గదిసి
యలిగి పద్మవ్యూహ మాచార్యుఁ డొడ్డఁ । దలపడి యేము విదారింపలేక
వలఁ జిక్కువడియు నవ్వల నభిమన్యుఁ । బిలిచి యీ వ్యూహంబు భేదింపవయ్య

1. డాత్మల.(మా)

నీవు చంపిన వెంట నిఖిలయోధులను । వేవేగ వత్తుము విఱిపిగా, ననిన
'చొరఁగాని వెడలెడి చొప్పు నే నెఱుఁగ । నరనాథ, యుక్తైన ననుఁజాలు' ననుచు
నా కుగ్గరము చొచ్చె నతఁ; డేను నతని । నేమఱకున్కచో, నెదుట సైంధవుఁడు
మమ్ము నిండఱ నాఁగె మూఁపటి దాఁక; । వస్మైన్మరి దొరలెల్ల వానితోఁ జెనఁగి;
నిను దప్ప నొకనాఁడు నిఖిలపాండవుల । నని గెల్వ వానికి హరుఁ డిచ్చె వరము.
ఆభంగినె సహాయమైనఁ గైకొనక । సౌభద్రుఁ డా వైరిచక్రంబుఁ జొచ్చి
మాణిక్యకుండల మణిమస్తకముల । క్షోణికి భారంబు శోభిల్లఁ గప్పి,
గురు కృప శల శల్య గురుపుత్త్ర కర్ణ । కురు నృపాలుర నొక్కకోలకుఁ దెచ్చి,
యక్షుణాంతకులను నట బృహద్బలుని । ఆ క్షితిఁ జంపి వసాతి ఖండించి,
దొరఁకొని మఱియు యోధుల వ్రాల్చి వ్రాల్చి । పరవీరబలము కోపానకుఁ దెచ్చి,
లక్కణు నటు చంపి రణమునఁ బోర । నక్కురువరుల నుక్కణఁచి యణంపఁ,
దగిలి యన్యాయ యుద్ధంబున నంతఁ । బగతు రొక్కనిఁ దన్నుఁ బలువురు పొదివి
యొకఁడు విల్లొకఁడు తే రొకఁడు రథ్యములు । నొకఁడు సూతుని గాఁగ నొక్కట నఱకి
యలయింప, దుశ్శాసనాత్మజుఁ డంతఁ । దలపడి పోర, గదాయుద్ధమునను
బెరసి యాతనిఁ దోడఁ బీనుఁగుఁ జేసి । ధర వ్రాలె నేఁడు నీ తనయుఁ డేమందు!"
అని చెప్ప నిజముగా నాత్మజుచావు । విని యర్జునుఁడు శోకవివశుఁడై పడినఁ
బట్టి యెత్తిరి శౌరి పాండుతనూజు । లట్టిచో నరుఁ డంత నా మూర్ఛఁ దెలిసి
సైంధవుఁ దలఁచి నిశ్శ్వాస వివర్ణ । బంధురముఖ కోపపాటలచ్ఛాయ
బొమముడి నిక్కించి పుష్యరాగముల । క్రమమునఁ గన్నులు కడుజేవురింప
మేను చెమర్ప నమ్మోయి నొడుగఱచి । సేనాధిపులఁ జూచి సేనలఁ జూచి
పలికె నిట్లని: "నేఁడు పాండవోత్తములఁ । జలముతో నాఁగిన సైంధవు శిరము
నినుఁ డస్తగిరి యెల్లి యెక్కకమున్న । తునుముదు ధర్మపుత్త్రునకైన విసువ.
లీల నీగతిఁ దున్మలేకుంటినేనిఁ । గాలుదు నగ్నిలో గాండీవయుతము;
వేఁడనీ యభయంబు విష్ణుని దండ, । తేరనీ (?) యటుగాక త్రిపురారిఁ గోరి,
విధిమాటు దూఱిన వీని వధింతు; । బుధులు మెచ్చఁగఁ దీర్తుఁ బూను ప్రతిజ్ఞ.
ఇంతకుఁ దప్పిన నే మద్యపాయి । నంతఁ బోవక బ్రహ్మహత్యావిధాయిఁ,
గుతలంబు రోసిన గురుతల్పశాయిఁ, । గత లేల మఱి నేను గాంచనస్తేయి,
నలర బ్రాహ్మల కిత్తు నన్నట్టి దీక । పలుమాఱు ద్రిప్పిన పాపిష్ఠి నగుదు."

అని గాండివము మహార్వి నతఁడు సారించి । ఘన దేవదత్త శంఖంబు పూరించె;
హరి యొత్తె విజితజన్యము పాంచజన్య; । మరియు భేరులు మ్రోసె; నాసేన యార్చె.
అప్పుడు క్రోధాగ్ని నణఁగు శోకాగ్నిఁ । దెప్పిఱి నగుఁడున్న తెలివి యెఱింగి
మారుతి పలుకు: "సమ్మోహనీయరవము । కౌరవ హృదయంబు కాడు నింతకును;
తల యేరుపట్టు నింతకు సైంధవునకు; । గెలుతు గాండివి, నీకుఁ గృష్ణుండు గలఁడు."
అనియె నక్కడ నంత నానుహోధ్వనులు । విని కౌరవులు వీపు విఱిగినట్లగుచు
నెప్పుడు వత్తురో యిటఁ బార్థు లనుచు । దెప్పర [1]వణఁకుచుండిరి బిట్టు వగచి.

అర్జునుని ప్రతిజ్ఞకుఁ దల్లడపడి సైంధవుఁడు దుర్యోధనునితోఁ జెప్పికొనుట

బాగుగా నరుఁ డట్లు పట్టిన ప్రతిన । వేగుల వారిచే విని సైంధవుండు
కొలువు వివ్వకమున్న కురురాజుఁ గాంచి । తలఁకుచుఁ బాదపద్మములకు నెఱఁగి
చింతచే నుల్లంబు చెదర నిట్లనియె । *(నంత: "నే నొక్కఁడనా యభిమన్యు
నంత మొందించిన యది! లేగ యొరులు! । కొంతగానఁడు క్రీడి కోపించె నుఱక;
భూతలాధిప, పొద్దు పోవకమున్న) । నా తల యెల్లి దున్మఁగ బాసపూనె!
తునుమ లేకుండిన దొరలెల్లఁ జూడ । విను మగ్నిఁ బడునఁట! విల్లును దాను.
(ఆ నాకపతికైన నర్జును నాఁగి) । భూనాథ, రక్షింపఁ బోలునె నన్ను!
గురు కర్ణ కృప బాహ్లికులకు శల్యునకు । గురుపుత్త్రునకుఁ గావఁగూడుఁ గూడినను;
రణముఖంబున నన్ను రాదు నీదొరల; । గణుతించునే వీరి గాండీవి మొదల!
పాఱిపోయెద నెల్లి బహుభాష లేల? । పాఱిన మఱి వెంటఁబడరు పాండవులు."
అనిన నాతఁడు నవ్వి: "యల్లుల! నేను । ననుజులు సేన నీ కడ్డమయ్యెదము.
ఒకనాఁటఁ బడితిమే యొకని కిందఱము? । అకట! నన్నవు మమ్ము నతి భీతిమహిమ;
పోరాడి యొకరీతిఁ బ్రొద్దు గ్రుంకించి । వీరుఁ డగ్నిఁ జొరంగ వీక్షింత మెల్లి."
అని వానిఁ గొనిపోయి యాచార్యుమ్రోల । జనపతి నిలిపి వాసవిబాస తెలిపి
'కావవచ్చునె వీనిఁ గలశజ?' యనిన । నావీరుఁ: "డదియెంత! యట్ల చేయుదము;
సాహసగతిఁ గ్రీడి సాధింపలేని । వ్యూహంబు పన్ని యందునుతము వీని."
అని సైంధవునిఁ జూచి: "యక్కటా! నీవు । చవియెదనంటేల సమరంబు విడిచి?
చదివితి శ్రుతులు; యజ్ఞములు చేసితివి; । తుది నాజి బంటవై తునియుట కీడె?

---

1. వలుకుచుండిరి కట్టు బిగిసి- (మూ). * కుండలీకృతము గ్రంథపాతపూరణము.

చచ్చుట యిష్టంబు చాకుంటె కష్ట । మెచ్చోట నృపులకు నిట్టియుద్ధమున;
కలఁగకు ; మట్లయ్యుఁ గాతుము నిన్ను ; । నులఁగక నా పింటివారటు నుంచు ;
తెగి పోరుదము రేపు తివుటఁ బాండవుల ; । నగపడమియుఁ జూచి హరియు నర్వోడిని
సమ్మెపొ." మ్మనిన సైంధవు చింత దీఱె । రమ్మని కొనిపోయె రారాజు తెరగ.
నరనాథ, సేనాని నరపతి యతనిఁ । దినము కొల్చుట గాఁదె జెలికి నిపజయము.
అట ధర్మజుఁడు శౌరి యనుజులుఁ దక్క । భటుల వీడ్కొలుపుచోఁ బద్మనాభుండు
నరుఁజూచి యిట్లను: "నాయనమా నీకు! । పరుల త్రేఁ గెఱుఁగక ప్రతిన పట్టితివి!
ఏ వింటివి, సైంధవుఁ డిప్పుడు నీ ప్రతిన । వేవుల వారిచే విని భీతిఁ బోయి
రారాజుతోఁ జెప్పి 'రణములోఁ బాగ్గు । నేరాజు గలఁ డాప? నేఁ బోదు డాఁగఁ;
జానోప' ననిన విచారించి యతఁడు । సేనాధిపతి కని చెప్పిన నతఁడు:
"చింగిపో నేటికి సింధురాజునకు? । అంగాధిపతి గల్గ నకట నేఁ గల్గ
నీవుఁ దమ్ములుఁ గల్గ నిఖిలంబు గల్గ; । ఆవల నరుఁడేమి యనను లోచనుఁడె!
రచయింతు నరునకు రారానియొడ్డు; । పచరింతు నా బాణపాండిత్య మెల్లి.
అనిన భూపతి నమ్మె నాతండు నమ్మె । ననయంబు భటు లార్చి రా సంభ్రమమున.
(కలన సైంధవుఁ గావఁ గావించి యొడ్డు) । నిలువరింపఁగ నోపు నిన్ను ద్రోణుండు.
కడఁక నేల ప్రతిజ్ఞ గడవఁ బల్కితివి? । ... ... ... ... ...
సకల యోధులు చావ సైంధవుఁ జూప; । రొకనాఁట నిందఱ నోర్వ నీ వశమె?
కలదు విచారింపఁ గార్యాంశ." మనిన । నలుక నప్పుడు క్రీడి హరిఁజూచి పలికె:
"పట్టిచచ్చిన కిన్కఁ బట్టితిఁ బ్రతిన; । పట్టి పల్లార్చక ప్రభువ, చెల్లింతు
వారి నే నెఱుఁగుదు; వారును నాదు । ఘోరాజిపన మెఱుఁగుదు; రింత యింతఁ
బూని యుపేక్షింపఁ బోదురు గాక; । ఏను గల్గఁగ నిల్వనిత్తునె వాని?
శక్రాదు లిచ్చిన శరము లెన్నఁటికి? । చక్రి, నీతోఁ జేయు సఖ్య మెన్నఁటికి?
విను ద్రోణుఁడిచ్చిన విద్య యెన్నఁటికి? । అనలుఁ డిచ్చిన తేరు హయులు నెన్నఁటికి?
ఈ చరాచర మెల్ల నెత్తివచ్చినను । నీచు సైంధవుఁ ద్రుంతు నీ యాన యెల్లి.
నను నుద్ధరించు యత్నంబునఁ గాదె । మనసు చూచితి." వని మఱియు నర్జునుఁడు
"భారపూరణ మెల్లి; పని చాలఁగలదు; । నీరజోదర, నీవు నిద్రింపఁ జనుము.
ద్రౌపదియును సుభద్రయు నుత్తరయును । ఈ పాపవార్తకు నెంత వేఁగెదరో!
వచ్చియున్నా రిందు వారిశోకములు । చెచ్చెర మాన్పవే శీఘ్రంబె పోయి."

అని వీడుకొలిపిన నతఁడు లోపలికిఁ । జనుదెంచెఁ బాండవసతుల నూరార్ప.
అందులోన సుభద్ర యధికశోకమునఁ । గుందుచు మోము వక్షము మోఁదుకొనుచు,
"మను నిభ, నా యభిమన్యుకుమార! । నినుఁ బుత్త్రుఁగాఁ గాంచి నీ ప్రోవు గుడువఁ
గోరుదు నాకోర్కి కుఱుచాయె నిట్లు; । ఘోరాజిఁ గూలితి గురుశౌర్య, తగునె!
వెడలి రానేరవు విజయుండు లేఁడు । కొడుక, ధర్మమె మన్నిగొను మొన నొఱఁగ.
పరఁగ ధర్మజుఁ డుండెఁ బవనజుఁ డుండెఁ । జొరుమని పంచిరే! సుతుఁడ, నిన్నందు;
అనదఁ జేసితి నన్ను నాగడిఁబుచ్చి । తనయ, యెక్కడఁ జొత్తు? నడలఁ బొలైతి.
మురవైరి నిన్నును ముని విప్రసుతులఁ । దిరుగఁ దెచ్చినమాడ్కిఁ దేఁడొకో మాకు!"
అనుచు వాపోయిన, నశ్రుపూరములు । తనకును జనియింప దామోదరుండు:

## కృష్ణుఁడు సుభద్ర నూరార్చుట

"ఎలనాగ, యేడ్వకు మెల్లి సైంధవుని । తలఁద్రొక్కి నీల్గాడు తాపశాంతికిని.
వాసవాత్మజుఁ డెల్లి వాని వధింప । బాస పూనినవాఁడు పగలింటిలోన.
వీరపత్నివి నీవు వీరమాతవును । ఘోరాజిఁ బడిన కొడుకున కేడ్వఁదగునె!
ఉత్తమగతి కేఁగె నుత్తముఁ డతఁడు; । ఉత్తర నూరార్పు ముమపుద్రొపదిని."
అని పెక్కుభంగుల నబల నూరార్చి । చనుదేర నంత నజాతశత్రుండు
హరి ననుజుల నంచి యభ్యంతరమున । కరిగె; నప్పుడు వోయె హరి క్రీడిఁ గూడి.
పోయి యాతనియింటఁ బుణ్యాసీమమున । (*నాయత దర్భశయ్యను రచియించి
నరవిని గంధపుష్పములఁ గైసేసి । పొరిఁగొన నాయుధంబులనెల్ల నునిచి
యిందుండి యభవు నర్చింపు మీవనుచుఁ । బొందికఁ బల్కి భూభుజుఁడు సంప్రీతి
సావధానములతో శైవార్పణముగఁ । గావించు పూజలఁ గైకొని యలరి
యాయుధహస్తుల నట నుండఁ బనిచి । పోయెద సుఖనిద్ర పొందుమీరాత్రి."
యని పల్కి శౌరి నిజావాసమునకుఁ) । జనుచు దారుకుఁడను సారథిఁ దలఁచి

## అర్జునప్రతిజ్ఞఁగూర్చి కృష్ణుఁడు దారుకునితోఁ జెప్పుట

రప్పించి వాని గారాముతోఁ బలికె: । "ఇప్పార్థు ప్రతిన యెట్లీడేరనేర్చు?
దొరలు సామాన్యులే ద్రోణాదులందు! । ధరఁ గూల్పవశమె యిందఱ నొక్కనాఁట!

* కుండలీకృతము-లు ప్తపూరణము.

అట్లు సేయకయున్న నగ్నిలోఁ జొరుట! । ఎట్లు గాఁగలవాఁడొ యిటుమీఁదఁ గ్రీడి!
ధనురస్త్రహేతి పతాకలతోడ । మన తేరు గొనితెమ్ము మఱవక రేపు.
ఆజి నేఁ బాంచజన్యం బొత్తినపుడు । ఆజాడ తేరు దెమ్మని నీకు సన్న.
నరుఁ డీతఁడుగాఁడు నాలోన సగము; । శరముపట్టని బాస చాలు నాకెల్లి.
తమ్ముఁడు నీవును ద్వారదేశమున । నిమ్ముల నిటువిల్లుఁ జేలుచొచ్చి వత్తు."
అనిన సూతుఁడు వల్కు: "నల్లేల దేవ! । అని నిన్ను శోధింపఁ దర్జునుఁ డుండి;
కలుషింపనొల్లఁడు గాక నీమఱఁది । వలె నన్నుఁ ద్రిజగముల్ వానికి నెదురె!
తెచ్చెద నేనును దేవాజ్ఞఁ దేరు; । వచ్చెద శంఖరావము నీవుసేయు."
అని పల్కి దారుకుఁ డచ్చోట నిల్వఁ, । గనకగేహముచొచ్చి గరుడవాహనుఁడు
జవ్వను లుచితోపచారముల్ సేయఁ । బవ్వళించియు వేగ వడి మేలుకాంచెఁ
బాండవహిత మెన్నుపరిపాటి; నచట । గాండీవి కనుమూసి కలయిట్లుగాంచె:

## కలలో నర్జునుఁడు కృష్ణునితోఁగూడి కైలాసమున కేఁగుట

తనునిట హరిచేరి, "ధవళాశ్వ, లెమ్ము । చనుదెమ్ము పోదము శంభునిఁ గాన.
జితనంబుగా నింక శంభునివలన । నతఁడు మున్నిచ్చిన యా పాశుపతము
స్థానకముష్టిసంధానంబు లెఱుఁగ; । మానక యదిగాని నడుపదు వాని."
అనిచెప్పి వలకేల నాతనిఁ గొనుచు । వినువీధి నతఁడేఁగి వృషభాంకుపురముఁ
జొచ్చి యావేల్పు తేజోమయగృహముఁ । జొచ్చి యిర్వురుఁ బోయి శూలికి నెఱఁగి
యాగమగతిఁ గొనియాడ, నమ్మనుల । యాగమనము తెఱంగాహరుఁ డెఱింగి:
"నుత నరనారాయణులఁ బూర్వమునుల । వితతపుణ్యుల మిమ్ము వీక్షింపఁగలిగె;
భూవలయంబునఁ బుట్టి యిర్వురును । దేవకార్యము నిట్లు దీర్చుచున్నారు;
రయమొప్పఁ గంటి మీరాకకుఁ గతము; । జయము మీకబ్బు విచారంబు వలదు;
ఉల్ల కొలంకులో నున్నవి పోయి । విల్లు నయ్యమ్ములు వేగ తెం." డనిన
నందిరువురుఁ బోయి యా మడువునను । దందశూకాకృతిఁ దలఁకక చూచి
దివ్యాస్త్రమహిమగాఁ దెలిసియు వెఱచి । భవ్యమంత్రంబులఁ బ్రస్తుతి చేసి
యమ్మును విల్లునై యవి గానఁబడిన । నెమ్మిఁ దెచ్చిరి ఫాలనేత్రు సన్నిధికి.
అప్పుడు శిశుమోల నటమున్నె యున్న । యొప్పుల నటుహూపుఁ డొక్కఁడు లేచి
యావిల్లు మోపెట్టి యస్త్రముల్ దొడిగి । వేవేగఁ దివియు, నవ్విధమెల్ల నెఱిఁగి

నరుఁడు నేఁడె; యంత నంకీశుఁ దలఁచి । శరమంత్ర మతనికి జతనంబుచేసి
తానంత హరికి నాఁడు సమర్పించి । పూనిత నవపుష్పమాలిక యిచ్చి
యునిచిన, నన్నాగ సాష్టాంగఁబెట్టి । ననిచినభక్తి నన్నాథున కెఱఁగి
యమవీథి నిదురను నొయ్యన వచ్చి । ధరణి వ్రాలినయట్లు తగఁ గలఁగాంచి
పులకితదేహుఁడై బోరనఁ దెలిసి । తలఁపునఁ దమకించి దాయఁ దలంచి
కోపింప, నతనిఁ గన్గొన నెజ్జవుట్టె; । హూపింప నపుడు తూర్యన నెజ్జవుట్టె.
కెంజాయ యిట్టు ప్రాపించి యుదయించి । గంజాప్తుఁ డుదయాద్రిఁ గదియునంతకును
శుభగానముల దిక్కుసుతులఁడు మేల్కాంచి । యభినవజలముల నభిషేకమాడి,
ధౌత మంగళ పరిధానంబు గట్టి, । నూతనభక్తి భానున కర్ఘ్యమిచ్చి,
జపహోమ దేవతార్చన ధర్మనియతి । నుపచరించి నిజాంగ మొప్పఁ గైసేసి,
ఘన వేత్రహస్తుల కలకఘోషముల । వినుచు నిజాస్థానవేదికి వెడలి,
యుదయాద్రి నెక్కిన యుడురాజు పోలెఁ । గదిసి మాణిక్యపు గద్దియ యెక్కి-
యున్నచో, హరివచ్చి యుచితాసనమున । నన్నరేంద్రుఁడు చూప నాసీనుఁడయ్యె.
పాంచాల మాత్స్యాది బాంధవోత్తములు । సంచిత సైన్యులై చనుదెంచి కనిరి;
వడముడి కవలలతో వచ్చెనప్పటికి; । కొడుకులు వచ్చిరి కొలువెల్ల నిండ.
నరుఁడంత వచ్చి ప్రణామంబు సేయఁ । గరమున నతని నగ్రజుఁడు లేనెత్తి
విజయుని గన్గొని వినయోక్తిఁ బలుక । విజయుండుఁ గూర్చుండె వెన్నుని వెనుక.
అద్ధర్మసుతుఁడంత హరిఁ జూచి పలికె: । "ఉద్ధరింపుము మమ్ము యుద్ధార్ణవమున;
భయమేది గాండీవి పట్టిన ప్రతిన । నియతిమై నింపింప నీది భారంబు.
రమణఁ గ్రీడికిఁ జొరరాని మొక్కవము । నమకట్టి రణభూమి శరమునఁ గిట్టి
యాతుత్తపరిపాఁ డాచార్యుఁ." డనిన । నాయెడ నిశ్శంక నతఁడప్పుడనియె:
"నరుని ప్రతిజ్ఞను నాథ, భీతిలకు; । గురుని యత్నము వెతగొలువునె మనకు!
[1]కలశజకలితపూ కౌరవబలము । కలయఁ బాఱెడు వేళఁ గనుఁగొందు మమ్మ.
నాచెయి మోహము నంబైన నయ్యె । నే చెలియలిభర్త నేల యేమఱుదు?"
అని శౌరి యాడిన, నంత నర్జునుఁడు । తన కన్న కలయు నందఱు వినఁజెప్ప
జయము సత్యంబని సైనికు లార్చి । రయమొప్పఁ గదలిరి రాజింప ననికి.

---

1. కలశజకులమైన (మూ)

శైనేయ సహితులై శౌరి పార్థులును । మానవాకృతి కపి మహితకేతున్ప్రమొక్కి-
యతఁడంప నాజికి నరుగుచు నింద్ర । సుతునిల్లు సొచ్చి యచ్చోటు రథమునకు
బోరన బహువిధపూజ గావించి । భూరిప్రదక్షిణంబుగ వచ్చి ప్రమొక్కి-
యెక్కిరి; సాత్యకి యుగ్రజు వెనుక । నొక్కరుం డస్త్రశస్త్రయుక్తుఁడై యుండె.
రథియనుమతి నంత రథము కృష్ణుండు । ప్రథిత భూమికిఁ దోలుచోఁ గిరీటి
తిరిగి సాత్యకిఁ జూచి, "ధీర, నీ వింక । మరలుము కృష్ణుండు నను కవశ్యంబు ;
అతనిఁ బట్టెదనన్న యాచార్యు ప్రతిన । మతి మఱవకుము నాకు మసలకమున.
రాజురక్షయు సింధురాజు శిక్షయును । ఓజ నేఁడెల్లను నొక్కరాఁజంబు."

## ద్రోణుని నాల్గవనాఁటి సమరము

అనిన నాతఁడు వోయె; నట ద్రోణుఁ డంత । ననుపమ సేనాసహాయుఁడై కదలి
శ్వేత ధౌతాంబర సితవరోష్ణీష । ధాతు నూతన రత్న ఘనళ వర్మములు
రక్త వేదిధ్వజ రణభీమ చాప । ముక్తా సితచ్ఛత్రములు దనరనుర
బలముల మెలఁగి యేర్పఱచి యేర్పఱచి । పలికె నిట్లను భీతవాయు సైంధవుని:
"విను నీవు కృపుఁ గర్ణ వృషసేన శల్యుఁ । బొనర నశ్వత్థామ భూరిశ్రవసుని
నొద్దఁ బెట్టుకయుండు; మొకలక్షహయము, । లఱ్ఱైనఁ గరిలక్ష లర్థిఁ గాల్బలము,
వినుము ముప్పదివేల వీరులు రథికు । లెనయఁ బదేనువే లిభములు గొలువఁ
గలయ నేఁదీర్చు మొగ్గరమున [1]కపలఁ । దలఁకక యోజనత్రయమున నిలుము.
నీతలఁ జూపకు నేఁడంతనట్టు; । చూతము నను దాఁటి చొచ్చు కవ్వఁడెడి!"
అనుటయు మేలేరి యాసేనఁ గొనుచుఁ । జనియె రాక్షేయాది సహితుఁడై యతఁడు.
శకట రాక్షసవైరి సఖుఁడు ద్రోణుఁడు । శకట వ్యూహము నిటఁ జాపశిక్షకుఁడు
నిరువది నాలుగు స్నిరైన క్రోసు । లరయ నిమ్ముచు వెడల్పై యుండఁ బన్ని,
యందుఁ బద్మవ్యూహ మపరార్థసీమ । నందమై లోపల సమరగాఁ బన్ని,
చెనసి యాలోనుండి సేనాముఖమును । మొనయు సూచీ వ్యూహమును సంఘటించి,
మునుకొని యా సూచిమొనఁ గృతవర్మ, । ఘనుఁ డతనికి వెన్కఁ గాంభోజరాజుఁ,
దగు మూలబలముతోఁ దమ్ములతోడ । సిగిడి సౌబలుతోడ నృపుని నవ్వెనుక

1. గలప. (మా.)

మొనకట్టి, యాసూచి మూలభాగమునఁ । దనర సేనలను సైంధవు నంత నిలువ
నేమించి మొనల కన్నింటికిఁ దాను । మోహమైనఁ, జూచి యా మొగ్గరంబునకు
నెదురెందు లేదని యెన్నఁడునిట్టి । చదురు మాడనటంచు జగములు వొగడె.
అది లోకముల మ్రింగ నభవుండు తెఱచు । వదనంబుఁ బోలె నుజ్జ్వల భీమ రేఖ;
నిట్టి కూటవ్యూహ మెందఱు నడఁపఁ । బుట్టెనో! యన భీతి పుట్టె దివ్యులకు.
అక్షౌహిణులవి నంత నావ్యూహమునకు । వీక్షింప నొకలక్షవిస్తర మూరమున
సేనె నిల్చునఁ గ్రీడి నిపుడంచు సేన । తో నిల్చె నంతట దుర్మర్షణుండు.
మొనకు వానికి నడుమ మొగి యువరాజు । తన సేనపనుండె ధవళాశ్వు నాఁగ.
ఆలోన యోధు లిట్లనిరి: "గాండీవి । యేలకో రాఁడయ్యె నింతసేపయ్యె!
పాలుపేది క్రాఁగెనో పుత్త్రశోకాగ్ని! । మహి నింత వెఱచెనో మాటాడి వెనుక!
వచ్చెఁబో తన కిది వశమె భేదింప! । నిచ్చట గురుఁడని యెఱుఁగఁడె మొదట!
ధర్మజ భీమ సాత్యకులేల తడసి? । కర్మిలి నేలకో హరి వారిఁ దేఁడు!"
అనిరి; కొందఱు: "వార లభిమన్యుఁ డీల్గ । నని మాని యడవుల కరిగెద" రనిరి.
మఱి కొంద: "ఱిక్లేల మనకబ్బు జయము! । పఱతెంతు రిదె వారు ప్రతినకు" ననిరి.
అప్పుడు [1]కడగంట నాభీల కీల । యుప్పతిల్లఁగఁ దీవ్ర హుంకృతితోడ
గాండీవ జ్యానాద ఘన శంఖనాద । చండ భూత నినాద చటులత తోడ,
నిరవధి హరిశంఖ నినదంబుతోడ, । ... ... ... ... ...
భూరి కుంభ ద్రోణములు వట్టికురియ । మూరిఁబోఁ బన్నిన మొగిలును బోలె
హరి సూనుఁడోడరంగ నఱవింటి సేలఁ । గురు సేనఁ గదిసి యుగ్గోవిందుఁ బలికె:
'ఇది శకట వ్యూహ మింద్రాది భయద; । మిదిగాక యిందులో నింక వ్యూహంబు
పన్నె కమానుఁడు ప్రౌఢుఁడు గురుఁడు; । తన్నుఁ జూచితె! యొద్దుతల నున్నవాఁడు;
ఆతని దాఁటి వ్యూహము చింపకున్న । నే తెఱంగున నోడు[2]సేయెడ దాయ?
సిసిరి వచ్చినయట్లు పెద్దఁకికమున । నాసతో నొంటి నన్నాఁగ రానోపు (?)
దుర్మర్షణుఁడు వీఁడు తొలిముద్దమునకు । దుర్మదాంధుని మీఁదఁ దోలుము రథము."
అని వాని బహుళ సైన్యంబుపై రథముఁ । జననిచ్చి భీకరాస్త్రపుజడి వెట్టి
కాలు బంట్లును హరుల్ గజరథములును । తూలఁ దుత్తుమురుగాఁ ద్రుంచి తూటాడి

1. కటికెల. 2. నేడాయె. (మూ)

యొక్కటఁ బ్రేల్చిన యోధకంఠముల । నొక్కట నెత్తురు నింగి నిలువఁ గడఁగ,
లీల సాంధ్యముఁ గూర్చిన యట్టుఁ బోలె । నోలిఁ బెక్కుమ్మొ కొక్కొక్కఁ బాడువ
గాండీవి లయకాల కాలుఁడై మఱియుఁ । బండిమఁ గను గప్పు శత్రుల చేతి
శరపంజరంబులుఁ జక్రమండలముఁ । బరిఘ ప్రవాహంబుఁ బ్రాస సంచయము
ననమ గదావ్యూహ మసిపత్రవనము । ముసల ముద్గరముల మొత్తంబుఁ జదిపి
యతని సైన్యము సమిపార్థసూత్రమున క్షితిమీఁదఁ బడనేసి చెలఁగి యుగ్గలిక
మర్మవర్మంబులు మఱి త్రెవ్వనేయ । దుశ్శాసనుఁడు వాఱె ద్రోణుని కడకు.
అంత వేగంబుతో నరుదెంచునరుని । దంతావళంబుల తఱుచుతో వచ్చి
యువరాజు తాఁకిన యుద్ధమయ్యెడను । దివిజ భీకరమయ్యె దేవ, యేమందు!
మారుతి హయముక్త మాంసపంకముల (?) । వారణంబులు గ్రుంగ వానిపైనుండి
కీలూడి రథములు కెడయ నమ్మీఁదఁ । గాలుబంటులు దాఁటి కడిమినేయుదురు.
ఒంటివాఁడని మొనసొనర నానాన । గెంటుక చొచ్చి యాక్రియ నేసి యేసి
... ... ... ... ... | ... ... ... ... ...
హరిమీఁద హరులపై నట హరిమీఁద । నరదంబుమీఁద నిజాంగంబు మీఁదఁ
బడనీఁడు తూపులఁ బార్థుఁ; డప్పార్థు । వెడతూపులైన నీవిరుఁ దాఁకి
శిరములు [1]చరణముల్ సెలవులు మొలలు । నురములుఁ గరములు నూరులు బరులుఁ
దనువులు హనువులు ధ్వజములు భుజము । లొనరఁ ద్రుంచుచు హరించు నొగిఁ జించునొంచు.
అంతఁ గాల్బారు నొవ్వ హస్తులు వివ్వ । హంతకాఁడై పాఱు యువరాజుఁ గ్రీడి
నిలువు దుశ్శాసన, నీకుఁ బోఁదగునె! । తలఁపవె! తొల్లింటి దారుణ క్రియలు;
నాఁటివారమె కామె నడుక నేమిటికి? । పాటించి తెమ్మొ సౌబలుఁ డొమఁ బోయె?
ప్రాణశాంతి యొనర్చు పరిపాటి నకట । ద్రోణునిమాటేల దూఱఁబోయెదవు?
ఇటు మాయమృగమవై యెందుఁ బోయినను । వేఁటాడ కుందునే భీముండు నిన్ను (?)"
అని వాని పెడతల యమ్ములు నాటి । తనపూన్కి తలఁచి యెంతయుఁ దత్తరమున
ద్వారభీకర భరద్వాజు చాపమునఁ । బోరాని యొడ్డనంబున కగ్గలించి,
దురము ద్రోణాచార్యుతోఁ గొంతసేపు । దొరఁకొని యది పెద్ద త్రోపికయున్నఁ
గటకటఁ బడుచోటఁ గైటభారాతి; । "యిటుగాదు, ప్రొద్దుపోయెను నీకు నిచట

1. శరములు శలములు మలవు. (మూ).

గురుని నిందావాక్యములాడఁ జెల్లునె? । వర, యాగ్రహము మాని నాబుద్ధి నతని
ననుచరింపుము కొంత మది నడఁకొనుము; । అనువుగాఁ బలికిన నాపోరుపోదు."

### అర్జునుఁడు ద్రోణునిచే ననుజ్ఞాతుఁడై మొగ్గరంబు చొచ్చుట

అనినఁ బ్రదక్షిణం బతనికి రథము । చననిచ్చి గాండీవి శరముల ప్రమొక్కి
యా పార్థుఁ డిట్లను: "నాజి సేయుటక । చేపట్టి నిలుతురే శిష్యుని నన్ను!
తూలక నీతోడ నని సేయువాఁడ । కేల గాదిది ద్రోణ, వినుము నాకుఁ ద్రోవ;
సత్యమే నీకు నశ్వత్థామ యట్లు; । శిష్యులంబు గల కృప నేఁడేల మఱవ?
ఎన్నఁడు నెదిరి నన్నెయుడు నయ్య! । నన్నెయు నిన్నెయు న్యాయమా మనకు!"
అనిన నవ్వుచు ద్రోణుఁ: "డర్జునా, తగునె! । నిను జొరనిచ్చుట నృపకార్యహాని;
కొలిచిన వారికిఁ గూడునే కృపలు! । నిలిచి పోరుము గాక నీకేది త్రోవ!
గురుఁడని నన్ను దక్షిణఁ బెట్టి చొచ్చి । పరులఁ ద్రుంచిన నీకుఁ బట్టునె బాస!"
యనుచు ద్రోణుఁడు భీమశస్త్రవర్షమున । వనజాలి నరు తేరు వాజులఁ గప్పి
గాండీవ శింజిని ఖండించి యార్చ, । నొండునారి బిగించి యుగ్రుఁడై నరుఁడు
లయకాల కీలి కీలాభీల విశిఖ । చయముల గురుని నచ్చోఁ జిక్కువఱచి
చొచ్చినమాత్ర, నర్జునశరాళియుఁ । జొచ్చె నొప్పుఁగల సుభట దేహముల.
మకరి ముఖమునఁ దొల్లి మారుతి చొచ్చు । ప్రకృతి మొగ్గరమిట్లు పార్థుండు చొచ్చె.
తన పార్శ్వములు చూచి తనతోడఁ గూడి । చనుదెంచు యోధులఁ జక్రరక్షకుల
నొనర యుధామన్యు నుత్తమౌజసునిఁ । గనుఁగొని వారిరాకకు సంతసించి,
త్రెళ్ళఁగాఁ గాల్కొని దెసలెల్ల రిపుల । పెల్లైన నచ్చోట బెదరక నడచి
వెనుక నాచార్యుండు నిలువక తగుల, । మునుకొని కృతవర్మ ముందటఁ దాఁకఁ,
గలఁగి శ్రుతాయువుఁ గాంభోజపతియుఁ । దన పార్శ్వముల నెక్కఁ, దగుసేన లెక్క,
నక్కడి కాముఖంబై యున్న పగిది । నెక్కడికిని ముఖంబెడలని పగిది
నన్నిముఖంబులై యమరేంద్రసుతుండు । వెన్నుఁ డాగతిఁ దేరు వేరొప్పనేసె
ధ్వజచర్మ సూతాశ్వ ధనురస్త్రశతులు । రజములుసేయ నుగ్రత ద్రోణుఁడలరి
నరుని డెబ్బదిమూఁడు నారాచములను । నరసిజోదరు నన్ని సాయకంబులను
నాటించి దివ్యబాణంబులు మఱియు । మీటినఁ, గ్రీడి యేమియు శేఁచికొనక
యలుగు లేసినయట్ల యతని వంచించి । తొలఁగి యా కృతవర్మతోఁ దలపడినఁ,

జేయ నేదియులేక సేనా ముఖమున । కాయ ప్రస్రగురుఁడేఁగె హార్ది నిక్కఁచూడ.
ఇటఁ గృతవర్మ యయ్యింద్రజు శౌరిఁ । బటు బాణములఁ గప్పఁ బదరక నరుఁడు
విల్లు ద్రుంచెను; ద్రుంప వివరింపరాని । యల్లీల నొండు వి ల్లతఁడు ధరించి
మున్నిటికంటెను మోపుగా నేయ, । నెన్నఁ దర్జునుఁబల్కెఁ: "పేఁదుగ్రబలుఁడు;
మోమోడఁ బనిలేదు; ముందఱఁ గలఁడు; । నీమార్గణాగ్నులు నిగిడింపు." మనిన
నవ్వుచు నిరువది నారసంబులను । నివ్వెచ్చఁ జాజోము నివశంగా నేయ,
నటఁజొచ్చి కాంభోజుఁడగు శ్రుతాయువుని । బటుగతిఁ దాఁకిన పరిపాటి తెలిసి
చయ్యన నర్జును చక్రరక్షకుల । నయ్యెడఁ గృతవర్మ యమ్ముల నాఁగె.
అట్లాఁగ వారు[1]ను హార్దిక్యుమీఁద । గట్టిపాఱమ్ముల [2]గఱిగఱి మోవఁ
బరఁగింప, నప్పుడు పాంచాలవరుల । యురుతర కోదండయుగము ఖండించి
ముఖమున శితశిలీముఖమున నాట । సుఖమాత్ర వార లర్జునుఁ గూడలేక
యద్రిఁ జిక్కిన ప్రవాహములును బోలె । నుద్రేకమునఁ గానకుండిరి తెరువు.

## అర్జునుఁడు శ్రుతాయుధ ప్రముఖ యోధులఁ జంపుట

అంత శ్రుతాయుధుండను మహారాజు । కౌంతేయుమీఁద నక్కాంభోజుఁ గడచి
యరదంబు పఱపి సాయకయుగళమున । హరినాటి హరిపతాకాగ్రంబు నాటి
సవ్యసాచిఁ బదాఱుశరముల నాట, । నవ్యయుఁడై పార్థుఁ డవ్వీరు తేరు
సుభటవర్గంబుతోఁ జూర్ణంబుసేయ । నభినవ గదగొని యతఁ డుర్విఁ ద్రావి
యాగద నటువైవ, నది పుష్పమాల । బాగయ్యె నురముపైఁ బార్థివ, హరికి.
వరుణాత్మజుఁడు వాఁడు; వానికగ్గదయు । వరుణుని యీఁగి; యవ్వరుణుఁ డట్లిచ్చి,
"యన్న, కుమార! యీ యాయుధంబున్న । నిన్ను నింద్రాదులు నేరరు గెలువ.
[3]వెడ నిరాయుధుమీఁద వ్రేయకు దీని. । నెడపకవైచితే నిది వానిఁ గాచి
తిరిగి నిన్నువధించుఁ దెలియుమీ." యనిన । వరుణవాక్యము నాఁడు వాఁడును మఱచె.
విను మాలికాకృతి విడిచి యగ్గదయు । వెనుకకు నిజపూర్వ విధమొప్పఁ గదలి
పార్థునిచే మున్ను బాహులు దెగిన । పార్థివు నాతని భస్మీకరించె.
అతఁడిట్లు గూలిన నంతఁ గాంభోజ । పతి దాఁకఁ గవ్వడి పది నారసముల
ననువున నాటిన, నా సుదక్షిణుఁడు । ననువున బాణారి నైదు బాణముల

1. మహాధిక్యు. 2. గరగరి. 3. వడి. (మూ)

జవ మొప్ప నప్తుల శరసప్తకమునఁ । గవిసి యగ్గాండీవిఁ గాండత్రయమున
గ్రుచ్చి యార్చినఁ, గ్రీడి కోపించి వాని । యుచ్చులతోఁ గోదండ మొకకోల నఱికి
కాయంబుతో గుండెకాయ వేఱొక్క । సాయకంబునఁ ద్రుంప సమసె నయ్యోధ.
ఎచ్చోట నేవీరుఁ డీల్గు నింద్రజుఁడు । నచ్చోట నతనిసైన్యము బాఱి[1]సమరు.
ఇందజుఁ ద్రుంచియు నిచ్చలోఁ బ్రీతిఁ । బొందఁడా తేఁడు దాయ పొడగానమికిని.
ఆరీతిఁ గాంభోజుఁ డనిలోనఁ బడిన । మేరువు మూఁగిన మేఘంబులనఁగ
[2]సేనలార్వ వసాతి శిబి శూరసేన । మానవనాథులు మఱి క్రీడిఁ బొదివి
ముట్టడ చేసిన, మునుకొని యతఁడు । గట్టికోలల జడి కడముట్టఁ బెట్టి
యాఱువేల రథంబు లందు రూపణఁపఁ । బాఱిరి నిలువక భగ్నులై వారు.
అట శ్రుతాయువు నయుతాయువు ననఁగఁ । బటు శౌర్య వీరులు పార్థివోత్తములు
శక్రజు నుభయ పార్శ్వంబులఁ దాఁకి । విక్రమంబునఁ దీవ్ర విశిఖంబు లేసి.
రందుఁ దోమరము శ్రుతాయువు వైచె; । నందు శూలము నయుతాయువువైచె;
నవి రెండు నర్జును నదరంటఁ దాఁక । వివశుఁడై మనసేన వెసనార్వ నొఱగి
హరి తెల్పఁ దెల్వి రూక్షాత్ముఁడై తెలిసి । హరిసూతి వానిపై నైంద్రాస్త్రమేయ,
నది వివిధాయుధాయత రూపధార । లొదవ మంటలు మింట నొలుకుచు నిగిడి
యశ్రమలీల సైన్యములతోఁ గూడ । నా శ్రుతాయువు నయుతాయువుఁ గూల్చె.
అంత నయ్యిరువురి యాత్మసంభవులు । కౌంతేయ, నిలుమని కడిమిమైఁ దాఁకి
యనినేసి నియుతాయువనఁగ దీర్ఘాయు । వనఁగఁ దంత్రులఁ గూడి యరిగిరి నృపులు.
మఱియు నెవ్వరుఁ గ్రీడి మార్కొన వెఱచి । చఱచిపోఁ జూచిన, సర్వకేతనుఁడు
ప్రాచ్య కళింగాంగపతులఁ గైరాత । వాచ్యులఁ గరిఘటావంతులఁ జూచి,
యర్జునుపైఁ బడుఁడని పంపువెట్ట । గర్జిల్లి నీలాభ్రగతి వారు గదిసి
శిలల [3]వ్రజములు వర్షించి ఘోరముగఁ । బలుతూపు లర్జునుపై జడివెట్ట,
ననలాస్త్రమునఁ గ్రీడి యయ్యంపగముల । నును ధూళి చేసి వెన్నుఁడు మెచ్చ నపుడు
గారుడాస్త్రము ప్రయోగముసేయ నచట । లేరైరి లెక్కమాలిన బోయలెల్ల,
నంతఁ బాఱె దశార్ణయవన సైన్యములు. । నెంతయు మొనవివ్వ నెదురేది క్రీడి
మదుఁగుఁ జొచ్చి కలంచు మాతంగలీల । జలధి చొచ్చి కలంచు శైలంబు పోలె

1. సరవి. 2. జేనసాల్వ. 3. వజ్రముల. (మూ)

వనము చొచ్చి కలంచు వనహస్తి పగిది మనమూఁకలకుఁ జొచ్చి మర్దించునపుడు
మిన్నుఁ బల్లము నిండి మింటికిఁ బోరాయ । నక్కాడ నెత్తు రయ్యాజిరంగమున.
అంబష్ఠవిభుఁడు శ్రుతాయువునపుడు । పంబినగతిఁ గ్రీడిపైఁ దేరు వఱపి
ధారాళ శరవృష్టి ధనువుఁ గేతనము । సారథిరథంబు వర్మములుఁ గప్పుటయు
శంబరాంతకుఁ దొల్లి శంభుండు వోలె । నంబకశిఖిఁ గ్రీడి యతనిఁ దాఁ జూచి
యందంద పైపైని నతి నిబిడముగ । సందడించు బలంబుఁ జక్కాడఁ దొడఁగె.
జగదేక రథికత జగతి నేర్పడఁగఁ । దగులక నఱకఁగిట్లు తఱిమిరాఁ జూచి
నిట్టూర్చి కలంగి కృప, నీకుమారుఁ । డొట్టిన తనపాఁజు నొక్కభంగి నిలిపి,
సేనాముఖమునకు శీఘ్రంబె వచ్చి । యా నెలవుననున్న యాచార్యుఁ బలికె:

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట

"క్రీడి రా విడిచితి కృతమేది యింకఁ? ।బాడు గావలియుండఁ బనియేమి యిచటఁ?
బడె నోవకుండ సర్పము చావకుండ । నడపెదు కార్యంబు నా ముచ్చు గురువ!
పాతకంబున నిన్ను బాండవపక్ష । పాతి నమ్మితిఁ గోలుపడితి సైన్యముల.
నీ వర మెటు వోయె? నిజమెందుఁ బోయె? । నేవెంట నమ్ముదు నెవ్వని నింక?
వలెనన్న నీకును వైరులు వేఁగె! । మెలప నిట్టివియయ్యె మీతోడి పనులు;
నమ్మఁగదే! మిమ్ము నా ముద్దుమఱఁది; । యిమ్మైన యపకీర్తి కేల భీతిలవు?
అతని కడ్డంబున్నయంకఱు నింద్ర । సుతుని కయ్యమునకు స్రుక్కుచున్నారు.
తేనియపూఁతకత్తివిగాక నీవు । మానిసివే! యిట్టిమాటలు వలసె.
నీబాణములఁ బార్థు నిలుప ర." మ్మనిన । నాబేలఁ జూచి ద్రోణాచార్యుఁడనియె:
"కూడ, దేముదునలిఁ, గూడి రానోప; । నీడాక నర్జును నిలుపుము పొమ్ము.
పగగలవాఁడవు; భావ్యంబు నట్ల; । తెగవు మాచే నంతఁ దీఱనిపనులు.
కవచధారణ మనఁ గల దొకవిద్య । యవనీశ, యిత్తు నీ కవసరంబగుట.
అది [1]గల్గ నెచ్చోట నర్జునాస్త్రములఁ । జెదరవు బెదరవు శ్రీపతికైన.
చతురాననుఁడు తొల్లి శంభునకిచ్చె; । నతఁ డంత దీని బృహస్పతి కిచ్చె;
అగ్నివైశ్యున కిచ్చె నాబృహస్పతియు; । నగ్నివైశ్యుఁడు మఱి హత్తించె నాకు;

1. గల్గియిచ్చిన. (మూ)

అది సాధనంబుగా నాఁగుము నరుని; । కదలక నాకు నిక్కడఁ గావవలయు.
పరఁగి పాండవసేన పఱతెంచు నింక । నురలఁ ద్రోక్కెడి మతి యొడ్డెల్ల నధిప!
ఏమన్న మఱి నీకు నిచ్చ్చన వరము । రానేర్చు నరుఁ బాసి రాజున్న వాఁడు.
ఇంద్రతనూజు ని జ్జైను రా విమన । నింద్రాదులును వారి కెదురె కయ్యమున!
ఆ నరనారాయణాఖ్య యోగంబు । మానను రాజేంద్ర, మన మన్ని గొనక.
ఎట్టైన గెలుతు మనేక యత్నములఁ । బట్టుచు బిట్టు నోఁ బలుకకు నన్ను."
అని ద్రోణుఁ డప్పుడు నట దివ్యకవచ । మొనరిన మంత్ర ప్రయోగంబు చేసి
దుర్యోధనున కది తొడిగి దీవింపఁ । దూర్య రావంబులతో మిన్ను దాఁకి
గురునకు మ్రొక్కి యక్కురు రాజు గదలి । పరువడి పోచుండెఁ బార్థు వెన్ దగిలి
ఆ పాండురాజ పుత్త్రావళి సేన । యీ పార్థుఁడేఁగిన యిక్కువ నడచి
ద్రోణాది యోధులతోఁ దలపడినఁ । బ్రాణ భీకరమయ్యె బవర మచ్చోట.
నొగ నొగతోఁ దాఁకి నుగ్గైన రథము, । పగ పగతోఁగూడ భగ్నమౌ బంటు,
తల తలతోఁ దాఁకి తగ్గు నేనుంగు, । నలి నలిగాఁ బోరి నాశిల్లు హయము
నిడివి గల్గుటఁ జేసి నెత్తురుటేరఁ । బడి పాఱె నయ్యాజిఁ బార్థివ, వినుము.
అడగాని పీనుఁగు లాప్రవాహమున । వడిసెల మెఱములు వైచుచు డొల్లె.
ఎక్కలి వెట్టిన ట్లిభతురంగముల । డొక్క లొక్కొక్కచోటునఁ దఱచయ్యె.
అట్టి జన్యమున సైన్యము లొక్కఁడొకని । గిట్టియదల్చుచుఁ గినుకమై నెక్కి
లయకాల కీలి కీలలఁబోని కోల । లయుత సహస్రసంఖ్యల నేసి యేసి,
యతుల శూలములు మహాముసలములు । ప్రతిలేని గదలు నేర్పడ వైచివైచి
శక్తిపాతమ్ములఁ జక్రపాతముల । ముక్త ముద్గర పాతముల నొంచి నొంచి,
పల్లవితాశోక ఫలితవటాభ । నల్లలితాకృతి చాలఁ బొందియును
జావు నొప్పెఱుఁగక జయకాంక్షఁ బెనఁగె. । ఆవేళ భీముపై నంగాధిపతియు
నరభసమతి వివింశతియును దాఁకి । శరభసమాన శస్త్రములేసి రధిప!
ద్రౌపదేయులఁ దాఁకెఁ దనర బాహ్లికుఁడు । చాప విద్యాప్రౌఢి జర్జరితముగ.
పంచేంద్రియంబులు ప్రాకృతుఁ బోలె । వంచిరి శరముల వాని నా నృపులు.
దుశ్శాసనుఁడు తేరుడోలి శైనేయు । నిశ్శంకఁ [1]దాఁకి తునియఁ జేయుటయును

1. గోపించి. (మా)

గుధరంబు వఱదఁబోఁ గురియు మేఘంబు । విధమున నశేఁజేసె వేపాఱ నతని.
నకులుని సహదేవు నానాస్త్రతతుల । శకుని గప్పిన వాఁడు చలము రెట్టింప
రవిచంద్రు లంధకారంపు గుమి విప్ప । తిపుట విప్పిరి వాని దిశలకు నొదుఁగ.
ఖండితారి శిఖండిఁ గడు నలంబుసుఁడు । వందానఁగొని యేయ నలిగి శిఖండి
గుహాలి శిఖండి రక్షోవీరు నొంచు । సహాణి నాతని నొంచె వాలంపగోళ్ళ.
సైంధవుఁ గాచున్న శల్యుండు సమర । బంధురుఁ డప్పటప్పటికి వచ్చుచును
ధర్మనందనుఁ దాఁకి ధర్మజు పూర్వ । కర్మము దాఁకినగతి నొంచిపోవు.
తక్కటి యోధులు తమయీడు వెదకి । యెక్కటెక్కటిఁ బోరి రీభంగిఁ గవిసి.
అంతఁ బోవక పాండవావలి నరుని । సంశయుఁ జూడఁబోయెను తమకమున
నొత్తి యెక్కిన, మనయోధులు కలఁక । నెత్తిపాఱఁగ, ద్రోణుఁ డెనురెక్కియార్చి
శమనజు భీము ధృష్టద్యుమ్ను నొంపఁ, । దెమలెఁ బాండవసేన తెలిసె నీసేన.

## ధృష్టద్యుమ్న ద్రోణాచార్యుల యుద్ధము

అందు ధృష్టద్యుమ్నుఁ డాచార్యు రథముఁ । గ్రందుగాఁ దఱుము నుగ్రపుసాహసమునఁ
గరముల నసి ఫలకములు వెలుంగ । గురుబాణములఁ ద్రోచుకొని నొగలెక్కి
యరుణాశ్వముల నొంప, నతఁ డొకభంగిఁ । బరఁగ నాతనివాలుఁ బలుకయు నఱకి
వారువంబులవన్నెఁ బరఁగు తద్రథము । వారువంబులఁ ద్రుంచి వానిపై మఱియుఁ
జంపనోపిన నారసము ప్రయోగింపఁ । ద్రుంచె సాత్యకి నడుమఁ దుమురుగా దాని.
అట్టిపోటున బాణ మతఁ డెత్తి శ్వేతు । నెట్టన నిజరథనిహితుఁ జేసినను,
అబ్బినమాంసంబు హరియింప నలుగు । బెబ్బులిచందమై పృథివీశ, గురుఁడు
బలుమెల్ల సాత్యకిపై ప్రయోగించు । తలఁపున నిగుడ, నాతఁడు నోసరిలక
సారథి కాజ హెచ్చరిక తాఁ జెప్పి । తోరపు ధృతి ద్రోణుతోఁ దలపడిన,
గుహ జామదగ్న్యుల ఘోరాజివోలె । మహితరణంబయ్యె మఱియు వారలకు.
భార్గైన జగమెల్ల బాణమయంబు । గాఁగలదో యని కంపించె బ్రహ్మ.
బాణానిలంబులుఁ బ్రాణానిలములు । త్రాణదప్పఁ గలంచె దాయాదిభంగి.
హరిముద్దుతమ్ముఁ డన్నంతకుఁ గలిగి । హరిసూను శిష్యుఁ డన్నంతకుఁ గలిగి
శైనేయుఁ డేయ, నాచార్యుఁ డయ్యేట్లు । రానీఁడు కూల్చు మార్గణవహ్నిఁ గాల్చు.

అంత ద్రోణునిచాప మతఁడు ఖండింప । నంతయు వెస ద్రోణుఁ డితరచాపమ్ము
నమ్మేయి సంధింప నదియు ఖండించె; । ఇవ్వాడ్కి ద్రోణు విండ్లిలఁ బెక్కు విఱిగె
మేలని ద్రోణుండు మెచ్చె నైనేయు; । ఆఁగావు గొనియాడి రమరులు మింట.
అంత నొండొకపింట నాగ్నేయశరము । కౌంతేయ హితునిపైఁ గలశజుఁ డేయ
వైరులయార్పులు వదల సాత్యకియు । వారుణాస్త్రంబున వారించె దాని.
ఆలోన గుఱుసిది క్కఖిల కౌరవులు । చాల సాత్యకిదిక్కు సకలపాండవులుఁ
గైకొని మెక్కినఁ గల్పాంత జలధ । భీకరసమర సంభృతమయ్యె రణము.
అటఁ గ్రీడి రవికంక నరిసేనసంకేఁ । జిలచిటఁ జూచుచుఁ జేవేగిరమునఁ
బఱపైన తనతేరు పాఱమపాటి । తెఱపిగా వ్యూహంబు ద్రెంచుచుఁ జొరఁగ

## విందానువిందు లర్జునుచే మృతిఁ బొందుట

వీకునఁ బోనీక విందానువిందు । లేకరథస్థులై యేతెంచి యార్చి
చీఁకటిదిక్కులఁ జేర నేయుటయు । (దాఁకటఁ గినియు సింహముపోలెఁ గ్రీడి)
విందుని ధనువు గోవిందుఁడు మెచ్చఁ । బిందికలొనరించి భీతిగా మఱియు
ననువిందు నవల మూర్ఛాయత్తుఁ జేయు, । ధనువు వేఱొక్కటి దాల్చి విందుండు
రథచిత్రగతుల మార్గణచిత్రగతులఁ । బృథసూనుఁ జిక్కులఁబెట్టఁ జూచినను
విందునిఁ జెనక నావిందు నర్జునుఁడు । క్రందైన బాహుయుగ్మమునకుఁ బాపి
తురగ కేతన సారథులతోడ వాని । శిరముఁ ద్రుంచినమాత్రఁ జెడక యయ్యసుర
యను విందుతనువున హత్తెనో యనఁగఁ । దనమూర్ఛఁ దెలిసి యాతఁడు నిట్టనిల్గి
యన్నఁగానక దుఃఖమాత్మలో ద్రుగ్గ । యున్నతగద గొని యుక్కికి దాఁటి
వడిఁ గ్రీడిశరముల వాఁడి తాఁకునకు । జడియక పఱతెంచి శౌరినేసినను,
అన్న[1]దమ్ములమేల మనునట్లు వాని । నెన్నఁడు మొకకోల నెఱిఁ ద్రెవ్వనేసి,
చిందంబు వట్టినఁ, జెదరక వాని । క్రందైనబలములు గాండీవధరునిఁ
దాఁకె, నింతియకాని తనువుతో నొకఁడుఁ । బోక క్రీడిశరాగ్నిఁ బొడిపొడి యయ్యె.
మఱియుఁ గవ్వడి పూర్వమర్యాద రిపుల । నఱుకుచు నవధిగానక వచ్చుచోట
నాతని [2]యలవు రథ్యంబుల యలవు । చేతప్పి రిపులు సుస్థితినున్న యలవు

1. దమ్ములు మేలు యనెడువాని. 2. యొలవు.(మూ).

జయమని కౌరవసైన్యంబు లార్చె | భయశోక మేకయత్నంబునఁ బెనఁగ,
శ్వేతవాహుఁడు వారిఁ జేరికిఁ గొనక | కేశవుఁ బరఁగఁ జూచి ప్రియమొప్పఁ బలికె:
"అలుగులు నాటుకొన్నవి శరీరమున | నిలువు గుఱ్ఱాలు పెప్పి నీ తురంగముల;
తాఁకనీ రిపు లేరు ధనువు మన్నార | మూఁకొని హయముల నూఱ్ఱాల్చి తెమ్ము.
పని తమకంబున బంటు నేమఱెన | జనుల కాపకు లేల సాధ్యమహా?" ననిన
హరి యట్లకాకని యరదంబు డిగ్గి | హయముల యమ్ములు పీక్కి, సతినాహసమున
ధరకుఁ గ్రీడియు డిగ్గి ధనువు సారించి | యరిసేన శరముల నాఁగఁ జొచ్చినను,
దేఱిన యొక్కఁడె తెఱపిఁ జెక్కెంత్రము | దూఱుచు నీదుయోధులు మహోగ్రమునఁ
బిడుగును బాముసు బెరఁజియట్లగుచు | మృత్యువుపాల్పుఁ గార్చిచ్చు మొలచినట్లగుచు
గరళము మృత్యువుఁ గడఁగినట్లగుచుఁ | గరమార్చి ముట్టడగాఁ జుట్టుముట్ట
హరుని వ్రేసిన ధీరుఁ డది లెక్కగొనక | శరములు దీర్చిన చాపంబు ద్రిప్పి
పొనర నుత్తర బొమ్మపొత్తిక లాలువ | నని చి కౌరవుల నాఁ డాఁగినయట్లు,
నాకితోఁటఁ గృశాను నమలంగఁబెట్టి | యాకడ సురల నాఁ డాఁగినయట్లు,
బాణబీరంబునఁ బరులబాణముల | రేణురేణువు లొనరించుచుఁ బరఁగి
రథశకలములు వారణశకలములు | ప్రథనంబులో వాజిభటశకలములుఁ
దొడవుల యినుము నెత్తురుల వాఁగులును | నడుకొన నఖిలసేనల నిల్వరించె.
అంత జిష్ణుని విష్ణుఁ డల్లనఁ గదిసి: | "కౌంతేయ, యివె తురంగములును దేరు;
నలుగులు వెడలకిలి ననువుచేసితిని; | జలములఁ ద్రావక చాలఁ బస్పడవు;
అలసె నేఁటి ప్రయాస మది యెంతలేదు! | కలదొకో యుదక ? మిక్కడ నెట్లుగలుగు?
అడరున నింతసేపైనది చాలు; | ముడుతునే మెడ!" లన్న మురవైరిఁ జూచి
కవ్వడి: "మునువకు గలిగింతు జలము; | త్రిప్పునే మనకివి తృషనున్నఁ బనులు!
అవధాన మెన్నఁటి! కినువులెన్నఁటికి! | నవభంగిఁ జూడుమీ నన్నింత." యనుచు
నుర్విపైఁ గోలనుగా నొక దివ్యశరము | సర్వజ్ఞుఁ డాయాజి జరపుచు నేసి
దానికి రక్షణార్థము శస్త్రశాల | గా నేయ నాశ్చర్యకలితులై సురలు
'ఏ యాజిఁ గంటిమే యీనేర్పు!' లనుచు | నాయర్జునుని గొనియాడిరి ప్రీతి.
అట్టి బీభత్సు రౌద్రాద్భుతంబులకు | నెట్టనఁ బొగడిరి నీవారు నతని.
అంత నారాయణుం డంటనవ్వుతోడ | నింతవానికిఁ గదా నేవత్తు ననుచుఁ
దనువులు నిమిరి రథ్యముల నచ్చటికిఁ | జననిచ్చి దప్పివో జలముఁ ద్రావించి

నీరార్చి యష్టుండ నెన్నిలవుల మొలచు । పూరి దిన్పించి నేర్పునఁ గొని తెచ్చి
నిజయత్నహానికి నీసేన వగవ । గజపురీశ్వర, యొయ్యఁగట్టెఁ దేరునకు.
అతఁ డిట్లు గట్టి రథారూఢుఁడైన । ధృతి నర్జునుఁడును నత్తేరికిఁ బాఱి
యుదయాద్రి రవియొక్క నొదిఁగి చీకట్లు । కదలున ట్లరులు డగ్గఱమికి నగుచుఁ
జాతుకి నిలుచుచో సర్వాంకుఁ డివల । నాతడవునఁ గ్రీడి నటఁ గూడవచ్చి
కదనంబు సేయఁ బొంకంబైన చోటు । వెదకుచుఁ బ్రచ్ఛన్న వృత్తిమై నడచె.
ఇరువురు కృష్ణులు నిట్లు తేరెక్కి । కరమార్భటముగ శంఖములు పూరించి
'వ్రాలెఁగదా ప్రొద్దు వలసినం' తనుచుఁ । ద్రోలిరి సైంధవు త్రోవకై రథము.
అప్పుడు "సిగ్గుగదా! యింక మనకు । నిష్పార్థుఁ దాఁకి జయించెద మనుట;
భూవరునకుఁ బ్రొద్దుపోదు సైంధవునిఁ । గావ నెక్కడివాఁడు! కదిసెఁ గార్యంబు;
వేఁడి రథంబిట్లు విడిచిన మనల । నాఁడు వారిని జేసి యనిఁ జేర్చువాఁడు.
అప్పుడు లేని శౌర్యము మనకింక । నెప్పుడు రానేర్చు నిలను శుద్ధముగ?
ఓసరించియు వీని నొగిఁ జూత." మనుచుఁ బాసిరి కొంద అప్పటికి నీ భటులు.
కొందఱు రాజులు 'కురురాజు వినిన । నిందయౌ' నని క్రీడి నెట్టోర్చి తాఁకి
శివుఁడు చుట్టినఁ బోవు జీవరాసులకు । వివరింప సరియైరి విజయాస్త్రములను.
కొంద ఱాసైంధవు కూటుగా నుండి । యందంద తలలెత్తి యర్జునుఁ జూచి,
"వాఁడి చూపులఁ గ్రీడి వాఁడెపో వచ్చె । లేఁడయ్యె నొకఁడు నిల్పినవాఁడు వీని.
కుంభజభోజులు కూర్కిరో వినము; । కాంభోజు శరములఁ గ్రాఁగెనో వినము;
విందానువిందులు వెండియు నృపతు । లెంద జీల్గిరో! కాన మిదె వచ్చెఁ గ్రీడి;
మనమును మునుమైతిమా! వీని." కనుచు । మనమునఁ గలఁగుచో మాధవనరులు
అలయక కొంతసవ్వటు పోయిపోయి । తలలెత్తి కనిరి సైంధవుఁ దోటివారి.
కని పల్కి: "రక్కటా! కర్ణునిఁ గర్ణ । తనయు శల్యుని సోమదత్తునిఁ గృపుని
ద్రోణిని నమ్మి సైంధవుఁడున్నవాఁడు; । ప్రాణి గానఁడుగదా! ప్రాణభయంబు.
వీరేల పారి హర విధు లడ్డపడిన । వైరి సాధింపక వదలము మనము."

### కవచధారణంబున దుర్యోధనుఁ డర్జునుఁ దలపడుట

అని యిట్లు సకలసైన్యము విన నాడి । చను దేర నడ్డమై సర్పకేతనుఁడు
ఔషధబలమున సహితుండికుండు । రోషితభోగి మార్కొనిన నిశ్శంకఁ

కవచబలంబునఁ గదియవచ్చుటయు । దివిజేంద్రసుతుఁ బల్కె దేవకీసుతుఁడు :
"పవనిఁ జూడుము బల్లి పాలలోఁబడిన । కరణి నిరుకునఁ జిక్కెఁ గర్ణగర్వమున.
మూలము మీఁజన్నములకెల్ల వీఁడు ; । శూలము భరతవంశమునకెల్ల వీఁడు.
ఎక్కడి పవనజుఁ! డెక్కడి ప్రతిన! । చక్కఁగాను సుతశోక చింతా హేతి.
వీఁడుగదా పెట్టె విషముతోఁ గూడు! । వీఁడుగదా యిండ్లు వెదకి కాల్చించె!
వీఁడుగదా యూడ్చె వెడఁగు జూదంబు! । వీఁడుగదా త్రోచె విపినాద్రి నిమ్ము!
అట్టివాఁ డబ్బిన నక్కటా! శిరము । గొట్టవు నీ దయా కరుణాలవా! యిచట!
సైంధవుఁ జంపుట శక్య మెట్లైన; । సైంధవుఁ డాక్షితిఁ జనిన జయము.
అనిన వాసవి 'యట్ల యయ్యెడుఁ గాక. చనినిమ్ము వీనికై యక్క కథంబు.
వెనుక సత్వముదాక వీఁడట్లు రాఁడు; । కనుఁగొంద మదియు నొక్కొక్కచో.'' యనిన

... ... ... ... | ... ... ... ...

కమఠముగతి జన్మకారిన్యవృత్తిఁ । దెమలనిపతి వారి ధృతిఁ జూచి పలికె:
"ఒక్కింత నిల్వుఁడీ యోకృష్ణులార! । చిక్కితిరిదె మిమ్ముఁ జెండాడువాఁడ."
అనిపల్కి మనమూఁక కాశ్చర్యమెసఁగ । జనపతి వారి నస్త్రప్రపూర్ణ ముంపఁ
'గప్పపై కొని యిట్లు కఱచునో!' యనుచు । నప్పార్థుఁ డతని సాయకపంక్తి నఱకి
పోయెఁ గౌరవుపని పోయె నన్నాటి । ధీయుక్తి నతఁడు పృథ్వీశు నేయఁగ,
నిడు జంగ జాతిపై నిర్ఘరాంబువులు । పడినట్లు మిడిసి యబ్బాణజాలములు
అగ్నిరోముని భీషణాకృతి వోలె । నగ్నికణంబుల యాకృతి నిగిడి
యవివచ్చి క్రమ్మఱ నాత్మదేహమునఁ । దవులుచో, నెఱఁగి మాధవుఁ జూచి నరుఁడు :
"కవచధారణమనఁ గల దొకవిద్య ; । ధ్రువమతి నితనికి ద్రోణుఁ డీ నోపు.
గోత్రారికిని నాకు గురునకుఁ గాని । ధాత్రి నన్యుల కిది తలపోయ లేదు.
ఏమాయ నితఁడున్న నేమాయె! నతని । మేమజు వేఁద్రుంతు మెత్తునే!'' యనుచు
నది త్రుంచుమున్న గోత్రారిచేఁ గన్న । ప్రదరంబు తొడుగుచోఁ, బరికించి యవల
తెగ లోనువెడలి యే తేరకమున్న । తెగనేసె ద్రౌణి యా తీవ్రసాయకము.
అట్టియ మఱియును నమ్మహాశరము । పట్ట నూహించిన పార్థుండు మాని
వింటిలావున యుక్తి వెరవున దీని । గెంట నేసెద నని కృతముష్టి నేసె.
నీ సుతుఁడును గృష్ణు నిశితాస్త్రయుగళి । నా సవ్యసాచి బాణాష్టక యుగళి
సైంధవధ్వజముల శరసప్తయుగళి । సైంధవు నాఁకగా సంధిల్ల నాటి

యింద్రజాస్త్రంబుల నెడనెడఁ దునిమె. । నింద్రజుఁ డతనితే రిల డొల్లనేసి
కరతలసంధులు కాడఁ గాండములు । వర శక్తిఁ బఱప న వ్వసుమతీపతియు
నాదట మేనెల్ల నలుగులు నాటి । వేదనయంతటి విధము జనింపఁ
'గపటపు జోడిచ్చెఁ గలశసంభవుఁడు । రిపుఁడుగదా విదారించె న' న్ననుచు
(నొండొక మైమఱు వొసపఁగఁ దాల్చ । భండనాధిపులు కవ్వడిఁ జుట్టుముట్టి )
యెదుట నేలికయుండ నెంతయుఁ బొంగి । పదిమొగంబులఁ బర్వి పార్థు నేయుటయుఁ,
జెలఁగి తేరు సహస్ర శీర్షుండు వెలుప । మెలఁగి యోధుఁడు నట్టిమొందు గైకొనక
కాళి కరాళ హుంకారముల్ వోని । వాలిక తూపులవాన ముంచుటయు
వీట తాటంబులై విఱిగెడు రథము, । లోటి వీరణములై యొరగు నేనుఁగులు,
నడరి [1]యోతప్రోతమై త్రెళ్ళు హరులుఁ, । బడుగు పేకయుఁ బోలెఁ బడు కాలుబలము,
లల కేలు కాలు మధ్యము నేరుపడక । యిలకు వ్రాలెడు ధారుణీశులుఁ గలిగి
సమరోర్వి మాంసపచన [2]పాత్రగర్భ । సమ రేఖమై పార్థుశరవహ్ని [3]నుడికె.
అటు వెచ్చమయ్యు సైన్యము దైన్యమేది । పటులీల గాండీవపాణిఁ బోనీక
మదమున గిరిఁ దాఁకు మత్తగజంబుఁ । బొదివెడు భూరుహంబులగుంపు వోలె
బలువునఁ బెనఁగ నప్పాండవుఁ డాత్మ । నలిననాభునిమాట నాటుటఁ జేసి
పతినింతఁ జంపక ప్రతినరాదనుచు । నతనికి నడచుచో నాసేనలెల్ల
విచ్చె; నప్పుడు రాజు విముఖతఁ బొఱఁ । జచ్చెఁ బొమ్మని ద్రోసెఁ జద; లట్లుద్రోయఁ

## కర్ణాదిరథికు లొక్కుమ్మడి నర్జునుఁ బొదువుట

దునిసిన కవచ మద్దుర్యోధనునకు । నెనిమిది రూపులై యేతెంచె నసఁగ
మెఱుఁగులు తళుకొత్తు మృగరాజు సిడము । మెఱయఁగయ్యములందు మేటిద్రోణియును,
ఉడురాజు సరివోలుచున్న వారణము । పడగతో నాహవప్రౌఢిఁ గర్ణుండు,
నలిఁ జిత్రవర్ణపు నమిలిపతాక । యలరు మహాక్రోధి యతనిసూనుఁడును,
వెలుఁగున రవిఁబోలు వృషభ కేతనము । వెలయ ధనుర్వేదవేది కృపుండు,
శ్రీలక్ష్మిఁ బొడవైన [4]సీత కేతనము । గ్రాల బాహాబలగర్వి శల్యుండు,
చెలువైన నవరత్న సింధురధ్వజము । వెలుఁగొందు రణకళావేది శలుండు,

---

1. యోధప్రాతలై, 2. మాంత్ర. 3. గుదిసె. 4. శిరము. (మూ)

నుమవీధి మాణిక్య యూపమ్ముఁ బడగ । పొడవున రిపుహారి భూరిశ్రవుండు,
[1]రాజతమైన వరాహ కేతనము । రాజిల్ల సమరభైరవుఁడు సైంధవుఁడు
నిజనిజ సేనతో నృపునకు నొదవి । విజయుపై నాటోపవృత్తి నెక్కినను
ఆ వీరసైన్యంబు లట్టిట్లు పడఁగ । దేవదత్తంబొత్తి దేవేంద్రసుతుఁడు
అఱువంటకోలల నందఱఁ బొదివి । విఱిచె శల్యునివిల్లు వెడఁదతూపునను.
అంత నశ్వత్థామ యందఱఁ గడచి । కౌంతేయు నుగ్రమార్గణ పంచకమునఁ
గమలాక్షు నాఱుద్రేకపు నారసముల । విమలాశ్వములఁ బది వేఁడిబాణములఁ
బురహరుగతి భూతములు గొల్వనున్న । హరికేతనము పదాఱమ్ములనేసె.
అతనికి మిగిలి రాధాత్మజుఁడస్త్ర । శతమున గాండీవిచాపదండమును
శరశతద్వయిఁ గ్రీడి జతనపు జోడు । శరలక్ష నరుతేరు సరిగ్రుచ్చి యార్చె.
ఆ యిరువుర కెక్కుడై కృపాచార్యుఁ । డాయత శరవృష్టి నర్జు నాస్త్రములు
నారాచకోటి నన్నరు కిరీటంబు । ఘోరభల్లంబుల గొడుగులఁ బొదివె.
వీరుఁడందఱికన్న వృషసేనుఁడలరి । దారుణాస్త్రముల నింద్రజు శింజినియును
శూలపాతములఁ గృష్ణుని కత్తళంబు । వాలువాల్లను [2]నరు బాహుయుగమును
భూరి చక్రంబుల బోరన గదల । శౌరి[3]వర్మంబు సీసకమును నొంచె.
భూరిశ్రవుండు నప్పుడు రథరథ్య । సారథిరథికులు చాపంబులనక
యొరిలి నిన్నియుఁ గూడి యొకబాణనగముఁ । బోల నొక్కటనేసె భుజసంభ్రమమున.
శల్యుఁ డార్యురశస్త్రచండిమకంటె । నెల్ల తామూరేఁడు నెక్కుడైనట్లు
నలి నరనారాయణప్రళయాగ్ని । కలదు లేదనిపించెఁ గాండవర్షమున.
శల్యుండు నొండొకచాపంబు సమర । తొల్యమేర్పడఁబూని లావునఁగదిసి
ఘోరమృత్యువువేఁడి కోలలఁ బోని । నారాచములఁ ద్రుంచె నరు నరసఖుని.
వీరుఁడు తానయ్యు విజయుభయమున । వీరిమాటునఁ దూఱి వెనసైంధవుండు
మొగిళుల మాటున మొగి మేఘనాథుఁ । డొగి నేసినట్లేసె హుంకృతి నరుని.
తోడుగల్గిన యాస దుర్యోధనుండు । క్రీడినేసె ననేక కృత్రిమాస్త్రముల.
సేనలు నప్పుడేసిరి కట్టతెగినఁ । బూనివచ్చు ప్రవాహమును బోలె వాని.
నిర్జరులంత నా నిండు కోల్తలకు । నర్జునుఁ డగపడునని యెన్నకొనిరి.

1. రాజిత. 2. నఖవద్రియుగములును. 3. చర్మంబు. (మూ)

ఏనును [1]మతిసెసీ యింద్రనందనున । కైన యాపదయని యధిప, చింతిలితి.
అప్పుడు దరహాస మానన్జముసఁ । జిప్పిల్లఁ బార్థుఁ డశేషయోధులకుఁ
గుత్తుకబంటిగా గొడుగులు విండ్లు । నెత్తినపడగలు నిరుసులు హరులు
నూతులు రథములు జోళ్ళాదిగాఁగ । శాతసాయక సహస్రములఁ గప్పుచును
నెఱసి యెల్లెడ నూర్మిసికరంబు తాఁకఁ । దఱగని జలధిమధ్యము కొండవోలె,
నురుఁగుతోఁ జిక్కని నులివేఁడినెత్తు । రుఁరల వారిలమేను లోలిఁ జెంచుచును
దనబారి నిండఁబుఁ దఁగులుట దోఁపఁ, । దనతెల్వి యితరులదైన్య మేర్పడఁగఁ,
దనువులు మఱచి యుండఁబు వెనుదివియఁ, । దనియ దివ్యాస్త్రసంతతిఁ బెచ్చుపెరిగి,
నిలువరించియు వైరి నిజదృష్టి పీధి । [2]నిలుచుట చింతించి నెఱి సంతసించి
వానిపైఁ బఱపిన వాఁడితూపులును । మానవాధిప, నూఱుమాత్రము గలవు.
విఱిగె శల్యుఁబివిల్లు వేఁడినయట్లు; । నుఱుమయ్యె దుర్యోధనుని పోటుజోక;
జలజనాభుఁడు నిజశంఖ మొత్తుటయు । నలుగుల నరికట్టె నఖిలసైన్యముల;
విముఖత కడమగా విఱిగియు యోధు । లమరేంద్రసుతునేసి రాజిలో." ననిన
వైచిత్రిఁ గొనియాడి వైచిత్రవీర్యుఁ : । "డోచెల్ల! సంజయ, యొప్పెఁ గార్యంబు;
విడువఁడు సుతుఁడు తా విజయ జయాశ; । వడఁకెద నక్కటా! వాని నే మందు!
ఈవు చెప్పిన యట్ల యిది నాయు పేక్ష; । యేవెంట దైవాజ్ఞ నేమనవచ్చు?
అనుజున కానరా యరుదెంచు ధర్మ । తనయుఁడు దొరలు నెంతటఁ జొచ్చి?" రనిన
ననఘుఁడాతనికి నిట్లని చెప్పఁ దొడఁగె । నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గథచెల్లె నెఱిఁగింపు, మనిన
భానుకులాంభోధి పావన చంద్ర! । భానుకోటి నిజప్రభా భాసమాన!
కరుణా కటాక్ష వీక్షణ! దయాలోల! । సురరాజనుత! మహాసురరాజవర్య!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత ద్రోణాఖ్య విపుల పర్వమున । నరుదుమీఱఁగఁ దృతీయాశ్వాస మయ్యె.

---

1. మదినిడి. 2. నిలువుము. (మూ)

# చతుర్థాశ్వాసము



శ్రీవైష్ణవాధార! స్థిరకృపాపూర! । ¹పాలితమునిసీమ! పరమాత్మ! రామ!
బ్రాంతి నంబుధిఁగట్టి పతిదైత్యుఁగొట్టి । సీతఁ దెచ్చిన సామి! చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:

## ధర్మరాజు ద్రోణునితో యుద్ధమొనర్చి యోడిపోవుట

పలికె సంజయుఁడు: "శిఖిఁ బాండవాగ్రజుని । బలము ద్రోణునిమీఁదఁ బఱతేరఁ ²గదలి
పైఁబడఁ గడఁగ నిల్వఁగఁబోవు దిగిచి । వేఁబోవు నతఁడు రుష్వినఁ బోవు దిగిచి(?)
యాయన్వ గాదని యంతఁ దూర్యములు । మ్రోయ భీమాదులు మిగులఁగూడి నిగిడి
బోరన నెక్కిన, భూపాల! యప్పుడు । ఘోరరణంబయ్యెఁ గురుపాండవులకు.
తగ నందు సహదేవుఁ దాఁకి దుర్ముఖుఁడు । నిగిడి పోరాడియు నిలువకే పాఱె.
నకులునిఁ గర్ణుండు నవభంగిఁ దాఁకి । యొకముహూర్తము నిల్చి యుసిఁగె నవ్వేసుక.
³శీఘ్రబాహునిమీఁది శిశుపౌత్రుఁ దాఁకి । ⁴వ్యాఘ్రదత్తుఁడు గూలె వ్రయ్యలై ధరణి.
దొరకొని బకవైరితో నలంబుసుఁడు । దురమొనరించి యోధులు నవ్వఁ బాఱె.
శరశక్తి మాగధ సహదేవుఁ దాఁకి । నిరమిత్రుఁడను రాజు నిశ్శేషుఁ డయ్యె.
చనుదెంచి చనుదెంచి శల్యుండు ధర్మ । తనయుతోఁ బోరాగి తగ నేఁగుచుండె.
ఒకమాఱు శలుఁడు శల్యునియట్ల వచ్చి । యకరుణ ద్రౌపదేయులమీఁదఁ దాఁకి
మరలవారల ధనుర్మధ్య నిర్ముక్త । శరముఖ ఘోరాగ్ని శలభమై క్రాఁగె.
అంత ధర్మజుఁ దాఁకి యాచార్యుఁ డతనిఁ । బంతంబుతో ముట్టి బలిమిమైఁ బెనఁగ
గురునివక్షము దూఱఁ గుశలత మీఱ । నిరువది బాణంబులేసె నానృపుఁడు.
శరపంచవింశతి చాల నొప్పెసఁగ । గురుఁడును నేసె నక్కువలయేశ్వరుని.
ఏసి వెండియు నన్నరేశు విల్ద్రెంచి । యోసరింపక కప్పె నుగ్రాస్త్రవృష్టి.
'అప్పుడు తగులునో! యటుగాక తెగునొ! । తప్పదీనృపుఁ' డని ⁵తలఁచె సేబలము.
మిసిమింతుఁడునుగాక మేదినీపతియు । వెస వేఱె విలుదాల్చి విప్రైనసోవృష్టి

1. పావన. 2. గణఁగి. 3. సేగ్ర. 4. వ్యాగ్ర. 5. తగవేల. 6. వృష్టి. (మూ)

విప్పినఁ, గోపించి విభునిపై ద్రోణుఁ । డప్పుడు బ్రహ్మాస్త్ర మరిఁబోసి యేసె.
నతఁడును నలిగి బ్రహ్మాస్త్రంబులేయ । హతములై యవి వ్రాలె నన్యోన్యహతుల.
గదవైచె నప్పు డక్కౌంతేయు ద్రోణుఁ ; । డది తునియఁగ నేసె నతఁ డుగ్రశక్తి.
గురుఁ డంతఁబోక యక్కునలయేశ్వరుని । హరుల సూతునిఁ ద్రుంచి యట విల్లుదునుమ
భయమంది నృపుఁడూర్ధ్వబాహుఁడై నిలువ । లయముఁబొందింపఁ జాలక సైన్యపతియు
నాతనిచుట్టు సైన్యముఁ దైన్యపఱుపఁ । జాతురి నతఁడెక్కె సహదేవురథము.

### అలంబుసుఁడు ఘటోత్కచునితో యుద్ధము సేయుట

అడరి యాదెసచూచి హైడింబుఁ డంతఁ । దొడిఁబడ గురుఁ దేరితోఁ ద్రుంగఁబోవఁ
బోకుపోకని యలంబుసుఁ డార్చి యతని । పేఁకఁ దాఁకినఁ జూడ వెఱఁగయ్యె రణము.
కనలి యిర్వురువైచు గదలు శక్తులును । దునియలై చెదరి యోధుల వచ్చి తాఁకె.
శరతరంగోత్తుంగ సంఘర్షణముల । నరుణబింబముఁ దాఁకె నయ్యొక్కధూళి.
జేగురుఁ గాల్వల క్షితి [1]ధర యుగము । లాగైనగంట్లఁ గీలాలముల్ దొరుగ
... ... ... ... ... । ... ... ... ... ...
అందు నలంబుసుఁ డందంద పాండు । నందన సుతు నేసె నలిఁదేరు విఱుగ.
అసిఁగొని మింటికా యసుర దాఁటుటయు । వెసఘటోత్కచుఁ డంత వెంటనే దాఁటె.
అసురు లచ్చట మొత్తులాడి భూస్థలికి । వెసడిగ్గి గదలతో వెండియు నెగసి
వారివాహంబులు వాయువశమునఁ । బోరెడుగతిఁ బోరి [2]పాలిపోకవచ్చి
యొక్కఁడొక్కనిఁ బట్టి యురుసత్త్వమహిమ । నొక్కట నెసఁగుచు నుర్విపై వ్రాలి
మల్లయుద్ధము సేయ మఱి యలంబుసుని । ద్రెళ్ళవైచి యురంబు ధృతి నెక్కివాఁడు
మొగము మోఁచేతుల మోఁకాళ్ళఁ బొడువఁ । బొగడి రప్పుడు పాండుపుత్త్రులప్పుత్త్రు.
ఆ సమయంబున నాచార్యుఁ డంత । భాసురంబుగఁ గోపభరితుఁడై తాఁకఁ
గినిసి సాత్యకి యడ్డగించుచో నతనిఁ । *దన పేరుగాఁ ద్రుంచు త ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
... ... ఉగ్రగ్రహంబు । మరలించుగతి వాని మరలించి యతఁడు

---

1. ధారయుగళ. 2. పోవక. (మూ)

* ఈ పట్టున తాటాకు కుడిపైపు సగముముక్క లేదు.

ఇతని కితఁడె యోర్చు ; నితనికి నితఁడె । ... ... ... ... ...
... ... ... ... ... । ... ... యుండును ...
శాతబాణములు పింజలబంటి దిగను । ఆతని నాటింప నతఁడేర్పువట్టి
... ... ... ... ... । ... ... ... ...
కౌంతేయులకు నవగాహింపలేక । ... ... ... ... ...
కాద్రముద్రా విద్ధ రణ గర్వమహిమ । రుద్రుఁడై పెనఁగి పార్థుఁడు మ ...
... ... ... ... ... ... .. ... ... ...
... ... ... లు లంపు । పంచవింశతిసంఖ్య పడిరి కేకయులు.
తొవకి సప్తతి సంఖ్య తూలిరి మాత్స్యు । లవనీశ, మఱి ... ...
... ... ... ... ... । ... ... ... ...

## ధర్మరాజు సాత్యకినర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట

... ... శైనేయుఁ । గనుఁగొని తమకంబు గానరాఁ బలికె
చెన్ను మీఱఁగ హరి శంఖరావంబు (?) । క్రన్నన వినరా ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
... ... డ్డి కంటికిఁ బోయి । పడఁడుగదా వైరి భటుల కొక్కఁడును!
వాడెఁడుఁ జిత్తంబు వడఁకెడు నొడలు । తో ... ... ... ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
... ... దు శిష్యుఁడ ననుఁగొందు । పోరామి గావవె పోయి నీగురుని.
అతనిఁ గాచుట నన్ను హరి భీమ ... । ... ... ... ... ...
... ... ... ... । ... ... ... ...
... ... ... కుండు । పోడుమఁ బోరుదు రొంటిఁ బోయె నాతమ్ముఁ
డోడుపవే మిగుల ఱంతోదవె నచ్చోట. । ... ... ... ...
... ... ... ... । ఆతఁడిట్టి ప్రతిజ్ఞ యాడుకొన్నాఁడు.”
అని పెక్కుభంగుల నతఁడు ప్రార్థింప । శిని పౌత్రుఁ డంజలిచేసి ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
... ... ... దనియు । నిలిపి పోయెఁ గిరీటి నినుగావ నన్ను.

రాజరక్షయు సింధురాజ శిక్షయును । ఆజి నేఁ డొకటని హరి విన నాడె.
పొమ్మన్నఁ బోమొకఁ బోలేక కాదు । చిమ్మెద రిపుసేనఁ జీకాకు పడఁగ.
ఇచ్చోట నీకొక యిమ్ము దప్పెనఁ । జచ్చియు వృథగాదె సైంధవుఁడచట!"
అనిన ధర్మతనూజుఁ డతనితో మఱియు :। "ననుగావ యోధులున్నా రెందఱైన;
ద్రుపదుండు ద్రుపదపుత్త్రుఁడు విరాటాది । నృపులు సామాన్యులే! నిన్ బోలువారు.
హరిసూతి గలిసిన నందఱుఁ గలరు । చొరుము వ్యూహము వాయుసుతుఁడుతోడుగను.
ఇరువురుఁ బోకున్న నేనమ్మ నతని । బరమార్థ." మనుటయు భయమంది యతఁడు:
"ఏ నేఁగ నితఁ డేల? యిచటికి వలయుఁ; । గాన నిర్భీరుఁ బోవఁ గడు దూఱు క్రీడి.
ఎంతటిపనియిది! యేల చింతిల్ల! । నంతకు నన్నంచి యటు చూడు." మనిన
నాతని కార్య శౌర్యములకా నృపతి । కౌతుకితాత్ముఁడై కడుఁ బ్రయత్నమున
సారథి కశనంబు జవనాశ్వములకు । నీరును ఖాణంబు నియతిఁ బెట్టించి
యావిరు మదిరామ[1]దాస్యుఁ దలఁచి । దీవింప మ్రొక్కి యాధీరుండు గదలి
పులి లేడిగమిఁ జూచుపోల్కి నీసేనఁ । గలయఁజూచుచుఁ దూర్యకలకలంబెసఁగ
వలుదముత్యంబుల వడి [2]వజ్ర సూచి । నెలకొన్నగతి నొడ్డు నెలవునఁ జొచ్చి,
చుక్కల బారులఁ జొరఁ బాఱు తోఁక । చుక్కపూఁపునఁ జొరఁ జూచి ధర్మజుఁడు
అతనికి సేన సహాయమై పనుప । నతఁ డందుఁ గూడక యరిసేనఁజొచ్చి
శిరములు వ్రక్కలుచేసి చెండాడి, । యురముల వ్రయ్యల నూఱుఖండములఁ
గుత్తుక తునకల ఘోరాజి జముని । కుత్తుక కడి సేయఁ, గోత్తల పడక
పన రాతి పాటునఁ బక్షులువోలె । వెన నీబలంబులు వీఁగఁ జొచ్చినను
'ఓడకుఁ డోడకుఁ డోసేనలార! । చూడుఁడు న'న్నని చొరవచ్చి గురుఁడు
శైనేయుఁ దాఁకి రోషము మించ నంప । సోనముంప నతండు స్రుక్కక పలికె:

## సాత్యకి మొగ్గరంబుఁ బ్రవేశించుట

"యమసూతి పనుపున నాజి నేఁ జొచ్చి । యమకేంద్రసుతుఁ గాన నరుగుచున్నాఁడ;
నున్నవారెఱుఁగఁగ యోధుల మిమ్ము । నెన్నవచ్చునె నాకు నేలికపనుపు.
పోనిమ్ము నీకిది పురుషార్థ వేళ । నేనొంటిఁ జొచ్చిన నింత నేమయ్యె?"

1. మదాద్యుల. 2. వజ్రినూతి. (మా)

అనిన ద్రోణుఁడు పల్కు: "సూత! నాసఖుఁడుఁ । జనియె నీయట్లు తచ్చన మాటలాడి.
పోరాడి గురుఁ ద్రోణుఁ బోయెదే!" యనిన । దారుకానుజుఁడైన దనసూతుఁ బలికె:
"పోరాడు రణ ¹భీమ భుజుఁ డీక్షించుఁడు ; । నారణ మహాసుభట ప్రాతంబు మెండు ;
తప్పఁ దొలఁగి పో క్షత్రము ; నానతియు । శప్పి నిలిచి యోడఁ దడవైన మనకు.
ఇదె బాహ్లికునిసేన, యిదె కర్ణుసేన, । అదె దాక్షిణాఖ్య సైన్యము చక్కఁజూడు.
ఇంచిన శరశక్తి నింకొక్క వంక । బించుక చొత్తము నిమ్ము నీ రథము."
అనిన వాఁ డల్లకా కని యుంగసేన । మును నుగ్గు చొచ్చుచో ముందఱనార్చి
కృతవర్మ మూఁటు వాల్గింట శేడింట । నతని సూతు రథంబు హయముల నొంప,
నూట వక్షము చోటు నూట నాల్గింట । నాటంపఁ గోలలఁ గప్పె సజ్జోదు.
కప్పిన శైనేయు కార్ముకభంగి । నప్పుడప్పుడు చేసి యార్చె; సల్లార్చ
శక్తిఁ బైగొని వాని సారథిఁ జంపి । యుక్తి నదాన్య తమ్ముఁడు నొండు విల్లు
ధరియింప, భోజుఁ డాతని దిక్కుచొరక । యురదంబునడుపు కార్యమువాఁడు నగుచుఁ
బవనజు ముఖమైన పార్థు వాహినికి । నవఘళించిన, ద్రోణుఁ డాకథలెఱిఁగి
రాజార్హ మొక్కసారథిఁ దెచ్చియిచ్చి । భోజు సేనాముఖంబునకుఁ జాలించి,
నిలు పోకు నిలుమని నిలిపి శైనేయుఁ । జల మొప్పఁ దాఁకి భీషణమూర్తిఁబెరఁగె.
అటఁ గృతవర్మని నసదుగాఁ దలఁచి । పటుగతిఁ బాండవభటు లార్చి యెక్కి
వెనుక ముందఱఁబర్వి విశిఖావళిష్ట । తనుని గా నేయ, నాతఁడు నుగ్రభంగి
ద్రుపదు నైదింట మాత్స్యుని బదేనింట । ద్రుపదాత్మజాతపుత్త్రులఁ బది పదిట
నవనవకముల సేనాని శిఖండి । నవతిఁ గేకయులను నాటించి యార్చి
చెల్లాక చెదరుగా సేనల నెల । భల్లాది శరపరంపర బిట్టుపఱపి
మొనకు మూలము వీఁడు మూర్ఖుండటనుచు । ననిలజువై చె మూర్ఛాయత్తంగాఁగ.
అతఁడంత సమ్మూర్ఛ యల్లనఁ దెలిసి । గత ⁴కృపఁ గెంజాయ కన్నులతోడ
శూలంబులైదు భోజుని మీఁదవైవ । వాలమ్ములైదేసి వాఁ డవి ద్రుంచి
నూతాశ్వ తనువులు జొత్తిల్లనేయ । నాతండు నతని విల్లునఁ ద్రెవ్వనేసె.
వైచి వెండియు విల్లు వాఁడు ధరింప । నాచందమున నేసె నదియును ద్రెవ్వ.
ఈ చందమున భోజుఁడేయు బకారి । చూచి సేనలను భోజునిఁ గప్ప నతఁడు
పెల్లునెత్తురు చిమ్మఁ బెద్దకోపమున । విల్లు విప్పఁగఁ బోయి వేసె వాయుజుని.

1. భీల. 2. దక్షిణాఖ్య. 3. వాకిటి జోదు. 4. కృత. (మూ)

వేయంగ నెడసొచ్చి వీరు లాభోజుఁ । బాయ బిట్టేయ నార్భటము లాలించి
జగదేకవీరుండు సాత్యకి యప్పుడు: । “మగిడెదఁ గాక క్రమ్మఱ వత్తుఁ గాని;
వెనుక అంతయ్యెడు విభునకే కీడు । మొనసెనో యటుపోదు మునుమిటు పెట్టి.”
యని ద్రోణుతోడి కయ్యంబు చాలించి । శినిపతి కృతవర్మ సేనకుఁ దిరిగి
యతనిఁ దాఁకఁగ నిష్ఠురారావ ఘోర । వితతాస్త్ర రణమయ్యె వెస నిర్వురకును.
అందు వే రథ్యంబునంది భోజుఁడును । గొందలపడఁ జూచి కుంతిజు లలర
వీఁగు సేవలఁ దగ వీక్షించి చూచి । యాగర్వి మఱియు వ్యూహముఁజొచ్చెఁ; జొరఁగ
గురుఁడు మార్కొనఁడయ్యెఁ; గుంతిజులప్పుడు । తరమిడి కృతవర్మ దాఁటివచ్చుటయు
వారట్లు రాఁజూచి వారించి గురుఁడు । నారాచవృష్టి వెన్కకు వీఁగఁ దోలి
కృతమతి నచ్చోటఁ గృతవర్మ నిలిపి । మతమొప్ప శైనేయు మఱియు వెన్దగిలి
వచ్చునంతకు మున్న వానితో నెదిరి । (చచ్చె ననిన్ జలసంధుఁ డన్‌రాజు.)
సాత్యకి గురుఁ డంత జగదీశ, కినుక । నత్యుగ్రగతిఁ బోర నా సహాయమున
దుర్ముఖ దుస్సహ దుశ్శాసనులును । దుర్మర్షణుండును ధృతి వికర్ణుఁడును(?)
కౌరవపతియును గడిసి శైనేయు । ఘోరాస్త్రముల ముంప గురుఁ డదిచూచి
‘వీరితో మార్కొన వీరె చాలుదురు । సేనాముఖంబు నేఁ జేరెద’ ననుచు
సాలె వెజ్జునుబోలెఁ జయ్యన మరల(?) । నాలంబు బలిసె సాత్యకి కౌరవులకు.
విశిఖసంఘట్టన విస్ఫులింగములు । దశదిశలకుఁ బాఱె ధరణి మ్రోయఁగను;
హుంకారముల కుక్షి యుఱ్ఱూఁత లూఁగె; । టంకారములకు వడంకె దిక్కరులు;
తొల్లి బాల్యంబునఁ దోయధిఁ దారు । చల్లులాడువిధంబు శరముల దోఁప.
... ... ... ... ... । ... ... ... ... ...
వీఁగె నప్పుడు సేన; వీరుబాణముల । వేఁగెను నీ పుత్త్రవితతి భూపాల!
విల్లు రెండుగఁ ద్రెవ్వి విరథుఁడై విభుఁడు । నొల్లనఁ బాఱె వేఱొకని తేరెక్క.
సేసలచ్చుట జాఱి చెదర భోజుండు । శైనేయుతోడి యచ్చలమున మఱియు
నటఁబోయి తాఁకిన నట్టహాసమునఁ । బెటిలి సాత్యకి కోపభీషణాస్త్రములఁ
బింజలకోలఁది నింపినను భోజుండు । భంజించె నతనిచాపము భల్లధార.
విల్లట్లు దునుమ నవ్విభుఁడు వేఱొక్క । విల్లెత్తె నెడమీక [1]వెరవొప్ప నతఁడు

1. వేరొప్ప. (మూ).

గదతిప్పి భోజువక్షము డాఁకవైచి । యడలింప మూర్ఛితుఁడై వ్రాలె నతఁడు.
వ్రాలిన నదియు చావని నిర్ణయించి । యాలోన నతనిసైన్యము నొంకువెంట
వీటతాటంబుగా విశిఖంబులేసి । నాటిపోవఁగ, భోజనాథుఁడు తెలిసి
శ్రీకంట నతని వీక్షించుచు మరలి । భీకరగతిఁ దాఁకె భీమాదిభటుల."
అన విని వెఱఁగంది యాంబికేయుండు : । "శినివరుఁ డక్కటా ! చిక్కకచొచ్చెఁ
బతి తన్ను ననిచిన భక్తి ; నాతనికి । నతిమానుషంబైన యాలావు వచ్చె ;
మఱి యిందుఁగలిగిరే మరలించు యోధు ? । లెఱిఁగింపు సంజయా ! యేవిందు." ననిన
ఆ సంజయుఁడు చెప్పె నధిపతి కిట్లు : । " వాసుదేవానుజు వరశక్తి వినుము
ఒకవంక నీపుత్త్రు లోడుఁగులు వాఱ, । నొకవంకఁ గృతవర్మ యులికి యే తేర,
నొకవంక సాత్యకి యొద్దు వేదూఱ, । నకలంకచిత్తుఁడై యటఁ జాపగురుఁడు
పాండవశిష్యునిపజ్జ దాఁ బోయి । (ఖండన పాండిత్య పటిమ యేపారఁ
బూనిన కినుకతో బొమముడి వైచి) । శైనేయ, నిలుమని సంధించి పిలిచి
తూపులఁ గప్పినఁ దోఁ ద్రొటుపడక, । చాపాంతరము వూని సాత్యకి కడిమి
వేఁడి నారసమున వెచ్చని నెత్తు । రోడిగిల్లఁగ ద్రోణు నొడక యేసి
పడగయు గొడుగును భంజింప, గురుఁడు । పిడుగుల మొగిలు రొప్పినయట్లు రొప్పి
(చతురుఁడై సూతు మూర్ఛామగ్నుఁ జేసి) । యతని నెత్తుటనోలలాడ నేయుటయుఁ,
బటుబాణములఁ బట్టువడక సాత్యకియుఁ । (బటుకున సారథిత్వము తాన పూని
పొరిగొని యంబకంబులఁ బ్రయోగించి) । గురుసుతో గురుసూతు కుత్తుక దునిమి
(యతిరయంబున వాయు వచలంబుఁ ద్రోయు) । గతి వానిరథము వెన్కకుఁ బడ నేయ
గురుఁడు నాతనిసూతుఁ గూల్పంగ నుండె ! హరులు తేరు హరింప నది తప్పెఁగాని.
అట్టు సారథిలేని యరదంబు మరలఁ । [1]బట్టుగొల్పఁగలేమి భగ్నుఁడై గురుఁడు
ఈకొలఁది గెల్వరా దీఁక వని యదియ । పోకఁగాఁ బోవ, నప్పుడు మొనలెల్లఁ
గన్నది కన్నవంకల విచ్చె ; విచ్చ । మున్నిటికడకేఁగి మొదలి సేనాని
భీమాది భటులతోఁ బెనఁగుచు నుండె. । ఆమేటిదెసకుబ్బి యట సాత్యకియును
ద్రోణాస్త్రములఁ జాలఁ దూలిన సూతుఁ । బ్రాణభీతికిఁ బాపి పలికె నిట్లలమి :
'భీమార్జునుల లావు పెఱుఁదముందటను । నోమిత్ర, గలుగఁగా నొదుఁగ మెవ్వరికి.

1. భట్లు గొల్పఁగ. (మూ).

నేఁడు పార్థులమీఁది నెమ్మి నానేర్పు । వాఁడిమిఁ బ్రకటించువాఁడఁ గయ్యమున.
నా తేరు నడఁకక నడపుమీ నేఁడు; । సూత, మాతము నిన్న ఘోరమధ్యమున.
బీభత్సుశరములఁ బీనుఁగుతెట్ట । లేభంగిఁ దఱచయ్యె నిటుచూడు మొదట.
అది నీకుఁ దెరువు రథ్యంబులఁ ద్రోలు । పొదపొద.” మనుట నుప్పొంగి సూతుండు
“ఇక్కఁగా నీకాంక్షకేఁ దేరు గడప । నెక్కుడీవాఁడ! మున్నెఱుఁగ నిట్లగుట.
నను జూడు మట్లయ్యె నా వినూనంబు । ఘనవీధిఁ దెచ్చినగతిఁ దేరు దెత్తు.
అదె గాండీవము మ్రోఁత; యదె శంఖరవము; । నదె కిరీటము కాంతు లతిదూరమున.
దండనాథాంబుధి దాఁటిన నీకు । వెండియు నడ్డమే వెన వత్తుగాక.
సురలు రెండవయింద్రసుతుఁడు వీఁడనుచుఁ । బరిగణింతురు నింగి బహుభంగి నిన్ను.”

## సుదర్శనుఁ డనురాజు సాత్యకితోఁ దలపడి మడియుట

అనినఁ గౌతుకమెత్తి యనివార్యవృత్తిఁ । జను శిబివరు సుదర్శనుఁ డనురాజు
తాఁకి పోరాడుచోఁ, ధనువుతో వాని । ద్రేకపుఁ గుత్తుక విదళించి యతఁడు
శాత్రవ దుర్నిరీక్ష ప్రతాపమున । [1]మిత్రుఁడై మాయచే మెయి మెయిఁ బోవఁ,
గైరాత బర్బర ఘన [2]శకమ్లేచ్ఛ । పారద యవనాది బలములు తాఁకి
యార్పులు చేసిన నతఁడు నారసము । నేర్పడ సంధించి యేయు నందఱును
గుదివడి రథవాజి కుంజరంబులను । మొదలేర్పడక యొక్క ముద్దయై పడిరి.
అంత సిగ్గు దలంచి యధిప, సౌబలుఁడు । నంతంత దుశ్శాసనాది వర్గంబుఁ
‘బోవకు శైనేయ! పోవకు’ మనుచు । రావంబు క్రోశమాత్రము దూఱఁ జీర
నగుచు సారథికి సాత్యకి యిట్టులనియె: । “తగిలెఁగదే కూయి; ధార్తరాష్ట్రుండు
వేఁడి చూపక పోఁడు వెలయఁ బైఁబడక. । వాఁ డల్పబలములవచ్చిన వాఁడె!
ఒయ్యఁద్రోవను వీని నొక దెబ్బగొనక; । చయ్యనఁ బోరాదు సమితి ముమ్మరము.”
నా మందగతి వాఁడు నడపించుచుండ, । వామిపెట్టిన నేలు వచ్చిన యట్లు
మొనలు రాజులఁ జుట్టుముట్ట శైనేయుఁ । డనుపమ ధైర్యసహాయుఁడై నిల్చి
నరుకృపఁ గన్న బాణ త్రాణ విద్య । పరఁగింపఁ, దేరులఁ బైపైని హారులు
దంతులఁ గాల్వురఁ దమచావు [3]నోవుఁ । జింతింప కధిపుని శిక్షనెక్కియును

1. మైత్రుఁడై మాయనేమైఁ బోవఁబోవ. 2. శంఖ. 3. నోపు. (మూ).

బాటొండె పగులొండె భస్మమగుటొండె । మాటొండె దూటొండె కుమురగుటొండె
పడఁ బొండె వడ రొండె గ్రాలుట యొండె । దడ[1]యొండె వెడఁగొండె దనుయందుఁ గలిగి
జయము మోమెఱుఁగక చయ్యన పేఁగ । జయ [2]లైత్రి యొంటిని భయమింత లేక
కనుఁగవ మెఱ్ఱనై కినిసి రారాజు । శివి రాజు పలుగుల పిలుగులఁ బెట్టి
గొడుగు విల్లును జోడు గ్రుచ్చి వోనేయ, । నడుగు పిడుగున వాఁడు నప్పు యుఁదాల్చి(?)
ఫాలపట్టము బీట వాఱ వాలమ్ము । గీలింప శకుని యాక్షితిపసోదరులు
ఎడచొచ్చి పోరి యనేక మార్గములఁ । గడపట నాతనిఁ గాలేక పాఱి;
రట్టు నిలువక పాఱ నధిపుండు పాఱ । నెట్టన కాఁకతో శేషాశ్రితులు
తుటములు గట్టి దుందుభిశంఖపటహ । పటునోగ్రులగుచు నా కథకుఁ దాఁకినను
ద్విరదంబు లినూఱు తేరులునూఱు । హరులు మున్నూఱు భటఘటముల్ వేలు
మడియునంత రణంబు మాధవానుజుఁడు । కడిమి నాటించి యాఘట్టంబు గడచి
దుస్సహోఁ జూడఁ గడున్ విచారమునఁ । ... ... ... ... ...

## దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధమొనర్చి పాఱిపోవుట

... ... ... ... ... । గచ్చెకు యువరాజు గాలు ద్రవ్వుచును
అన్న తోడనిపిన యనుచరుల్ లక్ష । తన్ను సేవింప సాత్యకిఁ దాఁకి యప్పుడు
ఉరుతర శైలంబు నొడిసెల ఱాతి । కరణి భుజాశక్తి కడిమి నైవంగ
భటులు పిడుగులువోని బాణంబులేయఁ । జిటచిటఁ గోపించి శినివంశకర్త
భల్లాగ్రమునఁ గొండ బరిద్రెవ్వనేయ । నెల్లచో మిడుఁగురు లెగయ నక్షత్రములు
తిరిగి తమ్మునె తాఁక దృష్టులు చెదరి । కరి రథంబులు గూలి కౌరవభటులు
తెల్లగాళులు గొని దెరలినఁ, బోక । చిల్లకోలల దుస్ససేనుండు నతనిఁ
గప్పియు నతఁడు వక్షము గాడనేయ । నొప్పికిఁ బాఱె ద్రోణుని మాటు దూఱె.
అంత [3]నిత్తెఱఁగున నరి యరుగుటయు । నంత నొందిగురుండు వాని కిట్లనియె:
" యువరాజ, యెక్కడ నోడుఁగ వచ్చితివి? । తోవకి ద్రావలసెఁ గాఁ [4]దోఁక నీర్పుట్టె!
బలిమిఁ జేతులుచాచి పాంచాలివలువ । లొలిచినగతి గాదు యుద్ధంబు నేఁడు.
అంత చేసిన నీవు నని చూప లేవు; । వింతయే [5]తీపనివిఁ వె ప్రాణములు!

---

1. గొండె. 2. లైతి నొంటిని. 3. నివ్వెరగుట. 4. దోఁకనిర్పుట్టె. 5. వినవైతివని ప్రాణమగుట. (మూ)

ఒక్క సాత్యకికింత యొదిఁగితే నింక । నక్కిరీటి బకారి యడర నేమగుదో!
శరణని బ్రదుకుము శమనసూనునకు । మరలి సాత్యకినైన మఱితాఁకు వోయి."
అని యిట్లు గురుఁడాడ నాతండు లజ్జ । జనియించి వెండియు సాత్యకిఁ దాఁకె.
ఇట ద్రోణుఁ డమ్ముల నెత్తి కౌంతేయ । భటులప్రాణంబులు పారణసేయ
వీరకేతుండను విభుఁడు పాంచాల । వీరుఁ డగ్గురుఁ దాఁకి విలువిద్యనోడి
తలఁగిపో నుండినఁ, దమ్ములాతనికిఁ । గలవారు నలువు రక్కలశజుఁ దాఁకి
చిత్రకేతు సుధన్వ చిత్ర వర్ములును । జిత్రరథుండు నాజిని మృతిపొంద,
నంత ధృష్టద్యుమ్నుఁ డా బంధుమృతికిఁ । జింతిల్లి ద్రోణు మూర్ఛితునిఁగా నేసి
యసిఁ ద్రెవ్వ నేయుదునని తేరుడిగ్గి । వెస ద్రోణు తేరెక్కి విన్నాణమునను
సారథిఁ బడఁ దన్ను సమవేళఁ, దెలిసి । యారథికుఁడు భీతి యాత్మలో లేక
చేరిన లక్ష్యంబు చెండాడుపాటి । దారుణాస్త్రము లేయఁ, దన పూఁపుదప్పి
కుంభినికడకు మ్రోఁకులవెంట జారి । సంభృతగతి నిజస్యందనంబెక్కె.
వానిసారథిఁ జంపి వాలంపసోన । సేనాని నిగిడింపఁ జెదరి రథ్యములు
సారథిలేని ధృష్టద్యుమ్ను రథము । దూరాన కీడ్చెఁ బార్థులు తల్లడింప.
మఱి ద్రోణుఁ డాజిని మంటనై రిపుల । నుఱుమాడఁ జొచ్చెఁ బీనుఁగుపెంటగాఁగ.
ఒకచోట గురుఁడును నొకచోట నరుఁడు । నొకచోట సాత్యకియును నేపురేఁగి
చంపుచో నపుడు ప్రజాక్షయమయ్యె; । నింపేది ధృతరాష్ట్ర! యిది నీయుపేక్ష.
వినుమిట్లు ద్రోణుచే వేఁడి వాక్యములు । విని దుస్ససేనుఁడు వేవేగఁ బోయి
త్రిగర్త రథములు తను మూఁడువేలు । చేగ యేర్పడి కొల్వ శినివరుఁ దాఁకి
రథ చిత్రగతుల ధరాధూళి యెగయఁ । బ్రధనంబు లోకైక భయముగాఁ జేయ,
నక్కుగా రథికుల నామంత్రణముల । నుక్కడంచి శినీంద్రుఁ డుబ్బి వీక్షించి
దుశ్శాసనునిఁ బదితూపుల గ్రువ్వ, । నిశ్శంక నతఁడును నిష్ఠురాస్త్రముల
రథ రథ్య కేతుసారథి రథికులను । మథన సమూహంబు మలయ నేయుటయు,
మేలని యువరాజు మెచ్చి, సాత్యకియు । వాలిక తూపులవాన నాటినను,
సారథిఁబోనాడి చాపంబు విఱిగి । తేరికి మోసమై దేహంబు వ్రస్సి
యువరాజు మూర్ఛిల్లి యొరఁగిన, నతఁడు । పవనజు ప్రతినఁ జంపక కాచివిడిచె.
అంత సాత్యకిమీఁది యాత్రచాలించి । దంతిపురీశుండు తమ్ముని గొనుచు
గురుని కయ్యంబు గన్గొనవచ్చి యపుడు । పరఁగిన పాండవబలముప్పై నుఱికె

శరములేసినఁ ద్రెవ్వె జమిలి నేసఁగులు : ఖురపుటంబులు ద్రెవ్వెఁ గుందె గుజ్జములు ;
గుణములు దెగి వొందుకొనిరి విల్కాండ్రు : మణియుగ పాతిఁ దేర్లమలమట్రగొనియె;
నేల [1]రోహిణివోలె నెత్తురు వాఱె ; చాల లోఁదాఁకిరి సచివు లయ్యనికి.
ఈ భంగి రాజరాజేటున మెఱయ । భ్రూభంగముగ ధర్మపుత్రుఁడు గినిసి
ప్రతిదాఁకి యతని చాపము ద్రుంచినైన । నతఁడు నొండొకవింట నమ్ములు దొడిగి
ధర్మాత్మజుని ఫాలతలము భేదించి । కార్ముక కవచ భంగములు చేసినను
గదనైనఁ ద్రుంచెఁ జక్రమునైనఁ ద్రుంచె । నదలించి యసినైన నదియును ద్రుంచె.
ఇట్లు పార్థుఁడునైన నితఁడు ఖండింప । ముట్టడఁ గని భీమముఖ్యు లెక్కనను
ద్రోణుఁ డిందఱి నివ్వెఁ దోలిన మరలి । క్షోణీశుఁ డేఁగె సజ్జను పోరుచూడ.
అంత బృహత్క్షత్త్రుఁడను కేకయుండు । కౌంతేయ హితముగాఁ గలశజుఁ దాఁకి
బ్రహ్మాస్త్రమేసిన భయమేది యతఁడు । బ్రహ్మాయస్త్రంబున భయమార్పనేసె.
అతుల హాహాకార మానేనఁ జెలఁగ । శితశరంబుల వానిశిర మట్టఁ బాపె.
ధృతిఁ జేదిపతి యంత ధృష్టకేతుండుఁ । బతిమెచ్చ ద్రోణునిపైఁ దేరుపఱపి
సారథిఁదెగటార్చి చాపంబు దునుమ । దారుణశక్తి యాతఁడు ప్రయోగింప
నదియు వానిశరాగ్ని నణఁగిన నొక్క । గదవైచె; నదియు వ్రగ్గఁగ నాత్మలోన
పోకిరింతఁ జెలంగఁబోలు వీఁడనుచు । నేకాండమైన విల్లెత్తి గురుండు
మెఱుఁగునారసమున మెడ దూరనేయ । నొఱలుచునెగసివాఁడుర్విపైఁ గూలె.
వాని పుత్త్రుఁడు దాఁక వాని గురుండు । సేన లార్భటములు నేయ ఖండించె.
చొచ్చి జరాసంధ సుత సహదేవుఁ । డచ్చటఁ దాఁకి కయ్యము చాలఁజేయ
రమ్య కుండలములు రాయు తచ్ఛిరము । యామ్యబాణాగ్నికి నాహుతి చేసె.
దొరల ద్రోణుండల్లు దొరఁకొని చంపఁ । గరువలిపట్టి శంకాతంకమునను
( సేనానివంక వీక్షించి, " యాచార్యుఁ । బూని యాఁపకయున్నఁ బొందునెజయము!")
అనునంత క్షత్త్రవర్మాఖ్యుండు శ్వేతు । తనయుఁ 'డాతని నేనె తఱుముదు' ననుచు
దీమసంబున ద్రోణు తేరంతఁ గదిసి । హేమపుంఖములైన యిషువులఁ బొదివి
వింటికొప్పాకకోల విఱిచిన, గురుఁడు । కంటికప్పుడు కెంపుగదుర నయ్యమర
పగతు పౌరుషము సైఁపక నొండువింటఁ । దెగ నిండ సాయకత్రితయంబు దిగిచి
విడిచిన, నది డేగవిధి వాని శిరము । నడికొత్తి కొనిపోయె నరములతోడ.

1. రోగిణి. (మూ)

'బాణధారల చాయ పదను చూపెడిని । ద్రోణునకై చక్క ద్రోలు మీ రథము.
అదె కుమారులమూఁక, యదె రాజలోక, । మది గొని పరివేయుమి మాత్రిఁ పుసరుని.'
అని చెప్పి నిశ్శంక నరుదేరఁ దాఁకి । మును యువరాజు దుస్సహు సుదర్శనులు
విందానువిందు వివింశతి హస్త । బృందారకాఖ్యయుభీము లన్వారు
జననాథ, దుర్విమోచన క్రాథకర్ము । లను వార లాదిగా నందంద యేచి
జాతి వైరమునఁ బ్రచండ కాండములు । కీలితాఁగ నించి మహా భీమునిచే నవ్రుసు
పర్వి బృందారకాభయ క్రాథకర్ము । దుర్విమోచనులు మృత్యువుపాలఁ జనిరి;
విందానువిందులు వ్రీలిరి; మఱియు । నందు సుదర్శనుఁ డంతకుఁ జేరె.
చిక్కినవారలు చెదరి పాఱంగ । నిక్కాఁగ బెడితలవేసి భీముండు
రువ్వునఁ బిడుగువాఱుట ద్రోఁప గురుని । నవ్వునఁ గదియుచో నమ్ములఁ గ్రాఁగి
యుగ్రుఁడై భీము: "నోహో పోకుపోకు । నుగ్రహమున పోవఁ జూచెద విదువ.
నన్ను గెల్వక నీవు నరుఁడును బోలె । నున్నవి మాటల నుడివి పోయెదవా!
అట నిన్నుఁ బోనిచ్చి యతనిఁ బోనిచ్చి । యిట మ్రొక్కఁబడికినే యేనున్నవాఁడ!"
అనినఁ గోపాంధుఁడై యనిలజుఁ డనియె: । "నిను వేఁడుకొనుటయు నిజమె యర్జునుఁడు!
వూని దేవవ్యూహములు చొచ్చుచోట । మానుష వ్యూహంబు మఱి క్రీడి కెంత?
గురుఁడని యొకమ్రొక్కు గొమ్మన నతని । వరుస యెఱుంగక నాక్రుచ్చి." తనుచు
గద త్రిప్పి వైచినఁ గడఁగి యాచార్యుఁ । డొదిఁగిన నదివోయి యురు తేరుదాఁకి
మసిప్రోవు చేసి క్రమ్మఱ భీముకడకు । వెసఁబోయె; నతఁడును వేఁజొచ్చె నొడ్డు.
చొచ్చినభీము నీసుతు లడ్డగించి । వచ్చి చిచ్చారు దీవ్రపుఁ దూఁపులేసి
యిందేమి బ్రదికెడి నితఁడని తోఁప । నందడించిన, క్షాత్రసంపత్తి నతఁడు
గదగొని వ్రాఁచిన, గర్భముల్ గలఁగి । చెదరిరి; సైన్యంబు చెదరె నచ్చోంత.
ఉన్నతి గురుఁడంత నొక్క తేరెక్కి । మున్నాడి వెసఁబోయి మున్దర గట్ట
రువ్వఁజివ్వను గాడ్పు రువ్వ బాణములు । త్రవ్వితండములుగాఁ దఱిమి యేయఁగను
దన సాయకములెంత తానెంత యనుచు । ఘనుఁడంతఁ దన తేరు గదగొని డిగ్గి
వానలో వృషభంబు వచ్చున ట్లుంప । సోనలోఁ దలదూర్చి చొచ్చి యేతెంచి
... ... ... ... ... । ... ... ... ... ...
ద్రోణుఁ డప్పుడు మేనుతుడుచుక లేచి । ప్రాణాశచేఁ దన్ను భావించు కొనుచు
నొండొకరథమెక్కి యొడ్డువాఁకిటనె । యుండెఁ బాండవసేన లోత్తి రాకుండ.

## భీముఁడు ద్రోణాదిరథికుల నుత్తరించి యర్జునుఁ జేరఁబోవుట

అంత సారథి వచ్చి యటుఁ జేసి చూపఁ । బంతంబుతో నెక్కెఁ బావని మట్టి,
ఘోరాస్త్రతతి మహాఘోషంబు తెలుప । వారక వ్రేయుచు, వాఁడి వేఁడిమికి
భోజాధిపతులుఁ గాంభోజాధిపతులు । నాజాత గలిగిన యధిపులు మఱియు
సోమరులై ప్రక్కి సుడిపడి సురిగి । మోమోటమును జెడి మోడ్పడి మ్రొగ్గి
పంచులై పసదప్పి ప్రాల్మాలి పాఱి । కంచుమించై పాఱఁ, గడుసంభ్రమమునఁ
దెఱపిఁ గాంచి బకారి తేరు దోలించి । తెఱఁగొప్ప నర్జును తేరు దవ్వులను
దివ్యలాంఛనముచేఁ దెలిసి పెల్లార్చి, । సవ్యసాచి యెఱింగి చయ్యనఁ దిరిగి
యతనిఁ గాంచి చెలంగి హరియును దాను । వితత శంఖములొత్త, విని ధర్మరాజు
పావని జయము బీభత్సు క్షేమంబు । నావెంట నెఱిఁగి ధైర్యము దెచ్చుకొనియె. ”
అని చెప్ప భీతుఁడై యాంబికేయుండు : । “ మనకేటి జయమింక ! మారుతి చొచ్చె ;
శినివరుఁ డొకఁడు చొచ్చినఁ జొప్పువడఁడు. । తనయుఁడేమని చింతఁ దగిలెనో యిపుడు!
మొనలెంత వణఁకిరో మువ్వురి యనికి ! । వినవోప సంజయ, విడు కథ. ” యనిన
“ ద్రౌపది నాఁడట్టి తద్ద వాపోవ । నోపితి విది వినవోపవా భూప !
పరదుఃఖ నిజదుఃఖ పరిపాటియట్ల । సరిగదా శేషంబు సకలంబు వినుము. ” (?)
అని సంజయుఁడు చెప్పె : “ నట్లార్చు భీముఁ । గనుఁగొని యేతెంచి కర్ణుండు దాఁకి
భుజముల బహు బాణములు గ్రుచ్చి విల్లు । రజముగా నేసి సారథి మూర్ఛ పుచ్చ,
బామముడితో వాయుపుత్త్రుండు కర్ణు । విమల ఖడ్గము నైచి వింటికిఁ బఱపి
యొండువింట లలాట మురము బాహువులుఁ । గండలు గ్రమ్మ రక్తము చిమ్మనేయ
వాఁడంత పరశక్తి నైవ వాయుజుఁడు । మూఁడుతూపుల నది మొదలికి నఱికి
సేనకంబాకకోలఁ జించి వక్త్రమున । నేసె నమ్ములు రక్త మిల మడుఁగుగట్ట.
అంతఁ గర్ణుని ఘోరమగు నవ్వు నవ్వి । యింతటఁ దెగఁ జూతు నేను నిన్ననుచు
ధనువంతఁ ద్రుంచి యంతస సూతుఁ ద్రుంచి । యనిలజుఁ డతని రథ్యములఁ ద్రుంచినను
అలసి కర్ణుఁడు వాఱె ; నప్పుడా కర్ణు । బలమెంత చావదు పావనిచేత !
అట్టు కర్ణుఁడు వాఱి యాత్మజు రథము । నెట్టినఁ బఱతెంచి మేదినీవిభుఁడు

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట

గురుని నిట్లని దూఱెఁ : “ గూడునే ద్రోణ ! । చొర విడిచితి సేనచూరఁబో భీము.
శైనేయ పార్థులు చాలరే మొదల ! । నే నెట్లు రక్షింతు నింక సైంధవుని ?

చేకొని వార్ధి శోషించుట గాక । నీ కొకఁడెక్కుఁడే నిలిపెడ ననిన?
ఏము నాత్మకిఁ గోడ నీ యశకీర్తి । నీ మీఁద బ్రాలదే! నేరవు తెలియ;
మా భాగ్య మిట్లుండె మాటలింకేల । ఏమంచి నా కార్య మిటమీఁద?" ననిన
నాతఁడిట్లను: "నాకు నగఁగఁ జాదు । శోకించితిట్లుల దూఱెదు నన్ను?
భీమార్జునుల నడ్డపెట్టరానెనుచు । నే మున్న చెప్పనా! యెఱుఁగవు గదవు.
సైంధవుఁ గాపున్న పటువులు నీవు । బంధురగతి రక్షకులుము వీరలకు.
ఏను నిక్కఁడనునిక్కు హితవు నీకెఱుఁగు; । నానికి నలిపితి రాజులనెల్ల;
కావున నే నాను; గయ్యమచొప్పల । నీవున్న జయము మాకు నెమ్మిఁ గా." న్ననినఁ
దను దాని పుడిగొని ధార్తరాష్ట్రుండు । నకలి యేతెంచు-నో, మధ్యభాగమున
మును బోకఁ జేసునిమ్ముఁగఁ గ్రీడిఁ గూడఁ । జనరాక చిక్కిన చక్రరక్షకులు
నొగి యుధామన్యుండు నుత్తమౌజుండు । నగపడ నదలించి యతఁడు వోనీక
యనిసేసె." ననుటయు నాంబికేయుండు: । "వినిపింపు వారెట్లు వెడలిరయ్యాక?
నిరువురఁ గృతవర్మ యెట్లు వోనిచ్చె? । నరుఁగుట యెట్లు వారంతద?" న్ననిన
సూతజుఁడిట్లను: "క్షోణీశ, భోజుఁ । డాతెఱంగునఁ దమ్ము నాఁగిన వారు
సంకేతములు చెప్పి చయ్యన రెండు । వంకల నయ్యోద్ధ బ్రచ్చక వెడలి
క్రీడి వోరెడుచోటు కేతులక్ష్యమున । నోడక [1]యొత్తఁగి యయ్యోద్ధున కేఁగి
చించుక మఱియుఁ జొచ్చిరి క్రీడిరథము; । నించుక మున్నాఁడి యితఁడంతఁ గూడె.
కూడి మువ్వురు నట్లు ఘోరాజిసేయ । నోడక నృపుఁడందు నుత్తమౌజుని
విరథునిఁ జేసిన, వెస యుధామన్యు । వరరథారోహంబు వాఁడును జేసె.
ఇరువురుఁ గూడి యయ్యిభపురాధీశు । విరథు విగతచాపు వికృతుఁగా నేయఁ
గుపితుఁడై చాపంబుగొని వానిఁ దేసు । నృపుఁడు రెండుగ నైన నిలువక వారు
తేరులు విడనాడి దేవేంద్రతనయుఁ । జేరిరి; పతి శల్యుఁ జేరి తేరెక్కె.
ఆలోన రథముతో ననువొంది కర్ణుఁ । డాలంబునకు భీము నలుకమైఁ బిలువ
బరిగోల పోటుల భద్రేభమనఁగ । వెరవుగాఁ దిరిగి యవ్వీరుండు గదియ
వెడతూపులకు మిన్ను విరివిశీదనఁగఁ । గడు నుగ్రరణమయ్యెఁ గర్ణభీములకు.
నొగులు పతాకలు నొచ్చు రథ్యములుఁ । బగులు రథాంగముల్ పప్పగు విండ్లు

---

1. రొఁగి యయ్యోధుగున. (మూ)

తుమురగు గొడుగులుఁ దునియు వర్మములు । సమరభావము దెల్పె సరి నిరువురకు.
కర్ణసైన్యములంతఁ గవిసి సర్దెసల । దుర్ణివారుని భీముఁ దూపుల ముంపఁ
బ్రళయానిలము మేఘపటలంబు విప్పు । పోలువున నా వాయుపుత్త్రుండు విప్పి
కర్ణుని రథసూతు ఖండించి యార్వ । వర్ణింప నరదంబు వాఁడునై వాఁడు
హరియుగ గిరియుగ హస్తియుగముల । కరణి భీముఁడుఁ దానుఁ గలహించిరపుడు.
రథవాజు లపుడు నారాచపాతములఁ । బృథివిఁ గూలఁగ మేను బెండును గాఁగ
ననిఁ గర్ణుఁ గావంగ నధిపతి తలఁచి । యనుజుని దుర్జయుండనువాని ననుప
నేతెంచి వాఁడు నయ్యెడఁ జొచ్చి రణము । వాతూలతనయుతో వారక చేసె.
తేరుఁ దానును గడ తేఱునంతటికిఁ । దే రాయితము చేసి ధృతిఁ గర్ణుఁ డలిగి
యనిలజుఁ దాఁకి శౌర్యమును ధైర్యమును । ఘన[1]బలమును దెప్పఁగాఁ బోరిపోరి
జల్లన మెఱుపులుచల్లు మహోగ్ర । భల్లమేయఁగ నది పార్థివుఁ దాఁకి
మండుచు నటఁబోయి మహిఁగూడ, నొడలు । మండి మారుతి వానిమకుటంబు దున్మి
గదవైచి రథము భగ్నముసేయ, వాఁడు । పదచారియయ్యుఁ దప్పక యేయుచుండె.
అప్పుడాతనిదైన్య మధిపతి చూచి । యిప్పార్థివునిఁ దాఁకు మిటఁ బొమ్మటంచు
దుర్ముఖు ననుప వాతూలజుఁ దాఁక । ధర్మమూ నాకని తలఁకక వాఁడు
కర్ణున కడ్డమై కౌంతేయు విల్లు । చూర్ణంబుగాఁ జేసి సూతు నొప్పించి
పడగయు గొడుగును బడవేసి యార్వ । వడముడి బొమముడి వడినిడి కడిమి
నుత్తమాంగము కుమారోత్తముఁ బాయఁ । గ్రొత్త కార్ముకమెత్తి ఘోరాస్త్రమేసి
నగుచుఁ గర్ణుని నేయ నాఁకఁగా నిల్లు । తెగుదురే నృపులని దీనుఁడై వాఁడు
దుర్ముఖు రథమెక్కి ధూమాయమాన । కార్ముకుఁడై భీముఁ గప్పె నమ్ములను.
వినవయ్య వైచిత్రవీర్య, నీకార్య । మనువు దప్పెడు భంగి నందంద క్రుంగి
దుర్జయు దుర్ముఖుఁ దోలి యాభీము । నిర్జింపఁ దలఁచి యా నృపుఁడంతఁ బనిపె.
ఆరీతిఁ గర్ణుఁడేయఁగ భీముఁడతని । నారాచ వింశతి నాటె, నాటినను
లావేది కర్ణుండు లక్ష్యంబు చెదరి । భూవల్లభుని యాన పొడవడఁ బాఱి
సేనలలోనఁ జొచ్చినఁ, గుమారకులు । జానొప్ప విజయుండు జయుఁ డనువాఁడు
దుర్మద దుష్కర్మ దుష్ప్రహాఖ్యులును । గార్ముకంబులు మ్రోయ ఘను భీముఁ దాఁకి

1. ధైర్యమును. (మూ)

సమరంబు సేయ నచ్చటఁ 'గుమారకులు । రమణ నత్తురుగదా రాజాజ్ఞ' ననుచు
లీల నగ్నుల నావులించు బాణములు । కీలించి యేపురఁ గెడపె భీముండు.
అంతఁ గర్ణుఁడు బుద్ధి నధిపుమన్ననలు । చింతించి యింక నిల్వఁ జెల్లునె యనుచుఁ
బ్రాణంబులకుఁ దెగి పావనిఁ దాఁకి । క్షోణి కంపింప నాశుగములు ముంప,
నాశుగతనయుండు నతని విల్ద్రెంచి । యాశాంతములు ముట్ట నార్చి యక్కర్ణు
సూతహీనునిఁ జేయ, స్రుక్కక శక్తి । సూతసూతుఁడు మిన్ను సోఁకఁగ వైచె.
అదియు నాతఁడు ద్రుంప నన్యచాపమునఁ । బడ నేసి కవచంబు పజ్జియలు వాపి
శైశవంబున[1]రాలఁ జదిమిన మేను । లేశమాత్రము నెడలేకుండ గ్రుచ్చి
యతని విల్లును ద్రుంప నన్యచాపమున । నతఁడును నతని జోడఱువుళ్ళు చేసె.
ఇట్లు పోరాడి రనేకమార్గముల । బెట్టిదులిరువురు బెదరకేమియును ;
ఉదయాపరాద్రుల నొక్కట భాను । లొదవినో యన మేను[2]లొడెరక్తముల.
రథమంతఁ జెడినను రారాజుహితుఁడు । రథికుభీముని నదిరా నడ్డపెట్టు
[3]నంతటఁ, గర్ణుసైన్యములును డాయ । శ్రాంతిలేని బకారి శరములఁ బాయఁ
దలఁచుఁ గర్ణుఁడు పాఱఁ, దక్కునై రాజ । కులులు చచ్చుటకును గొండొక నిలుచు.

## భీముఁడు శత్రుంజయాది కురుకుమారుల మడియించుట

రాజంత నతని ఘోరము చూచి మఱియు । రాజకుమారుల రణ విచక్షణులఁ
జిత్ర చిత్రాయుధ చిత్రాక్ష చారు । చిత్ర విచిత్రులు చిత్రవర్మ్మండు
నట చిత్రకార్ముకుఁ డనువారి భీముఁ । బటుపరాక్రముఁ దాఁకఁ బంపువెట్టినను
సూత పతాకలు జోడు నశ్వములు । వాతవాఁడి యొసంగ వారును దాఁక,
వీరనాచారులు వీరనారాచ । ధారకక్ష్మాలు నని తలఁచి భీముండు
తెగ నిండ దూఁబఱ దిండిబాణములఁ । దిగిచి యేప్వర వంచెఁ దీఁట గొంతఱఁగ.
అంతఁ దేరొడఁగూడి యంగాధిరాజు । కౌంతేయుఁ దాఁకి యుగ్రపుసాహసమున
నాంజనేయుని నేయు హరివైరి వోలెఁ । బింజపింజ చొరంగ భీము నోనేసి
గద గద్దఁ జించుచుఁ గదనోగ్రుఁ డగుచుఁ । బదరి చూచుచు విల్లు భంజించి యార్వ
నావేఁడి కులుకక యలుక విల్గొనిన । పావనిఁ బొగడిరి బలములు సురలు.

---

1. జాలజడిసిన. 2. లొండె. 3. అంతఁ గర్ణునిసైన్యగములును. (మూ)

పావని యిట్లు చాపము వాల్పఁ జూచి । చావు గండము వచ్చె శరముల ననుచుఁ
గర్ణరక్షార్థమై కౌరవేశ్వరుఁడు । పక్షింప మనసుఁ దన్వాని వికర్ణు
శత్రుంజయుని శత్రుసహుని సుదేహుఁ । జిత్రబాహు ద్రుమసాఖ్యుఁ జేసూటిఁ బనుప
జూదంబునకు ధర్మసుతుఁడు ధనంబు । లాదట నొడ్డినట్లయ్యెఁ జూపఱకు.
మారక యిట్లు కుమార సప్తకము । భూరిసేనలు గొల్వఁ బొంకమైఁ గవిసి
గాడ్పునందనుఁ దాఁకఁ గర్ణుపైఁ జేయి । మోడ్పక నతఁడు ననేక బాణములఁ (?)
బఱపి సేనలు ద్రెవ్వఁ బతినొవ్వ వారు । నఱకె దామెనకట్లు నఱికిన యట్లు.
అపుడు కర్ణుఁడు: " నీమనమైతినే నేఁడు । నృపకుమారులు " కని నిట్టూర్పుతోడ
ముగియనిరణము భీమునితోడ మఱియు । జగములు బెదర నచ్చటఁ జేయుచుండ
నీసున బలములు నెక్కి పెల్లార్చి । యేసియు బండికల్లెత్తి వైచియును,
అమ్ముసలముల మహాశూల గదల । [1]చిమ్మియుఁ బాషాణవృష్టి ముంచియును,
గరికళేబర తురంగమ కళేబరము । లురుశక్తి వైచియు నఱికి పైఁబడియు
సూతాశ్వములఁ జంపఁ జూచియుఁ బెక్కు । రీతులఁ బెనఁగి రేఁకిఁ ద్రోవ లేక.
అనలాస్త్రముల భీముఁ డాతట్టు ముట్టి । యనువుగాఁ జించి కర్ణుని విల్లు ద్రుంచి
యది రయోల్కాపాతమని దోఁప వాని । పడకప్రరత్నంబు పడనేసి యార్చి
కలువదండ విధంబుగా నోలి నొసల । నిలిపె నారాచముల్ నెఱి నాలు రెండు.
సైనికులపుడు మాంసపు మిట్టులెక్కి । వానిఁజూచిరి పోటువదలి నిశ్చలత.
భీముఁడిట్లు జయంబు పెనుపఁ గర్ణుండు । హేమరేఖా చాపమొలమి సంధించి
ఘన భీమచాప భంగము రాము కరణి । నొనరించి యవ్వీరునురము నోనేసి
యనువొప్ప నతని యుగ్యముల పగ్గములు । దునిమి సూతుని నొంపఁ దురగంబులంత
సాగక నొగలతో నందడి గొనఁగ । ధీగతి నతఁడు పృథివికిని దాఁటి
తలవీడఁ బాఱి యుధామన్యు తేరి । బలునొగ లెక్కె భూపా! చిత్తగింపు.
అరద మీతెఱఁగైన ననిలజుఁడలుక । నురు కార్ముకమున కుద్యోగించుచోటఁ
గర్ణుఁడావిల్లును ఖండించి పడగ । చూర్ణంబు సేయ నాశూరుండు గొనక
శక్తి వైచిన, బాణశక్తి నాశక్తి । రక్తుఁడై పతిమూడ రాధేయుఁ డడఁచె.
పలకయు వాలును బట్టి బకారి । పలక ఖండించినఁ, బట్టెది యతఁడు

1. విమ్మయ్యు. (మూ)

నసిమైచి కర్ణు శరాసనం బణంచి । వెస వాని తేరికి వ్రేఁగొప్ప దాఁటి
దాయ, చిక్కితివని తడవుచోఁ గర్ణుఁ । డాయెడ నిలువ ధైర్యములేక తొలఁగి
పడగ కంబమునకుఁ బట్టుగా నిడిన । పొడవైన కేతకంబున మేను డాఁచి
వంచనగతి నుండ, వడిఁ బాఱుఁ బోలు । నంచుఁ బాఱినచొప్పు నటు గానకతఁడు
రథము క్రిందికిఁ బోవు రాధేయుఁ డనుచుఁ । బృథివికి దాఁటి యా భీముండు వెదక
దొంటి సేమంబునఁ దోఁచి కర్ణుండు । వింట నారసములు వేఁడిమిఁ దొడిగి
యన్నిరాయుధు భీము నరదంబు లేక । యున్న సాహసముతో నుగ్రుఁడై యేయ,
నలసియు నెన్నికి యా వృకోదరుఁడు । మలసి తేరికి దాఁట మఱి యున్నఁగాక
యా నరుశరముల నటు నిటు నడిన । సేనావ యవములచే నొడ్డి కొనుచు
నవి పుచ్చివైచుచు నంపంద పోవ, । నిపిడిన వాని నన్నిటిని పన్నుచును
ఖలు వాక్యములకంటెఁ గడువాఁడియైన । యలుగులు వాఁడు దేహమున నాటింప
నిర్వహింపఁగ రాక నీకుమారుఁడును । సర్వసేనలు చూడ జనమొప్పఁ బోయి
తేరికి రారాని దెసఁ బార్థపతిత । వారణ శవపర్వతములలో డాఁగె. (?)
డాఁగిన వాఁడు వెంటనె తేరు డిగ్గి । యేఁగి ధర్మవిచార మించుక లేక
యారీతి రణమున నలసిన భీము । దూఱొప్ప విరథుఁ గైదువులేనివానిఁ
జంప విచారించి జనని వాక్యమునఁ । జంపక కర్ణుండు సత్యసంధుండు
భీముఁడు సొచ్చిన వీనుఁగుప్రోవు । భూమీశ, వింటికొప్పునఁ బాయఁ ద్రోసి
యదిగొని హాని మహోజఠరంబు । మద మొప్పఁ బొడుచుచు మాటలిట్లాడె :

## కర్ణుఁడు భీమసేను నవమానించి నీచోక్తులు వల్కుటు

" వండిపెట్టఁగఁ బొమ్ము వాయుజ, నీకు । భండనంబేటికి బహుభోజనుఁడవు ?
మునివృత్తి వనవాసమున కీవు దగుదు ; । తనర నెన్నఁడును క్షాత్రమునకుఁ బడకు.
అనికి వచ్చినసేమి యనదల వెదకి । పెనఁగుము బలియురపైఁ ద్రోసిపోకు.
పోపొమ్ము బ్రదుకుము పొరిగొన నిన్ను ; । శ్రీపతి పార్థులఁ జేరుము పాఱి. "
అనునంతఁ గ్రీడికి హరి భీముఁ జూపి : । " వెనుకయట్టులు వీని విడిపింతు గాక
మనకుఁ దోడై వచ్చు మానైకధనుఁడు । తనకిట్టి దశ వచ్చె దైవాజ్ఞ నకట !
ఎప్పటినుండి వీరిట్లు పోరెదరో ! । గుప్పనోవు నితండు కురుసేన నొవ్వ. "
అని చెప్పఁ గ్రీడి ప్రత్యాలీఢ పాద । మొనర వెన్కకు విల్లు నొడలును ద్రిప్పి

పలువారనము లేయఁ బాఱెఁ గర్ణుండు । సెలలవిసినయట్లు చిమ్మె నెత్తురులు.
పౌనర మాంత్రికు మంత్రమున రావి విడిచి । చను బ్రహ్మరాక్షసు చందంబు దోఁపఁ
బాఱెను కర్ణు నశ్వత్థామ మఱియుఁ । దీఱఁజూడఁ దలంచి దివ్యాస్త్రమేయ
నద నెఱింగి పరార్థ మాచరించుటకు । నది ద్రౌణి గనుమాడె సర్థమార్గమున.
తునిమిన ద్రౌణి బాష్పుఁడు గాడఁ జూచి । యనలున కనలంబులైన బాణముల
వెన్నడించినఁ దేపవిడిచి వాఁడరిగి । పన్నిన కౌరవబలములోఁ డాఁగె.
అంత [1]నిష్క్రమానిసి యటలేచి భీముఁ । డంతనంత విశోకుఁ డరదంబు దెచ్చి
కూడినఁ దేరెక్కి కొఱఁత చిత్తమున । వాడుచు నరుఁజేర [2]వడివడి నడచె.
వారిమోగము చూచి నరశక్తియెక్కి । తేరు సాత్యకి యట్టిదెసకుఁ దోలించి
నెఱి నలంబుసుఁడను నృపుఁడు మార్కొనిన । నఱికి, వానిబలంబు నలుదెస పఱపి,
మదమున మఱియుఁ గుమారవర్గంబు । వదిసిన శరవృష్టి గప్పుచు నిగిడి,
యువరాజు విరథుఁగా నొనరించి వానిఁ । దవిలిపట్టఁ దలంపఁ, ద్రైగర్త్తులార్చి
వేయితేరులవారు వీరులు మఱియు । నాయెడ నెక్కొనఁ, నతఁడెల్లవారి
భూరి బాణంబులఁ బొదివియు నూఱు । తేరులు విఱిచి యుద్దిన పౌఁజు విప్పి
పోనడఁగించి విప్పున సూరసేన । సేన దాఁకిన నందుఁ జిక్కక యతఁడు
వీచులఁ గదలని వేదండ లీలఁ । ద్రోచుక చనిచని తోడ్తోన మఱియుఁ
గాళింగు లెక్కనఁ గలగుండు వెట్టి । యాలీల మఱియు సైన్యములెక్కఁ దఱిమి
జననాబ్ధి దాఁటిన సంయమివోలె । శినివరుఁ డొకదరిఁ జేరినట్లగుచు
నేద దేఱఁగఁ జూచి జిష్ణునకతని । యాదవేంద్రుఁడు చూపి యప్పుడిట్లనియె:
‘ గురు భోజ కాళింగ కురుకుమారకుల । గుణ[3]శక్తి గెలిచి నీ కూర్మి శిష్యుండు
ఇదె వచ్చె మనకింత హితకారి గలఁడె! । మది మెచ్చఁదగు.’ నన్న మఘవాత్మజుండు:
“ ఎక్కడి హితమది! యేఁ దన్ను బతికి । నక్కడ రక్షగా నర్థించి పెట్టి
వచ్చితిఁ; దనకు రావచ్చునే యిట్లు! । చెచ్చెఱ మఱచెనో సేనాని ప్రతిన!
ఈ మారుతియు వచ్చె, నింతకు నృపతి । యేమాయెనో! వీరి నిటఁ దాన తఱిమె.
వైరి వ్రాలఁడు ప్రొద్దు వ్రాలెడుఁ గాని; । పోరామి యీరీతిఁ బుట్టునే మనకు!
అదిగొక సాత్యకి నలసిన వానిఁ । బొదివెఁ గదే వీఁడు భూరిశ్రవుండు!

1. నిట్టడ. 2. వడముడి. 3. భక్తి. (మూ)

తానింత దయ్యెఁడు తనదప్పి దీఱఁ । గానఁ జీతండేమి గాఁగల వాఁడొ!
పూర్వవైరంబది పొమ్మన్నఁ బోదు । సర్వంబుఁ గూడె నీ సైంధవు వధకు."

### భూరిశ్రవుఁడు సాత్యకితో యుద్ధమొనర్చి మడియుట

అనునంత: "నిలు నిలు మటఁ బోకు పోకు । శినివర, నాచేతఁ జిక్కితి గాదె!
పాఱిన విడువఁ బాతాళలోకంబు (?) । దూఱిన విడువను ద్రుంతు వధింతు.
నిన్ను బుత్తెంచిన నృపునకు భయముఁ, । బన్ని నీకొఱఁగెడి భటునకుఁ బ్రియము,
నీరాక కలరిన నేఁటి కిరీటి । కౌరుల కలవుడు నవరింతు." ననుచు
వీరుఁడు దివ్యాస్త్ర వేదియు నైన । భూరిశ్రవుఁడు భూరిభుజుఁడు దాఁకినను
దననొప్పి సూత రథ్యంబుల నొప్పి । మనమునఁ బెట్టక మాధవానుజుఁడు:
"ఓరి! నీవా నాకు నొకరుమొనరింక! । చేరి యిట్లాడిన జిహ్వ కోసెదను.
మెత్తనఁ బోవేల? మీకెల్ల వేరు । విత్తు నన్నెఱుఁగవే వృష్ణులలోన!
పోరాడి బొందితోఁ బోదుగా." ననుచు । ఘోరాజి ఘోరభంగుల నమ్ములేయ,
భూరిశ్రవుండు నప్పుడు పెచ్చుపెరిగి । దారుణ మర్మవిదారణాస్త్రముల
నావీరుఁ బొదువ మహోదండ్వ యుద్ధ । మావేళఁ జెలఁగె భయంకరమగుచు.
'పడె గెల్చె నొకఁడు లోఁబడె గెల్చె' ననుచు । నెడనెడ జనవాక్య మిరువురఁ బ్రాఁకె.
వింటిపోక పతాకవిఱుగు రథ్యముల । గెంటె దిరికి నెఱిఁగింపరు వెనను.
నొచ్చుట పగులుట నొగులుట బాణ । ముచ్చిపోవుట గాన రుల్లంబునందు.
చచ్చియు బహుభంగిఁ జరియించి పడక । యచ్చలంబులు మానవని తోఁచెఁ బ్రజకు.
అంత నొండొరుల రథాశ్వ సారథుల । నింతలింతలు చేసి యిలకును దిగక
యేటులాటకుఁ జొచ్చి యిరువురు విండ్లు । మోటులై జోడులు మొదలికిఁ బోవ
గదల ముద్గర పరిఘంబులఁ బోరి । పదపడి కత్తులుఁబలకలుఁ గొనుచుఁ
బాద సంచారులై పలుముష్టిఁ బోరి । మేదిని నెత్తుట మేదిల్ల నిలిచి
యలవులఁ దీర్చుక యతి చిత్రగతులఁ । దలపడి వెండియుఁ దమ యాగ్రహముల
ద్రేయుచోఁ, బలకలు వేట్లచేఁ దెగిన । కాయువంచనఁ గన్నుగలిగి తప్పించును,
[1]దారొండొరులతోడఁ దాఁకి బిట్టెగసి । యూరువు చెమటలు నుగ్రులై యంతఁ
గత్తులు దునియుచో ఘన మల్లవిద్య । మొత్తులాటకుఁ జొచ్చి మోములు దాఁకి

1. దారలొండొంటితోఁ దాఁకిచిచ్చుసంగి. (మా)

యురములు భుజములు నొండొండ నొత్తి । కరచరణంబులఁ గ్రందుగాఁ జెనఁగ
హా! యురువ్యథఁ జూపి యర్జును బలికె : । "పరికింపు శిష్యుని [1]పాటు కిరీటి!
యలసినవానితో నలయని వాని । కలహంబు విషమంబు గణుతింపవేమి ?
ఒరి నొంటి మనకుఁ దోడ్కొనఁ జనఁ బచ్చోఁ । దగఁ గాన సాత్యకిఁ దలఁకొనఁ గాదె!"
యనినఁ బార్థుఁడు పల్కు : "నదియట్లతగును । వినుము నాకెడయాదు వినుతసంకటము.
ఎక్కటిఁ బోరుచో నిక్కలయరాదు । తక్కటి నృపుఁడై తాతయు సోమదత్తి !
ఇట్టిమన్కి నీయాజ్ఞ నేసెన." ననఁగ । నట్టిచో మేలుచేవ్రాయై సోమదత్తి
పృథివిపైఁ బైనేయఁ బెనఁగఁ బెనఁగ । శిథిలునిగాఁ ద్రోసి చేయొకకాల
నురమొకకాల నత్యుగ్రుఁడై త్రొక్కి । కరవాల[2]మును వాని కంఠలక్ష్యముగ
నాయెడఁ గరకంకణార్భులు మెఱయ । ద్రేయఁ జేయెత్తిన, వెన్నుండు మఱియు
ద్రేయు మేయుము పార్థ, వేయస్త్రమనిన । నాయన తాతశౌర్యము మెచ్చుకొనుచుఁ
బూఁచి గాఢాకృష్ట భూరి భల్లమున । నాచేయి దునిమె సైన్యములు శోకింప.
ఆరీతి జయసిద్ధి యాజిని వోవ । భూరిశ్రవుం డాత్మఁ బురపురఁ బొక్కి
'యక్కటా! [4] యిట్లేసినతఁ డర్జునుండు । తక్కిన వాఁడింత ధన్విగాఁ' డనుచు
మోమటు త్రిప్పి యమ్మునిపూర్వుఁ జూచి : । "యేమయ్య పాండవ, యిదినీకుఁదగున!
నీ మును మిడిగాదు నిన్నేమి చెనక ; । నీ మాడ్కి రణధర్మ నిధులును లేరు ;
ఎవ్వరు చెప్పినా రీబుద్ధి నీకు ? । అవ్విష్ణుఁడో? కాక యజుఁడో? హరుఁడో?
ఏమఱిపాట నిక్లేయుదే ?" యనిన । "నోమహాత్మ! యధర్మ మొక్కింత సేయఁ ;
దనవాని కాజిలోఁ దగవు తోడ్పడుట. । నిను నుపేక్షించిన నీవారి దూఱు ;
మలసిన సాత్యకి నతిఘోరవేళ । నలకొని నొంచితి నీ కేటితగవు ?
అన్న! మీరందఱు నభిమన్యు నట్లు । మన్నిగొందురె ధర్మమార్గస్థులేని ?"
అనిన [5]నేయుత్తరం బతఁడీయకున్న । మనుజ నాయకులును మంత్రులు భటులు
దూఱిన నట్లు పార్థుఁడు వారిఁ బలికి । జాతినధృతి నంత సంబంధిఁ జూచి :
"యకట భూరిశ్రవ! యాజి నీకట్టి । వికృతి వాటిల్లనే వెడరాజనీతి ?
కౌరవ్యుఁ డీకర్మగతిఁ బోవుఁ గాక । [6]వీర, నీకొదవెడు వీరైక ముక్తి ;

---

1. పాటి. 2. మెత్తి కరకంఠలక్ష్యమున. 3. కృష్ణ. 4. యీారేటు అర్జునుడుగాని.
5. నిరుత్తరంబతఁ డియ్యకంత. 6. వీ రని కొవదని వీరైక యుక్తి. (మూ)

ఇంత నేఁజేసితి; నీవు నా ప్రతిన । చింతింపు నాకిట్లు సేయక పోదు."
అనిన సాత్యకి వీఁడి యడఁచుచున్న నేల । ఘనబాహువులు కయ్యి గావించి యందుఁ
బ్రాయోపవేశంబు పాటించి శాంతి । నాయతప్రాణుఁడై యుక్తిఁ గూర్చుండ,
సాత్యకి లేచి శస్త్రము సంతరించి । సత్కీర్తి నతఁడు జావఁ జేయుటను
ఘన కృపాశ్వత్థామ కర్ణులు మాన్ప । వినక భూరిశ్రవు వెసఁ ద్రెవ్వఁ జేసె.
వ్రేసి వారించిన వీరులఁ జూచి । "నానాహవమున నన్యాయ మెక్కడిది?
కర్ణ కృపాది రక్షకులుండఁ గాదె । వర్ణింప నే వీని వధియించి నాఁడ.
ఒంటిమై నలయుక నుండఁ బ్రాణములు । గొంటు మెచ్చభిమన్యుఁ గుత్తుకఁ దఱుగను?
తారువట్టిన నీతి తనకును గలిగె; । వారింపఁ బనియేమి వచ్చె నాపగయు."
ననియె నంత ననంతమైన సద్గతికిఁ । జనియె దివ్యులు చూడ సౌమదత్తియును.
ఇంత వైరము వీరి కెట్టాయె ననినఁ । గొంత చెప్పెద విను కురురాజ, తొల్లి

## సాత్యకి పరాభవ కారణము

దేవకుండను రాజు దేవకీ దేవి । కావల వీర స్వయంవరోత్సవము
సేయుచో, నచటికి శిని వీసి తాను । యాయత యదువంశ్యుఁ డరిగి గర్వమున
రాజుల నోడిసి యా రాజాస్యఁ గొనుచు । రాజమార్గంబున రాఁ, జూడలేక
భూరిశ్రవుని తండ్రి భువిసోమదత్తుఁ । డా రథికునిఁ దాఁకి యాలంబు సేయ
[1]వీరులు మదినొచ్చి విరథులై వ్రాలి । ధారుణి నిరువురుఁ దలపట్లు పట్టి,
శిని సోమదత్తు నిర్జించి మూర్ఛపునిఁ । గొన కొప్పువట్టి కాలూఁన నీక యీడ్చి
తన్నియుఁ జంపక దయవుట్టి విడువఁ । దన్నుఁ వడ్డ యతండు తడయక పోయి
హరునకుఁ దపము సేయఁగఁ బెద్దకాల । మరిగె; మింటికి శిని యరిగె నాలోన.
ఆతని సుతుఁడును నంతటఁ జావ । భూతేశుఁ డంతలోఁ బొడచూపి కృపను
'ఓసోమదత్త, నీకుదయించు సుతుఁడు । చేను (?) వానికి నొప్పి శిని మనుమనికి.
పొమ్ము నీ' వని చెప్పి పోవుట వీరి । కిమ్మాడ్కి రణమయ్యె నిట మీఁద వినుము.
భూరిశ్రవుండట్లు పొలిసినఁ గ్రీడి । తేరు సైంధవునకై తిరిగింపఁ జేసి

1. వీరికి(మూ).

## కర్ణుఁడు సాత్యకితో యుద్ధముచేసి యోడిపోవుట

వెనుక వీక్షింపుచో విను కర్ణుఁడపుడు । శినివరుతో నాజి సేయుచున్నాఁడు.
తమ జోదు వడిఁ గ్రోధమునఁ గర్ణుండు । శ్రమము దీఱిన నుబ్బు సాత్యకి పెనఁగ
నయ్యాజి ఘనమయ్యె; నంత సాత్యకికిఁ । జయ్యన రణమబ్బె జననాథ, వినుము.
ఇట్టున్న నాఁ డాజి కేఁగుచో నెదుర । నెట్టన హరియిట్లు నిజసూతుఁ బలికె:
"ఒక సన్న శంఖ మే నొత్తెదఁ గాని । సకల యత్నపుఁ దేరు సారథి, తెమ్ము.
ఎచ్చట నెవ్వని కిమ్ము డెప్పరము । వచ్చునో నేఁటికి వలయు నిన్నియును."
అనివచ్చి పాంచజన్యము హరియొత్తఁ । గొనివచ్చి కాంచె నక్కుశలుండు తేరు.
తెచ్చి కాంచిన మెచ్చి దేవకీతనయుఁ । డిచ్చఁ బుత్తెంచె [1]శినీంద్రున కదియు.
ఇట్టి సాత్యకిఁ జూచి యింద్రనందనుఁడు । నెట్టన శౌరితో: "నీ వింక రథము
బలువిడి రాధేయుపైఁ బోవనిమ్ము । చలము రెట్టింపంగ సాత్యకితోడ
నలుకఁ బోరాడెడి నంగ రా." జనిన । జలజాక్షుఁ డతనికి సాత్యకే చాలుఁ;
బోనిత్తు రథమని పూఁపున్నై నడవ । శైనేయుఁ డిటఁ దేరు చదిపి రాధేయుఁ
బఱపినఁ గౌరవబలము పెక్కండ్రు । తెఱపియీ కప్పిరుఁ దేల్చి రస్త్రములు.
... ... ... ... ... । ... ... ... ... ...
అప్పుడు హరి రథంబగుట తద్రథము । ... ... ... ... ...
ప్రొద్దు పోకకు యుద్ధభూమి కేతేర । నద్దారకుండు సాత్యకిఁ గదియించి
హరి ఖురంబులు మ్రోయ హరి తేరు గొనుచు । హరిఁ జేరె ననుటయు నాంబికేయుండు:
"ఎందు సంజయ, వినమిట్టి చోద్యములు; । కుందు లేదనరాదె కుంతి సూనులకు.
అనిఁ గ్రీడి నింక సాత్యకి గూడె నెట్లు । మును గూడి నట్టి భీముఁడు చేసె?" ననఁగ
నా సూతజుఁడు పల్కె: "నట్లు కర్ణుండు । వాసిపోఁ బలికి పోవఁగ భీముఁడేఁగి
బీభత్సు రథమెక్కి పెద్దయుఁ బ్రొద్దు । భ్రూభంగమున మాట పూన్పక యుండి
తగఁ బార్థు మఱిపల్కెఁ: "దమ్ముఁడా! నాకు । వగవవు మీలోనివాఁడనా యేను!
చిక్కినచో నన్నుఁ జిన్నఁబో నాడె । నక్కర్ణుఁ డేఁ బోయి యతనిపైఁ బడుదుఁ;
జత్తుఁ జంపుదు వాని సాగనీ." ననినఁ । జిత్తంబులోఁ గుంది జిష్ణుఁ డిట్లనియె:

1. శైనేంద్రున. (మూ)

“ అన్న, నా చెవి సోఁక నాడె నిన్నతఁడు; । నన్ను నాడుటగాని నలి నిన్నుఁ గాదు;
సైరింపు మది నే విచారించుకొందు ; । నీరసాత్ముఁడు వాఁడు నిన్నాడువాఁడె!”
అని క్రీడి కర్ణున కభిముఖం బేఁగి । “ ఓరరి యీముని నేల వెడమాట లాడితివి ?
తతనికి నీకు లేదా యంతరంబు? । అతఁడు నిన్నాడెనే యందంద యెఱుఁగ?
ఇప్పుడు గదర శిరస్త్రుండు తక్కెను! । ఎప్పుడు గలగర్వ మేటికి నీకు;
ఎడపక గెలుచు వారెల్ల నీయట్లు । ... ... ... ... ...
... ... ... ... ... । ఏపాటు పడుదువో యెఱుఁగు నాచేత!”
అని తేరు వానిపై నతఁడు తోలింప । ఘన రథంబులమున్న కర్ణుండు పఱచి
నిలిచి బిట్టేయుచో నీ సేనలెల్లఁ । గెలఁకుల నిగిడి కలఁచి చేయఁగను (?) ,
ఆ తీవ్రరణము దేవాసుర రణము । తానైనె నిరుపమో, నలమరి నరుఁడు
శైనేయ వాయుజ సహితుఁడై వారి । దానేయుఁ బ్రుతు నితనయుండు గదిసి
కర్ణునిఁ బలికె: “ నాకర్ణింపు కర్ణ ! । యర్జునంబున వాఁడె యుద్యుఁడు జాతె ;
నించుక *నిలువు నాకిది నీవరంబు । పెంచిక్కైఁ గాలెను బీభత్సుఁ డింక ;
ఇతనికై మఱి చత్తు రితరపాండవులు ; । క్షితి నాకు నీవ యిచ్చిన వాఁడ నగుదు;
శల్యుండు నేను నశ్వత్థామ కృపుఁడు । తుల్య తేజోనిధి దుశ్శాసనుండు
నీకుఁ దోడగుదుము నిక్కువం. ” బనిన, । ఆకర్ణుఁ: “ డయ్య, సేనల్ల నెల్పెదను;
భీముచే నోడలెల్లఁ బిండయ్యె నైన । నేమాయె మాన సహితుఁడనై నిలుతు.
నీవఁట పంతువు నేఁడంత నన్ను । లావున జలము నేలా డాఁపనేర్తు? ”
నని సర్వసేనల నర్జునుమిాఁద । మొనకట్టఁ జేసి యమూర్ఖచిత్తుఁడు
శల్యాది భటులతో సన్నద్ధుఁడైనఁ । గల్యాణవిధి నాజి కైకొని నరుఁడు
చిత్ర విచిత్ర విశేష బాణములఁ । జిత్రభాను కృశాను చేష్ట గానేసి,
యానేసఁ బడిన రథావయవములు, । గీసిన ట్లొరగిన కేతుదండములు,
జబ్బుగాఁ దొఱగిన చాపదండములు, । గుజ్జైనగూడైన కుంజరాంగములు,
నట్టలై తునిసిన యశ్వదేహములుఁ । దెట్టువచేసి నద్దెస రక్తనదికి.
చేసి యంతటఁ గర్ణ శితబాణ నవతి, । నా సుయోధను గిట్టి యతులాస్త్రవృష్టి,
మద్రాధిపతిఁ గూడి మార్గణద్విశతి, । నా ద్రౌణి కుఱికి శితాశుగత్రిశతి,
యువరాజు మాఱ్కొని యురుతర స్థితిని । దవిలి క్రోధింప నంతట విచ్చిపోక

---

* ‘ అర్జునాదుల ’ అనుకర్మ అధ్యాహార్యము.

యరుణు గ్రుంకించెడి యూస నందఱును । బహుశాస్త్ర కోటులు పఱుపఁ, గిరీటి
యొకరిన పన వాసినొక్కటఁ బెక్కు । తునియలు సేయుచుఁ ద్రోచుక నడవ
సైంధవుంకును వారిసందుల వచ్చి । గంధకాళిమ నేయఁ గాంచి యన్నరుఁడు
కర్ణాదు లడ్డంబుగావున వానిఁ । జూర్ణంబుగా నేయఁ జొప్పడ [1]కలిగి

## కర్ణార్జునుల ద్వంద్వ యుద్ధము

శైనేయ వాయుజ సహితుఁడై కర్ణు । నోనేయ వాఁడును [2]నొప్పికి నోర్చి
వెడఁగులై ప్రేఁగైన వేఁడి నారసము । లడరి మువ్వురి [3]మొదలంట నేయుచును
నిలిపిన, నా నాయకులు నంతఁదెలిసి । లలి వాని రథము నల్లన నాటనేయ
నిట్టుగాదని క్రీడి యేనూటఁ గర్ణు । ముట్టించి విలుఁద్రుంప మూర్ఛిల్లి వాఁడు
నంతలోపలఁ దేఱి యన్యచాపమునఁ । గొంత యేయఁగఁ గ్రీడి కోపించి మఱియు,
వాని ప్రాణము ద్రోవ వడిగలతూపు । భూనభోంతరములు పూనయ నేయుటయు,
నది ద్రౌణి దునిమె నయ్యర్ధచంద్రమునఁ; । బొదివెఁ గర్ణుఁడు నస్త్రముల మఱినరుని.
నరుఁడంతఁ బనికి విఘ్నము పుట్టుననుచు । మరణాంతధీరుఁడై (?) వకార్పి ఘోషింప
రాధేయు వివిధ నారాచ పాతమున । బాధింప, నెడసాచ్చి పైపై బలంబు
పవనజు శైనేయుఁ బార్థు బిట్టేయఁ । దవిలి పార్థుఁడు విప్పి తనపేరువాఁడి
యలుగుల వఱ్ఱుగాసం గాధి రాజు । నలయించి విరథుఁ జేయఁగ ద్రౌణి యరిగి
తేరికిఁ గర్ణురాఁ దివ్చుచుక ఘోర । నారాచములఁ బార్థు నాటు శల్యుండు
వృషసేన కృపులును వెంబడి నేయ । నిషుపరంపరఁ ద్రెవ్వ నితఁడు నేయుచును
దొరలెంత వెనుకకుఁ ద్రోచినఁ బోని । పురదారి సైంధవుఁ బొదువఁ జూచినను,
అవనీశు పనుపున నఖిలసైన్యములు । వివిధ హేతివ్రాత విషములై గవిసి
వివ్వచ్చు రక్తముల్ వెడలనేయుటయు । నొవ్వియొన్నక వారి నోనేసి తఱిమి
తెఱపి సైంధవుఁ గాంచి దివ్యబాణంబు । పఱపి వానిపతాక పార్థుండు దునుము
వాఁడు నర్జును శౌరి హాజులఁ బడగ । వేఁడి నారసముల వ్రేఁగుగా గ్రుచ్చి
తోడిఁబడుచున్నచో దొరలు కర్ణాదు । లెడ చొచ్చి కాచి రనేకభంగులను.
అట్టుగా సైంధవు హరులును నొచ్చెఁ । దిట్టినగతి సారథియు భస్మమయ్యె.

1. కలిగి. 2. నొప్పికనోర్చె. 3. నెడనాటు. (మూ)

పాండవుఁ డావేళ బాణంబు వాతిఁ । గండవాటి నరాతిఁ గానమి నలిగి
వెస నాకసంబున కిరుల దిక్కు । బిరుసు పెట్టని దిక్కు బిట్టు చూచినను,
హరి నరుపాలిటి పూర్ణదైవంబు । నరుని నొయ్యనఁ బల్కె : “ నర, యిట్లుగాదు
చలము సత్యము నీకెఁ జాలు ; సైన్యముల । గెలుచుటే చొప్పు తాఁకెడి దింతలేమ.
ఆ తిమిరారి మాయాతిమిరమున । జాతిగాఁ గప్పెను సంజ దీపింప.
అప్పుడా ర్తురు యోధు లసిపట్టు మఱచి । చప్పుట లిడుదురు సత్యంబు మఱల.
సైంధవు నత్తఱిఁ జంపుము ; లోకి । బాంధవు [1]మఱి చూపఁ బరుఁడేఁప్పుఁ గాక. ”
అనిన నాగతిఁగాచి యరిఁ బ్రమాధరామిఁ । దన శౌర్యహాసి కాతఁడను పొక్కుచును
జింతింప, శౌరియు శీఘ్రమే యట్టి । సంకల్పంబాదరించి మాయ యొంపినను
అదివోయి యావేళ నస్తమయంబు । గదిమినట్లుగ భానుఁ గప్పెఁ ; గప్పుటయు
నంధకారముఁ బోల నొదల మొత్తి । సింధురా జార్పులు సేనచే వినుచుఁ
జల్లగాలికి లేచు సర్పంబు వోలె । నెల్లదిక్కులు చూడ నింతలో శౌరి
తేరిపై నిలుచున్న దేవేంద్రజునకు । వీరుని సైంధవు వ్రేలఁ జూపుచును

## అర్జునుఁడు సైంధవు తల దునుముట

“ వేయుమేయుము పార్థ, యిదె వైరిశిరము । పాయక యున్నది పడమర దిరిగి ;
ద్రోణి యుద్ధమువచ్చుఁ దడసిన. ” ననిన । నేణాంకధరుఁ గ్రీడి యిచ్చలోఁ దలఁచి
యాశీవిషము వోలె నతిభీమమైన । పాశుపతాస్త్రంబు పదరక తిగిచి
గంధ మాల్యంబులు గానరాఁ దొడిగి । సైంధవు కుత్తుక చక్కఁ జూచుచును
విడిచిన నది వేగ విధముగ నెగసి । యుడువీధిఁ గోటి సూర్యులవోలె నగుచు
నరుదెంచి వ్రాలి నీ యల్లుని శిరము । హరియించెఁ బతిచూడ నశ్రమలీల.
హరియించి మింటికి నది పాఱవైచి । శిరము క్రమ్మఱ వచ్చె సవ్యసాచికిని.
అంత మాయ హరించి హరి సూర్యుఁ జూప । నంతంత మనసేన లాజికిఁ గడఁగె.
మాయ యిట్లు హరించి మఱఁదితో శౌరి : । “యేయుమేయుము తల యిలఁబడనీక ;
యంబకంబుల నిల్పు మంబరవీధి ; । శంబర రిపురూప, సత్య మీ క్రియకుఁ
గథగల. ” దని చెప్పఁ గథయును వినుచు । రథికులు దేగి యేయ రణము సేయుచును

---

1. హరి. (మూ)

దలపడనీక శస్త్రముల నొడ్డుచును । జెలువొందె నవధాన సిద్ధుఁడై నరుఁడు.
ఏమని కథచెప్పె నట శౌరి యనిన । భూమి సైంధవుతండ్రి పూర్వకాలమున
సింధురాజ్యంబు రక్షింపుచు నుండి । యంధకారిఁ దపంబునందు మెప్పించి
పట్టిగా నీతనిఁ బడసెఁ బెంపెసఁగ. । అట్టిచో నృపుఁబల్కె నాకాశవాణి:
"వినుము వృద్ధక్షత్ర, వీనిమస్తకము । తునుము నేమరియుండ దురములో వైరి;
ప్రతికార మేమైనఁ బాటింపు." మనిన । నతఁడును బుత్రమోహమునఁ జింతించి
'యిల వీనితల నెవ్వఁ డెవ్వండు వైచుఁ । దల వ్రక్కలై వాఁడు ధరఁ ద్రెళ్ళుఁ గాక'
యని తపోబలమున నాడి రాజ్యమునఁ । దనయు యౌవనవేళఁ దగఁ బ్రతిష్ఠించి
చని యా శమంతపంచకమున నర్థి । నొనరించుచున్నవాఁ డుగ్రతపంబు.
పాశుపతాస్త్రంబు పడపడి తొడిగి । యీ శిరంబటికి నీవు వోనేసి
వాని యూరువుమీఁద వైపించు మిపుడు । దీని ధారుణిఁ ద్రోచి త్రెళ్ళు వాఁ."డనిన
నాడింపఁ గిలుకూపాశీయట్లు । క్రీడి యాయత్నంబు క్రీడఁ జేసినను
ఖండేందుధరుతూపు గగన మార్గమునఁ । గాండపరంపరాకారమై నిగిడి
తలగొని పోయి వృద్ధక్షత్రు నూరు । తలమున వైవ నాతఁడు కన్ను తెఱచి,
హా పుత్రకా! యని యది ధాత్రిఁ । ద్రోచి యా పజ్జ తలవ్రక్కలై తాను గెడసె.
అప్పుడు గొనియాడి రమరులు పార్థు । ముప్పులకలు మేన మొలిచె శౌరికిని.
శినిపతి భీములు సింహనాదముల । నొనరించి రప్పుడు నొచ్చె నీప్రజయు.
ఉపకరించిన తూపు నుపసంహరించి । రిపులఁ దోలె నరుండు [1]లేఖులు పొగడ.
తల గూలునందాఁక ధాత్రిఁ దాఁబడక । తులువమొండెము నుండె దుక్కుదుక్కనుచు;
నీవుత్రు లేడ్చిరి నేల గ్రక్కదల; । నా పాండవుల నేన లార్చె నవ్వలను.
పగతు రిట్లుప్పొంగఁ బతులు శోకింపఁ । దగవుపట్టు దలంచి ద్రోణియుఁ గృపుఁడు
హరుని కంఠ విషాగ్ని యతని నేత్రాగ్ని । ధరఁ బర్వెననఁగ నిద్దఱుఁ బార్థుఁ దాఁకి
'కౌంతేయాప్చిన నోరఁ గు' య్యను మాట । కౌంతేయ భటులకుఁ గలుగ నేసినను,
హరి నొచ్చె తానొచ్చె హరులు నొచ్చియును । నరుఁడట్టి యంపవానకు నోసరిలక
దిక్పాలురిచ్చిన దివ్యబాణములు । వాక్పుష్పములఁ బూజ వాటించి తొడిగి
యేసినఁ బ్రతిబాణ [2]మెక్కక ద్రోణి । యొనరించెఁ; గృపుండు నొక్కింత నిలిచె.
నిలిచి మంత్రంబులు నేర్పుమై నొడువ । నిలువక యది మంట నెఱయ నేతెంచి

1. లేఖలు గడవ. 2. మెక్కడ. (మూ)

కృపుఁ ద్రోచి యాతఁ డెక్కిన తేరు గాల్చ । నృప, ఘోరమూర్ఛ మునింగె సజ్జోదు.
చిక్కిన యోధులు చిక్కులై పఱవ । నక్కిరీటి మురారి యత్యాదరమున
నాలింగనము చేసి "యవుర గాండీవి! । మేలు! నీచేఁగాని మెదుగరు వీరు;
నేఁడెంత ప్రాలదు నీచేత బలము! । వాఁడి దెచ్చితిఁ బాండువంశంబునకును."
అనిన సిగ్గున మౌళి యతఁడంత వాంచి, । "నిను జేరినార మన్నిట నేమి కొఱంత?
నొగలు ద్రొక్కక శౌర్యనుత! నీవు గెలిచి । నొసఁగ నిచ్చితి కీర్తి నీ దాసులకును.
అట్టుండె నది యింక నధినాథు నునికి । యెట్టిదో తెలియుద మిటఁ ద్రిప్పు రథము."
అని చెప్పి శౌరిచే నట్లు చేయించి । ఘన శంఖరవములోఁ గదలి యర్జునుఁడు
శైనేయ భీములు చక్రరక్షకుల । తో నేఁగివచ్చినత్రోవనే పట్టి
వీసమంత ధరిత్రి ప్రీలక రథము । నా సీమ శవరాసు లడఁగొన నడవ,
గురుఁడు నిల్పిన ఫౌఁజు గురు కురుభటులు । దురమున వెఱచి గొందులు దూఱవచ్చి
యరుణాస్తమయ వేళ నల్లంతఁ దోఁప । నరదంబు డిగ్గి ప్రియంబుతో రాజు
నెల్లయోధులు గొల్వ నేతేర, ధరకు । నుల్లంఘనము చేసి యుభయ కృష్ణులును
ఎదురేఁగి మ్రొక్కిన నిరుగేల వారి । నుదురులు ధర్మసూనుండెత్తి దాల్చి
యొక్క కౌఁగిటఁ జేర్చి యురమున నొత్తి । పెక్కు దీవన లిచ్చి బీభత్సుతోడ
"ఘనుఁడ, చేసెత్తురు గాకుండ రిపుల । వనమాలి కృపఁ జంపి వచ్చితే మరలి!
యెదురులు చూచితి నే." నన్నఁ గ్రీడి: । "యది నీవు రిపులపై నలిగిన లావు;
నీకు రక్షైన శైనేయ వాయుజుల । నాకు రక్షకు నీవు నడపిన వాఁడి;
ద్రోణుని రానీక దొరలఁ గాల్గొలిపి । క్షోణీశ, రణమీవు చూపిన కరుణ."
అనునంత భీమ సాత్యకులు మ్రొక్కినను । జనపతి వారిని సరిఁ గౌఁగిలించి,
యొగి యుధామన్యుండు నుత్తమౌజుండు । మొగపడి మ్రొక్క నిమ్ముల నమ్మతించె.
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । అని ముని జనమేజయ క్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యామీఁద । నెప్పాటఁ గతచెల్లె నెఱిఁగింపు? మనిన
భానుకులాంభోధి పావన చంద్ర! । భాను కోటిసమాన భాభాసమాన!
కరుణా కటాక్ష వీక్షణ! దయాలోల! । సురరాజనుత! మహాసురరాజ హరణ!
ఇది సదాశివ భక్త హితగుణాసక్త । సదయ స్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత ద్రోణాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగఁ జతుర్థాశ్వాస మయ్యె.

# పంచమాశ్వాసము



శ్రీవైష్ణవాధార, స్థిర కృపాపూర, । పావనమునిసీమ, పరమాత్మ, రామ!
బ్రాఁతి నంబుధి గట్టి పతి దైత్యు గిట్టి । సీతఁదెచ్చిన సాహసీ! చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:
ఇట సుయోధనుఁ డాత్మ 'నింద్రజుఁ డింత । పటుశక్తి మెఱయునే పగ' కని పొగడి
పాండుసూనుల గెల్చు పగపింత యణఁగి । దండాధిపతి చూడఁ దడయక వచ్చి
యాతని కిట్లను: "సకట! నాకేటి । భూతల రాజ్యంబు! పోయెద నణఁగి;
ఒఱగె భీష్ముఁడు శయ్య నొకటికిఁ గాక; । నుఱిమె నేడక్షోహిణులు నేఁడు క్రీడి;
నమ్మిన సైంధవు నరున కీవలసెఁ; । దమ్ములు చచ్చిరి తగఁబోరి చాల.
పాండవకులమెల్లఁ బడ నీక పగపు । ఖండింప నేర్తునే కార్ముకాచార్య!
కయ్యంబు తలమోచి కర్ణుండు చేసె; । దయ్య మాతనికి సైంధవు నీక పోయె."
అనినఁ గోపమువచ్చి యాచార్యుఁడనియె: । "వినవె! మున్నను బార్థువిఱుపరాదంటి;

### పాంచాలురఁ జంపక కవచంబు విడువనని ద్రోణుఁడు ప్రతిజ్ఞసేయుట

శకుని వైచినయట్టి సారెలు నేఁటి । కకట! పార్థుశరంబులయ్యెఁ దప్పేమి?
పడఁతి ద్రౌపది నట్లు పఱచిన పాటు । కుడుపక విడుచునే కురురాజ! మిమ్ము.
అడవులఁ దిరిగి వారరుదేర ననికిఁ । దొడఁగితిఁ గాని యందున శాంతిలేదు.
విదురవాక్యములేల వృథపోవు రాజ! । మది నింత తలఁకకు మాటిమాటికిని.
కలన సైంధవు నేల గాచికోవైతి? । వలదంటిమే? పగవాఁడవె నీవు!
పక్కలు పాంచాల పాండవుల్ గాల్ప । నొక్కెడ నీవును నుడికింపఁ దగునె!
మీరు పోరాడుఁడు మీ నేర్చినట్లు; । వీర, నా ప్రతినయు విను మీక్షణంబ.
ఏను బాంచాలుర నెల్ల వధించి । గాని కత్తళ మూడ్వఁ గలవాఁడఁ గాను.
అరుణాస్తమయమయ్యెనని జాఱకుండ । మరలింపు మనసేన మఱియుఁ బోటునకు.
సమయక తప్పు పాంచాల [1]సేనలను । సమయింపఁ జెప్పు మశ్వత్థామ." కనుచు

---

1. సేమంబు.

నాజిసంభ్రమమున నాననం బలర । నాజాడ సకలసైన్యముఁ గూడఁ దిగిచి
[1]యనమున రణయత్నమతిఁ జూచుచుండ । నెపుఁ గర్ణు డగ్గఱి విభుఁ డంతఁ బలికెఁ:
" ముదుకఁ డాశ్వత్థామ మొన వన్నెఁ గాని । తుదిఁ జూజవిడిచెఁ బార్థునిఁ జూచిచూచి.
ఇట్టైన సైంధవు నింటనే పెట్టి । కట్టడతో రామె కలహింపఁ గర్ణ!
సేనలు నీకీర్తిఁ జెడవు; చేసైన । నా నరుంపను బోవు నది తప్పఁ గాని.
ఇట్టి నమ్మనిపోటు నీద్రోణుఁ గోనుచు । నెట్టాజి వోడఁగుడ మెఱిఁగింపు. '' మనినఁ
గొంకక వాఁడాడె: " గురుఁ జేమినేయు! । నింకిపో దేమిట నీ పాండవార్థి.
ఇచ్చోట నాటమై యిఁతఁమంకకున్నఁ । జొచ్చు పాండవసేనఁ [2]జుఱువుచ్చు నపుడు.
కావున గురు నాఁ గడచకునోప్ప । దైవమే చంపె సైంధవు నేమరించి. ''
అనునంత వాఁడైన్యములున్న గపియు । మనసైన్యములు ద్రోణుమాలునఁగవియ
ఘోర రణంబయ్యె ఘోటక సుభట । వారణ రథ ధూళి పర్వె నవ్వేళ.
ఆధూళి ఖడ్గధారాహత భగ్న । యోధాంగ రక్త పయోధార నణఁగె.
అస్త్రపంజరముల నంధకారంబు । నిస్త్రాణమై తోఁచె నిజమైన యురులు.
అందు దుర్యోధనుం డాదికొన్నట్లు । డెందంబునందుఁ గడింది యా కాంక్షఁ
బాకశాసను బోలె బలమర్దనంబు । చేకొని సేయుచు జిష్ణునిఁ బదిట
ననిలజుఁ బండ్రెంట నధిపు నేనింట । శినివరు వింశతి సేనాని నవతిఁ
గవల నాఱింట శిఖండిఁ దొమ్మిదిటఁ । దోవకి సాత్యకి మూఁట ద్రుపదు నేడింట
ద్రౌపదేయుల ఘటోత్కచ కేకయులను । నూపింప మఱియు వీరుల నట్లు నాటి
మెలఁగఁ జొచ్చిన, నుక్కుమిగిలి ధర్మజుఁడు । తలపడి వాని ప్రతాపంబు మాపి
ముదురు వాలమ్ముల మూర్ఛిల్ల నేయ । నదలించి ద్రోణుఁ డయ్యమనూతిఁ దాఁకి
తేరేయునంతలోఁ దెలిసి రారాజు । దారుణగతి ధర్మతనయు నేయఁగను
అక్కడి సైనేయుఁ డతనికై యెక్క । నిక్కడి సేనలు నితనికై యెక్క
సంకులరణమయ్యెఁ జాపశింజినుల । టంకృతిఁ గమలజాండము తీండ్రవెట్ట.
కలశజుఁ డపుడు కేకయ పంచకంబు । నలుకమైఁ జెండాడి యంతటఁ బోక
ద్రుపదజు కొడుకులఁ ద్రుంచి తూటాడె. । నపుడు ద్రోణుని శిబియనురాజు తాఁకి
చాప సారథి రథ్యాశ్వములతోఁ గూడ । నాపద్ధనంబయ్యె నతని వింటికిని.

1. ఆనయ్య. 2. నురపుచ్చు. (మూ)

ఒక్కచోఁ గర్ణవాయుజులకు రణము । నెక్కొన్నఁ గర్ణుఁ డానృపుని కోల్తలను
... ... ... ... ... । ... ... ... ... ...
పడిరి దుష్కర్ణదుష్ప్రవాహులను వారు । ... ... ... ... ...
ఉన్నవారిద్దఱు నొక తెర్వు గాక । క్రన్నన పాఱిరి కన్న తావులకు.
కరము భీకరముగాఁ గరువలి సుతుఁడు । తెఱఁగొప్పఁ దనసేన దిక్కుచూచవుడు
రక్తాబ్జములకీతి రౌద్రవిస్ఫూర్తి । యుక్త క్రమంబునై యొనరఁ గన్నులకుఁ
దరమిడి ధర్మనందను దిక్కు చూచి । కరములు ఫాలభాగమునఁ జేర్చుటయుఁ
బ్రళయ కాలమునాఁటి భర్గుండు వోలె । నెలకొన్నభీముని నిజమూర్తి చూచి
ధర్మసుతుండును దనరంగ ద్రుపదుఁ । డర్మిలిఁ గవలు విరాటుఁ డాదిగను
సొరిది నాతని దిక్కు చూడ శంకించి । తిరుగు మోముల వినుతించి రందఱును.
సొలవక శైనేయ సోమదత్తులకుఁ । దలపాటు గలుగ సాత్యకిఁ జూచి యతఁడు:
" [1]బోయ చాయ విశంక భూరిశ్రవసుని । దాయ, యేసితి వెందుఁ దాఁగెదు పోయి ?
బలియిత్తుని "న్నని పలికియు నతని । బలుతూపులకుఁ గాక పాఱెఁ; బాఱినను
సాత్యకి కలిగి యశ్వత్థామ వచ్చి । మృత్యుజిహ్వలఁ బోలు [2]మెఱుఁగుటమ్ములను
దడవిల్లు గొని యేయఁ [3]దత్కాల లబ్ధ । బలములతో హిడింబాసూతి చొచ్చి
ఘోరశక్తుల నాఱు గురియ నాద్రౌణి । నారసంబున నవి నఱకుచు నిగిడి
యంజనగిరి రూపు నతని నందనుని । నంజనపర్వాని ననువులఁ బాపఁ
' గొడుకు గ్రక్కునఁ తుఁ బోకుమి ద్రౌణి ', యనుచు । నుడుకున హైడింబుఁ డుగ్రబాణముల
వర్షించి యొకశక్తి వైవ సహస్ర । శీర్షమై యాశక్తి చేర నాద్రౌణి
పట్టి హైడింబునిపై నది వైవఁ । బట్టీక భయమునఁ బాఱె నయ్యసుర.
వాని ధృష్టద్యుమ్న వాయుసంభవులు । పోనీక ద్రౌణిపైఁ బురికొల్పు కొనుచు
నెక్కి తారును నేయ నితఁడును నెక్కి । స్రుక్కక యొక్క యక్షోహిణి నఱకె.
ధరణీశ, యావేళ ద్రౌణి యుద్ధంబు । కరము భీకరలీలఁ గానంగ నయ్యె.
చలమెత్తి యంతఁ బాంచాల నందనులు । తలపడి సురథ శ్రుతంజయులనఁగ
... ... ... ... ... । ... ... ... ... ...
మొగమైన యేడ్వుర మొదలించి చంపి । తగు కుంతిభోజనందనులఁ జెండాడి

---

1. బోయకాయని కాంథ ... కోళనేసితి వెందుబోయెదుదాయ. 2.యేరు. 3. బాల్యకాలలబ్ధ, (మూ)

భీమజు మూర్ఛా సమేతుఁగాఁ జేయ (?) । నా మహాత్ముని కిన్క కప్పుడు వెఱచి
సోమకుం డా భీమసుతు నెత్తి కొనుచు । నీ మొన భటు లార్వ నిల్వక పఱచె.
అప్పుడు భీముండు యమసూతి కవలుఁ । దెప్పిరి నిలిచిన దితివంశపతియు
సేనానియును సర్వసేనలు ద్రౌణి । పై నాపి నడవ నీప్రజ వారిఁ బొదివె.
అప్పటి నిష్ఠురాహవ విభవంబు । చెప్ప నెయ్యది జిహ్వా శేషాహికైన.
శరదీప్తి నృపుల భీషణదీప్తి తమముఁ । జొరనీక తిమిరంబు సున్నగావించె.

## భీముఁడు బాహ్లికుని మడియించుట

వినుమంత రణములో వెదకి శైనేయుఁ । దన కోపమున సోమదత్తుఁడు తాఁకి
యణిసేయ భీముఁడు నాఘటోత్కచుఁడు । శిని ప్రపౌత్రుఁడును దొమ్మిసేయవచ్చినను
గొడుకునకును బాహ్లికుఁడు తోడువచ్చి । వడముడిచేఁ జచ్చె వజ్రాస్త్ర నిహతి.
ఆతఁడీల్గిన మఱి యధిప, నీసుతులు । వాతూలసుతు తూలవైచు యత్నమున
ఘనశక్తి యుక్తులై గలిసిన, నాత్మఁ । గనలి యందొకపంచకము భీముఁ డడఁచి
వృషరథుం డనువాని వెసఁ గర్ణతమ్ముఁ । [1]నిషుధారలకు బలి యిచ్చి వెండియును,
ఘనులఁబన్నిరువుర గాంధార విభుని । యనుజులఁ దెగటార్చి యార్చినఁ గవిసి,
లలి సూరసేన మాళవ బాహ్లికాది । బలములు భీముపైఁ బర్వఁ బర్వినను,
అట యుధిష్ఠిరు నాజ్ఞ నచటి దేశీయ । భటులు నెక్కొన నాజి బరవసం బయ్యె.
అప్పుడు రాజు ద్రోణాచార్యుఁ గదిసి: । "యెప్పుడు నీ బాస? యిదె ధర్మసుతుఁడు
అలసినాఁ డర్జునుం డటమున్నె యలసె; । తలఁకొని వారలఁ దలపడ." వనినఁ
బులి గోలవేసినపోల్కి నుగ్రమునఁ । దలపడి ద్రోణుండు ధర్మజుమీఁద
దివ్యాస్త్రములు పెక్కు [2]తెఱఁగుల నేయ । నవ్యాప్తిఁ బ్రతినాయకావలి నతఁడు
నడఁచిన, నంత బ్రహ్మాస్త్రంబు గురుఁడు । దొడిగి యజాతశత్రునిమీఁద నేయ
శతమఖసుతుఁడార్వ సైన్యంబు వొగడ । నతఁడది నిలిపి బ్రహ్మాస్త్రంబు నేసి.
వడినంత నెడ సొచ్చి వారిసేనాని । కడు నొత్తివచ్చినఁ గలశజుఁ డొత్తి
పాంచాల యోధులపై నంత నలిగి । త్రెంచెఁ దచ్ఛిరములు త్రిశతికిఁ గలుగ.
అంత భీమార్జును లట విరాటాదు । లంతంత నెక్కొయేయఁగ ద్రోణుకొఱకుఁ
గాలాగ్ని నెదిరించు కౌరవభటులు । వ్రాలిరి పెక్కండ్రు వారి శస్త్రముల.

---

1. నిషుధారణకిచ్చె ముఱిచి వెండియును. 2. తెరగొని. (మూ)

అత్తఱి నృపుచిత్త మలరింప దలఁచి । హత్తిఁ గర్ణుఁడు చేరి యంజలి చేసి,
"రాజరాజ, నీకు భారంబైన పార్థు । మారుతి ధర్మజు మడియింతుఁ జూడు.
నా విశ్వరూప మెన్నఁడుఁ జూడవీవు; । నీవల్ల భోగినై యెట్టియు వేఁడ (?)"

## కృపాచార్యుఁడు కర్ణుఁ బరిహసించుట

అని నేర్పుమై నాడ నావలఁ గృపుఁడు । చని, "పతి సమ్ముఁబో సత్య మాడితివి!
నీకుఁ జిక్కరె పాండు నృపసూను లనుచు! । నాకుఁ బ్రొత్తయె కర్ణ, మహి నీదు కడిమి!
నరులు గోగ్రహణమునాఁటి పౌరుషము । నరులు గంధర్వాజినాఁటి పౌరుషము!
పరిగణింతురు; నీవు పలికినఁ గలదె?" । ... ... ... ... ...
అనుచు నవ్వినఁ గర్ణుఁ డతని వీక్షించి, । "విను నీకుఁ దక్కువా వేయింట నేను?
కోయుదు నాలుక గురువైన నైతి; । వేయుమా నాతోడ నెవ్వరు బిరుసా!
క్షితిపతి కెచ్చోట గెలిచి పెట్టితివి? । పతి కార్యహాని నిర్భయులార!" యనిన
వాలెత్తుకొని ద్రౌణి వానికి నలిగి । నేలకై దాఁటిన నృపుఁ డెడసొచ్చి
వారింపఁ గర్ణుండు: "వారింపనేల? । చేరి నారణము వీక్షింపనీ యతనిఁ;
గుత్తుక మునిమొదఁ గోనగోర." యనినఁ । జిత్తశాంతిఁ గృపుండు క్షితిపతిఁ బలికె:
"నీకు మాన్యుఁడు గాన నృప, మన్నుఁ గర్ణుఁ । డేకీడు పలికిన నే మొల్లమలుగ;
నలుకకు వేళయే యకటనేఁ" డనినఁ । జలువగా నృపుఁ డాడి జగడంబు మాన్పె.
అంతఁ గర్ణుఁడు పాండవావలి మీఁదఁ । బంతంబు మీఱఁ దగఁ బైపాటుచేసి
నానాంక శరములు నాలుగు నైదు । నానొక వీరసైన్యము దూఱనేసి
రాజుల శిరములు రణవీధి గెడపి । వాజుల రథముల వడి నుగ్గుచేసి
సామజంబుల భటసమితిఁ జెండాడ । నీ మూడ్కి గావని యింద్రజుఁ డడరి
వాని బాణములోలి వ్రయ్య బాణములు । వాని బాణములోలి వ్రాల విల్విఱిచి (?)
యొండు వింటికిఁ బాఱి యొగ్గకునెడను । గుండియ యొక కోలఁగునికిలనాఁటి
తేరుఖండింప రాధేయుండు కృపుని । తేరెక్కి పాఱె బుద్ధికి సిగ్గు లేక.
అప్పు డర్జునుమీఁద నధిపతి యనికి । గుప్పింపఁ జూచిన గురుతనూభవుఁడు
మాటలు పెక్కాడి మరలంగఁ ద్రోచి । గాటంబు మెఱయ నక్కడఁ బార్థుఁ దాఁకి
కపికేతు రథ వృషాకపి కేతనములు । నపకారమతిఁ గప్ప నాయుగ్రతకును
బాండు బలంబులు పాఱె; నుద్దండ । చండిమఁ గదిసి ధృష్టద్యుమ్నుఁ డపుడు

ద్రౌణితోఁ బెక్కండ్రు బలుఁ బోరాడి । బాణధారలఁ జేసి పడిన జీకిల్లి
పాఱె; నప్పుడు భీమ పాంచాలరాజులుఁ । జూచి రావయ్యె సేనలాప్తునికి.
ఇట్టు ద్రౌణి చెలంగి యేపారి గెల్చి । గుబ్బుతోఁ బిల్చి యా క్రోధవిల్లునిమి
సూతహీనుని రథ్యశతాశ్వునిఁ జేయ । నాతని కెడసొచ్చి రథుల కౌరవులు.
అంతఁ గాల్బలని మొక్కి యూనిపోవఁ । గాంతేయుసేన సంగరము సేయంగ,
మలసి వంగాంబష్ఠ మద్రమాగధులు । బలుగాల పడగ చేర్చ్చుక కడువంత.
తక్కటి బలమును ద్రౌణి గాల్బలును । నెక్కుడు సంగడేయ నెడయుచుఁ బాఱె.

## సోమదత్తుఁడు సాత్యకితో యుద్ధమొనర్చి మడియుట

సుతునిఁ దంద్రిచేఁ గాసి సోమదత్తుండు । మతిమండ శైనేయు మఱియును దాఁకి,
సూతునిఁ దునిమిన శోకించి యతఁడు । సూతుఁడు తానయ్యె సోమదత్తుని
శరవిద్యఁ దలపడి శక్యంబు గాక । పరిఘశక్త్యాదులఁ బఱపి భేదిలక
గిరులెత్తి వైచి యాంత్రికయుక్తులోపడక । కరముష్టిఁ బొడిచి యాగతి గెల్పులేక
సోమరియగుచున్నచో, ఘటోత్కచుఁడు । భీముఁడు నెడసొచ్చి పెద్దతోఁద్భుడిన
నాపన రథికుఁడై హారితమ్ముఁ డతని । నేపెసలార బిట్టేసి వధించె.
తమసేన కిట్టు లాధారమౌ జోదు । సమసిన దొరలెల్ల సాత్యకి మీఁద
నేకయత్నంబున నేఁగినఁ దిగిచి । పోక యందఱ ధర్మపుత్త్రుండు విప్పి
ద్రోణునిఁ దనమీఁదఁ దోలిన రథికు । బాణభీకరుఁ డాఁకి భయమింత లేక
చేరువఁ [1]కృష్ణుండు జిష్ణుండు నున్న । సారథుక్తి ననేక శరములు పఱపి
మోాయు చాపముఁ ద్రుంచి మూర్ఛితుఁ జేయ । నాయెడ శౌరి యిట్లను నరపతికి:
" శౌఱవిచేఁ దలగోకుకొన్నట్లు ద్రోణు । నెఱిఁగి యొఱంగి నీ వేలడగ్గఱుదు ?
భీముఁ డెంతకు లేఁడు పెనఁగెడుఁ గాక ; । శ్రీముఖ, నీపట్లు చెయిచేసికొనకు. "
అనిన భీమునిపజ్జ నారాజువోవఁ । దనమూర్ఛదేఱి యంతట ద్రోణుఁ డలిగి
యమసూతిగతి చూచి ' యటు పోకుపోకు । సమర ధర్మమును విచారింపు ' మనుచు
నటవోవ, భీమసాత్యకి ఘటోత్కచులు । భటులు వెండియు ద్రోణు బ్రదికి పోనీక
యడ్డగించిన, నీభటావలి వారి । నడ్డగించిన ఘోరమయ్యె రణంబు.

---

1. నఱికి శేర్పడ భీమనకులు. (మూ)

ఇందు ద్రోణుఁడు కర్ణుఁ డీట ద్రౌణిశల్యు । లందు సోమకుఁడు సాత్యకి భీమసరులు
నేలిక తోనన నెల్లగాఁ బొడిచి । రా లోకసంహార మాశ్చర్యముగను.
అంతఁ గౌరవసేన లానేనలకును । నెంతయు వీఁగిన, నెఱిఁగి కాల్కాలిపి
సేనాని యొకయొద్దునేసి యొద్దునకుఁ । దా నగ్రభాగమై తన పార్శ్వములకు
శకుని నశ్వత్థామఁ జాలించి కృపుని । [1]సకుమారముగ వెన్క శల్యుతో నిలిపె.
అనిన సంజయుఁ బల్కె నాఁబికేయుండు: । "ఘన తిమిరంబులోఁ గలవె కయ్యములు!
ఉపచారములు లేని [2]యొడళ్లు లెట్లోపె? । విపరీత!" మనుడు నవ్విభుఁ బల్కెనతఁడు:
"చీఁకటిలో నాజి సేయరు వారు; । భూకాంత, వినుము నీపుత్త్రుఁ డావేళ
సవరణ లటువెట్టి సరసఁ గాల్బంట్లు । దివియకోలలు వట్టు లెఱుఁగు గావించి
యరదంబునకుఁ బది హస్తికి నేడు । హరికిని రెండుగా నాయత్తపఱచి
పట్టించి పొడవుగాఁ బడగలు దెలియఁ । బట్టించు గతియు సంపద పేర్మిఁ జేయ
నితనిఁ గన్గొని వారు నిట్టి యత్నంబు । ధృతిఁ జేయ నది దీపదివసమై తోఁచె.
క్షోణీశుఁ డప్పుడు సుభటులఁ బలికె: । "ద్రోణునిఁ గావుఁడీ ద్రుపదజు బారి;
సతఁడింక మవల నియ్యాజిలోఁ గాచు; । హతుఁజేయుఁ బిదప నయ్యగ్నికుండజుని.
నరుఁడు కర్ణుని పాలు నాపాలు భీముఁ । డరయఁ జిక్కినవారి యల వెంత?" యనిన

## పాండవ కౌరవవీరుల ద్వంద్వ యుద్ధము

[3]నెక్కడి వక్కడ నెక్క సైన్యములు । క్రిక్కిఱిసిన ధూళిఁ గేళిఁగైకొనక
యన్యోన్య జయకాంక్ష నాభీల లీల । జన్యము సేయుచో, శమన నందనుఁడు
కృతవర్మ దక్షిణగురు భుజావీథి । నతని నా అమ్ముల హయముల నఱికి
తరువాత వాని చిత్రపువాయి వాఁడి । తఱచుటమ్ములఁ బాఱె ధరసంచలింప.
భూరిశ్రవుని నూను భూరి యున్వాని । శౌరి తమ్ముఁడు ద్రుంచె శరములు పఱపి.
కలశసంభవ ఘటోత్కచులు పోరాడి । యిలద్రావాలి రొక్కట నిరువురు మూర్ఛ.
మారుతితో నీ కుమారుండు రణము । వారక సేయుచు వాని నోనేసి
ధనువు ఖండించి యాతనిశక్తివాత । మున ద్రుగ్గి మూర్ఛిల్లెమొనలెల్ల నేడ్వ.
ఎవ్వఁడు మూర్ఛిల్లు నిలద్రావాలుఁ దెలియు । నెవ్వరి మఱిగానఁ డితఁడు సందడిని.

1. సుకుమారగతి. 2. యొళ్ళేట్లుయోపె. 3. నెక్కడ నెక్కడ. (మూ)

కర్ణుఁడు సహదేవుఁ గలహించి [1]నొంచి । కర్ణశూలములాడి కాచిపో విడిచె.
నృప, మత్స్యపతి శతానీకుండు శల్యు । రిపు శౌర్యుఁ దాఁకి పోరికిఁ దా నూల్గె.
అనుజుఁ డీల్గ విరాటుఁ డా శల్యుఁ దాఁకి । మనసు నిల్పక పాఱె మనసేన బెగడ.
ద్రౌపదేయులకు నీ తనయులతోడ । నోపినంత రణంబు నొక్కటఁ గలిగె.
ద్రుపదుండు వృషసేనుతో ఘోరయుద్ధ । మపుడు సేసె యుగాంత మయ్యెనో యనఁగ.
నకులుతోఁ బోరాడి నారాచహతుల । శకుని చలించి జర్జరితుఁడై పాఱె.
కృపుఁడు శిఖండియుఁ గినిసి పోరాడి । యపగత చేష్టులై రన్యోన్య హతుల.
తలపాటు ద్రుపదనందన కుంభజులకుఁ । గలిగెఁ; గల్గినయంతఁ గలశజు నతఁడు
తెమలనేసి సిడంబు తేరును విల్లుఁ । దుమురుచేసి జవంబుతో విఱిచె శక్తి
యసి ద్రవేయుచోట నయ్యసి కృపాచార్యుఁ । డిసుముగా వెస చేసె నిచలముండి.
అపుడు ద్రోణుని గావ నానృపుఁ ద్రోవ । నృప, నాల్గు దిక్కులఁ బె భటు లెక్కి
యిరువుర నెడసొచ్చి యేయ నచ్చోటఁ । బరఁగి వారి నెదిర్చెఁ బాండవబలము.
సేనకుఁ బ్రతి సేన చేతకుఁ జేత । హానికిఁ బ్రతిహాని యందిందుఁ గలుగ
వీఁగితి మనరాదు విమతసంకులము । నీఁగితి మనరాదు నృప, సైనికులకు.
సకల ఘోషంబులు సంప్రదాయమున । నొకట ఘోషము నొందునో యనరాదు.
ఆ దీర్ఘరణమున నంగాధిరాజు । యాదవసింహు సాత్యకి నంటఁ బట్టి
చేరువ భీముండు జిష్ణుండు లేమి । సారథి రథమును శరముల నాఁగి

## కర్ణ దుర్యోధనులు దురాలోచనచేసి సాత్యకిని దలపడుట

విభున కిట్లను: "దేవ, వీని నందఱము । నభిమన్యుఁ జంపిన ట్లన్యాయవృత్తి
ఖండింత మనువుగాఁ [2]గడఁగి, యీ శరణి । గాండీవి భీములు గావలే." రనిన
సమ్మతించి నృపుండు సకలమంత్రులకు । నమ్మంత్ర మెఱిఁగించి యార్చి యొక్కటయుఁ
గావలేక కలంగి కౌంతేయు సేన । యా వేళ సాత్యకి హతుని గా నెన్ని
హాహామహాధ్వను లాకసంబద్రువ । వాహాదు లనిని నిల్వక పాఱఁ బాఱ,
నేయుదు గాండీవి నీఁక నని శకుని । [3]యయుత ఘోటికల సహస్రదంతులను
వేయిరథంబుల విభునాజ్ఞఁ గొనుచు । నాయెడ నిగుడుచో, నది చూచి క్రీడి

1. నొచ్చె. 2. గళది యీగళది. 3యయుత ఘోటుల. (మూ)

తొలుతఁ ద్రిగర్తులతోఁ జేయుచున్న । కలహంబు చాలించి ఘను భీముఁ గొనుచు
నిలు మని నిజసేన నిలుపుచుఁ గదిసి । కలన సౌబలు గర్వగతి చూచి యలిగి
వానిఁ దీవ్రపుఁ దూపువాన ముంచినను । సేనల మిగుల నొంచియుఁ దొంటిభంగి
విచ్చిపోని విధంబు వింతగాఁ జూచి । "యెచ్చట గెల్చెనో యిట్లు వా రలుక!
కానము చేరువఁ గర్ణాదిభటుల; । శైనేయుఁ గానము శంకయయ్యెడిని;
ఉల్లమో ఘోరాగ్ను లుప్పొంగు రణము । చెల్లెను నటునేను జేరెద." ననుచు
నోడ ముంచిన రీతి నొకని నాసేన । నూడ నీక వధింప, నులికి సౌబలుఁడు
దెసచెడి పాఱినఁ దేరు శైనేయు । వెస వెస నడపింప ధృతి నటనున్న
సౌభద్రుఁ జంపిన సరణిఁ గౌరవులు । శోభితయశు శినిసూనుఁ జంపంగఁ
దలఁచి యాతని కేతు దండ రథాశ్వ । ములఁ ద్రుంచి సూతుని మూర్ఛితుఁ జేసి
మిగుల నోనేయుచో, మేటి బీభత్సుఁ । డగలించి యటకుఁ జయ్యన నెడసొచ్చి
మునుప సాత్యకి రథంబునకు రాఁదిగిచి । మొనలపై నలిగి యమ్ముల జడివట్టి
కర్ణు సౌబలుఁ గృపుఁ గౌరవ్య ద్రోణు । దుర్నిరీక్షములైన తూపుల ముంపఁ
బాఱిరి వారు భూ[1]భాగంబు వణఁక; । నాహూతి నర్జును నసురారి వొగడె.

## అలంబుసుఁడు హైడింబుఁ దాఁకి మడియుట

అప్పు డలంబుసు హైడింబదైత్యు । లొప్పుగాఁ దాఁకుచో, నుగ్రహుంకృతుల
శర ముసల ప్రాస శక్తి ఖడ్గములఁ । గరికళేబరముల ఘనరథాంగములఁ
దరుశిలాతతుల నిద్దఱుసైన్యములును । ధరచలింపఁగఁ గొంతతడవు పోరాడి
ప్రోగులు ప్రోగులై పొర్లాడి పడిన । బాగునఁ బడి ఘోరభంగిఁ జచ్చుటయు,
వలమున నీలలవంటి బాణములఁ । దలపడి యప్పుడు దైత్యు లిద్దఱును
రథఘోషముల నంబరంబు చలింప । నృథగాని పూవులు [2]విడువని చలము
నుడివోని కినుకలు నుడుగని పసలు । నెడగాని [3]యుజ్జలు నెసఁగ నంతంతఁ
బోరాడి ధనువులు పోయి రథ్యములు । సారథులును ద్రెవ్వి, చలముల నెసఁగి
గరుడసర్పంబులగతి సింహాకరుల । కరణి నింద్రాసురుల్ కైవడిఁ దోఁప
నచ్చట విపుల బాహాశక్తిఁ బెనఁగి । రచ్చెరు వని తమ్ము నమరులు వొగడ.

1. భాగంబు. 2. విడుగని చరులు. 3. యుజ్జ్వల నెపగు యుండంద. (మూ)

సరిపోటు నొందుచో సైఁపక యపుడు । ధర నలంబుసుఁ ద్రొక్కి తన్నె భీమజుఁడు.
త్రొక్కి నరంబులతో నాసికరము । చిక్కని నెత్తుగ చిప్పిల్లఁ బెఱికె.
తెంచి దుర్యోధను తేరి ముచ్చట్టు । నంచితగతిఁ ద్రిప్పి యుం దది వైచి
యా రాజు విన నట్టహాసంబు చేసి । ... ... ... ... ...
“కర్ణ నమ్మితి వీవు కర్ణు నిట్లనిని । కర్ణయుంబునఁ గూల్తు నెడమూఁడు” మనుచు
మాయారథంబెక్కి మారుతికొడుకు । నాయకాననము హస్తమునఁ గిలించి
రాధేయు వెసఁదాఁకి రౌద్రగారాచ । వేషపుట్టఁగఁ జేసి నిలుచున్న, వాఁడు
పెఱవిల్లుగొని దైత్యు భీకరధనువు । నఱకి గ్రద్ద పతాక నఱిమికిఁ దునుము,
నందంద హెచ్చిన యా దైత్యు మాయ । నెందఱో యోధు లయ్యెడఁ గానవచ్చి
యమ్ముల వానలు నటఁ గర్ణుమీఁద । నమ్ములవానలు నడరించి మఱియుఁ
గురుసేనపై నద్రికోటులు గురియఁ । దిరమేది ఘనభీతిఁ దెరలె నబ్బలము.
అపుడు కర్ణుఁడు నిల్చి యామాయలెల్ల । దివ్యాస్త్రములఁ ద్రుంచె విభుఁడాత్మ మెచ్చ.
నరుఁడయ్యు దానవునకు నట్టువడక । శరపరంపరల నా సమరోర్వి నింప,
మఱియు నక్కసుఁ డల్గి మాయపుట్టించి । నెఱి వానితూపులన్నియుఁ [1]ద్రావఁజేసి
యసి గదా శక్తి శూలాదులఁ గురియ, । మసలఁ గాతఁడు నవి మాయతోఁ దునిమి
విరథుఁ జేసిన, వాఁడు వినువీధి కెగసి । గరుడుండై నఖములఁ గాడఁ బట్టుటయు
నారూపు దున్మ, మహాహియై గవియ । నారూపు దునిమె ధైర్యమునఁ గర్ణుండు.
అసుర వెండియు సింహమై తాఁకఁ దునిమి, । అసుర వెండియు హస్తియై పట్టఁ దునిమి,
కడతేర్పలేక యక్కసుచేతఁ దనకుఁ । జెఱు ప్రాప్తి గలదని చెదరెఁ గర్ణుండు.

### ఘటోత్కచుఁడు అలాయుధుని మడియించుట

అంత నలాయుధుఁ డను బకానుజుఁడు । పంతంబుతో వచ్చి పతిఁగాంచి మ్రొక్కి
తన్నెఱిఁగించుక దర్పించి పలికె: । “నిన్నింకఁ గయ్యంబు నృప, సోఁకనీను ;
కలశజుఁ గాచెదఁ గర్ణుఁ గాచెదను । గలసేనఁ గాచెద ఘనతమై వినుము.
వీరుల మ్రింగుదు వీరి తోయముల ; । మారుతి నెఱుఁగనే మా పగవాఁడు!”
అని యనుమతి గాంచి యట్టహాసముల । వినువీధి చించుక వెస నలాయుధుఁడు

1 ద్రోవ (మూ).

తిరమైనగతిఁ గర్ణుతేరు మున్నట్టు । తిరుగుచునేయు దైతేయుని దాఁకె.
అంగరాజంత సహాయ సత్త్వమునఁ । బొంగి భీమాదులఁ బొదివి నొప్పించి
భీమ సోమక మత్స్య బీభత్స నకుల । [1]భూమీశపతుల నంతఁ బోరిగొని యప్పుడు
దురముసేయ, నలాయుధుండు హైడింబు । నరిశక్తిఁ దాఁకి యస్త్రములేసి నొంచి
మన సైనికులఁ గూడి మఱియు హైడింబుఁ । జెనకి తేరును విల్లుఁ జిద్రుపలు చేసి
శూలంబువాటున శూలించి హృదయ । శూలంబుగా వాయుజున కది చూపి
'పంపుదు కూటికై బకుని మామన్నఁ । జంపితి వీటు నిన్ను సాధింతు' ననుచు
నతనితో నతిరౌద్రమైన రణంబు । దితిజుఁడు చేయుచోఁ, దెలిసి భీమజుఁడు
కవల సోమకుఁ దాఁకి కడఁకతోఁ బెనఁగి । యనలీల రణముసేయఁగ [2]నున్న దైత్యు
నసిగదాముసల చక్రాదులఁ దునిమి । యసహాయు విరథు నిరాయుధుఁ జేసి
మాయచే శిలలును మాంసంబుఁ గురియు । నా యత్న మటుమాన్చి యంతట వాని
నసిగొని మెడ ద్రెవ్వనడఁచి యా శిరము । గసి నెత్తురట్ట నాకసముపైఁ ద్రిప్పి
మున్నిటిగతిఁ దెచ్చి యొకటి కౌరవుని । యున్నతరథముపై నునిచి బిట్టార్చి,
"వసుధేశ, యింక నెవ్వని ననిచెదవు? । వెస" నంచు ననిన నిర్విణ్ణుఁడై యతఁడు:
"అక్కట వీఁడింత నఖిల కౌరవులఁ । జక్కాడు నీ రాత్రి సందేహమేల!
ధూర్జటి వచ్చెనో తోడు పార్థులకు! । నిర్జరపతి తోడునెగడెనో యిట్లు!
కర్ణుపోటును బెద్ద గాడము పీచి; । దుర్నీతి రణ మేల దొడఁగితి రాత్రి!
కయ్యంపుటలజడిఁ గానము గురుల । కియ్యాత్మజుల భక్తి యేమని చెప్ప!"
అనునంత రాధేయుఁ డనిఁ బాండవులకుఁ । దన దివ్య కాండ ప్రతాపంబు చూపి
దనుజునిఁ బరిమార్చుతలఁపున మఱియు । నినుమిక్కిలై భీము నేయఁ జూచుటయు,
దివినుండి ధాత్రిపైఁ దేరును దాను । బవనపౌత్రుఁడు తోఁచి భయముగా నప్పుడు
క్రుంగి యదృశ్యుఁడై కొంతసేపునకు । నింగి [3]నీలాభ్రమై నృప, తోనవచ్చి
మెఱుముచు నుఱుముచు మేదినిఁ బిడుగు । లుఱక రాల్చుచు నుండ నొదిగి నీభటులు
'నెవ్వా డెవ్వనిమీఁద నేమిమై పడునొ! । తప్ప దీరిపుఁ' డని తలలు దాఁపఁగను,
కొండరాజు చలంబుగొని జంగఱాలు । గొండఱాలును మొండుకొని చాపఱాలు
కత్తిఱాలును ఘటోత్కచుఁడు వర్షింప । నెత్తులు వగిలియు నేల పాలయ్యు
నడుములు విఱిగియు నఱుకులు వడియుఁ । గడుభీతిమైఁ బాఱెఁ గౌరవబలము.

---

1. భూమీశుఁ బొదివి యా పోరిదొని. 2. దైత్యవరుని. 3. నీలాగ్రమై. (మూ)

అట్టిచోఁ బాఱక యంగాధిరాజు । దిట్టతనంబున దివి దృష్టి నిలిపి
భూరి మాయామేఘములు విచ్చసేయ । ధారుణి దైత్యుండు తలచూపి మఱియుఁ
గర్ణురథ్యంబులు గదవేసి చంపెఁ । గర్ణు డగ్గఱి యంతఁ గౌరవభటులు:
"పరిమార్పుమీ వీనిఁ బగవాయఁ గర్ణ! । కురుసేన నిలిపితి ఘోరాజి నేఁడు.
నిక్క మాపదలకు నిర్వోఢ్ఢు నృపుఁడు । చక్కఁబెట్టుము వీని కౌరవ్యాభిరామ!
ఇంద్రుఁ డిచ్చినశక్తి యెన్నాళ్ళకింక! । నింద్రసూతికిఁగదా యీవు దాఁచితివి!
అతని నెవ్వండెఱుఁగు! నంతకు నేఁటి । మృతిదప్ప వీనిపై మీఱవే శక్తి."
అనుచుఁ బ్రార్థింప వాఁ డది వినలేక । దనుజుపై వాసవాస్త్రము ప్రయోగింప
నీవల నరుఁ డది యేసెఁ ద్రెవ్వంగ. భూవర, విను మంతఁబోక గర్ణుండు

## ఇంద్రుఁడిచ్చిన శక్తిచేఁ గర్ణుఁడు ఘటోత్కచునిఁ జంపుట

వేఱొక్క తేరెక్కి వెడ వాతి కోల । లాఱేసి గద ద్రుంప నసుర వెండియును
గదగొని యాతేరు గాలిఁ బోవైచి । యదలించి మఱియు మహాగద వైవ
నొకభంగిఁ ద్రెవ్వనేయుచుఁ గర్ణుఁడాత్మ । "నకట! వీని వధింప నాశక్తి వలెనె!
యింక నింద్రజుఁగెల్వ నేదిసాధనము! । శంక లిట్లణఁగునే శత్రుచిత్తముల!
వీఁ డర్జునునికంటె వేఁడి నేఁ" డనుచు । వాఁడిమి తూపు జిహ్వాలు గ్రోయుదాని
ఘుమ ఘుమధ్వని మింట ఘోషించుదాని । విమతుల దృష్టికి వ్రేఁగైనదానిఁ
దిగిచివైచిన మింట దేదీప్యమాన । మగుచు నాశక్తి లోకాభీలమగుచు
నొక్కట రవికోటి యుదయించె ననఁగ । నక్కజ మగుచు రా నసుర తలంకి
తప్పిపోఁ దలఁచునంతనె పోయి వాని । విప్పైనయురము ప్రవేశించి శక్తి
వీపున వెడలిన వికృతాస్యుఁ డగుచు । నాపజ్జ నొఱలుచు నట్టిట్టు పడుచు
నుచ్చిళ్ళు నోరనీనుచు నాల్కగఱచి । చచ్చె శక్తియుఁ బోయె శక్రు [1]సన్నిధికి.
అంత నీ సేనలో నార్పులు చెలఁగె; । కౌంతేయుసేన నాక్రందనంబెసఁగె;
తగువేడ్కఁ గర్ణునిఁ దనరథంబునకుఁ । దిగిచి కౌఁగిటఁ జేర్చె దేవ, నీ సుతుఁడు."
అని సంజయుఁడు నల్క నాంబికేయుండు । "దనుజుపాలయ్యెఁ గదా యంతశక్తి!
కర్ణుఁడేమిటఁ గెల్వఁ గలవాఁడు పార్థు! । వర్ణింప నిది నీలవర్ణుయత్నంబు.

1. దీధితికి. (మూ)

బీభత్సు చావు దప్పించు నుపాయ । మీభంగి నొనరించె నేమనవచ్చు?
మునుమున్న యే మడలంచిన కర్ణుఁ(?) । డనిమొన నరుపైవఁ డయ్యె నీశక్తి.
నిది రాజు మఱచిన నేమి నీవైనఁ । గదిసి చెప్పవు దీనిఁ గర్ణునితోడ.
చెప్పినఁ గొంత యీ చేటుపాటునకుఁ । దప్పరే ప్రజలు రాధాసూను వలన!"
అన విని సంజయుఁ డారాజుఁ బలికె: । మనుజేంద్ర, యిచ్చట మాపటిపూట
నిందఱుఁ [1]జెప్పెను 'రీశక్తి నింద్ర । నందనుఁ గూల్చు కర్ణా', యని చాటి.
అతఁడును "చేపుగదా! చూచుకొంద । [2]మతఁ డెంత!" యనుఁ గాని యాజిలో మఱచు.
"హరిఁ [3]జంపు మతఁడున్న నర్జునుమృతియు । ధరవృథా" యందు రాతఁడు[4]విని మఱచు.
ఏ వింటి సాత్యకి యీ వడ్గినట్లు । గోవిందు నడుగ నగ్గోవిందుఁ డనియె:
"కౌరవార్థముగ నక్కర్ణుఁ డీ శక్తిఁ । బోరనర్జునుమీఁదఁ బూన్పఁగ వచ్చు;
ఏమఱుపింతు; మీ రెల్ల శైనేయ! । యామహేంద్రకుమారుఁ డగుచు రా నాకు!"
అనియెఁ గావున మాకు నాజిలో మఱపు । లొనరించెఁ గథచందముర్వీశ, వినుము.
ఆరీతి దైత్యుండు హతుఁడైన నలరి । శౌరి యర్జునువీపు చఱచి నవ్వఁగను
ఆకులమతి నున్నయతఁ డాడె నతని: । "నీకు శోకపువేళ నీతియే యలర!
లోకనాటకము నాలోకింతు." వనిన । నాకేశసుతుఁ జూచి నారాయణుండు:
"చక్రగాండీవముల్ సాధింపలేని । యీ క్రూరసాధనం బిలఁ గర్ణుచేత
నుండ నే నిను సమ్మకుండితి; నదియుఁ । జండదైత్యార్థమై సమయఁ బొంగితిని.
ఏ నీకుఁ గలిగియు నీశుచే నస్త్ర । దాన మందియుఁ గడుఁ దగుజోదవయ్యు
వృథ యిది కర్ణుచే వెలుఁగొందునేని; । రథిచంద్ర, మిమ్ము ధర్మమె తలగాచె.
దివిజేంద్రుఁ డర్థించి దినకరాత్మజుని । కవచకుండలములు [5]గమిచివోవుటను
అనఘ, కర్ణుని మర్త్యుఁడనవచ్చుఁ గాక । యనిమిషుండును గాఁడో యది విచారింపు.
ఆ కడ శిశుపాలు నా జరాసంధు । నేకలవ్యుని నేల యేన చంపితిని?
నేఁటిచో వారు దీనికి వత్తురేని । గాటమా నని సుమీ కవ్వడీ, యెఱుఁగు."
అనునంత ధర్మజుఁ డశ్రులు రాలఁ । దనయు శోకంబున ధనువటు వెట్టి
పరవశుఁడై వ్రాలఁ బాఱి కృష్ణుండు । తిరముగై కొనఁ బట్టి దీనత దెలిసి
"యేమీ మహారాజ! యీ ధైర్యహాని! । నీమోపు దలఁపవు నీకిట్లు దగునె!

1. జంపుమ. 2. మతఁడంత. 3. జప్పునత. 4. వీని. 5. కపురు. (మూ)

తేరు మడంపులు దీనభావంబు । మాఁపెటి పగవాఁడ్ప మనికిత తగునె! ”
అనిన నాతనితోడ నధిపతి కౌంతే । యనుజుని భక్తిచందము గొనియాడి
“ వీనిఁ జంపినకర్ణు వేపోయి ద్రుంతుఁ । గానిమ్ము నన్ను నాపోటుచెన్నటికిని?
నిన్నను నేఁడు వీనికిఁ బూనివచ్చి । యున్నఁట మనకు ద్రోహమ్మౌ ద్రోణుండు;
ఇతని నేఁడు వధింప నే భీముఁ బనుతు; । శ్రుతి-చోరహర, మమ్ముఁ జూడు మీవేళ.”
అని సంకు ద్రోయించి యతనికై కదలి । వనమాలి తేరెక్కి-వచ్చి యత్తెఱఁగు
హరిసూనునకుఁ జెప్పునంతలో వ్యాసుఁ । డత్త్రోవ నడ్డమై యమసూతిఁ బలికె:
“ ఓకుమారక, నీకు నొంటిఁ బోదగదు ; । జోకఁగూడుము గల్గు సులభమై జయము.
వగవకు మీ క్రీడి వాసవుశక్తిఁ । దెగనని నోర్తువా! ధృతిచెడ , మఱియు
నేఁటికేనవనాఁడు నిఖిలరాజ్యంబు । నాటమై మిముఁ జేరు నాలాయ మెఱుఁగు. ”
అని యుపదేశించి యతఁడు వోవుటయుఁ । దనమది శాంతుఁడై ధర్మరా జపుడు
కాలాఁగి యోధవర్గము నెల్లఁ జూచి । చాలఁ బ్రేమమున ధృష్టద్యుమ్నుఁ బలికె:
“ ఆచార్యవధకునై యగ్నికుండమునఁ । దోఁచిన యోధవు ద్రుపదకుమార!
ఈవు శిఖండియు నేము చూడంగ । నావీరుఁ దునుమాడుఁ డది నాకు హితవు. ”
అనిపల్కి- మఱి భీమునర్జునుఁ గవల । శినిపౌత్రు వెండియు సేనాధిపతుల
గురువధార్థము వేఁడుకొనిన నందఱును । గురునకుఁ గడఁగ, నగ్గురుని సేనలును
గన్నెఱింగి రణోర్విఁ గలయఁ బర్వుటయు । నెన్న నక్క-జమయ్యె నిరువాగురణము.
అల్లి కాయలను వ్రేట్లాడిన యట్లు । జల్లుగా వెస నస్త్ర చయములఁ బోరి
తెగుగతి చూచి చింతించెఁ బద్మజుఁడు । మగ పోడి మానేఁడమ్మొక్క పోవదనుచు.
అట్లు పోరాడి బాహాశక్తు లెడలి । పట్టిన తూఁగున భటులిందు నందు
వ్రాలుచుఁ బొట్లాడు వరుస తప్పుచును । దూలుచుఁ దేలుచుఁ దూపు మార్చుచును
ఆఁకలి నీరువ ట్టస్త్రవేదనలుఁ । జీకాకు పఱుప వీక్షించి యర్జునుఁడు
ఉభయసేనలు విన నొకనీతిచెప్పె । “ సుభటులార, వినుండు [1]చొక్కు-మద్పుదము
చంద్రోదయము దాఁక శ్రమమార్చికొంద ; । మింద్రియపాటవం బిటుగాని లేదు. ”
అనిన నర్జునుమాట కందఱు నలరి । మనసుల దీవించి మంత్రిసమ్మతుల
నట్టట్టు మెఱయ నయ్యాజికిఁ దప్పి । గుట్టు విప్పక నిల్చి కూర్కఁ జొచ్చినను,
తలలింత వ్రాల్చి కందములు విదల్చి । చెలఁగి హేషాధ్వని చేసె నశ్వములు ;

1. చొప్ప (మూ).

కటములు గదలించి కరశాఖ లెత్తి । చటుల నిశ్శ్వాస ఘోషముచేసెఁ గరులు;
సతుల చన్నులరతిశ్రాంతాత్ము లొఱగు । గతి వీరులొఱగిరి కరికుంభములను
అప్పు డొప్పినదయ్యె నయ్యంధకార । మప్పాండుజులకు నిల్వ ననువిచ్చెఁ గాన.
గొనియాడఁ బట్టైన గొంతసేపునకు । మనుముల [1]మేను నిమ్మఁగ వచ్చెననఁగ
నని డస్సిపడిన దేవాంశులకెల్ల । నెనయ సుధాధార లీవచ్చె ననఁగఁ
గువలయంబుల మందు ఘుటికయుఁ బోలె । నివురు వెట్టిన [2]పాంథ హృదయాగ్నివోలె
బవాలుచకోరక తపఃఫలమును బోలె । మహిఁ బూర్వగిరి విద్రుమపులతవోలె
(గొనకొని సకల దిక్కులవెలిఁగింపఁ । గనుపట్టె నంతఁ జుక్కలఱేఁడు మింట.
కురుకులేశ్వరుఁ డంత గురుఁ జేరవచ్చి) । "గురుఁడ, నీశరశక్తి గొనియాడునరుఁడు;
వలెనన్న గెలుతువు వాసవాదులను; । దలపోయఁ బాండునందనులు నీకెంత!
తగుశిష్యుఁడని నీవు ధనఞ్జయు మీఁదఁ । దెగువకుఁజొర[3] వింకఁ దెగుట వారెట్లు?
నడుమ వారికిఁగాక నాకును గాక । నుడివడు గతినుంటఁ జూడఁ బాతకము.
చెప్పెదు జరపనచాలవుగాక. । ఇప్పుడే తగునేన లిచ్చెదఁ గొంచు
నేవైరితతినైన నేర్పడఁ దాఁకి । నీవు వధింపుము నిల్తు నే నిచట.
కలరు దుశ్శాసన కర్ణ సౌబలులు । తలఁప నా." కనిన నాతఁడు నవ్వి పలికె:
"ఇట్టైన గెలుచుట కేమి సందియము! । నెట్టన నేఁబోదు నీ చెప్పినట్లు.
కుడిచితి కట్టితి కుతలమేలితివి । నడవవే నిర్భీతి; నాకింత లేదు.
పోరితి నేను నాభుజశక్తి కొలఁది । వారి ధర్మబలంబు వధియింపనీదు.
తలఁప మీరందఱు దైవోపహతులు । పలుకుల వేఁడికిఁ బనియేమి వెఱ్ఱి!"
అనుచుఁ బాంచాలుర కాది గొనంగ, । విను కౌరవుఁడు పాండవేయుల కుఱికె.
వేగంబు మదిఁబొడమిన వేళగాన । లాగైనయుభయ బలంబులు దెలిసి
ప్రాణవంచనలేక పైకొన్న రణము । రేణువ నిగిడి దర్శింప [4]నీదయ్యె.
కలహంబులోపలఁ గౌరవేశ్వరుఁడు । లలిఁ బాండవాస్త్రములకు నోర్చియేసె.
గురునిచేఁ బాంచాలకులుల నేగియును । నరునిచే గురునిసైన్యముల నేగియును
జూడ నక్కజమును జోద్యంబు నయ్యె" । వీడాడె గురునర విలువిద్య లనఁగ.

---

1. మేలు. 2. పాద. 3. వీవు దిరుగుట యెట్లు. 4. నిండయ్యె. (మూ)

## ద్రోణుఁడు విరాటద్రుపదుల సంహరించుట

అత్తఱిఁ దూర్పెఱ్ఱనగుచు వచ్చుటయు । నుత్తరంబున ద్రోణుఁ డొక్కరుండె తోలి
'యింతటినుండి నన్నెదిరించు బంటు । కౌంతేయసేనలోఁ గలఁడొకో యిపుడు?
కలిగిన నేతెంచుఁగా' కని పిలువఁ । బలుకక నా సేనయు ధర్మజుండు చోట
ద్రుపద విరాటులతోన కేకయులు । ద్రుపదపుత్త్రులు నా పృథ్వీశు నానావిధ
సేనలఁ గూడి యాసేనాధినాథు । నానతిఁ గేఁగి యాక్రమించుటయు,
వాఁడి యంతంతకు వర్ధిల్ల నతఁడు । వాఁడు పేఁడనరాని ద్రవ్యాలు గాఁగ
బలములఁ జెండియుఁ బాంచాలసుతుల । నలయ యింద్రసుతు కవిసి వేగమున
నుగ్రాస్త్రములఁ గేకయులఁ బో[1]రి కెడపి । యుగ్రత ద్రుపదుపై [2]నొత్తక నడవ,
నతఁడు కొండలఁ ద్రెంచునంత బాణముల । శత సహస్రాధిక సంఖ్యల నేయ,
నర్ధచంద్రాకృతి నలరు బాణంబు । వర్ధమాన క్రోధి వానిపై నేసి
పాండవయోధులు భయమంది చూడఁ । గుండలంబులతోడఁ గూల్చెఁ దచ్ఛిరము.
విరటుండు నప్పు డవ్వీరునిఁ దాఁకి । శరచయంబులఁ గొంతచలముగాఁ బెనఁగ
వననిధిఁ గలయు ప్రవాహంబె పోలెఁ । దనులీల నడఁగె నాతఁడు రణాంబుధిని.
ఆ తేరు దండి యోధావళిఁ జంప । శ్వేతుండు ద్రోణునిఁ జిచ్చుగాఁ జూచి
"వీని నిప్పుడ ద్రుంతు విడిచితినేని । యేను గులంబున కెడమైన వాఁడ
నడ్డంబు రాకుఁ డీరందఱు." ననుచు । [3]నుడ్డీనగతిఁ బక్షియును బోలెఁ గడఁగి
భటులతో ద్రోణునిపైఁ బడునంత । నటఁ బోయి దుర్యోధనాది యోధులును
నడుమఁ జొచ్చిరి; మఱి నరుఁడు వారలను । దొడరి సైన్యంబుతోఁ దునుములంబుచేసె.
అంత సూర్యోదయంబయ్యె నయ్యెనను । అంత నా నృపులు కాల్యక్రియల్ దీర్చి
యాఁకలి [4]రేయింటయలజడి నిద్ర । తాఁకిన బాణవేదనలు నీర్వట్టు
ముడివడ బలము పెన్మొనగట్టఁ ద్రోలి । నడపింప మఱియు రణంబుప్పతిల్లె.
అందు రారాజుతో నన్నకులునకు । నందంద కర్ణుతో ననిలసూనునకు
నల దుస్ససేనుతో నకులానుజునకుఁ । గలశసంభవుతోడఁ గపికేతనునకు
ననియయ్యె; నపుడు ద్రోణార్జునరణము । వినఁ జూడఁ గ్రొత్తయై వివిధమార్గముల
వెనుక కయ్యములెల్ల వెలరానిపాటి । ... ... ... ... ...

---

1. గడఁగి. 2. నొత్తిక. 3. నొడ్డినగతి. 4. రేయింటి. (మూ)

రామభీష్ముల సంగరము నుఱిపించె. । (భూమీశ, యేమిచెప్పుదు నట్టివేళ)
నిశివిశిఖిఁ జొచ్చి సైనికులంత నొదిఁగి । మొదలు చొచ్చి పెనంగ నెవ తెవ్వఁగాని(?)
అట్టిసందడిఁ గర్ణుఁ డనిలజసూను । బట్టు పాటగు మూర్ఛ మునుఁగ నేయుటయు
గదగొని భీముండు కర్ణుని నేయ । నది లీలఁ గాలదండాకారమగుచు
వే వచ్చుచోఁ, జూచి వెఱచి కర్ణుండు । పోవఁ దత్సేనలఁ బొడిచేసె గదయు.
శ్వేతుండు గదలు నీ సేనాధినాథు । డ్రాఁతిఁ దాఁకిరి వారిఁ బఱపె ద్రోణుఁడును.
సాత్యకిఁ దలపడి సర్వకేతనుఁడు । నత్యంతమును నొచ్చె నతఁడును నొచ్చె.
అంతఁ బాండవసేన హాఁఱణునఁ బడక । కౌంతేయముఖ్యుని కడఁక నెక్కినను
గరళాగ్ని కెదిరిన కఱకంటుఁ బోలెఁ । గురురాజు తన సేనఁ గొలిపి యెదిర్చె.
ఎక్కడ నెదిగె వాఁడెందుండె నధిప! । యక్కడ నంతకయ్యము వానికొదవు.
అట్టిచో మధ్యాహ్నమగుటయు గురుఁడు । పట్టిపల్లార్చక పాంచాలపతుల
యొత్తుగుత్త గొనంగ నీక్షించి యతని । యత్తుకోలు నుతించి యట ధర్మరాజు
తమకును సిడియపో తరువాయనంగ । యమసూతి భయమంద హరి యాత్మనెఱిఁగి
యరదంబుఁ గదియించి యారాజుఁ బలికెః । "గురుపయోనిధి వెల్లిగొన నోర్వరాదు;
మాపటి కెందఱ మడపునో తెలియ; । దోపినఁ దెగటార్పఁ డొకయుక్తి గలదు
'కూలె నశ్వత్థామ ఘోరాజి' ననుచు । మీలోన నొక్కఁ డమ్మేటికిఁ జెప్పఁ
గడునమ్మి పుత్త్రశోకమున విల్లతఁడు । విడుచు నప్పుడు చంప వెరవగు." ననినఁ
[1]గవ్వడి కొడఁబాటు గాకుండెఁ బలుకు; । నివ్వెఱపడి రాజు నిట్టూర్పు పుచ్చె.
అంత నశ్వత్థామ యనఁగ నేపాళ । దంతి నొక్కెడ వాయు[2]తనయుండు గూల్చి
యొయ్యన గురుఁజేరి యుద్దండవృత్తి । 'నయ్య, యశ్వత్థామ హతుఁడయ్యె' ననఁగ
నాతఁడు బిట్టులికి 'హా సుత!' యనుచుఁ । జేతిచాపము కొంత శిథిలత నొంద
మారుతిమాట నమ్మక విచారించి । "ఏరీతి నితఁడీల్గు నీశ్వరాంశజుఁడు!
నేచినాఁడే నేర్పు నిఖిలాస్త్రసిద్ధ! । చూచినాఁ డాహవక్షోణులు చొచ్చి;
యిందెవ్వఁ డతనికి నెదురైన జోదు! । పొందుమాలినయట్టి బొంకులే!" లనుచుఁ
దెలిసి ధృష్టద్యుమ్ను తేరికి నడచి । బలము లాతని కడ్డపడుచోటఁ గదిసి
పాంచాలరథికు లిర్వదివేలు చదియ । నంచితగతిఁ గరులన్నియు మడియ
నంత మత్స్యబలంబు నైదువేలడఁగ । నంతకంటెను బెక్కు హయదంతు లీల్గ

---

1. నప్పటి. 2. జాఁడును. (మూ)

నారాచవర్షంబు నలువంకఁ గురిసి । ఘోరాక్షుఁడై రాచగుంపుల కడుకఁ
నతనికి సప్తసంయమను లక్షిమునఁ । " క్షితిదేవుఁడవు ద్రోణ! చింతింపుమకులము;
వేద వేదాంగాది విద్యల నెఱిఁగి । కోదండవిద్య కెక్కుడు నీకుఁ దగునె!
వృద్ధుండ వెఱబడి వర్షముల్ నీకు(?) । నిద్ధర్మ మిటువంటి యేతెమ్ము దెలిసి."
అని కానరాక తారసిల్లిన గురుఁడు । మనమున ఖేదము నగలు దలంచి
భీతియుఁ బ్రీతియు బెరయఁ గుమారు । నాతని క్షేమముల నరసి కానకయు
' బొంకనొల్లని ధర్మపుత్త్రుచేఁ గాని । యింకఁ బుత్త్రుని వార్త యెఱుఁగ రా ' దనుచు
నరదంబు డోలించి యాతనిఁ గదిసి । గురుఁ డాత్మనందనకుశల మడుగుటయుఁ
బలుక నేరకయున్న పాండవాగ్రజుని । జలజాక్షుఁ డిట్టులు చయ్యనఁ గదిసి

### అశ్వత్థామహతుఁడైనట్లు కృష్ణాదులు ధర్మజుచేఁ బొంకాడించుట

చింతింపనేల యీ సేనాధినాథుఁ । డింతటఁ బడకున్న నేడి నీబ్రదుకు?
కాదని గురునకుఁ గా రాజ్యకాంక్ష । గాదని విడువు సుఖంబబ్బు." నవిన
కల్లకు మాటయొక్కటి మాటతోడ । నుల్లాడ కృష్ణుఁ బల్కె మఱియు మాధవుఁడు :
" ఏలధర్మజ, మమ్ము నితని గొప్పింపఁ । వాలాయమున బొంకవలె నేఁడు నీవు;
భయ వేళ బొంకినఁ బాపంబు లేదు; । జయసిద్ధి యటు గానఁ జాలదు నీకుఁ
జేయఁగడఁగి వృథ సేయు నే." డనిన । వాయుసూతియుఁ బల్కె వసుధేశుతోడ :
" వారణంబొకటి యశ్వత్థామ యనఁగ । ఘోరాజి నాచేతఁ గూలిన నేను
నాచార్యునకు దఱియనక యీ వార్త । సూచింప నతఁడు నాసుద్ది నమ్మకయు,
నిను నడ్గుచున్నాఁడు నీవును దంతి । మనమున నిడుకొని మాట యిట్లాడు.
హారిగల్ల మనకు దోషాదోషచింత । కురువంశ్య, లే." దన్నఁ గొంకుచు నతఁడు
నరి నసత్య భయంబు సమరభయంబు । నిరువంక దివియంగ నిటు తొట్రువడుచు
ద్రోణునితోఁ బల్కె ' దురములోపలను । ... ... ... ... ...
హతుఁడయ్యె మఱియు నశ్వత్థామ ' యనుచు । నాతతధ్వని నాడి యట్లని వెనుక
' ననుపమగజ ' మన నప్పిన్న మాట । వినక ద్రోణుఁడు భీతి విల్లట్లు విడిచి
భూమికి మిన్నెత్తుపొడవున వచ్చు । నేమపురథమందు నిశ్శంకఁ గ్రుంగి
పుత్త్రశోకాంధుఁడై బుద్ధిలోఁ బొందు । పుత్త్రవిరోధ మప్పుడు చక్కవిడిచి,

శత్రుని నెదుట ధృష్టద్యుమ్నుఁ జూచియు । నాత్రాణ మా గర్వ మా కళ దొఱఁగి
సంకోచితాంగుఁడై చాల నిశ్చేష్టుఁ । డుంకణంగిన కాంతి సూర్యుండు పోలె
హరుని కంఠంబునఁ దగులుకొను డీ । ఖరమరీచులఁ బొల్చు గరళాగ్ని పోలె,
నడఁగె నశ్వత్థామ యన్నమాత్రమున । జడమైన విషనీలసర్పంబె పోలెఁ
జేతికి లోనైనఁ జేరి శ్వేతుండు । తాత, రా యని పోయి ధట్టించి తాఁకి
ద్రోణవధార్థమై శోధనతలఁపు । [1]క్షోణీశునెదురుగా సుచిరయత్నమున
నమ్ములేయఁగఁ జూచి యతఁడు కోపాగ్ని । నిమ్ములఁ జరిమి యయ్యెదురైన రిపుల
దివ్యాస్త్రములఁ ద్రుంచఁ దెచ్చెరేఁ; దివురుటయు । దివ్యాస్త్రములు తమ తెగకు రాకున్నఁ
జగతున కొర్వక ప్రకృతి బాణముల । జగముల కతిభీతి జనియింప నేయ
నతనితూపులఁ ద్రెవ్వె హాతినుయ్యె విల్లు; । నతని సూతుఁడుగూలె; హరులునీఱయ్యె;
నరదము నీఱయ్యె; [2]నడిమూల మడఁగె; । నురుకిరీటము రాలె; నొడలిజో డూడె;
నుదరు నారసమును నొరదూఱి పాఱ । గద వాఁడువైచె నక్కలశసంభవుని.
వైచిన గదద్రుంచి వాఁడంత మఱియు । వైచిన శక్తియు వడిఁ ద్రుంచె గురుఁడు.
చలమున నంతలో జడియుక వాఁడు । పలకయు వాలును బట్టుక కవిసి
యాచార్యునూతు రథ్యములఁ జెండాడ । నాచార్యుఁడును వాని యసి ద్రెవ్వనేయ
నింతట వాయుజుఁ డేతెంచి శ్వేతు । నెంతయు దవ్వుగా నీడ్చుక తొలఁగఁ,
[3]దొలఁగఁబో పొమ్మని ద్రుపదజుఁ డరుగఁ, । గలఁగిన మనముతోఁ గ్రమ్మఱ గురుఁడు
నాల్గునాళ్ళును నొకనాటి రాత్రియును । నాల్గైన లేవనాఁడు నాడికలు
చేసితి [4]నెఱపితి సేనాధిపత్య । మీసంగమునందు నే నెసఁగి యట్లరుల
వెసనిరువదియొక్క వేయట్లలాడఁ । గసిమసఁగితి సంకఁ గయ్యంబుచాలు."
నని శాంతివాటించి యస్త్రంబు విడిచి । మునివృత్తిమై వీరముఖ్యులఁ జూచి,
"ఓకృప! యోకర్ణ! యోకృతవర్మ! । యోకౌరవేంద్ర! నా యోపినట్లేను
బోరితి నీకఁ జాలుఁ బుణ్యలోకములు । గోరితిఁ బోయెదఁ గుశలత నేను."
అని పల్కి రథముపై నతఁడు గూర్చుండి । కనుదోయి మోడ్చి యోగప్రభావమున
నీరు నీరును నింగినింగి మారుతము । మారుతమ్మును మహిమహిఁ గూడినట్లు
నర కృప హరి ధర్మనందనులెల్లఁ । బరికింపఁగా ముక్తి పదమునఁ జెందె.

---

1. క్షోణికి. 2. నడిమిముడంగె. 3. తొలఁగఁ బొమ్మనియను. 4. పెటికితి. (మూ)

## ధృష్టద్యుమ్నుఁడు మృతుఁడైన ద్రోణుకంఠము నుత్తరించుట

శ్వేతుఁడప్పుడు వాలు చేత ధరించి । యాతని రథముఁ గలవొప్ప దాఁటి
హాహారవంబు సైన్యములెల్లఁ జేయ । నా హంత గురుసుతుత్తమాంగంబు వట్టి
మును నెనుబదియేండ్లముసలి గురుండు । చనవసి యాథర్వ శక్రజులాఁగ
వంచిన కంఠంబు వాలునఁ దఱిగి । యించుక దయలేక యిలఁ బడవైచి
యట్టి యావల త్రోచి యార్చినఁ జూచి । కుట్టుగుండెల పంతఁ గురుసేన పఱచె.
వారిపైఁ బాండవవాహిని తఱుమఁ । దేరికి నగుడ నేతెంచె శ్వేతుండు.
అంత దుర్యోధనుఁ డాచార్యువధకు । నెంతయు భీతుఁడై : " యిఁక నేదిదిక్కు !
పోయె నాధారమై పోయెడువాఁడు ; । నాయత్న మేటికి నయముతో డేదు !
పోదము పోయిన పోకన !" యనుచు । నాదెస మంత్రిసహాయుఁడై కదలి
గొడుగులుఁ బడగలుఁ గుంభినిఁ బడఁగ । దడగొని వచ్చుచో ద్రౌణి వీక్షించి
యావల నొకచోట నసనెయుచుండి । నేవేగ నేతెంచి విభుఁ గాంచి పలికె:
" కోదండపాణియై గురుఁడు ప్రాణమున । నాదెస నరిసేన లణఁగింపుచుండ
నేటికిఁ బాఱెద ? రేమయ్యెఁ జెప్పుఁడ ? । మీ కెద విలువ్వుఁడు మీభయంబెల్ల ;
అతనికి నేమయా ! యనిచెప్పఁ." డనినఁ । జతి చెప్పలేకచోఁ బలికెఁ గర్ణుండు :
" గురునిచందము వినఁగోరెదు వినుము ; । గురుఁడు వాఁడాలుర గూల్చుకోపమున
జనుదెంచె ; భీముఁ ' డశ్వత్థామ చచ్చె ' । నని యొక్క దంతిచా వతనికిఁ జెప్ప
నమ్మక మది ధర్మనందను ద్రోణుఁ । డమ్మాట యడిగిన, నతఁడు నేరుపున
' నణఁగె నశ్వత్థామ ' యని వినవాడి । కడుఁబిన్న యెలుఁగునఁ ' గరినుమీ ' యనెను.
అది వినకతఁడు ' హాహా పుత్త్ర ! ' యనుచు । మొదలిటి మాటకు మ్రొగ్గి విల్విడిచి
నవయోగమహిమఁ బ్రాణంబులు విడువ । శవమునకడరి ధృష్టద్యుమ్నుఁ డతని
తలవట్టి తివిచి కంధర మసిధార । నలిఁ గోసె ధర్మజనరులు వారింప.
వినుమిది కతముగా నీఁగితి మేము । జనకుని వెదక నెచ్చటికేఁగెదీవు ? "
అనిన మూర్ఛమునింగి యాతండు వ్రాలి । తను రాజు తెలుప నెంతయుఁ దడవునకుఁ
దెలిసి కన్నులఁ గోపదీపాగ్ని లోలుక । జలజాక్షు యత్న మీసకలంబు ననుచు
నధిపతి నీక్షించి " యక్కటా ! గురుఁడు । విధివశంబున మేను విడుచుఁగాకేమి
తలయెట్లు ద్రుపదనందనుఁడు తాఁ గోసె ; । తలపోయఁడయ్యెఁగదా యని నన్ను !

నాకుఁగా నతఁడు ప్రాణము లిచ్చియుండ । నాకృతి నేనేల యతనికై చావ.
గురువధార్థంబుగాఁ గొడుకనై యేను । ధరఁబుట్టి నేటికిఁ దప్పెఁ గార్యంబు.
పార్థివ, వినుము నాపట్టిన ప్రతిన; । పార్థుల నిదె పోయి భజించువాఁడ.
నరనాథ, నేఁ బదినాళ్ళలోపలను । అరులఁ జంపెదనని చూడనే నాఁడు!
అదియెల్ల నిజముగా నన్నృతంబు వలికి । బ్రదుకఁ జూచినరాజుఁ బట్టి నిర్జింతు.

### అశ్వత్థామ పూనికవలనఁ గౌరవయోధులు మరల ననికిఁ గడంగుట

మున్ను మాద్రోణుండు మురవైరిఁ దూర్చి । పన్నుగా ఘోరతపం బాచరించి
యతనిచే నారాయణాస్త్రంబు గాంచె; । ధృతి నాకు నతఁడుపదేశించినాఁడు.
అట్టి నారాయణాస్త్రాగ్నిచే నిపుడు । నెట్టన రిపుకోటి నీఱు గావింతు
ర." మ్మని రథమెక్కి రారాజుఁ గొనుచు । వాలున్మని కర్ణాది యోధులే తేర
భయద భేరీ శంఖ పటహాదితూర్య । హయ హేషితధ్వని సంబరంబ్రువఁ
దను జూచి గురుఁడీల్గు దగయెల్ల నణఁగి । ఘనసేనలార్పుచుఁ గదిసి యే తేరఁ
దిరిగి యెక్కెఁ, నటన్న ధృతరాష్ట్రుఁడనియె: । "అరయ సంజయ, యిది యాశ్చర్యకరము;
ఆరీతిఁ దిరిగిన నచటి కౌంతేయు । లేరీతి వర్తించి రెఱిఁగింపు." మనిన
నతని కిట్లని చెప్పె నవనీశ, యిట్లు । ధృతమతి ద్రౌణి వే తిరిగి యెక్కుటయు,
నచటఁ బాండుకుమారు లందఱుఁ గూడి । ప్రచుర సన్నాహ మేర్పడి యుండునంత,
నంతలో ధర్మజుఁ డర్జునుఁ బలికె: । "ఎంతయుఁ గడుఁ జిత్రమిదె చూడు క్రీడి!
యింతకుమును గురుఁ డీల్గిన భీతి । నంతఁ బాఱినయట్టి యఖిలకౌరవులు
నిలయును నింగియు నేకమై యద్రువఁ । జెలఁగి యార్పుచు వారిసేన లుప్పొంగ
వేవచ్చుచున్నారు; వెండియు వీర । లే విచారముచేసి యిటకు వచ్చెదరో!
కాదేని గురునసంగతిఁ జంపిరనుచు । నాదివస్పతి వీరినటఁ గూడినాఁడో!
ఏమి కారణము నాకెఱిఁగింపు." మనిన । నామహీపతితోడ నర్జునుఁ డనియె:
"నన్యస్తశరుఁడైన చాపజ్ఞు మరణ । మన్యాయ మని విని యతని నందనుఁడు
త్రుంతు వధింతుఁ దుత్తుమురుగా ననుచుఁ । గౌంతేయు విభులపైఁ గడునల్గినాఁడు.
జనియించు వేళ నుచ్చైశ్శ్రవలీల । ఘనుఁడు ఘోషింపఁ దత్కారణమ్మునను
అతని నశ్వత్థామయనిరి గీర్వాణు । లతఁడునుమీ యిప్పుడరుదెంచువాఁడు."
అని వెండియును బల్కె: "నకట నీ మాటఁ । దనయుని చావు తథ్యంబుగా నమ్మె.

అనృత దోషము వచ్చె ననక్తి వచ్చెఁ । జనకుని గొంత విచారింపనైతి.
అదియును గాక నిరాయుధు విప్రు । నదియును వృద్ధు నాచార్యు యోగాఢ్యు
వలదు హా మానుమా శిరంబు ద్రుంపఁగ । వలదని యేనెంత వారింప వినక
యతని ముందల పట్టి యసిఁ ద్రెవ్వనేసె । నతిపాపకర్ముఁ డీ యగ్నికుండజుండు."
అని పల్కుచుండంగ నంతఁ బాంచాల । తనయుఁడు ధవళాశ్వుఁ దప్పక చూచి,
"యనఘ, ద్రోణుని విప్రుఁడని పల్కితీవు । విను విప్రుఁడే! రాజవిధ్వంసకుండు?
మా తండ్రిమీఁద నుమ్మలికమ్ముఁ జేసి । ప్రాఁతఁ జంపెనువాఁడు పగవాఁడు గాఁడె!
అతనిఁ జంపఁగఁ గాదె యగ్ని వెల్వడితి; । నితరునిభంగి నీ విట్లాడఁ దగునె!
మఱి మొన్న నీ పితామహుఁడైన భీష్ము । హతుఁ జేయవే! నిన్ను నాడను గాక."
అనిన నర్జునుఁడు బాష్పాకులుఁ డగుచు । ననఘుఁ డజ్ఞేమియు ననరాదు గాన
నూరకయుండె నిట్టూర్పులు నిగుడ । నీ రూపమున నోఁత యేటికి ననుచు.

## ద్రోణపరిభవంబునకు సాత్యకి ధృష్టద్యుమ్ను నధిక్షేపించుట

అపుడు సాత్యకి ద్రుపదాత్మజుఁ బలికె: । "ఇవుడు నీవిట్లాడితేమిరా యోరి?
నీజిహ్వ గోయును నిక్కంబు ధర్మ । రాజు సన్నిధి గాన బ్రదికిపోయితివి.
గాంగేయు నట్లు శిఖండియే తునిమె; । నంగతియే క్రీడి చంపినాఁడనుట?
నోడిపెదవే నిన్ను నోరు వ్రేయింతుఁ । దోడిఁబడ." నసుటయు ద్రుపదనందనుఁడు:
"వెలప్రేలెదురా! సహించిన నెఱుఁగ । వేల త్రుళ్ళెదు నిన్ను నెఱుఁగనా యోరి?
నీ యొమ్ము ద్రొక్కిన నిజయోగరతుని । భూరిశ్రవుని నీవు పొరినొనవైతె?
అలిగి నన్నింక నేమాడిన నిన్ను । దల ద్రెవ్వ నేయుదుఁ దథ్య మీపలుకు.
అదె వచ్చెఁ గురుబలం బాహుతి గొనఁగ । నజయాత్మ, కూడి రమ్మా పోదమందు."
అనిన శైనేయుఁ డుగ్రాకారుఁ డగుచు । ఘనరథంబవులకు దిగ్గన డిగ్గనుఱికి
కాలాగ్నికరణి నాల్కలు గ్రోయుచున్న । వాలు చే నమరించి వసుధ గ్రక్కదల
శ్వేతునకై పోవ, వీక్షించి వాయు । సూతుఁ డంతట నెడసొచ్చి పోనీక
తనలావుకలిమి నాతని నిల్వఁబట్టి । పెనుపుగా రోఁజుచుఁ బెనఁగు శైనేయు
శాంతునిఁ జేయ ధృష్టద్యుమ్నుఁ డనియె: । "కౌంతేయ, విడువిడు కడఁగి రానిమ్ము;
నీచేత నిలువంగ నేరఁ డీ వేళ; । నాచేతఁ గాని మానఁడు గర్వమహిమ."

అనునంతఁ గృష్ణ ధర్మాత్మజార్జునులు । చనుదెంచి వారల శాంతులఁ జేయ
నిజ రథారోహణ నియతులై సేన । నజిత మహావ్యూహమై యుండఁ బన్ని
తాఁకిరి పటహ ఢణంఢణ ధ్వాన । మాకాశ పథమెల్ల నాక్రమింపఁగను.
అపుడు గుణారావ మంతఁ గల్పాంత । కుపిత ధనుర్ధర కృష్ణునిఁ బోలె (?)
పార్థివులకు నల్గు భార్గవుఁ బోలెఁ । బార్థులకెల్లఁ గుంభజతనూభవుఁడు
భూరి సేనాముఖ్యమున నరువేయు । తేరుల వీరులఁ ద్రెళ్ళంగనేసి
దశసహస్ర మదేభతతి రూపుమాపి, । యశనికల్పుఁడు లక్షహరులఁ జెండాడి
దశలక్ష యోధ యూథము నుక్కడంచి । దిశ లద్రువఁగ నార్చి తేజంబుమీఱ,

## అశ్వత్థామ పాండవసేనపై నారాయణాస్త్రము ప్రయోగించుట

“ మేదినీశ్వర, చూడుమీ నన్ను నీవు । మోదింప రిపులఁ జంపుదుఁ ద్రుంతు” ననుచు
నదలించి నారాయణాస్త్రంబు దొడిగి । త్రిదశులు భీతిల్లి దివినుండి చూడ
నేసిన నది మహాహిత గర్వతిమిర । శాసన రవిసహస్రప్రభఁ బొదలి
శరభ సింహ మదేభ శార్దూల మహిష । ఖర ఖడ్గ భల్లూక ఘన కాలభూత
గరుడ కిన్నర యక్ష గంధర్వ సిద్ధ । సురవర పన్నగాసురుల నీనుచును,
గరివర సుభటవర్గములఁ గాల్చుచును । అరుదేర వీక్షించి యబ్జనాభుండు
సేనలకెల్లఁ దాఁ జేయెత్తి పలికె: । “ సేనాధిపతులార! చెప్పెద వినుఁడు ;
సామజ హయరథ చయముల డిగ్గి । భూమిపై నాయుధంబులువెట్టి నిలుఁడు.
ధృతి నిరాయుధులను దివ్యసాధనము । హతులఁజేయదు నేయుఁడాక్రమం.” బనిన
జగతీశు లాయాజ్ఞనలుప భీముండు: । “ దిగకుఁడు రథములు దిగనేల మీకు!
నీయస్త్రమెంత నేనిదె త్రుంతు.” ననుచు । దాయ తూర్పునకు రథంబుఁ దోలింప,
నా మహాస్త్రంబు రౌద్రాకారమగుచు । భీముపైఁ గవిసి సంభృతవహ్ని ముంప
నరుఁడంత వరుణబాణంబేసి భీము । నురువహ్నిఁ గాలకయుండ రక్షించె.
అంత దిగ్గన బాఱి హరి భీముఁ గదిసి । “ యింతటఁ బోవునే యిమ్మహాశరము!
వలదు సాహస ” మని వాయునందనుని । నలవోక డించి నిరాయుధుఁ జేసి
యమరేంద్రనందను నల్లకావింప, । నమిత సైన్యంబులు నట్ల సేయుటయు
నయ్యుగ్రమెల్లఁ జయ్యనమాని శాంత । మయ్యె నద్దివ్య మహాసాధనంబు.
అంత వెండియు సేన హరియాజ్ఞఁ దురగ । దంతి రథంబులు దగ నెక్కి కదియఁ

గురురాజు ద్రౌణిఁ గన్గొని "యా శరంబె ! ఖరతేజ, నాఁ డిసుగఁగ వేయు" మనిన
నెలమి నాతఁడు పల్కు: "నీఁక నేయరాదు । వలసి యేసినఁ దన్ను వ్రాల్చు నెక్కైన;
కృతమతి నదియును గృష్ణుని వలన । హతమయ్యె నేమిసేయఁగవచ్చు ? " ననుచు
నిట్టూర్పు నిగిడించి నృపునితో మఱియు । "నట్టయ్యుఁ జూడుమీ యధినాథ, నన్ను
హరునైన నరునైన నగ్నిజునైనఁ । బోరి గొందుఁగాని నేఁ బోసి " నటంచు
గురువధ రోషసంకుల చిత్తుఁ డగుచుఁ । బరువడి ద్రుపదజుపై వచ్చి తాఁకి
నన్నూఱు తూపు లున్నత వక్షమందుఁ । జెన్నార నేసి మూర్ఛితుఁ జేయుటయును
అందు సుదర్శనుండను మాళవుండు । నందు దీర్ఘప్రభుండను గౌళవిభుఁడు
నందు సుకేతనుం డను చోళపతియు । నందంద ద్రౌణిపై నార్చి యొక్కటయు
వారి మువ్వురఁ ద్రుంచివైచి ఘోరాస్త్ర । ధారల మేఘుచందమునఁ జూపట్టి
హరిమీఁద నరుమీఁద ననిలజుమీఁదఁ । గరి రథసుభట వర్గంబుల మీఁద
ద్రౌపదేయ శిఖండి ధర్మజ ముఖ్య । భూపాలకుల మీఁదఁ బోరి పోరి నేయఁ
దెరువులు గానక తిరితీపులాడ । దొరలెల్లఁ బాఱఁ బార్థుఁడు నిల్వరించి
'గురుపుత్ర, పోకుమీ కొంతసే' యనుచు । శరముల జడివట్టి చాపంబు దునిమి
ఘనసూత రథ రథ్య కవచకిరీట । తను లసద్బాణ కేతనముల నఱికి
పోయె నశ్వత్థామ భూమిపై నణఁగి । పోయెఁ గౌరవపతి పోయెఁ బొమ్మనఁగ
హరి సంతసింప సైన్యములు కీర్తింప । గురుసుతుఁ గ్రొవ్వాఁడి కోలల గ్రుచ్చి
సకల[1]సైన్యమును జర్జరితంబు సేయ, । 'నీకఁ జాలు రా కయ్య మింతట' ననుచుఁ
జేతులు విద్రుచుచుఁ జేతికి మించి । [2]కాతర భావంబు గానరాఁ బాఱె.
పాఱుచోఁ గర్ణాది భటులు నవ్వేళ । తాఱివధృతి ద్రౌణిఁ దగఁ గూడుకొనుచు
వివశాత్ములై మిన్ను విఱిగినట్లగుచుఁ । (బవిలి కౌరవ యోధవరులు శోకింపఁ)
గలకలంగునఁ గౌంతేయులార్వఁ । బఱచిరి యేమిచెప్పఁగవచ్చు నధిప !
అప్పుడు సూర్యుండు నాహవదశకు । ముప్పిరి శోకాబ్ధి మునిఁగినరీతి
యనదృశకాంతి దైవాఱుచు నుండ । వెసఁ బశ్చిమాంబుధి వీచుల మునిఁగె.
అటఁ బాండుసుతులు సైన్యముఁ దారుఁ గూడి । తటుకునఁ బోయిరి తమపాళెములకు.

---

1. దేహములు జర్ఝరిసేయ నాళ. 2. కాతుర పాకంబు. (మూ)

అంత సుయోధనుఁ డాకీతి విక్షించి । సంతాపమున నివాసమునకుఁ బోయి
గురుభీతి దొరల వీడ్కొలుపను మఱచి । పరవశుండగుచు బాష్పము లుప్పతిల్లఁ
దను జూచి లజ్జించి తలవాంచియున్న । ఘన వీరయోధ వర్గముల కిట్లనియె :
" అక్కటా ! యాచార్యుఁ డాజిలోఁ గూలె : । దిక్కెవ్వరున్నారు ! తీఱెఁ గార్యంబు;
ఇంక నెక్కడిరాజ్య ! మెక్కడి రణము ? । శంక నేటికిఁ బొందు జగతీశులార !
కమలనాభుని సంధి గైకొనితప్పు । తమకించి సుసభాజ్ఞ దాటినతప్పు
నొప్పైన విదురుపల్కుల్లని తప్పు । తప్పంనే నాకు వృథా గర్వ" కనుచు
నేడ్చినఁ, దోడేడ్చి యెలమిఁ బాంచాలి । వీడ్చిన రాజుతో నిట్లనెఁ గృపుఁడు :
" ఓ కౌరవేశ, నీ వుఱక చింతిలకు; । నీకు మే మిటఁ గల్గ నీతియే వగవ !
కటకటా ! నీవాఁడు కర్ణుఁడున్నాఁడు; । భటులు పెక్కండ్రు దోర్బలు లున్నవారు.
అవనీశ, నీవు సేనాధ్యక్షుఁ గాఁగఁ । బ్రవిమలగతిఁ గర్ణుఁ బట్టంబు గట్టు.
అతఁడు సేనాపతియైనఁ బాండవుల । హతులఁ జేయఁగనోపు నటు సేయు. " మనినఁ
గొంత శోకము మాని కువలయేశ్వరుఁడు । సంతోషమున భానుసంభవుఁ బిలిచి :
" నరు గెల్తునంటివి కర్ణా ! నీవు నాకు । నరపి సేనాధిపత్యము సేయవలయు.
పావని తమ్ముని౯ బట్టి నిర్జింప । నేవేళ నీవుగా కెవ్వ రున్నారు ?
చేయక చేసిన సేనాధిపతివి । ధీయుక్తి రిపుల సాధించి రక్షింపు. "
అనినఁ గర్ణుఁడును " మహాప్రసాదంబు; । అనఘ, నన్ బూన్చు సేనాధిపత్యమున.
కృతవర్మ గురుపుత్త్ర కుంభజముఖ్యు । లతిరథోత్తము లెందఱైన నున్నారు;
వీరిప్రాపునఁ బాండవేయులనెల్ల । ఘోరాజిలోపలఁ గూలనేసెదను.
నే నల్గినను నిల్వనిత్తునె వారి । భూనాథ ! " యనవు డుప్పొంగి రారాజు
కనక కుంభములను గంగాజలముల । నను వారఁ దెప్పించి యతిసంభ్రమమునఁ
దోరమై మంగళతూర్య ఘోషములు । భూరి మాగధ బుధాస్తుత నుతిధ్వనులు
భేరీ ధణంధణ పృథుల వాద్యములుఁ । జారుసైనిక ఘన జయజయధ్వనులు
నేకమై మ్రోయ మహీనాథ చంద్ర ! । యాకర్ణు నభిషేక మపుడుగావించి
తమ్మట పటహాది ధ్వను లుల్లసిల్ల । న మ్మహీశుఁడు కర్ణు నభిషిక్తుఁజేసి
భానునందనునకుఁ బట్టంబు గట్టి । యానందమునఁ బొందె నఖిలసైన్యంబు.

ఏ నిట్టి తెఱఁగు నీ కింతయుఁ దెలియ । భూనాథ, యెఱిఁగింపఁ బూని వచ్చితిని. ”
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయక్షితిపతికి
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యామీఁద । నెప్పుడుఁ గథ చెల్లె నెఱిఁగింపు మనిన
భానుకులాంభోధి పావన చంద్ర! । భానుకోటి సహస్ర భాభాసమాన!
కరుణాకటాక్షవీక్షణ! దయాలోల! । సురరాజనుత! మహాసురరాజహరణ!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత ద్రోణాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగఁ బంచమాశ్వాసమయ్యె.

# ప్రథమాశ్వాసము



శ్రీ వేంకటాధీశ, సృష్టిప్రకాశ, । భావజాతీతవైభవ, భోగనిలయ,
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథానువృత్తి మిట్లని చెప్పఁదొడఁగె:

## ధృతరాష్ట్రునకు సంజయుఁడు కర్ణుని తెఱఁగెఱిఁగించుట

ఆరీతి సంజయుఁ డాలంబుమాని । వారణపురికిని వడినొప్ప వచ్చి
తనరార నంబికాతనయు మందిరము । ఘనతఁ బ్రవేశించి కిరిమస్థిఁ గాంచి
యా రాజునకు మ్రొక్కి యాతఁడు తన్ను । గారవించిన నొక్క కనకపీఠమునఁ
దిరముగాఁ గూర్చుండి ధృతరాష్ట్రుఁ జూచి । పరువడి నొకమాట పలికె [1]నిట్లనుచు:
"మనవారి మొనలును మఱి పాండురాజ । తనయుల బలములుఁ దలపడి రెండు
దినములు పోరిన తెఱఁగెల్ల నేను । దిననాథ సమ తేజ, తెలిసి వచ్చితిని."
అని పల్కి రాధేయు నతుల విక్రమము । గొనియాడి మఱియు డగ్గుత్తిక వెట్టి
పలికెఁ "గుంతీసుత బలసముద్రంబు । గలయ మందరగిరిగతిఁ జొచ్చి కలఁచి,
మొన లేపుచూపిన మొనసి యుద్వృత్తు । గొనియు సామంతుల క్రొవ్వడంచియును
బొలమెల్లఁ బీనుఁగుప్రోగులుగాఁగ । నలిమీఱ యోధుల నఱికివేసియును
అడరెడు కడిమిమై ననిలోన జనుని । కొడుకు నుద్వృత్తుగాఁ గొని చెలరేఁగి,
క్రీడి నెదుర్పడి క్రీడియుఁ బోలెఁ । జూడ నక్కజముగా శౌరత మెఱసి,
పులికగ్గమైన యాఁబోతును బోలెఁ । బొలిసెఁ గర్ణుం డింద్రపుత్త్రునిచేత.
మనుజేశ, యదిగాక మన దుస్ససేను । ననిలసూనుఁడు పట్టి యందఱుఁ జూడ
ఘన ఖడ్గధార నాతని ఱొమ్ము చించి । తనియక యుగ్రుఁడై త్రావె రక్తమును.
అయ్యో, యింతలు పను లవునని మున్నె । నెయ్యో లాడినమాట నిజమయ్యె నేఁడు.
కొడుకు లాతనిసిరి గొన శక్తులనుచు । నడియాన [2]వారల యన్యాయములను
నీ వుపేక్షించిన నేఁ డాఫలంబు । భూవర, కుడువక పోనేలవచ్చు?"
అన విని ధృతరాష్ట్రుఁ డా సుయోధనుఁడు । ననిలోనఁ దెగటారినట్లకా వగచి

1. సంజయుఁడు. 2. దారల. 3. పోవనే విచ్చు. (మూ.)

నిట్టూర్పు లెసఁగఁగ నెలకొన్న వగల । బెట్టున మూర్ఛిల్లి పృథివిపైఁ ద్రెళ్లె.
అప్పుడు విదురుండు నా సంజయుండుఁ । జెప్ప నచ్చెరువుగా శీతలక్రియలు
తెలిఁగొప్పఁగాఁ జేయఁ దెలిసి కూర్చుండి । ధరణీశుఁ డొక కొంత ధైర్యంబువట్టి
మొగమున వేఁడియూర్పులు గ్రమ్ముదేరఁ । బొగులుచు సర్పంబుపోలె [1]రోఁజుచును
దనమదిలోఁ దాఁకి, దైవంబు దూఱి, । దనదైన దుర్బుద్ధి తలపోసి రోసి,
చెచ్చెఱ సొబలు సేతలు దెగడి, । విచ్చలవిడిఁ బాండవేయులఁ బొగడి
"సంజయా, నీమాట చక్కఁగా వినుము; । అంజక చెప్పవే యాలంబులోనఁ
దొడిఁబడ నెదిరించి సుయోధనుండు । పడఁడుగదా! నేఁడు పగవారిచేత."
అనవుడు "రాధేయుఁ డాతనితోడఁ । దనయులు కొందఱు తమ్ములుఁ దెగిరి.
చెచ్చెఱ మన దుస్ససేనుని ఱొమ్ము । వ్రచ్చి నెత్తురు ద్రావె వాయునందనుఁడు."
నావు డూఱకయుండి నరనాథుఁ డపుడు । భావించి సంజయుఁ బలికెఁ గ్రమ్మఱను :
"మునుమిడి విభ్రాంతి మునిఁగిన చింత । యెనయ నా వాక్యంబు లేమియు వినఁడు;
దుర్మదాంధుండైన దుర్యోధనుండు । ధర్మజునకుఁ గీడు దలఁపుచు నుండు.
కోరి వారింపని కొఱగామిఁ గాదె । భూరి శోకంబునఁ బొగులుచున్నాఁడ.
పెల్లు శోకాంబుధిఁ బెనగొన్నవాఁడు । నుల్లంబు కొంకక యూఱడు నెట్లు?
కలిమియు లావు నగ్గలికయు వెరపుఁ । గడఁకయు మగఁటిమిగల మహారథులు
తలపోయ నింక నెందఱు మనవీట । నెలమి నున్నారు? నా కెఱిఁగింపు." మనిన,
నంబికాసుతుఁ జూచి యా సంజయుండు । పంబి యిట్లనిపల్కె : "పార్థివ, వినుము
వరబాహు శౌర్య దుర్వారాతి శైల(?) । సురనాయకుఁడు ద్రోణసూనుఁ డున్నాఁడు
వినుత పరాక్రమ విద్వేష తిమిర । వనజమిత్రుఁడు కృతవర్మ యున్నాఁడు;
వీత [2]భయోత్పాత విమతోగ్ర గహన । జాతవేదుఁడు కృపాచార్యుఁ డున్నాఁడు;
అవినయవైరి మహావారి వాహ । పవమానుఁడగు మద్రపతి యున్నవాఁడు;
కపటశత్రువ్రాత గర్వసంహార । నిపుణుఁడు గాంధారనృపతి యున్నాఁడు;
అక్షీణ విక్ర మాహవ నిత్యకేళి । దక్షులు భవదీయతనయు లున్నారు;
క్రూర వీరావేశ ఘూర్ణాయమాన । ఘోరచిత్తులు కర్ణకొడుకు లున్నారు;
మఱియు నానా[3]దేశ మండలేశ్వరులు । వఱలియున్నారు దుర్వారవిక్రములు.

---

1. రొఁగుచును. 2. భయోత్సాహ విమలాగ్ర. 3. ఘోర. (మూ).

వీరలఁ గాని పోర విజయంబు వడయఁ । గోరియున్నాఁడు నీకొడుకు." నావుడును
సూనునికడఁ కకుఁ జోద్యంబు నొంది । భూనాథుఁ డాకర్ణితప్రాప్తాతురుఁడై
కడు నసహ్యంబైన కర్ణుని మరణ । మెడఁదలోఁ దలపోసి మొలఁగత్తి పలికె:

## కర్ణుని మృతికి ధృతరాష్ట్రుఁడు దురపిల్లుట

"హా విష్ణుసమధుర్య ! హా మేరుధైర్య ! । హా వార్ధిగంభీర ! హా గుణాధార !
హాయి తే రాధేయ ! పుణ్యావిధేయ ! । హాయి తే రవిపుత్ర ! భుజబలపాత్ర !"
అని యిట్లు పలుమాఱు నందంద పనలి । యనియె సంజయుతోడ నాంబికేయుండు
"నమ్మినయట్టి బాంధవకోటిపాటు, । చుమ్మలుగొనియెడు సూనులచేటు,
కూరిమిగల తండ్రి కూలినలాగు, । శౌర్యవిక్రముఁడైన గురునిపోకడయును,
దుర్నివారాహవ తోయధి గడపఁ । గర్ణధారుండైన కర్ణుని మృతియు
మనువాక్యమును బోలె మహిఁ గథవోలె । [1]మనికితపడక నెమ్మదినుండి వినుచు
నొక్కఁడ మ్రందకయున్నాఁడ నిపుడు । తక్కుప్రాణంబులు తక్కినవాఁడ.
విషముబ్రింగినను విడుతుఁ బ్రాణములు ; । విషధిలోఁ జడినైన విడుతుఁ బ్రాణముఁ
బ్రాయోపవేశంబు పాటించినైన । వేయి చెప్పఁగనేల విడుతుఁ బ్రాణములు."
అని తెంపుమై నాడ నతనివాక్యములు । విని సంజయుం డంత వినయుఁడై పలికె:
"కృతమందు విశద విశ్రుతకీర్తియందు । మతియందు నధికసన్నాహంబునందు
యోగంబునందు నుద్యోగంబునందు । భోగంబునందును బురుషార్థమందుఁ
బ్రణుతింపఁ దొంటి భూపాలపుంగవులు । గణుతివెట్టఁగ నీకు గారు నీతోడ.
అంతటివాఁడవై [2]యుక్కటా యిప్పు । డింతకు వచ్చితే యింతకులేశ !
వీరిడిభంగి వివేకంబు మాలి । యోరాజ, యిట్లాడ యోగ్యమే నీకు?
తాలిమిదూలిన ధారుణిలోన । నాలివాఁడని నిన్ను నవ్వరె జనులు !
బవరంబులో గతపడ్డవారికిని । దివిజేశ శోకింపను ధృతి నూలుకొలుపు."
అనవుడు వగపేది యా ధృతరాష్ట్ర । జననాథుఁ డా సూతసంభవుఁ బల్కె:
"యువరాజు మరణంబు నొప్పుగా వినియుఁ, । జెవులారఁ గర్ణునిచేటును వినియుఁ
దునియదు ద్రుంగదు తుమురునుగాదు । చెనఁటిచిత్తము వజ్రశిల గాఁగఁబోలు,

---

1. మనకత. 2. యంతక. (మూ).

వందురి వందురి వనరి నా మనసు । డిందేఁ జట్రాతేఁ గొట్టినఁ జావులేదు.
పరశురామాస్త్రప్రభావ కోవిదుఁడు । నిరుపమ వితరణ నియత మానసుఁడు
అతిసత్త్వధనుఁడు లోకైకవీరుండు । చతుర విక్రముఁడైన సవితృనందనుఁడు
ఆరయ దైవోపహతుఁడయ్యెఁ గాక । పౌరుషబలమునఁ బడియెడివాఁడె!
పాండుపుత్త్రులతోడి పగకోర్చి వెఱవ । కుండె నెవ్వని నమ్మి యొగి సుయోధనుఁడు;
వైదేహ పౌండ్రాది వసుధాధినాథు । లాదట నెవ్వని కరిగాపులైరి;
పెనుపొంద నెవ్వని పెనుప్రాపు గలిగి । మనసేన లెప్పుడు మదవృత్తి మెఱయు.
నట్టి మహాబలుఁడంట నీరజాక్షు । పట్టి సంగరభూమిఁ బడిన పిమ్మటను
శతవృద్ధునకు రూపవతి సంగమంబు । కుతలంబుపైఁ బిచ్చు[1]కుంటుకుఁ బరువు
నెలకొని గ్రుడ్డివానికి లెన్నచూడ్కి । వెలయఁ గోరిన సంభవింపని మాడ్కి
నయదూరుఁడైన యా నాగకేతునకు । జయము సిద్ధింపదు సర్వయత్నముల.
'మనకేల కయ్యంబు మదిమది నుండి' । యనుచు ధర్మజుఁ డాడె; నతని వాక్యములు
బాగొప్ప మీపతి పాటింపఁడయ్యె । రోగి తాఁ బథ్యంబు రోసినభంగి.
శరతల్పముననుండి శంతనుసుతుఁడు । సరవిఁ బార్థుని దివ్యశరవైభవంబు
దెలుప జలంబులు తేరంగఁ బసిచి । "సొలసి పాండవులతోఁ జుట్టఱికంబు
నడపు, రాజ్యంబును నలువొప్పఁ బంచి । యిఁకను యుద్ధముమాను మింతటినుండి
మనుము నీ." యనిన దుర్మదుఁడు కౌరవుఁడు । వినఁడింక శోకాబ్ధి వెసఁ గూలకున్నె!
బలిమి ఱెక్కలుత్రుంచి పసుచులాడించు । పులుఁగుచందంబయ్యె భూమి నా విధము.
ఎక్కడఁ [2]జొచ్చెద! నీ వగలుడుప । దిక్కెవ్వ! రిటమీఁదఁ దెఱఁగేది నాకు!"
అని పెక్కుభంగుల నడరి నెవ్వగల । మునిఁగి క్రమ్మఱ మొగంబునఁ దెలివొంది
దినకరపుత్త్రుండు తెగినవిధంబు । వినఁగోరి వైచిత్రవీర్యుఁ డిట్లనియె:
"తలఁకొన్న కడఁకతో ధవళవాహనుఁడు । చలమున నేసిన చండకాండముల
తాఁకున కోర్చెనే? దర్పమొప్పార । వీఁకఁ బేర్చెనె భుజవీర్యంబు మెఱయ?
తన యుగ్రకోపంబుఁ దనప్రతాపంబు । దన ధైర్యమహిమయుఁ దన శౌర్యగరిమ
వెలుఁగంది యిరువాగు వీక్షింపుచుండ । నటిమెనే యోధుల నధిక ధైర్యమున?
తనుకుచుఁ గయ్యంబు దయ్యామె యెఱుఁగు । నని [3]పఱవఁడుగదా యర్కనందనుఁడు?

---

1. గుంటకు. 2. చొరువాడ. 3. పరుపఁడు. (మూ)

తెగువ శిఖండిని దీమంబుచేసి । మగటిమితో వాని మాటున నిలిచి
గరిగంటిగానిక కపటమార్గమునఁ । బొరిగొనె భీష్ముని బురుహూతసుతుఁడు.
సామజంబొక్కటి సమసినఁ జూచి । భూమి నశ్వత్థామ పొలిసెఁ బొమ్మనుచుఁ
దప్పక యమపుత్రి తాఁ బల్లలాడి । చక్కంగ నాకుండఁ జంపించె గురుని.
కొంచక యీరీతిఁ గుటిలశాత్రవులు । వంచనఁ జంపిరో వనజాప్తసుతుని?
భర్గు శిష్యునిదయఁ బడసినవాఁడు । భార్గవాస్త్రంబును బ్రహ్మశరంబు
వడముడితమ్ముని వధియింపఁబూని । యొడికమై యున్నది యురగసాయకము.
తక్కక మంటలఁ జిమ్ముచుఁ బోలుచు । పెక్కు దివ్యాస్త్రముల్ పెంపారఁగలవు.
సుభటకోటులు చూడ శూరుఁడై నిలిచి । యభిమన్యు విలు మును నఱకఁడే మున్న!
సహదేవు గిట్టి దుస్సహాలిలఁ బట్టి । మహిమీఁద మర్దించి మందల విడిచె.
పవమానతనయుని బతిమాలుపించి । తవిలి పాఱంగ [1]బాహుదలపట్టి విడిచె.
గ్రక్కున మాయతోఁ గడఁగినవాని । నుక్కఱ హైడింబు నుర్వరఁ గూల్చె.
ఇట్టి రాధేయున కిట్లాఁగి చావు । కట్టడ చేసెనే కటికిదైవంబు!
ఎన్నికకెక్కిన యిట్టియుద్ధంబు । లన్నియుఁ బడటిపాలై పోయెనొక్కొ!
అరదంబు క్రుంగెనో! యరయ సారథికి । నెరవు లేదయ్యెనో! విలువిద్య పేర్మి
పనికి రాదయ్యెనో! బాణజాలములు । మనసులోఁ దోఁచక మాయమై చనెనో!
లేకున్న సంజయా, లేశమాత్రంబు । నీకీడు వచ్చునే యితనికిఁ దలఁప?
ఆతతగతిఁ దన యరదంబు గడప । సూతు నెవ్వనిఁ జేసె సూతనందనుఁడు?
కృతవర్మ గురుపుత్ర కృప శల్య శకును । లతనికి నేభంగి నయిరి తోడ్పాటు?
అందఱుఁ దలమీఱి యాజి నారాజు । బృందారకులు తన పేర్మి వీక్షింపఁ
గయ్యంబు సేయుచోఁ గౌరవేశ్వరుఁడు । నెయ్యంబు చూపెనో నిలిచి యత్తఱిని?
కెలఁకులవారలు గీల్కొని నడవ । వెలయంగ రారాజు వెన్నాడి నడవ
నా రవిపుత్త్రున కనిలోనఁ గూలఁ । గారణంబేమియుఁ గానఁ జొప్పడదు.
పాండవకోటి నిర్భరవృత్తిఁ గడఁగి । ఖండనంబునఁ గర్ణుపై నచ్చుటెట్లు?
చావక నొవ్వక సర్పబాణమున । కేవిధంబునఁ దప్పె నింద్రనందనుఁడు?
ఏచి దినద్వయం బిరువాగు గడసి । యేచందమునఁ బోరి రెఱఁగింపు నాకు."

1. దాని. (మూ).

అనవుడు సంజయుఁ డాంబికేయునకు । ఘనశౌర్యప్రౌఢి నక్కథ చెప్పఁదొడఁగె:
"మునుమిడి కయ్యంబు మొదలుఁజేయుదు । విను మెఱిఁగించెద విశదంబుగాను.
[1]గురు విఱుగుట విని కోపించి ద్రౌణి । యరుదారఁ దన యోపినంతయుఁ బెనఁగె.
ఇనుఁ డస్తశిఖరికి నేఁగి పిదప । ననిపని చాలించి యంతట మరలి
సేనలతోఁగూడి శిబిరంబునకడకు । దీనాస్యులై చనుదెంచి రందఱును.
అప్పుడు కొలువుండి యా రాజరాజు । తప్పక ద్రోణనందనుఁ జూచి పలికె:
"తొడఁగిన కయ్యంబు తుదముట్టదనుచు । విడిచి యూరకయుండ వీరధర్మంబె?
కాన నీవెఱుఁగని కార్యంబు లేదు । మానుగా నెఱిఁగింపుమా యొక్కవలను."
నావు డశ్వత్థామ నాగాంకుతోడ । వావిరిఁ బటుతర వాక్యుఁడై పలికె:
"బహుళ సంగరకళా పారీణులగుచు । రహికెక్కు నుత్తమరథికులు తెగిరి.
వారు వోయిరటంచు వసుమతి మనకు । నూఱకయుండుట యుచితంబుగాదు.
పగఱ నాలమున నేభంగుల గెల్వ । నగునొకో యని పెద్ద యాత్మఁ జింతిలకు.
ఇప్పుడేమిటఁ దప్పె నీయున్న రథికు । లిప్పాట నల్పులే యుద్ధవిక్రములు;
వావిరి నుద్యోగవంతుఁడ వగుము । దైవసహాయంబు తానె గల్గెడిని;
ప్రతిపక్ష మాతంగ బంధుర కుంభ । సతత [2]భిదాకేళి చతురసింహంబు
ఘనుఁడు కర్ణుం డేమఱడయున్నై యుండ । మనుజేశ, విజయంబు మన కేమిబ్రాంతి!
దాయంబు తల నింకఁ దడయంగఁ దగదు । ధీయుక్తిఁ గట్టు రాధేయుఁ బట్టంబు.
ఇతఁడు గావఁగనోపు; నితని ప్రాపునను । క్షితినాథ, కురుసేన చెడక వర్ధిలును."
అని కర్ణుఁ జూపిన నాసుయోధనుఁడు । ననురాగమునఁ బొంది యతని కిట్లనియె:
నలినాప్తనందన, నామీఁద నీకుఁ । గలదు తాత్పర్య మగ్గల మేమిచెప్ప.
నీ బాహుశక్తియు నీ సాహసంబు । నీ బాణసంపత్తి నిఖిలంబు నెఱుఁగు.
ధీరసన్నుతుఁడగు దేవవ్రతుండు । నారూఢ బలశాలియగు [3]వస్త్రగురుఁడు
కాలయాపనబుద్ధిఁ గయ్యంబుచేసి । వ్రాలసిచ్చిరి వైరివర్గంబు నిట్లు.
పగదీర్ప నిన్నాళ్లు పట్టునా! వారు । తగనార్చి వేళులు తలఁబెట్టి చనిరి.
ఇల నీవు మాకొక్కన్న నింతకాలంబు । నిలుపనిత్తువె పాండునృపకుమారకుల?
గరుడుఁడు పాముల ఖండించు కరణి । దురములో నింతక ద్రుంపవా కడఁగి?

1. గురుం విరటగని. 2. భేదా. 3. దేవ. (మూ)

ఇంక నెవ్వరి దూఱ నేమికారణము? । పంకజహితపుత్త్ర, భారంబు నీది.
పట్టంబుగట్టుకో పౌరుషంబొప్ప । నెట్టైన నీకార్య మీడేర్పు నీవు.
వహిని బృందారకవాహిని నడపు । గుహుని చందంబునఁ గురుసేన నడపు."
అనవుడు రాగిల్లి యా సూతసుతుఁడు । తనకేర్పు విలసిల్లఁ దా నిట్టులనియె:

## దుర్యోధనుఁడు కర్ణునకు సర్వసేనాధిపత్యంబు గట్టుట

"నన్ను నేనలకెల్ల నాథునిఁగాఁగఁ । బన్నుగా దళవాయి పట్టంబుగట్టి;
నిన్ను సంగ్రామంబు నెఱి పోఁకనీను; । కన్నార వేడుక గనుఁగొనుచుండు.
అదియునుగాక నీ కాదికాలమునఁ । బదరక యిచ్చినబాస యేమఱను.
కాలకంఠుని పినాకముఁబోలె నొప్పు । కాలపృష్ఠంబను కార్ముకంబంది
పరశురాముని కృపఁ బడసినయట్టి । వరదివ్య సాయకవ్రాతంబు వఱపి
వ్రక్కలువాపెద వసుధాతలంబు । చక్కాడి పిడిచెదఁ జదలెల్ల బెదర.
పిండలివండు గావించెద నబ్ధి; । కొండలు [1]పిండిమై త్రుంగఁ గూల్చెదను;
ఓర్చెద నింద్రుండు నురవడించినను; । దేర్చెద నమరు లేతెంచినైన.
నా బాహుశక్తియు నా దివ్యబాణ । ప్రాబల్యగతియు నా పౌరుషక్రమము
నీ సర్వరాజన్యులెల్ల వీక్షింపఁ । బూసగ్రుచ్చినయట్లు పొగడంగఁ జేర్చి
[2]మిడుమిడు కనఁగ నెమ్మోయిఁ బాండురాజు । కొడుకుల నేవురఁ గూల్తుఁ గాకేమి.
పరిజన హిత సుహృద్బంధుయుక్తముగఁ । బురుహూతనందను పోడిమిఁ బాపి
లలినొప్ప సామ్రాజ్యలక్ష్మి యంతయును । ఎలమి సొంపారంగ నే నీకునిత్తు.
వివిధయాగంబులు వివిధదానములు । తివిరి కావింపుచు దిశల నీయాజ్ఞ
[3]చెల్లఁగా రాజ్యంబుసేయుచుఁ గడుపు । చల్ల దొలంకక చల్లఁగా నుండు."
అనిపల్కు విని యుబ్బి యా కురురాజు । తన హితులును దానుఁ [4]దగు ప్రయత్నమున
ఫలపుష్పములుఁ బంచపల్లవంబులును । బాలుపార నవరత్నములును దెప్పించి
పుణ్యనదీతోయ[5]ముల నొప్పుచున్న । గన్యా కాంచనమయ కలశంబు లునిచి
బహు వేదపారగ బ్రాహ్మణోత్తములు । విహితతంత్రంబు గావింపుచు నుండఁ,
జేర్మి నౌదుంబర పీఠంబునందుఁ । గూర్మి రాధేయునిఁ గూర్చుండఁబెట్టి

1. పిండలై. 2. మిదమిద మిడుక. 3. చెల్లుగా. 4. దగ బ్రహ్మయత్నమున. 5. ములనొప్పు. (మూ).

పటహ డిండిమ భేరి పణవ మృదంగ । పటువాద్యరవము లంబరవీథిఁ జెలఁగ,
నభిరామయుతుఁడైన యా సూతసూను । నభిషేక మొనరించి యనురాగ మొప్పఁ
'బ్రతిలేని కౌరవబలమున కీవు । పతివి గ' మ్మని వేడ్కఁ బట్టంబుగట్టె.
అంత రాధాపుత్త్రుఁ డంతరంగమున । సంతోషముప్పొంగఁ జయ్యన నపుడు
హాటక మౌక్తికహార మాణిక్య । ఘోటక రథ ధేను కుంజరంబులును
దాస దాసీజన ధనధాన్యములును । భూసురసమితికి భూరిగా నిచ్చి
సురుచిరాంబర రత్న శుద్ధ సువర్ణ । నిరుపమ గంధాది నిఖిలవస్తువులు
గాయక పాఠకగణముల కర్థి । నాయతమతిఁ దోరహత్తుగా నొసఁగె.
రారాజు మదిలోన రాగిల్లి యపుడు । చారుకిరీటంబు చామరద్వయము
నంగద కంకణ హార భూషణము । లంగాధిపతికిఁ బ్రియంబున నిచ్చి,
గొడుగులుఁ బడగలుఁ గొమరు దీపించు । నడియాలములు పెక్కు లలవడ నిచ్చి,
శుభతూర్యములతోడ సూతనందనుని । విభవంబు మెఱయించి విడిదికి ననిచె.
ఈరీతి నీపుత్త్రుఁ డెల్లసేనలకుఁ । గారవంబునఁ గర్ణుఁ గర్తఁగాఁ జేసి
దొరల సామంతుల దుర్గాధిపతుల । వర మండలేశుల వరుసఁ జుట్టముల
మానని వేడ్కతో మన్నించి యనిచి । తానును జనియె నంతఃపురంబునకు.
జగదీశ, యారాత్రి చనుదెంచి యేను । దగ నీకు ద్రోణయుద్ధము వివరించి
క్రమ్మఱఁ బొమ్మన్నఁ గరమర్థి నిన్ను । నిమ్ముల వీడ్కొని యేనటఁ గదలి
వారక తెలతెలవారునప్పటికిఁ । జేరితి నొయ్యన శిబిరస్థలంబు.
సురరాజు మేడపైఁ జూపట్టునట్టి । కరమొప్పు మాణిక్య కలశమో యనఁగఁ,
గవగూడి మెలఁగు జక్కవలపాలింటఁ । దివిఁ గల్గినయట్టి దేవుఁడో యనఁగఁ,
దనయుకయ్యముఁ జూడఁ దా వచ్చెననఁగ । దినమండలం బుదయించెఁ దూర్పునను.

## కర్ణుని తొలినాఁటి యుద్ధము

అప్పుడు రాధేయుఁ డాహవోత్సాహ । మొప్పారఁ గై సేసి యుజ్జ్వలుండగుచుఁ
గనకరసస్ఫీత ఘన కార్ముకంబు । తనరార నిజహస్తతలమునఁ దాల్చి,
లలితాహ[1]వోత్సాహలక్ష్మిచే మొగము । చెలువంబుపన వింతచెన్ను దీపింప,

1. వోత్సవలక్ష్మికి.

నారూఢ భటకోటి కానందమొదవ । భూరిశంఖము తినముండట మ్రోయ,
నక్షయంబుగను ధ్వజాగ్రశిహస్తి । [1]కక్ష్యతోఁ గాంచన ఘంటికాబద్ధ
హంస వర్ణ తురంగమాంచితోదగ్ర । హంసాద్రి సంకాశమగు రథంబెక్కి,
వీరభద్రోదార విక్రమసార । మారసమాన కుమారవర్గంబు,
విక్రమ క్రమశక్తి వినుతులు గన్న । చక్రరక్షకులును సామంతచయము
మెండైన తోడవ్వుల మెఱుఁగుల [2]తోను । మండలోజ్జ్వలులైన మండలేశ్వరులు
నిరుఁగెలంకులను గ్రిక్కిరియంగఁ జేరి । పరువడి బహురంపుఁ బలుకులు చెలఁగఁ
బుడమిపైఁ బెండ్లికిఁ బోవు చందమున । నడవ, సొంపున మీఱి నడచెఁ గర్ణుండు.
తరమిడి లక్షబద్ధలవారిఁ బిలిచి । నెరవొప్పఁగా సేన వెడలింప నపుడు
సవరణతో యుద్ధసన్నద్ధమగుచు । వివిధముఖంబుల వెడలంగఁ దొడఁగె.
భూరి దంతశృంగములఁ జెన్నుమిగిలి । చారుమదాపూర ఝురముల నొప్పి
[3]రుంద్ర కుంభస్థల రూపితసాంద్ర । చంద్రగైరికముల సంపద మెఱసి
యానసబిలముల నలరారి పార్శ్వ । సానుజాలంబులఁ జాలంగ నమరి,
[4]గురు నిషాదివ్రజకుంజముల్ దనరి । కరులు భూధరములకైవడి నడచె.
నరమత, ధర్మగుణంబు దాల్చియును । కరమర్థి వాయువేగము నహించియును
హరినామ సామ్య విఖ్యాతినొందియును । బొరిఁబొరి శ్రీదేవి పుత్త్రులమయ్యుఁ
దివిరి పల్గాఱు కౌంతేయుల జయము । వివరింప కేమేల విడుతుమన్నట్టు
లెడపక దిక్కుల కెఱఁగించునట్టి । నడువున హేషారవంబు సేయుచును,
బోఁడిఁ గల్యాణుఁ డీ భూమిపై నిలువ । లేఁడని చూపుపోలిక గానుపింప,
ఖురపుటాహతి నుర్వి గుఱుతులుగాఁగఁ । దురగంబు లరిగె బంధురవృత్తి నధిప !
రథికహాసములు సారథిభాషణములు । పృథివిపై [5]ఘోటకహేషలు నెనఁగ
[6]నేమిఘాతంబుల నేలబిట్టవియ । వేమాఱు విమధరవిభుఁ [7]డోసరింపఁ
బడగలు గొడుగు లంబరవీధి నొరయఁ । గడుఁ బెక్కుతేరులు కలనికి నడచె.
దుందుభి పటహాది తూర్యబృందముల । క్రందైన మ్రోఁతలు కప్పుకపోవఁ
జెలరేఁగి దిక్కులు చెవుడుపడంగఁ । దలకొని సింహనాదములు సేయుచును,
నిగిడి కన్నులతుద నిప్పులు రాలఁ । దెగువతో [8]మిన్ను భేదిల్ల నార్చుచును

1. కక్షీ కాంచనమయ ఘంటికాబద్ధ. 2. తోను. 3. రుద్ర. 4. సురనిషాది.........కుంజములం దనరి. 5. భీషణఘోషలు. 6. నేమివిఘాతల...బిట్టవిసె. 7. డోసరింప. 8. మన్ను. (మూ.)

గాలునిపట్టితోఁ గయ్యంబుసేయఁ । గాలుద్రవ్వుచు నేఁగెఁ గాలుబలంబు.
హయఖురోద్ధూత మహాపాంసుపటలి । భయదంబుగా దిశాభాగంబు గప్పె;
మానిత గజదళ మదధార లనెడి । వానలపెక్కువ వాని నడంచె.
పటుతర వాదిత్ర భైరవారవము । తటుకున నంబరతలమెల్లఁ గప్పె;
చెలఁగిన గుణనాద సింహనాదములు । బలిమి నగ్రమ్మ్రోఁతను బారణచేసె.
ఏచిన భటకోటి హేతి మాణిక్య । రోచుల భూషణ రుచిర రశ్ములను
చారు కేతుచ్ఛత్ర చామర సక్త । భూరి రత్నంబులఁ బోలుచు దీధితులఁ
బగలింటి దీపంబు భంగిఁ జూపట్టె । జగదీశ, యప్పుడు జలజబాంధవుఁడు.
ఇవ్విధంబున సేన లేపారి నడవ । నివ్వటిల్లెడు వేడ్క నీదళవాయి
జనములు తనుజేరి సన్నుతిసేయ । ఘనతరాటోపుఁడై కలనికి వచ్చి
యూహించి మకరికా వ్యూహవిధాన । మాహవోచితముగా నప్పుడొనర్చె.
మండలేశ్వర, విను మార్తాండసుతుఁడు । తుండదేశమున బంధురవృత్తి నుండె;
చలపాది శకునియు సరి నులూకుండు । సొలయక కన్నులచోటు గైకొనిరి;
తలపట్టు ద్రోణునితనయుండు తనకు । వలెనని మదిలోన వాంఛించి నిలిచె.
తడయక రారాజు తమ్ములందఱును । మెడవద్ద నొప్పిరి మేదినీనాథ!
దురితవర్తనుఁడగు దుర్యోధనుండు । నరుదార మధ్యంబునందుఁ జూపట్టె.
గోపాలసహితుఁడై గుణి భోజవిభుఁడు । నేపార ముందట నెడమకాలయ్యె.
ఘన [1]దాక్షిణాత్య త్రిగర్తులతోడ । ననయంబు కుడికాల నమరె నాకృపుఁడు.
వెనుక డాకాలను వివిధదేశముల । జననాయకులఁ గూడి శల్యుండు మెఱసె.
మఱి సుషేణుండను మనుజనాయకుఁడు । వఱలిన బలముతో వలకాలఁ బొలిచె.
ఆ విచిత్రుండును అతనితమ్ముండుఁ । జేవగల్గినయట్టి చిత్రసేనుండు
వాలస్థలంబున వారలిందఱును । వాలిరి చతురంగవాహినితోడ.
తక్కటియోధు లుద్దండవిక్రములు । తక్కక నిలిచిరి తగినతావులను.
అటమున్నె ధర్మజుఁ డాహవస్థలికిఁ । బటుతర చతురంగబలముతో వచ్చి
మనమున నమ్మహామహుఁడు వీక్షించి । యనుఁగుఁ దమ్మునితోడ నప్పు డిట్లనియె:
"[2]కంటె ధనంజయ, కౌరవసేన! । కంటికిఁ గొంచెమై కాన్పించె నిపుడు.

---

1. దక్షిణాద్య త్రికర్త. 2. కంటివె సంజయ. (మూ.)

కలయఁ గూరిన వానకాలంబు వోవ | నిల నింకఁ బొడచిన యేటిచందమున,
అవగుణంబులకెల్ల నాటపట్టయిన | రవితనూభవుని సంభ్రమము చూచితివె!
పనుపడి యొకయొక్కఁ పన్నుగాఁ బన్ని | మొదలఁ దా నందుకు [1]ముఖమయి నిలిచె.
పాటించి యొక పోటుబంటును బోలె | మేటికయ్యపు తేరిమీఁద వహించి
బీరంబు లావును బెట్టియు నెఱ్ఱు | కూరత పెంపును సొంపారఁ జూపి
యొప్పుడు కయ్యము తుదికెక్కింతు ననుచు | విపరీతగతి విజృంభించుచున్నాఁడు.
కాలకేయ నివాతకవచాది దైత్య | జాలంబుఁ ద్రుంచిన చండకాండముల
నీ నీచుఁ దెగటార్పు; మిటమీఁద మనకు | మానుగా శత్రువానసము లేకపోవు.
మగఁటిమి మీఱిన మగలెల్లఁ దెగిన | వగపున మనతోడి వైరంబుఁబొఱెఁ
కురురాజు తన్ను సైన్యాను గమనించి | సారెకుఁ బుద్ధులు దెలఁజెప్పెఁ గావునను
బోర నాతఁడు చూడఁ బోరి మనమీఁదఁ | జేరి యగ్గలికఁ జేసేయకపోఁడు.
వాసవనందన, వసుధ చిల్లంగి | వేసిన విధమున వీఁడొక్కఁడుండు
ద్రెళ్లినఁ గౌరవుల్ ద్రెళ్లినవారు | తెల్లమిసుమ్ము సందేహంబు లేదు.
అడవిలోఁ గందమూలాహారవృత్తి | నెడపక పదియురెండేఁడులు మనము
ఇడుమలఁబడుట యూహించి చూడంగఁ | గడపటఁ గర్ణునికతమునఁ గాదె!
క్షితిలోన వీఁడు చేసిన చేఁతలకును | బ్రతిసేఁత సేయక పాయదు వగపు.
అటుగాన నీవిప్పు డనువైన [2]యొక్క | నిటఁ జేయుమనుచును యింద్రనందనుఁడు
రమణతో నర్ధచంద్రవ్యూహ మమరు | సమకట్టి మధ్యదేశమునఁ దానిలిచె.
భీమునిఁ బాంచాల పృథివీశ సుతుని | వామేతర శృంగవాసులఁ జేసె.
శ్రీరమ్యులగు యుధిష్ఠిర మాద్రిసుతుల | ధీరుఁడై [3]పింగలిదెస నుండఁ బనిచె.
ఒగి యుధామన్యుండు నుత్తమౌజుండు | మిగులంగ బవరంబుమీఁది మోదంబు
జిగిమించి మొగములఁ జెలువంబు మీఱఁ | దగనిల్చి; రా ధర్మతనయునియందుఁ
గడఁక దీపింపఁ దక్కటి యోధవరులు | నెడనెడ నిల్చి రహీనసాహసులు.
సదమల జయలక్ష్మి సయిదోడుగాఁగ | నది చూడనొప్పె జనానందమగుచు.
ఈభంగి వర్పించి యిరువాగుఁ బన్ని | యాభీలగతినున్న యాసమయమునఁ
దనమదిలోపల ధర్మనందనుఁడు | నెనసిన ప్రీతితో నిట్లని తలఁచె

---

1. ముఖరియై. 2. యందు. 3. బంగలి. (మూ).

“మకరంబుఁ జంపి తమస్వినీచరుని । ప్రకటదర్పమడంచి బలువడిఁ దొల్లి
సంజీవి యా రామచంద్రుని కొసఁగె । నంజనాసూనుఁ డీయలఘువిక్రముఁడు
నాతమ్మునొద్ద నున్నతి నున్నవాఁడు । ఈ తెఱంగునకు నా కేల చింతింప?
ఓలి నక్రవ్యూహ మురివ్వఁ జింపించి । కాలనేమిని బోలెఁ గర్ణునిఁ జంపి
జయలక్ష్మి నయసియెడు సంజీవి నేఁడు । రయమూఱఁ బడయుదు రామునికరణి.”
అని యంతరంగంబునందుఁ గామించి । యనయుంబు నెదిరించె నా ధర్మరాజు.
అప్పుడు రెండుసైన్యములు నుబ్బుచును । ముప్పిరిగొని రణంబునకును దివుఱ
నిందును నందును నేచిన బిరుదు । చిందఁబు లందంద చెలరేఁగి మ్రోయఁ,
గెరలుచుఁ దమకించి కెలఁకుల భటులు । నురుతరాటోపులై యురవడించుటయు,
వర రథనేమి నిస్స్వనపరంపరలు । నిరుపమ బహు కింకిణీ నినాదములుఁ
జటుల తురంగ హేషానాదములును । బటు [1]ఖురవ్రాత విస్ఫార రావములుఁ
గరిఘటాకోటి ఘీంకార శబ్దములు । భరిత భేరీ శంఖ భాంకారములును
[2]వీర హుంకారముల్ విపులాట్టహాస । భూరి [3]సంరావముల్ బొబ్బలార్పులును
బరిహాసజన వంది పాఠకశ్రుతులుఁ । [4]బరగి దిక్కులనెల్లఁ [5]బగిలించె నపుడు.
గరుడ కిన్నర యక్ష గంధర్వ సిద్ధ । వరులు ఖేచరులును వచ్చి మోదమున
ఘనవిమానస్థులై కయ్యంబు సొంపు । గనుఁగొనుచుండిరి గగనమార్గమున.
చెలరేఁగి పూర్వపశ్చిమ సముద్రములు । తలపడి యొండొంటిఁ దాఁకినపగిది,
దితిజసైన్యంబును దేవసైన్యంబుఁ । దతిగొని యొక్కటఁ దార్కొన్నకరణిఁ
గౌరవబలమును గౌంతేయబలము । దారుణగతిఁ దాఁకె ధరణీశ, యపుడు
మండలాగ్రంబులు మహితకుంతములు । భిండివాలంబులు పృథుముద్గరములు
పరశుతోమరములుఁ బట్టిసంబులును । నురియలత్తలములు శూలము ల్గదలు
మొదలైన యాయుధంబులు మెఱయంగఁ । గదనంబు సేయఁగఁ గడఁగి రాలోన.
బలువడిఁ బొడుతురు పంతంబుతోడఁ; । బెలుకుర నడఁతురు పేరువాడుదురు.
త్రుంతురు హేతులఁ దొరుగంగఁ దలలు; । చింతురు పొట్టలఁ [6]జెండి వేయుదురు.
మొత్తుదు రంగముల్ మోఁదలుకట్టఁ; । గత్తుల నెమ్ములు గాఁడ నేయుదురు.
పులులు కురంగాళిఁ బొలియించునట్టి । పొలుపునఁ బగతురఁ బుడమిఁ గూల్చుదురు.

1. తరవ్రాత నిస్వార. 2. విరహ. 3. సంహారముల్. 4. పరఁగ. 5. పరగించె. 6. చెడ్డి. (మూ).

అంచలు బిసముల ననని ఖండించు । సంచునఁ ద్రెవ్వులు చక్కఁ ద్రెంపుచును.
పరశుఘాతంబులఁ బట్టిసహతుల । సురుశూలముల నెత్తురొలుకఁ జంపుచును.
చెక్కులు ముక్కులుఁ జెవులు బాహువులు । నక్కలుఁ బిక్కలు నంసదేశములుఁ
[1] గరములు శిరములుఁ గాళ్లుఁ జేతులును । జరణంబు లూరులు జానుదేశములు
బరులు పేరురములు ఫాలస్థలములుఁ । గరముగ్రముగ రణాంగణమున నిండఁ
గుంచియు నీడ్చియుఁ గూలఁగ్రుమ్మియును । వంచియు వ్రాల్చియు వసుధనైచియును
ముసలమ్ములెత్తి యెమ్ములు నలియంగ । నెన్నవేసి నముసులు పిణుగ్రవేసియును
[2] జేనేత విజయంబు సేకొనఁబట్టి । [3] యూసఁ గయ్యముసేసి రమరులు పొగడ.
వెనుక దీసినవాఁడు వెదకిన లేఁడు ; । మొనయకుండినవాఁడు మొదటికి లేఁడు ;
పాఱిపోయినవాఁడు పరికింప లేఁడు ; । ఊఱకుండినవాఁడు నొకఁడును లేఁడు ;
పందయు మఱిలేఁడు భావించిచూడ । నిందును నందును ఇభపురాధీశ !
" ఈ కురుక్షేత్రంబు ; ఇది పుణ్యభూమి ; । చేకొని యేలిన క్షితిపులకొయొద్ద
జచ్చిన సురలోక సౌఖ్యంబుగలుగు ; । మెచ్చుగా జయమైన మేలె " యటంచు
మిగిలినచేవలు మితిమేరలేని । తెగువలు నొండొండఁ దీయనియట్టి
దర్పంబులును ఘనతరసాహసములు । నేర్పులుఁ గడఁకలు నెఱయంగ, నంత
దారుణ సింహనాదస్ఫురణముల । భూరి మహాహాసములను బొబ్బలను
హాటకగర్భాండ మవియఁ జేయుచును । వాటమై నిబ్బంగి వడి నిరువాఁగు
చండ దండాదండి సరి కచాకచిని । దండి ముష్టాముష్టి ధరఁ బోరుచోట
సందడికయ్యంబు సాగిన నపుడు । పెంధూళి గగనంబు పెల్లుగాఁ గప్పె.
ఆవేళఁ దమవారి నట లాఁతివారి । భావింపనేరక [4] భ్రమసెఁ జిత్తములు.
అఱిముఱి భటులదేహంబులఁ [5] దొరఁగు । కఱచైన శోణితధారలవలన
వారణ దానప్రవాహంబువలన । నా రేణుపటలి తానంతయు నణఁగె.
అప్పుడు సాత్యకి యాద్రుపదజుఁడు । చెప్పఁ జిత్రముగాఁగఁ జేకితానుండు
ధన్యవిక్రములైన ద్రౌపదేయులును । సైన్యసమేతులై చాలఁ గోపించి
కుకుర ఘూర్జరలాట కోసల వంగ । శక కళింగావంతి సాల్వ సౌవీర
మళయాళ కర్ణాట మగధాది దేశ । బలములతోఁ [6] బోరి పాఱఁద్రోలుటయు,

1. శరమాల. 2. చెంజేత. 3. యాజి. 4. భ్రమసి చిత్తముల. 5. మెఱుఁగు. 6. బొడి. (మూ).

నేనుఁగు [1]తండంబు లిరుగెలంకులను । మూఁకగా నేతేర మగఁటిమి మెఱసి
యైరావతారూఢుఁడగు వజ్రిపోలె । మారుతి యొక మహామదకరి నెక్కి
“ వేఁడి యశ్వత్థామ ? వేఁడికృపుండు ? । వేఁడి కౌరవరాజు వేఁడి ? ” యటంచు
వేఁడి వాలమ్ములు వెసఁజల్లుకొనుచు । వాడిమి పసమించి వచ్చుట చూచి
మార్తుర కరుదైన మగఁటిమివాఁడు । ధూర్తశీలుఁడు క్షేమధూర్తియన్వాఁడు

## క్షేమధూర్తి యనురాజు భీమునితోఁ బోరి మడియుట

“ అంతెందుఁబోయెద ననిలజ, నీవు ? । ఇందు ర ” మ్మనుచు బిట్టేచి [2]పిల్చుచును
దనదంతి భీమునిదంతిపైఁ గొలిపె । ననయంబు చిత్ర మేమని చెప్పవచ్చు ?
అది గిరి గిరిఁ దాఁకునట్టుల భీము । మదసామజంబుతో మార్కొనె నపుడు.
వడముడి తోమరవ్రాతంబు పఱపి । తోడిఁబడ నా క్షేమధూర్తిని నొంచె.
కనక కాండాభీల ఘనతోమరమున । ననిలసూనుని నొంచె నతఁడు కోపమున.
అంత బాణాసనహస్తులై వార । లంతకాకారులై యనిసేయుచుండ
నిరువుర చాపంబు లిషుపరంపరల । మురిసినఁ గోపంబు ముప్పిరిగొనఁగ
మఱియుఁ దోమరముల మండుశక్తులను । అఱుక్రమ్మి మిగులఁ గయ్యము సేయునపుడు
ఏడుతోమరముల నేపున నాతఁ । డోడక భీము పేరురము నాటించె.
నాటిన మదిలోన నాటఁ గోపించి । ‘ నేఁటితోఁ గూల్తు నీ నీచు నే ’ ననుచుఁ
బవమానసూనుఁ డప్రతిమసాహసుఁడు । రవికరనిభతోమరము వీఁకనెత్తి
యతనిపై వైచిన, నంతఁ గరూశ । పతి నడుమనె దాని భగ్నంబు సేసి
యాఱుబాణంబుల ననిలజు మేనఁ । దూఱిపోవఁగ నేసి తొలఁగక యార్చె.
వేఱొక్కకోల్లంది విషమబాణముల । మారుతి యాతని మదకరిఁ గప్పి
యా కరూశాధిపు నరవాయిగొనక । దీకొని యాతని దెసకును జనక
పటుగుణధ్వని దిశాభాగంబు వగులఁ । జటులసాయకములు చాల సంధించి
తొలఁగక యా క్షేమధూర్తి సామజముఁ । దలకొని జర్జరితంబు చేసినను
దటుకునఁ గనుఁ[3]మూసి దారుణగతిని । అటు[4]నిల్వనోపక యది[5]మొగదిరిగి
[6]పొలుచు గంటల వెడమ్రోఁతలు నిగుడ । నొలసి దిక్కులనున్న బలములు బెగడ

1. తుండంబు. 2. పిల్చుటయు. 3. పూచి. 4. గెల్వ. 5. మేన. 6. మొలచు. (మూ).

నంకుశంబున నొత్త నదియుఁ గైకొనక । ఘీంకృతధ్వనులతోఁ గెరలి వేపఱచె.
పఱచిన నార్చుచుఁ బాండునందనుఁడు । తఱిమె [1]దానిని వెనుదగిలి యుద్ధతిని.
ఆసమయంబున నధికయత్నమునఁ । జేసి యాకరిఁ ద్రిప్పి క్షేమధూర్తియును
వెడమంట లుమిసెడు వెడఁదయమ్ములను । వడముడి వేనొంప, వడముడి గినిసి
యుఱక యాతనిచాప మొక్కటఁ ద్రుంచి । కఱకుటేనుఁగునొంచెఁ గడురభసమున.
చాపంబు వేఱొండి శరముల నతఁడు । మాపోవ కా నాయుసూను నొప్పించి
దంతి నొక్కమ్మున ధర ద్రొగ్గనేయ । నంత నిజబలమెల్ల నార్చె; నార్చుటయు
గిరినుండి లంఘించు కేసరిపోల్కి । గరి డిగ్గనుఱికి యస్ఖలితసాహసుఁడు
గద చేతఁగొని లయకాలునిపగిదిఁ । ద్రిదశులు వొగడ నుద్వృత్తుఁడై పోయి
కుంభస్థలము బిట్టుగొట్టిన నతఁడు । కుంభి హూపఱి కూలెఁ గుంభినిమీఁద.
అసముఁడింపక యాతఁ డసిపాణి యగుచు । వెసవచ్చి యమ్మహావీరునిఁ గదియ
నిట్టిగదాహతి నింక సొంపెక్క । నట్టకుఁ బెడఁబాపె నతనిమస్తకము.
అతని మొండెంబు నూఱడుగులు వాఱి । పదపడి ధారుణిఁబడియె ఘోరముగ.
కులిశాహతంబైన కొండచందమున । నిలమీఁదనున్న యామిభము చేసినను
బిడుగుతాఁకునఁ బడ్డ పృథులసింహంబు । నడుమునఁ గెడసిన నాసి చిక్కించి
కాకుత్స్థుచేఁ గుంభకర్ణుఁడు తెగిన । దాకొని పాఱిన దైత్యులంబోలి
ననయంబు ధృతిగుంది యతిభీతిఁజెంది । మొనచూపలేక నీ సేన వాఱుటయును
బసగల పాండవభటులుగ్రవృత్తి । వెసనార్చి తఱిమిరి వెనువెంటఁ దగిలి.
అంతఁ గర్ణుండు కాలాంతంబునాఁటి । యంతకుండునుబోలె నంతరంగమునఁ
గప్పినకోపాగ్ని కన్నులయందు । నుప్పతిల్లెడుమాడ్కి నొగి మంటలెసఁగఁ,
బొరిపొరి దానిపైఁ బొడము ధూమంబు । పరుసునఁ బొమముడిపాటు వర్తింప,
ధవళహయంబులఁ దార్కొన్నరథము । అవల విస్మయగతి నతిశయిల్లంగ,
నాతత శత్రుసైన్య[2]క్షయోత్పాత । కేతువునా దివిఁగేతువు మెఱయ,
దుందుభిపటహాది తూర్యరవంబు । వందిమాగధకోటి వర్ణితారవముఁ
గోదండరవమును ఘోటకరవము । రోదోంతరంబుల రొదవెట్టుచుండఁ
దిరమైనవీకఁ గౌంతేయులమీఁక । శరజాలముల మఱి చతురుఁడై తాఁక,
[3]నాన యుల్లములోన [4]నాన నీసేన । పూని సేనాని ప్రాపున నగ్గలించె.

1. నాతని. 2. క్షయాద్వాత. 3. నాని. 4. నానని. (మూ).

పాండవవీరులు పరమసాహసులు । పాండురయశులు దోర్బలధురంధరులు
దర్పంబుసొంపును ధైర్యంబుపెంపు । నేర్పు దురంబున నెఱపఁ జొచ్చుటయు
ననిమిషాసురులకు ననిమైనయట్టి । యనువునఁ బేర్చె ఘోరాహవం; బందు
సూతపుత్రుని శరవ్రాతంబులగుచు । భూతలంబునఁ బడి పొరలు నేనుఁగులు,
రంచలు వీడ సంరంభంబుతోడఁ(?) । గంచు[1]మించైపాఱు గంధనాగములు,
కుంభస్థలంబు నుగ్గులుగాఁగఁ బగిలి । కుంభినిపైఁ జచ్చి కూలు నేనుఁగులు
మ్రగ్గునేనుఁగులును మడియునేనుఁగులు । స్రగ్గునేనుఁగులును సమయునేనుఁగులు
విచ్చునేనుఁగులును వెచ్చునేనుఁగులుఁ । జచ్చునేనుఁగులును జదియునేనుఁగులు
నై యున్న సమరోర్వి నానకులుండు । నాయెడఁ గర్ణుఁ డా నరికట్టుకొనియె.
పెలుకుఱ నార్చుచు భీమసేనుండు । తొలఁగక ద్రోణపుత్త్రుని నడ్డగించె.
వినుము కేకయులగు విందానువిందు । లనువారి సాత్యకి యానె నుద్ధతిని.
చిత్రసేనునితోడఁ జిత్రంబుగాఁగ । ధాత్రీశ, శ్రుతకర్మ తలపడి పోరె.
జితశాత్రవుండైన చిత్రునిమీఁదఁ । బ్రతివింధ్యుఁ డేపార బవరంబుచేసె.
తగ సుయోధనుఁడును ధర్మపుత్త్రుండుఁ । దెగిపోరఁగడఁగిరి ధీరాత్ములగుచు.
సమసియు సమయని సంశప్తకులకు । నమరేంద్రసుతునకు నయ్యె యుద్ధంబు.
ఆ కృపాచార్యుపై నగ్నికుండజుఁడు । భీకరాస్త్రములతో బిట్టేచి నడచె.
ఖండితవైరి శిఖండి కోపించి । దండి భోజేంద్రునిఁ దాఁకె నుగ్రతను.
క్రీడిపుత్త్రుఁడు శ్రుతకీర్తి రథంబు । రూఢి మద్రాధీశ్వరుని తేరుఁ దాఁకె.
సహజవిక్రమశాలి సహదేవుఁ డలిగి । బహుభంగి యువరాజుపై వెసనేసె.
అడరి వైశ్యాపుత్త్రుఁడగు యుయుత్సుండు । తొడరె నులూకునితోడఁ బోరాడ.
ధర ధీరుఁడైన శతానీకుఁడార్చి । వరగర్వమునఁ గృతవర్మ మార్కొనియె.
సుబలతనూజాత శ్రుతసోములకును । బ్రబలమై సిద్ధించె బవరమంతటను.

## సాత్యకిచే విందానువిందులు మడియుట

సారశౌర్యుండైన సాత్యకితోడ । వీరులు విందానువిందులు కడఁగి
దుర్మదంబునఁ బోర దురములో వారి । కార్ముకద్వితయంబు ఖండించి యతఁడు

---

1. తెంచై. (మూ).

సునిశితాస్త్రంబులు చొనుపె నంతంతఁ । దనువున శోణితధారలు దొరఁగ.
ఆ మహావీరులు నధిక వేగమున । భీమచాపములెత్తి పెల్లుగోపించి
యేయుచో మూవురయిష్వాసనములు । పోయెఁ దుత్తుమురులై భూరిబాణముల.
వేవేగమున వారు విస్మయంబందఁ । జేవగల్గిన విల్లు చేత నమర్చి
మింట మంటలుగ్రమ్మ మేటిబాణంబు । వింట సంధించి యా విష్ణుసోదరుఁడు
'అనిలోన[1]నిలుపఁగ ననువెందుఁగలుగు ? । అనువింద, ద్రుంగిపొ ' మ్మని యేయుటయును
అసదృశ మకుట రత్నావళితోడ । వసుమతిపైఁ గూలె వాని మస్తకము.
అది చూచి కేకయు లతిభీతి గదిరి । మద మేది నిర్విణ్ణ మానసులైరి.
అనుఁగుఁ దమ్ముని మృతి యాత్మలోఁ గోప । మినుమడింపఁగఁ జేయ నేచి విందుండు
రుంద్ర బాహాబలరూఢి నిరస్త । తంద్రుఁడై యొండుకోదండంబు దాల్చి
మండుచు శినిరాజుమనుమనిమీఁదఁ । జండసాయకముల జడి వంచుటయును,
బదియుఁ దొమ్మిదియారు పటు భల్లములను । ఉదరి సాత్యకి వాని యుబ్బెల్ల నణఁచె.
ఒండొరు సూతుల నొక్కటఁ దునిమి । యొండొరు హయముల నుర్విపైఁ గెడపి
యొండొరు చాపంబు లుగ్రవేగమున । ఖండితంబులు చేసి కడు రోషమునను
అసి చర్మ శోభిత హస్తులై వారు । వసుధకు లంఘించి వరగర్వరేఖ
నిప్పులు రాలెడు నేత్రంబు లొప్పఁ, । జొప్పడి యొండొరుఁ జుట్టివచ్చుచును
గరవాల విద్యుదుత్కట చర్మ వారి । ధర [2]మధ్య నందీప్త తనువులై వారు
అంత రిక్షంబున నతి లాఘవమున । నెంతయుఁ జరియించి యిలమీఁద వ్రాలి
వ్రేయుచుఁ దప్పుచు వ్రేటుపూఁ బెట్టఁగి । పాయుచు డాయుచు బలిమి చూపుచును
గడిమి డింపక చిత్రగతిఁ బోరుచోటఁ, । బుడమి నొడ్డనమునఁ బొలసె ఖేటములు (?)
మేవెరవునఁ జొచ్చి మిగులంగ హెచ్చి । గోవిందు తమ్ముఁ డా కూటిలాత్ము విందు
కదలికా వృక్షంబు ఖండించు నట్టు । లదనున నడుము చయ్యన దెగవ్రేసె.
విందానువిందుల విషమసాహసుల । నిందిరావిభుతమ్ముఁ డీ భంగిఁ గూల్చి
వేవేగ విజయుఁడై విబుధులు వొగడఁ । దా వచ్చి యెక్కె యుధామన్యు తేరు.
ఎక్కి యంతటఁబోక యేపు దీపించి । గ్రక్కున వేఱొక్క రథముఁ దెప్పించి
తలకొని శీఘ్రంబె తానందు నెక్కె । బలువిడిఁ గేకయబలముపై నెక్కె."

1. నిలుపని యనువెందుఁ గలుగ. 2. నుద్యద్దీపిత తరుణులైవారు. (మూ)

అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయ క్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యామీఁద । నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు మనిన
వైకుంఠనాయక, ద్వారకావాస, । కాకోదరాధిప గ్రైవేయ వినుత,
సగుణనిర్గుణ, దేవ, సహజప్రభావ, । నిగమగోచర, కృష్ణ, నీరజనాభ,
ఘనమానిహృద్గేహ కలిత సందోహ । వినుతప్రకాశ, శ్రీ వెంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన, భుక్తి । ముక్తి ప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర పద్య । పదపద్మ మకరందపాన ద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమౌ కర్ణపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొక్కటి యయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ భూసమేత, యాశ్రితపారిజాత, । శోభిత వైభవా, సురముని వినుత,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె :
ఆరీతి సాత్యకి యతుల విస్ఫూర్తిఁ । దేరెక్కి యితుల నుద్రిక్తుఁడై మెఱసి
తురికాసి తోమర కుంత కుఠార । శరచక్ర కాంతులు పరఁగఁ గ్రిక్కిఱియఁ
గేకయ బలము దాఁ గిట్టి సర్వంబును । బాకటంబుగఁ గొట్టి పాఱవైచుచును
లక్షలు కోట్లు పోలంగ నప్పుడమ్ము । లక్షయ సంఖ్యలై యలరు బాణముల
విశ్వరూపము చూపి విజయు విఖ్యాతి । శాశ్వతుఁడన మించె జగదేకనాథ!
అత్తఱి శ్రుతకర్ముఁ డా చిత్రసేను । దుత్తుంగ బాహాబలోద్ధతి మెఱయ
గండ భేరుండయుగ్మముభంగిఁ గదిసి । దండిఁ బెనంగువో దంతిపురీశ,
నీ మనుమని నైదు నిష్ఠురాస్త్రముల । నామేటి చిత్రసేనాఖ్యుఁ డేయుటయు,
నాతఁడు నవబాణహతి వానినొంచి । సూతుని నైదింట నుడివడ నేసి,
దేవ, నీసుతఫాలదేశంబు వగుల । వేవేగ నేసిన వివశుఁడై వ్రాలె.
అతఁడట్లు మూర్ఛిల్ల నంతటఁబోక । యితఁడు పైపై నేయ నంతయుఁ దెలిసి
శిశువుకోదండంబు చిత్రంబుగాఁగ । నసదృశగతిఁ ద్రుంచె నక్కౌరవుండు.
బాలుండు మించైన బంగారు కట్ల । మేలు విల్లొక్కటి మీఁదుగా నెత్తి
బెట్టుతూపుల నేదు [1]పెరిగిన యట్లు । నెట్టన గావించె నీకుమారకుని.
శ్రుత కర్మ వక్షంబు చూడ్కి లక్షించి । శితసాయకం బేసెఁ జిత్రసేనుండు.
అది యర్ధచంద్ర బాణాహతిచేతఁ । బది తునుకలు చేసి బాలుండు నార్చె.
ఆర్చియుఁ గోపించి యాశ్రుత[3]కర్మ । కార్చిచ్చుఁ బోలెడు కాండంబు దొడిగి
'బకవైరి కని యేచుపఱచినవాని । నొకభంగిఁ జంపక యుండితిఁ గాక
వీఁ డింత పోరునే! [4]వీనికిఁ గలుగు । పోఁడిమి మాపకపోవనీ.' ననుచు
రోషతామ్రాక్షుఁడై రుద్రుఁడుబోలె । శేషజిహ్వాగ్ర విశేష బాణమున
మిత్రేంద్రముఖ్యులు మింట వీక్షింపఁ । జిత్రసేనుని శిరశ్ఛేదంబు చేసె.

---

1. తేగిన. 2. వర్మ. 3. వర్మ. 4. విండింత. (మూ)

క్షితిఁబడ్డ యాచిత్రసేనునిఁ జూచి । శ్రుతకర్మ[1]ఁ దత్సేన చుట్టుముట్టుటయు,
నార్చి గుణధ్వని యభ్రంబుఁగప్పఁ । జేర్చినయుద్ధతిఁ బెంపారి యతఁడు
పవమాన మెుగి మేఘపటలంబుఁ దోలు । వివిధరీతులఁ దోలె వినుము భూనాథ!

## ప్రతివింధ్యుఁడు చిత్రుఁ డను రాజుఁ జంపుట

అప్పుడు ప్రతివింధ్యుఁ డైదుబాణముల । నొప్పించెఁ జిత్రుని నుతశక్తి మెఱసి.
కెడపి నొక్కమ్మునఁ గేతుదండంబు ; ముడివడ సారథి మూట నొప్పించె;
హయముల నాల్గింట ననిని నేసె. । జయమొప్ప నీరీతి సవడి నేయుటయుఁ
జిత్రభానునిభంగిఁ జిత్రుండు మండి । చిత్రరథమ్మార్తి క్షితియెల్ల నద్రువఁ
దూర్యడిండిమ [2]శంఖ దుందుభి పటహ । తూర్యారావముల కద్రులు మాఱుమ్రోయ,
వందిమాగధ సూత వర[3]శూర సుభట । సందోహ జయజయ శబ్దముల్ నిగుడఁ,
[4]దొమ్మిదితూపులు దొడిగి కౌరవుఁడు । బమ్మెరపోవ ద్రౌపదిపట్టి నేసె.
వీక నక్కౌంతేయవిభుకుమారకుఁడు । తాఁకి యాతనివిల్లు దళనంబుచేసి
శక్తిపాణియుఁబోలె సత్వరంబునను । శక్తి బాహాశక్తి చతురతఁ బఱపె.
గదవైచి యది నాల్గుగనెలుగా నతఁడు । విదళించి నూతాశ్వవితతిఁ జంపినను
హాటక మంజుకాండాంచితంబైన । యీటె యవ్విభునిపై నితఁ డడరింప
నూటిగా నది తోకచుక్కయుఁబోలె । గాటమై వచ్చుటగని కౌరవుండు
కోయని దానిఁ గైకొనివైచె మగుడఁ । జేయుచ్చిపోవ నచ్చిత్రాహ్వయుండు.
బావాలుపు[5]నొంచినఁ బ్రతివింధ్యుఁ [6]డలిగి । వ్యూహంబు చలియింప నుగ్రతోమరము
చెడుగఁడై యెత్తివైచినఁ గంకటంబు । నొడలు నుగ్రంబుగా నుచ్చిపోవుటయు,
గోత్రంబు పవిహతిఁ గూలుచందమునఁ । జిత్రుఁ డుర్వరఁ ద్రెళ్లెఁ జిత్రంబుగాఁగ.
ఆచిత్రుఁ డీభంగి నణఁగుట యెల్లఁ । జూచి రోషాగ్నులక్షుల నుప్పతిల్ల
బొబ్బలు నార్పులు భూగగనముల । నిబ్బరంబై నిండ నీయోధవరులు
కరవాల శూల ముద్గర భిండివాల । పరశు శక్తి ప్రాస పట్టిస ముఖ్య
బహుతర శస్త్రాస్త్ర పటుహస్తులగుచు । (మిహిర తేజుని మబ్బుమెయి నాక్రమింపఁ,
జతురతఁ బాండవసైన్యంబు లంతఁ) । బ్రతివింధ్యునకుఁ దోడుపడుటయు, నవుడు

1. వర్మ. 2. మండి. 3. శౌర్య. 4. తుమ్మెద. 5. నొచ్చిన. 6. డరిగి. (మూ).

మనవాఁడు వెన్నిచ్చి మరలి పోఁడనుము । మనుజేశ, వానికి మఱియేమి చెప్ప.
బలువిడి గురుపుత్త్ర బకమర్దనులకుఁ । గలహంబు లోకభీకరముగాఁ జెల్లె.
పంచి యశ్వత్థామ పావనిరథము । తొంగలితూపులఁ దూల చేయుటయుఁ
దఱిమి యాద్రౌణిపైఁ ధర్మజానుజుఁడు । పఱపె సాయకపరంపరలు బెట్టుగను.
చటులాస్త్ర మొకటి కీడ్పడనైన నుదుటఁ । బటుభంగిఁ గీలించె బ్రాహ్మణోత్తముఁడు.
కరువలిపట్టియుఁ గాండత్రయమున । నెసయ నశ్వత్థామ నిటలంబు నాటె.
జననాథ, భీముండు చాపశిక్షకుని । తనయుండు నిభంగి దర్పితులగుచు
జన్యంబు తొంటిసాజన్యంబు సడలి । యన్యోన్య జయకాంక్షులై [1]సేయునప్పుడు
మిహిరాంశుసమతేజ, మేదిని నాఁడె । మహితాస్త్రపటలమంటపమునఁ గప్పుటయుఁ
బగలు చీఁకటిపడియె; భానుండు మాసె; । జగతీతలంబెల్లఁ [2]జంచలంబయ్యె;
దారుణసింహనాదముల దిగంత । వారణకర్ణముల్ వడిఁ జెవుడ్వడియె;
కులగిరు లగలె; నా కూర్మంబుఁ బెగలె; । తలఁకు జనించెఁ బాతాళవాసులకు;
క్రాఁగిన యెసపులగతి సముద్రములు । మ్రోఁగె; బీటలువాఱె మొగి నాల్గుదిశలు.
వారలఁ జూచి గీర్వాణు లిట్లనిరి: । "శూరు లీయోధులు సూర్యసన్నిభులు;
పోరెందుఁ జూడమో భువిలోన నిట్టి । శూరుల పోరులు చూడము గాక.
ఎక్కటియుద్ధంబు లిలమీఁద మున్ను । పెక్కులు చూడమే పెక్కాఁడ నేల!
జమదగ్నిరామ నిర్జరనదీసుతుల । సమరంబు దీనితో సరిచేయరాదు.
కడఁక నొండొరులను గడవంగలేరు; । కడిమి నొండొరులను గదలింపలేరు;
చలమున నొండొరు సమయింపలేరు; । (మలసి యొండొరులను మరలింపలేరు)
ప్రళయకాలోదగ్ర రవియుగంబట్లు । [3]తిలకితాస్త్రద్యుతిఁ దేజరిల్లెదరు.
కలిగిన బల మిట్లు కలుగంగవలదె! । బలిసినఁ జలమిట్లు బలియంగవలదె!
దొఱకిన యలవిట్లు దొఱకంగవలదె! । నెఱవైన వెరవిట్లు నెఱయంగవలదె!"
అని వినుతించుచు నంతరిక్షమున । ననయంబు వేడ్కఁ గయ్యము [4]చూచుచుండ
నొండొరు హయముల యుబ్బులణంచి, । యొండొరుసూతుల నొక్కటఁ ద్రుంచి,
యొండొరు కాండంబు లొడళ్లుఁ జాల । నిండఁ గయ్యమునకు నిగుడంగలేక
ఘటజన్ముపట్టియుఁ గరువలిపట్టి । పటుమూర్ఛ రథములపైఁ ద్రాలిరప్పుడు.
ఆరీతి నొరఁగిన యావీరవరుల । సారథు లత్యంత సాహసులగుచు

1. పోరు. 2. బంటె. 3. తిలకాస్త్రద్యుతిదీప్తి. 4. నేయుచుండ (మూ).

వలనుదీపింపఁ గేవలముగా ననికిఁ । దొలఁగ రథంబులు దోలిరంతయును.
నరతనూభవ మద్రనాథు లుప్పొంగి । పారి దిక్కు లల్లాడఁ బోరుచున్నెడను
తప్పక శ్రుతకీర్తి తనతాతయొడలు । ముప్పదియమ్ముల ముప్పుగా నేసి
సత్వరంబున మూఁడుశరముల సూతు । సత్వంబు గ్రుక్కించి శౌర్యమెక్కింప
వాలంబుమెట్టిన పడి రోఁజునట్టి । కాలాహివిధమునఁ గినిసి శల్యుండు
శ్రుతకీర్తి లోక విశ్రుతకీర్తిఁ గిట్టి । వితత శౌర్యప్రభా విఖ్యాతి మెఱయ
[1]స్యూత సాయకముల సోనలు గురిసి । సూతుని నొప్పించె సురలెల్లఁ జూడ.
అంత రౌద్రాకారుఁడై క్రీడి కొడుకు । దొంతి వాలమ్ములు తొమ్మిది తొడిగి
తనువుచ్చిపోవ నద్ధరణీశు నేసి । పౌనరఁ గాండత్రయంబున సూతు నొంచి
పంచాస్త్రుఁడును బోలెఁ బంచబాణముల । ముంచి మద్రేశ్వరు మొగతిరిగింప,
భ్రూకుటితాస్యుఁడై బోరన విలయు । కాకోలకంఠునిగతి శల్యుఁడేచి
చాపంబు ఖండించి సప్తబాణముల । నేపెల్ల నడఁచిన, నింద్రపౌత్రుండు
కోదండ వక్త్రుఁడై కోదండదండ । మాదండ గైకొని యధిక వేగమున
వారిదం బద్రిపై వర్షించుభంగి । ఘోరాస్త్రకోటులు గురిసె నందంద.
మనుమనిచాప మమ్మద్రనాయకుఁడు । దునిమి తొమ్మిది వాఁడితూపుల నేయఁ
దాతయమ్ముల నొచ్చి తాతను మెచ్చి । చాతుర్యగతి మించి నాలఁ గోపించి
దండహస్తుని గదాదండంబు బోని । దండ మాయత భుజాదండుఁడై యెత్తి
'యూడనిఁ బాడకు మోతాత!' యనుచు । వోడక యప్పుడత్యుగ్రత వైవ
నొగిఁ గృతఘ్నునకైన యుపకృతి వోలె । మొగి నాతఁడేచి ముమ్మారియులు చేసె.
శక్తియొక్కటి భుజశక్తి సంధించి । యుక్తిచాలఁగఁ బెంచి యొగి నిగిడింప
నది మంట లుమియుచు ననిలవేగమునఁ । బది దిక్కులును జెవుడ్వడఁగ మ్రోయుచును
మిడుఁగుఱు లెగయంగ మిన్నేరు వేఁడి । నుడుకంగ సైన్యంబు లొక్కటఁ గ్రుంగ
శూలిశూలము భంగి సూర్యునిభంగిఁ । గాలకూటము భంగిఁ గడఁగుట చూచి
కలఁగి కొందఱు భీతిఁ గనవులు గఱవ, । దొలఁగి కొందఱు యుద్ధదూరులై పఱవ,
మరలి కొందఱు శల్యునాటున కొదుఁగ, । దురములోఁ గొందఱు త్రొక్కుళ్ల మెదుగ
శల్యుండు రిపుమనశ్శల్యుండు రుద్ర । తుల్యుఁడుగ్రంబైన తూపు సంధించి
యాశాంతములు నిండి యరుదెంచుచున్న । యాశక్తిఁ దునుమాడె నటఁ బేరువాడి.

1. సూత.

పిన్నవాఁడయ్యును బెన్నత్తురుట్టఁ । దన్నేయుచున్న యాతని లావుచూచి
'మనుమఁడు తాతకు మాటాడ నేర్చె' । ననుమాట నిజమయ్యె ననుచు శల్యుండు
జవనారి కప్పుడు జవమునఁ దోఁడిగి । తివిరి నాంధిశల తెగఁ బ్రేయుటయును,
అనిల వేగములైన యశ్వరత్నములు । అని వెడలఁగ నీడ్చె నాతని రథము.
అంతట శల్యుండు నధిక క్రోధమున । సంతసియుఁ బెంపొంది యొగ్గించి
జ్యారవంబున దిశాచక్ర మంతయును । బూరించుకొనుచు నప్పుడు వెసనార్చె
పటువఁ జొచ్చిన సేనఁబడి సూనువెంట । సోఁకి సూత్రంబును జొచ్చినయట్లు
తెఱపి గనుంగొని తెగువతో నంత । నఱిమి ఱేఁ జొచ్చి నాయకముల ముట్టి
కాఱడవులఁ గాల్చు గార్చిచ్చు రీతి, । మీఱి దంతులఁగూల్చు మృగరాజుభంగి,
మూఁడూళ్లు గాల్చిన ముక్కంటి పగిది । వాఁడిమిఁ గౌంతేయు పరబలంబులను
సమరోర్విఁ బెక్కండ్ర సమయించి మించి । సమవర్తిపురికి విచ్చలవిడి ననిచె.

## దుశ్శాసనుఁడు సహదేవునితోఁ బోరి మూర్ఛిల్లుట

సహదేవుఁడేచి దుశ్శాసనుమీఁద । బహుతరాస్త్రంబులు పరఁగించుటయును
బోఁడిమి యువరాజు పొంది శరత్రయము । వాఁడిమి సహదేవు వక్షంబు నొంపఁ,
జాపంబు మ్రోయించి శౌర్యంబు వెంచి । కోపంబు బల్మి భ్రూకుటికల్మి దోఁపఁ
గరువలి నెలవున ఘన పతాకంబు । మెఱయ శరద్యుతి మిహిరుతో నొరయ
రథగతి నిజమనోరథగతి మీఱఁ । బ్రథితాశ్వ[1]ఖురహతిఁ బాతాళ మగల
నవ్య విక్రముఁడైన నకులానుజుండు । దివ్యులచ్చెరువంది దృష్టించి చూడ,
డెందంబు పెన్నుబ్బ డెబ్బదితూపు । లందించి సూతుని యదటణఁగించి
కాండత్రయోదగ్ర ఘనతరాహతుల । గండు మీఱఁగ సూతు గబ్బు మాన్పుటయు,
నతిరోష రక్తాక్షుఁడై కౌరవుండు । చతురత మాద్రేయు చాపంబు దునిమె.
అతఁడొండు కార్ముక మటమటఁ గొనుచు । వితత రణప్రౌఢి విలసిల్ల నపుడు
కపటాత్ముఁడై యొక్క కాండమేయుటయు । నపరిమితజ్వాల లడరి యేతేరఁ
గడు వెసనెత్తిన కరవాలమునను । దడయక యువరాజు దానిఖండించె.
ఇంద్రచాపప్రభ నెనఁగు చాపంబు । సాంద్రవైఖరిఁగొని చండ కౌరవుఁడు

---

1. నిజ (మూ).

కంకపత్రంబులు ఘనచతుష్షష్టి । పంకింప నమ్మాద్రి పట్టిపైఁ బఱప,
వఱల మున్నూటిరువది వాఁడికోల । లఱిముఱిఁ గుఱియించి యశ్రమ లీల
నీలకంఠము సర్పనిచయంబుఁ ద్రుంచు । పోలిక నబ్బాణములు పొలియించి,
హస్తలాఘవమును నస్త్రలాఘవము । శస్త్రమై పెనుపొంద సహదేవుఁ డేచి
శాతధారాభీల చటుల బాణంబు । లాతనిపైఁ బెక్కులడరించుటయును,
అవి యంతవట్టును నవలీలగాఁగ । వివిధ ఖండములు గావించి కౌరవుఁడు
శరనవకంబున సారథియురము । నరుదార నాటించి యార్చె; నార్చుటయు
నాలోన సహదేవుఁ డలుకమైఁ గాల । కాలుఁడై బొమముడి కడుపడి నిగుడ
"రమణి పాంచాలి చీరలు సభలోనఁ । గ్రమమేది యొలిచిన కష్టాత్ముఁ దెచ్చి
పరమేష్ఠి నా దృష్టిపథమున నిలిపెఁ । బరఁగ నాచేసిన భాగ్యంబు గాదె!
భీముప్రతిజ్ఞ తప్పినఁ దప్పెఁగాక । యీ మదాంధునిఁ బట్టియేఁ గూల్తు." ననుచుఁ
(బటు బాణమొకటి యంబరగుున దీప్తి । పటలంబుపర్వ నుద్భట వేగవృత్తి)
నేసిన, నది సేనలెల్ల భీతిల్ల । నోసరపడక జోడుచ్చిపోవుటయు,
ఆొమ్మ ప్రక్కలువాఱి రుధిరంబు గాఱి । [1]దిమ్మరి మూర్ఛిల్లి తేరిపై వ్రాల
సూతుండు నురుభయ శోకాత్ముఁడగుచు । నా తేరు గొనిపోయె ననికి దూరముగ.
అతిరౌద్ర రుద్రవిహారుఁడై మాద్రి । సుతుఁడు తద్బలవార్ధి సొలవక చొచ్చి
మందరాద్రియుఁ బోలె మహితధైర్యమున । నందంద కలఁచి యిట్టట్టు గావించె.

## కర్ణ నకులుల ద్వంద్వయుద్ధము

కర్ణుండు నకులుండుఁ గడు మచ్చరించి । దుర్నివారబలంబుతోఁ బోరునపుడు
ఆ సూతనందను నలుకతోఁ జూచి । యాసున మాద్రేయుఁ డిట్లని పలికె:
"ఎన్నఁడు కర్ణుతో నెక్కటియుద్ధ । [2]మన్నది కల్గునో యనుచుండ నేఁడు
తలఁచి నిన్నిటఁ దెచ్చి ధరణి నాయెదుట । నిలిపిన బ్రహ్మను నెఱయ మెచ్చితిని.
కడు సుయోధనునింటఁ గడిమాడ సేయఁ । గుడిచి దేహమున నెక్కుడు కండ హెచ్చి
క్రొవ్వు వాతెరఁ బట్టి కుఱుబొజ్జవెట్టి । క్రొవ్వాఁడి మించులగోల్లు మీటుచును
గలహంబు పాండవ కౌరవులకును । దలఁకొని పన్నిన తండ్రివి గావె!

1. దిమ్మరి. 2. మున్నది కల్గునొకో యనుచుండ. (మూ)

అదిగాక ద్రౌపది నతిపుణ్యసాధ్విఁ । బదరి దుర్భాషలు పలికిన ద్రోహీ!
నాశరంబుల నిన్ను నాశంబుచేసి । యాశతీఱఁగఁ జూడ కాలుచే కిచుక!"
అనవుడు మీసంబులదర సూర్యదేయుఁ । గనుఁగొని యుగ్రుఁడై కర్ణుఁ డిట్లనియె:
"సత్క్షత్రియుండవు శౌర్యధుర్యుఁడవు । వీక్షింప దివ్యాస్త్రవేదివి గాన
బలుకులఁ బనియేమి భండనభూమిఁ । జులుకన నీలావు చూపుదుగాక."
యనుచు రాధాపుత్రుఁ డాతనిమీఁదఁ । జొనిపె డెబ్బదిమూఁడు సునిశితాస్త్రములు.
ధనువు ఖండించియుఁ దనువున నాటెఁ । దనుకంగ ముప్పది దారుణాస్త్రములు.
కాండాసనంబొండు కడఁకతోఁ గొనుచు । గాండీవితమ్ముఁ డఖండ తేజుండు
ఈరేడుబాణంబు లినజునిమీఁదఁ । గూరించి ముప్పదికోలల నొంచి
పాలువాతమ్ములు బలువిడి మూఁడు । సారథిమేనఁ [1]బింజలబంటి డించి
విల్లొక్కశరమున విదళించి యతని । త్రుళ్లడంచెను నాల్గుతూపులచేత.
సరవి నీరీతిని జాపంబు దునుము । సరసిజాప్తసుతుండు సరవిమై నంత
వొంకపండునుబోలె నొప్పులచేత । వింక విల్లొక్కటి వీఁకఁ గైకొనుచుఁ(?)
జుఱచుఱ నిప్పులు చూపులఁ దొఁగఁ । దఱిమి యా నకులు నుద్ధతిని దాఁకుటయుఁ,
బేర్చి యయ్యిరువురు భీకరాస్త్రముల । కోర్చి మహోగ్రులై యుద్ధంబుసేయఁ
గర్ణుండు నిగిడించు కాండజాలములు । తూర్ణమై ఖరితోడఁ ద్రుంచుఁ బాండవుఁడు.
నకులుండు పఱపెడు నారాచపంక్తి । ప్రకటించి ఖండించుఁ బద్మాప్తసుతుఁడు.
తూపులొండొరులను దూలనేయుదురు ; । తూపులొండొరుల నెత్తురులముంపుదురు ;
ధృతిఁ బరస్పర ఘోర దివ్యాస్త్రములకుఁ । బ్రతిసాయకములేసి బయలుసేయుదురు.
సారథి రథరథ్యచయముల ద్రెంత । లా రథికుల యార్పు లా గుణధ్వనులు
వినవచ్చుఁగాని, యా వీరపుంగవులఁ । గనరాదు పెంధూళి గ్రమ్మిన కతన.
ఆ సమయంబున నప్పాండవునకు । బాసటగా వచ్చి పాంచాలబలము
ఖరకరసూతి భీకరసాయకములఁ । గరములు దునిసియుఁ గంఠముల్ దెగియుఁ
బసదక్కి యొక్కట బన్నురించియును । దెసచెడి భయముచే దిక్కు[2]మొక్కయ్యె
నమ్మనమ్మయ్యని వంజవాఱియును । ఎమ్మెదూలియుఁ బలాయితమయ్యె నపుడు.
అదిచూచి నీయోధు లదయులై యతనిఁ । [3]బొదివి రక్కనిఁగప్పు మొగిళులుఁ బోలె;

---

1. పిజ్జల. 2. ముక్కయ్యె. 3. పొదివిరి కప్పు మొగిళ్లనుబోలె. (మూ).

పాండవు నత్యుగ్రబాణపాతమున । గండెల్లఁజెడి దూరగతులైరి పఱచి.
ఎడగలుగంగ నిట్టిగు నాఁగు నిలిచి । కడఁగి వారల యుద్ధగతిఁ జూచుచుండ
సూతజుఁ డాపాండుసూనుని గెలువ । సూతాశ్వ కోదండ ఘోటకవ్యాప్తిఁజేసి
విక్రమలీలఁ ద్రివిక్రముండగుచుఁ । జక్రరక్షకులమస్త్రము లుర్విఁ ద్రోలిపి
పలకయు వాలు నబ్బలియుండు గొనినఁ । జెలరేఁగి నడిమికిఁ జెక్కలుచేసె;
తునుకలు తేరిపైఁ ద్రొరఁగకమున్న । యతఁడు వార గదయెత్తి నని రూపుమాపె;
విరథుఁడై నకులుఁ డుర్విఁకి డిగ్గదాఁటి । పరిఘాభిరాముఁడై పఱతేర నలిగి
పరిఘంబు పొలియించి భర్మపుంఖముల । శరములు గురిసిన, జడిసి పాండవుఁడు

## కర్ణుఁడు నకులు నొవ్వనాడుట

ఎల్లవారును జూడ నేపెల్లఁ బొలిసి । పొల్లయై సంగ్రామభువి నోడిపాఱ,
వెనుకొని కర్ణుఁ డవ్వీరుకంఠంబు । తనచాపయష్టిచేఁ దగిలించి పలికె:
"పొల్ల, నీవెక్కడ పోడిచివచ్చితివి? । పల్లదంబున నొవ్వఁబలికితి నన్ను;
అప్పటివీరంబు లప్పటికాఱు । లిప్పుడెక్కడవోయె? నేల పాఱెదవు?
నా లావుకొలఁదియు నాసాహసంబుఁ । జాలు నీ వెఱిఁగితి జననాథతనయ!
ఓపఁజాలక నన్ను నోవెట్టికాన! । నీ వెన్ని పలికిన నీమీఁదఁ దెగను.
ఓపిన మార్కొను మోపకయున్న । వే పొమ్ము పాండవవిభునియొద్దికిని.
కాకున్న నర్జునుకడకైనఁ బొమ్ము; । రాను మొన్నఁడు నిట్లు రణరంగమునకు."
అని కుంతివాక్యంబు లాత్మఁజింతించి । జననాథ, నకులుని జంపక విడిచె.
నినుపారుసిగ్గుతో నిట్టూర్పుతోడఁ । జని పాండవాగ్రజు స్యందనంబెక్కి-
కుంభ వినిక్షిప్త కుండలివోలెఁ । గుంభిపురీశ, నకులుఁ డుండె నంత.
తనయు విజృంభణత్వంబు వీక్షింప । నెనయంగఁ బొడవున కెక్కెనో యనఁగఁ
దరణియు మధ్యాహ్నధారఁ జెన్నొందె; । ధరణిఁ గర్ణుఁడు ప్రతితరణియై వెలిఁగె.
ఈరీతి నప్పాండునృపసూతిఁ గలహ । ధారుణిలోపలఁ దలపట్టి విడిచి
కలధౌత[1]కాశసంకాశ తురంగ । కలితకంబు ప్రభాకమనీయకేతు
సురుచిర మాణిక్య శోభి సమీర । నిరుపమగతియుక్త నిజమహారథము

1. కాం. (మూ).

పరఁగంగఁ గర్ణుఁ డుద్భటప్రవృత్తితోడఁ । బఱపించి సోమకబలములఁ దరిసి
కాలాగ్నికీలలకరణి మెఱుంగు । లోలి మిన్నులఁ బర్వ నుగ్రబాణములు
చిత్రవానయుఁబోలె క్షితిఁ గదియించి । క్రొత్తనా సూతులఁ గొట్టినైచియును,
మూఁకలు మూఁకలై మొగిఁ బన్నిసచ్చి । తాఁకిన రథికుల తలలు ద్రుంచియును,
బడగలు గొడుగులు బహు చామరములు । పొడిపొడి గావించి పుడమి రాల్చియును,
అంకుశంబులతోడ హస్తాళితోడఁ । గొంకక గజములఁ గొట్టి త్రోచియును,
వేదండములఁ జంపి విపులకుంభములు । భేదించి ముత్యముల్ పృథివిఁ జల్లియును
ముందఱ రౌతుల మోఁది గుఱ్ఱముల । కంధముల్ చెండాడి కాళ్లు ద్రుంచియును,
మొదలఁ గల్లెంబులు మోరల గూడి । చిమ్ముపత్తైపోఁ జెలఁగి చెక్కియును,
శాతాసి తోమర చాప శరాది । కేళి సాధనములు చిత్రపుచ్చియును
చేతుల కసిపోవఁ జెండి కాల్బారను । భూతకోటికి బలి పుడమిఁ బెట్టియును,
బుట్ట లెక్కినవారిఁ బోరిఁ బ్రాణభీతిఁ । జెట్టు లెక్కినవారిఁ జేకాచి విడిచె.
అవనీశ, నీపుత్రుఁడగు యుయుత్సుండు । గవిసి యులూకునిఁ గడిదిబాణమున
నొంచినఁ గోపించి నుతశక్తి [1]నతఁడు । త్రుంచె నాతనివిల్లు తునుకలుగాఁగ.
అక్కుమారకుఁ డంత నన్యచాపంబు । గ్రక్కునఁ గైకొని కడిమిదీపించు
తూపు లర్వదినాల్గు తొడిగి నీమఱఁది । యేపున గ్రుచ్చియు రోషంబుతోడ
మొక్కలుండై సూతు మూఁడు బాణముల । గ్రుక్కనేయుటయును నుబలనందనుఁడు
మిక్కిలి నొచ్చియు మితిలేని యలుక । నక్కజంబైన రౌద్రావేశమునను
సాయకం బొక్కట సారథిఁ దునిమి । యాయెడ నాల్గింట హయములఁ జంప
మర్మవిభేదన మార్గణహతుల । నిర్మథితాంగుఁడై నీకుమారుండు
అందఱుఁ దనుజూచి హాస్యంబుసేయఁ । జిందఱవందరై చెడి పాఱిపోయి
యొంటు రథంబెక్కి యుడుకున గ్రుక్కి । యుండెఁ గౌరవసైన్య ముప్పొంగి యార్వ.
అంతటఁ బోవక యాయులూకుండు । సంతకాకాకుఁడై యరదంబు పఱపి
బలువడిఁ బాంచాల బలముల కుఱికి । కొలఁది మీఱిన వాఁడికోల లేయుచును,
దవవహ్ని వనముల దహియించునట్టి । తివుటఁ జరించె నుద్రేకంబుతోడ.
శ్రుతకర్మ నకులునిసుతు శతానీకు । ధృతిఁదాఁకి యార్చుచుఁ దెగి పోరునెడను
సారథిహానియుఁ జచ్చిన హరులు । నా రథులకు సమమయ్యె ; నాటయును

---

1. వరుఁడు. (మూ)

విరథులై యుద్ధంబు విడిచి వే చనిరి । తిరముగా వే ఱొండు తేరుల కంత.
నుతశక్తి భీమసేనుని పుత్త్రుఁడైన । సుతసోముఁ దలపడి శూరుఁడై శకుని
యతఁడేయు శరములు నతనిరథ్యములు । నతని పతాకయు నతని రథంబు
దుత్తుమురును గాఁగఁ దునుమాడుటయును, । అత్తఱి సుతసోముఁ డవనికిడాఁటి
విలు గేలఁబూని దోర్వీర్యంబు మెఱసి । బలు నారసముల సౌబలుఁ జాలనొంప
నాలోనఁ గోపించి యట సౌబలుండు । బాలునివిల్లు దోర్బలశక్తిఁ దునుము,
విను మేమి చెప్ప నవ్వీరుండు చేతి । తునుక నాతనివిల్లు తునుకలు చేసి
శ్రుతకీర్తి రథము విశ్రుతకీర్తి నెక్కె । సుతసోముఁడుండె నక్షుల నిప్పులుఱల.
అత్తఱి వేఱె విల్లంది యా శకుని । యుత్తెఱపిని చొచ్చి యార్పులు చెలఁగఁ
బాండవ రథికుల భట సమూహముల । గండు మీఱఁగఁ జొచ్చి కలఁచుచునుండె.
అంత మందరధైర్యుఁ డాకృపాచార్యుఁ । డెంతయుఁ గోపించి యేపు దీపించి
పసిఁడి యాఁబోతునఁ బడగ యొప్పార । నసమాన తేజుఁడై హరునిచందమున
జ్యానాద హరినాద శంఖనాదముల । భూనభోంతరములు బోరుకలంగఁ
గడురయంబునఁ దేరు కదియఁ దోలించి । వడినాశ్వి పాంచాల వరునిపైఁ గదిసి
వధియింపఁజాలు దుర్వార బాణంబు । లధికుఁడై చాపంబునందొప్పఁ దొడిగి
చారు హాటకశైల[1]సంకాశ రథము । సారథి హయములఁ జదియ నేయుటయు,
గౌతమాటోపంబు కౌంతేయసేన । లాతతగతిఁ జూచి యప్పు డిట్లనిరి:
"ద్రోణుఁజంపిననాఁటి కోప మీద్విజుఁడు । క్షోణి నీతనిమీఁదఁ జూపుచున్నాఁడు.
చలము సాధింప ధృష్టద్యుమ్నుఁ బట్టి । చెలఁగి గతప్రాణుఁ జేయ కే లుడుగు!
అతి బాహుబలుఁడు దివ్యాస్త్ర కోవిదుఁడు । క్షితిలోన వైరులఁ జీరికిఁ గొనఁడు.
ఇతఁడు విల్లందిన నెల్ల దేవతల । హతము గావించెడినఁట లోకులెంత!
చేవ నీతం డేఁచు చెఱువుల నీళ్లు । ద్రావించు మనల నందఱ నేఁడు కడఁగి."

## ధృష్టద్యుమ్నుఁడు కృపాచార్యులతోఁ బోరి యోడిపోవుట

అనుచోట సారథి యధిపతిఁ జూచి । తన నీతి వెలయంగఁ దా నిట్టులనియె:
"వినుము కుమార, యీ విప్రపుంగవుని । ఘన బాహువీర్య మగ్గల [2]మవార్యంబు.
భూమిపై నీవేయు భూరిబాణంబు । లేమి చిత్రమొ గాని యితనిపైఁ జనవు.

---

1. సంకాశ శరథ్య. 2. మదార్యంబు. (మా)

మగంటిమిగల నీదు మహిత విక్రమము । జగతిఁ బ్రసిద్ధిఁ జెల్లుచున్నదియు ;
ఏ నిశ్చయించితి నితఁడనర్ఘ్యుండు ; । మానవనాథ, నామాట గైకొనుము :
మన తేరు సంగ్రామమహిఁ గదలింపఁ । గొనిపోవుటయె మేలు గురుకార్యసరణి."
ననిన ధృష్టద్యుమ్నుఁ డనియె సారథికి : "ఎవరిని పితలఁగొప్పఁ జెంచి చూచితిని ;
మనసు విహ్వలమందె మా కెందు కుందేఁ । గనుఁగొనఁ జేకట్టె గ్రమ్ముచున్నదియు.
వడఁకెడిఁ బదములు ; వదలె ధైర్యంబు ; । రోమలు తిమ్మిరి పట్టుచున్నది నాకు.
²అడిబీరమేటికి ! నరకంబు కీడు । కడకైనఁ బాపంబు కడకైనఁ గడపు
రయు మొప్ప." ననుడు సారథి విజరథము । భయమేది తోలె నా బాకైనఁ గడకు.
దారుణ శంఖనాదము నెఱపుచును । ఘోరచాపధ్వనిఁ గుంభిని యద్రువ
వెన్నాడెఁ గృపుఁడంత వెసఁ బర్వతంబు । వెన్నడిందిన యట్టి విబుధేంద్రుకరణి.
కెరలి శిఖండియుఁ గృతవర్మయును । కర ముగ్రశరపంచకంబున నొంప,
ధీరుఁడై భోజుండు తెగి ద్రుపదజుని । నాక్రోటు నొంచి విల్లత్తిముక్కఁ ద్రుంచె.
తోరంపువిల్లున ద్రుపదనందనుఁడు । ఘోరబాణంబులు భోజుపైఁ బఱపఁ,
దోడనె యవి ద్రుంప, ద్రుపదజుఁ డలిగి । బీదుకొబీదుగా విలునఱుకుటయు,
యాదవోత్తముఁ డన్యచాపంబు । నాదటఁగొని కోప మాత్మలోఁ గదుర
ఫాలంబునందు దోర్బలశక్తి మెఱయ । నాలికతూపులు వడి నాటనాటె.
కలలావుపోలిసి శిఖండి మూర్ఛిల్లి । బలువిడిఁ దేరిపైఁబడిన, సారథియుఁ
దోలె నచ్చోటు బంధురగతిఁ దొలఁగఁ ; । దూలి యాసేనయుఁ దోడ్తోన పఱచె.
అటఁ ద్రిగర్తాధీశుఁ డర్జునుతోడఁ । దటుకునఁ బేర్చి యుద్ధము సేయుచుండ
సత్యసేనుండను జననాయకుండు । సత్యసంధుండగు సత్యకీర్తియును
మిత్రవర్మండును మిత్రదేవుండు । క్షాత్త్రంబు గలయట్టి చంద్రదేవుండు

... ... ... ... ... | ... ... ... ... ...

వీరాదిగాఁగల వీరపుంగవులు । ఆరయ ⁴నారలయనుజులు సుతులుఁ
గ్రూర నారాయణ గోపాలకులును । సార శైబ్యత్రిగర్త సాల్వసైన్యములుఁ
గర ముగ్రగతిఁ దోడుగావచ్చి నరుని । యురవడ మత్యుగ్రులై యటు చుట్టుముట్టి
సరిగొని మూఁటను సత్యసేనుండు, । మెఱసి నాల్గింటను మిత్రదేవుండు,
మిహిరతేజుండైన మిత్రవర్మండు । నిహీనసంఖ్య(?) నిష్ఠుర నిశితాస్త్రములను,

1. బట్టిన. 2. అడిదమేటికి. 3. సప్త. 4. నాతని. (మూ).

చంద్రదేవుం డేఁడుసాయకంబులను । ఇంద్రతనూభవు నేసి యార్చుటయు,
నప్పుడు మేఘంబు లంబుధారలను । గప్పిన గిరివోలెఁ గదలక నరుఁడు
మర్కటధ్వజభూత మహితాట్టహాస । కర్కశధ్వనుల నాకము పెల్లగిల్ల
గాండీవ పటుతర క్వణనంబు రిపుల । గుండియ లవియ నెక్కుడుగాఁగ నెఱపి,
సరసమై సవ్యాపసవ్యమార్గములఁ । గరలాఘవము చిత్రగతి నుల్లసిల్ల,
నిజనామ విలసిత నిష్ఠురాస్త్రముల । విజయుండు హాగిమెచ్చ వేవేగఁదొడిగి,
మిత్రదేవుని నూఱు మెఱుఁగుఁదూపులను, । మిత్రవర్మని నాల్గు మేటియమ్ములను,
ఱిమిగి సత్యసేనుని మూఁట, సుశర్మఁ । దెగి నాలుగింటను ధీరుఁడై నొంచె.
ఆ *శృతింజయునిఁ బెక్కమ్ముల ముంచి । సౌశ్రుతిఁ జంపె వింశతికాండములను.
విశిఖాష్టకంబున వెసఁ జంద్రదేవు । పస రూపు నరివీరభద్రుఁడై మాపె.
అంతఁ గోపంబున నా సత్యసేనుఁ । డంతకాకారుఁడై యార్చుచు వచ్చి
కర ముగ్ర కాంచన కాండతోమరము । నురగతల్పునిభుజ ముచ్చిపో వైవ
నీలాద్రిగైరికనిర్ఝరంబనఁగ । నోలి శోణితపూర మొండొండ దొరఁగె.
అది గనుఁగొని క్రీడి యధికరోషమున । వదల కెంతయు వాని వధియించి మించె.
ఆ సత్యసేను నిట్లనిపైఁ గెడపి । నాసపి మఱి మిత్రవర్మున కుఱికి
ఘన[1]వత్సదంత భీకరకాండయుగళిఁ । జొనిపి మర్దించెను సూతయుక్తముగ
వెమ్మచు వెండియు వెసఁ ద్రిగర్తేశు । తమ్ములు పెనఁగ నుద్ధతిఁ గడంగినను
జిత్రవైఖరి నొక్క శితసాయకమున । మిత్రదేవు శిరంబు మృత్యువు గొనఁగె.
పరఁగఁ ద్రిగర్తాధిపతి బాహుమధ్య । మురవడి నాటించె నుగ్రబాణమున,
అట్టిచో సంశప్తకాఖ్యగణంబు । బెట్టిదంబుగ మిన్ను పెకల నార్చుచును
మందేహనికరంబు మార్తాండుఁ బొదువు । చందంబు దోఁప వాసవసూనుఁ బొదివి
నారాచ శూలాది నానాస్త్రసమితి । శూరపుంగవుమీఁద సోనలు గురియ
జంపులువెట్టక సంశప్తకులను । జంపుట కార్యంబు చర్చింప ననుచు
భీమానుజుండు సంభృతకోపుఁడగుచు । నామూఁకమీఁద నైంద్రాస్త్రమేయుటయు,
నది వియచ్చర హృదయానందమగుచు । నది పాండవేయ సైన్యాహ్లాదమగుచు
నది ధార్తరాష్ట్ర భయంకరమగుచు । నది భూమి దిగ్గగ నావృతంబగుచుఁ
బరశు కౌక్షేయక పట్టిస శూల । పరిఘ ముద్గర భిండివాల నిస్త్రింశ

* శత్రుంజయుఁడని కవిత్రయ. భా. 1. సత్త్వదంతి. (మూ.)

ప్రాసాసి కణయక బాణ చక్రాది । భాసుర తోమర ప్రతతిఁ బర్వుటయుఁ,
జడియు రథంబులు సమయు సారథులు । కెడసిన హయంబులు మృతిఁబొందు రథులు
నా రథికులకంటె నధిక వేగమున । నారయ రాలు శస్త్రాస్త్రములును,
గొడుగులకంటె నెక్కుడుగ మున్నాడి । కడురయంబునఁ గూలు ఘనపతాకములుఁ,
గరిసమూహముక్రిందఁ గడఁగి "జెపిడిచి" యరుపఁ [1]గదిసెడి భటసమూహములు
నగణిత భటసమూహంబులమీఁద । నెగసి పాఱుచునున్న నెత్తుటేఱుల్,
నా రక్తనదులలో నప్పుడు తేల్చుచును । బాఱుచునున్న క్షత్రి కపాలకబంధములు,
నా శవంబులఁ దిను నాశతోఁ గూడి । కాసెకట్టుక యాడు ఘనపిశాచములఁ
గలిగిన జన్యరంగంబు చూపఱకు । బలయకాలమునాఁటి పెంపును నొందె.
హతశేష సంశప్తకావళి విఱిగి । ధృతిచెడి నాలుగు దిక్కులయందు
విచ్చినఁ, బొగలెల్ల విరిసిన వెలుఁగు । నచ్చుగా శోభిల్లె నమరేంద్రసుతుఁడు.

## దుర్యోధనుఁడు ధర్మజునితోఁ బోరి విరథుఁ డగుట

కౌరవేశ్వరుఁడును ఘనుఁడు ధర్మజుఁడుఁ । బోరుచునుండ నప్పుడు సుయోధనుఁడు
ఆతని నపబాణహతి నుబ్బుచెఱిచి । నూతుమేనొక్కటి చొరఁజేయుటయును
బగతుఁ అపూర్వులు భగ్నంబు గాఁగ । మగఁటిమి నార్చుచు మఱి ధర్మరాజు
నిప్పులక్షుల వెంట నిగుడఁ గోపంబు । ముప్పిరిగొన బొమముడి వెట్టుకొనుచు
భీమాట్ట [2]హాసంబుఁ బృథు రథధ్వనియు । భూమాయతోగ్ర కార్ముక నిక్వణనము
బృథురథ్య హేషిత భీషణ ధ్వనియుఁ । బృథివిని గగనంబుఁ బెల్లగలింపఁ
జతురుఁడై పదుమూఁడు శరములు దొడిగి । యతని యురస్థలి నదరంట నేసి
నాలుగు శరముల నఱికె నశ్వముల; । తోలి రెండింటను ద్రుంచె సారథిని;
ఆఱింటఁ బడగలావంతయుఁ దీర్చె; । ఈరసంబునఁ జాప మేడింటఁ దునిమె.
అంతలోఁ గైకొన్న యష్టిఖండంబు । వింతగా ఖండించె విశిఖాష్టకమున.
లలిఁ బంచశరహతి లావుదూలింప । నలికి భూమికి డిగ్గనుఱికె నీశొడుకు.
వికల [3]శతాంగు నుర్వీపతిఁజూచి । సకల సైనికులును సకల యోధులును
అరయ రాధాపుత్త్రుఁ డాదిగాఁ గలుగు । దొరలును మఱియు నాప్తులు సహోదరులుఁ

1. గదిసెడు. 2. సంభృతరథంబునను. 3, శాంగు. (మూ).

జక్కఁ గండలు నొక్కఁ జాడగావచ్చి । తక్కక పన్నగధ్వజుఁ గూడుకొనిరి.
భీమాదు లనుజులు పృథుబాహుసత్త్వ । లామాడ్కిఁ నేతెంచి రన్న పొంతకును.
దొరల మొత్తంబిట్లు దురముపై వేడ్కఁ । సొరిది నేపున నొక్కచోటఁ దార్కొనిరి.
ఉభయ సైన్యములకు నొక్కటఁ జెల్లె । బుభువు లచ్చెరువంది యీక్షింప రణము.
క్రందు కయ్యంబులో గరిపురాధీశ, । యందంద వెస నట్టలాడు ప్రోఁతలును,
ఆతత పరిఘ సాయక ముద్గరాది । హేతిఘట్టనముల నెసఁగు ప్రోఁతలును,
వరుసతోఁ గట్టికవారి ప్రోఁతయును । బరఁగి దిగ్వలయంబుఁ గగిలించెనధిప!
వెలి కుఱికిన కండ్లు విఱిగిన రొండ్లు । కలయ పిఱిగిన విండ్లు కఱచిన పండ్లు
నఱుమైన మెడలును నుగ్గైన తొడలు । నఱుచైన తొడవులు నులిసిన గదలు
మురిసిన కాళ్లును ముడిఁగిన వ్రేళ్లు । విరియఁ బాఱిన జోళ్లు విచ్చిననోళ్లు
నెఱయ ద్రెగ్గిన తేర్లు నెత్తురు టేర్లు । పఱదఁ బాఱినవార్లు వమ్మైననార్లు
నెమ్మల తిప్పలు నెఱచి కుప్పలును । వమ్మైన వాజులు వసరు రాజులును
గెడసిన యేనుఁగుల్ కీలూడి పడిన । పడగలు జగజింపఁ బలుగొడుగులును
గరవాఁడి యమ్ములుఁ గలయంగ నాటి । కొఱప్రాణములతోడఁ గూర్కు యోధులును
జిక్కని గుదియలచేతి గుంపులును । మొక్కరాహుత్తులు మూల్గు మావుతులుఁ
గలిగి సంగరభూమి గజపురాధీశ! । ప్రళయకాలముభంగి రౌద్రమై యుండె."
అనవిని కంపించి యాధృతరాష్ట్ర । జననాథుఁ డా సూతసంభవుఁ బలికె:
"సంజయ, చెప్పుము సమరంబు సొంపు; । రంజిల్లఁ జెప్పుము రారాజు విధము.
చలమును మానముఁ జాలించి యసికిఁ । దొలఁగెనో విరథుఁడై దుర్యోధనుండు?
నెఱయ సంజయ, నాకు నిక్కంబె చెపుమ । మఱి ధర్మజునితోడ మార్కొంట లేదె!
వెఱచి బిడ్డనినొప్పి విన్నది మొదలు । ఎఱియుచున్నది హృదయంబు లోన."
అనవుడు సంజయుఁ డతని కిట్లనియె: । "అనఘాత్మ, వినుము నీయాత్మసంభవుఁడు
విరథుఁ డొంటమొగాని విడువఁడు రణము. । అరదంబు వేఱొక్కఁ టనువొప్ప నెక్కి
కనలుచు నిప్పులు కన్నుల రాలఁ । దన రథచోదకుఁ దప్పక పలికె:
"తెల్లని గొడుగుతోఁ దెలివినున్నాఁడు । అల్లవాఁడే పాండవాగ్రసుతుండు.
పరఁగ నచ్చోటికిఁ బఱపు రథంబు । తురగవేగంబు బంధురలీల మెఱయ."
ననుటయు నట్లాతఁ డాచరించుటయుఁ । దననూతునకుఁ జెప్పె ధర్మనందనుఁడు

---

1. మింపు. (మూ)

'వాఁడె కౌరవపతి వచ్చుచున్నాఁడు । పోఁడిమి నెదురుగాఁ బోనిమ్ము రథము.'
అని పల్కు సూతుం గనల్లకాకనుచు । నిలు వేగంబున హయములఁ బజపఁ
జతురులై సురలెల్లఁ జయ్యనఁ జూడ । నతి ఘోర రణమయ్యె నయ్యిరువురకు.
రారాజువడి ధర్మరాజు చాపంబు । నారసంబునఁ ద్రుంచి నలిమీఱఁ దూర్చె.
ధనువు వేఱొక్కటి దాల్చి యారాజు । కనలుచుఁ దునుమాడెఁ గౌరవ్యువిల్లు.
మెఱుఁగులు గ్రమ్మఁగఁ గేటికిల్లెత్తి । మెఱసి యాతఁడు లెక్కమీఱఁగఁ జేయఁ
బొంగి పాండునృపాలపుత్త్రుండు ఛేద్చె । వింగియు నేలయు నిండ నేయుటయు,
నా వారిజాసనుఁ డస్త్రమయంబు । గావించెనోయనఁ గాన్పించె జగము.
గురుసింహనాదముల్ గుణవినాదములు । హయుల వినాదంబు లట వినవచ్చు;
మంటలుఁ బొగలును మార్గణావళుల । వెంటలుఁ గనవచ్చుఁ బెల్లుగాఁ బుడమి.
పోయె ధర్మజుపని పోయెఁ గౌరవ్యుఁడుఁ । బోయె నన్నట్టు మాబుద్ధికిఁ దోఁచె.
అమ్ములు పుచ్చుటయును నరిఁ బోయుటయును । అమ్మేయుటయుఁ దోఁప దప్పుడెవ్వరికి.
అత్తఱి రక్తధారావృతులగుచుఁ । గ్రొత్తపూచిన మోదుగులఁబోలి రిరువురు.

## దుర్యోధనుఁడు ధర్మజుతోఁ బోరి మూర్ఛిల్లుట

శక్తి యొక్కటివైవ సర్పకేతనుఁడు । యుక్తిమైఁ ద్రుంచిన [1]నుదరి ధర్మజుఁడు
పిడుగుకైవడి నొక్క బెడిదంపుఁ దూపు । తొడిఁబడ నీపుత్త్రుఁ దూఱ నేయుటయుఁ,
గయ్యంబు తుదిసేయఁ గలవాఁడె పోలె । నయ్యెడఁ గోపించి యరదంబు డిగ్గి
గదఁగొని కౌంతేయుఁ గదిసిన, నతఁడు । గదలక శక్తి వక్షముఁ గాఁడ వైవ,
మఱఁటిమి చెడక యా మానధనుండు । మగిడి తేరికి వింట మార్కొనఁదలఁచి
బురబుర నెత్తురుప్పొంగ నీకొడుకు । అరదంబుపైఁ బడె నవుడు మూర్ఛిల్లి.
హార్దిక్యుఁ డెడసొచ్చి యమసూతిమీఁద । దుర్దాంతశరములఁ దొడిగి యేయుటయు
వాయుసూనుఁడు కృతవర్మపైఁ గవిసి । సాయకజాలంబు సంధించి యేయ,
వాయువేగోద్ధూత వార్ధియుఁ బోలె । నాయెడ బలముతోడయ్యె భోషణకు.
అప్పుడు బీభత్సుఁ డమరులుప్పొంగ । నుప్పతిల్లిన [2]ధూళి యుడివీధి గ్రమ్మఁగ
జ్యానాద హరినాద శంఖనాదముల । భూనభోంతరము లద్భుతముగా మ్రోయఁ
బటురయంబున వచ్చి బహుళశరధార్ల । భట వారణంబులఁ బరిమార్చె; నంతఁ

1. నుదరి. 2. ధూమి. (పా)

గురుపతి తెప్పిఱి ఘోరబాణముల । నరుమీఁదఁ బఱప నన్నరుఁడు కోపించి
[1]సప్తి సారథి కేతు చారుచాపములు । సప్తబాణంబుల సమయించి మించి
విల్లల్లె నఱికి యావిభుని ప్రాణములు । కొల్లలాడఁగఁజాలు కోలలేయుటయు
మీఱి యశ్వత్థామ మేదినీనాథ! । యాఱింట నవిద్రుంచె నర్ధమార్గమున.
అతికోప రక్తాక్షుఁడై సవ్యసాచి । యతని కోదండరథ్యములఁ జెండాడి
యనిఁ దన్ను జెనకిన యాకృపాచార్యు । ఘను శరాసనశూన్యుఁ గావించె ననఘ!
సిడమును [2]మావులఁ జేతిచాపంబు । గెడపె నెదిర్చిన కృతవర్మఁ గిట్టి.
నిస్సీమ విక్రమనిధి విజయుండు । దుశ్శాసనుని విల్లు తునుకలు చేసి
కపికేతనాశ్రిత ఘన భూతవర్గ । విపులాట్టహాసంబు వినువీథిఁ గప్ప,
హారిరావ దేవదత్తాఖిలరావ । గురుగుణధ్వనులు దిక్కులఁ బిక్కటిల్లఁ
గర్ణుపైఁ గడఁగినఁ గర్ణుండు నపుడు । దుర్నివార క్రోధ ధూమ్రాక్షుఁ డగుచు
విష్ణునిపై గ్రుచ్చి విశిఖాష్టకమున । జిష్ణుని తనువు చెచ్చెర మూఁట నాటె.
ఈరీతి భానుజుఁ డేపుదీపించి । వారక దివ్యాస్త్ర వర్షముల్ గురియ
హరితమ్ముఁ డెడసొచ్చి యస్త్రపుంజములు । ఖరకరసూనుపైఁ గడఁగించుటయును,
అప్పుడు మాద్రేయు లాశిఖండియును । ఒప్పార ద్రౌపదేయులు యుయుత్సుఁడును
దండనాథుఁడుఁ జేకితానుండు మఱియుఁ । జండతేజులు పార్థ చక్రరక్షకులు
ఘనమాత్స్య చేది కేకయ శూరవరులు । ననిలోఁ బ్రభద్రకు [3]లా కరూశులును
గాంతేయ హితముగాఁ గర్ణుపై నొక్క । కుంతాది బహు శస్త్రకోటులు పఱప
ననమాన వేగుఁడై యవియెల్ల నతఁడు । నిశితాస్త్రచయముల నీఱు గావించి
దంతి శతాంగ పదాతి తురంగ । సంతతి సంగరస్థలి రూపుమాపె.
దివిజేంద్రసుతుఁ డంత దివ్యాస్త్రవహ్ని । వివిధరూపులఁ గప్పె విశ్వమంతయును.
అనయంబు గార్చిచ్చు లడరినఁ బొఱు । ఘనమృగ నివహంబుకైవడిఁ దోఁవఁ
గురురాజబలము నుగ్గులుగాఁగ విఱిగి । పరభసగతిఁ బాఱె జగతీశ, యంతఁ
బంకజాప్తుండును బశ్చిమవార్ధిఁ । గ్రుంకె రక్తచ్ఛాయ గుఱుతు గాన్పింప.
ఆ సమయంబున నట నిరువాఁగు । వేసరి శిబిరప్రవేశంబు చేసి
కృతమతి సంధ్యాది కృత్యముల్ దీర్చి । క్షితిమించి సుఖనిద్ర చెంది రారాత్రి."
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయక్షితిపతికిఁ

---

1. సప్త. 2. మావుల. 3. లా బలంబులును. (మా)

చెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మునీంద్ర । నెప్పాటఁ గథనెల్ల నెఱిఁగింపు మనిన
ద్వారకావాస, శ్రీవైకుంఠనాథ, । నారదవినుత, లోకఖ్యాత చరిత,
నిత్య సత్యోన్నత, నీరజనాభ, । అత్యంతదృఢ, చిన్మయాకార, దేవ,
ఘనమాని హృద్గేహ కలిత సందోహ । వినుత ప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన, భుక్తి । ముక్తిప్రదాయక ! మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర పద్య
రచితమగు కర్ణపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొప్పె రెండవది.

# తృతీయాశ్వాసము



శ్రీవిష్ణు నిజనామ, శ్రీరంగధామ, । గోవింద, మాధవ, గోపికారమణ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:

## కర్ణుని రెండవనాఁటి యుద్ధము

ఆరాత్రి వేగంగ నమ్మఱునాఁడు । చారుతరంబుగా సకల జనంబు
మునుకొని సంగ్రామమునకును నడచి; । రనయంబు నంతలో నక్కడఁ జేరి
యమతనూభవుఁడు బృహస్పతి మతము । నమరి మించిన దుర్జయవ్యూహ మెలమిఁ
బన్నింప, మనవారు ప్రతి మోహరంబు । పన్నుటకై పద్మబాంధవ సూతి
కెదురుచూచుచు నుండి రెలమితో ననిన । నదను మీఱంగ నా యాంబికేయుండు:
"అకట సంజయ, వినుమటఁ జలిచేతఁ । బ్రకటితంబుగ బాధపడు మహీజనులు
అరయంగ సూర్యోదయము గోరుచున్న । కరణిని దనరాక గరిమతోఁ గోరు
జనుల కాతఁడు నిజస్వచ్ఛ తేజమున । ఘనమైన ప్రియ[1]మెసఁగఁగఁ దోఁచెనొక్కొ!
అమ్మెయిఁ దొలునాఁడు యమసూతిచేతఁ । గ్రమ్మనఁ బడ్డట్టి కష్టము చూచి
సకల బలంబులు సన్నాహలీల । నకలంకగతి వచ్చి యాహవవీధి

... ... ... ... ... । ... ... ... ... ...

కర్ణుఁ డా కలనిలోఁ గౌంతేయవరుల । వర్ణింప గెల్చెడివాఁడు! చాల్చాలు!
ఏమిచెప్పఁగవచ్చు నితని మూఢత్వ । మామెయిఁ [3]జెఱుపక యది యేలమాను?
నెలకొని సౌబలు నీతియుఁ గర్ణు । బలిమియుఁ గడఁకచొప్పడఁగూడి తనకు
నెలమితో సామ్రాజ్య మీయఁగా బలిసి । వెలయు[4]వాఁడై యుండు వెడఁగు రారాజు.
మొనసి జూదమునాఁడు మొనసిన కీడు । ఘనముగాఁ బెరిగి దుఃఖము సేయకున్నె!
పూనినగతిఁ బాండవులలోన నొక్కఁ । డేనియు నొవ్వఁడు ఎలమి దీపింప.
నతులలో మెలఁగిన చాడ్పున మనదు । చతురంగ బలములో సంచరించెదరు.
దేవతాబలమున ధీరులు వారు; । కావున జయమెద్ది కౌరవ్యనకును."

1. మెఱుఁగఁగ. 2. వచ్చురాహువువిదియ. 3. జరుపక. 4. నోడై యుండు రారాజు. (మూ)

అనిన సూతతనూజుఁ డాంబికేయునకు । వినుమని యెంతయు వివరింపఁ దొడఁగె:
"పార్థివ, విను కృతపడిన కార్యంబు । అర్థిఁ గ్రమ్మఱఁ గానఁగునె! డెందంబు
గుందు సింతయకాక; గానఁగొని నీవు  పాండుసూనులఁ జేసి యిప్పుడు వగచెదవు;
అదియును ఫలియించె; సకల యుద్ధంబు । పదపడి పలుదన్నుఁ బాండవులకును
గీడు దలంపుచుఁ గిల్బిషంబునకు । నోడక యొడిగట్టి యుంటివిగాదె!
కడచినపనికి వగవఁ బనిలేదు । కడఁకతోఁ గుతను సంగ్రామంబు తెఱఁగు
విను" మనుటయు మహీవిభుఁ డిట్టులనియె: । 'ఒనరఁ గర్ణుండాజికుండిన యట్టి
కారణంబేమి? చక్కఁగఁ జెప్పు' మనిన । నారూఢి సంజయుఁ డనియె భూపతికి:
"కరమొప్పఁగా దేవకద సర్వజలము । దురము సేయఁగఁ బోవఁ దొడఁగి యున్నేళ
పరికించి సితనూభవుఁడు తమ్ములును । దరణీపనందను దను గొల్వరాఁగ
నాజికి వెడలె; నయ్యవసరంబునను । రాజుడగ్గఱ దివరాజపుత్రుండు
మెల్లన నిట్లను: "మేదినీనాథ! । యెల్లగాఁ గృపవిను మిప్పుడొక్కమాట,
నాకు సురాధీశనందనునకును । బ్రాకటంబుగఁ గల్గు బవరంబు నేఁడు.
అలవును జలమును నధికంబుగాఁగఁ । దలపడుదుము ఘోరతర సత్త్వలీల.
ఎలమితో దేవేంద్రుఁ డిచ్చిన శక్తి । పొలియుట నాతోడఁ బోరాడు నతఁడు.
దొరకొని కరము నెత్తురుగాక యుండ । విరివి నర్జునుఁ జంపువిధముఁ జింతింపు.
సలలితంబగు దివ్యశరసత్త్వమునను । దలకొని సరి నాకుఁ దలపోసిచూడ;
ఘనదృఢత్వమున లాఘవ గుణంబునను । మును దూరపాతంబునను వజ్రపతనను;
పటు శౌర్యధైర్య సంపద హీనుఁ డతఁడు; । చటుల సౌష్ఠవరేఖఁ జాలఁ డెంతయును.
మనుజేశ, వినుమొక్కమాట చెప్పెదను । మును విశ్వకర్మ బుభుక్షున కెలమి
విజయ నామంబున వెలయు చాపంబు । విజయుఁడై నిర్మించి వెసనీయ, నతఁడు
నావింట నిఖిలదైత్య శ్రేణిఁ ద్రుంచి । భావించి యంతలో భార్గవరాము
నకు నీయ, నాతఁడు నవ్యశౌర్యమునఁ । బ్రకటించి మించి యిర్వది యొక్కమాటు
భూవల్లభులఁ ద్రుంచి పొందుగా నాకు । వావిరిఁ గృపచేసె వసుధాధినాథ!
నెలకొని యిమ్మహానీయ చాపమున । మలసి దేవేంద్రజుమద మణంచెదను.
అనఘ, నావిజయంబు నాగాండివంబు । విను నీకుఁ జెప్పెద వెననొక్కసమము.
తొలఁగక యక్షయ తూణీరములును । అలరనవధ్యరథ్యంబులు రథముఁ
గల వవి యెక్కుడు గడఁగి వానికిని. । కలవు శస్త్రాదులు ఘనముగా బండ్లఁ

గొని తెత్తుఁ; దేరుల ఘోటకంబులను । వెనుకను బెక్కులు వివిధమార్గముల
సమరులకై సను సలవి గాకుండ । సమరించి తెచ్చెద హస్తిపురీశ!
మఱి విను మొక్కటి మధుసూదనుండు । వఱలు సారథియయ్యె వానికి నట్లు
గాన నసాధ్యుఁడై కదనోర్విఁయందుఁ । బూని వర్తించు; నేర్పునఁ గృష్ణుపాటి
యనఁగ నన్నుతికెక్కు నమ్మద్రనాథు । ఘనత నాసారథిగా నొనరింపు.
మత్తైన గెలిచెద నమరేంద్ర సుతునిఁ । బోట్లాట ఖచరులద్భుతమంది చూడ.
హరికెక్కుడూహింప నమ్మద్రవిభుఁడు । హరుల చిత్త మెఱుంగు; నదిగాక యేను
మేదిని నరుకన్న మిక్కిలి బలిమి । పాడుకొల్పినవాఁడఁ బౌరవాధీశ!
ఈ చనవిమ్ము నాకింతియ చాలు । ఖేచర పతినైన గెలుతు నిక్కముగ.
మనుజులయ్యును పాండుమహీపతిసుతులు । పనుగొనఁగాఁ దృణప్రాయంబు నాకు".
అనవిని యుప్పొంగి "యంగాధిరాజ! । విను మిటులైన నీ వెనుకఁ దేరులును
అమ్ముల బండ్లును హయములఁ దెత్తుఁ । దమ్ములఁగూడి మొత్తమ్ముగా." ననుచు

## దుర్యోధనుఁడు కర్ణునకు సారథ్యంబు సేయుమని శల్యుని వేడుట

బహుతర సంతోష పారవశ్యమున । మహనీయుఁడై పోయి మద్రేశుఁ గాంచి
ప్రణతుఁడై వినయ సంభ్రమములు చెలఁగ । గణుతించి యిట్లనుఁ గౌరవేశ్వరుఁడు:
" సత్యవ్రతంబును [2]శత్రుశిక్షయును । నిత్యంబు నీకును నిత్యప్రతాప!
అదిగాక నామీఁద నధిక తాత్పర్య । మదనుగాఁ గలిగుందు; వదిగాన నిన్ను
విపత్తిమైఁ బ్రార్థించి వేఁడెద నొకటి । మనుపుము నన్ను నామాట గాదనక.
అర్జును ననిఁదెగటార్పంగవలయు । కర్జమూహించి యాకర్ణుని రథము
గడపు; మత్తైన విక్రమలీల నతఁడు । అడరి నీకృపఁ జంపు నఖిలపాండవుల.
గురుఁడును భీష్ముండుఁ గూలినవెనుక । గురుతరంబైన యీ కొంచెపు మూఁక
తోడ జయముగోరి తొడరుచున్నాఁడ; । రూఢి నమ్మితి నిన్ను; రూపింప వసము
నీవేళ నాకిమ్ము; ఈవెపో దిక్కు; । సావధానతఁ గర్ణుసారథి గమ్ము.
వినతాతనూజుని విమలసహాయ । మున విభావసుగతి మునుకొని విమత
నిబిడాంధకారంబు నిక్కంబణంచు । ప్రబలుఁడౌ." ననిన రారాజు నీక్షించి
కనుఁగవయందు నుగ్రంబుగా నగ్ని । మునుకొనఁగా బొమముడిపాటు గదురఁ

1. పొట్లమై. 2. సత్య. (మూ)

గటములుప్పొంగ నుత్కటకోపుఁ డగుచుఁ । ... ... ... ... ...
బ్రలయకాలమునాఁటి ఫాలాక్షుకీతి । వలను మీఱంగ గర్వస్ఫూర్తిఁ బలికె :
"నృప, విను నన్నింత నీచపుఁబనికి । విపరీతగతి నంప నెవ నీకుఁ దగునె ?
ధర్మవిధంబును దప్పెద వేల ? । ధర్మమె కటకటా ! ధరణీవల్లభులు
శూద్రుల కేనాఁటఁ జొప్పడ సేవ । [1]యుద్రిక్తులై చేసి రూహించిచూడ ?
సూతజు రాధేయు క్షోణిలోపలను । ఈతఁడె వీరఁజేసి యిట్లు పల్కెదవు.
కలయ నాకింతటికన్న [2]బన్నంబు । కలదె ? యుద్ధమున నొక్కనిఁ బొలుకొట్టు
మలవడ నెట్టివాఁడైనఁ గానిమ్ము । కలహరంగంబున ఖండింతు వాని.
అట్టిభంగియుఁ జాలదంటేని వినుము । కట్టు[3]తోఁ దరవాయిగొని సంహరింతు
విమతుల ; వినుమేను విక్రమింపంగఁ । గ్రమమొప్ప గా మార్కొనఁగలఁడె యొక్కరుఁడు ?
కులశైలములఁ గూల్తుఁ ; గుంభిని బ్రత్తుఁ ; । జలనిధుల్ గలఁతు ; నక్షత్రముల్ రాల్తు
నదిగాక మిన్నును నవనీతలంబు । వదలక ధరణిపై వాయింతుఁ దాళ
గతిమీఱ ; నాదువిక్రమ మెఱుంగరయె । యతులితంబుగఁ బల్కి తందు కేమాయె !
పొగడొంద రథికవిస్ఫురణంబు దక్కి । మొగిని సహస్రాంశమునకును నాటి
గాని సూతతనూజుఁ గష్టు దురాత్ముఁ । బూని సారథినైన భూజనుల్ నగరె ?
నరకసంహారుని నరునిఁ గైకొనను ; । ధరఁ గర్ణపక్షపాతంబున నన్ను
బెనుపొంద నవమాన పెట్టెదవేని । పొనర మాభూమికిఁ బోయివచ్చెదను."
అనిపల్కి రాజమధ్యంబు తా వెడలి । పోనుపొంద శీఘ్రతఁ బోవఁ జూచినను
భూపతి బహుమానపూర్వంబుగాఁగ । నాపజ్జఁ బ్రణమిల్లి యతివినయమున
నిలువరించి ప్రియంబు నిగుడ నిట్లనియె : । "కలయంగ నీ మహాకలహరంగమున
రమణ నీకధికులౌ రథికులు గలరె ? । క్రమ మొప్ప భూమిభాగమున నెందైన.
తొల్యత [4]శత్రుజాలములకు హృదయ । శల్యంబ వగుటగా శల్యుఁడన్ పేరు
గలిగె నీకును విను కారుణ్యనిలయ ! । బలభేది[5]సూతి కుర్వర రథికత్వ
గుణముల[6]యందు నెక్కుడు భానుజుండు. । గణనకెక్కినయట్టి కలితాశ్వహృదయ
సుజ్ఞానమున మధుసూదనుకంటెఁ । బ్రజ్ఞ మిక్కిలి నీకు భాసురతేజ !
పరికింప నింతటిపని నీకుఁదక్క । నొరుల కశక్య మత్యున్నతస్ఫూర్తి.

---

1. యుద్ర్వక్తులై. 2. జన్నంబు. 3. తొందరవాయ. 4. శ్వేత. 5. సూనుని యుర్వర. 6. కంటె. (మా).

పనివడి నావిన్నపంబు చేకొనుము । ఘనముగా నిలుపుము కౌరవకులము."
అనిన సంతసమంది యమ్మద్రవిభుఁడు : । "నను మురివైరికన్నను నెక్కుడనుచుఁ
గొనకొని రాజన్యకోటి వినంగఁ । గొనియాడితివి గానఁ గురుమహీనాథ!
కడఁకతో ఘనుఁడైన కర్ణుని రథము । నడపెద నొకమాట నా కీయవలయు.
ఈతనితోడ నాయిచ్చ నేమేని । ఘాతమాటలు దోఁపఁగా నాడుచుందు.
పనివడి యెగ్గులు పట్టకుండినను । మునుకొని యెంతయుఁ బొం దొనఁగూడు."
అనుటయు రాధేయు నాతండు చూచి । యనయంబు నియ్యకొమ్మన నీయకొనియె.
అట్టభినందించి యా కురురాజు । నెట్టన శల్యుని నిజచిత్తవృత్తి
యెక్కడ దిరుగునో యనుచు శంకించి(?) । మక్కువదీపింప మఱియు నిట్లనియె :
"అనఘాత్మ, యీపథం బాచరించుటకుఁ । జెనసి నుం తేనియుఁ జింతింపవలదు.
పెనుపొందఁ దొల్లింటి పెద్దలచరిత । మనయంబు వినిపింతు నది నీకుఁ దెలియ.
మలసి మార్కండేయ మౌనిశేఖరుఁడు । చెలఁగి మాతండ్రికిఁ జెప్పంగ వింటి.

## త్రిపురాసుర వృత్తాంతము

తారకుఁ డనియెడు దైత్యుండు సురల । తోరణంబొనరించి తుదిఁ జన్న పిదపఁ
దనరంగ వానినందనులు ప్రతాప । ధనులు విద్యున్మాలి తారకాక్షుండు
కమలాక్షుఁడు ననంగఁ గలుగు రాక్షసులు । కమలాసనునిఁ గూర్చి ఘనతపోనిష్ఠఁ
బరఁగినఁ, బద్మసంభవుఁడు వారలకు । వరుసఁ బ్రసన్నుఁడై వలనొప్పఁ బలికె :
"మీ తపఃప్రౌఢికి మెచ్చితి నిపుడు । ఖ్యాతిగా వరముల నడుగుఁ డిచ్చెదను."
అనిపల్క నపుడు వారందఱు నొక్క । మనసునఁ బలికిరి మహిఁ జాఁగిమ్రొక్కి,
"భారతీనాయక, బ్రహ్మణ్యాగణ్య, । నీరజోద్భవ, నిత్య, నిగమాంతవేద్య,
నలలితవిస్ఫూర్తి సకలభూతముల । వలన నేకాల మవధ్యత్వ మిమ్ము."
అని యడుగుటయు భాషాధీశుఁ డనియె : । "ఎనయంగ నీచంద మెందును గలదె!
గొనకొని యిచ్చుటకును గొనుటకును । అనిశంబు దగినది యడుగుఁ డిచ్చెదను."
అనవుడు వారిట్టులనిరి ధాతకును : । "బొనరంగ మాకు ముప్పురకును మూఁడు
పురము లెల్లసుఖంబు పొందుగాఁ గలిగి । సురగరుడోరగాసుర సిద్ధతతికి
సాధింపరాక నిశ్చలత దీపించి । యీ ధరణీస్థలి నెన్నికకెక్కఁ

[1]గలుగునట్లును గామగమనంబులుంచు । గలిసిల్లునట్లుఁ గావించి యు.” మ్మనినఁ
బద్మజుఁ డిట్లని పలికె వారలకు : । “ ధర్మంబులేక నిత్యులు నుండవలయు;
నెడపక మూఁడు నొక్కెడఁ గూడనేని । చెడు బలియునిచేతఁ; జేరకయున్న
వెస నసాధ్యంబులై వెలయు నెంతయును । వసుమతిలో.” నని వరమిచ్చి పోయె.
అంతట రాక్షసు లత్యంత మహిమ । సంతోషమున నిజస్థానంబు కరిగి
మయు వేడుకొనుటయు, మయుఁ డా పురములు । రయమున నిర్మించె రమణ దీపింప.
వినుమవి కనకంబు వెండియు నినుము । ననయంబునై నాలుగంచులు నూఱు
యోజనంబులు గల్గి యుండు నెంతయును. । రాజిల్లఁ గార్తస్వరమునఁ జేసినది
యెంతయు దివమున, నట వెండిపురము । నంతరిక్షంబున, నవనిపై నినుము
నై సంచరించుచు నత్యంత మహిమ । తో సాహసస్ఫూర్తితో విలసిల్లె.
తారకాక్షున కొక్క తనయుండు పుట్టి । ధీరత హరినామ ధేయుఁడై మించి
యపురూపముగ వారిజాసనుఁ గూర్చి । తపము సేయంగఁ బ్రత్యక్షమై ధాత
‘ వలనొప్ప నీకును వరమిత్తు నడుగు । మలవడ ’ ననిన హస్తాబ్జముల్ మొగిచి,
వరుసతోఁ ద్రిపురంబువార లాయుధము । లరుదారఁగాఁదాఁకి హతులైన, [2]వారి
మీనుఁగుల్ నీటిలోఁ బెట్టంగఁ [3]దడిసి । మానుగా [4]నొకఁడు క్రమ్మఱఁ బదుంద్రగుచు
శౌర్యంబుగలుగఁ బ్రసాదించు [5]బావి । వార్యమోఘంబునై వర్తింప నిమ్ము.”
అనిన నిచ్చితినని యబ్జజుఁ డరుగ । ననఘాత్మ, రాక్షసు లట శంకలేక
యేపుమై లోకంబులెల్ల బాధింప । నా పురందరుఁడు దేవావలిఁ గూడి
పనివడి పురములపై నెత్తిపోయి । పెనుపొంద సుంతయు భేదింపలేక
యెంతయుఁ జింతించి హితులును సురలు । నంతంత రాఁ బోయి యబ్జజుఁ గాంచి
దండప్రణామ మత్తఱిఁ జేసి నిలిచి । దండిగా నా పురదైత్యుల తెఱఁగు
విన్నవించిన ధాత విబుధేంద్రు కనియె : । “ క్రన్నన నా పురత్రయ మేకబాణ
మునఁగాని యణఁగదు; భూతేశు నీశు । మనసిజసంహారు మధువైరివినుతు
గిరికన్యకానాథుఁ గిల్బిషదమనుఁ । బరమేశు శంకరుఁ బ్రార్థింపుఁ.” డనిన
నమర సంఘములెల్ల నట్ల కాకనుచు । నమరంగ దివ్యసహస్రవర్షములు
తలకొన్న నిష్ఠతోఁ దపమాచరించి । యలవడ శుద్ధాత్ములై యీశుకడకు
నరుగఁదలంచి పద్మాసనుఁ దలఁచి । నరవినాతనిఁ బురస్సరుఁజేసి పోయి

---

1. గలవియే. 2. యట్టి – మీనుఁగ. 3. దడవ. 4. నొకటి. 5. మట్టి. 6. క్రమ. (మూ)

పరమ శరణ్యుని భక్తమందారుఁ । బరమాత్ముఁ బరమేశు ఫాలాక్షుఁ గాంచి
తలఁకొని సాష్టాంగ దండ పాతముగ । నలవడ మ్రొక్కిన, నాశంకరుండు
కరుణామృతము చల్లు కడగంటిచూపు । పరఁగించి "లేలెండు బ్రహ్మాదులార!
... ... ... ... ... । ... ... ... ... ...
అనవుడు లేచి హస్తాబ్జముల్ మొగిచి, । కొనకొని యాతనిఁ గొనియాడిరిట్లు :
"ఘన నీలకంఠాయ గంగాధరాయ । వనజాప్త శశధర వహ్నినేత్రాయ
భూతాధినాథాయ భూతాత్మకాయ । చేతోజమథనాయ శేషహారాయ
దక్షయాగహరాయ ధనదమిత్రాయ । రక్షితభక్తాయ రాజజూటాయ
తుభ్యం నమోనమో ధూర్తులఁ జంపి । సభ్యుల రక్షింపు సర్వేశ, యీశ!
త్రిపురవాసులు మదోద్రేకులై జగము । తపియింపఁ జేసిరి దర్పవిస్ఫూర్తి.
శరణు శరణ్య, యో శాంభవీరమణ! । పరఁగ వారలఁ జంపి బ్రదికింపుమమ్ము."
అని పద్మభవముఖ్యులాడు వాక్యములు । విని నవ్వు దళుకొత్త విశ్వేశుఁ డనియె:
"పనివడి వినరయ్య బ్రహ్మాదులార! । యొనయంగ నీపని కియ్యకోఁ జాల.
ధృతి మదీయములైన తేజోబలముల । నతులితంబుగ మీకు నర్ధ మిచ్చెదను.
అది పుచ్చుకొనుచు మీరందఱుఁ గూడి । వదలక చంపుఁడు వైరి వర్గముల."
అనుడు: "మా తేజంబులందులో సగము । వినుతింపఁగా నీవె వేడ్కతోఁ బుచ్చి
కొని వారి శిక్షింపు కుంభినిలోన । నొనరంగ రక్షణీయులము రక్షింపు."
అనుడు సర్వేశ్వరుం: "డసురులు సురలు । ననిచిన ప్రీతితో నాకొక్క సమము.
తగ శివం బఖిల భూతంబులయందు । నగణితంబుగఁ జేయు ననిమిషులార!
శివనామ విఖ్యాతి చెల్లె; నట్లయ్యు, । భువిఁ బాపకర్ముల మూఢుల శఠులఁ
జంపంగవలెఁ గాని చనదూఱకుండ. । పెంపువహించి [1]చెప్పెద వినుఁ డొకటి
ఎనయు లోకంబుల కెల్లఁ బశుత్వ । మును నాకుఁ బశుపతి ముఖ్యత్వ మహిమ
వలయు; నట్లైన భూవలయంబు నందు । నలలిత విస్ఫూర్తిఁ జర్చించి చూడఁ
బశుమాననమునఁ బాపంబు [2]లేకుండు. । వశము సేయుఁడు నాకు వరదివ్యరథము
నూతఁ డశ్వంబులు సునిశితాస్త్రములు । ప్రీతితో." ననవుడుఁ బృథివిఁ బశుత్వ
మునకు శంకించి యిమ్మల విచారింపఁ । దనరంగ నద్దేవతల చంద మెఱిఁగి

---

1. చంపెద. 2. లేకుండ. (మూ),

భయపడ నేటికి? పశుభావ¹ముక్తి । రయమున విడిచింతు రమణఁ బాశుపత
వ్రతనిష్ఠ నెంతయు వర్తింపవలయుఁ । బ్రతి మీఱ ద్వాదశాబ్దము; లటుగాక
వరఁగ నిష్ఠానురూపమున వత్సరము । సరవితో నాఱుమాసములు నెక్కొల్ప
పొసఁగ ద్వాదశదినంబుల మాత్రమైన । వసుమతి ఫలియించు వలనొప్ప." ననిన
వారల్ల కాకని వైభవ లీల । నారూఢి 'పశుపతి' యనిపల్కి యంత
రమణఁ దేజోబలార్థంబు ²లర్పించి । క్రమమొప్పఁగా విశ్వకర్మ కిట్లనియె :
"ఇమ్మహాదేవున కెలమి రథంబు । నెమ్మి సాధనములు నిర్మింపవలయు."
అనిన నాత్వష్టయు నంగీకరించి । తనరంగ ధరణి రథంబు గావించి,
రవిసుధాకరులఁ జక్రములుగాఁ జేర్చి, । యపరశైలంబుగ నాక్షకము మొనర్చి,
విస్తర ³హైమాద్రి వింధ్యనగంబు । నస్తాచలంబును నా యుదయాద్రి
నవయవంబులు చేసి, యగ్నులు మూఁట । ⁴రవణఁ ద్రివేణుక రచన గావించి,
హరులు ⁵వేదంబులు, నాతపత్రంబు । గరిమతో మేరు⁶నగము, శరాసనము
వత్సరంబును, నమ్ము వారిజాక్షుఁడుగ, । నత్సరద్గ్రహాలసద్భోగ్యమమండలము
జోడుగా విరచింపఁ, జూచి శంకరుఁడు । వేడుకగైకొని విభవంబు మెఱసి
'సారథి నిట నాకు నమకూర్పఁ డతుల । ధీరుండు సుజనవిధేయుండు నగుచు
నాకంటె నధికుఁడై నయమొప్పువానిఁ । బ్రాకటలీలమైఁ బ్రార్థించి తెండు.'
అనిన దేవతలెల్ల నంబుజాసనునిఁ । గని మ్రొక్కి "యో దేవ, కరుణావిధేయ,
సారథివై మమ్ము సర్వలోకముల । నారూఢి రక్షింపు." మనినఁ బద్మజుఁడు
నలిమీఱఁ బ్రణవంబున నొనర్చినట్టి । ములుకోలగొని నొగల్ ముదముతో నెక్కి
యశ్వరత్నంబుల నటు పఱపంగ । విశ్వేశ్వరుఁడు కడువేడ్క దీపించి
పురములకడ కేఁగి ⁷బోరన విల్లు । కరమొప్ప సజ్యంబు గావించి మించి
పాశుపతాస్త్ర సంబంధంబుగాఁగఁ । జేసి పురంబులు ⁸స్థిరబుద్ధి నిలుప,
నవి యొక్కచోటికి నప్పుడు గూడి, । శివుఁడేయఁ గాలి పశ్చిమవార్ధిఁ దోఁగె.
కడఁగినయగ్ని లోకములు దహింప । నడురాజశేఖరుఁ డొప్పుగా మాన్చె.
సకలమునీంద్రులు సకలదేవతలు । సకలేశు నీశ్వరు సన్నుతిసేసి
సరవిదీపింప నిజస్థానములకు । నరిగి; రివ్విధమున నప్పరమేష్ఠి

1. యుక్తి. 2. లర్థించి. 3. హేమాద్రి. 4. రవిరింద్రి. 5. వేదములుగా నట శరాసనము. 6. నగంబుగాఁ జేసి. 7. భోరున. 8. స్థిత. (మూ).

మనసిజారాతి కిమ్మహిని సారథ్య । మొనరించెఁ గావున నీవును నట్లు
రమణమైఁ గౌరవరక్షణార్థముగఁ । గమలాస్త్రజనకును గడపుము రథము.
సమ్మతి నిన్ను నెంతయు, రాజ్యపదవి । సమ్మతిగా నాకు సాధించి యిమ్ము.
అదియునుగాక పాయక విను మనఘ! । యిది యొక్క యితిహాస మేనొద్దనుండ
ధర్మవర్తనుఁ డొక్క ధరణిదేవుండు । పేర్మి భూపతికిఁ జెప్పినయది వినుము.
మొగిని భార్గవవంశమునను బ్రసిద్ధుఁ । డగు జమదగ్నికి నత్యంతమహిమ
రాముఁడు పుట్టి సంరంభంబుతోడ । నా మొయిఁ దపము సేయఁగ శంకరుండు
ప్రత్యక్షమై వచ్చి రక్తి నిట్లనియె: । 'అత్యంతమతి వరంబడుగుము: నీవు
అనఘాత్మ, యిచ్చెద' నవవు డుప్పొంగి । చనవొప్ప దివ్యశస్త్రములు లడుగుటయు,
నమ్మహాత్ముఁ 'డశుచియైనవారలను । నెమ్మితో దహియించు; నీ వదిగాన
శుచివి గ' మ్మనుటయుఁ జూచి భార్గవుఁడు: । "ఖచరేంద్రవంద్య, శ్రీకంఠ, భూతేశ,
బలిమి నాకెప్పుడు పాత్రత్వమహిమ । దలకూడు నివి నాకు దయసేయు మభవు.
నీకు శుశ్రూష మన్నించి సేయంగ । నాకుఁ బ్రసాదించునది యింతె చాలు."
ననిన వరంబీయ నా భార్గవుండు । జననుతస్ఫూర్తి నిష్ఠాపరుఁ డగుచు
నొనర నాశివు షోడశోపచారములఁ । [1]దనుపారు బ్రీతి నెంతయు సేవసేయు,
నరవి ననేకవర్షంబులు చనిన । ... ... ... ... ...
సంతోషచిత్తుఁడై సర్వేశ్వరుండు । వింతగా గౌరిదేవికి రాముఁజూపి
"రాముఁ డత్యంత సువ్రతచర్యమీఁతె; । భామరో, నిశ్చలభక్తుఁ డీతండు."
అని ముద్దుసేయంగ, నాసమయమున । దనుజులచేత బాధలఁబొంది సురలు
విశ్వేశుఁ బొడగాంచి విన్నవించినను । శాశ్వతబుద్ధి నా జమదగ్నితనయుఁ
గనుఁగొని, "దుష్టరాక్షసుల మర్దించి । యనిమిషావళికిఁ బ్రియంబాచరింపు."
మనిన ముదంబంది యంజలిచేసి, । "మునుకొని దివ్యాస్త్రములు లేవు నాకు;
సకలాస్త్రవిదుల రాక్షసుల నేరీతిఁ । బ్రకటించి గెలిచెదఁ బార్వతీరమణ!"
అనిన సర్వేశ్వరుం డానతి యిచ్చె: । "తనరంగ వినుమా నాతలఁపు నీదెసకు
నిలిపెద, నిలిపిన నిర్జింపు మరుల. । నెలకొని యంతట నీమనోరథము
తలకొని సిద్ధించుఁ దడయక పొమ్ము । వలదు తామస." మన్న వడిఁబోయి దనుజ
వీరుల వధియించి వెస వారిపోట్ల । ధీరత నొచ్చిన దేహంబుతోడ

1. తను బ్రీతితోడుతదును చేయుచుండ. (మూ)

వచ్చిన, నంత నా ప్రమథాధిపుఁడు శివుఁడు । ప్రత్యక్షుఁడై ప్రీతిమైఁ గరములఁ బడసి
'పోలుపొంద నాయుధంబులు దాఁకవేని । తలయుంగ నోర్తువు; విమతుల గెలువు;
తెలివితోఁ గొను' మని దివ్యశస్త్రముల । నలవడ నిచ్చిన నరిగె భార్గవుఁడు.
అట్టి దివ్యాస్త్రంబు లర్జునకును । నెట్టన గృపచేసె; నెఱి నట్టివారలు
మఱి హీనజాతుల నుర్వింప రెప్పుడు । నెఱిమీఱ; నదిగాన నీరజమిత్త్ర
తనయు నర్జునుగాఁ దలఁచెద నేను. । పనివడి పదనంబు బాహువుల్ మొదయు
వక్షస్స్థలంబును వట్రువతనువు । వీక్షింపఁగా సర్వవిమలాంగములును
మహిమగా దేవకుమారుల కెన్న । సహజ మావిధములు చర్చించి చూడ.
కవచకుండలములు గలవానిఁ బ్రకృతి । ధవళాక్షి గాంచునే తనయునిఁ గాఁగ!
లీల మృగేంద్రంబు లేటి కెన్నుట్టు! । తూలక సూతపుత్త్రుండను కీడు
వలీలఁ బుట్టెనో యింతియుగాక. । చాల భూతేశ [2]శిష్యత్వము దయయుఁ
గల భార్గవునకును గాదిలిశిష్యుఁ । డలవడ రాధేయుఁ; డదిగాన శివుని
కా పద్మసంభవునటుల సారథ్య । మోపిక నొనరింపు మొప్పుగా." ననుచు

## శల్యుఁడు కర్ణునకు సారథ్యము సేయ నియ్యకొనుట

నరవిఁ బ్రార్థించిన నారథ్యమునకుఁ । బరఁగంగ నమ్మద్రపతి సమ్మతించి
యతనిఁ గౌఁగిటఁ జేర్చి, "యధినాథ, వినుము । వితతకర్ణములకు వినఁగఁ జేఁదైన
పలుకులు పలుకుదుఁ బరమహితములు । వలనొప్ప నోర్వంగవలయును నీకు."
అనిన రాధేయుఁ డిట్లను మద్రపతికి : । "మనసిజారికిని బద్మజుఁడు పార్థునకు
హరియునుబోలెఁ బాయక సారథిత్వ । మరయఁగఁ జేసెద వదిగాన గెలుతు."
నని తనసారథి నరదంబు వేగఁ । గొనితెమ్ము నీవన్నఁ గోరి వాఁడేఁగి
యొగి మనోరథముగా నొక్కరథంబు । తగ నాయితము చేసి తదవసరమున
దీవించి;యిచ్చిన, దినకరసుతుఁడు వేవేగ రథము భావించి పూజింప
నెలమితోడుతఁ బురోహితు నియోగించి । తలకొన్న కడఁకతోఁ దదనంతరమునఁ
దాను బూజించి ప్రదక్షిణం బర్థి । మానుగాఁ జేసి నమస్కరింపుచును
బనివడి భాస్కరోపస్థాన మెలమి । నొనరించి శల్యుని నొగి నెక్కుమనినఁ
గృతమతి నాతండు గిరితటంబునకు । నతులితగతి దాఁటు హరియును బోలెఁ

1. భక్తి. 2. శిష్యత్వనిదయును. (మూ).

దేరికి లంఘించి ధృతి నొగలెక్క । నాయూఢి భానుజుం డరదంబు నెక్కె
వందిమాగధులు కైవారంబు సేయఁ । గ్రందుగా బహు యోధగణములు గొలువ
భేరీమృదంగ గంభీర నాదముల । భూరి ఝాంకృతుల నంభోనిధుల్ గలఁగఁ,
జనిచని కర్ణుండు శల్యు కిట్లనియె : । "నొనర భల్లాది మహోగ్ర బాణములఁ
బాండు తనూజుల భగ్నంబుసేతు । నిండి ఖేచరులెల్ల నెమ్మిఁ గీర్తింప."

## శల్యుఁడు కర్ణునిమనసు నొవ్వనాడుట

అనవిని మద్రరాజతని కిట్లనియె : । "ఘను లఖిలాస్త్ర విక్రమ ధురంధరులు
నయమొప్ప సమరాధి [1]నాథునికైన । భయము పుట్టింప నోపఁగఁ గలవారు.
[2]ఏల నీవిక్కడ నీలీలఁ జెలఁగి । తూల నోనాడెదు? దురము లోపలను
నరుని శరంబులు నాటంగ నిలిచి । నరవితోఁ బెనఁగినఁ జాలు వెయ్యేల!"
అనిపల్క వినియును అర్కనందనుఁడు । వినని వాఁడును బోలె వెన నూఱకుండె.
నరవితో నీరీతి నంగరంబునకు । నరుదెంచు కర్ణుని నప్పుడు చూచి
వెఱఁగంది రప్పాండవేయు లందఱును. । కురుబలం బార్చెను; ఘోటకహేషి
తములును గరిబృంహితములును మించె; । రమణమై నావేళ రక్తవర్షంబు
గురిసె; సూర్యుఁడు మాసెఁ; [3]గూసె వఱళ్లు; । వరునతోఁ బిడుగులు వడె; భూమిగదలె;
వఱలంగ సుడిగాలి వడి ధూళిఁ జల్లె. । నఱిముఱి మఱియుఁ బెక్కైన యుత్పాత
చయములు దోఁచిన సరకుగాఁ గొనక । రయమున నమ్మద్రరాజు కిట్లనియె :
"అరదంబు నెక్కి శరాసనం బర్థి । ధరియించి మద్భుజాదర్పంబు పేర్మి
దేవతాధిపునైనఁ దృణముగాఁ జూతు । వావిరిఁ బాండుభూవరసుతు లెంత?
పరఁగ గాంగేయ కుంభజు లంతవారు । పరికింప దురములోపల రిత్తచావు
చత్తురె కటకటా! చంపిన నరుని । నత్తుగా నిదె నేఁడు చంపుదుఁ జూడు.
పాండవాగ్రజుఁడును బావని గవలు । నొండొరు ముదలించి యొక్కటఁ దీవ్ర
శరములఁ దాఁకినఁ జండకాండములఁ । జిరతరంబుగ నేసి చెండివేసెదను."

## శల్యుఁ డర్జును పరాక్రమంబుగ్గడించి కర్ణుని జిన్నఁబుచ్చుట

అనవిని శల్యుఁడిట్లనియెఁ గర్ణునికి : । "వినిన వారెల్లరు వీఁ డవివేకి

1. నాథునికైన. 2. ఏల మాటాడితి వీలీలఁజెలఁగి – తూలిపోనాడెదు. 3. గురిసెవరుళ్లు. (మూ)

యన రజ్జులాడెద; వందున నీకు । గొనకొని యేమైనఁ గూడునె చెప్పుము!
రాసికెక్కఁగఁ బోరి రమణ శౌర్యమునఁ । బాసిన యంగారపర్ణునికంటెఁ,
గురురాజుఁ జెఱవట్టి కొనిపోయినట్టి । వరమూర్తి గంధర్వవల్లభుకంటె,
వడి ఖాండవంబు గావఁగలేక సిగ్గు । వడి చన్న నిర్జరవల్లభుకంటెఁ,
గొలఁది కిరాతుఁడై క్రోధంబునకును । నలిఁ జెనఁగిన భూతనాథునికంటె
నెక్కుడౌ రథికుండు నీ[2]క్రీడితోడఁ । జక్కఁ బోరెదనన్నఁ జనుఁ గాక : వినుము
ఆరూఢి మనబోఁటు లమ్మహామహునిఁ । జేరంగఁ గలరె! యిస్సీయన్న [3]విడవు.
నృపుఁడును భీష్ముండు నీవు గురుండుఁ । గృపుఁడు సౌబలుఁడును గురుతనూభవుఁడు
సకల బలంబులుఁ జనుదేరఁ బోయి । ప్రకటించి విరటుని పశులను బట్టి
దొరలతోఁ బాఱితి; దొరకొని యిప్పుడు । బిరుదులు పలికెదు పెంపగ్గలించి.
నెఱి నాఁటివలెఁగాదు నేఁటి యుద్ధంబు । నెఱవాదివై పోరు నిక్కంబు కర్ణ!"
అనవుడుఁ గోపంబునణఁచి కర్ణుండు । పనివడి యమ్మద్రపతి కిట్టులనియె :
"నరుని సత్త్వంబును నా భుజాబలము । దురమునఁ గనుఁగొని తుదిఁ బ్రశంసింపు;
మందాఁక మాను మీ." వనిన శల్యుండు । నందంద యట్లకా కని తేరుగడప
మన మొనలోఁ జొచ్చి మహిమ దీపించి । యినజుఁ డిట్లని పల్కె నెల్లను వినఁగ :
"వినుఁ డెవ్వరైనను వీఁడె కిరీటి । యని చూపినను నిత్తు నఖిలవస్తువులు;
కృతమతి నిద్దఱు గృష్ణులఁ జంపి । తతభంగిమై నారిధనము లక్షములు
గ్రామంబు లిత్తును; గజముల నిత్తుఁ; । దామరసాక్షులఁ దగనిత్తు నిజము."
అనిన మద్రేశ్వరుఁ "డట్ల సేసెదను । సునిశిత విస్ఫూర్తిఁ జూపెదఁ గ్రీడి;
నెవ్వరు చూపంగనేల యర్జునుని । నెవ్విధినైనను నీవె చూచెదవు.
రిత్తవారికి మదోద్రేకంబు తోఁడ । నుత్తమార్థంబుల నూఱ కిచ్చినను
నవ్వరె జనులు! ధనంబు గల్గినను । గ్రొవ్వునఁ బాఱ గ్రక్కున నైవఁ దగునె!
తలకొని సత్పాత్రదాన మీరాదె! । గెలిచెద నిద్దఱఁ గృష్ణుల ననుచుఁ
బలికితి; విల మృగపతి నెందునైనఁ । జలమున గెలువంగఁ జాలునె నక్క?
దంతావళంబుతోఁ దలపడి శశము । మంతనంబునఁ బోర మార్కొనఁ గలదె?"
యనవుడుఁ గెంపారు నక్షుల మద్ర । మనుజేశుఁ జూచి క్రమ్మఱ నిట్టులనియె :
"వలను మీఱఁగ గుణవంతుల గుణము । కొలఁది లేనట్టి దుర్గుణుఁ డేమి యెఱుఁగు?

---

1. యని రజ్జులాడఁగ నందున. 2. క్రీతి. 3. విడువు. (మూ)

గుణమిందుఁ గలదు దుర్గుణమందుఁ గలదు । గణుతింప నని నీవు కానంగ వలదె!
యమరేంద్ర [1]జునకు నా కగు నంతరంబు । క్రమమును నీ వెఱుంగవు విను తెలిపెద.
కడుఁ బెద్దకాలంబు గంధపుష్పములఁ । గడఁకతోఁ బూజింపఁగా సర్వశరము
నిష్పాలఁ గ్రక్కెడు, నెఱి దీన నొకనిఁ, । దప్పక భార్గవాస్త్రంబున నొకనిఁ
బరిమార్చివుచ్చెద బాహువిస్ఫూర్తి. । గరుడ ధ్వజంబును గపికేతనంబు
గాండీవధనువు చక్రము [2]నిరీక్షింప । బెండు మానుసులకు భీషణంబగును;
పరికింపఁగా నాకుఁ బరితోషణంబు. । హరిసహస్రంబు నా యర్జునకోటి
మఱి పన్ని వచ్చిన మర్దింతు వారి. । వెఱవకు వెఱవకు వెఱపేల నీకు?
వినుతింప యుద్ధకోవిదుఁడవు గావు । నెనసి భయంబున నిట్లు ప్రేలెదవు.

### కర్ణుఁడు శల్యునిపైఁ గోపించి యతని దురాచారము లుగ్గడించుట

పనివడి యెంతయుఁ బాపదేశమున । జనితుండవగు నీకు సద్బుద్ధి గలదె!
క్షత్రియాధమ, నీచ, [3]కలదొకమాట । ధాత్రిలోఁ గుటిలుండు ధర్మహీనుండు
దుష్ట[4]చిత్తుఁ డసంగతుండు నిష్ఠురుఁడు, । కష్టుండు దుర్మతి కార్యహీనుండు
నతిలోభి మద్రకుండన నింతపట్టు । ధృతిమీఱఁ జూడంగ దృష్టాంతమయ్యె.
భువి వారిలో నెల్ల పురుషులు సతులుఁ । గవియుట వెగ్గలుగాక వర్తింత్రు.
కల్లు మున్నును వెనుకను జన్నుఁబాలు । నెల్లగానైకాదె యెసఁగుచుండుదురు.
పలువురకును బుట్టి బహుభాషణములఁ । గలుద్రావి పెరిగిన గర్వులు గారె!
గదచేత శిరము వ్రక్కలుగాక యుఱక । పద." మన్న నమ్మద్రపతి యిట్టులనియె:
"కౌరవనాథుని కార్యార్థి నగుచు । వీరత్వసంపద వెలసిన నాకు
హితబుద్ధి చెప్పక యెట్లుండవచ్చు? । తత భంగి సారథి దక్షుఁడై రథిక
సాధ్యము సూతుని సారథ్యమహిమ । విధ్యుక్తమార్గంబు వెస శుభాశుభము
మదిఁగని చెప్పక మానంగఁదగునె! । పదపడి యేను జెప్పక మాన వినుము.
ఏనేమి చేసినా నిటు తలవగులఁ । బూని మొత్తెదనంటి పుణ్యవిదూర!
[5]శేవ నీవట్టులంటివి గదా యనుచు । నేవిధంబున మాన హితవు చెప్పెదను.
స్రుక్కక 'నిజము నిష్ఠూరంబుఁ' గాదె! । మక్కువ దీపింప మహిజనులకును.

---

1. సూనుని యంత రాంతరము. 2. సు రక్షింప. 3. కలుగునె చూడ. 4. చిత్తుల. 5. దేవ. (మూ)

## హంస కాకోపాఖ్యానము

ఉరవడి జగతిలో నొక్కదీవియందు । వరబుద్ధితో ధర్మ[1]వర్తినాఁ బరఁగు
వసుధేశపురమున వైశ్యవర్ణుండు । రసికుఁడు నయశాలి రాజపూజితుఁడు
కలితాధ్వరాది సత్కర్మ [2]పరుండు । కులపావనుఁడు సద్గుణగరిష్ఠుండు
ధన ధాన్య పుత్త్ర పౌత్త్రక వర్ధనుండు । ధనదాన ధనదుండు తపన తేజుండు
సప్తసంతాన ప్రశస్తుండు నగుచు । దీప్త వైఖరిఁ బ్రవర్తింపుచు నుండు.
వరమతి నొకకాకి వానిల్లుచేరి । [3]కెరలి వానింట నెంగిలిదిని పెరిగి
[4]పులికండ వెట్టి యుబ్బునఁ బెంపుమీఱి । కొలఁదిగా నెల్లపక్షులను గైకొనక
యది హీనజంతువె యగుటను జేసి । మదమున నుప్పొంగి మార్మలయుచును
దను విచారింపక తను జూచుకొనక । యనిశంబు వర్తింప నట నొక్కనాఁడు
నన్నుత తార్క్ష్యుని సరియనఁ బరఁగు । కొన్ని హంసంబులు గొనకొని జలధి
చేరువఁ జనఁ గని చెలఁగి యావైశ్య । ధీరునితనయు లెంతేఁ గాకిఁ జూచి,
" లోలతఁ బక్షులలోన నీవెక్కు । డోలి నీయంచల నుడువీధి గతుల
గెలువంగఁ గలవె మిక్కలి ప్రతాపించి । వెలయ మేమెంతయు వీక్షింపుచుండ. "
నని పల్క దర్పించి యవ్వాయసంబు । ఘనముగా నంచలకడకుఁ దానరిగి
యెనయంగ నిందు మేలెద్దియొ యనుచుఁ । దనదు చూపులకు [5]నెంతయును మేలైన
కలహంసఁ గనుఁగొని, " గ్రక్కున మనము । వెలయంగఁ బఱతము వినువీధి రమ్మ. "
అని పల్క, నయ్యంచలన్నియు నవ్వి । చనవొప్ప నవ్వాయసంబు కిట్లనియె :
" మానససరసిఁ బ్రేమంబున మేము । పూని వసింతుము భువనంబు [6]లెఱుఁగ
హీన జవము పక్షులెల్లఁ గీర్తింపఁ । గా నెంతదవ్వైనఁ గడఁగి పాఱుదుము.
అలయి కేమియు లేదు హంసలమగుట ; । పిలిచితి విందులో [7]బిరుదైన దాని.
తుది రాజహంసంబుతోఁ బురుడించి । కదలక వర్తించు కాకులు గలవె!"
అనుటయుఁ గాక మిట్లనియె వెండియును : । " ఒనరంగ గతులు నూటొక్కటి గలవు ;
ఒకట నొక్కట శతయోజనవ్యాప్తిఁ । బ్రకటించి పొడవుగాఁ బరవంగ నేర్తు.
చనగ నచ్చటినుండి చక్క నేలకును । ఘనత మీఱఁగ డిగ్గఁగా నేర్తు ; మఱియు
వరుస దూరాపాత వక్రయానములు । పరువడి సంగతి భ్రమణ మాదిగను

1. వర్తన. 2. కర్మండు. 3. కదలి దా. 4. పులిగండ. 5. నెంతే మేలిమైన. 6. ఎఱుఁగ + అహీన. 7. బిరుదేదియనుచు. (మూ)

బెక్కులెఱుంగుము; బిరుదైన యంచ । మక్కువఁ గల్గినే మఱిగెల్తుదాని."
ననిపల్క నాయంచ యరనవ్వు నవ్వి । ఘనుఁడు గావున దాని కడిఁదికి రోసి
మనికిఁ దలఁకక క్రమ్మఱ దానిఁజూచి । గొనకొని పలికె: "నీ క్షోణిలో నీవు
కరమొప్పఁగా నూఱుగతులఁ బాఱెదవు; । అరుదెంతుఁగాని నే నారీతు లెఱుఁగ;
ప్రతి మీఱఁగా నెల్లపక్షులుఁ బాఱు । గతులఁ బాఱుదును జక్కఁగ నిడుపుగను."
అని పల్క నదియును నంగీకరించి । చనఁగ నచ్చటివాయసంబు లీక్షించి
'నూఱు విధంబుల నుతగతి మెఱసి । పాఱెను దీనితోఁ బ్రతియె యీయంచ'
యని హసింపఁగఁ, గాకి హంసయు నెగసి । వినువీథిఁ బోవంగ, వేడ్కతో నంతఁ
బక్షులలోపలఁ బరఁగఁ జండాల । పక్షి కాకియెగానఁ బగువు వెట్టుచును
బాఱుచు మీఱుచు బలిమి చూపుచును । దాఱుచు 'నిదియేమి తగిలి రా' వనుచుఁ
గొంతదవ్వేఁగి గుదిగొని కాళ్లు । వింతగాఁ దొట్రిలి వెలవెలఁ బాఱి
తటతట ఱెక్కలు దాటించుకొనుచు । నటు నిటు చూచుచు నంగలార్చుచును
ఆకాక మటుగావు మటఁగావు మనుచు । జోకతోఁ గనుదృష్టి సుడివడఁ జెదరి
తెకతెక తననోరు తెఱచి యుండఁగను । నకనకమని చాలనలఁగి డస్సినను,
గలహంస క్షిప్రంబుగాఁ బాఱుటయును । దలఁపులోఁ గాక మత్తఱి వితర్కించె:
"నేరక తొడరితి నేదీనితోడ; । భూరుహము[1]లు లతల్ పొద లెవ్వి లేవు
వారిధిలోఁ జావవలసె దైవంబ! । వారక కావ నెవ్వరు దిక్కుగలరు?"
అని యని దిగుచున్న యవ్వాయసంబుఁ । గనుఁగొని యప్పు డక్కలహంస యనియె:
"ఘనమైన నీ వనేక గతుల నేర్తు । వెనయ నేగతి యిది? యిట చెప్పు." మనిన
వెగడొంది ఱెక్కలు విటతాటమగుచు । నెగయంగ లేకది యిట్లని పలికె:
"కోమటియెంగిల్లు గుడిచి గర్వమున । నీ మహిలో నాకు నెదురులే దనుచుఁ
దలఁతు; నాకొలఁది యెంతయు నెఱిఁగితిని. । తలకొన్న కరుణ నార్తశరణ్య, [2]నాకు
గరుణామృతము చల్లు కడకంటిచూపు । పరఁగించి కృపసేయు ప్రాణదానంబు."
అని నీటమునిఁగెడు నా కాకిఁ జూచి । తనచరణంబులఁ [3]దగ నిఱికించి
చావు తప్పించి యచ్చటి పక్షులెల్ల । వేవేగ వినుతింప విడిచె భూస్థలిని.
అటుగానఁ బలుగాకి యాకాకి యంచ । నెటువలెఁ జెనకిన నీడౌనె చెపుమ?
సూతసంభవుఁడవు చూడంగ మొదలఁ; । బాతకి, నీతోడ భాషింపరాదు.

1. అల్లతలు. 2. నన్ను. 3. దప్పకయిరికి. (మూ)

కౌరవపోషణఁ గాయంబు పెంచి । కేని దంచకుము నాకికి నెంతకెంత!
ఈవెంత పెనఁగిన నింద్రసూనునకుఁ । గావరంబున నీవు గావు తొలంగు.”
మనిన రాధేయుఁ డుగ్రాకారుఁ డగుచుఁ । గనుఁగవఁ గెంపారఁగా శల్యుఁ బలికె:
“ఇది యేమినాలుకా నీవు పలికితివి? । పిదప నన్ గాకిగాఁ జేసి యర్జునుని
హంసగాఁ బోలిచి మాటాడెద విప్పుడు ; । హింసగోరెదవు నాకీవు చాల్చాలు.
కమలనాభుని యేపు గాండీవిబలిమి । క్రమ మొప్ప నేనెఱుంగనె! వాడిఁబట్టి
సంగరస్థలములోఁ జంపినై చెకను । అంగద; నెడమాట లాడకు నీవు.

తనకుఁ గలిగిన శాపంబులు కర్ణుఁడు శల్యున కెఱిఁగించుట

తలఁచిన మనసు సంతాపంబు సేయుఁ । గలిగిన భృగురాము గలుషంబు, విప్రు
శాపంబుఁ గాక యే సరకు సేయుదునె । యేపుమీఱఁగ మఱి యెవ్వరికైన!
చెప్పెద నది బాణశిక్షార్థినగుచుఁ । దప్పక యా[1]మహేంద్రనగంబు గదిసి
రాముఁ బొడఁగని రమణ సేవింప । నామహాత్ముఁడు కులమడుగంగ నేను
బొలుపొంద బ్రహ్మాస్త్రమునకుఁగా బొంకి । యలవడ బ్రాహ్మణుండని వినిపింప
సంతోషచిత్తుఁడై సకలశస్త్రములు । నెంతయుఁ గృపచేసి యేపుదీపించి
బ్రాహ్మఁడె యౌనని భార్గవాస్త్రంబు । బ్రహ్మాస్త్రమును నిచ్చి భక్తి రెట్టింప
‘బవరంబులోన నాపత్సమయమున । నవికళంబుగ నేయు’ మని నియోగించె.
ఒకనాఁడు ప్రీతి నా యూరువుమీఁదఁ । బ్రకటించి నిద్రవోవఁగ నొక్కపురుగు
తొడక్రింద శీఘ్రతఁ దొలువఁగ నేను । అదరి నిద్రాభంగ మయ్యెడు ననుచుఁ
గదలకుండితి ధైర్యగరిమ వాటించి. । తదనంతరంబ యత్తపసి మేల్కాంచి
నెత్తురు వొడగని నెనరు దట్టించి । చిత్తంబునందు వీక్షించి ‘నీవెవరు?
ధరణిదేవున కింత ధైర్యంబు గలదె! । పరికింప నాకుఁ దప్పక చెప్పు.’ మనిన
భయపడి ‘సూతసంభవుఁడ నే’ ననుచు । రయమునఁ జెప్పిన, రాముండు నలిగి :
“యరయంగ విప్రుండనని కపటమునఁ । బరఁగ బ్రహ్మాస్త్రంబు వడసితి గాన
వలనొప్పఁగా నీకు వలయుకాలమున । నొలయకయుండు ; మృత్యువు చేరువైన
నలవడఁదోఁచుఁ బొ.” మ్మని శపియించె. । వెలయ బ్రాహ్మణశాపవిధమును వినుము.
శ్రవమునకై యేను సరవి నొక్కెడను । వివిధాంబకమ్ములు వెననేయుచోట

1. మహీంద్రనగదిసి. (మూ).

నొక్క బ్రాహ్మణు వత్స మొగి నేగుదెంచి । తక్కక నయ్యంపతాఁకునఁ గూలె.
కూలిన విప్రుండు కోపించి చూచి । "ఈ[1]లాగు వత్సంబు నెట్లు బాణమునఁ
జంపితి [2]వాలాగు సమరంబులోనఁ । బెంపేది చావుము; పృథివి నీరథము
కదనంబులోఁ గ్రుంగఁగలదు నిక్కువము. । అదియునుగాక యీయవనిలోపలను
గోరి యెవ్వానికు మారొక్కని గెల్వఁదలఁచి । సారెకు నీరీతి శ్రమము చేసెదవు
తనర నవ్వీరుచేతనె చత్తుగాక." । యనుటయు భీతిచే నతనికి మ్రొక్కి,
'పదివేలు గోవుల భద్రదేహ శతుల । విదితంబుగాఁగ వేవేలురత్నముల
నిచ్చెదఁ జేకొని యీవేళ నన్ను । మచ్చిక రక్షింపువరా.' యని పలుకఁ
'బాలుపొంద నాపల్కు బొంకౌట గలదె! । యెలమి దీపింపంగ నీకిల్బిషంబు
పరలోకమున నిన్ను బాధింపకుండ । నరయఁ బ్రాయశ్చిత్తమయ్యెఁ బో.' మ్మనిన
వచ్చితి నదిగాన వారిశాపముల । కచ్చుగా నెఱతు నత్యంబు నల్కితిని.
తుదిని బ్రహ్మాస్త్రంబు తోఁచుచున్నదియు; । వదలక గెలిచెద వాసవునైన;
అరదంబు వోనిమ్ము; హరిహయ తనయు । దురములోపలఁ గడుద్రుంతు నిక్కువము.
శరతరంగంబుల శత్రుల ముంచు । హరిపుత్త్ర జలధికి నట వేల నగుదు;
దుర్జయ రశ్ముల ఘోరార్తులఁ బొదవు । నర్జునాదిత్యున కభ్రంబ నగుదు;
ఘనబాణశిఖి నరిగణ మేర్చు విజయు । వనధనంజయునకు వర్షంబు నగుదు;
బంధుర విమతులఁ బగిఁ గూల్చు పార్థ । గంధవాహామునకు గ్రావంబ నగుదు."
అని పౌరుషములాడ నమ్మద్రవిభుఁడు । విని మొగంబునఁ జాల వేడుక పొంది
మహి జామదగ్న్య బ్రాహ్మణుల శాపంబు । బహువిధంబులఁ జెప్పెఁ బార్థివుల్ వినఁగ
సారిదిఁ గౌంతేయాగ్రజునకు నాయిచ్చు । వరము ఫలించెఁ బావనవృత్తి ననుచు
మనమున హర్షించి మఱియు నిట్లనియె: । "విను కర్ణ, కర్ణులు వేవురయ్యెనను
గృతమతి నర్జును గెలువఁ జాలుదురె! । క్షితిలోన." యనుటయుఁ జెలఁగి కర్ణుండు
అతనిఁ గనుంగొని యర్థి నిట్లనియె: । "ధృతరాష్ట్ర సన్నిధి ద్విజుల సద్గోష్ఠి
నరయంగ సకల దేశాచార విదుఁడు । ధరణిదేవుఁడు చెప్పెఁ దద్దయు వింటె
ధీరులై బాహ్లీక దేశంబు వార । లాహార్థి గోమాంసమది నంజు కొనుచుఁ
గల్లుద్రావి [3]మత్తులై కడఁగి వర్తింతు । రలవడ ననిచెప్పె నట్టి బాహ్లీకుల
కేలికవై తివి యెలమి దీపింప । నోలి నెంతయు వార లొనరించు నట్టి

1, 2. లోన. 3. మగ్నులై. (మూ).

పాపపుణ్యముల లోపలను పచ్చాక । మోపకమైఁ జెందఁ బోగ నిన్ను నిజము.
ఇదిగాక మఱియు బాహ్లీకులకంటెఁ । మది మద్రదేశజాతులు పాపకర్ము
లని చెప్పఁదుకు పెద్దలవి యేమిచెప్ప! । ఎనయంగ నిక మెల్ల నెఱిఁగి కోపంబు
మానియుండుము." నన మద్రేశ్వరుండును । మానక నవ్వుచు మఱల నిట్లనియె :
"పాలుపొందక నీయుతు రాష్ట్రుల బంధువరులఁ । దోలఁగంగ నెలకమ్ముదురు తమ సతులఁ
దెగడంగ నయ్యంగదేశ సంజనితు । లగువారి విభుఁడ వీవటునలెఁ గాదె!
పరదోషములు చెప్పఁ బనువు వెట్టుదురు; । తొరఁగిన యాత్మీయ దోషంబు మదిని
బరికింప రథములు ప్రజ్ఞ చూపుదురు. । సరవిమై సకల దేశంబుల యందు
సన్మార్గవర్తులు జనులును గలరు. । సన్మతి వారలు నలిపెడు విధము
దైవమెఱుంగును; నిగ నెవ్వరికిని । భావించి యెఱుఁగఁ జొప్పడదు నిక్కమము."
అని వివదింపంగ నా కురురాజు । విని వచ్చి యిద్దఱ వేగ వారించె.
అంత రథముఁ దోలుమనిన శల్యుండు । నెంతయు నవ్వుచు నిట్లని పలికె:

## అపుడు తోఁచిన యుత్పాతములను శల్యుఁడు కర్ణునకుఁ జూపి చెప్పుట

"కృష్ణసారథియైన కృష్ణునితోడ । నుష్ణించి పెనఁగంగ నోపితివేని
నీవు మాకెల్లను నృపుఁడవు నిజము; । ఆవల దుర్నిమిత్తము లవి చూడు.
గ్రద్దలు పైనాడెఁ గాకులు కూసె; । గద్దరిమై సుడిగాలి యేతెంచె;
కొలఁదిగాక వఱల్లు కూయంగఁ దొడఁగెఁ; । దలకొని ఘోరయుద్ధంబు గాఁగలదు.
అల్లదె చూచితే యర్జునుపడగ! । కల్లగా దెంతయుఁ గాన నమ్మొడిలి.
దురము త్రిగర్తులతోఁ జేసి వారి । శరములఁ దూలించెఁ జక్కఁగాఁజూడు."
అనినఁ గర్ణుండిట్టులనియె నాతనికి: । "ఘనమైన సంశప్తక బలంబు చేతఁ
బరఁగంగఁ బాదువంగఁ బడిన ఫల్గునుఁడు । గరిమ బలాహకాక్రాంత మైనట్టి
వనజాప్తు కైవడి వాఁడిమి [1]లేక । తనరంగ నున్నాఁడు తప్పక చూడు."
అనుటయు శల్యుఁ డిట్లనియె వెండియును: । "విను మెంత చెప్పిన వినవేమివీవు;
నెలకొని వరుణుండు నీళ్లచేఁ జెడునె! । జ్వలనుఁ డింధనముల వైఖరిఁ జెడునె!
దేవతలకునైన దేవేంద్రసుతుని । వావిరి గెలువంగ వశమె చర్చింప?
యమసూతి కడిమియు ననిలజు పేర్మి । సరవిమై విజయానుజన్ముల సొంపు

1. గలక. (మూ)

సురవడి ద్రౌపదేయుల భుజాబలము । కనుఁగొన వార లఖండవిక్రములు ;
చనవొప్ప ధర్మ మెచ్చుట నండె నచట । జయమాట తప్పను సందియమేల ?
రయమొప్ప." ననిన రారాజు తాననియె : । "పాండుసూనులఁ బట్టి బవరంబులోన
ఖండింప రాజ్యభోగంబులు గలవు ; । వలనొప్ప నదిగాక వారలచేతఁ
బొలిసిన నాకంబు పొగడొందఁ గలదు." । ... ... ... ... ...
అని పల్క విని వారలందఱు నుబ్బి । పనివడి శౌర్యప్రభాస్ఫూర్తి మెఱయఁ
దలకొని సింహనాదములు సేయఁగను । జెలఁగి యశ్వత్థామ చేరియిట్లనియె :
"ఆయుధరహితుని నతుల పుణ్యాత్ము । సాయకాచార్యుని జంపిన దుష్ట
జీవి ధృష్టద్యుమ్నుఁ జెండాడి కాని । మేలిమి గలుగు నా మెయిమరు వూడ్వ.
వాయుసంభవుఁడు కవ్వడియును నతనిఁ । బాయక కావంగఁ బనిపూని రేని
బాణాగ్నిశిఖలచే భస్మీకరింతుఁ । ద్రాణమై నిలువంగఁ దరమె వారలకు !"
అనవిని సంతోషమంది నీ బలము । ఘనముగా మార్కొన్నఁ గదనంబు చెల్లె.
జన సంక్షయము పెల్లు చర్చింప నరుదు । అనిమిషులకునైన నక్కదనమున.
వలనొప్ప వీరుల [2]వరియించుటకును । అలవడఁ జనుదెంచు నప్సరోగణము
గంధపుష్పాదుల ఘన సౌరభంబు । బంధురంబుగఁ జేసెఁ బవనుఁడెల్లెడల.
ఆసమయంబున ననిలజుతోడఁ । జేసె యుద్ధము కురుక్షితిపతి కడఁగి.
రాధాతనూజు[3]తో రమణ ధర్మజుఁడు । యోధులు మెచ్చంగ యుద్ధంబు చేసె.
మన సైనికులు చూచి "మఱి ధర్మజునకు । ననికి సహాయుఁడై యరుదెంచుఁ గ్రీడి ;
యరుగుదెంచినఁ గర్ణుఁ డవలీలఁ ద్రుంచు ; । కురురాజు వేడ్కతో క్షోణి పాలించు ;
ఈతఱి మనమెల్ల నీయస్త్రమహిమ । చూతమేర్పడ." నని చూడంగ నంత
రవిజుండు పాండవాగ్రజు భుజాబలము । తొవకి భంజింపుచుఁ దూలపోఁ బలికి
యాతని కడ్డమై యరుదెంచు భటులఁ । జేతుల తీఁటవోఁ జెండాడివైచె."
ననవిని ధృతరాష్ట్రుఁ డా సూతపుత్రుఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
"కడఁకతోఁ గర్ణుఁడేగతి మొననిలిపె ? । పుడమిపైఁ గొంతేయపుత్త్రు లేరీతి
నిలిచిరి సన్నాహ నికరంబుతోడ ? । బలభేది సూనుఁ డెప్పాట వర్తించె ?
తలకొని యాతఁడు తమ యన్నకడనె । నిలిచినఁ గర్ణుండు నెఱిఁ జేరఁగలఁడె ?
అమరాధిపతియగు నంతటివాఁడు । అమరులు గొలువంగ నటఁ బన్నివచ్చి

1. పరువడి. 2. వధియించు. 3. తోడ గుణి. (మూ)

అనిచెప్పి చూపి సాయకయుద్ధవిధము । వినుమని యెంతయు వివరింపఁ దొడఁగె.
భానునందనుఁ డట్లు పౌరుషస్ఫూర్తి । పూని యుద్ధంబునఁ బుడమిఁ బెక్కండ్రఁ
జంపి ధర్మతనూజుఁ జక్కఁగాఁ జూచి । సొంపార నడచిన, సొరిది శ్వేతుండు
అడ్డపడంగఁ, బాయక ప్రభద్రకులు । దొడ్డనారాచముల్ దొరిగియేసినను
అవియెల్ల ఖండించి యర్కనందనుఁడు । తివిరి [1]యందఱఁ గూల్చె దివిజులు పొగడ.

## కర్ణుఁడు పాంచాలకుమారులఁ జంపుట

అదిగని పాంచాలు రథికకోపమున । మదమెత్తి యేతేర మఱియును గర్ణుఁ
డెనయ నయ్యిరువదియేడ్వురఁ బట్టి । దునిమెఁ గ్రోధంబునఁ దూపులఁ బెలుచఁ.
బాఱక వెండియు భానుదేవుండుఁ । జేరి సేనాబిందు చిత్రసేనులును
నుతగతి శూరసేనుఁడు తపనుండు । ప్రతిగాఁగ నేసినఁ బట్టి వేచంపె.
అంతఁ గర్ణుని సుతుఁడగు వృషసేనుఁ । డెంతయు సాత్యకి నెదిరినఁ జూచి
వాఁడిమార్గణములు వడినేయుటయును । బోఁడిమి నవియెల్ల [2]వారసఁ దునిమి
సారథిమూఁట నశ్వంబుల రెంట । వారక ధనువును వరుసమై నొకట
వక్షంబు మూఁటను ధ్వజము నాల్గింట । నాక్షణంబున నేయ, నటవ్రాలి, తెలిసి
పలకయుఁ గరవాలుఁ బట్టి యేతేర । నలవడ సాత్యకి యవియు ఖండింపఁ,
దొలఁగక కనుఁగొని దుశ్శాసనుండు । మెలుపుమైఁ దన తేరిమీఁదికి నతనిఁ
[3]దివిచి తోలంగిన ధీరుఁడై వాఁడు । [4]నవియక వేఱొక్క యరదంబునెక్కి
తమతండ్రి వెనుక నెంతయును వర్తింపఁ, । గమలమిత్రజుఁడును గడఁగి శైనేయు
సూతాశ్వచాపముల్ చూర్ణంబుచేసి । యాతని నురమొక్క యమ్ము నాటింప
సత్యకసుతుఁ డొక్క స్యందనంబెక్కి । యత్యంతగతి వచ్చె నాలంబు సేయ.
అంత రాధేయుండు యమసూతిమీఁద । నెంతయుఁ బోవంగ, నెడసొచ్చి [5]చేది
బలములు పోరాడ, భానునందనుఁడు । కలఁగక మున్నూఱు ఘనయోధవరులఁ
దనచేతితీఁటవో ధరణిపైఁ గూల్చి, । యనిలవేగంబున నరుదేరఁ జూచి
యొనరంగ సాత్యకియును శిఖండియును । గొనకొని యేతేరఁ, గురురాజుబలము
పోనీక యడ్డమై భూరిబాణముల । వాన ముంచినఁ బోరు వడి ఘోరమయ్యె.

1. యుద్ధార. 2 భోరున. 3. తిగిచి. 4. నలగక. 5. చేరి. (మూ)

## కర్ణుఁడు ధర్మజుతోఁ బోరి నొవ్వఁజేయుట

అప్పుడు ధర్మజుమీఁద నర్కనందనుఁడు ప్రబలాస్త్రతతులేయ, వేగ ఖండింప,
[1]నవ్వుచు విల్లును నడిమికిఁ ద్రుంచి । యుర్వీధి మైమఱచినట్లు ఛేదింప,
[2]ధన్యమై రత్నప్రభా దీప్తమగుచు । నవ్యమై మిగుల నున్నతమైన జోడు
సౌదామినీచాప జలదంబు సూర్య । కాదట నష్టమై యనిలాహతమునఁ
బాయుసప్టుల పోలెఁ బడుటయు, మణిగ । ణాయుతాభరణ మోహనమైన యతని
తనువప్పు డాసూతతనయునిచేత । ఘనరక్తమయమునై గాన్పింప నంత,
రాజధర్ముఁ బూని రమణమై ధర్మ । రాజు చలింపఁగఁ బ్రాభవస్ఫూర్తి
నొకశక్తి నైచిన, నదిక కర్ణుండు । ప్రకటించి సప్తశరంబులఁ దునిమె.
అంతటఁ బోవక యమతనూభవుఁడు । పంతంబుతోఁ గర్ణ ఫాలభాగంబు
మొగి నాల్గుతోమరంబుల నెత్తురులఁ । దగనేసి యార్చినఁ, దరణిసూనుండు
సూతునిఁ గేతువుఁ జూర్ణంబుచేసి । శాతసాయకములఁ జలియింప నేయ
నెడసొచ్చి సాత్యకి యట శిఖండియును (?) । గడు వాఁడి బాణముల్ గాడ నేసినను,
వెఱవక వారల విరథులఁ జేసి । పఱియలుగా విండ్లు భగ్నముల్ చేసి
వెగడు పుట్టించి యాపృథివీశు మేన । నగి యొక్కకొట్టు బాణంబు లేసినను,
నిలువంగ లేక యానృపచక్రవర్తి । తలకొని తన తేరు తాఁ దోలుకొనుచుఁ
బాఱినఁ, బోనీక భానునందనుఁడు । అరయ నిలునిలు మనుచు నిట్లనియె:
"క్షత్రియకులమున జనియించి నీవు । ధాత్రిలోపలఁ బెద్ద ధర్మంబు నెఱిఁగి;
తట్టి నీకిట్టి మహాహవంబునను । దట్టించి ప్రాణముల్ దాఁచుకోఁ దగునె!
నీకేటి శౌర్యంబు! నీకేటి బ్రతుకు! । నీకేటి రాజ్యంబు! నీకేటి కీర్తి!
విను బ్రాహ్మణాచార వేదివి నీవు । ననిచి యోగాధ్యయనముల వర్తింపు;
వలనొప్పఁ గయ్యంబు వలవదు మాను; । తొలఁగక ననుబోఁటిఁ దొడరినఁ జాల
నెడరు వాటిల్లుఁ బొమ్మింటికి వేగ; । కడఁకమై బీభత్సు కడకైనఁ బొమ్మ;
వెఱవకు వెఱవకు వెఱపేల నీకు! । పఱియలై యని కోడిపాఱినవారిఁ
గర్ణుండు చంపునే! కారుణ్యజలధి । స్వర్ణదాన వినోది సత్యసంధుండు."
అనిపల్కి జనని వాక్యంబులు దలఁచి । జననాథ, ధర్మజుఁ జంపక విడిచె.

---

1. నవ్వుడు. 2. ఛేద్యమై. 3. రత్న. (మూ).

**అని సంజయుఁడు** చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయ క్షితిపతికిఁ
**జెప్పినగతి** జెప్పఁ, జెలఁగి యామీఁద । నెప్పాటఁ గథచెప్పె నెఱిఁగింపు మనినఁ
**బంకజాక్ష,** రమేశ, బ్రహ్మణ్యదేవ, । శంకరాది సురేంద్ర సంస్తూయమాన,
**మానితఘనరూప,** మంజులాటోప, । సూనసాయకజనక, సోమార్కనేత్ర,
**ఘనమాని హృద్గేహ** కలిత సందోహ । వినతప్రకాశ, శ్రీవేంకటాధీశ,
**భక్తవత్సల,** జగత్పావనమూర్తి, । ముక్తిదాయక, దేవ! మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
**మగు నాతుకూరి తిమ్మార్యతనూజ** । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర వర్య
**రచితమై** కర్ణపర్వమున నాశ్వాస । మంచితార్థ యుతముగా నొప్పె మూఁడవది.

# చతుర్థాశ్వాసము



శ్రీకరుణాపాంగ, శ్రితభక్తసంగ, । నాకేశ సన్నుత, నారాయణాఖ్య,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
ఆరీతి ధర్మజుఁ డాలంబులోన । ధారుణి సూతనందనునకు నోడి
మొగము వెల్వెలఁబాఱి మోహరించుటకుఁ । దగవొప్పఁ దమయోధతతి నియమింప
వారు భీమునిఁగూడి వరభుజాబలము । తో రణ మొనరింపఁ దొడఁగ, కర్ణుండు
సింహనాదముచేసి చెలఁగి యా వీర । సింహునిఁ దఱిమినఁ, జెలఁగి వాయుజుఁడు
సారిది సంతకు మున్నె శ్రుతకీర్తి రథము । వరఁగ నెక్కినయట్టి పాండవాగ్రజుని
నరవి ధృష్టద్యుమ్న సాత్యకులకును । అరుదారఁగాఁ జూపి యప్పుడిట్లనియె:
"కర్ణుండు చెలరేఁగి కౌరవేశ్వరుఁడు । వర్ణింపవలెనని వసుధేశునోఁచె.
ఈతని దుర్దశ యేఁ గనుఁగొంటి । నీతఱి మీకు నేనేమి చెప్పుదును?
ఏనొండె నతఁడొండె నిలమీఁద నొకఁడు । పూని పోయిఁ గాక పోదునెంజిలియు.
అదిగానఁ బోరెద నర్కజుతోడఁ । గదనంబులో రాజుఁ గావుఁడీ మీర."
లనిపల్కి తనరథంబతనిపైఁ ద్రోలఁ । గనుఁగొని శల్యుండు కర్ణుతో ననియె:
"మనమీఁద వచ్చెడి మారుతాత్మజునిఁ । గనుఁగొంటివే! వీఁ డఖండవిక్రముఁడు.
వడిఁ గోపమెసఁగంగ వచ్చుభావంబు । తోడిఁబడ నాకును దోఁచుచున్నదియు.
కనలిన మూఁడు లోకంబులనైనఁ । గొనఁడు చీఁకిఁ, గ్రీడికొడుకును దనదు
తనయుఁ డయ్యెన ఘటోత్కచుఁడుఁజచ్చుటయు । మనమున జాజ్వల్య[1]మానుండు నగుచు
నెంతకోపించెనో! యీతని చేత । నెంత కానున్నదో! యీకురుబలము.
నీభుజాసారంబు నేఁడు చూచెదను । ఏభంగిఁ బోరెదో యెఱుఁగము నిన్ను."
అనిన సూతతనూజుఁ డమ్మద్రవిభుని । కనియె: "నీచెప్పినయట్టులు నిజము;
అనిలజుఁ డల్పుఁడే! యైనఁ గానిమ్ము; । పౌనరఁ గీచకశతంబును వధియించె
ననికదా తలఁకెద; వందుకేమాయె? । పనివడి మద్భుజాబలమునుఁ జూడు."
మనుచు వాయుజుమీఁద నమ్ములవాన । ఘనముగాఁ గురిసి వెక్కసపునారసము

1. మానాంగుఁడగుచు. (మూ)

నురముఁ జొప్పించిన, నుగ్రుఁడై యతఁడు । తరణిపుత్రునిమీఁద దశసాయకములు
పరఁగింప, నంతలోపల నవి దునిమి । కరువలిపట్టి విల్ ఖండించి యార్చి
నలి నిరువదియైదు నారాచములను । దొలఁగి కత్తళమును దూఱంగ నేసె.
ఏసిన భీముఁ డయ్యినజునిమీఁద । నా శతకోటియోయన భల్ల మొకటి
యుదరక యేసిన, నది ఱొమ్మునాడఁ । బడెఁ దేరిమీఁద న ప్పద్మాప్తసుతుఁడు.

### భీముఁడు కర్ణుని మూర్ఛితుఁ జేసి నాలుక గోయఁబూనుట

పడి మూర్ఛవోయినఁ బావని చేరి । 'యెడపక వేగంబ యీనీచుఁబట్టి
నాలుక గోసెద నయవృత్తి' ననుచు । నాలోన రథముపై కడఁగ నుంకింప,
వారించి య మ్మద్రవసుధేశుఁ డనియె: । "మారుతి, వినవయ్య మరణంబు గాదు;
ఒనరిన మూర్ఛచే నున్నాఁడితండు. । గొనకొని నాలుక గోసితివేని
చచ్చునిక్కము; వీనిఁ జంపెద ననుచుఁ । [1]గ్రచ్చఱఁ బార్థుండు ప్రతిన తాఁ జేసె.
నీవుచంపినఁ గ్రీడి నెవ్వగఁబొందుఁ । గావున మానుము కారుణ్యమూర్తి!"
అనుడుఁ బావనియు: "నర్జునుప్రతిన । యెనయంగ నెంతయునెఱుఁగుదు నేను.
వెనుకొని ధర్మజు వీఁడు గారింపఁ । గనుఁగొని కోపంబుకతన నేమఱచి
తనరంగ వచ్చితిఁ దలపించి తీవు. । మనసు సంతసమయ్యె మామరో!" యనిన
వెలయంగ శల్యుండు వేగంబె తేరు । తొలఁగించె ననుటయు దుఃఖంబు నొంది
సంజయు కిట్లను జనపాలవరుఁడు: । "అంజక యాజిలో నర్కనందనుఁడు
పాండుసూనులఁ జంపుఁ బ్రథనోర్విఁ ననుచు । నుండితి; మక్కటా! యుడుకెల్ల నణఁగె.
భీమునిచే నిట్లు బీరంబు వోయి । యేమయ్యెఁ గర్ణుండు? ఎఱిఁగింపు." మనిన
నాంబికేయునకు నిట్లనియె సంజయుఁడు: । "పంబి భీమునిచేత బాధితుఁడైన

### భీముఁడు శ్రుతవర్మాది కుమారులఁ జంపుట

రాధేయుఁ గనుఁగొని రారాజు నిఖిల । యోధులఁ దమ్ముల నొప్పుగాఁ బలికె:
"అదె వాయుపుత్రుచే నబ్జాప్తసుతుఁడు । వదలక కడునొచ్చె; వన్నెగా మీరు
గవియుఁ డాతని." నని కడఁకతో ననుపఁ । దివిరి నారును మదోద్రేకంబు మీఱఁ

1. ప్రచ్ఛర. (మూ)

ఆతనిఁ గడచి సాత్యకి వానిఁదాఁకి । శాతసాయకములఁ జతురత నేసె.
అప్పుడు కృతవర్మ యా సౌబలుండుఁ । దప్పక కృపుఁడును ద్రోణియుఁ జెలఁగి
బవరంబు సేయంగఁ బాండవబలము । తివిరి పోరాడె నోధృతరాష్ట్ర, వినుము.
ఏమిచెప్పఁగవచ్చు నిలయెల్లఁ జూడ । నామెయి రక్తమై యఖిలంబు నిండె;
అట్టలాకసమాన నాడంగఁ దొడఁగె; । తెట్టులై పీనుఁగుల్ తేలాడఁ దొడఁగె;
తతభంగి భూతభేతాళ పిశాచ । తతులు మదించి నృత్యము సేయఁజొచ్చె.

### సంశప్తకు లాక్రమొగి నర్జునురథము నాఁగుట

అపుడు సంశప్తకు లాక్రీడిఁ దాఁకి । విపరీతగతి నంపవెల్లి ముంచుటయుఁ
బన్నగాస్త్రంబున బంధించె వారి. । నెన్నఁగ నివ్విధంబెఱిఁగి సుశర్మ
గారుడాస్త్రం బేయఁగా బంధనములు । దూరమై పోయినఁ, దొడరి యర్జునుఁడు
వెసఁ ద్రిగర్తాధీశు వివిధబాణముల । పసఁజూపఁ, గోపించి భవ్యాస్త్ర మొకటి
యురమునాటఁగ నేయ, నుబ్బెల్లనణఁగి । సరసరఁ దేరిపైఁ జదికిలఁబడిన
'నడెచచ్చె నడెచచ్చె నర్జునుం' డనుచు । మదవృత్తి [1]మననేన మసలక యార్చె.
అంతఁ దెప్పిఱి విలయాంతకుపగిది । నెంతయుఁ గోపించి యింద్రనందనుఁడు
శరవృష్టిచేత సుశర్మఁ గప్పుటయు, । నరయ నర్జునుమీఁద నతఁ డస్త్రమేసె.
ఏసిన నవ్వుచు నింద్రాస్త్రమతఁడు । భాసురంబుగ నేయ బాణాగ్ని [2]నపుడు
పదివేవు రుద్దండబలు లోలిఁ దెగిరి ; కదలక సంశప్తగణములు భూప.
హతశేష సంశప్తకానీకవరులు । తతశౌర్యమునఁ జతుర్దశసహస్రములు
విజయునిఁ బొదివిన, విజయనాశంబు । నిజముగాఁ జేసి యన్నిచుల గెలిచె.
యమసూతి ద్రోణితో నసిసేయుచుండఁ । బ్రమదంబు దీపింప బాసటగాఁగ
సాత్యకి యేతెంచి చండకాండంబు । లత్యంతగతి నేసె నా ద్రోణిమీఁద.
ఏసి యంతటఁ బోక యెసఁగి తద్ధనువు । వాసిగా ఖండింప, వాఁ డోర్వలేక
వెలయంగ శక్తిచే విలు దునుమాడి । కలితాస్త్రశిఖలచేఁ గప్పిన, నతఁడు
సారథి దెగుటయు సమరంబుమాని । తేరీడ్చుకొనిపాఱెఁ దీవ్రంబుగాఁగ.
ఈరీతి సాత్యకి యేపెల్ల విడిచి । పాఱంగఁ గనుఁగొని పాండవాగ్రజుఁడు
ద్రోణిని శరములఁ దఱిమి నొప్పించి । ద్రోణితో మఱియు నాతనిఁజూచి యనియె:

1. గునిసిన. 2. నతఁడు. (మా).

నడవ, ధృష్టద్యుమ్నుఁ డా శిఖండియును । దడయక ద్రౌపదీతనయులుఁ గపలు
శైనేయుఁడును మఱి సకలభూవిభులు । జానొప్పఁ బొదివిన, సవితృనందనుఁడు
పూని సర్పంబులు పొదివినఁ బెనఁగు । వైనతేయునిరీతి వర్తింపనొప్పె.
అటమున్న సంశప్తకాఖ్యసైనికులఁ । బటుగతిఁ జెండాడి పార్థుఁ డుప్పొంగి
వాసుదేవునిఁ జూచి వలనొప్పఁ బలికె: । "ఈసునఁ దలపడి యుందఱుఁ దెగిరి
భీముచేఁ గౌరవుల్ ప్రిదులంగ [1]లేదు; । కామించి కర్ణుఁ డొక్కఁడె కలఁచెడిని.
అరదంబు గడపవే యాతనిమీఁద । సరభసంబున." నన్న శౌరి నవ్వుచును
'వాయునందనుచేత వడిఁబోదు నీవు । నేయుము రణవాంఛ [2]యిఁక వారికణఁగ'.
అనవుడు నట్లకాకన, మురాంతకుఁడు । ఘనముగా నరదంబు గడప, నీక్షించి
విచ్చె నబ్బలములు వెసఁ బులిఁగనినఁ । [3]గ్రచ్చఱఁ జను లేటిగమియునుబోలె.
అపుడు నీసుతులుఁ బాయక త్రిగర్తులును । విపరీతముగ రెండువేల తేరులను
గరమొప్ప మున్నూరుగజముల మఱియు । విరివిగాఁ బదునాల్గువేల గుఱ్ఱములఁ
గలయంగ రెండులక్షుల పదాతులను । దలకొని పురికొల్పఁ దత్క్షణంబునను
ధరణిపైఁ గూల్చి యంతటఁ బోక నరుఁడు । గరిమ సంశప్తకగణములఁ దునిమి
బాణాగ్ని విశ్వరూపము చూపె; సభ । వాణి యందఱు విన వానిపిఁ బొగడె.

అశ్వత్థామ యర్జునుతోఁ దలపడి పోరుట

చెనకి యీరీతి విచిత్రముల్ గసియు । వినియును మాత్సర్యవృత్తి నాద్రౌణి
తన కుడిచేత సుత్రామజుఁ బిలిచి । మనమునఁ గోపించి మసలక పలికె:
'అతిథిగా భావించి యర్జున, నాకు । నతిశయ సంగ్రామ మాతిథ్యమొసఁగు.'
మని షష్టిబాణముల్ వారినేసి మఱియు । సునిశితాస్త్రంబు లర్జునుఁ దాఁకనేయ,
విల్లు ఖండించిన, వేగ వేఱొక్క । విల్లెత్తి శరములు వెయ్యేయుటయును
అవియును బటుమార్గణావళిచేత । వివిధ ఖండములు గావించె నర్జునుఁడు.
అంతటఁ బోక కాలాంతకు పగిది । నెంతయు గురుసుతుఁ డేచి పెల్లార్చి
యనయంబు గాలుచెయ్యార్పరాకుండ । ఘనబాణతతు లేయఁగా, సురవరులు
నతని సైన్యములు హాహాకార మొనఁగ । నతుల నిశ్చేష్టితులై చూచుచుండఁ
గమలదళాక్షుఁ డాఖండలాత్మజునిఁ । గొమరప్పఁ గనుఁగొని కోపించి పలికె:

1. లేరు. 2. నిట వారి నణఁగ. 3. క్రచ్చరంబుగ. (మూ).

“ నుతగతి గురునందనుఁడు నిన్ను మించె । నతుల సాహసుఁ డిది యద్భుతకరము !
గాండీవమెంతయుఁ గరమున నీకు । నుండదో పదిలమై యుదుటేల యణఁగె ?
అదిగాక గురుపుత్త్రుఁడని తలంచెదవొ ? । వదలకు.” మనిపల్క వాసవి యనియె :
“పెనఁగొని మనమీఁదఁ బెక్కు బాణములు । ఘనముగా నేసినఁ గని ముదంబొదవి
యుండితిఁగాని యత్యుగ్రత నన్ను । గాండీవమును జూడు కమలదళాక్ష !”
అని బాణజాలంబు లందంద యేసి । ధనువును నాతపత్త్రమును గేతువును
దునుమాడ, గదనైనఁ, ద్రోణసూనుఁ ద్రుంచి । చెనసి ప్రాలేయంబుఁ జెఱచు భాస్కరుని
తెఱఁగున మెఱయంగఁ, దివిజేంద్రసూనుకిని । మఱియు సాహాయ్యమై మహితశౌర్యమునఁ
గణఁగి సంశప్తక గణము లేతెంచి । పెనఁగొని పొదివిన, భీషణాస్త్రముల
వారలఁ గూల్చిన, వడినంతఁ బోక । ధీరుఁడై కౌరవాధిపుఁ డేఁగుదేర
గనుఁగొని భీముఁ డఖండవిక్రముఁడు । తన తేరు గడపి యుద్ధము సేయుటయును,
అక్షౌహిణులు మూఁడు ననిలజుచేత । శిక్షింపఁబడి పాఱె క్షితిపుతోఁ గూడ.
అదిచూచి నవ్వుచు నంబుజోదరుఁడు । త్రిదశేంద్రసూనుకుఁ దేటగాఁ జూపె.”
అనవిని ధృతరాష్ట్రుఁ డా సూతసుతున । కనియె : “నో సంజయ, యాజిరంగమునఁ
బరఁగ నీ చెప్పిన భావంబు చూడఁ । దిరముగా మనవారు తెగిరి నిక్కువము ;
ఏచేటు వాటిల్లె నెఱిఁగింపు ?” మనిన । నేచి సూతతనూజుఁ డిట్లని పలికె :
“ అదిగని గురుసుతుఁ డనిలజుఁ దాఁక । నదనేది యర్జునుఁ డంతయుఁ జూచి
ద్రోణాత్మజునిమీఁదఁ ద్రోణ్రోన పెక్కు । బాణజాలములేయ భంజించె నతఁడు.
తెగి యైంద్రమాదిగా దివ్యాస్త్రతతులు । మొగి నేయ నవియును మునుకొని త్రుంచె.
మఱియును నేయంగ మది నల్కవొడమి । యుఱక యశ్వత్థామ యుగ్రబాణములు
వానరధ్వజునిపై వనజదళాక్షు । పైని రథ్యచయంబుపైని బిట్టేసి
భుజము నొప్పించినఁ బోవక యంత । విజయుండు నేసెను వివిధబాణములు.
అంత భానుజుఁడును యమసూతిమీఁదఁ । బంతంబుతోఁ బెక్కు బాణంబులేసి
వలుద నారాచంబు వక్షంబు దూఱ । బలువుగా నేయ నప్పాండవాగ్రజుఁడు
నెత్తురు గాఱంగ నిలువంగలేక । చిత్తంబు దూలంగఁ జేష్టలు దక్కి
తేరిపైఁబడి సూతు దృష్టించి పలికె : । “ వారక యోసూత, వరగుణోపేత
తొలఁగింపుమీ తేరు దురములో వెడల ; । నిలువవు ప్రాణముల్ నెఱయఁజిక్కితిని.”
అనిపల్క సారథి యరదంబు దోలి । కొనిచనఁ గనుఁగొని కురురాజు వేడ్క

సకల యోధులుఁ దాను సాహసస్ఫూర్తి । ప్రకటించి ధర్మజుపై నెత్తిపోవఁ,
గని వాయుసూనుఁడు గనలి పోనీక । యనయంబు నిలు నిలుమని యడ్డగించి
నానాస్త్రముల నేయ నలినబాంధవుని । సూనుండు పాంచాల సుతులను దోలి,
యంతట శిబిరంబుకై పోవుచున్న । యంతకసుతుఁ గూడ నరిగి: "యిదేమి!
పాఱకు పాఱకు బంటవై నిలుము; । ఈరీతిఁ బాఱంగ నిందఱు నగరె?"
అని మూఁడు బాణంబు లతనిపై నేసి । గొనకొని మగిడించి క్రొక్కిదీపింప
సాయకత్రయమున సారథిఁ గూల్చి । సాయక హయముల భగ్నంబు సేయఁ
గడునొచ్చి దిక్కులు గనుఁగొనుచుండఁ । దడయక యమ్మాద్రితనయుఁ డీక్షించి,
"యక్కటా! చిక్కె నయ్యమతనూభవుఁడు । తక్కక కర్ణుచే దైవమా!" యనుచు
నరుదార నేతెంచి యమ్ముల వాన । గురిసిన నవ్వుచుఁ గుంతి వాక్యములు
తలపోసియును భుజాదర్పంబు పేర్మి । వెలయంగ నకులుని విరథుఁ గావింప,
భయముతోడుత జముపట్టియు నతఁడు । నయమున సహదేవు రథమెక్కుటయును,
మునుకొని కర్ణుఁ డమ్మువ్వురమీఁద । ఘనబాణ తతులేయఁగా శల్యుఁడనియె:
"ఏల ధర్మజుమీఁద నిట్లాగ్రహింప? । వాలాయ మిం దొక్కవాక్యంబు గలదు.
ఈతఁడు దెగటార నేమిఫలంబు? । భూతలంబునఁ గ్రీడిఁ బొలియించితేని
రారాజునకుఁ గల్గు రాజ్యభోగములు; । ఆరూఢిఁ గనుఁగొను మదియును గాక
వాఁడె కౌరవభర్త వాయుజుచేతఁ । బోఁడిమిచెడి యుద్ధభూమి నున్నాఁడు.
అనిలనందనుచేత నతఁ డీల్గనేని । ఘనముగా ధర్మజుఁ గవలఁ జంపుటయు
వృథయునై పోవును; విడువుము వీరి । నధికత." ననిపల్క నత్త్రైత్తిచూచి
రారాజుఁ గావ నా రథికవర్యుండు । వీరల విడిచి యుద్వృత్తిమైఁ జనియె.
అటఁ బినతమ్ముని యదరంబు నెక్కి । తటుకునఁ దనతల తడవి చూచుచును
గన్నుల నొగి నీళ్లుగాఱ ధర్మజుఁడు । చిన్నవోవుచుఁ దన శిబిరంబు చొచ్చె."
అనుటయు ధృతరాష్ట్రుఁ డా సూతసుతున । కనియె: "నో సంజయ, యనిలసూనునకు
నాకొదుకున్నాఁడు నలిఁజాలఁ డోటు? । ప్రాకటలీల ధర్మజుఁ డబ్బియుండఁ
బోనిచ్చెనే సూతపుత్రకుం డకట! । తా నెఱిచెడి బుద్ధి తప్పెఁ గార్యంబు;
ఇటమీఁది వృత్తాంత మెఱిఁగింపు." మనినఁ । బటుతరంబైన వాక్ప్రౌఢి నిట్లనియె:
"అట ధర్మనందనుఁ డరదంబు డిగ్గి । యటు నిటు చనక చయ్యన సెజ్జచేరి

తనువునాటిన బాణతతిఁ దివిపించి । కొని విషాదంబునఁ గుందు[1]చునంతఁ
గవలఁ గనుంగొని కడఁక నిట్లనియె : । "కవలార, మీర లా గంధవాహజుని
కడ కేఁగుఁ." డనినఁ దక్కక నకులుండు । తడయక యొక్కరథంబెక్కి వేగ
సహదేవుతోఁగూడఁ జని యుద్ధభూమి । మహితుఁడై చొచ్చి త్రిమ్మరుచుండె. నంత
వెనఁ బాండవాగ్రజు విధ మెఱుంగకయు । వసుమతి ద్రౌణితో వాసవి పోరి
మెఱుఁగునారసములు మిక్కిలి యేయ । నుఱక ద్రౌణియు నేసె నుగ్రంపుగదను.
అదియును దునుమాడి యమ్ములవాన । త్రిదశేంద్రజుఁడు గప్పెఁ దీవ్రంబుగాఁగ.
కప్పినఁ గోపించి ఘననారసంబు । లప్పార్థుమేనఁ జెల్లార్చి యేయుటయుఁ
గనుఁగొని హరులపగ్గములు ద్రుంచినను । గొనకొని తేరీడ్చుకొనిపోయె ద్రౌణి.
పోయినఁ గని మొనల్ పొలుపెల్లఁ దక్కి । యాయెడఁ బాఱంగ నహికేతుఁ డపుడు
తరణిసూనునిఁ జూచి తప్పక పలికె : । "కరమొప్పఁగా నీవు గనుఁగొనుచుండ
మనమొనల్ పాఱెడు మరలింపు." మనిన । నినజుఁ డాలోన మద్రేశు కిట్లనియె :

## కర్ణుఁడు పాండవసేనలపై భార్గవాస్త్రము ప్రయోగించుట

"నరుని భీమునిఁ బద్మనయనునిబట్టి । దురములోఁ జంపుదు దోర్గర్వమెసఁగ ;
రథరథ్యగతులు మీఱఁగవలె." ననిన । నధికుఁడై యతఁడును నట్ల కావింపఁ,
బరువడిఁ బైపైని బాంచాలసేన । యురవడించినఁ జూచి యుగ్రుఁడై కర్ణుఁ
డతిరయంబున భార్గవాస్త్రమేయుటయు । క్షితిఁగూలు రథములుఁ జెడు వారణములు
నుగ్గైన రథికులు నొగులు సారథులు । [2]మ్రగ్గిన రవుతులు మడియు నశ్వములు
నై తలచెడి [3]పిల్చి రా ధనంజయుని. । ఆతతిఁ బిలువంగ హరిఁజూచి క్రీడి :
"యదె చూడు రాధేయు నతులవిక్రమము ; । వదలక మన సేన వడిఁబాఱఁదొడఁగె.
ధరఁ బట్టపగలింటితరణిచండమున । విరివిగా నుగ్రుఁడై వెలుఁగుచున్నాఁడు.
వదలక మన తేరు వడిగా మరల్పు । [4]బ్రదికిన శుభములఁ బడయంగవచ్చు.
ఇంతటివాఁడౌట యెఱిఁగియు నతని । పొంతకు వత్తునే పుండరీకాక్ష !"
అన విని శ్రీకృష్ణుఁ డనిలనందనునిఁ । గనుఁగొన నాతండు గర్ణు మార్కొనుచుఁ
బాండవసేనల బలువీడి నిలిపి । ఖండింపఁ దొడఁగె నక్కర్ణాదిరథుల.

1. చున్నంత. 2. ద్రుగ్గిన. 3. వారి. 4. బ్రతికిన. (మూ).

అట మురహరుఁడు నయ్యర్జును కనియె : । "ఎటఁబోయెనో లేఁడు ఇందు ధర్మజుఁడు !
మనము ద్రోణజుతోడ మార్కొని పోర । ననఘాత్మ, కర్ణున కగ్గమై యుండి.
యాతఁ డాతని సిశితాస్త్రసంతతుల । చేత నొచ్చెనో యేమొ చింత యయ్యెడిని."
అని యన్న నొచ్చిన యామాట చెవుల । విని కలఁగుచు నాజి వీక్షించి వెదకి
యమసూతిఁ గానక యనిలజు కడకుఁ । గ్రమమునఁ బోయి యా గాండీవి పలికె :
"చూచితే యా ధర్మసుతుని నెందైన ? । నేచాయ నున్నవాఁ డెఱిఁగింపు." మనిన
హరిసూనుఁ జూచి యయ్యనిలనందనుఁడు । ఇరవొప్పఁగా నంత నిట్లని పలికె:
"కౌరవకోటితోఁ గదనంబు నేను । వారక సేయ భూవరుఁ డాఁకి కర్ణుఁ
డఱిమిఱి నొప్పింప నాహవభూమి । తెఱఁగొప్ప వెడలెను ధీరాత్మ, యతఁడు ;
ఇంతకు నెట్లొనో యెఱుఁగంగరాదు ; । అంతేల శ్రీకృష్ణుఁ డరసి రక్షించు."
అన విని విష్వచ్ఛుఁ డా వృకోదరునిఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
"కర్ణ నారాచముల్ గాడఁగ నోడి । యర్ణవగంభీరుఁ డరిగెనో యేమొ ?
ఒనర ద్రోణాచార్య నుగ్రబాణముల । కనయంబు నిల్చి యా యర్కజుచేత
నొచ్చెఁగదే భీమ, నుతగతి నీవు । విచ్చలవిడిఁ బోయి విభు తెఱఁ గరయు ;
మేను నీమొగ మొన నిలిచెద." ననిన । మానుగా నిట్లను మారుతాత్మజుఁడు :
"నరనితో నీరీతి చనఁగాక నీకు ; । నిరవొప్ప నాకును నిట్టిది తగదు.
అని కోహటించినాఁ డందురు జనులు ; । పొనరంగ వేవేగఁ బొమ్ము నీ." వనిన
"సంశప్తకులు వీరె సమరంబు సేయ । వింశతి సాహస్రవీరులు తోడరు
చున్నవా." రనిన వాయుజుఁ డను: "నేను । గ్రన్నన పోరెదఁ గాని నీవరుగు."
మనిన నట్టులకాక యని యర్జునుండు । వనమాలిఁ గనుఁగొని వలనొప్పఁ బలికె :
"అనఘాత్మ, నృపుఁ గనుసంతకు నాకు । మనము గలంగెడు ; మఱి వేగరథము

ధర్మజుని సేమంబరయఁ గృష్ణార్జును లాతని శిబిరమునకుఁ బోవుట

పోవని." మ్మనుటయుఁ బురుషోత్తముండు । పావనిఁ గనుఁగొని, "భవ్యాత్మ, వినుము
మీయన్న సేమంబు మేమిట్టె యరయఁ । బోయెద ; మీవు నద్భుతవిక్రమమునఁ
గౌరవబలములఁ గదనోద్వియుందు । నారూఢితో గెల్వు." మనుచు నగ్గించు
తెఱఁగున వరమిచ్చి దేవదేవుండు । వఱలు నశ్వము లతి త్వరితంబుగాఁగఁ
జెనసి తోలుచు వచ్చి శిబిరంబుఁ జొచ్చి । పొనర శయ్యాతలంబున నున్న జముని

కోడుకుఁ గనుంగొని కుశలియై తాకెంజేఁగి । యచ్చుగులఁ బడుటయు, యమతనూభవుఁడు
వారలు శాధేయు వధియించి వచ్చి । నారని తలఁచి డెందము సంతసిల్ల
మందస్మితంబుతో నుమశ దీపించి । పొందుగా సంతోషమున నిట్లులనియె:
"సురలైనఁ జలమున సూర్యనందనుని । నిరతులై గెలువంగ నేర్తురె! [1]వాఁడు
రామశిష్యుఁడు దినరాజతేజుండు । భీమాస్త్రవేది గాంభీర్యశౌర్యుండు.
అటువంటి బల్లిదు నవలోనఁ జంపి । తేటుకునవచ్చిన ధన్యులు మీరు.
ఇదిగదా సంతోష ! మిదిగదా కీర్తి ! । యిదిగదా రణధర్మ ! మిదిగదా నేర్పు !
అతనికి నాకును నాహవంబయ్యె । బ్రతుకెల్ల నట బట్టబయలునై పోయె.
నూతహయంబులఁ జూర్ణంబు చేసి, । యాతతసూతకర్ణుఁ గ్రూరాస్త్రంబు లేసి,
యప్పుడు మర్త్యోథనాది వీరులకుఁ । దప్పక పరమానతనయుని కధిక
సమరంబు గాఁబట్టి చాలించిపోయె ; । తెమలకయున్నను దిగ్భ్రమింగువాఁడు.
పదమూఁడు వర్షముల్ పగలును రేలుఁ । గదనంబులోఁ గర్ణుఁ గడతుమె యనుచు
నిరతిమై నాహార నిద్రలు లేక । పరితాప మందితిఁ ; బశువుఁ జేయంగ
భూసురుల్ పట్టఁ బాఁ బొలుపెల్లఁ దక్కి । యోసరింపుచుఁ గడు నొదుఁగుచునున్న
గవయుంబు తెఱఁగునఁ గర్ణునిభీతి । దవిలి యుండను మదిఁ దథ్యంబుగాఁగ.
తనరంగ సురనదీతనయుచేఁ గుంభ । జునిచేతఁ బడని నిష్ఠురపరాభవము
పఱచె నెంతేనియుఁ ; బగనీఁగఁగంటిఁ । దఱినేచి నీయట్టి తమ్ముండు గలుగ.
వెరవును లావును వీర్యశౌర్యములుఁ । దిరముగా మించిన దృఢముష్టి గలిగి
యమరేంద్రసూనుని నణఁచెద ననుచుఁ । బ్రమదంబుతోడుతఁ బ్రతినగావించి
మెఱసినకర్ణుని మిహిరప్రతాపి । నఱిముతిఁ జంపితి వనఘ, నీసాటి
ధరణిలోఁ గలరె ! యుద్దండ ప్రచండ । నిరుపమ గాండీవ నిత్యహస్తుఁడవు."
అని కొనియాడంగ నా ధర్మరాజుఁ । గనుఁగొని పలికె నాఖండలాత్మజుఁడు :
"అనఘాత్మ, సంశప్తకాఖ్యులతోడ । ఘన రణంబయ్యె ; నక్కడ గురుసుతుఁడు
అరయ స్వాతిగతుండు నగు శుక్రుఁడెట్టి । వరుసంబు గురియించు వలనుగా నట్టి
బాణవర్షము మీఁదఁ బరఁగించు నంతఁ । బ్రాణలేశములేక ధర్మజ, నిన్ను
జూచెద నని యేను సారిది నీదిక్కు । చూచిన నమ్మూ లచ్చో నిండియుండె.

1. వాని. (మూ)

ఉదటునఁ బదపడి యొకభంగి సతని । మదమెల్ల నణఁచి నేమఱు నిన్ను వెదకి
చెలరేఁగి కర్ణునిచేఁ దూలిపోయి । తలఁగి వచ్చినమాట తగ భీమసేనుఁ
డెఱిఁగింప మీ సేన మెఱిఁగెఁకుకొఱకు । వెఱవృశో వచ్చితి విధువంశతిలక !
కరమొప్ప నేమంబుగల నిన్ను గంటిఁ । బరువడి సంతోషభరితుండ నైతి.
ఇఁకఁ బోయి రాధేయు నిలమీఁదఁ గూల్తుఁ । బ్రకటించి చనుదెమ్ము బవరమ్ముచూడ.
[1]తెఱలి యాఱంగల దీపంబు మండు । తెఱఁగున నున్నాఁడు దినకరాత్మజుఁడు.
ఉండుఁగా కేమి యే నుర్వి నార్పెదను । భండనంబున కంపు పరువడి నన్ను.
ఎలమితోడుత నాతఁ డెదిరించెనేని । తలఁ ద్రుంచివైచెద తథ్యంబు నేఁడు.
అంత సేయకయున్న పవనిదేవునకు । నంతంత యిచ్చి లే దనువానిగతికిఁ
బోదు నిక్కము నమ్ము భూపాలతిలక ! । ఓ దయాజలధి, వాయుజుఁ డొంటిఁజిక్కె."
అనుడు కర్ణుండుండు టది తెల్లమైన । విని వానిశరముల వెన నొచ్చెఁగానఁ
గోపంబు మదిఁ [2]బెనఁగొన ధర్మతనయుఁ । డాపార్థుఁ జూచి యిట్లనియె నుద్ధతిని :

కర్ణుఁడు బ్రతికియుండుట విని ధర్మజుఁ డర్జునుఁ గినియుట

"అనిలోన వెడలుట యధికకష్టంబు ; । సునిశితగతి వచ్చి చులుకనయ్యితిని.
ఎనయంగఁ గర్ణున కేనె యోడితిని । అననేల ! నీవును హరియును నోడి
చనుదెంచితిరి ; వాయుసంభవయములు । నెనయంగ నోడిరి యిఁకఁ బోరుచాలు.
విపినభూమికిఁ బోయి వెఱపెల్లఁ దక్కి । తపసులమై చరింతము పెక్కులేల !
కాదేని బిరుదులు గ్రక్కునఁగట్టి । సాదరంబునఁ గురుక్ష్మానాథుఁ గొలిచి
యతఁ డేమి పనిచిన నదిచేసి మిగుల । జతనమై యుండుట సరవిమైఁ దగును."
అనుచు నిప్పులఁబోలు నశ్రుల నిండ్ర । తనయు నిరీక్షించి తప్పక పలికె :
"తెలివిమీఱంగ నీ తెఱఁ గిట్టిదేని । కలహంబునకు రాక [3]కడిమివాటించి
తపముసేయుచు నుందు ద్వైతవనమున. । విపరీతముగ నాఁడె 'వినుము రాధేయుఁ
జంప శక్యముగాదు సాహసోన్నతుఁడు । ఇంపార' ననివల్క నిక్లేల వత్తు ?
ఎఱిఁగియు ధారుణియేల దుర్బలులు । మఱి వాంఛ సేతురే ! మాటలేమిటికి !
ప్రతిమతిఁ గర్ణుని వధియింతుననుచుఁ । బ్రతినపల్కితి వృథాపలుకు నీపలుకు.
[4]పలుచగాఁ బొడవెత్తి పగవారి నడుమ । నిల్ల నను వైవంగ నెట్టునేర్చితివి ?

1. తెరువు. 2. గను. 3. గదిమె. 4. పలుచుగా. (మూ).

దేవత లిచ్చిన తేరు సర్వములు । నావల నిఖిల దివ్యాస్త్రసంతతులు
హరి సారథిత్వంబు హరికేతనంబు । హరిహయుఁ డిచ్చినయట్టి బాణములుఁ
దాటంత ధనువును ధరియించి కర్ణు । పోటున కోడితి; భువియెల్ల నవ్వఁ
బాఱు తెంచితివీవు ; 'భానుజుఁ గనిన । బాఱుదు' వని చెప్పఁ బతిసుయోధనుఁడు.
నెలకొని యామాట నిజముగాఁ గొనక । పలనేది బాంధవవర్గంబుఁ జంపి
యప్రయోజనముగా నట జేలనయితి. । ఈప్రయోజనముగా నీ పంకజాక్షు
రథికునిఁ జేసి సారథిని నీవగుచుఁ । బ్రథనంబు సేయంగఁ బ్రార్థించి మఱియు
నెరవుగా గాండీవమిచ్చిన నతఁడు । దరికొల్పఁడే వైరితతి నిమిషమున.
కడఁకతోడుతఁ గుంతిగడుపున నీవు । అడరంగఁ గొడుకుచూలై తోఁపవేని,
తోఁచినఁ బిండంబు తుది దిగఁబడిన । నీచోట నాకు ని ట్లీడేన రాదు."

## అర్జునుఁడు ధర్మజు తలఁదఱుగ నుంకించుట

అన విని కోపించి యా సవ్యసాచి । గొనకొని ఖడ్గంబు గొని ధర్మసూతి
తలద్రెవ్వవ్రేయ నుద్ధతిఁ గడంగినను । జలజాక్షుఁ డెఱిఁగి యచ్చటఁ గ్రీడి నిలిపి :
"వాలుగేల నమర్ప వలసిన దేమి ? । ఈలోనఁ గౌరవు లిట ముట్టిరారు ;
యమసూతి సేమ మిట్లరయ వచ్చితిమి ; । ప్రమదంబుతోడ నేర్పడఁగ నీఘనునిఁ
గంటిమి ; సంతోష కాలంబుగాని । కంటుగల్గిన [1]రోష కాలంబుగాదు.
ఏల కోపించె దిట్లేటికి ?" యనినఁ । జాల క్రోధమున నజ్జనపాలవరునిఁ
జూచుచుఁ గ్రీడి యచ్యుతున కిట్లనియె : । "ఓ చక్రహస్త, పుణ్యోజ్జ్వలమూర్తి,
క్రమ్మి యెంతేనియు గాండీవ మొరుల । కిమ్మన్నవాని నే నిలఁ గూల్తుననుచుఁ
బ్రతిన పట్టినవాఁడఁ బలుకులింకేల ! । క్షితిమీఁద నామాట చెల్లింతుఁ గృష్ణ !
అది[2]గాక నాకసత్యంబు రాకుండఁ । బదపడి పరిహరింపఁగ నోపితేని
పరిహరింపుము నీవు ప్రజ్ఞతో." ననిన । సరసిజాక్షుఁడు సవ్యసాచి నీక్షించి
'పదరక[3]పో యేటివాఁడ వీ !' వనుచు । నదలించి వెండియు ననియెఁ గృష్ణుండు :
నీకు వృద్ధులసేవ నెఱయలేకునికి । ప్రాకటంబుగఁ గానఁబడియె భూస్థలిని.
ఉడుగ కెంతేనియు నూరక యడిచి । పడుదు ; ధర్మవిధి విభాగజ్ఞులెల్ల

1. రోష. 2. దాక నాకసమబ్బ. 3. పోయెడి. (మూ)

నేటికి నొనరింతు రిటువంటిచేఁత? । మాటలు పెక్కేల [1]మన కదిగాక
సత్యంబు దమ మహింసయు శమగుణము । నత్యుత్త[2]మములగు, నందు నహింస
సత్యంబుఁ గాచుట సరి; హింస మఱియు । సత్యంబుఁ గావంగఁ జనదంద్రు బుధులు
ప్రాణహానియొనర్చు పట్టున, ధనము । ప్రాణతో హరియించుతఱి ధాత్రినెపుడు
సత్యమసత్యమై సరవి దీపించు । నిత్యమసత్యంబు నిజమని పరఁగు.
ఎనయ నిందుకు నొక్క యితిహాస మేను । వినిపింతు నిశ్చలవృత్తితో వినుము.
అవనిలోఁ గౌశికుఁడను విప్రుఁడొకఁడు । ... ... ... ... ...
సరవితో నొక విశిష్టగ్రామమునకు । జేరువ నొక సరసీతీరభూమి
వారక వసియించి వన్నెదీపించి । ... ... ... ... ...
ప్రతినతో సత్యంబు పలికెద ననుచు । వ్రతమువట్టి తపంబు వడిఁ జేయుచుండ,
నొకనాఁడు ముచ్చుల నొగిఁగాంచి వెఱచి । ప్రకటించి కొందఱు పఱతెంచి యచటి
పొదలలో దాఁగిన, ముచ్చులేతెంచి । వదలక యిప్పుడు వచ్చిన జనులు
ఎటుపోయిరనుచు మునీశ్వరు నడుగఁ । బటుతర సత్యవిభాగజ్ఞమూర్తి
గామిఁ జేసి తనకుఁ గడఁగి యసత్య । మేమెయిఁ దొడరునో యిప్పు డను శంక
'నచ్చుగా గుల్మలతాగహనంబు । చొచ్చియున్నా' రని చూపి చెప్పినను
వారిఁ జంపిరి; మౌని వచనదోషమున । నారకంబునఁ బడె; నలి నదిగాన
నవని హింసాకరంబైన సత్యంబు । తవిలి ధర్మముగాదు తగవిను మనఘ!
తలకొని మును విన్న[4]దానినపట్టి । ఖలుఁడు పెద్దల నడుగకయ దుర్గతికిఁ
బోవు; నింతయు నీవు పొందుగా నెఱిఁగి । వావిరి జనుపట్టి [5]వధ్యుండొ గాఁడొ
మునుకొని నిశ్చయింపుము మదిలోన." । అనుటయు హరికి నయ్యర్జునుఁ డనియె:
"తల్లిదండ్రులమాడ్కిఁ దగుబుద్ధిచెప్పి । యెల్లగా రక్షించి తిందిరారమణ!
సొలసి వృథాప్రతిజ్ఞుండు వీఁడనుచు । నెలకొని జనులెల్ల నిందింపకుండ
నలరి మాయన్న సౌఖ్యంబున నునికి । గలిగెడునట్లుగాఁ గరుణింపుదేవ!"

ప్రతిజ్ఞాభంగము గాకుండ ధర్మజు దూఱుమని కృష్ణుఁ డర్జునునితోఁ జెప్పుట

అన విని శ్రీకృష్ణుఁ డమరనాయకుని । తనయున కిట్లనెఁ: 'దప్పక వినుము.
నలినాప్తసుతుని బాణంబులు దాఁకి । పొలుపేది దేహంబు పులకరింపంగ

1. మాకని. 2. మోత్తములందు. 3. పరు తెంచి యవటి. 4. దానవ. 5. వధ్యుండుగామి. (మూ).

నొచ్చి కోపంబున నొవ్వఁబల్కినను । అచ్చుగా నీకిటు లలుగంగఁ దగునె!
పతియేమి పలికినఁ బ్రాభవంబదియు. । చతురత భీముఁ డచ్చట నీవుఁ గవలు
సరవిమై నితరవశంబునఁ గాదె । చరియింతురెప్పుడు సంతసంబునను.
కావునఁ బ్రభువై సకతన నీరాజు । ఏవిధంబుననైన నేమిపల్కినను
హృదయంబులోపల నెగ్గుగాఁ గొనక । చదురొప్ప మదిని సంశయ మేమిలేక
చనవున వర్తింప సంపదల్ గలుగు । విను నీప్రతిజ్ఞకు వెరవు చెప్పెదను.
వసుధలోపల నిట్టివాఁడ వీవనుచు । వసుధీశు వినరాని వచనముల్ పలుకు.
అదియొప్ప చంపుట యా తరువాత । పదములపైఁ బడి ప్రణతుఁడ వగుము.
సరవి నిట్లైన నసత్యదోషంబు । గురువధ పాపంబుఁ గొనదుపో నిన్ను.
తదనంతరంబునఁ దరణితనూజు । వదలక చంపంగ వసుమతీవిభుని
యనుమతి వడయుద." యనవు డర్జునుఁడు । మనమున నలరి ధర్మజుమోము చూచి,
"వినుము ధర్మతనూజ, విక్రమాటోప, । ఘనశౌర్యవిఖ్యాతి గలిగినయట్టి
వాయుతనూజుండు వడి నన్ను దూఱి । యీయెడ నాడిన నిది తగుఁగాక,
పనివడి భుజబలప్రౌఢి దీపింప । నని నిల్వలేని నీవాడ నర్హుఁడవె!
నాభుజాబలమును నాసాహసంబు । నాభాగ్యరేఖయు నానరసతయు
నెఱిఁగి యెఱింగియు నిట్లాడఁ జనునె! । ఎఱుఁగరే నీసత్త్వ మెల్లభూప్రజలు!
కవలుఁజూడంగ విక్రమధురంధరులు । వివిధ శస్త్రాస్త్రప్రవీణు లుత్తములు;
గుఱుతుగా నేలకుఁ గోలకుఁ దెత్తు । రరిబలంబుల వారలాడిరే యిట్లు!
తలకొని నీవు జూదంబాడఁబట్టి । కలిగె శత్రుత్వంబు కౌరవులకును
మనకును; అదిగాక మానభంగంబు । ఘనమయ్యె; మఱియును గాంతద్రౌపదిని
ముందలపట్టి [1]యుమ్మొగి నీడ్చి యీడ్చి । యందంద వస్త్రముల్ హరియించుటెల్ల
నీకతంబునఁగాదె! నీకేటిసిగ్గు! । దాకొన్న కౌరవదాసుఁడ వీవు.
నేరమెంచఁగనేల నేఁడని వెడలి । పాఱిపోయితిగాదె భానుసూనునకు!
జానొప్ప ననిసేయఁ జాలకయున్న । వానికిఁ దాల్మి యవశ్యంబు వలయు.
కానిమాటలు నన్నుఁ గడవ నాడితివి; । నీనాల్క తునకలై నెఱిఁ బోక[2]యున్నె!"
అని యగ్రజాని నప్రియంబులు పలికి । యొనరఁ జింతించి నిట్టూర్పులు నిగుడ
నొఱఁబాయఁ బెఱికి మహోగ్రఖడ్గంబు । నఱిముఱి ధరియింప నబ్జాక్షుఁ డనియె:

---

1. నిమ్మొవి. 2. యున్న. (మూ).

‘క్రమ్మఱ నిదియేమి కడఁగితి!’ వనిన । నెమ్మి నిట్లనిపల్కె “నీరజనాభ,
భక్తవత్సల, శార్ఙ్గి, పాపసంహార, । నక్తంచరాంతక, నగధర, కృష్ణ,
యమతనూజాతు నోనాడినందులకు । సమరంగ నిప్పుడు ప్రాయశ్చిత్తమేను
దలఁద్రుంచుకొనుటయె తలపోసినాఁడ । నలవడ.” ననిన మురాంతకుఁ డనియె:
“నరవి నాత్మ[1]ప్రశంసయె మరణంబు । ధరణిలో ననుమాట తత్త్వార్థ మనఘ!
అదిగాన విల్లును నమ్ములుఁ బూని । కొదలేక నిను నీవె కొనియాడుకొనుము.”
అనుడు ‘నీ చెప్పినయట్ల చేసెదను । ఘనదేహ, నీవెఱుంగని ధర్మమెద్ది?’
అని ధనంజయుఁ డంత నమ్ములు విల్లుఁ । దనకేలఁ బూని యాధర్మజు కనియె:
“హరుఁ డొక్కరుఁడు దక్క నవనిలోఁ జాప । ధరు లెవ్వరేఁడు మొత్తంబుగా నాకు;
రాజసూయమునాఁడు రాజుల గెలిచి । తేజంబుతో నేను దెచ్చిన ధనము
కమలగర్భుండైన గణుతింపఁ గలఁడె! । ప్రమథాధినాథునిఁ బార్వతీరమణుఁ
గొమరొప్ప గెలిచితిఁ గుంభిని వొగడ; । ... ... ... ... ...
కాలకేయ నివాతకవచముఖారి । జాలంబునెల్లను జంపివైచితిని;
ఖాండవం బాహుతిగా ననలునకు । దండిమై నిచ్చి సుత్రాము గెల్చితిని;
అంగారపర్ణుని యంతటివాని । భంగపెట్టితిఁ గాదె బాహుసత్త్వమున?
గంధర్వపతి తొల్లి గాంధారికొడుకు । బంధించి కొనిపోవ బలువిడిఁ దాఁకి
విడిపించితిని ధర విఖ్యాతిగాఁగ; । ఎడపక నాసత్త్వ మెన్నంగ వశమె!”
అనిపల్కి యన్నకు నపుడు సాష్టాంగ । మొనరించి హస్తంబు లొప్పార మొగిచి
ధర్మతనూభవ, ధైర్యస్వభావ, । ధర్మస్వరూప, భూధవవర్య, యేను
అరతిమైఁ బ్రల్లద పఱపు లాడితిని । అరలేని కడఁకతో నవి వినవలదు.
పనివడి సత్యంబు పలికెద వినుము । తనువును బ్రాణంబు ధరణి నీసొమ్ము;
ఒనర వాయుజుఁ డొంటి నున్నవాఁ డచట; । ననుఁబంపు భూనాథ, నలినాప్తసుతునిఁ
దునిమివైచెద నేఁడు దోర్బలప్రౌఢి.” । నన విని ధర్మజుఁ డమరేంద్రసూనుఁ
గనుఁగొని యనియె ‘నాకతమున మీకు । ... ... ... ... ...
బహుదుఃఖములు గల్గె బడలితి రపుడు; । విహితమా తలఁద్రెవ్వ వ్రేయు మీవేళ.
కలగొని యడిగాక కాచెదవేని । మెలమితోఁ బోయెద నేను కానలకు.

---

1. ప్రశంసా,

బలహీను రణరంగ భయయుక్తు నన్ను । నిలవతిఁ జేయంగ నిది యుక్తిగాదు.
కట్టుము పట్టంబు గంధవాహజుని । నెట్టన నదిగాక నీవైన నేలు."
మని పల్కి ధర్మజుఁ డాసెజ్జ డిగ్గి । వనవాసమునకునై వడిఁ బోవుచుండఁ
గమలనాభుండు భూకాంతుని పాద । కమలంబులకు మ్రొక్కి కడఁక నిట్లనియె:
"నరుని ప్రతిజ్ఞ భూనాథ, యీ వెఱఁగి । వరఁగంగ నీకిట్లఁ బలుకుట దగునె !
రమణమై నిన్ను నేరము లెంచరాదు । క్రమమున నామాట గైకొను దేవ !
కలయఁ బ్రతిజ్ఞ భంగము గాకయుండఁ । బలుకు మీవని యేనె పంచితి నతని.
వరునఁ గీడాడిన వధియించి నట్లు । ధరణిలో ననుచు శాస్త్రములు చెప్పెడిని.
అదిగాక తద్దోషహరణార్థ మిపుడు । కొదలేక తనుదానె కొనియాడుకొనియె;
సరవి నంతటికంటెఁ జచ్చుట గలదె ! । శరణంబు వేఁడెదఁ జయ్యనఁ గావు."
అని యర్జునుఁడుఁ దాను నతనిపాదములు । ఘనముగాఁ బట్టి "యోకారుణ్యమూర్తి !
మమ్మిరువురఁ బ్రోచి మాతప్పులెల్లఁ । గ్రమ్మఱ సైరింపు గతినీవె మాకు.
పార్థునిచే నెల్లభంగులఁ గర్ణుఁ । డర్థి నేఁడే చచ్చు నది నిక్కమనఘ !
వానికై చింత యావంతయు వలదు; । మానక నీ వనుమానంబు నుడుగు."

### కృష్ణుని మాటలచే ధర్మరాజు కలఁకదేఱి ప్రసన్నుఁడగుట

అనుటయు ధర్మజుఁ డాహరినెత్తి । యనయంబు ప్రాంజలియై యతఁడుండ
నతని కిట్లనియె: "నోయనఘాత్మ, నాకు । మతిదప్పెనిందాఁక మఱినీవు కృపయు
నిండి యాపత్పయోనిధిలోన మునుఁగ । కుండంగఁ గాచితి పుణ్యాక్షవినుత !"
అనునంతలోన నయ్యమరేంద్రసుతుఁడు । తనరంగ ఖిన్నుఁడై తలవాంచియున్న
నతనిఁ గనుంగొని యంబుజోదరుఁడు । వితత వాగ్వైఖరి వెలయ నిట్లనియె:
"దేవేంద్రసుత, నీకుఁ దిక్కువట్టినదొ ! । యీ విచారంబేల ! యీ వేళనృపతి
సుముఖప్రసాదంబు చూచి మోదింపు; । విముఖత తగునె ! వివేకివి నీవు;
వరఁగ నీతని నొవ్వఁ బలికినందులకె । దురదుర నీకు నీ దురవస్థవచ్చె.
జగతి ఖడ్గంబునఁ జంపిన నెట్టు । లగుదువో ! యెఱుఁగ మే మక్కటా ! నేఁడు.
అలవడెఁబో దైవతానుగ్రహంబు; । కలహారంగమునకుఁ గడఁగంగ వలదె !"
యనినఁ గన్నీరొల్క యమసూతి పాద । వనజంబులకు మ్రొక్కి వదలకయతఁడు
పొలుపేది బొప్పజల పూరితుఁడగుచు । బలభేదినుతుమీఁదఁ బడియె; నీరీతి

నిరుపురు దుఃఖింప నిందిరావిభుఁడు । సరవిఁ 'జాలింపుఁడు చాలింపుఁ' డనుచు
వారింపఁగా, మాని వసుధీశుఁడంత । గారవంబునఁ బార్థుఁ గౌఁగిటఁ జేర్చి
నలి ముఖప్రక్షాళనంబు గావించి । తలకొన్న చిఱునవ్వు దళుకొత్త నపుడు
"మహినింత పఱచునే! మనలఁ గర్ణుండు ; । విహితంబుగా జనుల్వీక్షింపుచుండ
వరుసతో విల్లు నశ్వమ్ములు సూతు । ధరణిపైఁ బడనేసి తగ నన్ను గెలిచె.
సమరంబులో నేఁడు చంపక యున్నఁ । బ్రమదంబుతో నాకు బ్రతికుండరాదు."
అనవుడు వేడ్కతో యమతనూజాతుఁ । గనుఁగొని పల్కె నాఖండలాత్మజుఁడు :
"నుతగతి నేఁడు కర్ణుని బడవైతుఁ । బ్రతిమీఱఁ దప్ప నీపాదంబులాన."
అనుచుఁ గృష్ణునిఁజూచి "యనఘాత్మ, నీవు । మనసునఁ గర్ణుండు మహిఁ గూలవలయు
నని తేరుగడలింపు మాలోన వానిఁ । గినిసి చంపెద నీదు కృపపేర్మి." ననుచు,
నరదంబునందున్న హరులకు నంత । గరిమతో జలపాన ఖాద్యఖాణములఁ
బరితృప్తి గావించి పాండవాగ్రజుని । గరమొప్ప వీడ్కొని కదలి రవ్వేళ.
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గథచెల్లె నెఱిఁగింపు మనిన
పద్మపత్రాక్ష, శ్రీపతి, వాసుదేవ, । పద్మసంభవ ముని ప్రస్తూయమాన,
నాదామృతాస్వాదన ప్రభాకార, । వేద వేదాంతప్రవేద్య స్వరూప,
ఘనమాని హృద్గేహ కలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన, భుక్తి । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పాన ద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమై కర్ణపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొప్పె నాలవది.

# పంచమాశ్వాసము



శ్రీ గరుడాద్రీశ, సృష్టిప్రకాశ, । ఆగమవినుత, శ్రీ హరి, జగన్నాథ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె :
ఆరీతి నృపునిచే ననుమతి వడసి । [1] బోరన రథమెక్కి పురుహూతసుతుఁడు
భేరీ మృదంగ గంభీర నాదములు । [2] బోరుకొనంగ వార్పులు మిన్నుముట్టఁ
దురగ మదేభ సందోహంబు నడవఁ । బోరిపోరి రణరంగ భూమి కేతెంచి
యుభయ బలంబుల నుగ్గించెఁ బేర్చి । త్రిభువనంబులు భీతిఁ దేమలంగ; నంత
ధీరులై వీరులై ధీవరస్తుత్యు । సారులై భీమసంచారులై పోరి
కరికరిఁ గదియించి ఘనత దీపించి, । హరి హరిఁ దాఁకించి యసి వ్రేసి వ్రేసి,
తేరు తేరొత్తించి దృఢలీలఁ బెనఁగి, । వీర భటాళితో వీరభటాళి
తలపడి దేవతాతతి బెగ్గడిల్ల । బలువిడి శస్త్రాస్త్ర పంక్తులచేతఁ
బొడువఁడను మాటయుఁ బోకుఁడన్ మాట । విడువఁడను మాటయు వేయుఁడన్ మాట
చంపుఁడన్ మాటయుఁ జదుముఁడన్ మాట । నొంపుఁడన్ మాటయు నుతశక్తి గలిగి
యందందు నన్యోన్యహతులఁ జెన్నొందె । నందఱి కయ్యమో జననాథచంద్ర !
అంత రాధేయుండు సాహసోత్సాహ । మెంతయుఁ దనయందు నేపుమీఱంగఁ
బ్రలయ కాలోత్తాల భైరవాకార । విలసిత నిర్ఘోష విపులాట్టహాస
విక్రమక్రమములు విలసిల్ల శల్యు । నాక్రమంబునఁ జూచి యనువొప్పఁ బలికె :
" శల్య, నన్నిటఁ జూడు సకలలోకములు । లౌల్యవర్తనల డొల్లంగ నే నేచి
కౌంతేయ కులమెల్ల ఖండించివైచి । వింత భీష్మాదుల వెసఁ జంపినట్టి
పగయణంగించి చూపట్టి నాస్వామి । చిగురు మనంబు రంజిల్లఁ జేసెదను.
సారథ్యమునకు వేసరక నారథము । శూరపుంగవ, నీవు సొంపారనడుపు."
అనవుడు శల్యుఁడిట్లనియె: "రాధేయ, । వినుము నీమాటలు విడువలేవైతి.
అర్జునాదుల గెల్వనకట ! నీతరమె? । నిర్జరాధిపునైన నిర్జింతు రాజి;
నెప్పటిమాటలే యిది నీస్వభావ । మొప్పారఁగాఁ గ్రొత్తయొకటియు లేదు.

1. భోరన. 2. భోరుకొనంగ (మూ)

నతి నరనారాయణుల గెలువంగ । క్షితిలోన వశమె! యిస్సీ మానవైతి;
నీవు గానఁగలేవు నీతిమార్గంబు ; । కావరంబున వారి గడవనాడకుము."
అన విని కర్ణుఁ డుగ్రాకారుఁడగుచు : । "నను జెప్ప శల్య, విన్నాఁడవా లేదా!
నాబాణమహిమ లెన్నఁడుఁ జూపఁగాక. । ఆ బాణవైరియు నర్జునుఁడెంత!
సప్తాంబురాశులు సప్తశైలములు । సప్తలోకంబులు సంచలింపంగఁ
ద్రుంతు నొంతు వధింతు ధూర్జటి వచ్చి । వింతగాఁగాచిన విడువ నీయాన."
నావుడు శల్యుఁ "డన్నరునకోడంగ । భావించి యేని చూపఁగఁ జూతుఁగాక ;
ఎందుఁబోయెద ? విప్పుడేల త్రుళ్లెదవు ? । పంద, నీకేటికి బహుభాషణములు ?"
అనుచు నవ్వుచు నవ్వుడరదంబు గడప । ననఘుఁడా రాధేయుఁ డతిశౌర్యమహిమ
సేనలఁ బురికొల్ప సేన లప్పాండు । సేనలతోఁ దాఁకి సేనగాఁబోరి
జర్జరితాంగులై చలము దీపింప । నిర్జించి గర్జించి నిబిడహుంకృతుల
నతిరథ సమరథులట మహారథులు । ధృతి నర్ధరథులు నుద్రేకించి తాఁకి
బవరంబు సేయ నప్పాటఁ గౌరవుఁడు । వివిధభంగులఁ బోరె వినుము భూనాథ!

## దుశ్శాసనుఁడు భీమునితోఁబోరి మడియుట

అంత దుశ్శాసనుఁ డాత్మలోపలను । జింతించి "యిట్లుండఁ జెల్లునె నాకు!
నాహవక్షేత్రంబునందుఁ బాండవుల । నాహేమగిరిచాపుఁ డర్థి మెచ్చంగఁ
ద్రుంతుఁ గలంతుఁ దుత్తుమురు గావింతుఁ । బంతంబుతో" నని పావనిఁ దాఁకె,
కరికరి గిరిగిరి గ్రహము గ్రహంబు । నరయ సింహంబు సింహముఁ దాఁకినట్లు.
భీముండు ప్రళయాంత భీమునిభంగి । భీమాహవక్షోణిఁ బేర్చి యుప్పొంగె.
ఉదయాపరాద్రుల నొక్కట నూర్యు । లుదయించునట్లు వారొక్కటఁ బేర్చి
రథములు గదియించి రణభీకరముగఁ । బృథుతరాస్త్రముల నిర్భేదించి చొచ్చి
బవరంబు చేసిరి ప్రావీణ్యమెసఁగ । దివి నొడ్డగిలి సురల్ దృష్టించి చూడ.
దుశ్శాసనునితోడఁ దొడరి భీముండు । నిశ్శంకఁ బలికెను నిఖిలంబు నెఱుఁగ :
"ఓరి దుశ్శాసన, యుద్ధమధ్యమునఁ । బాఱక జారక బంటవై నిలుము.
ప్రాణంబు తీపుగాఁ బాఱితివేని । క్షోణి నేలోకము చొచ్చెద విపుడు ?
ఉత్తమసాధ్వి మాయువిద ద్రౌపదిని । నెత్తమాడినవేళ నీ చేసినట్టి
నీతకు నే నాఁడుసేయు ప్రతిజ్ఞ । యూఁతగా నినుబట్టి యసురు తోడుతను

కిన్నర గంధర్వ ఖేచరుల్ చూడ । మన్నన మీవారు మావారుఁ జూడ
నుదరంబు చించి నీయుదుటురక్తంబు । నెదతృప్తి తీఱంగ నేఁ ద్రాఁగువాఁడ.
ఆసతి నీడ్చిన యాఫలం బిపుడు । చేసేతఁ గుడిపెదఁ జెలువారఁజూడు.
అప్పుడు బ్రహ్మదు లా యమసూతి । యొప్పఁ బ్రార్థించిన నొగి నిన్నువిడువ.
చుట్టాలఁ బక్కాలఁ జూచిరా పోయి । ధట్టించి నీయాత్మ దైవంబుఁ దలఁపు.
మీయన్న మోమును మీవారి మోము । నోయన్న, చూచిరా ; యొగి నిటమీఁద
నీవున్నచోటికి నీవారినెల్ల । వేవేగ ననిపి నీ వెక్కచెల్లింతు."
అనిన దుశ్శాసనుఁ డతని కిట్లనియె : । "వినుభీమ, యిదియేల విఱ్ఱవీఁగెదవు ?
ఎడమచేయి కుడిచేయి నెఱుఁగనియట్టి । బడుగుల నీవంటి పందలఁబట్టి
చంపితినని మహా చటులగర్వమున । నింపారెదవు ; నిన్న యినజునిచేత
నేపాటు పడితివో యెఱుఁగవా మదిని ! । ఏపార సిగ్గులేకేల త్రుళ్లెదవు ?
అదిగాక నీపుత్త్రుఁడగు ఘటోత్కచునిఁ । బొదివి చంపఁగనెందుఁ బోయితి చెపుమ ?
వట్టిబీరంబులు వలదు నాయెదుట ; । పొట్ట క్రొవ్వులు మానిపో నిన్నుజంప.
వెలయంగ వెనుకను విరటునియింటఁ । బులిగండ వెట్టుగబ్బును నుబ్బఁ జెఱుతు.
విడక మాసభలోన వెస భంగపెట్టఁ । బడి మఱచితె మిమ్ముఁ బఱచినపాటు ?
కడఁకతో సంధులు గట్టించి గంగఁ । బడ నీళ్ళఁ ద్రోయించి పటుభీతినించి
విషధరంబుల నోలి వేఁడిమిచూపి । విషభోజనంబులు వేడ్కఁ బెట్టించి
చెనసి లక్కింటను జిచ్చువెట్టించి । వినమిగా శకునిచే వెడఁద జూదమున
సిరియెల్లఁ జేకొని సృష్టికిఁ బాపి । వెరవున నడవికి వెళ్ళఁ గొట్టితిమి.
అందుఁ బెక్కాపద లనుభవించితిరి ; । [1]అందఱునట వీడి యజ్ఞాతచరిత
విరటుప్రోలికిఁ జని వేఱుమార్గమున । నరుదారఁ జరియింప నడ్డపెట్టితిమి.
ఎనయ మీయిడుమల నెఱుఁగరా మీరు ! । అనికి వచ్చినచోట ననసేలమిమ్ము !
మానహీనంబైన మనికి యేమనికి ! । మానవోత్తములకు మహి విచారింప.
ఎఱిఁగినవారికి నిదియపో కొఱఁత ; । ఎఱుఁగనివారి మిమ్మేమందు నిపుడు !
మాటిమాటికిఁ బెక్కుమాట లేమిటికి ! । పాటిగా మగఁటిమి పాటింతుగాక."
అని తనకన్నుల నపుడు కెంపెసఁగఁ । గని కరువలిసూతిఁ గడఁకతో డాసి
భల్లంబు వఱపి యప్పావనిచేతి । విల్లు రెండుగఁ జేసి వెసనార్చె నధిప !

1. అందులో నటఁజని యాఘాతచరితు (మా).

ఆర్చిన భీముఁ డమ్మ్యెడ (?) నొక్కవిల్లు । పేర్చి మహోగ్రతఁ బెంపారఁ బట్టి
యాతని కోదండ మవలీల విఱిచి । యాతతాస్త్రంబుల నడరంట నేసె.
ఏసినఁ గోపించి యెలమి నీసుతుఁడు । దాసి తానొక్క కోదండంబు దాల్చి
భీము వక్షస్థలి బీటలు వాఱ । [1]నామెయి నొక భీషణాస్త్రంబు నేసి
రథచిత్రగతుల ధరాధూళిచేతఁ । బృథివి నాకాశంబుఁ బెంపారఁ గప్పె.
మఱియును బంద్రెండు మార్గణంబులను । దరలక సారథి దర్పమణంచి
యడియాలమును భీకరాస్త్రచయంబు । తొడిఁబడఁగా నాఱుతూపుల నాటి
ముప్పది కోలలు మునుకొని మేనఁ । గప్పినఁ, గోపించి కరువలిసుతుఁడు
అడవి లోకంబెల్ల హాతముగా మండి । పడి యాడుగఱచుచుఁ బావకాకృతిని
గడఁగి యేఁబదియాఱు కాండసంతతులు । తొడిగి యా యువరాజుఁ దొడరి నొప్పించె
నొప్పించుటయు భీము నలివేఁడికోల । [2]లుప్పన బట్టలై యుంచునశ్లేసె.
ఏసిన నాభీముఁ డేపుదీపించి । గాసిల్లి వీనితోఁ గలహమేలనుచు
రథము దిగ్గనడిగ్గి రాజేంద్ర, యపుడు । ప్రథనోగ్రమగు గదపట్టి వేవచ్చి
యతనిసారథిఁ జంపి యశ్వరత్నములు । వితత చూర్ణములఁ గావించి రథంబు
పెడచేతఁగొని కొట్టి పెకలించి పాఱ । విడిచిన, నదివోయి వెస ధూళి గ్రుంగె
అపుడేమిచెప్ప నీ యాత్మసంభవుఁడు । అపరిమిత ప్రౌఢి నర్థి నుప్పొంగి
మొగిమూఁడు తోమరంబులు త్రిప్పుకొనుచు । మగఁటిమి భీముపై మార్కొని పొడిచె.
పొడిచినఁ గోపించి "[3]పోట్ల నీపోటు । పొడిచి నీకెక్కడఁ బోవచ్చు !" ననుచుఁ
గొట్టిన దొకకొట్టు, కొట్టుతో మూఁడు । గట్టి తోమరములు గనియలై రాలె
రాలిన నాయువరాజు కోపించి । ప్రాలుమాలక మేలు [4]పట్టుగా వునను
పలకయు వాలునుబట్టి రణోర్విఁ । [5]దలఁగి తెక్కలుగల తార్క్ష్యవిభంగి
నుప్పరంబెగసి [6]తా నుడుకురక్తంబు । చిప్పిల్లఁగా భీమసేనుని వ్రేసె.
వ్రేసిన నదితప్పి వెంటనె యెగసి । యా సమీరాత్మజుఁ డా వాలుపలక
చూర్ణంబులుగఁ జేయ శూలమునుంకించి । ఘూర్ణాయమానుఁడై కోపించి పొడిచె.
పొడిచిన నదియు నుప్పొంగి రాఁదిగిచి । కడికండలుగఁజేసి గద గదియించి
యతని శిరోమధ్యమడఁచిన, మూర్ఛ । వితతాంగుఁడై కాళ్లు విలవిలఁ బోవ

1. రామణీయక. 2. ఉప్పెనపిట్టలై 3. పొట్లనిపోటు. 4. పట్టి 5. తలఁకి. 6. రానొలుకు రథంబు. (మూ).

ధరమీఁదఁ [1]బడినయా నీతనయునిఁ; జూపిమీఁద । బిరబిరఁ బడిపచ్చి పిడుగుచందమునఁ
బోనరంగఁ బులి లేటిఁ బొదివినకరణిఁ । గినిసి యేనుఁగుఁ బట్టు కేసరిపగిదిఁ
బరఁగ దుశ్శాసనుఁ బట్టి వేఁద్రొక్కి । విరవిరమని గ్రుడ్లు వెలికుఱుకంగ
నుఱిమి చూచుచు వాని యురముపై నెక్కి । యుఱుముఱిమినభంగి సుఱుసగర్జనముల
నక్కుమారుని జూచి యనిలనందనుఁడు । ఎక్కుడౌ మదమున నెలుఁగు రాల్పడఁగ:
"మను సభలోపల మదితఁ బాంచాలిఁ । గనుఁగొన్న పాపపుఁ గన్నులే? " యనుచుఁ
"కులకాంత ద్రౌపదిఁ గోరి దూషించు । నులివెచ్చమాటల నోరెద్ది?" యనుచు
"సరవి నందఱుఁ జూడ సతియనీడ్వఁగఁ । గరమర్థిఁ బోయిన కాళ్ళేవి?" యనుచుఁ
"జేచాఁచి యాయింతి చీరలు దోఁచు । నాచేతులేవియేఁట? యిప్పి" యనుచుఁ
"గలకాలమెల్లను గానివర్తనల । మెలఁగివర్తించు నీ మేనెద్ది?" యనుచు
"మీయన్న రారాజు మీ కర్ణశకుని । లోయన్న, యెక్కడ నున్నవా?" రనుచు
లీలఁ గేలునఁ గేలు లేనెత్తి త్రోచు; । నేలపైఁ బడవైచు; నిక్కుకుప్పించు;
ముఖవీధి వడిమీఱ మోఁకాల నూఁదు; । నఖిలదిక్కులఁ జూచు నగ్నియైమండు;
ఊఱుము, మోఁచేతుల నోడుగాఁ [2]బొడుచుఁ; । బిఱువీకు గావించుఁ బెడపిడ నార్చు;
మనబలంబులఁ జూచి మఱి తనవారిఁ । గనుఁగొని "యిందందుఁ గలఁడొకో బంటు!
విడిపింపఁ గలరేని విడిపింపుఁ డితని; । విడువక ప్రాణముల్ విడిపింతు" ననుచుఁ,
గనకకశిపుఁ బట్టి కదనోర్వియందుఁ । జెనసి ఖండించు నృసింహుని పగిది,
నంతకాసురుఁ బట్టి యదటణఁగించు । బంధురాకృతి గల పరమేశు కరణిఁ
బాయుచు డాయుచు బాహార్గళముల । వ్రేయుచు రాయుచు వెస నహో యనుచు,
అప్పుడు మాపీటి యతిరథులెల్లఁ । దప్పక కనుఁగొని తడయక యతని
తేజోవిశేషంబు దృష్టింపరాక । రాజును రథికులు రాజనందనులు
గరుడకిన్నర యక్ష గంధర్వవరులు । నరసిద్ధసాధ్యులు నాకనాయకులు
మిక్కుటముగఁ గనుల్ మిఱుమిట్లు గొనఁగ । వెక్కసమై యంత వెఱచి చూడంగ,
ననిలజుఁడట్లు విహారంబు సలిపి । యనియె నాయువరాజు కల్లన నగుచు:

---

1. బడిన నీ తనయునిమీఁద. 2. పొడుచు. (మూ).

భీముఁడు దుశ్శాసను వక్షముచీల్చి రక్తపానము సేయుట

" అన్న, దుశ్శాసన, యకట దుర్మదము । నిన్నింతచేసె దుర్నీతి పెంపునను,
నీవుర (?) మిటువ్రచ్చి నెత్తురు నేను । ద్రావెదఁ దేనియ ద్రావు చందమున.
ఆశచీవల్లభుఁ డమృతపానంబు । చేసిన విధమునఁ జేతునా యేను ?
పగటున నీరక్తపానంబు చేసి । [1]నగుటుచర్మంబు కుచ్చెలి గంతచేసి
పొసఁగు నెమ్ములు సంకుపూసలు చేసి । యొసఁగు నాగద లాత నొప్పుగాఁజేసి(?)
మహిమ నీగ్రుడ్లు కామాక్షులుచేసి । సహితభూతప్రేత శాకినీ గణము
లరయంగఁ గరతాళమనువుగాఁ జేయ, । గరిమఁ గిన్నరకాయగాఁగ మస్తకము,
నొఱపుగా వెన్నెమ్ము నొళవుగాఁజేసి । తఱిమి నీనరములఁ దంత్రులుగూర్చి
యానంద మెసఁగ మాయన్న ధర్మజుఁడు । మానక చూడంగ మహిమ సోలుచును
వీణచుఁ బాడుచు వెసఁ దాళగతుల । కాడుచుఁ జొక్కుచు నాజిఁ [2]ద్రొక్కుచును
దాండవాడంబ రోద్దండ ప్రచండ । పాండిత్య మెసఁగ విస్ఫారసంకల్ప
సిద్ధ ప్రసిద్ధ సంసిద్ధుండు భీమ । సిద్ధాహ్వయుండని సిద్ధగుహ్యకులు
కలగొని కొనియాడఁగా నీకు దిక్కు । గలిగిన విడిపింపఁగలబంటుఁ గనెద.
కలరేని యీ కురుగణములోపలను । ఎలమి మీవారికి నెఱిఁగింపు మీవు."
అనిపల్కి పెలుచఁ దా నడిదంబు పెఱికి । యనయంబు దిక్కుల నదరులు చెదర
భూ నభోభాగ దిగ్భువనంబులెల్లఁ । బూని కంపింప నంభోధులు కలఁగ
భారతవీరులు భయమంది చూడ, । నారాయణుఁడు మహానటనఁ గీర్తింప,
నట వాని మోమును నదరంటఁద్రొక్కి । కటకటఁబడి వాని కాళ్లనుద్రొక్కి
గుండెపట్టటు గాఁడఁ గుదికిలఁబొడిచి । దండిమీఱఁగఁ జించి తగడొక్కలోని
ముదురైన రక్త మిమ్ముల దోయిలించి । కదిసి తృప్తిగఁద్రావి కడఁకఁ ద్రేన్చుచును
మెచ్చుచుఁ దలయూఁచి మేలుమేలనుచు । గ్రుచ్చుచు వ్రచ్చుచు గుఱి నహా యనుచు
నిఖిలేశ, యప్పు డన్నిచురక్తంబు । ముఖమునఁ జమురుక మొనలటుచూడ
గరిమ భయంకరాకారుఁడై పేర్చి । యిరవొప్పఁగా భీముఁ డిట్లని పలికె :
" తల్లిచన్నులపాలు ద్రావనె మున్ను ! । కొల్లగాఁ బలు తేనె గ్రోలనె మున్ను !
కండచక్కెర పాలుఁ గలవము చేసి । చెండి త్రావనె యింత చవిగాదు గాక(?) "

1. నగరు. 2. నొక్కుచును. (మూ).

అనిపల్కి క్రమ్మఱ ననిలనందనుఁడు । మన మొనమీఁదను మదమునఁ గవిసి
గద చేతఁగొని లయకాలుండు కడిమిఁ । గదిసెనో యన్నట్లు ఘనకళేబరము
నిమ్ములఁ బల్పట్టి యీడిచి వైచి । కిమ్ములనిట్లనుఁ గిమ్మీరవైరి :
" ఓ వీరవరులార ! యువరాజు మమ్ముఁ । జేవమైఁ జేసిన చేఁతకు నిట్లు
చేసితి ; దీని కేస్పృష్టిశుఁడైన । వాసిగల్గిన వచ్చి వడిఁదాఁకుఁ డిపుడు.
మోసపోయితినని మొఱఁగంగ వలదు ; । భాసిల్లు మీఁయందుఁ బరఁగ మాయందు
వీరుఁడు గలఁడేని వెస నన్నునోర్చి । వీరిఁడి నీతని విడిపింపఁ గలఁడె ?
నెట్టన మాను వీఁడు నీళ్లుద్రావించి । పెట్టనిపాటులఁ బెట్టి నిండియును
బలు మహామృగముల పాలుగాఁ జేసి । సొలవక చెలులును జుట్టాలుఁజూడఁ
దిట్టుపాటునకోర్చి తివిరి పాంచాలి । కట్టిన చీరలు కడఁకతో నొలిచె.
గెలువరే జూదంపుఁగ్రీడ నందఱును ! । గెలిచిన నిటువలె గెలువరు గాక.
ఏమియు ననసేల యిటు నాప్రతిజ్ఞ । వామిగాఁ దీర్చితి వచ్చెనాపగయు. "
అనియని భీముఁ డిట్లాడువాక్యములు । విని సహింపక క్రీడి విష్ణునిఁజూచి :
" దేవదేవ, చూచితే ! యుగ్రుఁడై భీముఁ । డాదెస నుభయ సైన్యంబులలోన
వెస బంటు గలిగిన విడిపింపుఁడనుచు । నెసఁగ నే వినవాడె నీఁకనాకుఁ బోదు.
ఎక్కడ శూరత్వ మిటఁజాలుఁ జాలు । నిక్కడ [1] నేనుంట యెఱుఁగఁడో మొదల !
కాలకేయ నివాత కవచులఁ బట్టి । తోలనా ! సైంధవుఁద్రుంపనా ! హరుని
వెసఁబట్టి నేలతో వ్రేయనా ! యగ్ని । కసలార ఖాండవంబాహుతి యీనె !
అఱిమఱిఁ గురుబలం బాహుతి గొనని ! । ఎటఁ గెటఁ గాడిన నేమందు నతని !
ఇప్పుడేమిటఁ దప్పె ; నీమాత్రమునకు । నొప్పన చెప్పుకోనోపనా యేను !
కదనోర్వి నీరీతి గర్వించినతని । యుదుటణంచెద నన్నునొగిఁజూడు. " మనుచుఁ
గన్నుల నిప్పులుగ్రమ్మంగ భీమ । ణోన్నత గాండీవ మొప్పు సారించి
కదియుచోఁ, గృష్ణుండు గాండీవిఁజూచి, । " ఇది వేళగాదు నీకీయాజియందు
నిప్పుడేమనవచ్చు నీ భీమసేను ; । అప్పురాంతకుఁబోలె నర్థినున్నాఁడు ;
బ్రహ్మాదులకునైనఁ బరికింపరాదు ; । బ్రహ్మాండభాండముల్ వడఁద్రోచు నిపుడు.
నీవనఁగా నెంత ! నేనన నెంత ! । దేవవిమలాత్మక, యుడుగు సాహసము. "
అనిన నర్జునుఁడు మహాప్రసాదంబు ; । అనఘాత్మ, నీమాట లడ్డంగవెఱతు ;

1. నన్నాట. (మూ)

కాక తానీమాట కడునాడఁ దగదు; । పోక వేఱొకఁడైనఁ బోనేలయిత్తు?
ఈతనిపై గోపమిటఁ జూఁడుమనన్న । నీతఁడే కర్ణుని నిటఁజంపువాఁడు."

## కర్ణార్జును లొండొరులపై దివ్యబాణములఁ బ్రయోగించుట

అనుచుఁ గోపాటోప మారంభిల్లఁగఁ । బనుగొనఁ గౌరవబలములమీఁదఁ
[1] బడపడి యాగ్నేయ బాణమేయుటయు, । నది మహా [2] ధ్వనులచే నాకసంబ్రువఁ
బదిదిక్కులను మంట ప్రజ్వరిల్లఁగను । బెదరి సేనలు కకావికలుగాఁ బాఱ
నంతకు కోపాగ్ని యడరిన క్రీయను । బొంతబలంబుఁ గాల్చుచు రాఁగఁజూచి(?)
యారసంబునఁ గర్ణుఁడింత నైకొనక । వారు ణాస్త్రంబేసి వారించె దాని.
ఫల్గునుండును దమోబాణమేయుటయుఁ । గల్గునంతయు నంధకారంబు గప్పె.
కప్పినఁజూచి యా కర్ణుఁడుప్పొంగి । 'యిప్పుడు నేరనా యిటదీని!' కనుచు
సౌరాస్త్ర మస్త్రోళ నంధించి యేయ । భూరితమంబు గొబ్బున విచ్చిపోయె.
అర్జునుండంత మహాప్రతాపమున । నిర్జరులటఁ దన్ను నింగిఁ గీర్తింప
నైంద్రాస్త్ర మెంతయు నార్చుచుఁ దొడిగి । సాంద్రదీధితుల నుజ్జ్వలత నర్కజుని
నేసిన, దైత్యాస్త్రమేసి యుక్కణఁచి । భాసుర శైలాస్త్రపటలి యేయుటయు,
నదిగని గాండీవి యపుడు వజ్రాస్త్ర । మొదవంగ నేసి యా యుదుటణఁగించె.
ఈ రీతి నిద్దఱు నిల భువనైక । వీరులై ధీరులై వెనఁబోరుచోటఁ
బవనతనూజుఁ డప్పార్థునిఁ జూచి, । "దివిజేంద్రతనయ, రాధేయుండు నిన్ను
గ్రుక్కక యెదిరించి చోద్యంబు గాఁగఁ । జిక్కనై యనిమొనఁ జెలఁగుచున్నాఁడు.
వానిని బటుశరవ్రాతంబుచేతఁ । బూని ఖండవిఖండములుగాఁగఁ జేసి
కౌరవు లాత్మలఁగనలి శోకింప । ఘోరాజిఁ బడవైచి గూల్తువుగాక."
అని భీముఁడాడిన యగ్గాటలెల్ల । విని వనజాక్షుఁ డా విజయ్యునకనియె:
"నీ దివ్యబాణంబు లిట నిదియేమి । యేదియుఁగాకుండ నిటు గతిదప్పె?
ఒకటియుఁ గాఁడకయున్నది లేదు । ఎకసక్కెముగ నిది యేమిచోద్యంబొ!
వానిబాణములెల్ల నడి నిన్ను నన్ను । [3] బూని పట్టుక దూఱి [4] పోవుచున్నవియు.
ఎనయఁ గర్ణునిజూచి యిలయెల్లఁ బొగడఁ । గని కౌరవులు మించఁ గారణంబేమి?

---

1. పనిపడి. 2. జ్వాలల. 3. పాని. 4. పాఱు. (మూ)

కదిసి యిన్నాళ్లును ఘనయోధవరులు । ఎదురెదురై తొలఁగుచుండుటఁగాదో! యెఱిఁగి
యెఱిఁగియు నెఱుఁగవో! యిదియునుగాక । వెరవుదప్పెనో! లేక వెఱ్ఱివయ్యితివో!
తగుబాణములశక్తి దాఁగెనో నీకు! । మగఁటిమి తొలఁగెనో! మఱచితో నిన్ను!
ఎనయఁ దామసమేల యినజుని జంప." । అనవుడు క్రీడి బ్రహ్మాస్త్రంబు దొడిగి
తెగఁగొని యేసిన, దిశలు కంపింప । జగములు వణఁకంగ [1] జనులెల్ల బెగడఁ
బఱితేరఁ గని దాని భానునందనుఁడు । వెఱవక కద్దానసే వికలంబు చేసె.
చేసి యంతటఁబోక శితనారసముల । నేసి కృష్ణుని నరు నెమ్ము నొప్పించె.
నరుఁడును శల్యుని నలినాప్తసుతుని । సరసతిఁ దొమ్మిదిశరముల నొంచె.
ఆరూఢిఁ గర్ణుఁడయ్యర్జును వింటి । నారి ఖండించెఁ గిన్నరులు కీర్తింప.
క్రూరుఁడై నరుఁ డొండు గొనయ మెక్కించి । దారుణాస్త్రముల నత్తపనజుచేతి
విలు గాఁడ నేసిన వీఁగక యతఁడు । బలు నారసముల సవ్యాష్ఠు నొప్పించె.
నరుఁడును బలిమి నన్నలినాప్తసుతుని । కరమునన్న విల్ ఖండించి యార్వ
మేలుమేలని మెచ్చి మిహిరతనూజుఁ । డాలోన నొక్కవిల్లంది తోడ్తోన
శ్రీకృష్ణుఁడున్న యంచితరథంబపుడు । దాఁకొని క్రోశమాత్రము వీఁగనేయ
'బాపురే రాధేయ! బాపురే!' యనుచు । శ్రీపతి పలికిన, జిష్ణుండు కనలి
కర్ణుని రథ మంతఁ గడు యోజనంబు । తూర్ణవైఖరిఁ బోవఁ దూఱనేయుటయుఁ,
గర్ణుఁడు ముందటిగతిఁ బాఱనేయ । వర్ణించి కృష్ణుఁడు వడి మెచ్చిపొగడఁ
గన్నులఁ గెంపార గాండీవియపుడు । వెన్నునిఁ గనుఁగొని వెఱవకిట్లనియె :
"తప్పక యిదియేమి దైత్యారి, నీవు । నెప్పుడు మానవైతివి వెఱ్ఱితనము.
ఏను యోజనమేయ నిట వాఁడు క్రోశ । మాన మాత్రంబేయ మహిమ మెచ్చెదవు.
మెచ్చిన నన్నేపో మెచ్చంగవలయు; । మచ్చికగలవని మది నమ్మియుంటి;
మంచి చుట్టమవౌదు మము భంగపెట్టి । మించి మాపగవాని మెఱయఁ జేసెదవు.
డాఁకొన్న కపటనాటక సూత్రధారి । వేకడఁ బక్షమో యెఱుఁగమునిన్ను.
ధారుణి ముచ్చుచేఁ దాడిచ్చి యుంటి । వారిని లేవు నా స్వామివిగావె!"
అని దూఱిపలికిన నాత్మలో నవ్వి : । "విను నీకు నాకును వేఱులేదెందు ;
కర్ణుని శరలాఘ(?) కరలాఘవములు । నిర్ణయించితిఁ గాని నిన్నేలమఱతు!
పౌనరంగ ఘనుఁడుగావున వాని నేను । గొనకొని పొగడితిఁ గోపగింపకుము.

1. దిక్చక్రంబు, (మూ)

పరఁగ నామేనిలోపల జంతుతతులు । ధరణియు నదులును దరణి చంద్రుండు
పూని చరాచరంబులు సముద్రములు । దానవాదులు దేవతా సమూహములుఁ
జుక్క లంబరమును క్షోణీధరములు । నక్కజమైన బ్రహ్మాండభాండములు
నుండుట నన్ను నేయుట దొడ్డుగాక । యొండొండ నొకని నేయుట యేమిదొడ్డు!
అటుగాన నీవింక నాలస్యముడిగి । చటుల బాణముల జర్జరితునిఁజేయు. ”

## కర్ణుఁ డర్జునుపై సర్పశరముఖంబేయుట

మని చెప్పినంతలో నశ్వసేనాఖ్యుఁ । డనుపాము క్రీడితో నలిగి యాకర్ణు
దొన నుండుదాని సంస్తుతి ధూపదీప । వినుత నైవేద్య సవిస్తరంబుగను
మనసునఁ బూజించి మార్తాండసుతుఁడు । కనుఁగవ కెంపారఁగాఁదీసి యపుడు
గరిమ నర్జునుకుత్తుకకు దాని మొనకు । సరుదుమీఁఱంగ లక్ష్యముఁచేసి నిలిచి
యార్చుచుఁ దొడిగి పెల్లార్చి పెంపేర్చి । కార్చిచ్చుకై వడిఁ గడుమంట లొలుకఁ
దెగనిండఁ దిగిచి యాదివిజులు మునులు । బెగడ లోకములతోఁ బృథివియల్లాడ
నేసిన, నదియును నిట్టట్టుపోక । గాసిల్ల విషము లొక్కటఁ బర్వుచుండఁ
గన్నుల భీషణోల్కలు మింటనంటఁ । [1] గ్రన్నన మణిమయ కాంతులతోడ
భుగభుగ నార్పులుఁ బొగలు వెల్వడల । మగఁటిమి వాటించి మహియునాకసముఁ
గాల్చుచు బలముల గరళ[2] జాలమునఁ । బీల్చుచు నేతేరఁ బీతాంబరుండు
వినఁగ శల్యుఁడు వల్కు వెసఁగర్ణుతోడ: । ... ... ... ...
“ అదియేమి బెగడితివర్కజ, నీవు! । కదనంబులోపలఁ గంపమేమిటికి!
దిటతప్పనో? కన్ను [3] తిరిగనో? యిట్టి । యటమటంబేటికి? నస్త్రమీవేళ
మెడకుఁ దొడుగఁగఁబోయి మెయిమెయినదిగొ।తొడకునఁదొడిగితి తుది నెగఁదొడుగు.”
అనినఁ గోపించి యా యర్కనందనుఁడు । కనుఁగవ నయ్యగ్నికణములు రాలఁ :
“ దప్పకచూడు మింతయుఁ గ్రీడిశిరము । నిప్పుడేఁ [4] గూల్చెద నేలపల్కెదవు? ”
అని చెప్పునంతలో నమ్మహాస్త్రంబు । చనుదేర శౌరియుఁ జయ్యననపుడు
చెలఁగి దీసికిఁ బ్రతిసేయుక యున్న । నలుక నర్జునుఁ జంపుసని నిశ్చయించి
మెడగుఱిగా వచ్చు మేరదప్పంగఁ । బుడమి నయ్యరదంబు పొలిఁగ్రుంగఁ ద్రొక్కె.

1. గ్రక్కున. 2. ఖీలమున. 3. విరిగనో. 4. గొల్చెద. (మూ)

త్రొక్కినంతనె మెడ త్రుంపంగవచ్చు । నక్కట నా పాపయమ్ము వేవేగ
నెట్టన దంభోళి నెఱి గిరిఁ దాఁకి । బెట్టుగా శిఖరంబు భేదించు భంగి
బహురత్న దీప్తుల భాసిల్లుచున్న । మహిత కిరీటంబు మహి మీఁద రాల్చె.
శౌరి యీరీతి నాశక్రజురథము । నారూఢగతిఁ గ్రుంగ నదిమినయపుడు
సురలు ఖేచరులును జూచి యత్తఱిని । మురహరుఁ బొగడిరి మోదంబుతోడ.
దేవదుందుభులెల్ల దివినుండి మ్రోయ । భూవర, కురిసెను బువ్వులవాన.
ఆరీతి నత్తెఱంగపుడేమి చెప్ప । సారసయోత్సాహ సంపదలీల
[1] తేజంబెడలి వింత తేజంబు నొంది । [2] రాజిల్ల నా పాండురాజనందనుఁడు
చని సత్కళాహీన శశియును బోలె । (వనమాలిఁ గని యంత వగరుచుఁ బలికె):
"మున్నగ్నిసాక్షిగా ముక్కంటి మెచ్చ । నెన్న ఖాండవము దహించెడునాఁడు
నా విక్రమక్రమోన్నతులకు మెచ్చి । చేవ దేవేంద్రుఁడిచ్చిన కిరీటంబు
పుడమిడొల్లఁగ నేసెఁ బొల్లగా నదియు. । కడసారివచ్చి యీ కర్ణునిఁజూడఁ
గాలానలోగ్ర సంకలిత ప్రతాప । కాలరుద్రుని గతిఁ గాంచియున్నాఁడు.
నేఁటికి మన తేరు నీరజనాభ, । పాటించి త్రిప్పు మీపాటి చాల్చాలు!
నీయుపేక్షను గాదె నే భంగపడితి! । కాయజజనక, నాకడిఁది రథంబు
కర్ణుని యెదుటఁ గ్రుంగఁగఁ ద్రొక్కఁదగునె! । వర్ణింప నాతలవ్రాఁత యిట్లుండె.
దీనికిఁ బ్రతిసేఁత తెగి సేయలేనె! । మానుగా నాబాణమహిమ లెన్నఁటికి?
దేవ, నాచేతి గాండీవ మెన్నఁటికి? । రావయ్య నీదు సారథ్య మెన్నఁటికి?
అక్షయతూణీర మదియు నెన్నఁటికి? । అక్షర ధర్మసహాయ మెన్నఁటికి?
కాలకేయాది రాక్షసులను గెలిచి । యీలీల నీశ్వరు నెక్కటి గెలిచి.
యంగారపర్ణుని నటమున్నె గెలిచి । ... ... ... ... ...
చిత్రసేనుని బట్టి శిథిలునిఁ జేసి । నేత్రోత్సవమ్ముగా నిఖిల కౌరవుల
నరవి భీష్మద్రోణ సైంధవప్రముఖ । చిరసోమదత్తులఁ జెనకి సాధించి,
కర్ణునిఁ బదిమార్లు కడుఁ బాఱఁగొట్టి । తూర్ణవైఖరి నాజిఁ దొడరునాబలిమి
యొనర బూడిదలోని హోమంబుచేసె । ఘనుఁడ, నారథముఁ గ్రుంగఁగఁ ద్రొక్కఁదగునె!
ఈ యవమాన మిట్లేల చేసితివి? । పాయక నాప్రతాపం బెన్నఁడింక?

1. తేజంబువెడ. 2. రాజమినా. (మూ)

నలినాక్ష, నీవని నమ్మినచోటఁ । గోలఁదిగాఁ బగవానిఁ గూడితి." యనిన
శ్రీకృష్ణుఁ డప్పుడా జిష్ణునిఁజూచి : । "యోక్రీడి, యిట్లాడ నుచితమె నీకు?
నన్నేలదూరెదు? నాఁడు ఖాండవము । నున్నతి నీవగ్ని కొప్పించు చోటఁ
బాముక్కటందుండి పాఱిపోఁజూచి । కామించి తల్లిఁ దోఁకను గఱిపించి
వినువీథికెగసిన, వెస నీవు దాని । తనరు పుచ్ఛముఁ ద్రుంపఁ దల్లితోనదియు
విను మగ్నిఁబడి కాల, వెసనదివోయి । మొనసి రాధేయుసమ్ముఖమున నిలిచి,
"జాడ నీకెన్నఁడు సంగరమబ్బు । నాఁడు నన్ దొడుగుము నాడెంబుగాఁగ.
అర్జును బట్టి నే నాహవక్షోణి । నిర్జించి భర్జించి నీపగదీర్తు.
నాపగ యెట్లన్న నాతల్లి నగ్ని । లోపలఁ జంపె ముల్లోకంబు లెఱుఁగ."
అనిచెప్పఁ బూజించి యప్పాఁపరమ్ముఁ । దనర నిగ్గాళ్లను దాచుక యుండె.
నీమీఁది కినుకమై నేఁ డమ్మహోగ్ర । మీమేర నెంతయు నిటఁ బ్రయోగించె.
చెలఁగి యవ్విధమునఁ జేయఁగాఁ గాక । పొలియింప కూరకే పోవునెయదియు!
ఇనుమాఱు లీబాణమేయంగ రాదు । ఎనయంగ నే నిశ్చయించితిఁ జుమ్ము.
అటుగాన మనమున నాందోళ ముడిగి । యటమీఁది రాచకార్యము చూచుకొనుము."
అనిచెప్పుచున్నంత [1] నమ్మోయిఁబాము । తనపూఁవు దప్పిన [2] దర్పించి యంత
గ్రక్కున మంటలు గ్రక్కుచు వచ్చి । యక్కడ నకర్ణు నప్పుడిట్లనియె :
"కొసర కివ్విధ మెఱుంగుదో లేదో నీవు । బిసరుహాక్షుండింత వెఱ పెట్టినాఁడు.
కొండమోపరి గొల్ల[3]కొమ్మల నలువ । దండీ ముచ్చిలు నట్టి తడఁబాటుకాఁడు;
బూమెలబయకాఁడు పూతనాదులను । దామెన కట్లుగా దండించు నతఁడు;
నాకులస్వామియే నలిఁదనకన్ను । లాకడ నైనట్టి యమ్మహాత్ముఁను
ఇట్టియెల్లారులు నెఱుఁగ [4] నేఁటేఁటఁ । బట్టుడి [5] దెఱుఁగంగఁ బడును గావునను
అపగఁజేసి తానటు చేసెఁగాక ; । యీ పాటి చేసెడి దెఱుఁగ లేనైతి.
ఎఱిఁగితే పాతాళ మిట మాదిగాదె! । ఎఱిఁగింప నంతఁ బోనిత్తురె వారు!
చలపాది యితఁ డెడనంగరమన్యోఁ । దలకొని తనవిధిఁ దాన పోయెడిని.
కావున నిపుడేమిగాదు రాధేయ! । అవిరించియు హరిహరులడ్డపడినఁ
దతభంగి నారసాతలము శీఘ్రమున । బ్రతిమాలి చొచ్చినఁ బాఱిపోయినను

---

1. నమ్మహాపాము. 2. తప్పించేతప్పి. 3. కొమ్మలిలువలు. 4. నేఁడింట. 5. దెరగ పడుచు గావున. (మూ)

జిష్ణుని బట్టి నేఁ జెనకి రౌద్రమునఁ । దృష్ణుచాయఁగ వానిఁ దివిజి ఖండింతు.
నీక నొకమాటు నీయిచ్చ నుప్పొంగి । తుకతుక యుడికి సత్తుగ నీమువింటఁ
దొడుగుము రాధేయ! తొడుగువేవేగఁ; । దొడిగినఁ బ్రదంతు నెందులకుఁ బోనీను."
అనవుడు రాధేయుఁడతని కిట్లనియె, । చనవునఁ దా సత్యసంధుండు గానఁ:
"దల్లితో నాడిన తగవు ప్రతిజ్ఞ । చెల్లింతుఁ గాక యేఁజెనఁటి మూర్ఖుఁడనె!
కయ్యంబులో భీముఁ గావనా నిన్న? । గయ్యాళి నకులునిఁ గావనా పట్టి?
వారిఁ గాచినరీతి వరుసనాక్రీడి । నారయఁ గాతుగా కటుగాక నేఁడు
మఱి దివ్య శస్త్రముల్ మహినెన్ని లేవు! । అఱిముఱి సాక్షినీవై చూచుచుండు.
కర్ణుఁడయ్యెడిఁ గాని కవ్వడయ్యెడిని । నిర్ణయంబిది గాని నే నేమి యెఱుఁగ."
అనుచోట శల్యుఁ డుగ్రాకారుఁ డగుచుఁ । గనలి రౌద్రంబునఁ గర్ణుకిట్లనియె:
"పనిలేని వట్టి దబ్బరలు మీవారు । పెనకువ వెన్నతోఁ బెట్టిరి నీకు.
సకల లోకారాధ్య చరణుఁడీశ్వరుఁడు । తకబిక పందికై తరమిడి తాఁకి
విలువిద్యఁ బోరాడ, వీఁకఁబోడాడి । శిలలు పల్మఱు ఱువ్వి చెలరేఁగి గ్రొవ్వి
విల్లుత్రిప్పుచుఁ బోయి వెసఁగొట్టి యతని । గుల్లల తిత్తిగాఁ గూలంగఁ ద్రోచి
మెట్టిపట్టుక శివుమెప్పించి యపుడు । గట్టించి పాశుపతంబు బొప్పఁబడసి
యింద్రలోకమునకు నేఁగి పెక్కన్ను । లింద్రునిచేఁ గాంచి యిల మించినట్టి
జిష్ణుని నీవె గెల్చెడివాఁడ వకట! । యుష్ణము లీమాటలుడుగ వెన్నఁటికి;
చేతగాఁబోదు; ఈ చెనఁటిమాటలకుఁ । గాతరంబున నోడికట్టితి." వనుచుఁ
గర్ణకఠోర వాక్యంబుల నపుడు । గర్ణుచిత్తము నీఱుగాఁ జేయుటయును
ఆ సూతసంభవుఁడలిగి యెంతయును । ఈసున శల్యుతో నిట్లని పలికె:
"ఏమిటికో శల్య, యింతేసిమాట? । లామేటి కానూటి నా కిరీటికిని
ఉడురాజధరుఁడోడె నోడె నటంచుఁ । గడిఁది సారెకుఁజెప్పి కాఱులాడెదవు.
అతఁడోడినట్టు లేనఁటె యోడువాఁడ! । జతనమై నాసాహసం బిదె చూడు."
మని పది యమ్ముల నచ్యుతు నేసి । యనిమిషేశ్వరపుత్త్రు నాఱింట నొంచి
మఱియును బైకైకొన మార్గణంబులను । అఱిముఱి నేసి కోయని యార్చుటయును,
అమరేంద్రసూనుండు నలిగి పైకైకొన । నమధిక శస్త్రముల్ చాలంగ నేసె.
ఏసినఁ గోపించి యినజుఁడవ్వేళ । భాసురంబైనట్టి బహుళశరంబులను
నరునిపైఁ గురిసిన నరుఁడవి ద్రుంచి । దొరకొని పదియేడు తూపుల నేసి

నెత్తురు పైనొల్క నిగిడి యార్చుటయు । నత్తుంగ తేజోమయుండు కర్ణుండు
వనచరధ్వజ మిరువది బాణములను । వెనుకొని కృష్ణుని విశిఖ వింశతిని
ఘనతర బాణాష్టకమున నర్జునుని । ననయంబు రెంకునేలమ్ముల రథము
ధవళవాహములపై దశవిశిఖములఁ । దివిరి లోకంబులు దిగులొందనేసె.
ఏసిన నవి ద్రుంచి యింద్రనందనుఁడు । భాసురకలిత వాక్ప్రౌఢి నిట్లనియె:
"వినుమురాధేయ, నీ విక్రమస్ఫురణ । గొనకొని కౌరవకులమెల్ల నెఱుఁగు.
రారాజు ఘోషయాత్రకు వచ్చియున్న । ఏకీతి విడిచడె నెఱుఁగవా నీవు?
వరుస ద్రౌపది స్వయంవరమున నీవు । నెఱయ నిన్నేలిన యేలికతోడ (?)
నేపాటు వడితివో యెఱుఁగవే యకట! । పాపాత్మ, నీకేటి బఁటుపంతంబు!
విరటుని ప్రోలున వెన నాలఁ బట్టి । చిరమతి [1]నీవేమిచేసితి నాఁడు?
నీయేలికయు నీవు నెఱయ దుర్బుద్ధి । నాయెఁ బొమ్మన్నట్టులగునె రణంబు!
రట్టడి మమ్ము ఘోరపు రణభూమి । నట్టు ద్రోచినయట్టులగునె రణంబు!
కపటజూదంబునఁ గలరాజ్యమెల్ల । నపహరించినయట్టులగునె రణంబు!
ఇంతి ద్రౌపదిఁ బట్టి యీడ్పించినట్టి । యంతరంగంబులట్లగునె రణంబు!
ఏపాటి రణమంచు నిట వచ్చినాఁడ । వేపోటుబంటవై యిపుడు రాధేయ!
నీవోడిపాఱిన నెలవు లెన్నెన్ని । వావిరి నెన్నఁ గోవలదె సూతజుఁడ!
ఉత్తమక్షత్రి కులోచితము నాకు । నెత్తెఱంగున నైన నీవీడు గావు.
అయ్యైనఁ గాని ఘోరాజిమధ్యమునఁ । జెయ్యార నీవు చేసిన చేఁతలకును
జంపకమాన నా శరపరంపరల; । తెంపునఁ [2]బాఱక ధీరత నిలుము."
అనవుడుఁ గర్ణుఁ "డహో! మేలు మేలు! । వెనుకొని నిన్ను నీవే పొగడితివి.
ఇతరులు గొనియాడ నెసఁగుట గాక । హితబుద్ధి నీకిది యిస్సిరో తగునె!
భువనైకధీరతఁ బొగడొంది నట్టి । రవిజుండ నన్ను నెఱుంగరా జనులు!
నీవేమి చెప్పెదు నిలునిలు." మనుచు । నావేళ భానుజుఁ డస్త్రాద్రిమీఁద
విలసిల్లు సూర్యుఁడువెలుఁగుచందమున । నెలమితోడుతఁ గర్ణుఁడెంతయు మించి
జలజల క్రీడపై శరవృష్టిగురిసి । పొలివోని కడిమిమైఁ బోరుచునుండి
పార్థుఁడెక్కిన తేరి బండి కండ్లపుడు । పార్థివ, నేలలోపలఁ గ్రుంగ నేసె.
ఏసిన మునికోల నిలఁ బాఱవైచి । యానరోజాక్షుఁడొయ్యన దిగ్గనఁ జేకి

1. నీవావు. 2. నాచార్య కథితనిలువు (మా)

యమృతంబు గొలకునై యఖిలదేవతలు । రమణ మందరము వారాశి వైవంగ
నాధారహీనమై యయ్యది గ్రుంగ । బోధించి యెత్తిన పుణ్యుండు గాన
నత్తేరు నేలలో నటు గ్రుంగిపోవ । నెత్తె గోవర్ధన మెత్తిన ఘనుడు.
ఆసమయంబున నర్కనందనుడు । మోసపోయితి విధి మొగి నింతచేసె ;
ధర్మంబులేని యధర్మ చిత్తులకు । ధర్మంబు ... ... ... ...
(పావనమూర్తి యా) పద్మనాభుండు । సావధానత వీరి సరస నుండంగ
గౌరవులకు నెద్ది ఘనరాజ్యలక్ష్మి! । ఊరక మానదు ఉడివోనియాస ;
భార్గవాస్త్రంబులపన తప్పె దొడంగె ; । దోర్గర్వ మెంతయుఁ దూలుచున్నదియు ;
మహి నాజి యర్జునుమయమైన దిపుడు;।అహహ యెక్కడఁ జొత్తునక్కటా !'' యనుచు
నున్నచో, రవిమండలోపరివీధి । నున్నతి యొకవాక్య మొగి వినఁబడియె :
"రాజకులాచార రక్షకుండైన । రాజన్యుఁడగు పాండురాజాగ్రమహిషి
కుంతికి నాయంశకును నీవు వొడమి । పంతపు సూతసంభవుఁడన మించి
యుత్తమ క్షత్రియకులోచితమైన । యుత్తమవంశంబు నొగిఁ జారఁబుచ్చి
కౌరవేశునకు నెక్కటి బంటువోలె । వారి సేవలు చేసి వడిఁ దిట్టు రట్టు
[1] గుడిచి యపఖ్యాతిఁ గుక్షి వేపించి । కొడిమె సత్కీర్తులకును బాసితీవు.
పగయును మైత్రియు బంధుకార్యంబుఁ । దగువారితోడఁ గదా చేయుటొప్పు.
ధర్మంబుతోడుగాఁ దనరినయట్టి । ధర్మజాతుని సహోదరులతోడుతను
బోరితి విన్నాళ్లుఁ బూరి నింకఁ జాలు । వారక నాలోన వసియింప రమ్మ. ''
అని పద్మబాంధవుఁ డానతిచ్చినను । విని కర్ణుఁడెంతయు విస్మయంబంది
యర్జును గెల్వ నయ్యెడఁ దనచావు(?) । నూర్జితంబుగఁ గని యుల్లంబులోన
'నట్టుదాఁ జెలసినట్లయ్యెడిఁ గాని । గట్టిగా నర్జును ఖండింతు' ననుచు
బ్రహ్మాస్త్రమప్పుడు పటుమార్గియందు । బ్రహ్మాదులదరఁ దప్పక కూర్చువేళ
కల్యుఁ "డహో యేల సంభ్రమించెద ! వ । తుల్య తేజుఁడు క్రీడి తొడర నీవళమె !
ఏయకు మేయకు మేసితివేని । పాయక సూతసంభవ, సిగ్గుగాదె!''
అనుచుఁ గర్ణకఠోరమగు మాటలాడ । ఘనత బ్రహ్మాస్త్ర మక్కర్ణుఁ డేసినను
అతఁడును బ్రహ్మాస్త్ర మున్గ్లేయుటయును । జతురత నవిరెండు శాంతంబులయ్యె.
అపుడు వాసవి ప్రళయాంతకు పగిది । నిపుణుఁ డాతని తేరు నెఱిఁ గ్రుంగనేసె ;

1. గుడిచియుఁ బ్ర. (మా)

ఏసినఁ గర్ణుండు నిలకున దాఁటి । వేసరినరుఁ జూచి వివశతఁ బలికె:
"ఇత్తేరి రథచక్రమిలఁ గ్రుంగఁబడియె ; । నెత్తెద నందాఁక నేయకయుండుఁ.
పౌరి రథస్థుండవై పోరెద వీవు ; । ఇరవేది భూమిపై నేనున్నవాఁడ.
ఈయెడఁ దగవుగాదిట్లేయుటయును ; । పోయిన నిన్నేల పోనిత్తు నేను!
చేకావు మించుకనేవు నిక్కముగ ; । నీకడ రథచక్రమెత్తంగ వలయు.
చెనకుప రణపాడి చెప్పితిఁ గాని । విను నీకు హరికిని వెఱచుటఁగాదు."
అనవిని యచ్యుతుఁడతని కిట్లనియె : । "ఎనయంగ నీధర్మ మేమిచెప్పెదవు?
నీవు మున్నుగఁ గాదె నెఱినభిమన్యు । భావించి చంపి పాపము గట్టుకొంటి.
పౌరి రథస్థుండవై పోరుచు నీవు । ... ... ... ... ...
ఆజినొచ్చిన భీము నట్లుండ నీక । యేజాతి నేయు నీవిటు నేయునేఁత?
నీవేటి రణధర్మ నీతు లెంచెదవు? । నీవు మీఁదటిపాటు నెఱిఁ జూచుకొనుము.
విడిచిరి మగలింక వేఱొక్క మగనిఁ । దడవి పొమ్మనవె మది దయయింత లేక?
కౌరవదాసు లీ కౌంతేయు లనుచు । ... ... ... ... ...
ఊటక రారాజు నుండంగ నీక । యూరయ వెట్టాట లాడింపవైతె!
అడవికేఁగిన వారి ననదలఁ జేసి । కడపటఁ గురుసేనఁ గదలింపవైతె!
అదిగాకయును దేవుఁడనక నన్నన్ని । యదటున వక్రోక్తులాడవా కర్ణ!
అలనాఁడు సంధికి నట వచ్చుచోటఁ । దలఁచి నన్ బట్టంగఁ దాఁకొంటి గాదె!
వినుము నీకపటంబు వెస నెంచ కేను । జనవుతో నొకరహస్యంబు చెప్పినను
ఆక్రీడిఁ జంపెదననుచు నాతోడ । వాక్రుచ్చి యాడినవాఁడవు గావె!
నీ వాచుమాటలు నీదుర్గుణములు । నీవిక్రితంబులు నీవట్టిపోటు
నీ కండగర్వంబు నీగబ్బు నుబ్బు । నీ కీడునేఁతయు నేన తీర్చెదను;
ఎక్కడఁ బోయెద వెందుఁ జొచ్చెదవు! । దిక్కెవ్వరిట నీకుఁ దివిరి లోకముల!
అలనాఁడు ధర్మజుఁ డానతి మాకు । నొలసి యీకున్న నిట్లుంటిమి గాని
నీవనఁగా నెంత! నిన్నేలురాజు । భావింపఁగా నెంత! పాండవేయులకు.
ఇల నధర్మముకుల్కి యీ ధర్మరాజు । బలువిడి నింతేసి పనులు గావించె.
చలమేది నీవెంత సన్నాహపడినఁ । బొలియింప కిట రిత్తపోవునె నరుఁడు!
ఇలఁ బాపములకెల్ల నెడము రారాజు । కలనేఁతలకునెల్లఁ గర్తవు నీవు.
మలసి నీవిట నాఁటిమాటలు మఱచి । యొలమి నీ రణపాడి యేలచెప్పెదవు?"

అని యిట్లు శ్రీకృష్ణుఁ డాడువాక్యములు । విని నరుండును గోపవివశాత్ముఁ డగుచు
రథమెత్త నెడమీక రాధేయుమీఁదఁ । బృథుశరాస్త్రంబులు పెల్లుగాఁ గూర్చి
సారథి రథరథ్య చయములన్నిటిని । వేఱు వేఱన ద్రుంచి భీమాస్త్రమొకట
విలు ద్రుంచివైచిన వేగనర్కజుఁడు । వలనొప్పఁ బలకయు వాలును గొనుచుఁ
గదియుచో నదియును ఖండించివైవ । గదయూఁచివైచె నగ్గదయును ద్రుంచె.
త్రుంచిన నొకశక్తి తోడ్తోన వైవఁ । ద్రుంచె నాశక్తి, నింద్రుఁడు మెచ్చిపొగడ.
తోరంపు రెండుచేతులను రెండీటె । లారయఁ గైకొని యదె చూడుమనుచు
వ్రేసిన, నవి నాల్గు వ్రేటులఁ దునిమి । వాసి వజ్రాంగి నుర్వరఁ బడనేసె.
ఏసినఁ గోపించి యిట్టట్టు నాక । యా సవ్యసాచిపై నర్కజుఁ డపుడు
శూలంబు ద్రిప్పుచు శూలి చందమున । నాలమ్ములోపల హరిఱొమ్ము వొడిచె.
పొడిచిన నెత్తురుప్పొంగి దైవాఱ । సుడి వడుచున్న నర్జునుఁడు రోషించి,
"యోరి రాధేయ, లోకోన్నతుఁ బొడిచి । క్రూరదోషంబు గైకొన్న నీవెంత?
చూడుమా దోషంబు చుట్టుముట్టఁగను । వేడుక నినుబట్టి విదళింతు." ననుచు

## అర్జునుఁడు ఘోరశర ప్రయోగమొనర్చి కర్ణుని మడియించుట

భూనభోభాగ దిగ్భువనంబు లెల్లఁ । బూని కంపింప నంబుధులు ఘూర్ణిల్ల
రౌద్రాస్త్ర మరిఁబోసి రమణమ్మెఁ గాల । రుద్రుని కైవడి రోషంబు నొంది:
"మాయన్న ధర్మజ మండలేశ్వరుఁడు । ఆయుతంబైన ధర్మాత్ముఁడౌనేని,
అఱలేని హరికృప యటఁ గల్గెనేని, । తెఱవ పాంచాలి పతివ్రతయేని,
వెన నేను భువనైక వీరుఁడనేని । మసలక కర్ణుని మస్తకంబిపుడు
త్రెంతుగా." కని తన దృష్టి గీల్కొలిపి । పంతంబు మీఱంగఁ బైకొని యేసె.
ఏసిన బ్రహ్మాండ మిలయును మిన్ను । మోసిన మంటలు మొగి మండుకొనుచు
ధారుణి వణఁక దిక్తటము లల్లాడ । ఘోరాస్త్ర వితతుల కోటు లీనుచును,
ప్రళయ కాలమునాఁటి భానుబింబముల । వెలసిన వేఁడిమి వెదఁజల్లుకొనుచు,
దిగిభంబు లూటాడ దిక్కులల్లాడ । నిగిడి కౌరవ సేన నీఱు సేయుచును
వచ్చుచో శల్యుండు వడి నదిచూచి, । "యెచ్చటఁ గర్ణ, నీకేది ది" క్కనఁగఁ,
బదివేల పిడుగుల పగిది మ్రోయుచును । అదనుగా బ్రహ్మాండమంతయుఁ బగుల

నెలకొని చనుదెంచి నిర్ఘోష ఘోష । ములు పర్వ రాజముఖ్యులు బెదరంగ
వచ్చి కర్ణునితల వడిఁ ద్రుంచివైచె । నిచ్చ నాదివ్యాస్త్ర మెలమి దీపింప.
అన్నఁ జంపిన దోష మది వాయుటకును । వెన్నుని మఱుఁగు తావెసఁ జొచ్చెననఁగ
మగిడి యేతెంచి యమ్మహిత తూణీర । యుగళంబు చొచ్చి తానున్నచో, నంత
శతయోజ నాయత సప్తార్చిరాశి । యతులితమై పేర్చునట్టుగా రవిజు
తేజంబు సూర్యుని తేజంబు నందు । రాజులెల్లను జూడ రమణమైఁ గలిసె;
పవిపాణిచేఁ బడ్డ పర్వతాకృతిని । రవిజుఁడు గూలె సర్వాంసహాస్థలిని.
అపుడేమి చెప్ప నీయాత్మసంభవుఁడు । విపులమీఁదను బడి వెస మూర్ఛనొందె.
అప్పుడు దేవదత్తాభీలరవము । లొప్పార మ్రోయించె నొగి నింద్రసుతుఁడు.
సుతుని చావునకును సూర్యుఁడవ్వేళ । వితతమై రేవాడ విచ్చేసె ననఁగఁ
బశ్చిమవార్ధిలోపలఁ గ్రుంకె నంత. । దుశ్చరితులు కురుద్రోహులు ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
దేవదుందుభులును దివ్యగానములు । పూవులవానలు పొందుగాఁగురిసె.
ఆవేళ శల్యుఁ డత్యాదరంబునను । వావిరిఁ గౌరవ వల్లభు కనియె:
"కర్ణార్జునుల రణక్రమ ... ... । ... ... ... ... ...
... ... ... ... ... । ఆరయ దైవసహాయంబు లేక
పగవకు నొగులకు వారినిబట్టి । తెగ వ్రేయువాఁడను దీవ్రబాణముల.
అనఘ, సంధ్యాకాల మగుచునున్నదియుఁ । బనివడి మనసేన పాఱంగఁదొడఁగె.
... ... ... ... ... । ... ... ... మైనయదియు.
ఈపాటి శిబిరంబు కేఁగుట మేలు । రేపాడి వత్తము [1]రిపుల మోదంగ."
అని నిశాసమయంబునందు వేతిరిగి । చనిరి పాళెములకు జ(ననాథతిలక !)
... ... ... ... ... । ... ... ... తాత్మఁ దానయ్యె.
కౌంతేయు లప్పుడు గగనంబు చిరుఁగ । నంత నార్పుల వచ్చునపుడు కృష్ణుండు:
"అర్జున, నిను బోలునట్టి వీరుండు । పర్జన్య సభయం ... ... ...
... ... ... ... ... । ... ... ... ముకే నృపులీడువారు.

---

1. రిపుమీఁఱంగ (మూ)

ధర్మసహాయకత్వంబున మెలఁగు । ధర్మజుఁ బోలరే ధరణినాయకులు.
చెలఁగి మీఱిరిక శత్రుశేషంబు చంపి । చలపాది రారాజు ... ... ..
... ... ... ... ... । ... ... ..., ... ంచు."
అని కొనియాడుచు నల్లన వచ్చి । తనరంగ ధర్మనందనుఁ బొడగాంచి
మఱఁదులుఁ దానును మహిఁ జాఁగి మ్రొక్కి । నెఱయ నిట్లనిపల్కె నీరజాక్షుండు :
"రా ... ... ... ... । ... ... ... ... ...
... ... ... చ్చిన సఖిలకౌరవులు । నీతలఁ దెగిరని నీమది నిలుపు."
అన వినిధర్మజుఁ డంభోరుహాక్షుఁ । గనుఁగొని పల్కె వేడ్కలు ముమ్మడింప :
... ... ... ... ... । ... ... ... ... ...
... ... ... అరుదె యోభువనైకవంద్య! । ఏచాయ భానుజుఁ డిలనీల్గెఁ గాక.
వలనొప్ప నామది వగపెల్లఁబాసె । నెలకొని కంటికి నిద్దురవచ్చు.
ఈయుద్ధభూమిఁ దానీక్షిం ... । ... ... ... ... ... ...
... ... ... ... ... । ... తర కరదీపికాసహస్రములు
వెలుఁగంగ లీలతో వేవేగవచ్చి । కలిత సంతోష మగ్గలికమై చెలఁగఁ
గర్ణుని శిరమును గాత్రంబుఁ జూచి । వర్ణించి మిక్కిలి వా ... ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
కర్ణసాగరమును గడచితి మనుచు । నర్ణవగంభీరుఁ డటఁ బాళిమునకుఁ
జనుదెంచె నవ్వేళ సకలయోధులను । గొనకొని యొప్పి నోకురువం ... ...
... ... ... ... ... । ... ... ... ... విఖలేక
వెల వెలనై చాల ... ... భావమున । నలవడ ననియెఁ గృపాచార్యుతోడ :
"ఆచార్యవర్య, నా యనుజుండు కూలె; । భూచక్రమునఁ గర్ణు పోఁడి ... ...
... ... ... ... ... । ... ... ... కదనంబునకును
నల నిందు సేనాధినాథునిఁ గాఁగ । నెలమిఁ జేయఁగ నర్హుఁ డింకెవ్వఁడనిన
"శల్యుఁడు నీకుండఁ జంచలంబేల? । తుల్య తేజోనిధితో సెమరి ... ... ...
... ... ... ... ... । ... ... ... ... రెడు."
అనినఁ గౌరవనాథుఁ డానిశివేళఁ । జెనసి శల్యుని నభిషేకంబు చేసి
ప్రబలంబులగు సార్వభౌమ చిహ్నములు । సిబిడంబుగా నిచ్చి నృపులు మోదింప
... ... ... ... ... । ... ... ... ... ...

అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గథచెల్లె నెఱిఁగింపు మనిన
నరహ ... ... ... ... । ... ... ... ...
... ... ... రూప, ఆద్యంతరహిత, । మణివక్షు, కేశవ, మాధవ, శార్ఙ్గ,
ఘనమాని హృద్గేహకలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన, భుక్తి । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పద పద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర వర్య
రచితమై కర్ణపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొప్పె నేనవది.

# ప్రథమాశ్వాసము



శ్రీ రమణీశ, పూరితకృపావేశ, । భూరి పరంధామ, పూజితనామ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె :
విను జనమేజయ, విఖ్యాతుఁడైన । ఘనుని కర్ణునిపాటుఁ గని కౌరవుండు
చిడిముడిపాటున శిబిరంబు కడకుఁ । దొడరి కొంచెపు మూఁకతోడ నేతెంచి
యారాత్రి శల్యుని నధిపతిఁ జేసి । భారతంబైనట్టి బవరంబునకును
బన్ని యేతెంచినఁ, బాండవ నృపులు । మిన్నంది యుబ్బున మెఱసి పోరాడ
సరవి దేవతలోకసమునఁ గీర్తింపఁ । గరమొప్ప మధ్యాహ్నకాలంబునందు
సమవర్తిసుతుచేత శల్యుఁడాదిగను । సమరోర్వి బాంధవ సత్పుత్రమిత్ర
బలములు హతమైనఁ, బరఁగ రారాజు । మలసిన భీతితో మానంబు విడిచి
మందుచు నొక మహామడుఁగులోఁ జొచ్చి । యుండినఁ బాండవులొగి నది యెఱిఁగి
చుఱుకుమాటలు యమసూనుఁ డాడుటయుఁ । గఱకఱి నమ్మహాగదఁగొని వెడలి
గాలికొడుకుతోడఁ గయ్యంబు చేసి । కూలెఁ బద్మాప్తుండు గ్రుంకు నత్తఱిని.
రజనీముఖంబున రారాజునాజ్ఞ । నిజమతిఁ గైకొని నెఱిద్రోణసుతుఁడు
చని ద్రౌపదేయ ధృష్టద్యుమ్న ముఖ్య । జనవల్లభులనెల్లఁ జంపిన యంత
సంజయుఁడది యాత్మఁ జయ్యన నెఱిఁగి । సంజాతమూర్ఛుఁడై చాలదుఃఖించి
పఱతెంచి ధృతరాష్ట్రుపదముల కెఱఁగి । నెఱయఁ గన్నీరొల్క నిట్లని పలికె :
" జననాథ, శల్యుండుసమసె; సౌబలుఁడు । ననిఁ ద్రుంగె; మృతుఁడయ్యె నయ్యులూకుండు;
తలఁకి కాంభోజ శతానీకు లవనిఁ । బొలిసిరి; రాధేయుపుత్త్రులు పడిరి.
పొప్పిరి(?) వడముడి పూర్వప్రతిజ్ఞ । తప్పకుండఁగ గదాదండంబు నంది
వెస రెండుతొడలును విఱుగఁ గొట్టుటయు । వసుధపైఁ గురురాజు వ్రాలె గూవణఁగి.
పాండవులేవురుఁ బద్మనాభుండుఁ । జండపరాక్రమ సాత్యకి మొదలు
వారందు నేడ్వురు, వసుధేశ, నీదు । కూరిమితనయుండు గుణి యుయుత్సుండు
కృపుఁడు నశ్వత్థామ కృతవర్మ మొదలు । విపరీతగతి నిట్టి వీరలు దక్క
సారిది నష్టాదశాక్షోహిణీ బలము । వెరవారఁ గూలిరి. వీరు వా రనక.

నీకతంబునఁ జేసి నెఱి నింతలేసి । భీకరకృతులయ్యెఁ బేర్చి భూపాల!”
అని విన్నవించిన నాంబికేయుండు । తనదేవియును దాను దగవిదురుండుఁ
గోడండ్రు నాదిగాఁ గుంభినిఁ ద్రెల్లి । చూడ నొక్కట మూర్ఛఁ [1] జొచ్చి వే తెలిసి
పొదలుశోకాగ్నులఁ [2] బొగులు నయ్యెడను । విదురు నుద్దేశించి విభుఁడొయ్యఁ బలికె:
“తమ్ముఁడ, నాకు నే దరి గలదింక! । నిమ్ములఁ బుత్త్రవిహీనుండనైతి.
కడపట నీకె నేడుగడయును నాకు । నెడపక నీవెకా కెవ్వరున్నారు?
విదుర, నీబుద్ధులు విననేరనైతి; । విదితమ్మె నావిధి విననేలయిచ్చు?”
అనుచు మూర్ఛితుఁడైన నవనీశునకును । జనవొప్ప శైత్యోపచారముల్ సేయ
సేదదేరించుక క్షితిపాలకుండు । నాదటఁ గూర్చుండి యసురుసు రనుచుఁ
గడవలోపలనున్న కాలోరగంబు । వడువున నిశ్వాస వదనంబుతోడఁ
బలుకు డగ్గుత్తికపడి యూఱకున్నఁ, । గలఁగి గాంధారియుఁ గలబంధుజనులు
నొక్కట శోకింప నొగి నాంబికేయుఁ । డొక్కింత విదురున కొప్ప నిట్లనియె:
“విదుర, నీ వదినెను వెలయంగ మఱియుఁ । బిదపఁ దక్కిన బంధుబృందంబు సతుల
నూరార్చి లోనికి నొగినంపు.” మనిన । నారీతి బుద్ధిగా నతఁడు చెప్పుటయు,
విని వారు శోకాబ్ధి వీచులమునిఁగి । వనరుచుఁ జనిరి నివాసంబులకును.
చనినపిమ్మట నంత జననాథవరుఁడు । తనపుత్త్రురారాజుఁ దలఁచి యిట్లనియె:
“అనఘ! దుర్యోధన! యాహవశూర! । ననుగన్నతండ్రి! యున్నతభుజాటోప!
నావంశవర్ధన! నాపట్టుఁగొమ్మ! । హా! వనజారి కులాన్వయ తిలక!
మీతల్లి గాంధారి మేదినిఁ బొరల । నే తెంచి యూరార్ప వేటికిఁ బుత్త్ర!
సుతవియోగంబునఁ జూర్ణమానన్ను । చితమతిఁ గౌఁగిటఁ జేర్పంగఁ దగదె!
ఎల్లరు చెప్పిన హితవులు వినక । త్రుళ్లుచుఁ బాండవాదులనెల్ల గెలిచి
యెలమి భూచక్రంబు నేలుదు ననుచుఁ । బలుమాఱునాడిన పంతమెందణఁగె!
‘గురుఁడు గాంగేయుండు గురుతనూభవుఁడు । గిరిధైర్యుఁడైనట్టి కృపుఁడుఁ గర్ణుండుఁ
గలుగ నాకెదురు లోకంబుల నెవ్వ । రలవొప్ప’ ననుమాట లవియెందుఁబోయె!
అల నర నారాయణాఖ్యులతోడఁ । గలహించి బ్రతుకంగఁ గలరె దేవతలు!
దుర్గుణంబున గురుద్రోహంబు చేసి । దోర్గర్వమున నాజిఁ ద్రుంగఁ బాలైతి.
కలిమి శ్రీహరికృప గలుగు పాండవులఁ । బొలియింతునని పోయి పొలిసితే తండ్రి!

---

1. జొనిపి. 2. బొదలుచు. (మూ)

తిరముగా దేవనదీ తనూభవుని । వర శరగురు బాంధవాదుల నెల్ల
వెరవార నొక్కొకవిధమునఁ బట్టి । దురమునఁ జంపిరె దోర్గర్వ మెసఁగ.
కర్ణుఁడంతటియోధు కడఁగి యేమయ్యె ! । నిర్ణయమతి మద్రనృపతి యెట్లయ్యె !
అన్నియు శకునిమాయలు చుట్టుముట్టి । కొన్నను గడపటఁ గురువంశమణఁగె.
ఆ సమీరాత్మజు నాగ్రహంబునను । నీ సహోదరులెల్ల నేఁడెందుఁ జనిరె ?
తొడలు తుత్తునుకలై దురములో బ్రాలు । నెడ నిర్వసుంధర నెవ్వఁడున్నాఁడు ! "
అని సంజయునిఁ జూచి, "యకట ! నేమున్న । ననువారఁ జేసిన దనుభవించితిని !
ఎవ్వరు నామాటలింకఁ బాలింతు ! । రెవ్వరు నిందింప కేలమానుదురు !
ముదిసి ముప్పున నాకు మున్నదైవంబు । వదలక యీగతిఁ బ్రాసె ఫాలమున.
సమ్మతింపని నాకు సకలంబుఁ జెప్పు । తమ్మునిమాటలు తలకూడె నేఁడు.
ఇన్నియు నేటికి సిదియీశ్వరాజ్ఞ । క్రన్నన నాకింకఁ గడవంగ వశమె !
సూతసంభవ, రణక్షోణిలోపలను । ఆతతంబుగ శల్యునణఁచె నేయోధు ?
కురువీరు లేరీతిఁ గుంభినిఁ బడిరి? । ధరణి రారాజెట్లు తలలక కూలె?
శకుని మాయలపోతు చచ్చుటేలాగు ? । వికలులై రాజు లేవిధిఁ బడిరందు !
ఇల మనవారెవ్వ రీల్గక నిలిచి ? । రలవి వారెంద ఱీయువసి నున్నారు ?
కనుఁగొంటివా రణక్రమమెల్లఁ దెలియ ? । వినిపింపు సంజయా, వివరంబుగాఁగ. "
అనవుడు సంజయుఁ డారాజుఁ జూచి: । " యనఘాత్మ, రాధేయుఁ డణఁగినపిదప
రారాజు మిగులఁ బరాజితుఁ డగుచుఁ । గ్రూరుఁడై వగఁబొంది కోపంబుతోడ
రయమునఁ దనమందిరము చొరవెఱచి । భయమున నొకపెద్ద బయటను నిలిచి
హతశేషులగువారి నటఁ గూడుకొనుచు । క్షితినాథుఁ డెంతయుఁ జింతించునపుడు,
మనమున దయపుట్టి మహిమ దీపింప । జననాథునకుఁ గృపాచార్యుఁ డిట్లనియె:

## కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశము సేయుట

" ఓటమి గెలుపును సర్వేశ్వరులకు । నేటికిఁ జింతింప నెప్పుడుఁ గలుగు.
తొల్లింటిరాజులు దోర్బలక్రీడ । యెల్లగాఁ బోరిరి యిహపరంబులకుఁ
గీర్తియుఁ బుణ్యంబుఁ గ్రియతోడఁ గోరి ; । కర్తవ్య మిట్టిది క్షత్రియులకును ;
ఓ యవనీశ్వర, యొకటిచెప్పెదను । జేయుము; కూడదేఁ జేయకమాను.
గాంగేయ కలశజ కర్ణాదిరథులు । సంగరోద్దండులు చతురసాహసులు

పొలిసి పోయిరి పాండుపుత్త్రులచేత. । బలపరాక్రమ దైవబల శక్తి వారి
పాలఁ గల్గుట గానఁబడుచున్న దధిప! । ఏల పాండవులకు నిందిరావిభుఁడు
రేఖమై కంటికి ఱెప్పయుఁ బోలె । శేఖరంబుగఁ గాచి చేరియుండఁగను
ఈలోకమున గెల్వ నెవ్వరివశము? । బాలార్కతేజులఁ బాండునందనుల.
నాలుగు కొమ్ముల నాగంబురీతిఁ । జాలఁగఁ గురుసైన్య సరసిలోఁ జొచ్చి
క్రీడసల్పుచునుండుఁ గ్రీడియొంతయును; । వేడుక నదిగాక విను గజంబులను
జెండాడు హరివోలెఁ జెండుచున్నాఁడు; । పాండుసూనుండను పావకునకును
గమలనాభుండను గాడ్పుతోఁ గూడె; । వినుతుల నీఱు గావించుచున్నారు.
గురుఁడు నశ్వత్థామ కృతవర్మ శకుని । ధరణిఁ దక్కినయట్టి దండనాయకులు
నీవు నీతమ్ములు నీతనూభవులుఁ । గావఁగూడియు మూఁకగాఁగూడి పాఱఁ
జాటించి విజయుండు సైంధవుఁ దునిమె. । మాటేల కేవలమనుజుఁడే యతఁడు!
కన్నులారఁగ నీవు గనుఁగొనుచుండఁ । దిన్నగాఁ బదియేడుదివసంబు లయ్యె
చిక్కుచెమర్పక చేతీఁటవోవ । [1] నిక్కవైరులగెల్చు టెఱుఁగవా? నీవు.
పరికింప రవిలేని పగలింటిపగిది । నురువడి మనసైన్యమున్నది భూప!
ఈసేనఁ బరిమార్చ నింద్రసూనునకు । బాస సేసెదఁ దృణప్రాయంబు సుమ్ము.
[2] వారితమ్ముఁడును భీముఁ డటఁ గెలంకులను । అరయంగఁ దనకు సహాయుమై నడవఁ
గఱకుటర్జునుఁడను కాలోరగంబు । పఱతెంచి యిట మనప్రాణానిలంబు
దప్పిఁద్రావఁగ నీవె తవిలిచూచెదవు. । కప్పిన [3] కోపాగ్నిఁ గరువలిసుతుఁడు
తనదు భుజాబలదర్పంబుతోడఁ । జనఁ దీర్చుఁ గౌరవేశ్వర, నిన్ను బట్టి.
ఇటుగాకమున్న వివేకచిత్తమున । ఘటనతోడుత సంధి గావించుకొనుము.
శరణన్నఁ జేకొను శమననందనుఁడు; । శరణన్న నీకునొచ్చెముగాదు వినుము. (?)
కౌరవాధీశ, యకారణంబైన । వైరంబుచేతను వడినొచ్చెఁ గులము.
కురుకులోత్తమ, దీర్ఘకోపి కవశ్య । మరణంబుగల్గు నంబంధియుక్తముగ.
తనయందు బలసత్త్వ [4] ధైర్యముల్ గలుగఁ । జను నాగ్రహింపంగ జనవర్యులకును.
పరులందుఁ దేజంబుపస గల్గనేని । కరమర్థిమై సంధిగావించుటొప్పు.
తానుంట లోకత్రితయమును నుంటె; । తా నాశమునుబొందఁ దప్పు సర్వమును.
వలవదు వైరంబువర్జింపు మధిప! । పొలిసిమీఁదటఁగనఁబుణ్యంబు గలదె!

1. నింక, 2. ఘఱి. 3. శోకాగ్ని. 4. ధర్మంబు. (మా)

శారీరమెత్తుట శాంతంబు వలయు; । పాఱుకోపం బిహపర హాని గాదె!
సమవర్తిసూనుండు సత్కృపామూర్తి । రమణమై మీతండ్రిరాజ్యభాగంబు
నీకు నిక్కమ్ముగా నెమ్మితో నొసఁగు; । చేకొనిదీనికై చింతింపవలదు.
గురులకుఁ బరిచర్య గోరికావించు; । సరసుఁ డాపుణ్యుఁ డజాతశత్రుండు;
చాల నాతనితోడ సంధి గావింపు. । గాలిఁ బోవక బ్రదుకుఁ గౌరవకులము.
సిరివరునకు లెన్న చిత్తంబువచ్చు; । కరువలిసుతుఁడును గాండీవి కవలు
శివమతిఁ గులహానిసేయంగ వెఱచి । యవనీశ, ధర్మజునాజ్ఞ సేయుదురు.
నెలకొని కురురాజ, నీకునై కాని । యలసి మా ప్రాణరక్షార్థమైకాదు.
విదితమై నాబుద్ధి వేదోక్తయుక్తి, । ముద మొప్ప విన్ననిమ్ముల సౌఖ్యమొదవు."
అనిగౌతముఁడు కౌరవాధీశ్వరునకు । మనుబుద్ధిచెప్పిన మదిఁ బట్ట కతఁడు
ఒకకొంత తడవూఱకుండియు మఱియు । వికలచిత్తాంగుఁడై విప్రున కనియె:
"మా మేలుగీడును మఱి నీవెగాన । నేమంబుగా బుద్ధిచెప్పితి వనఘ!
నీకుమిక్కిలి మాకు నెవ్వరుగలరు? । ఈకార్య మొనరించు టిది యట్టిదగును;
వినఁగానిమ్ము నాయంతరంగమున । నీ నిర్ణయము చొర దేమిసేయుదును!
సంధికి నామది చనదెంతయైన । బంధువర్గంబులు పగ వలదనఁగ,
కైతవద్యూతంబు ఘటియించి గెలిచి, । భూతిమై ధర్మజుఁ బోగులంగఁజేసి,
యురుపుణ్యవారాశి నుత్తమ సాధ్వి । ధరణి నయోనిజ ద్రౌపదీదేవి
నరయ రజస్వల నట నేకవస్త్ర । నిరుఁగేలఁ దలవట్టి యీడ్చి తెప్పించి,
సరసిజాక్షుఁడు వచ్చి సంధి గమ్మన్న । గరిమ నాదేవునిఁ గడు నిషేధించి,
బాలుని నభిమన్యుఁ [1] బాపంబు నాక । యాలంబులోపల నలమి చంపించి,
యువరాజుఁ బడఁగొట్టి యుబ్బియాభీముఁ । డవలీల రక్తంబు లట్టు ద్రావఁ జూచి,
నెలకొని యేను జన్మించిన మొదలు (?) । కలబంధువులనెల్లఁ గలనఁ జంపించి,
పాండవేయులఁ గష్టపఱచి యందంద । దండిగా వాఁడిమి దఱుగక తిరిగి,
సార్వభౌమత్వంబు నలిపి యుందాఁక । గర్వాభిమానంబు గడుఁ బేర్చి, ధాత్రి
నరులచే నొరులచే నవమానపడక । బిరుదుగల్గిన పెద్దపేరు వహించి,
కడసారమున సంధి కడ కియ్యకొనుట । కడు కష్ట నరకంబు గైకొంటగాదె!
ఇంక నెక్కడిసంధి! యెక్కడిబ్రదుకు! । పంకజాక్షునితోడఁ బాండవేయులను

---

1. భాగంబు. (మూ)

గలహించి చంపుదుఁ; గాదేని భీష్మ । కలశజ సైంధవ కర్ణాదిబంధు
హితులేఁగు లోకంబు కేఁగుదుఁగాక. । మతిఁదలఁపఁగ సంధి మగపాఁడి యగునె!
మీమాట విననైతి మిన్నక యనక । యోమహాత్మక, యిదియొప్పన గొనుఁడు.
తప్పనమాటల దైన్యవృత్తికిని । బొచ్చునాతఁడు భూమి [1] శూరుఁడే తలఁప!
అంతకంటెను జచ్చుటది మేలుగాదె! । పంతంబుతోడుతఁ బార్థివులకును.
కాదువో మీమాట కడువింటినేని । మోదించి ననుజూచి మొలక నవ్వులను
దెప్పదె ద్రౌపది దినచావు గాఁగ! । కప్పార నవ్వఁడె కరువలిసుతుఁడు!
ఆచంద్రతారార్క మగు మానముడిగి । నీచవృత్తికి నింక నేనేల చొత్తు!
అనవుడు నపుడు నయ్యవనిపాలకులు । వినుతించి మెచ్చి రవ్విభుని వాక్యములు.

## దుర్యోధనుఁడు శిబిరంబు విడిచి సరస్వతీ తీరంబు చేరుట

కృప ద్రౌణి సౌబల కృతవర్మ శల్యు । లపుడు రారాజున కనిరి కంపించి:
"కౌరవనాథ, యిక్కడ నుంటిమేని । వారు కర్ణునిఁజంపి వత్తురో యేమొ!
ఈ రాత్రి మన మొక్కయెడకుఁ బోవలయు । గారవంబున." నన్నఁగడు సంతసిల్లి
వడి నంత యోజనద్వయము తొలంగి । నడచి సరస్వతీ నదిపొంత విడిసి
యిష్టాన్న తృప్తులై యేపు వహింప । సృష్టీశ్వరునిఁజూచి సేన లిట్లనిరి:
"నేర్పున నోర్పున నిఖిల సైన్యములఁ । గూర్పనోపియు శక్తి ఘోరాజిఁబోర
నోపిన వీరుని నొకని సేనలకుఁ । బ్రాపుగా దళవాయి పట్టంబు గట్టు."
అనుడు దుర్యోధనుఁ డాహ్లాదమంది । యిన నన్ని భాకారు నేకాంగవీరు
గౌరీశవరలబ్ధ కారణజన్ము । శూరు ద్రోణాచార్యసుతుఁజూచి పలికె:
"అనఘాత్మ, విను ధనురాచార్యునట్లు । పనివడి సేనానిపట్టంబు పూని
యీ పాండవేయుల నాజిలో గెలిచి । భూపాలకత్వంబు పొందింపునన్ను."
అనిన నశ్వత్థామ యారాజుఁజూచి, । "యనఘ, యీ మద్రదేశాధీశ్వరుండు
తారకజితుఁడు బృందారకావలికి । నారఁ జమూపతి యైనట్టిపగిది
సేనాధిపత్యంబు చేసినఁజాలు । మానుగా విజయంబు మన కేమిబ్రాఁతి?
కావున నీతని ఘనత పట్టంబు । వేవేగఁ గావింపు వేడ్కతో." ననిన
శల్యుని నప్పుడు సరవి రారాజు । తొల్యావర్తనలఁ జెలంగి ప్రార్థించి,

---
1. శూన్యుఁడే. (మూ)

"యలుఱలేనిపుణ్యుల కాప్తుల కిప్డుడు । నెఱమేలు పొందింప నిది సమయంబు.
శరవృష్టి గురియించి శత్రులనెల్లఁ । బరఁగ జయించి చేపట్టి నన్నిపుడు
జగతి యేలింపు మాచంద్రార్కముగను । ... ... ... ... ...
సేనాధిపత్యంబు చేసెడి వరము । పూనికనాకిచ్చి బుద్ధిమన్నింపు."
అనవుడు మద్రేశుఁ డారాజుకనియె : । "అనఘ, నాకింతేల ! యాదికాలమున
గానకోని నిన్ను నేఁగూడిన నాఁడె । మొనసి యర్థప్రాణముల నిచ్చినాఁడ.
ఇఁక నోపలేనన్న నలమి నీకిచ్చు । ప్రకట మయ్యెన మాటపట్టెందుఁ బోవు ?
నాకోపవహ్నిచే నరకృష్ణు లనెడి । [1] భీకరాటవులను బేర్చి కాల్చెదను.
కలశజ గాంగేయ కర్ణులపాటు । పొలుపారఁగా నేఁడు పొల్లచేసెదను.
ఘనుఁడు శల్యునితోడి కయ్యంబు చాలు । నని పాండవేయుల నాడుకోఁజేతు."

## దుర్యోధనుఁడు శల్యుని సేనాధిపతిగాఁ జేయుట

అనినఁ భూపతి మెచ్చి యమలోదకములు । కనక కుంభంబులఁ గడఁకఁ దెప్పించి
యభిషేకమొనరించి యఖిలసేనలకుఁ । బ్రభుఁడవు గమ్మని పట్టంబుగట్టె.
అట ధర్మనందనుఁ డత్తెఱఁ గెఱిఁగి । పటుగతి నిందిరాపతికి నిట్లనియె :
"సుద్దులేమెఱుఁగవు; చూడంగ వింత । సుద్దులువో మధుసూదన, వింటె !
కౌరవేశ్వరుఁడట కణఁగి మద్రేశు । నారఁబట్టముగట్టె నదిక్రొత్తగాదె !
కావున నీ రాచకార్య భారంబు । లీవెఱుఁగుదుగాక యేమెఱుంగుదుమె !
అవనిఁ బాండవ రక్షణార్థంబు గాఁగ । నవతరించిన దేవుఁడవు గావె కృష్ణ !
శల్యుఁడు మిక్కిలి సాహసోత్తముఁ డ । తుల్య తేజోనిధి తొడరంగరాదు ;
మీఁదుదిఁ దలపోసి మెలఁగుఁ డెంతయును ; । ఈ మద్రపతిచేత నేమిగాఁగలదో !"
అనవుడు శ్రీకృష్ణుఁ డది యట్టిదగును ; । ఘనుఁడ, నీకీడు గాఁగలఁడె శల్యుండు !
కలశజ గాంగేయ కర్ణాదిరథుల । బలిమికంటెను వాఁడు బలియుండుగాఁడె !
బెడిదుండు ; ఈతనిబీరంబు కలిమి । కడు నమ్మియున్నాఁడు కౌరవేశ్వరుఁడు.
భీమార్జునులు వాని భేదింపలేరు ; । ధీమతి సాత్యకి దృష్టింపలేఁడు ;
ద్రుపదాత్మజుఁడు వానిఁ దొడరంగలేఁడు ; । నిపుణతఁ [2] గవలువానిని నొంపలేరు ;
చతురుఁ డావీరుఁ డసాధ్యుఁ డెవ్వరికి ; । క్షితినాథ, నీచేతఁ జెచ్చెరఁ గూలు.

---

1. భీకరారాటవి. 2. బలువాని నొప్పింప. (మూ)

మేనమామనుమాట మీమదిమఱచి । పూనిఖండింపు మద్భుతశౌర్యమహిమ.
గురు భీష్మరాధేయ ఘోరవారిధులు । వరుసదాఁటినయట్టివారికింకొక్క-
కాలువ దాఁటుట కడిఁదియే [1] చెప్పు? । ఈలీల రారాజు నీల్గిననాఁడె
సకల సౌఖ్యంబులు సమకూరెమనకు; । నకలేశ, శల్యునిఁ జంపితిననుము."
అనవుడు సమవర్తియాత్మజుఁ డనియె: । "అనఘచారిత్ర, నీయాజ్ఞ చేసెదను;
ఈశల్యుఁ దెగటార్ప నేమున్ను ప్రతిన । నేసినవాఁడను సృష్టీశ తెలియఁగ.
నీచు శల్యునిఁ జంపి నీదయకలిమి । భూచక్రమెల్లను బొసఁగ నేలెదను."
అని పద్మనాభుని ననుజన్మ ద్రుపద । తనయుల దొరలను దగుపడ వాళ్లఁ
బనిచి నిద్రింపంగఁ బార్థివేశ్వరుఁడు । సునిశితగతి శయ్య సుఖయించె నంత.
ఆరాత్రియేనిట నరుదెంచి మీకు । వీరు రాధేయుని వృత్తాంతమెల్ల
వినిపించి, మఱియును వెసఁబోయి యేను । గనునంత, [2] నట రేపకడ మేలుకాంచి
వీరును వారును వినుతవాద్యములు । బోరుకలంగ నార్పులు మిన్నుముట్ట
వచ్చుచోఁ, గృపకృతవర్మసౌబలులు । నచ్చుగా రారాజు నని రొక్కమాట:
"పోరి నొక్కఁడొక్కండె పోయి పాండవుల । నొరయక యిందఱు నొక్కయుద్ధతిని
పైపడ పోరినఁ బరఁగ జయంబు । నేపొందు నిందఱ కిదియు మతంబు.
ఒకనికి నొక్కరు నొనరఁ బ్రావగుచు । నకలంక వృత్తిమై నని సేయవలయు.
ఇటుగాక [3] వేఁడిమి నెవ్వఁడు చనిన, । నట నొంటిఁ బోరెడు నవ్వానిఁ జూచి
కొనరి తా వానిని గూడుకొకున్నఁ । బన్నైన యమశాస్తి పడువాఁడుమీఁద."
అని ఘోరసత్యంబు లాడుచునుండ । మొనలకు శల్యుండు ముందట నడవఁ
గలహాబ్ధిఁ బుష్కరాగ్రమునఁ బూరింపఁ । గలిగిన మదగంధ గజములు నడవ,
జగములు కంపింప సప్తగాడ్పులను । దెగడెడు సామ్రాణి తేజులు నడవ,
రమణమై వెలుఁగు తారావిలాసముల । క్రమమునఁ దేరులు క్రందుగా నడవ,
ధృతిఁ బెంపుతో మృత్యుదేవతనైనఁ । బ్రతిననోర్చెడు వీరభటకోట్లు నడవఁ,
గురువీరు లీభంగిఁ గోరిరాఁ జూచి । పరువడి నేతెంచెఁ బాండవసేన."
అనవిని ధృతరాష్ట్రుఁ డాత్మలోఁ గలఁగి । మునుకొని ధైర్యంబు మొగినూఁతచేసి:
"సంజయ, గాంగేయుచావుతోఁ దొలుతఁ । గంజాప్తసుతుచావుఁ గలశజుచావు
విన్నచెవులకు వేసటగాఁగఁ । బన్నగధ్వజ మద్రపతులు చచ్చుటయు

1. చంపు. 2. నొక్కఁడ రేపకడయు. 3. వేడిమి. (మూ)

నిక్కంబు చెప్పుమా నెఱిఁ భయంబుడిగి । మిక్కిలి దుఃఖ మిమ్మెయి ఘనంబుగను.
యమసూతి శల్యుని నని నెట్లుచంపె? । రమణ భీముండు దూరాజు నెట్లణఁచె?
మలసి పాండవులకు మనవారికపుడు । కలసేన నాకెఱుంగఁగఁ జెప్పు." మనిన
'ఎలమి భూవర, మనకిటఁ బదునొకడు । వేలు తేరులు పదివేలు నేనూరు
గజములు, రెండులక్షల ఘోటకములు, । కుజనవీరులు(?) మూడుకోట్ల కాల్బలము,
వారికి నార్వేలు పరరథంబులును, । వీరంబుగల మూఁడువేల గజములు,
గుఱ్ఱంబు లొకలక్ష కోటికాల్బలము, । జిష్ణుని కాలాగ్ని శిఖల చందమున
నిరువాఁగు వేర్వేఱనిట నెదిరించి । బరవసంబునఁ దలపడుచోట శల్యుఁ
డల సర్వతోభద్ర మను మహావ్యూహ । మిల సంఘటించి తా రేచి పోరాడ
నెక్కినచోటఁ బెంపెక్క యాలోన । నక్కజంబుగఁ బాండ వారవిందములు
వెలిఁగించి కౌరవ [1]నీరోత్పలములు । చెలువంబు సుగిడింపఁజేయు చందమున

## కురుపాండవుల పదునెనిమిదవనాఁటి యుద్ధప్రారంభము

నొనర దివాకరుండు యాద్రి యెక్క. । అనఘ, సేనలు రెండు నార్చి నార్చుటయుఁ
జలియించె నభము; దిక్చక్రమల్లాడె; । జలధులు ఘూర్ణిల్లె; జగము భీతిల్లె;
కరులతో నురువడిఁ గరులుమార్కొనియె; । తురగతండములతోఁ దురగంబులొరసె;
తేరులు తేరులఁ దెగువమార్కొనియె; । వీరభటాళితో వీరులుతొడరి
సురలు నచ్చెరువుగాఁ జూడఁ బోరఁగను । గురుపాండవులకు సంకులయుద్ధమయ్యె.
శింజినీరవము హేషిత ఖురధ్వనులు । కుంజర ఘీంకార ఘోరనాదములుఁ
గరవాలముల మ్రోఁత ఘనరథ నినద । మరయంగ వీరకాహళ నిస్వనములుఁ
గప్పి నాకీర్ణమై గగనభాగంబు । ముప్పిరిగొనఁగ; సముజ్జ్వల కీర్తి
పోవక పోరాట భూరిసైన్యములు । గావింప, మాధవకాలంబు నాఁటి
నడమోదుఁగులరీతి నవ్యరక్తముల । నొడికమై యొప్పుల నొప్పుచునుండె.
మృదువైన భగ్నపు [2]మెదడదిఱొంపి, । యొదవిన యెముకలనుగ్గు సైకతము,
అరయవింజామర లంచలగములు, । ధరణిపైఁ గూలిన తలలు తామరలు,
నెలకొనిపాఱిన నెత్తురు నీరు । జలధియో యన నొప్పె సమరాంగణంబు.

1. నీలో. 2. మేదళ్ల. (మూ)

అప్పుడు భీమసేనార్జును లార్చి । యుప్పొంగి శంఖంబులొప్ప మ్రోయించి
కదిసినఁ, బెనుభీతి గజగజవణఁకి । యుదనేది మనసేన లప్పుడు వాఱె.
పాఱిన సేనాధిపతిఁజూచి తనదు । సారథిఁ బలికె నచ్చలమగ్గలింప :
" (అలరి యుధిష్ఠిరుఁడదె కయ్యమునకుఁ) । దలకొని యటఁ గాలుద్రవ్వుచున్నాఁడు.
తడయక తాఁగాచు తెగ నన్ను గెలువఁ । దొడరి దేవాసురాదులకైన వశమె!
తెలుసుము మనసేన ధర్మజుమీఁదఁ । దఱిమెద మెఱమెదఁ దనసేననెల్ల.
నిన్ను మెచ్చించెద నేఁడు నాకలిమిఁ । బన్నుగా నాబాహుబలమును జూడు.
అనవుడు సూతుఁ డయ్యనుమూతిమీఁదఁ । గని విచక్షత రెట్టిగాఁ దేరు వఱవ
నామద్రపతి మెచ్చి యపుడాగ్రహించి । యామేటిఁ దాఁకుచో నట మనసేన
పాఱక యమ్మద్రపతిఁ గూడుకొనుచు । వారిఁదాకినఁ బోరు వడిఘోరమయ్యె.

## నకులుఁడు కర్ణపుత్రులఁ జిత్రసేనాదుల మడియించుట

వావిరి ఘోరాహవంబులో నపుడు । భావించి నకులుండు భానుజుకొడుకు
చిత్రసేనునిమీఁద శితనారసములు । చిత్రంబుగా నేయఁ జిడిముడిపడక
రణగరిష్ఠుండగు రవిమనుమండు । తృణలీలఁ దునిమె మాద్రేయుని విల్లు.
తునిమి యంతట మూఁడుతూపుల నతని । ఘన నిటలస్థలిఁ గాఁడిపో నేసి
తురగధ్వజంబులఁ ద్రుంచి సారథిని । శిరమటు గూల్చిన క్షితికి లంఘించి
పవిపాణియునుబోలె బాహార్గళమునఁ । దివిరి ఖడ్గము కేలఁ ద్రిప్పుచుఁ గదిసి
ధీరుఁడై యాతని తేరిపై కుఱికి । దారుణంబుగ వాని తలద్రెవ్వనేసె.
రణభూమి హతుఁడైన రవిపౌత్రుఁజూచి । ప్రణుతింపుచును నార్చెఁ బాండవసేన.
బలి చిత్రసేనుండు పడఁజూచి, వాని । కలఁగిన యనుజన్ము లధికరోషమున
సత్యసేనుండు సుశర్ముండుఁ గడఁగి । యత్యుగ్రు నకులుపై నార్చుచుఁ గదియ
నవిరళమతి నప్డు యర్జునానుజుఁడు । రవళితో వేఱొక్క రథ మప్పుడెక్కి
ధనువు మోపెట్టి యత్తఱి సత్యసేను । ధనువుఖండించి రథ్యములఁ గూల్చుటయు,
వాఁడొక్కరథమెక్కి వరచాపమంది । వాఁడికోలల వెంట వక్షంబు నేయ,
నరుతమ్ముఁ డపుడొక్కనారసంబునను । అరుదార నేసిన, నాసత్యసేను
తలఁకక నకులుని ధనువు ఖండించె. । వెలయంగ వేఱొక్క విలుదాల్చి తీవ్ర
శరములేయుచు వానిచాపంబు దునిమి । తరమిడి మాద్రినందనుఁడు రౌద్రమున,

గాలోరగమురీతి గరళంబు గ్రక్కు । వాలికయగు శక్తి వానిపైఁ బఱప
మండుచు నదివచ్చి మంటలతోడ । దండితో నాతని తలఁ ద్రుంచివైచె.
ఆ సుశర్ముఁడు తనయన్న పాటునకు । గాసిల్లి రోషాగ్నికణములు దొరుఁగ
నరయఁ గాలానలంబగునట్టి తీవ్ర । శరవృష్టిఁ గప్పిన, సహదేవునన్న
తానును దోర్దండ దారుణాస్త్రములు । పూనికనేయ, నప్పుడు వాఁడుగనలి
తేరు భగ్నముసేయ, ధృతిభీముకొడుకు । తేరెక్కి విజయప్రదీప్తులు నిగుడ
నా శ్రుతసోముండు నట సహాయముగ । గాసిల్ల నేసినఁ, గడునల్గి వాఁడు
ఇద్దఱపైని బెక్కేషు పరంపరలు । తద్దయు నేసినఁ, దగమాద్రిసుతుఁడు
చండిమ నొకయర్ధచంద్ర బాణమున । ఖండించె నాతని ఘనశిరంబప్పుడు.
రాధేయసుతులిట్లు రణములోఁ బడినఁ । గ్రోధభైరవుని పోల్కృతి శల్యుఁడలిగి
వీరరసస్ఫూర్తి విక్రమంబెసఁగ । [1] దారుణ సింహనాదము నేసి పేర్చి,
తనసేనలును బాండుతనయుని సేన । లనయంబుఁ బోరుచో నప్పుడేమిచెప్పఁ!
బెల్లైన మదకరి బృంహితధ్వనులు । హల్లకల్లోల ఘంటారావములును
బడగల రవళియుఁ బటురథధ్వనులు । నుడుగక పైకైకొన హుంకారములును
భేరీమృదంగ గంభీరనాదములు । భూరి భాంకృతులు నభోవీధి నిండ
దొరలు శిఖండియు ద్రుపద నందనుఁడు । నుఱవడించిన, వడి నొగి మనవారు
దొరకొని పోరుచోఁ, దుహినాంశువంశ! । కరమర్థి సందడి కయ్యంబులోన
నందఱఁ గడచి తా నధికరోషమునఁ । గ్రంమగా శల్యుఁడుగ్రస్ఫూర్తి మెఱయఁ
బవమానతనయుని బలభేదిసుతునిఁ । గవల శైనేయ శిఖండి వర్గములఁ
బటు శిలీముఖముల పాలుసేయుచును । జటుల సైన్యావళిఁ జక్కుసేయుచును
గరుల నశ్వంబుల ఘనరథావళులఁ । దఱిమి ఖండించి విదారించుటయును,
గనుఁగొని సేన కకావికలుగను । వెనుకొని ధర్మజు వెనుకకుఁ బొత్తె.
అప్పుడు ధర్మజుఁ డధికరోషమునఁ । దప్పక మద్రేశుఁ దఱిమి వారించి
శిత శిలీముఖములఁ జిక్కువర్చుటయు, । నతుల రౌద్రాకారుఁడై మద్రవిభుఁడు
యమసూతి చనుమర నేడుబాణములఁ । గ్రమమున నాటింపఁ గడుఁగోపమెసఁగి
యదలించి సహదేవుఁ డైదుబాణములు । తుదిముట్ట నకులుండు తొమ్మిదస్త్రములఁ
బాంచాల తనయులు బహుమార్గణములు । మించి ద్రౌపదిసుతుల్ మెఱుఁగుటమ్ములను

---

1. ఘాతజి. (మూ)

ధర్మతనూజుండు దశ విశిఖములుఁ । బేర్మితో నేయుచు భీకరస్ఫూర్తి
దురము శల్యునితోడఁ దొడఁగి నేయంగఁ, । బరువడి నతనికి బాసటగాఁగఁ
గృతవర్మ శకుని యులూకుండు మఱియు (?) । నతిమీఱి నీదుతనూజులుఁ గవిసి
యురుదార వారినేయఁగ, ద్రోణిచూచి । యరిసేనఁ దాఁకి భయంకరంబుగను
బది పది శరములఁ బాండవేయులను । అదలించి యేయుచో, నంతటిలోన
మారుతిహయముల మద్రేశ్వరుండు । ఘోరాహవంబునఁ గూల్ప, భీముండు
పాదచారంబునఁ బస మాద్రిసుతులు । ఆవటఁ దనకు సహాయమై మెలఁగ
గదత్రిప్పుచును సేనఁ గదనోర్విఁ గూల్చె. । అదిచూచి మద్రేశుఁ డాత్మఁగోపించి
సహదేవు తేరి యశ్వములఁ గూల్చుటయు, । మహిత విక్రమకేళి మద్రేశుకొడుకు
పులిమీఁదఁబోవు జంబుకము చందమునఁ । దలఁకక యమ్మాద్రితనయునిఁదాఁక
వాలుచు బలకయు వడిఁగొని యతఁడు । నేలకు లంఘించి నెఱి మామచూడ
దండించి మఱఁదిని దల దెగఁగొట్టి । యొంటురథంబున కోడక చనియె.
తనయుండు తెగిన మద్రక్షమావిభుఁడు । చెనకునఁ బాండవసేనలఁ గలఁచి
కమలాకరంబున గంధసింధుర మ । సమశక్తితోఁ గ్రీడ సలుపు చందమున
బలశాలి ధర్మజుపైఁ దేరు వఱపి । [1] జిలుగుటమ్ముల భీతిచిలుకంగనేసె.

## శల్య భీమసేనుల గదాయుద్ధము

అది భీముఁడీక్షించి హా పోకు మనుచు । గదయూఁచి మద్రేశుఁ గడఁకనదల్చి
ప్రళయకాలమునాఁటి భైరవుపగిది । నలిగి కల్పానలుండై మంటలెసఁగఁ
గదిసిన, శల్యుండు గడునల్గి యపుడు । మదమున నుప్పొంగి మారుతిఁ జూచి,
"యేలరా మారుతి, యేను ధర్మజుఁడు । నాలంబునేయ మీయన్నను గడచి
వచ్చితి ! నాఁయాడువాఁడవా నీవు ? । ఒచ్చెమొందవె కర్ణు నోలిమైఁ జెనకి ?
ఇదె వజ్రనిభమైన యీతోమరమున । హృదయంబుఁ బొడిచెదనిటఁ దప్పకొనుము.
దీనఁ బగిల్చితి దిక్కులవారిఁ; । బూని చూచెదఁ దప్పిపోయెదువాని."
అని భీకరాకారమగు నగ్నికణము । లినమండలము గప్ప నెసఁగ నంకించి
తోమరంబున భీముఁ దొడిఁబడఁ బొడిచె. । ఆమెయిఁబొడిచిన నతఁడది చేతఁ

1. చిలుకు. (మూ)

గొని బిట్టువాడిచిన, గొనకొనినొచ్చి । కినిసి శల్యుఁడు బోరగ్రిందుగాఁ బడియె.
పడి యంతలోన గొబ్బున లేచి పేర్చి । యడరి వజ్రము దాల్చు నమరేంద్రు రీతి
శూలంబు ధరియించు శూలిచందమున । గాలదండము పూను కాలుని భంగిఁ
గరమున నొక్క ముద్గర మర్థిఁ బూన, । నసదార వాయుజుఁ డట్టహాసమున
(గద కేలఁగొని సమ్ముఖంబుగా నడరఁ) । గదలక శల్యుఁడు కడిమిమై నిలిచె.
మారుతి తానొండె మద్రేశుఁ డొండె । నీరణంబున (?) నని యిలయెల్లఁ బొగడ
నార్పుల నూర్పుల నడరుహుంకృతుల । నేర్పుల నోర్పుల నిగిడి యుద్ధమును
జంకెలువైచు గోరాజుల భంగి । నంకించి గదలెత్తి యడరి హుమ్మనుచు
నురములు శిరములు నూరులు బరులు । కరములు నరములు కంఠనాళములు
ముక్కులు చెక్కులు మోములక్కులును । నొక్కసమంబుగా నొవరఁ గొట్టుచును
ననిచిన పంచాననంబులఁ బోలి । ఘనముగా రక్తమంగంబుల దొరుఁగ
నొక్కట మూర్ఛిల్లి యుర్విపైఁ బడినఁ, । జక్కటి నాకృపాచార్యుఁ డేతెంచి
తానొక్క రథముపైఁ దగ శల్యునిడి । మానుగాఁ బోవ, సమ్మారుతి తెలిసి
కనుఁగొని ‘పోకు పో’ కని కూడఁబాఱె. । మునుకొని రారాజు మోగినది చూచి
‘యందెందుఁ బోయెద వనిలజ, తిరుగు । మిందుర’ మ్మని వచ్చి యిల భీముఁ దాఁకె.
అదిగని ధర్మజుఁ ‘డట పోకుపోకు । మిదె యున్నవాఁడ నన్నిదె చూడు’ మనుచు
ననిసేయఁ గడఁగిన, నా చేకితానుఁ । డనయంబు గోపించి యధిపు కట్టెదుర
‘ననుజూడు ధర్మజ, ననుజూడు’ మనుచు । నెనయంగ రారాజు నీక్షించి పలికె:
“ఎలమి దుర్యోధన, యేల త్రుళ్లెదవు? । తాలిమి నాస్వామి తమ్ముఁడవనుచుఁ
జేకాచినాఁడ నేఁ జెనక నీవెంత! । ఏకీడు వచ్చునో యిటఁ జూచుకొనుము.”
అని పెక్కుబాణంబు లతనిపైఁ గురియ । ననయంబు గోపించి యాకురురాజు
నవి శీఘ్రగతిఁ ద్రుంచి యార్చి మిన్నద్రువఁ । బవినిభంబైనట్టి ప్రాసంబు పూని
యురుతర ప్రభలతో నంకించి వైచి । ధరఁ జేకితానుని తల ద్రుంచివైచె.
అటు చేకితానుండు హతుఁడైనఁ జూచి । పటు పరాక్రములైన పాండునందనులు
కురుబలంబుల మీఁదఁ గోపించి నడవ । గరిమ ధర్మజుఁడును గౌరవేశ్వరుఁడు
వావిరిఁ బోరిరి ; వడి నంతలోనఁ । బావనియును మద్రపతియు మార్కొనిరి.
ఆ కృపాచార్యుండు నమరేంద్రసుతుఁడు । డీకొని రణములోఁ దెగి పోరి రధిప!
పరువడి నకులుండు పౌరుషస్ఫూర్తి । సొరిదిమై ద్రోణాత్మజుఁడుఁ దలపడిరి.

ఆ సహదేవుండు నయ్యులూకుండు | నాసమయంబున ననికెదుర్పడిరి.
క్షోణిపై ద్రుపదాత్మజుండును గృతవర్మ | జాణలై తొడరిరి సమరంబు సేయ.
సౌబలసుతులుఁ బాంచాలిసూనులును | నేపడ్కి నమ్ములఁ దెగి పోరిరపుడు.
కాలసన్నిభులు త్రిగర్తులు మూఁకు | వేలరథంబుల వీరాధివరులు
కౌంతేయ సేనతోఁ గలిసి పోరంగ | నంత నేమనవచ్చు నధినాథ, వినుము
బంధురంబైన యాహవరంబులోనఁ, | బెంధూళి మిన్నును బృథివియుఁ గప్పె.
చీఁకటి పెంచిన సేనలిర్వాగు | నొకడ నొక్కరొక్కరిఁ గానరాక
తమచేతి దివ్యశస్త్రముల నత్తఱుము | గమకమడంగినఁ, గడఁగి బిట్టేచె.

## ధర్మజాదులు శల్యునిపైఁ దలపడుట

మద్రేశుఁ డప్పుడు మహితాస్త్రహతులు | ముద్రగా ధర్మజు మొగిఁ గాడనేసె.
ఏసినఁ గోపించి యిషుపంచకమున | మోసనాతని ఱొమ్ము మునుఁగ నొప్పించి
మందహాసముచేసి "మామ, యిదేమి | మందె మేలంబున మానకేసెదవు?
కర్ణకఠోరవాక్యంబుల మున్ను | కర్ణుచిత్తము నీరుగాఁ జేసినట్టి
చుట్టపువాఁడని చూచితిఁ గాక | యిట్టిచోఁ బగవాఁడ [1]విట్లగు టెఱుఁగ.
అనఘ దుర్యోధను నసఁ బరిదేమి! | వినఁ జంపినపుడుగా నెగులెల్లఁ దీఱు.
భూర్భువస్స్వర్లోకములు చొచ్చెనని | యూర్ఫటి రారాజు నాజిఁ జంపెదము.
ఎటఁ బోవవచ్చు నాయెదుట గర్వించి! | కటకటా! నీవెఱుంగవె వానిసేఁత!
తగభీముగదకు నాతని ప్రాణములకుఁ | దగులైనచందంబు తప్పిపోయెడినె!
తద్దయు నీమదిఁ దగ మేనమామ | ముద్దులు [2]గుడిచెను మొగి వీఁడునాక
యిఁకనైన భూభాగ మిప్పింపు చాలు; | నిఁక నేఁడ యీయర్ధ మీనోపరేని
నైదూళ్లు కడసారికైన నిప్పింపు; | ఈదెస నిటఁ దాము నేముఁ గూడెదము,
చూపిచెప్పితిఁ గాని చూడుమీవాఁడు | ఏపార నిచ్చునో యీపల్లెలైన?
ఇనుముగూడినయగ్ని యిల వ్రేటువడిన | యనువున నీమీఁద నట భారమొందె.
చూచిపోరాడుము సురుగక" యనిన | నాచతురాత్మునితో ననియె శల్యుండు:
"ఏల ధర్మజ, నీవు నిప్పుడు నొవ్వ | నేలిలఁ బలికెద విడి నీకుఁదగునె!
ఎనయంగ హిత పురోహిత మంత్రివరులు | వినుమన్న బుద్ధులు వినక రారాజు

---

1. విట్లాతఁ. 2. గుడిచిన. (మూ)

పుత్త్ర మిత్రుల బంధు భూప యుక్తముగఁ । జిత్తమై యిదె కడుఁ బ్రీతిఁ జాలనేసి
నిన్నేఁకూడెదు; నృపుఁడు రారాజు । నన్నుఁ దమ యాన భూషణమైనవాఁడు
సూది మోపెడునంత చోటు తా నీఁడ । వాఁ డింతు నాఁడు నా వాక్యముల్ వినునె!
అది [1]గాక సేనల కధిపుఁ గానున్న । కుమతి జచ్చుట గట్టి యెంగి నమ్మినాఁడు.
ఇంతకంటెను మేలు నిన్నేమి సేయు? । పంతంబుతో నానిపుడ నేఁగువాఁడ.
చూడుము నాచేతి చుఱు" కని యొక్క । వేఁడి నారసముల్పె క నాటించె.
నాటింప సమవర్తి నందనుఁ డప్పుడు । చాటించి మాతుల చక్రరక్షకునిఁ
ఇంద్రసేనుని నర్ధచంద్రబాణమున । చంద్రకీర్తితులతోఁ జట్టులు వాపె.
అప్పుడు శైనేయుఁ డనిల నందనుఁడుఁ । జెప్పఁ జిత్రముగాఁగఁ జేరి బలంబు
పాంచాలముఖ్యులు ప్రతివింధ్యుఁడాది । మించి బాహువిక్రమున మిక్కుటంబుగను
బొదివిన, శల్యుఁడుప్పొంగి యదల్చి । యుదరి ధర్మజుఁ బదియుగ్రబాణముల
శైనేయు నెనిమిది శరముల భీము । నేనింట నుబ్బపోనేసియుఁ జేది
బలముల నుగ్గాడి ప్రతివింధ్యుఁడాది । బలియుర నెల్లను బలువిడి నొంచి
గర్వించుటయుఁ, జూచి కడఁగి ధర్మజుఁడు । వార్వటంకృతి చేసి మద్రేశుమీఁదఁ
దఱచుగా నప్పుడు దారుణాస్త్రములఁ । బఱియలుగా వాని కడగేయుటయును,
గాలనందను భీముఁ గవల సాత్యకిని । నాలోనఁ బగటుఁ బడాలు బాణముల
నొప్పింప, భీమసేనుండాది వీరు । లప్పుడు దమ్ములు వాని యనిపైఁ గురియ
వారిపై నలిగి తీవ్రప్రదరముల । ఘోరాజి నేకుఁ గోరుకుఁ దెచ్చె.
ఎంమి వీరధ్వజం బెత్తించి మించి । బలు నారసం బేసెఁ బవమానసుతుఁడు.
శైనేయుఁ డట సప్తశరములు పఱపె. । పూని యిర్వది మాద్రిపుత్త్రులేయుటయుఁ
దృణముగా వారి మద్రేశుండు నొంచి । గణన మారుతి యాదిగా నలువురను
ఇరువదింటను ముప్పదింట నేనింటఁ । బరుపడి మాటను బరఁగి నొప్పించి
నకులానుజుని విల్లు నడిమికి నఱక, । నొకవిల్లు దాల్చి యుయ్యోధు కోపించి
తూపోఁడమ్ములు మేనఁ దూఱంగ నేసి: । "ఓమామ, యిఁక నేఁడ నోడిఁగెదు చెపుమ!
యొదిఁగి నీవేలోక మొగిఁ జొచ్చెదింక? । విదళింతుఁ గాకేల విడుతును నన్ను?
మాపగవాని నిమ్మహిఁ గూడినట్టి । పాపకర్ముఁడ, నిన్ను బట్టి మర్దింతు.
తల్లితోఁబుట్టిన ధర్మంబు దలఁచి । ప్రల్లదు నిన్ను గావాడితిఁ గాక.

---

1. గానసేనల. (మా)

నీకు మాయన్నకు నెంతయంతరము? । ఆకాక మాపిక మది యేడకేడ?
మహనీయుఁడైన ధర్మజునకు నీకు । మహి నెన్నఁగా హస్తిమశకాంతరంబు.
సూత సంభవు తేప చొనిపిన నీకు । జాతియు నీతియన్ జాడలు గలవె!
ఏమని నచ్చితి వీ రణంబునకు? । నోమామ, సిగ్గులేదో కాక నీకు!
నీసరివారిలో నీవుండఁదగదు; । ఆ సూతసంభవు నటఁ గూడుకొనుము;
నీ మన్నిగొనియెద నిలువు మించుకయు; । నీ మేనయల్లుని నిజశక్తిఁ జూడు."
మని తీవ్రశస్త్రంబు లందంద పఱప । మునుకొని కోపించి మువ్వుర నట్లు
మార్గణావళి బిట్టు పలగొననేయ । భగ్నుడై వడి యముపట్టి యాలోన
నురుతర రక్తంబుతోల్లిమైఁ గ్రమ్మ । శరముల గ్రుచ్చి నాశల్యుని ఱొమ్ము.
గ్రుచ్చిన సమవర్తికొడుకు చాపంబు । నచ్చుగా ఖండింప, నంతటిలోన
నొండుకోదండంబు నుగ్రుఁడై కొనుచు । మండుచుఁ 'బగదీఱ మామను ద్రుంతు'
నని రోషమొదవ దవ్యాస్త్రసంతతులఁ । బనినడి భీముండు పటు ఖడ్గధార,
నురువడి నకులుండు నొకమహాశక్తిఁ, । దిరముగా నాసహదేవుండు గదను
వైచిన, నవి మద్రవనుధేశ్వరుండు । చూచెఁ దుత్తుమురుగా సురపతి వొగడ.
అప్పుడు కపికేతుఁ డావలనుండి । యొప్పు నాకలకలంబొగి నాలకించి
రుద్రుడై వడి మండి రూక్షేక్షణమున । భద్రంబుగా మద్రపతిమీఁది కుఱికె.
అదిగని ద్రోణజుం 'డటఁ బోకుపోకు । మిదె యున్నవాఁడ నన్నెదిరి పోరాడు;
పోయిన నిన్నొండెఁ బోవనీ.' ననుచు । నాయువనీనురుం డమరేంద్రసుతుని
వారిఁ గపిధ్వజమును నాతపత్రమును । హరుల సారథి మహాహవమున నొంచె.
అట్టిప్రావున మన యక్షుల సైన్యములు । ముట్టడ సేసిన మొగి నింద్రసుతుఁడు
గాండీవ నిర్ముక్త కలితాస్త్రవర్ష । చండిమ ధ్వనులతో సైన్యంబుఁ బొదివి
తేరులఁ జక్కాడి తేజులఁగూల్చి । సారథులను ద్రుంచి చాపముల్ విఱిచి
గుండెల వగిలించి కోలెమ్ము లేర్చి । కండలు భాగించి కాళ్లుఖండించి
ముక్కులు నక్కులు మోములఁ జెక్కి, । పిక్కలు డొక్కలుఁ బిఱుఁదులు గోసి,
బొమిడికంబులు రాల్చి, పొట్టలు చీల్చి, । కుమతి నెత్తురులు (?) వాఁగులు వాఱఁజేసి,
యప్పుడు రెండువే లతిరథ రథుల । నొప్ప వెల్మిడిగాఁగ నుర్విపైఁగూల్చి,
నీరసారణ్యంబు నెలకొని కాల్చు । ఘోరపావకుఁడనఁ గురుబలంబణఁచె.
కవ్వడిఁగనుఁగొని కలశజుకొడుకు । నవ్వుచు నప్పుడున్నతలీలఁ దాఁకి

శిత శిలీముఖముల జిష్ణుఁబడంట । శతమార్గణములఁ గంసధ్వంసి నొంచె.
అందుకుఁ బాండుమధ్యముఁడు కోపించి । కుందుచు ఘన దివ్య ఘోరాస్త్రములను
సూతుని వాజులఁ జూర్ణంబు చేసి । యాతని తనువున నైదమ్ములేసె.
ఏసిన గురుసూనుఁ డేడుబాణముల । గాసిల్ల నేసినఁ గడుఁద్రుంచె నతఁడు.
ఈరీతిఁ బోరాడ నెలమి సంశప్త । లారూఢిగా వచ్చి యార్చి మార్కొనిరి.
ఆయెడ వారల నమరేంద్రపుత్రుఁ । డా యముపాలికి ననిచిన వెనుకఁ
బటురయంబునఁ గురుప్రభుఁడు తానరద । మటు గదియించి యయ్యర్జునుఁబలికె:
"ఇదియేల చంపెద వీసేనఁ దొడరి? । కదిసి నన్నెఱుఁగవా కౌరవేశ్వరుని?
మీయన్న యెఱుఁగుఁబో మెఱసి నాలావు. । ఆయెడ నెఱిఁగియు నటవచ్చెఁ గాక.
... ... ... ... ... । కపట జూదంబునఁ గడుమోసపుచ్చి
కుతలంబుఁ బాపి యేగురి వెళ్లఁదోలి । గతిమాలఁజేసి యా గహనాంతరముల
నాకులు నలములు నటఁ దినఁజేసి । చీకాకు పఱచి యొచ్చెముల నొందింప
మఱి మత్స్యపురిని వేమఱు పడ్డపాట్లు । మఱచితిరే నేఁడు మానాథ్యులార!
ఏనోరు పెట్టుక యేయ వచ్చితిరి? । పూని పట్టుక చాలఁ [1] బొంకంబు మెఱసి.
మిమ్ము నేవురఁ జంపి మేల్మినాహితుల । వమ్మైన పగదీర్చి వడి మింతు." ననుచు
జలజల క్రీడిపై శరవృష్టి గురియ । నలుకమోమున మందహాసంబు నిగుడఁ
"గప్ప పైఁబడి యట్టిగఱచిన భంగి । యొప్పారె; నాపాటి యోధవా నీవు!
ఇప్పుడీవాడిన యీమాట లెల్ల । నొప్పార మఱవకుమోరి దురాత్మ!
ఈవు చేసినచేఁత హృదయంబులోన । నీవు చెప్పకయున్న నేము మఱచితిమె!
అందుకు నేమాయె నవిఘ్నెల్లఁగాడి । పొందుగా మాననిపుండులై నవియు.
భీము గదాద్భుత పృథులాపథమున । మామనోవ్యాధులు మఱి నివర్తించు.
నీవేల పదరెదు నీతలంపట్ల । కావింప కూఱకే గడచి పోమెడిన!"
అని పెక్కుశరముల నార్చుచుఁ దొడిఁగి । పనుపడ నేసినఁ బన్నగధ్వజుఁడు
[2] ననదమై యున్నంత నతని సోదరులు । ఘనత నాతని వెనుకకుఁ ద్రోచికొనుచు
నార్చుచుఁ దాఁకిరి; యంతలోపలను । బేర్చి భీముఁడు వారిపీచంబు లణఁచె.
అగ్నికుండఁబడంత నా కురుబలము । నాగ్నేయ శరముల నడఁపుచో, వచ్చి
ఖండితారాతి శిఖండి కౌరవుల । ఖండించి నిండించె గౌరవజలధి.

---

1. పంతంబు. 2. నవశుఁడై. (మూ)

అప్పుడు మద్రేశుఁ డలుక దీపించి । యుప్పాండవేయ సైన్యావలికపుడు
మించిన తనమూర్తి మిఱుమిట్లు గొలుప । ముంచి చేతులుఁ గాళ్లు మొగినాడకుండ
నేయెడఁజూడ నయ్యేడఁదానె యగుచుఁ । బాయక పోరాడి పటురభసమున
నురగసంహతిఁ ద్రుంచు నురగారిభంగి । గిరులను దునుమాడు గిరిభేది కరణిఁ
జెనసి లేళ్లను ద్రుంచు సివ్వంగి వగిది । వనములు గాల్చు దావాగ్నిచందమునఁ
జించియు నొంచియు జీవనాశములఁ । ద్రుంచియుఁ ద్రెంచియుఁ దూల నేసినను
బంచత్వమునకోడి పాండవసేన । పంచబంగాళమై పాఱె భూపాల !
అదిచూచి యమసూతి హస్తంబు వీచి । ముదమున సేనల మొగి నిల్వరించి,
తనసహోదరులను దనయాత్మహితులఁ । గనుఁగొని వారితోఁ గరమర్థి ననియె :
" ఆవగా తనయుని నర్కనందనుని । జావళిక్షకులను సైంధవాదులను
గడతేర్చితిరి నేర్పుకలిమిమై మీరు । పుడమిపై నాకాది భువనంబు లెఱుఁగ.
నాపూన్కి నీ మద్రనరపాల వరుని । నేవునఁ జంపెద నెట్లంటిరేని,
గొనకొని నా తేరు కుడిదిక్కునందుఁ । దనరంగ నకులసాత్యకులు రావలయు ;
నిట సహదేవుండు నీద్రుపదజుఁడు । ఘటన నా వామభాగమున రావలయు ;
అనమునఁ గపికేతుఁ డతిశౌర్యమహిమ । యసలార నావెన్క నలమి రావలయు ;
భీముండు సంవర్తభీముని రీతిఁ । బ్రేమ నాముందటఁ బేర్చి రావలయు.
వచ్చిన, రుద్రుండు వడిఁగాచెనేని । యచ్చుగాఁ జంపెద నాశల్యుఁడెంత ?
కృప కృతవర్మాహికేతను లాది । చపలు లీతనిఁ గావఁ జాలియున్నారు.
అటుగాన మీరును నాయోధవరులు । ఘటనతో రాకుండఁ గాపాడరండు. "

## శల్య ధర్మనందనుల ద్వంద్వయుద్ధము

అన నట్లవారు నయ్యమసూతిఁ గూడి । చనుదెంచు నప్పుడు సంరంభవృత్తిఁ
గరి ఘీంకృతులు తురంగముల హేషములు । వరరథధ్వనులు నుర్వరఁ బిక్కటిల్ల
మృగరాజ యుగ్మంబు మెఱసిపోరాడు । తెగువ ధర్మజుఁడు మద్రేశుండుఁ బోర
వారి యుగ్రత చూచి వారువీరనక । పోరాడి రమరు లద్భుతమంది చూడ.
పనివడి యంతలోపలఁ గురురాజు । అనిలజు [1] సింహాంకమగు పతాకమును
వర శరాసనమును వాఁడితూపులను । బరువడిఁ జెండాడెఁ బరసేనలదర.

---

1. సింహాకమటు. (మూ)

అంతఁ గాలోదగ్రుఁడగు రుద్రుపోల్కిఁ । గుంతి రెండవపట్టి క్రూరుఁడై మండి
విలు గుణధ్వనిచేసి వికటాస్త్రమొకటి । చెలఁగి రారాజు మూర్ఛిల్లఁగా నేసి
సారథిశిర మొక్క శరమునఁ దునుమ । నారథికుని రథహయములు వేవేగఁ
దోలఁగ నీడ్చుకపోయెఁ దొడరి యారథము; । కలఁగె మూఁకలు మహాకలకలంబయ్యె.
అదిగని గురుసుతుఁ డాదిగాఁ గలుగు । విదితప్రతాప దోర్విక్రమోన్నతులు
అనిలనందనుఁ దాఁకి యంతటఁబోక । యనయంబు మద్రదేశాధీశుఁ గడచి
సమవర్తిసుతు నేయ, సరకుగాఁ గొనక । యమపట్టి జగజెట్టి యందఱ గిట్టి
యల మహారథికుల నశ్వసంహతుల । బలములఁ గరులను బహురథంబులను
విలయ శరాగ్నుల వెల్విడిసేసి, । కలయ నెత్తురువాన కాల్వల ముంచి
యత్యంతకాంతిస్యుఁడయి మృపుపుడిగి । సత్యప్రతాపుఁడై సమరంబు సలిపె.
'ఇతని నొంపంగరా దింద్రాదులకును' । 'ఇతనికి గురుశిక్ష యెట్టిదో!' యనఁగ
గమకంబు రెట్టింపఁ గలితోత్సవమున । దమ శంఖములు పూరితంబులు చేసి
యాగ్రహవ్యగ్రులై యకలంకవృత్తి । నిగ్రహాగతి మద్రనృపుఁడు ధర్మజుఁడు
పోరాడుచో, సైన్యములు తమలోన । "నీరీతి వీరల నిద్దఱఁజూడ
నేర్పున బలమున నిఖిలహుంకృతులఁ । గూర్చి తూఁచిననొక్కకొలఁది యూహింప.
వినను శల్యుని నణఁచి ధర్మజుఁడు । ఈనేలయంతయు నేలకపోఁడు,
కాక యీశల్యుఁ డీఘనుఁ జంపి లోక । మేకమై కౌరవుకియ్యకపోఁడు."
అని పల్కుచోట మద్రాధీశ్వరుండు । తనర ధర్మజుని కోదండంబు ద్రుంచి
శరముల నొప్పింప, సమవర్తిసుతుఁడు । వెఱవున మఱియొక్క [1] విలుపూని శల్యు.
మున్నూఱు తూపుల మూర్ఛితుఁ జేసి । క్రన్నన [2] వాజుల ఖండించి మించి
సూతుని దేహంబు చూర్ణంబు చేసి । యాతపత్రము ఱెక్కమవలీలఁ ద్రుంచె.
కరమాడకున్నట్టి [3] కల్యునిశల్యు । నురవడి నేకీను నొందునో యనుచు
ద్రౌణి యప్పుడువచ్చి తన తేరిమీఁదఁ । ద్రాణమై నిడి యేఁగెఁ; దదనంతరంబ
భూనాథ, శల్యుండు పోరిలో వికల । మానసుండైన ధర్మజుఁడు పెల్లార్చె;
సేనలు పరసేనఁ జెలరేఁగి తఱిమె. । మానక శల్యుండు మఱియంతఁబోక
తెలిసి వేఱొకతేరు తెప్పించి యెక్కి । విలుగొని పటురోష వికృతాస్యుఁడగుచు
గ్రహరాజుపై వచ్చురాహుచందమునఁ । దహతహ గోపాగ్నిఁ దఱిమి యేతెంచి

1. వెఱపూని. 2. రాజుల. 3. ఖల్యు. (మూ)

ధర్మజుఁ దాఁకి మద్రక్షమావిభుఁడు । చర్మభేదనవారసంధేయుటయును,
అది ద్రుంచి ధర్మజుఁ డంబకంబొకటి । యుదరమేయుటయు శల్యుఁడు మూర్ఛనొంది
తెరమిడి మఱికొంత తడవుకుఁ దెలిసి । పరమార్గణోదగ్ర వర్షంబు గురిసి
యలుకమై ధర్మజు నైదుతూపులను । గలఁచినఁ, గలఁగక కాలునిపట్టి
పఱియలుగా నంతఁ బసిఁడి కత్తళము । నఱకె జయోన్నతి నవశరంబులను.
నఱకిన శల్యుఁ డున్నతవిక్రమమునఁ । దఱలక కఠినకత్తళమొప్పఁ దొడిగి
మారుతిజోడు ధర్మజుని కత్తళము । ఘోరంబుగాఁ ద్రుంచి కోయసియార్చె.
ఆర్చి వారలవిండ్లు నరదముల్ హయులుఁ । బేర్చి బాణము లేసి పృథివిఁ గూల్చినను,
విరథుఁడై కౌంతేయవీరుఁడు వగలఁ । బరితాపమునఁ బొంది బహుచింతనొంది :
"యింకనాకీయాజి నెక్కడిజయము ! । పంకజాక్షుండన్న పలుకేలతప్పు !
ఈతని యేటుల కిట నేమిచెప్ప । నాతత బ్రహ్మాండ మవియకయున్నె !
గెలిచెదననుటెల్లఁ గేలిమైఁ గల్ల; । గెలువలేఁ డీశల్యుఁ గృత్తివాసనుఁడు.
మానమే తోడవుగా [1] మనుచున్నయట్టి । యేనేల పూనితి నీ రణంబునకు !
సత్యభామాప్రాణసచివుని మాట । సత్యంబుగాక యసత్యమేలగును !
వినఁ గానిమ్ము నాయాత్మరోషంబు । ధీనుతగతితోడఁ దివురుచున్నదియు;
ధార్తరాష్ట్రుల యిష్టదైవమైనట్టి । ధూర్తు శల్యునిఁ ద్రుంతు దురములో నిపుడు."
అనియాత్మలోపల నఖిలాండ నిలయు । వనమాలి సద్భక్తవత్సలు శార్ఙ్గి
వేదాంతవేద్యుని [2] విశ్వైకజనకు । నాదినారాయణు నంబుజోదరునిఁ
దారకబ్రహ్మ విస్తారక మూర్తిఁ । గారుణ్యగుణలోలుఁ గల్యాణశీలు
దేవకీనందను దివ్యప్రకాశు । శ్రీవిష్ణుఁ గృష్ణు సుస్థిరముగా నిలిపి
'నరుఁడాజిసేయుచో నరుని యగ్రమున । వరశూల హస్తుఁడై వైరిసంఘములఁ
బరిమార్పఁ గంటి నేఁ బార్వతీనాథు । నరుదార నతనికి నంజలి సేతు'
నని యిష్ట దేవతా ప్రార్థన చేసి । యొనయ నమ్మద్రేశు నేసి నొప్పించి
చాపంబు నుగ్గాడి సారథిఁ దునిమి । తూపులఁ దేరుతుత్తునుకలు చేసి
కవచంబు ఖండించి కాండత్రయమున । వివశుఁగా నేసిన, విరథుఁడై నిలిచి
వాలును బలకయు వడిఁ బూనివచ్చి । వాలిక యమునికై వడి నరుదేరఁ,
గరువలిసుతుఁడు నగ్గలిక బెగ్గలిక । కరవాలుఁ బలకయు ఖండించివైచె.

---

1. మనినట్టియేను. 2. విశ్వేశ. (మూ)

వైచినఁ జలనంబు వడినాత్మలేక । చూచి వేఱొకగద సొరిదిఁ ద్రిప్పుచును
వచ్చినఁ, గవ్వడి వరబాణమొకట । గ్రుచ్చి ఖండించి మిక్కుటముగా నార్చె.
అంతఁ గంకటధారియై భీరువోక । పంతంబుతోడ నప్పార్థునిఁ గదియ
నావేళ శైనేయుఁ డది ద్రుంచివైవ । నావలనొకశూల మంకించివాఁడిచె.

ధర్మజుఁడు శక్తి ప్రయోగించి శల్యునిఁ జంపుట.

పొడిచిన నదివెలిపుచ్చి ధర్మజుఁడు । కడుఁ బెక్కుతునియలుగఁ ద్రుంచివైచి
విడువని చలమున వెనుకకుఁ బోక । తడయక వీనితోఁ దడవేల యనుచుఁ
బరమేశ్వరుఁడు మున్ను పాలించినట్టి । సురుచిరంబగుశక్తి సొరిది నర్చించి
వేదమంత్రంబుల వినుతులొనర్చి । యాదటఁ గలితాట్టహాసమౌదాని
శత్రుసూదన జయస్థానమౌదాని । వృత్రారి పరిభూతి వెలసినదానిఁ
గాలదండాకృతిఁ గైకొన్నదాని । ప్రేలుఁతేతాగున్నల విధమైనదాని
ఘర్ఘర ఘనఘోష గాఢమౌ దాని । నిర్ఘాత నిబిడ సన్నిహితమౌదాని
ఘుమ ఘుమాకారమై ఘోషించుదాని । సమవర్తిసూతి హస్తమునఁ గీలించి
రాజులలో ధర్మరాజ నాదేని । యోజ నాతమ్ము లత్యుత్తములేని
దేవిపాంచాలి పతివ్రతయేని । దేవకీసుతుఁడు నాదిక్కగునేని
కురుబలం బొవకుతిగొనఁ గల్గుదేని । సిరుల సామ్రాజ్యంబు చేకొందునేని
యీదుర్మదాంధుని నీశల్యుఁ బట్టి । యీదివ్యశక్తిచే నిటఁ ద్రుంచువాఁడ."
అనివైచెఁ గాలోరగాకార శక్తిఁ । బనుపడి మననేన పరసేన లదర.
అది మింట మంటలు నదరంట నంటఁ । ద్రిదశులు భీతిల్ల దిక్కులుద్రెళ్ల
వారిధుల్ కలఁగంగ వసుధ కంపింపఁ । దారలు డుల్ల భూధరములు డొల్ల
[1] శతశత శతకోటి సన్నిభంబగుచు, । నతి కాలకూట కూటాధికంబగుచుఁ
జండ మార్తాండ ప్రచండ దోర్దండ । చండిమ సత్ప్రభా సంభ్రమంబగుచుఁ,
గిన్నర గంధర్వ ఖేచర యక్ష । పన్నగ గుహ్యక భయదంబు నగుచు,
నివుడుచు నమ్మద్రనృపవరు భద్ర । కవచంబుఁ ద్రుంచి యొక్కట నురస్థలము
వ్రక్కలుగాఁజేసి వడిఁదూఱి పాఱి । తక్కకాశక్తి పాతాళంబు గాఁడె.

1. శతశతాయుత. (మూ)

ఆ శక్తిపాతంబునందు శల్యుండు । ఆశయ్య పవిఁగ్రుంగు నద్రీంద్రుభంగి
వెడవెడ మూర్ఛన్నువెట్టి త్రిమ్మరుచుఁ । బుడమిపై నప్పుడు బొరగిలఁ బడియె.
సదయుఁ డజాతశాత్రవునితోఁ బోరి । కుదిసి పాపము గట్టుకొన్నట్టి తప్పు
ఏవిధంబునఁ బాయుదిఁకనని తలఁచి । భావజ్ఞుఁడగుఁగాన భక్తియుక్తులను
శిరము ధర్మజుదిక్కు చేతులుచాచి । యిరవొప్ప సాష్టాంగ మెఱఁగెనో యనఁగ
రతులచేఁ జొక్కిన ప్రాణేశ్వరుండు । సతికుచ యుగళిపై జాఁగెనో యనఁగఁ,
కేలీ వినోదమై క్షితికాంతఁజేరి । యాలింగనము చేసె నర్థితో ననఁగఁ,
గురుకుమారకులెల్లఁ గోరి [1] తోడ్తెచ్చి । పరఁగ శల్యుని యాగపశువు గావించి
కొదలేని ధర్మజు కోపాగ్నిచేతఁ । గదనరంగంబను ఘనకుండమందుఁ
బూర్ణాహుతుల వ్రేల్చిపోయిరో యనఁగ । నర్ణవధ్వని శల్యుఁడణఁగుట చూచి
ధర్మజుఁ డఱనవ్వు దళుకొత్తుచుండ । నర్మిలిఁ దనవారి కప్పుడిట్లనియె:
" జగతి భీష్మద్రోణ సైంధవాదులకు । మగఁటిమి నెక్కుడై మలసిన ఘనుఁడు;
వీఁడాజిలోపల వెసఁగ్రుంగెఁ గాన । నేఁడువో కురురాజు నిజముగాఁ జచ్చె.
మానహాయంబున మెఱసె నాకీర్తి; । వాసవాదులు నన్ను వడిఁ బోలలేరు.
భీమునిచేఁ గురుపృథ్వీశ్వరునిని । భీమాహవమునఁ జంపించెద నిపుడు.
కురుశేష మాహుతిగొని నన్నుభూమి । పరిపాలనప్రౌఢిఁ బాలింపుఁ " డనిన
విని యెల్లవారును వెస నుత్సహించి । యనిసేయఁ దొడఁగుచో నపు డేమిచెప్ప
శల్యుఁడీల్గుట మనశ్శల్యమై వగలఁ । గల్యంశభవుఁడు తక్కక మూర్ఛనొందె;
కృపుఁడు వాపోయె; నాకృతవర్మ శకుని । లపుడు దుఃఖించిరి యాసమయమునఁ
జననాథ, శల్యుని సహజన్ముఁ డొకఁడు । ఘనుఁడు ధర్మజుఁ దాఁకి కడుసంభ్రమమునఁ
దుములంబుగా వచ్చి తూపులు వఱప । సమవర్తిసుతుఁడు విచ్చలవిడితోడ
వానిసారథిఁజంపి వాజులఁదునిమి । మానైన యొక దివ్య మార్గణంబునను
మరకతమాణిక్య [2] మకుటాఢ్యమైన । శిరమటు ఖండించి చెలరేఁగి యార్చె. "
అని సంజయుఁడు చెప్పె నాంబికేయునకు । నని ముని జనమేజయ క్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ దెలఁగి యమిమ్నాఁద । నెప్పాటఁ గథచెల్లె నెఱిఁగింపు మనిన
రాజశేఖరనుత, రాజీవనయన, । తేజోదివాకర దేదీప్యమాన,

1. తోడ్తెంచి. 2. మకుటోక్త. (మూ)

నరకాసురాంతక, నగధర, కృష్ణ, । మురహర, సర్వేశ, పురుషోత్తమాఖ్య,
ఘనమాని హృద్గేహ కలిత సందోహ । వినుతప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర వర్య
రచితమై శల్యపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొక్కటియయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ కలితాకార, చిత్తజ జనక, । కాకోదరాధీశ ఘనభోగ శయన!
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
ఆరీతి మద్ర దేశాధీశ్వరుండు । ధారుణీ నాతనితమ్ముండుఁ దెగినఁ
గుపితుఁడై కృతవర్మ గోవిందునను జుఁ । జపలత నొప్పించి చాపంబు ద్రుంచె.
త్రుంచిన మఱియొక్క దొడ్డచాపంబు । మించిన శౌర్యంబు మెఱయంగఁదాల్చి
పోకు పోకిఁక నెందుఁబోయెద వనుచు । వీఁకమై నాతని విల్లు రథంబు
సూతాశ్వ పటలంబుఁ జూర్ణంబుచేయ । నాతఱిఁ గృపుఁడంత నడ్డంబు వచ్చి
తన తేరిపై నిడి దవ్వులఁ దొలఁగె । మన సేనలటు వాఱె మండలాధీశ!
అంత నా పార్థివుఁడట వేఱె తేరు । సంతోషమున నెక్కి సాత్యకిఁదాఁక,
నెడచొచ్చి ధర్మజుఁడేపున నతని । కడిఁది రథాశ్వ సంఘముల ఖండించె.
హరులు నాశంబైన యాదవోత్తముని । గురునందనుఁడు వచ్చి కొనిపోయెఁ దొలఁగ.

## శల్యుచుట్టము లొక్కమొగి ధర్మజుఁ బొదువుట

అపుడు కృపాచార్యుఁ డా ద్రోణసుతుఁడు । నృపులును రాజులు నెమ్మితోఁ గొలువఁ
జారుప్రతాపులు శల్యుచుట్టములు । కోరికఁ గోటానకోటులు గొలువ,
సకలకుంజరములు సకలాశ్వములును । బ్రకట కాల్బలములుఁ బ్రముఖులై నడవ,
దానధారల మదదంతిపై నెక్కి । భానుదీప్తులఁ జాలఁ బరిహసింపుచును
గురుతింప నీపెద్దకొడుకు కౌరవుఁడు । తిర మొప్ప రెండవ దేవేంద్రుఁడనఁగఁ
బఱతెంచి చతురంగ బలములుఁ దాను । నఱిముఱిఁ బరసేన నంటఁగఁ దాఁకె.
తాఁకినచోట నాధర్మసూనుండు । నాక్రీడియును భీముఁ డాసాత్యకియును
ద్రుపదసంభవులు బంధురసైన్యములును । నిపుణతఁ దాఁకిరి నీ కేమిచెప్ప.
తాఁకినఁ గురురాజు తనయాత్మలోన । "వీఁకమై నీక్రీడి వ్రేల్మిడిలోన
సకలసైన్యంబుల సమయింపఁ గలఁడు. । ... ... ... ... ...
ఇవ్వీరుఁ దాఁకఁగ నెవ్వఁడు గలఁడో! । దవ్వులమనసేన దగిలి పాఱెడిని;

నేనంటినా పగనెఱినింత దెగఁడు ; । మానుగాఁ గృపుఁడంటిమా చొరఁడతఁడు ;
కృతవర్మనంటిమా గీడ్పడినాఁడు; । కృతము సౌబలుఁ డిందుఁ గినియంగ వెఱచు;
తక్కినవార లుద్ధతి మోహరింపఁ । దక్కుదురిట, నాకుఁ ద్రాణమైనట్టి
ద్రోణసూతియె కాని తోడరంగ లేఁడు, । నాకెంబుగా" నని నయమొప్పఁ బలికె:
"గురుపుత్ర, మనసేనకును నాకు దిక్కు । అరసి చూచిన నీవె యన్యులు లేరు.
నమ్మితి నే నిన్ను నా సేనఁ గాచి । నెమ్మి రక్షింపు మన్నించి యీ వేళ.
శల్యుఁ డీల్గినచోట సమరభారంబు । తొల్యత నీవె కా లలి నాత్మఁ దలఁపు.
కౌంతేయవరులను ఖండించి మించి । వింతగా సామ్రాజ్యవృత్తి నా కిమ్ము."
అనవు డశ్వత్థామ యధపతిఁ జూచి । ఘనతరశౌర్యంబు గానరాఁ బలికె:
"ఇంత చెప్పఁగ నేల యిభపురాధీశ! । రంతుగా నిట్టి భారము నాదిగాదె!
ఈ సేనఁ గావక యే నూఱకున్న । హాసంబు సేయరే! యఖిలమానవులు.
దేవర యొక్కింత ధృతి చిక్కఁబట్టి । భావించి చూడుఁడేర్పడ" నంచుఁ దోడరె.
అంత నర్జున కీచకాంతకులొక్క । సంతత సంధాన శరవృష్టిచేత
మద్రాధిపతి సేన మాటమాత్రమున । క్షుద్రమై యమపురిఁ జొరఁ జేసి రపుడు.
పగవారి నణఁచిన పాండవసేన । యగణితధ్వనుల మిన్నగల నార్చుటయుఁ
బరవశమై ప్రాణభయమునఁ బొంది । నరనాథ, మనసేన నాల్గుదిక్కులకుఁ
బఱవ విషణ్ణుఁడై పౌరవేశ్వరుఁడు । అఱిముఱిఁ బెద్ద శోకాతురుండగుచుఁ
"గొసరక దైవానుకూల్య మెవ్వరికిఁ । బసగలుగును వాఁడె పార్థివేశ్వరుఁడు.
ధరణి నిర్భాగ్యుండు తత్పదబుద్ధి । పరుఁడు కానేర్చునే పరికింప నెందు?
డాఁకొన్న కపటనాటకసూత్రధారి । కైకొని యట వారికర్తయైయుండ
మహియంతటికిని ధర్మజుఁడె రాజగును; । సహజమై తనకపజయమె గాఁబోలు."
ననుచుఁ జింతాక్రాంతుఁడై యుండె ననిన । విని యాంబికేయుండు వేదనఁ బొంది,
"గాంగేయుఁ డాచార్యకర్ణాదిరథులు । సంగరంబున నేడు చచ్చినట్లయ్యె;
కడు యోధులఁట మఱి కవ్వడి భీము । లడరంగ జయమేమియరుదు చర్చింప!
హరి భక్తులకు నేలయాపదగలుగు ? । హరి పరాయణులకు నఖిలభూపత్వ
... ... ... ... ... । సిరులు ముప్పిరిగొని చేకూరకున్నె !
అటుగాన హరినొల్లనటువంటి మనకు । నిటువంటి కీడొంద కేటికి మాను !
అరిభంజకంబును నరివినాశకము । హరిభక్తియే గాన హరిభక్తులకును

సరిసమానులులేరు సంజయ, భువిని. । వెరవొప్ప మేల్గిడు నెనకపోరాదు
ఘనత నాతరువాతికథ చెప్పు" మనిన । నెనయంగ సంజయుఁ డిట్లనిపలికె :
"తనసేనపఱచినఁ దలఁకిరారాజు । కనలి యేనుఁగుడిగ్గి ఘనరథం బెక్కి
యలఘుఁడై సేనల కడ్డంబు వచ్చి । యెలుఁగెత్తి "ననుజూడుఁ డేలపాఱెదరు?
అడవులు కొండలునట మహాగుహలు । నడరి శాత్రవకోటి కడ్డంబులగునె !
ధీరత ననిలోనఁ దెగి పాఱువాఁడు । ఆరయ యమపురి నరిగాఁపు గాఁడె !
అటుగాకనిల్చిన నాజిఁ జచ్చినను । దటుకున నింద్రపదంబు సిద్ధించు ;
గెలిచిన సత్కీర్తి గల్గును నిండు ! । నెలకొన్న ప్రాణంబు నిత్యంబుగాదు.
కొంచెపు సేనతో గోవింద జిష్ణు । లంచితంబుగ డస్సి యడెయున్నవారు.
మీకేల మగఁటిమి మేలు వోకార్చి । కాకులగతి ధాత్రిఁ గడవఁ బాఱఁగను !
గెలుతు నవశ్యంబు కితవశాత్రవుల । నిలువుండు నడువుండు నెఱిఁ జంపుఁ డరుల."
అని సేనఁ బురికొల్పి యబ్ధీంద్రునకును । ఘనతఁ జెల్లెలికట్ట కరణియైతాఁకె.
తాఁకిన నప్పుడు ధరకు లంఘించి । కాఁకమై భీముండు గద త్రిప్పి పేర్చి,
"కౌరవాధములార ! కఠినాత్ములార ! । యీరీతి మృతిగోరి యేలవచ్చెదరు ?
నాగద మాడుఁడు నరుఁ జూడుఁడిపుడు । ఏగతిఁ బోదురో యెఱుఁగరు మీరు.
వలవదు నాదృష్టివలలకుఁ బాసి । తొలఁగుఁడు తొలఁగుఁడు దూరంబుగాను."
అనుచు రోషాభీలుఁడై బాడబంబు । వనరాసు లింకించువడువునఁ దొడఁగి
వినువ కిర్వదిరెండు వేల సద్భటులఁ । బొనఁగఁ గురుక్షేత్రమునకు బలిచ్చె.
ఆమెడఁ గరిరథ హయసమూహములు । సాయక తమసేనపైఁ గదియుటయు
గాండీవి లయకాలకాలుఁడై పేర్చి । ఖండించె వ్రేల్మిడి గజసహస్రముల.
నకులానుజన్ముఁడు నకులుండుఁ గూడి । యొకటియై చంపుచో నొగినేమిచెప్ప

### ధృష్టద్యుమ్న సాత్యకులచే సాల్వుఁడేనుఁగుతోఁగూడ మడియుట

నంత సాల్వుఁడు మదహస్తిపై నెక్కి । మంతనంబున మాఱుమలయుచు వచ్చి
కరుల ఘోటకములఁ గాల్బలంబులను । శరవహ్నిఁ గాల్చుచు శమనజుఁ దాఁకి
కౌంతేయ విభులపైఁ గడిమిచూపుటయు । వింతగా నది చూచి వెసద్రుపదజుఁడు
నవలీల మార్కొన్న, నతనిపై హస్తిఁ । [1] గవియించి డీకొల్పి కడఁగితొక్కింప,

1. గళయించి. (మూ)

నతఁ డర్ధమార్గంబునందు వేతోలి । వితత గుణధ్వని పిక్క మ్రోయించి
హస్తి కుంభస్థలి యటుచూచి పేర్చి । ప్రస్తుతమతి నొక్క బాణవాతమ్ము
దొడిగి యేసిన, దాని తుండంబు దూఱి । యడయక కుంభమధ్యము వ్రక్కలింప
ఛిద్ర ఘీంకారంబు సేయుచు మఱిడి । భద్రగజేంద్రంబు పాఱెఁ; బాఱుటయు,
నంతఁ బ్రకోపుఁడై యానాల్వనృపతి । దంతావళంబు నుద్ధతి మఱిడించి
ద్రుపద సంభవుఁ దోడుతోఁ గదియించి । నిపుణుఁ డాతని తేరు నెఱి నెత్తఁబడప
నట్టి యావారణ మది కబళించి । పట్టిన, భీతుఁడై పాంచాలసుతుఁడు
మెట్టిన లగువున మేదిని దాఁటి । కట్టెఁడిజయమేది గదగొని పాఱె.
అంత నాతని తేరు హయసారథులను । నంతయు సాల్వుండు నిభముచే నపుడు
దివికి నెత్తించి వే త్రిప్పించి భూమిఁ । దొపికి వేయించి తాఁ ద్రొక్కింపఁ జూచి
కరువలి సుతుఁడు శిఖండి సాత్యకియు । శరవృష్టి గురియుచు సాల్వుఁ దాఁకుటయు,
నా సాల్వుఁ డందఱసంబరంబులను । ఓసరింపఁగఁ జేసి యుగ్రుఁడై పేర్చి
సరసతఁ దను విలుచ్చకులు మెచ్చఁగను । ఉరుతర జ్యాఘోష మొనరించుటయును
పాంచాల సుతుఁడంతఁ బాటించి సిగ్గు । మించిన కడిమిమై మెఱయ నేతెంచి
గాంభీర్యమూర్తియై గదవుచ్చి యపుడు । కుంభి కుంభస్థల కూటంబు వ్రేయ,
నదియు ఘీంకార శబ్దావలితోడ । మదమేది గిరిగూలుమాడ్కిఁ గూలుటయు,
నాసమయంబున నసహ్యతాపజుఁడు । నా సాల్వభూపతి నట్టిట్టనాక
శితశిలీముఖమున శిరముఖండింపఁ । బ్రతిలేక మనసేన పాఱెఁ; బాఱుటయుఁ
దదనంతరంబ యాదవపుంగవుండు । చెదరకుండఁగ సేనఁ జయ్యననిలిపె (?)
కృతవర్మ సాత్యకిఁ గేలిమైఁ దాఁకి । చతురత నాతని చాపంబు ద్రుంచె.
త్రుంచిన వేఱొక్క దొడ్డచాపంబు । సంచితగతిఁ బూన్చి యా రథాశ్వములఁ
జావంబు నూతునిఁ జక్కాడి వైవ । నాపజ్జ విరథుఁడై యా కృతవర్మ
శూల మొక్కటి గొని చూచి సాత్యకిని । నోలిమై వైచిన నొగిఁ ద్రుంచె నతఁడు.
త్రుంచి యంతటఁ బోక తోడైన నతని । గంచు[1] మించుగ నేయఁ గనలి కౌరవుఁడు
పాండుసూనులమీఁదఁ బైఁబడి దోఁప । చండమదోద్వృత్త శరపరంపరలఁ
బొదివి వారలసైన్య[2] భూరివారాశి । మదమొల్ల నాభీల మథనంబు చేసె.
అంతఁ బాండవులును నఖిలసేనలును । బంతంబు తీయక పైఁబడి పోర

1. లెంచుగ. 2. బోరి. (మూ)

నా వీరవరుఁడంత నాగ్రహవృత్తి । భూవినుతంబుగఁ బోక తానిల్చి
నతశక్తి ధర్మజు నూఱంబకములఁ । బ్రతిన మారుతిని డెబ్బది సాయకముల
సహదేవు నెనిమిది శరముల నకులుఁ । దహతహ నాలుగస్త్రములను మఱియుఁ
బాంచాలసుతుని [1] సప్తాంబకంబులను । బాంచాలిసూనులఁ బంచశరముల
సాత్యకి నన్నూఱు శరములనేసి । యత్యుగ్ర మూర్తియై యార్చి సైన్యములఁ
బదిటఁ బన్డెంటను బదుమూఁట మూఁట । విదితంబుగా నేసి వెస నంతఁ బోక
నకులానుజుని విల్లు నడిమికిఁ ద్రుంప । వికలుఁడై యతఁ డొక్కవిల్లు సంధించి
వదపడి [2] పోరుచోఁ బాండవసేన । లదయులై శరవృష్టి నాఁగిన, నతఁడు
దృష్టిచలింపక తిరుగుడు వడక । దృష్టినిఁ గరములఁదీవ్రత చూపి,
తనువుల నెత్తురు దట్టమై భువిని । ఘనతఁ బ్రవాహంబుగఁ బ్రవహించె.
మన సేన లారీతి మఱి పాండురాజు । తనయుల సేనలఁ దగనొంచుచోట,
ననఘు ధర్మజుమీఁద నప్పుడాశకుని । తనపాటు చూడక తావచ్చి తాఁకి
శరములు వర్షించి శమనజు తేరి । వరహయంబులఁ బట్టి వారకకూల్చి
యవశుఁగా నేయుచో నంతటిలోన । నవనీశ, సహదేవుఁ డడ్డంబు వచ్చి
తన తేరిపై ధర్మతనయుని నునిచి । కొనిపోయె నప్పుడా ఘోరాజి వెడల.
మఱివేఱు తేరు ధర్మజుఁడపుడెక్కి । యఱిముఱిఁదాఁకి ఘోరాస్త్రంబులేయ
శరముల నవి ద్రుంచి సౌబలుఁడేచి । యురయంగ ముంచెఁ దోయధిముంచినట్లు.
నకులుని తోడుత నవ్య విక్రముఁడు । శకునిసూనుఁడు పోరె జయకాంక్షమహిమ.
వడిసాత్యకియుఁ గృతవర్మయుఁ దొడరి । విడువక పోరిరి విశ్వంబు దలఁక.
ఫాల్గుణిఁ గృపుఁడును ద్రౌపదిసుతులుఁ । బోరిరప్పుడు మహాద్భుత శక్తి మెఱసి.
మఱివారిభటులును మనవారిభటులు । నుఱక పోరాడిరి యుర్వీతలేశ !
అమరేంద్రసూనుఁ డట్లాతుములమున । సమరసైన్యము [4] బారిసమరుచు వచ్చి
కృపురథాశ్వముల నిష్కృతి నేలఁగూల్చ । నపుడు ద్రోణతనూజుఁ డడ్డంబు వచ్చి
తన తేరిపై నిడి దవ్వుగాఁ బోవఁ ! । గనుఁగొని కౌరవాగ్రజుఁడు రోషించి
రయమున నేనూఱు రథములవారి । భయమేది యయ్యుమపట్టిపైఁ బనుపఁ,
గనుఁగొని యంత శిఖండి కోపించి । కనుఁగవ నపు డగ్నికణములు దొరుఁగఁ
బూని యొక్కనినైనఁ బోరిలో బ్రదికి । పోనీక నిశ్శేషముగా జంపివైవఁ,

1. సప్తమార్గణంబుల. 2. పొరుచో. 3. ద్రుంచె. 4. బారజమరుచు. (మూ)

దఱచైన యుత్పాతతతులు చూచుచును । బఱచెను గురుసేన బహుముఖంబులను.
ఆ దుర్నిమిత్తంబు లవి లెక్కగొనక । యాదట సౌబలుం డహి కేతుకనియె :
" ఓసుయోధన, నీకు నొకటిచెప్పెదను । నాసాహసంబును నను జూడు మిపుడు.
మోహరింపుఁడు సేన ముఖమున మీరు. । ఆహవంబున నేను నా పాండుసుతుల
ఖండించి సామ్రాజ్యకలితుఁగా నిన్ను । దండిగా నేలింతు ధరణి యంతయును;
పాలించి యనువు నీపాదంబులాన; । గాలిమాటలు గావు కనుఁగొను. " మనఁగఁ
బొల్పడినట్టి యాబలుమొగ్గరంబు । వేల్పువట్టినవాని విధమునఁ జూచి,
కడు సంతసిల్లి యగ్గాంధారిసుతుఁడు । తడయక శకునితోఁ దా నిట్టులనియె :
" మున్ను ద్యూతనిమిత్తమున రాజ్యమెల్ల । నెన్నఁగ గెలిచి నాకిచ్చితిగాదె !
మొనసి యాహవరంగమునఁ బాండుసుతులఁ । బెనఁచి యిప్పుడునీవు భీకరాస్త్రముల
పాలుగావించి నిర్భయవృత్తి రాజ్య । మేలింపు మామ, నీకిదె వేళ." యనిన
సౌబలుఁ డాహవోత్సాహంబు మీఱఁ । గా బలంబులతోడఁ గడఁగిన, నపుడు
అంతకసుతుఁడు తనంతరంగమున । సంతసంబంది యా సహదేవుఁ జూచి :
"భీతిల్లి పోరాని పెడమొగ్గరంబు । నాతత కాంభోజయవనాశ్వములను
గూడి పెల్లార్చుచు గుణనిస్వనములు । నోడక [1]గావించి యొనరఖడింపు."

## శకుని సహదేవు లాశ్వికసహాయులై ఘోరంబుగాఁ బోరుట

మనవుడు నట్లకాకని మాద్రిసుతుఁడు । మనమున రాగిల్లి మఱి విజృంభించి
తొడరి పోరాడుచోఁ, దుములంబునందుఁ । బడ వచ్చువారును బడియెడువారు,
మల్లయుద్ధంబున మ్రగ్గెడువారు, । భల్లాయుధంబులఁ బడ వ్రేయువారుఁ
గరవాలములఁ దలల్ ఖండించువారు । సురియలఁ జెండాడి స్రుక్కించువారు
గదల నెత్తులు వివ్వఁగాఁ గొట్టువారు । పదముల నొండొరుఁ బడఁ దన్నువారు
నొకని గుఱ్ఱంబుపై నొకఁ డెక్కువారు । సకలంబుగా నస్థిచయ మేర్చువారు
పొడిచి గంట్లను దూరిపోయెడువారు । తొడిఁబడ గుండెలు దొరిఁగించువారు
ముక్కులుఁ జెవులును మొగిఁ ద్రెంచువారు । చక్కగా హయములఁ జంపెడివారు
నీరీతిఁ బోరాడ నిరువాగురణము । ఘోరమై యుండె నెక్కుడు పేర్మితోడ.
అంత సౌబలుతోడ నాసహదేవుఁ । డెంతయుఁ బోరుచో నిటద్రుపదజుఁడు

1 రానిచ్చి. (మూ)

తెలియక కలఁగక తెగువవీడ్వడక । యలుతేని కడఁకతో నస్వమువ్వాంగి
యతుల రౌద్రాకారుఁడై చెలరేఁగి । ప్రతివీరసేనల బహురక్త శల్య
భూరిమేదోమాంసములుఁ బునుకలును । ధారుణి రాల్చుచు ధరఁ గూల్చుచుండె.
ఆరీతి నుభయ సైన్యంబులవారు । వీరులై ధీరులై వెస ససహాయ
శూరులై క్రూరులై సారిదిఁ [1]బోరఁగను । ... ... ... ... ...
పాంచాల సుతునొంచి బలియుఁ డాశకుని । యంచిత ద్యుతుంతో నట వేగ మరలి
"వేఁడి కౌరవరాజు వేఁడి నాస్వామి । వేఁడి వేఁడి" యని వెదకుచు రాఁగఁ
జతురత శకునితో సైన్యమిట్లనియె : । "హితమతిఁ గౌరవు నిక్కల వెదక ?
అదెచూడు సేవల [2]నాఁచుచున్నాఁడు; । పొదలి పాండవులతోఁ బోరుచున్నాఁడు;
పోవలసిన నందుఁ బో" మ్మన్నఁ నతఁడు । నావేళ నావిభు నర్తర్తి చూచి
చేరంగఁజనుదెంచి చెలఁగి యిట్లనియె : । "పౌరవేశ్వర, మెండుబలములనెల్లఁ
గరితురంగాదులఁ గడతేర్చినాఁడ. । ధరణి నీవేళల దాఁగక మనము
ప్రాణవంచన లేక [3]పైకొన్నఁగాక । త్రాణఁ బాండవులను ధర గెల్వరాదు."
అనిన సంతోషించి యాకౌరవుండు । తను గూడుకొని మదోద్దండుఁడై నడవఁ
గేశవుఁ గనుఁగొని క్రీడి యిట్లనియె : । "ఆశమానఁడుగదా యహికేతనుండు !

## దుర్యోధనుని మార్ఖ్యంబుద్దేశించి కృష్ణార్జునులు సంభాషించుట

వెనుఁబాటు మది నరవీసంబు లేక । యనిసేయఁ దివురుచున్నట్లున్నవాఁడు.
వీఁడుగో మనసైన్య వితతి మధ్యమున । వాఁడిమి వాటించి వచ్చుచున్నాఁడు.
వచ్చుఁగాకేమి నా వాఁడిబాణముల । గ్రుచ్చెదఁ గురుసేన కుంభినిఁ గూల.
ఉడుగక తీవ్రత కోపలేననక । తోడరి రథంబీవు తోలుమీ కృష్ణ !
తివిరి పద్నెనిమిది దివసంబులయ్యె । వివరించి యరిసేన విసిగితి నలికి.
పూర్తిమైఁ బోలని పోల్కినున్నదియు (?) । ధార్తరాష్ట్రులసేన తలుగదేమియును.
నిచ్చలుఁ బరికింప నిన్ననేఁటికిని । మచ్చిక మనసేన మహినెంత యణఁగె.
ఆపగానందనుఁ డనిఁ జన్నపిదప । నీపౌరవుఁడు సంధికిట వచ్చునసుచు
నామదిలోఁ దోఁచె నది నొల్లఁడయ్యె । నేమనఁ గలదింక నిందిరారమణ !

---

1. బోరుమను. 2. నేఁచు. 3. పోరిన. (మూ)

మున్నాజిలోన భీష్ముని చావుచూచి । యెన్నఁగా భగదత్తుఁడీల్గుట చూచి
యనిలోన సైంధవుఁ డణఁగుటచూచి । గొనకొనియాచాపగురు చావుచూచి
దుశ్శాసనుని చావుతొలఁగకచూచి । దుశ్శీలి కర్ణుండు ద్రుంగుటచూచి
గుడ్డిపాపాత్ముండు గుదియింపఁ డయ్యె, । దొడ్డమూఢుఁడుగదా ! దుర్యోధనుండు.
పోఁకిప్పుతు మదివ్రూనట[1]యెన్న । వీరుఁడింతటివాఁడు వెదకినఁ గలఁడె !
తుది నేఁడు శల్యుండుద్రుంగుట చూచి । యిదె వచ్చినాఁడు తానెంతటివాఁడొ !
కోరి భీమునిచేతఁ గూలిసఁగాక । యూరక తానేఁ యుర్విపాలిచ్చు !
సారసనేత్ర, నాచండకాండముల । ఘోరాజిసేనలఁ గూచ్చెద." ననిన
యాదవతిలకంబు నప్పార్థుఁ జూచి । "యీ దెస నీమాట లివి నిజంబగుఁ ;
రాయబారము మున్న రయమున నేను । ... ... ... ... ...
విదురుఁడెఱుంగఁగా వేవు రెఱుంగఁ । జెదరి నన్ బట్టఁజూచినవాఁడు గాఁడె !
అదిగాక ద్రౌపది నట భంగపఱచి । వదరిలక్ష్మికిఁ జెడఁ బాయంగఁజేసి
యాకలంబులు దిని యలమటఁబొందఁ । బ్రాకటారణ్యంబుపాలు గావించి
విరటుపాళెంబున వీడ్వడి నవఁతఁ । బొరసియుండఁగఁజేసి పోరి దండుగూర్చి
యిందువంశేంద్రుల నిట మనవారిఁ । గందఁ జేసినయట్టి కష్టుండు గాఁడె !
వీఁడు భీమునకెంత వీనిసైన్యముల । పోఁడిమి మాయించి పుడమిపైఁ గూల్చు."
అనిన ధనంజయుఁ డచ్యుతుకనియె : । "విను దేవకీపుత్ర, వీనిమార్గంబు ;
మతిచెడి నిన్నవమానించి పట్టఁ । జతురతఁ దలఁచిన శఠుఁడు దుర్జనుఁడు.
పాపికిఁ బాపంబె పథ్యంబుగాక । యేపార నీబుద్ధి హితవుగాఁగొనునె !
కుతలంబునను వీని కొఱకునై వచ్చి । ప్రతిన రాజులు వృథా పాతమై తెగిరి.
జగతి భీష్మద్రోణ సైంధవప్రము । లగణిత పుత్రమిత్రామాత్య సుభట
కరిరథ తురగ సంకలిత యోధులును । సరవిమై ననిలోనఁ జావంగఁ జూచి
మది నొకించుక యనుమానంబు లేక । పదిలుఁడై మఱియును బఱతెంచినాఁడు.
చన మిగిలినవారిఁ జంపించి కాని । తనువు దొఱంగఁడు ధార్తరాష్ట్రుండు.
కురునాశనుండైన కురుకులేశ్వరుని । బలములఁ గడతేర్తుఁ బఱువుము రథము."
అనవుడు నౌఁగాకయని యచ్యుతుండు । ననిల సంకాశంబు నగు తేరు వఱపఁ
బావక నిభమైన బాణంబు లేసె. । పావని గదపూని పటు తేరు డిగ్గి

1. యొల్ల. 2. పాకమె. (మూ)

కరటి కుంభంబు లొక్కట విదారించి । పరఁగంగ ఘోటకపటలిఁ జెండాడి
రథములుర్వరఁ గూల్చి రథ్యాళి నొంచి । పృథివిపై భటకోటిపీఁచమణంచి
మఱి వేలసంఖ్యలు మాతంగసమితి । నుఱుక చెండాడి మహోగ్రత మెఱసి
కోపించి వాయువుకొడుకు నీసుతుని । దీపిత రథమంతఁ దెగువతోఁ బట్టి
యాడ్చి త్రిప్పుచు దివికెగురవైచినను । ఊచ్చినగతి నతఁడుర్విపైఁ బడియె.
పడిన నంతటిలోనఁ బవనతనూజు । కడరుచు నొక కొందఱాభీముఁదాఁకి
పోరుచో నలవారిఁ బోనీక యతఁడు । కేరుచు జముప్రోలికిని బోవవైచె.
అదిచూచి హతశేషమైన బలంబు । కదుపులు కదుపులై గదియువచ్చుటయు
నేనూఱు రథికుల నేన్నూఱుకరుల । మానితకాంభోజ మత్తవాజులను
ఎనిమిది వేవుర నిటఁ బదాతులను । బనుగొన నొక్కటఁ బ్రాణముల్ గొనియె.
ఆవేళ నందఱ కనిలాత్మజుండు । కావింప లయకాలకాలుఁడై తోఁచె.
దట్టంపు గుఱ్ఱపు దళముతో నంత । నెట్టన కురురాజు నెఱి సుదర్శనుఁడుఁ
గూడియుండుట చూచి గోపాలుఁడపుడు । క్రీడితోఁ బలికె సత్కీర్తితోఁ బొంగ:
"కవ్వడి, చూచితే కదనరంగమునఁ । గ్రొవ్వి చచ్చిరి వైరికురుకుమారకులు.
ఘోరతమంబుగా గుఱ్ఱపు గములుఁ । దేరులుఁ గరులును దెగటాఱిపోయె.
భీము నెంచెదరన్నఁ బృథుతరాటోప । కామారియే గాని గాఁడు మర్త్యుండు.
వేయేల నిను జెప్ప వెస నీకు నాకు । నోయున్నతాత్మక, యొగి వేఱులేదు.
ఖాండవంబేర్చి యాఖండలు గెలిచి । గాండీవమగ్నిచేఁ గైకొని మున్న
పరమేశుతోఁ బోరి పాశుపతాస్త్ర । మరుదారఁ గైకొన్న యాహవశూర!
అల్లదె కంటివే! యహికేతనుండు । తెల్లనిగొడుగున దీపించువాఁడు.
మనమీఁది కినుకతో మార్మలయుచును । ఒనవెట్టుకొని కాచుకున్నాఁడు చూడు.
ఒఱునున్న యసివోలె నొప్పుచున్నాఁడు । వెఱవఁడు; ఎట్టిదో వీని సాహసము!
తెగిరి వాయుజుచేత ధృతరాష్ట్రసుతులు, । తగవొప్ప నింకనిద్దఱుగాక ధాత్రి.
వీరనఁగా నెంత వీరలఁ జంపి । భూరి సత్కీర్తులు పొందుఁడుమీరు."
అనిన ధనంజయుఁ డచ్యుతు కనియె: । "వినుము భీష్మద్రోణ వీరుల నాజిఁ
జంపితి మీయల్పసైన్య మదెంత? । సొంపార నా పేర్మి చూడుము దేవ!
ఏనూఱు తేరులు నేనూఱు కరులు । నేనూఱు గుఱ్ఱంబు లిట రెండువేలు
కాలుబలంబులు గానరా వచ్చి । శూలమై యున్నాఁడు చూచితే! శకుని.

కృతవర్మ గురుసుత కృపులు తారేల । జితులు గాలేరు ; ఆజిని బోరలేరు ;
ఇంతమాత్రపుసేన నేనాజిఁ జంపి । పంతంబు మింతు నీ పాదంబులాన.
తలకొని వీరిని దండించు నపుడు । తెలియరా రాజు సంధికి వచ్చునొక్కొ !
ఏకార్యగతియును నిటఁ జూచుకొనెద. । ... ... ... ... ...
దేవకీనందన, తీవ్రవేగమున । నీవేళ నారథ మిటఁ దోలు. "మనుచుఁ
గరువలిసుతుఁడును గవలును నడవఁ । గురురాజుఁ డా.కి మిక్కుటముగా నేయ,
నెడసొచ్చి శకునియు నిట సుశర్ముండు । నడరి సుదర్శనుఁ [1] డాయనిలజునిఁ,
ద్రిగర్తవీరులుఁ దక్కటివారు । ధీగతిఁ బార్థుని దేవకీసుతుని
జలజల మన నంపచయమున ముంప । [2] నొలసి మండెడు వీతిహోత్రుఁడై నరుఁడు
వచ్చినవారల నమ్ముపోసీక । యచ్చుగా యమపురి కనిపి, వేవేగ
వారిబలంబుల వారినూనులను । వారివారినె కూడ వరుసతో ననిచె.
అంత సౌబలుఁడు మహాప్రతాపమున । నెంతయు సహదేవు నేపుమైఁ దాఁకె.

## ఉలూకుఁడు సహదేవునితోఁ బోరి మడియుట

తాఁకినచోటఁ దత్తనయుఁడులూకుఁ । డాఁకొన్న పులివోలె నాక్రమించుటయుఁ,
గొడుకును దానును ఘోరాస్త్రములను । విడువక సహదేవు వెసనొవ్వనేయఁ,
బదియింట నాతని భంజించి విల్లు । వదలక తెగనేయ, వాడిమిచూచి
శకుని తనూజుఁ డచ్చలము రెట్టింప । వికవిక నవ్వి యవ్వీరునిఁబలికె:
"సహదేవ, మాతండ్రి చండకార్ముకము । నహహా త్రుంచినయట్టి హస్తముల్ ద్రుంతు ;
చూచి తప్పించుకో శూరుఁడవైన ; । నేచియుఁ గాదేని యిటఁ బాఱిపొమ్ము."
అని పావకజ్వాలలైన బాణముల । మునుకొని యేయ నిమ్ముల మాద్రిసుతుఁడు
అవి తెగవిడివడి యట రాకమున్నె । యవనీశ, యాతని హస్తముల్ద్రుంచె.
త్రుంచి యంతట సహదేవుండు కినుక(?) । మించి "యులూక, మేల్మేలురా! నీవు
నొకటి నీమదిలోన నొగి నెంచియుండ । వెకలి నిన్ బాలించు విధి యొక్కటెంచె.
నిగిడి నన్నేయఁ బూనినయట్టి చేతు । లాగి నేఁడు తెకతేర వోనాడుకొంటి (?)
అట నులూకంబన నాగూబపేర । ఘటనమై నర్తించి కడపట నీవు
గూబజంకెలతోడఁ గుందుచు వచ్చి । గూబవై పోతివి కురురాజునెదుట.

---

1. విజయుండు. 2. శెలసి. (మూ)

ఏయుమా యేచేత నేసెద?'' యనుచు । దాయ మస్తకమటు ధరణిపైఁ గూల్చె.
తనయుండు దెగుటయుఁ దగసౌబలుండు । మునుకొన్న కోపాగ్ని మునిఁగి లోఁగుంది
కన్నీరు దొరుఁగ నంగంబు వణంక । విన్ననై తనయాత్మ వెచ్చుచు నపుడు
"పాండుతనూజులు భవ్యదోర్దండ । చండప్రతాపులు సహజ విక్రములు
గతమత్సరులు శుభకరులు సత్యాత్ము । లతులితాచారు లాయత కీర్తిధనులు
నైన వీరల జూదమను నెపంబునను । బూని రాజ్యము మోసపుచ్చిన దోష
మదియేలతప్పుఁ? బాయక పుణ్యుఁడైన । విదురుని బుద్ధులు విననైతి మొదల ;
అడరి నిందలకెల్ల నాధారమైతి ; । కడపటఁ దనకు నిక్కడ చావవలసె."
అనియని శోకించి యా సహదేవుఁ । గనుఁగొని పలికె నాగ్రహము రెట్టింప :
"మాద్రీ తనూభవ, మహి నాకుమారు । భద్రమూర్తిని వీరభద్రావతారు
రణమునఁజంపిన రణశూర, నీవు । జుణిఁగిపోవక నిల్చిచూచి పోరాడు ;
పోయెదవో నిన్ను బోనీనుగాని । పాయక ననుదాఁకి బంటవై నిలుము."
అని గుణధ్వని చేసి యార్చుచుఁ బేర్చి । మునుకొని నారసంబుల మూఁట నేసె.
ఏసిన సౌబలు నిష్ప్వాసనంబు । చేసెఁ దత్తుమురుగాఁ జిత్రవైఖరిని.
అట వాఁడుఁ గదిసి మహారుద్రుగతిఁ । బటు ఖడ్గ తోమర ప్రాసశూలములఁ
బైకొని వైవ నప్పాండవానుజుఁడు । చీకాకుపడ నానిఁ జెక్కువై చుటయుఁ,
గనుఁగొని శకునియుఁ గాలు సేయాడ । కనయంబు నతని బాణాలిచే నొచ్చి
పెదవులు దడుపుచు భీతి వాటిల్లి । కుదిసి నెవ్వగల దిక్కులు సూచుచుండె.
ఆ సహదేవుండు నాసమయమున । భాసుర బ్రహ్మాండభాండముల్ వగులఁ
గోపించి తనవింటిగుణము మ్రోయించి । చూపట్టు శరములు సోనగాఁ గురిసి
మర్మ మర్మంబులు మఱి యుచ్చిపాఱ । మర్మదాంధుని నేసె దొడ్డతూపొకటి.
కాయంబులో గుండెకాయ నాటంగ । నేయుచోఁ బడి లేచి యిఁకఁ జాలుననుచుఁ
దనుగూడి వచ్చిన తనవారుఁ దాను । గునిసి 'తంగెళ్లు రేఁగులుగాఁగఁ' బాఱె.
పాఱిన నదిచూచి పాండునందనులు । పాఱకుండఁగ వారిఁ బసనడ్డగించి
చంపుచో, గొందులు సందులు దూఱి । తెంపేది 'యిఁక దిక్కు దెసయేది' యనుచుఁ
బాఱెడు సౌబలుఁ బాండవానుజుఁడు । "తీఱకు పాఱినఁ దిరుగు సౌబలుఁడ!
రారాజుమామవై రమణిగాంధారి । కారయుఁ దోఁబుట్టువై ధృతరాష్ట్ర
మండలేశ్వరునకు మఱఁదివై యిట్టి । బండంగివై యిట్లు పాఱంగఁ దగునె!

పరఁగంగ నేటికి బలుకవిడిఁ దొడఁగు ; । నెఱి [1] మాన్పవచ్చునే నీపాలిచావు !
చావక యెక్కడ జరిగెదు చెప్పుము ! । వావిరి నిష్టదైవంబును దలఁపు.
మాయజూదంబున మారాజ్యలక్ష్మి । మాయించినట్టి దుర్మదుఁడవు గావె !
ఉత్తమసాధ్వి యాయమవిడఁ బాంచాలి । మొత్తి యీడ్పించిన మూర్ఖవు గావె !
రారాజుచే వినరాని వాక్యముల । నోరి, దూషించిన యొజ్జవు గావె !
నాఁడు, ఓడినమమ్ము నవ్వి బంట్లన్న । వాఁడవు నాప వాఁడవు గావె !
ధర్మజుఁ గొలువులోఁ దప్పంగనాడు । కర్మంబు లన్నియుఁ గడ తేర్తునేఁడు ;
చూచి పోరాడు నిష్ఠురుఁడ, నీ." యనుచు । నేచి వాలమ్ము లనేకముల్ గురిసె.
కురిసినఁ గోపించి గుణము మ్రోయించి । తిరుగక యా సహదేవునొప్పించె.
నొప్పించుటయుఁ జూచి నూఱుబాణములు । తప్పక తొడిగి యాతనిఁ జిక్కువఱచి
యొకట హయంబుల నొకట సారథిని । నొకట శస్త్రాస్త్రంబు లొకటఁ జాపంబు
నొకట రథంబును నొకటఁ గేతువును । నొకట వజ్రాంగియు నుర్విపైఁ గూల్చి
పదిటఁ బండ్రెంటను బదుమూఁటమూఁటఁ । బదుల ముప్పదులఁ దప్పని సాయకముల
మర్మ మర్మంబులు మఱి యుచ్చిపాఱ । ధర్మజాతమ్ముఁ డుద్ధతి మీఱ నేసె.

## సహదేవుఁడు శకుని కంఠ ముత్తరించుట

ఏసిన సహదేవు నీక్షించి శకుని । "నాసరి గావచ్చు నని యుంటేఁగాక
చూడుము నీ" వని సునిశితశక్తి । వాఁడకొత్తని మీఁద నుగ్రుఁడై వైచె.
వైచిన నదియును వడి నభోవీధి । నేచి మంటలతోడ నేతేరఁ జూచి
'తేరును విల్లును దెగిన నీపాటి । శూరుండవైతివి చూడు మేల్మేలు'
అని యర్ధచంద్రబాణాలిచే దాని । గనలుగా నేసి యాకితవదుష్టాత్ము
"సారెలనాడు హస్తము లేవి ?" యనుచు । నారూఢి శరముల నవి ద్రుంచివైచి,
చటులత నొకదివ్య సాయకంబునను । నిటలాక్షుకైవడి నిండ గోపించి
వెలయఁ గౌరవుఁడు నిర్విణ్ణుఁడై చూడఁ । గలుషాత్ము సౌబలు కంఠంబుద్రుంచె.
కృపుఁడు ద్రోణాత్మజ కృతవర్మలపుడు । విపరీతగతి వీపు విఱిగి నట్లుండఁ
గలసైన్యమెల్లను గలఁగి పాఱఁగను । జలజనాభుఁడు పాంచజన్య మొత్తుటయు
నానినాదముఁగూడ నమరేంద్రసుతుఁడు । తానును దేవదత్తం బొత్తె నపుడు.

1. పెంకచచ్చునే. (మూ)

ఇట్టి శంఖరవంబు లీక్షించి బలము । కుట్టులు వదలఁ, గన్గొని చాలనవ్వి
కౌంతేయురథము డగ్గఱఁ బోయి నిలిచి । మంతనంబున వాని మాధవుండనియె :
" నేఁటి యుద్ధంబిట్లు నెఱయఁ జూచితివె ! । వాటమై నీమనను వచ్చెనో లేదో !
దేవ, నేఁడిదె సహదేవునిఁ జూడు । దేవతామూర్తియై దీపించినాఁడు.
ధర్మజ, నీపిన్నతమ్ముని నెన్న । నర్మిలి మర్త్యమాత్రావతారుండె !
కోపగించఁడు గాక కోపించునంత । నేపున నింద్రాదులెనగారు సుమ్మ ;
ఈ సౌబలుండన నెంతటివాఁడు ! । వాసిగా సౌబలు వాఁడితూపులకు
నితనిఁ జెప్పినచోట నితరులఁ జెప్పఁ । బ్రతి పోల్పరాదు భూపాలాగ్రగణ్య !
శకుని యీతనిచేతఁ జచ్చుటఁ జేసి । సకలేశ, నేఁడువో సామ్రాజ్య మబ్బె.
కావున నోవీర, కడకఁతో ధర్మ । దేవతా మూర్తివి దేవ, నీవర్థి.
ఈ భీముఁ డీనరుఁ డీనకులుండు । శోభనాకార సంస్తుత పరాక్రములు.
వీరు నీవును గూడి వేడ్కతో భూమి । భారంబు డించి నాప్రతిన చెల్లింప
నాచంద్ర తారార్కమై నీదుకీర్తి । యేచి లోకంబుల నిట నొప్పఁగాత. "
అని యిట్లు శ్రీకృష్ణుఁడభినుతి సేయఁ । దన కేలు మొగిచి యాధర్మజుండనియె :
" ఘనుఁడు తృణంబైనఁ గడఁగి పట్టినను । అనఘాత్మ, మేరుమహా శైలమగును.
అట్టిహేమాద్రి తృణాంతరంబైనఁ (?) । గట్టడ మీయనుగ్రహమునఁ గాదె !
సకల జీవులకును చైతన్యమగుచు । సకల జీవాళి రక్షకమూర్తివగుచుఁ
గలగొని ప్రహ్లాదుఁగాచి, యీ మొన్న । మఱసి మాద్రౌపది మానంబుగాచి
తెలివి భూభారంబు దించంగఁ బుట్టి । ... ... ... ... ...
నట్టి సర్వాంతరాత్మకుఁడ వీ వమ్మ । నెట్టన గాచుట నీకెంత పెద్ద !
తోలుబొమ్మలయందుఁ దొడరి సూత్రములు । కీలించి ధైర్యంబు గీల్కొల్పి యమ్మ
జోక నాడించెడి [1] సూత్రధారుఁడవు ; । మాకు దిక్కెవ్వరు మఱినీవె కాక ;
కురుశేష మాహుతిగొనఁ జేసి భూమి । పరిపాలనప్రౌఢిఁ బాటించు నాకు. "
అనియిట్లు పలుకుచో నంతఁ గౌరవుఁడు । మనమారఁ 'దన మేనమామ పాటునకు
నేమాయె !' ననిపల్కి 'యెల్ల పాండవుల । నే మాయచేసెద నిఁక ' నంచుఁ గదలి
జనపతి వైరాగ్యసంపన్నుఁడగుచుఁ । దన నిజమూల బాంధవసేనఁ గూర్చి
పురికొల్ప, వారును బోరఁ బ్రాణములు । సరకుసేయక క్రీడి సద్వృత్తుఁ దొడరి

1. సూత్రావధాని. (మా)

యవని నాతని సాయకావలిచేతఁ । గవగూడి పోయిరి కాలునిపురికి.
పోయినఁ దానొల్లఁబోయి కౌరవ్యుఁడు । పాయక [1] వెలవెలపాటును బొంది
హీనుఁడై విహ్వల హృదయ వికల్ప । దీనుఁడై దెసచెడి దిగ్భ్రమ మీఱఁ
బెదవులు దడుపుచు బిమ్మిటిగొనుచుఁ । బిదపఁ దాఁ దన పేరుఁ బెంపును విడిచి
మానమే తోడవుగా మహిమించినట్టి । సూనృతమటు డించి శూరతవిడిచి
నుఱిఁగిపోయెదనని చుఱుకనిబుద్ధి । వెరవేసి మార్గంబు వెదకుచు నుండె.”
అనుటయు ధృతరాష్ట్రుఁడనియె సంజయుకు : । “ మన సేనలందఱు బ్రమందిపోవంగఁ
బాండవులకు నెంత బలముండె నపుడు ? । ఒండొండ వివరించి యెఱుఁగఁజెప్పు.” మనిన
“ నిరువేలురథములు, నిభములేడ్నూఱు, । వెరవాఱఁగా నైదువేల గుఱ్ఱములు,
పదివేలు నిజయోధ భటవీరవరులు । ముదమునఁ గౌంతేయ మొనసంట చూచి
కొంచెపుఁ దనమూఁక గుమురునుజూచి । వంచన నృపతి యుర్వరనుండ వెఱచి
వలనొప్ప నప్పుడెవ్వరుఁ గానకుండ । నలయుచు నటు గదాహస్తుఁడై తొలఁగె.
ఏమనిచెప్పుదు నిభపురాధీశ ! । యామహాదైన్యంబు నట దైవమెఱుఁగు.
[2] కొలువనేకాదశాక్షౌహిణీబలము । గలుగు మహారాజు కౌరవేశ్వరుఁడు
ఎల్లవి గోల్పోయి యేకాంగియగుచు । నెల్లగాఁ దనవెంట నెవ్వరులేక
యా యున్న చోటికి ననతిదూరముగఁ । బోయి యుత్తరమైన పూర్వభాగమున
నున్న హ్రదంబున నొగి దాఁగియుండ । విన్ననై చనుచును, “ విదురువాక్యములు
వినని పాపంబున వెస నిట్టికీడు । గనుఁగొంటిఁ గంటనక్కట ! మోసమయ్యె.
మునుకొని యంతయు మొదలఁగృష్ణుండు । పొనరంగ బోధించి బుద్ధిగాఁజెప్పి
‘ మైదూళ్లుచాలు వారన్నదమ్ములకు । నీదెస నాకుఁగా ని’ మ్మన్న శౌరిఁ
గృష్ణు జనార్దనుఁ గేశవు శార్ఙ్గి । జిష్ణు నారాయణుఁ జేపట్టు వట్టి
చెఱఁ బెట్టఁదలఁచితి; క్షితిపులభంగ । వఱచితి నా పాపఫలమెల్లఁగంటి.
దేవతాత్ములు గుంతిదేవి గర్భమున । నావిర్భవించిన యమ్మహాత్ములను
ఇడుమలఁ బెట్టిన యీ జన్మమునకుఁ । గడమలే కివియెల్లఁ గనుఁగొనవలసె.
మాయజూదంబున మహియెల్ల గెలిచి । ‘ ఛీ ’ యని నాసరిక్షితిపులు నవ్వ
నువిదఁ బతివ్రత నుత్తమసాధ్వి । నవమానపఱచిన, నది పుత్రమిత్ర

1. తెలుతెల్ల 2. సులభుఁడే. (మూ)

సహితంబు రణభూమిఁ జాన నాపాలి । విహిత విధాత యిచ్చోఁ[1] దెచ్చిపెట్టె."
నని తలపోయుచు నధికశౌర్యమునఁ । జనునెడ, నట బోరి సను[2]రుచు వేగ
రారాజుచొప్పున రథికసహరథులు । భేరీ మృదంగాది భీకరధ్వనుల
భీమసామ్రాదేయులు పృథివి గంపింప । నామేటిసైన్యంబు లతులమై నడవ
హరికేతనంబును హరిసారథియును । హరిదశ్వమణులును నగ్నిరథంబు
హరిమయాలంకార మది తేజరిల్ల । హరికుమారుఁడు పురహరుని చందమున
నొప్పారి రణభూమి నగ్రుఁడై నడవ, । నప్పుడు హతశేషు లవనిపై నడఁగఁ,
గృతవర్మ గురుపుత్రకృపులు నవవ్వానుసు । హతులుగాఁ గేఁగిరి ; యాసమయమున
ననుజూచి పాంచాల నందనుఁ డప్పుడు । "[3]చన నేల సాత్యకి, సంజయుఁ బట్టి?
వీఁడేమి సేయును ? వీఁడవధ్యుండు ; । వీఁడు పాపంబుగావింపఁ డెన్నఁడును ;
వితత గుణోన్నత విమలమానసుఁడు । బ్రతికి యెక్కడనున్న భయమేమిమనకు ?
వినుతవిక్రమశాలి, వీనిఁబోనిమ్ము." । అనవుడు శైనేయుఁ డమ్మాట వినక
"విధి తెచ్చి నాచేత వీనినర్పించె ; । వధియింతు నిప్పుడవశ్యంబు." ననుచు
వేసరి వాలెత్తి వ్రేయఁజూచుటయు, । నాసమయంబున ననఘుండు ఘనుఁడు
సాత్యవతేయుఁడు సన్నిధి యగుచు । "సాత్యకి, యాతనిఁ జంపంగవలదు ;
విద్వేషియగు నైన వీని నీక్షణమె । మద్వచనార్థమై మన్నింపు." మనిన
నమ్మునీశ్వరునకు నంజలి చేసి । సమ్మదంబున నన్ను జయ్యన విడిచి,
"పొమ్ము సంజయ, కాచిపుచ్చితి నిన్ను । నిమ్మైనచోటికి నేఁగి వర్తింపు."
మనుటయు మునినాథునకప్పుడు మ్రొక్కి । యనుమతి వడసితి నరిగె నమ్మౌని.
అంతనేఁ గురువిభుఁ డరిగినజాడ । పొంత నట్టుకపోయి భూపాలవరుని
మడుఁగు చక్కటిఁగాంచి మఱి దుఃఖమందఁ, । బుడమి జేఁడును బాష్పపూరంబు నించి
నను జక్కఁజూడక నలిఁదూల, విభుఁ । గని యేను నేడ్చుచుఁ గడుశోకవృత్తి
నల్లనఁ బలితోడ నంటి నప్పాట : । "మెల్లనఁ బోరానిమృత్యువు దప్పి
వచ్చితి నమ్మహావ్యాసుల కృపను ; । ఇచ్చట నుండరా దింక నేటిబ్రతుకు !"
అని యేనుజెప్పిన నహికేతనుండు । [4]పనవుచు ననుజూచి పలికె నిట్లనుచు :
"మనయందు సంజయ, మఱి యెవ్వరైన । వినిపింపు చావని వీరులు గలరె! "
అనినఁ గౌరవునకు ననఘు ! యిట్లంటి : । "మనికితమది యేల మనవారిలోన

---

1. బెట్టఁదెచ్చి-తని. 2. రుచి. 3. చనఁడేల. 4. పనుపుచు. (మూ)

బ్రదికె నశ్వత్థామ బ్రదికెఁ గృపుఁడు । బ్రదికెను గృతవర్మ పతి, వీరుదక్కఁ
బనుగొన నెవ్వరు బ్రతుకుటలేదు." । అని విన్నవించిన నడలుచు విభుఁడు
నాకంధరంబున నలి హస్తమూఁది । యాకొలఁకున నడలుచుఁ జూచి

## దుర్యోధనుఁడు ద్వైపాయనంబను మడుగున డాఁగుట

నీకడ కనుపుచు నృపుఁ డిట్లులనియె: । "ఏకాంగినైతి నింకేమి సేయుదును!
మందునైనను మాఱు మానిసి లేక । మ్రందె నాసైన్యంబు మాటమాత్రమున.
పాండుసూనులు ధర్మపరులు గావునను । బాండిత్య మేర్పడ బంధులుఁ దారు
బ్రదికినా; రిట వారి బారికిఁ దప్పి । బ్రది[1]కితి నాపాలిభాగ్యంబు గాదె!
ఇదె నాకు రాజ్యంబు; నింతియె చాలు; । [2]బ్రదుకు కన్నను బుణ్యఫలములు గలవె!
పుడమియెల్లను ధర్మభూవరుఁ జెందె । వడిఁ జెడ్డ మీఁద నవ్వారలు నాకుఁ
బాలుపుగా నొకకొంత భూమిచ్చిరేని । కలసియుండుట నాకుఁ గడుహీనవృత్తి.
చిక్కు యెంతయుమ్రగ్గి సిగ్గువోవిడిచి । కుక్కనై నే గుడుచునే కొఱగాని కూడు!
కొడుకులు తమ్ములుఁ గురుకులంబెల్ల । నడఁగిరి నాకొఱకై రణంబునను.
అట్టివారల చావులన్నియుఁ జూచి । కట్టెఁడినస్థిరకాయంబు నమ్మి
వారిచ్చు సామ్రాజ్య వైభవం బొల్ల; । వారిమధ్యంబున వసతిసేసెదను.
ఈ మడుఁగందు నే నిటు డాఁగియుండి । యామీఁద నొండెడకరిగి నానొప్పి
తీర్చెద నాపగదీర్చెద." ననుచుఁ । బేర్చి యమ్మడుఁగు తాఁ బెంపేది చొచ్చె.
అది యెట్టిదంటివా యాదికాలమున । ముదమున నతఁడొక్క ముని వనంబునను
బరమేశ్వరుని గూర్చి బహుంతర తపము । చిరనిష్ఠతోఁ జేయ శివుఁడంత మెచ్చి
ప్రత్యక్షమై నిల్చి పలికెఁ గౌరవుని: । "అత్యుత్తమోత్తమ, యనుదీతపంబు;
ఏలచేసెదవు? నీ వేమి కోరెదవు? । వాలాయ మిచ్చెద వలసినదడుగు."
అప్పుడు ముకుళిత హస్తుఁడై శివునిఁ । గనుఁగొని పలికె నక్కౌరవేశ్వరుఁడు:
"ఈశ్వర, దేవ, సర్వేశ్వర, యభవ, । శాశ్వత, భవహర, సచ్చిదానంద,
మోక్షప్రదాయక, మూర్తిత్రయైక, । సాక్షాత్పరంజ్యోతి, సత్య, సత్యాత్మ,
నీలకంధర, కృపానిధి, దేవదేవ, । యాలకింపవె! యొక్కటడిగెద నిన్ను.
పరికింప నాకరస్పర్శ మాత్రమునఁ । బరుసవేదియుఁ గల్గఁ బాలింపు మొకటి.

1. కిన. 2. బ్రదుకకన్నను. (మా)

ఒకటి నే నిషమ పాటొందిన వేళఁ । బ్రకటించి జలములోపలఁ జొచ్చుమాత్ర
నదిగట్టిదై బలమై యభేద్యమగు । సదనమై, నీటిలో జపియించునంతఁ
గదనరంగంబునఁ గడచన్న యట్టి । విదిత ప్రతాపులు వెస మహాయోధ
చతురంగ బలము లచ్చటఁ దొంటియట్లు । చతురత బ్రదికెడు సామర్థ్య మిమ్మ్మ్.
జపము సమాప్తమై సరిఁ జెల్లదేని । యపజయం బి." మ్మన్న, నభవుఁ డీశ్వరుఁడు
నవ్వి: "యీ యపజయోన్నతి వేడితేల? । చివ్వన నీతలంచిన దిది గాదు,
డాఁగొన్న కపట నాటక సూత్రధారి । యాకృష్ణు మాయ నీవాడితి గాక ;
నీ వశమాయిది! నీకోరినట్లు । గావింతు" ననిపల్కి గౌరీశుఁ డరిగె.
కాన నవ్వర మట్లు గన్నవాఁడగుట । నో నరనాథ, యా యుదకమధ్యమునఁ
దన మంత్ర సామర్థ్యతతిఁజేసి రాజు । వనములు స్తంభింప వారక చేసి
యుదకంబులోఁజొచ్చి యుండెఁబెల్లుగను. । తదనంతరంబ రథ్యంబులు [1] నడవఁ
బరితాప మొనరింప బహుశస్త్రఘాత । లరుదుగాఁ దమమేనులందు దీపింపఁ
బుడమీశుఁగానక బుద్ధిలో వేగ । నడలుచుఁ గృతవర్మ యాచార్య మఱఁది
యాచార్య పుత్రుండు నట వచ్చుచుండి । చూచి నాదగ్గఱ సారిది నేతెంచి
నను గౌఁగిలింపుచు నాతోడ ననిరి: । "జనపతి యెటఁబోయె సంగరస్థలిని ?
ఎవ్విధి బ్రతికితి వీశ్వరుకృపను? । మవ్వమై చెప్పవే! మహిపతివార్త."
అనవుడు వారలకంటినే వేగ : । "వినరయ్య విధిదప్పి వివశుఁడై వచ్చి
కురుపతి యీనీటఁ గ్రుంకి యున్నాఁడు ; । కొఱగానివిధి యింత కుందించె." ననఁగ
విని వారు శోకాబ్ధివీచుల మునిఁగి । మనమున రణభీతి మల్లడి గొనఁగ :
"వనజనేత్రాప్త దేవాంశులచేత । వనజారికులునకు వచ్చె నీపాటు.
అనినేను బ్రతికిన యవ్విధంబెల్ల । నెనయ రాజెఱుఁగునో యెఱుఁగఁడో కాక.
సమరంబులోన నిస్త్రాణుఁడై విభుఁడు । మముఁబాసి యొంటిమై మడుఁగు కేతెంచె.
కాక మా పొదినున్నఁ గౌరవేశునకు । నీ కష్టవర్తన మేలావహించు?"
అని యని తలపోయు, నంతఁ బాండవులు । వెనుకొని రారాజు వెదకుచు వచ్చి
యచ్చేరువను దోచునంత, భీతిల్లి । యిచ్చట మనయునికి హితముగాదనుచు
నను గృపాచార్యుఁ డున్నత రథంబునను । నునిచి శీఘ్రత నట నుండక తలఁగి

1. నడక – పరిణామ మొనరించి (మూ)

పొది గొన్న వేడ్కఁ బొదలెడువాఁడు । జెదరక తిరుగుచో, శిబిరంబునందు
నంతఃపురాంగన లందఱుఁ గూడి । యంతఁ గుందంగ, వడి యుయుత్సుండు
శోకానలంబునఁ బొరిది వేఁగుచును । "భీకరబలులగు భీష్మాది యోధ
కురువీరు లందఱు ఘోరాజిఁ బడిరి । తొరలి దుర్యోధను దుష్కృతికతన.
ఆ మేటియగు పాండవావలి మహిమ । నేమని వాక్రుచ్చి యిటఁ జెప్పవచ్చు!
ఈవనితలఁ గొని యిభపురంబునకుఁ । బోవుట నాకిది బుద్ధియుఁ దగవు.
కోరి యేకాదశాక్షౌహిణీ[1] భర్త । కూఁడిమి మన్నించు కోమలిజనము
కిప్పాటు వాటిల్లెనే!" యంచుఁ దలఁకి । యప్పుడు తనరథం బల్లన డిగ్గి
దామోదరునకును ధర్మరాజునకు । జోమించి యవ్వార్త సూచించుటయును
ధర్మజుఁ డప్పుడు దాఁ గృష్ణుమోము । నర్మిలిఁ జూచిన ననుమతించుటయు
నా వైశ్యసుతుఁ బాండవాగ్రణి యపుడు । భావింప నిది లెస్సపనియని మెచ్చి
యాలింగనము చేసి యట "నోయుయుత్సు! । యేల నీకుపమానమెవ్వరు లేరు;
అదియె కావింపు మీ" వని వీడుకొలుప । మదిలోనఁ బొంగి నెమ్మది రథంబెక్కి
యా పుణ్యకాంతల సాపరిజనుల । నాప్రొద్దె యంతయు నాయుయుత్సుండు
కొని కరిపురికేఁగి కురురాజు నగరి । కనిపి యవ్విదురుతో నప్పుడిట్లనియె:
"ఆ మద్రపతియును నాసౌబలుండుఁ । గ్రామిడి రణమునఁ బడినఁ, గౌరవుఁడు
తనమాన మటుడించి తనపేరు డించి । తన కార్య మటుడించి దారలడించి
తా నొక్కరుఁడు గదాధారియై పాఱె. । ఏను ధర్మజకృష్ణు లీభంగిఁ బనుప
వచ్చితి నీ భూపవనితలఁ గొంచు । నచ్చుగా." నని చెప్ప నవ్విదురుండు
మతి ననాగత వర్తమానంబు దెలిసి । "హితకార్య మొనరించుటిది లెస్సయయ్యె;
ఈ నిర్ణయము పతి కెఱిఁగింప వలదు; । తానె సంజయుచేతఁ దగ వినుఁగాని;
మనము చెప్పఁగనేల మఱి శోకమేల । వనట నీవార్త లెవ్వరుఁ జెప్పవలదు."
అని సమయము చేసి యా నగరికిని । నెనయంగఁ బలుగావులిడి యుండె. నంత
నక్కడ శిబిరంబునందు సైనికుల । నిక్కుమదంబును నింగితోరాయు
నార్పులుఁ గరితురగావళి రవళి । దర్పంబులును బోయి దైన్యంబు వఱవ
సవడియే లేక నిశ్శబ్దమైయుండె । నవనీశ, యిట్టిదేమని చెప్పవచ్చు!"
అనవిని ధృతరాష్ట్రుఁ డప్పు డిట్లనియె: । "విను మనసేన లివిధ్వమైన వెనుక

1. బలము. (మూ)

నిలవతి మీరల లింకేమి చేసితిరి ? । తెలఁకెద సంజయ, తగఁ జెప్పు." మనిన
మనుజేశుఁ జూచి యేమట [1] కంతలోనఁ । బనివడి సూతనంభవుఁ డిట్టులనియె:
"జననాథ, పాండవ జగదీశులపుడు । వెనుకొని రారాజు వెదకుచు రాఁగ,
ఘనమైన సేనల కలకలార్భటులు । విని కృపాచార్యాది వీరులు వెఱచి
నను గొంచు వేగ నున్నతి నొక్కయెడకుఁ । జని యున్నయంత, నజాతశత్రుండు
పొరిదిప్పై సేనల సోమవంశజుని । నరసి కానక మనహతశేషవరుల
ననుకంపఁ గనుఁగొని, యపుడాదరించి । చెనకువతోఁ దన శిబిరంబుకరిగె.
ఆసమయంబున నవనీశ, యేము । నాసుయోధనుఁడున్న యటకు నేఁగితిమి.

## కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనునిగని సంభాషించుట

గొనకొని రథులు ముగ్గురు నొక్కపెట్టు । తనరంగఁ దమరాకతగ నెఱిఁగించి
"మముఁ జూడు విచ్చేయు మండలాధీశ ! । నమరంబు సేయంగ శంకయేమిటికి ?
అదరంగఁ గృష్ణుని నాపాండుసుతుల । నెడపక గెలిచి నీకిత్తుము జయము.
కాదేని వారిచేఁ గణఁగి చచ్చినను । ఆదట నాక సౌఖ్యములు సిద్ధించు.
అటుగాక యీరీతి నణఁగినఁ గీర్తి । విటతాట మగుఁగాక విజయంబుగలదె !
వెడలుము రాజేంద్ర ! విమలభోగేంద్ర ! । వెడలుము శూరత విడువకు." మనిన
వలదని రారాజు వారికిట్లనియె : । "బలము చాలదు నీటఁ బడియున్నవాఁడ ;
వీరతవిఫలమై విను నేఁడిదేమొ । శూరత ననిసేయఁ జొరదు నామనను ;
అటు మీరు నిస్త్రాణులై యున్నవారు ; । పటుతరంబుగ నెల్లి బవరంబు సేసి
[2] తూఁటరి వైరులఁ ద్రుంతము గాని । నేఁట మాత్రము మాని నిలుఁడు పొం" డనిన
ఆ వాక్యములు విని యాచార్యసుతుఁడు । "భూవర, యీ పేదబుద్ధి యేమిటికి ?
విను నాప్రతిజ్ఞ యవ్వీరకౌంతేయ । జనపతులాది పాంచాలుర నెల్ల
[3] ఖండనోద్దండతఁ గడికండలుగను । జెండాడి బహుభూతసిద్ధులఁ దనిపి,
యస్త్రదేవతలకు నాదిశక్తికిని । బ్రస్తుత గతి నేఁడ బలియిచ్చువాఁడ ;
ఎలమి మీజనకున కిటమీఁదఁ బ్రియము । లలరించి కాని న యసి యొరఁబెట్ట."
అని ద్రౌణి భాషించు నా నమయమున । విని భీమసేనుని వేఁటకాండ్రపుడు
అరయ నరణ్యంబునందు వేఁటాడి । యురు మాంసభారంబు లూని వ్రేఁగునను

1. నంత. 2. తూటారి. 3. ఖండనోద్దండ విఖండఖండలుగ. (మూ)

నీరువట్టున డస్సి నిలిచి యమ్మడుఁగు । చేరి యూసిళ్లు దోసిట నిడి త్రావి,
యే తెరఁగా మున్న యిట ధర్మసుతుఁడు । [1] నాతీరు నొకబోయ కానతియిచ్చె :
" నోరి కిరాతుఁడ, యురగకేతనుఁడు । ఏరీతి నెక్కడి కేఁగెనో యరసి
చెప్పుము వాఁడున్న సీమ మా" కనిన । నప్పుడ యాబోయ యనిలనందనునిఁ
[2]గాని కొల్చు నాలుబ్ధకులలోనివాఁడు । అనయంబు గావున నావేఁటకాండ్ర
కెదురుగాఁ జని వారికెఱిఁగించుటయును । మదిలోన వారల మ్మాడువృత్తికమునఁ
'కృపుఁడు ద్రోణజుఁడును కృతవర్మ యుండి ; । రపుడు దుర్యోధనుఁ డందుండఁ బోలు;
నదియె తప్పదు మనయధిపుకీవార్త । చదఁడు చెప్పెదము సంపదలిచ్చు.' ననుచు
మాంసభారంబు లిమ్ముగాఁ బొఱవైచి । హంసధ్వజుని భీము నంతటఁ గాంచి
కురుపతియున్నట్టి గుట్టెల్లఁ జెప్పఁ, । [3] ఎరికించి వారికిఁ బసదనం బిచ్చి
వారిఁ దోడ్కొనివచ్చి వడి ధర్మసుతుని । వారక కనిపింప వారలిట్లనిరి :
" అవధారు దేవ, మే మధిక దాహమునఁ । గవియుచు నొకతటాకమునీరు ద్రావ
నా చుట్టునను కృపుఁ డాచార్యసుతుఁడు । వాచకాకృతి (?) కృతవర్మ సంజయులు
నున్నారు ; వినుము సుయోధనుఁ డందు । నున్నాఁడు తప్ప దో యుర్వీశ తిలక !
నరవితో నొకవిశేషంబు చెప్పెదము । వెరవుతో నరనాథ, వినఁ జిత్తగింపు.
కులిశ తోమర హల కుంభాంబుజాత । జలచరోత్పల ఛత్ర శంఖ చక్రములు
గలపాదములచొప్పు గంటిమి దేవ ! । కొలఁదికిమీఱ నక్కొలని దగ్గఱను.
అంకె వైశంపాయ నాఖ్యహ్రదమునఁ । గ్రుంకియున్నాఁ డిందుకుల సార్వభౌమ !
నీచిత్త." మనుటయు నృపుఁడు వారలకు । రాచయోగ్యంబులు రవణంబులిచ్చి
యా వార్త వారికిని ననుజన్ములకును । మోవంగ నేకాంతమున నెఱిఁగించి,
భీకర ప్రస్థానభేరి వేయించి । యేకమై కాహళు లిరువంక మ్రోయ
వారణంబులతోడ వాజులతోడఁ । దేరులతోడను దీవ్రత మీఱఁ
గదలిరా, నప్పుడా కలకల ధ్వనుల । నదటుమై విని ద్రోణియాదిగా రథులు
కౌరవేశ్వరునకుఁ గణఁక నిట్లనిరి : । " వీరె నచ్చిరి పాండవేయులు దేవ !
అలఘు విక్రమ కేళి ననికిఁ బోవలయు, । జలములు వెలువడి చనుదెమ్ము వెలికి.
వెఱవకు పోరుట వీరధర్మంబు । వెఱచిన మమ్మింపు వేగ నొండెడకు.
వఱలి మీ చిత్తము వచ్చిన వేళ । మఱి వచ్చెదముగాని మాకానతిమ్ము ;

1. రీతి. 2. గొనకొని 3. భీముఁడు కర్తఅధ్యాహార్యము. (మా)

అచ్ఛలంబున వారలటు వచ్చి." రనిన । మచ్చికతోడ నమ్మౌనాథ్యుఁ డనియె:
"ఈవేళ వలవదు ; ఎలమి నిచ్చటికి । భూవరు లాధర్మపుత్రులు వచ్చి
పోయెద ; రా పాండుపుత్రులు దిరిగి । పోయినఁ జనుదెంచు ప్రొద్దువో నిచ్చి.
వారు వోయెదరింక వారణపురికి । వారక ; కాదేని వచ్చిరేనియును
నను నిప్పు డాయింద్రునకుఁ జేరరాదు, । చనుఁడు మీ." రనిన నచ్చటువారువాసి
యరిగి దూరము వోయి యా కౌరవునకు । నరుదార నెట్లొకో యని నగఁ బొంది
తల వోయుచుండ, [1] నత్తఱి నేను వారి । యలరిన రథముపై నట వేగ డిగ్గి
పొంచి యమ్మడుఁ గున్న పొంతకు వచ్చి । యంచితగతి డాఁగి యట్లున్న వేళ,
పాండవు లత్యంత బలములుఁ దారు । భండనోదగ్రులై బంధులు హితులు
ననుజులుఁ దనయులు నాప్తులు సఖులు । గొనకొని యిరుఁ గెలంకులఁ గొల్చిరాఁగ
నోలి సుయోధనుఁ గేలి సేయుచును, । ఆలోన ధర్మజుఁ డటఁ జేరవచ్చి
భీమార్జునులఁ జూచి పృథుతరాటోప । భీమసాహస యోధ బృందంబుఁ జూచి,
యతి రథులను జూచి హస్త్యశ్వసుభట । వితత వర్గముఁ జూచి వెసద్రౌపదేయ
పాంచాలురను జూచి పలికె: "నితండు । పంచాస్య సన్నిభ పటు పరాక్రముఁడు ;
వాఁడిమి నూఱక వచ్చినవాఁడు । గాఁడు ; ఏమెంచి యిక్కడ వచ్చినాఁడో
ఈ మహావీరుఁ డిట్లేల యీ యునికి ? । ఏమియు నెఱుఁగరా దీతని మతము.
ఎఱిఁగియు నెఱుఁగని యితరులమాడ్కి । నెఱుఁగమితోఁ గూడి యేమరఁ గాదు.
పదిలమైయుండుఁ డీపట్టున మీరు । మొదలఁ జక్రాకారముగఁ గాలుబలము,
నావెన్క నశ్వంబు లావెన్కఁ గరులు । నావెన్క నతిరథు లట మహారథులు
నందుకుఁ దిరిగిరా నట మీఁద వీర । బృందంబు నెంతయుఁ బ్రిదులంగ నీక
యీ రీతి నుండఁగా నెంతకుఁ దెగునో । యారయ మనభాగ్య మది యెవ్వఁడెఱుఁగు ?
వాఁడు మాయోపాయ పరమంత్రములను । వాఁడిమి మెఱసినవాఁ డౌనో కాఁడో !
కోరిక మానమె కూడైన వాని । బారి కెచ్చరికతోఁ బదిలమై నిలుఁడు."
అని చెప్పి వారల నట్లుండఁ జేసి । యనఘుఁ డాధర్మజుఁ డాసమయమున
నీరసంబెసఁగ నాయిభపురాధిపుని ! । చారుమాయాస్పద స్తంభితంబైన
భూరి జలాశయంబును నిరూపించి, । కారణమంతయుఁ గని యుధిష్ఠిరుఁడు
ఆచక్రధరునకు నప్పుడిట్లనియె: । "ఓచక్రధర, చూడు మొగి మాయకాని

---

1. నత్తఱియును వారు. (మూ)

పుక్కిటఁ బహునాల్గు భువనంబులునిచి । చిక్కినయాట సర్వ జీవరాసులకుఁ
జైతన్యరూపమై సచరాచరములఁ । బ్రీతితో మాయలఁ బెట్టెడు నీదు
భృత్యులముండఁటఁ బెను తనమాయ । సత్యమేలగును! అసత్యమె కాక.
సురల కసాధ్యమై చొరరాదు జలము; । గరిమతోఁడుత శిలాగారంబుచేసి
సరసిలో నిర్భయశక్తి నున్నాఁడు. । విరివి మీకొక్కటి విన్నవించెదను.
నాకంబు చొచ్చిన నలి నగ్నిఁ బడిన । నాకీర్ణమగు మాయ లర్థిఁ గప్పినను
హరుఁడు బాసటయైననక్కటా తన్ను । బొరిగొన కట బ్రదికి పోనేలయిత్తు!
ఓ రమాధీశ్వర, యొనర మాయెదుట । నీరీతి మడుఁగెంత! యిపుడు తానెంత!”
అని విన్నవించిన న య్యాదిదేవుఁ: । “జనఘాత్మ! ధర్మజ, యదిగాదు వినుము;
మాయకానికి భూమి [1] మాయలె కగును ; । మాయకానికి శౌర్య [2] మహిమలుతగవు.
మాయదానవులు ఇమ్మహిమీఁదఁ దొల్లి । దాయలై చరియింపఁ దా నాదివిష్ణుఁ
డా యింద్రుఁ గూడుక యణఁచుట వినవె!’ । ... ... ... ... ...
రావణాసురుఁడను రాక్షసా ధీశుఁ । డోవీర, తా మాయనహోమంబు సేయ
రాముఁడాతనిఁ జంపి రాక్షసలక్ష్మిఁ । బ్రేమతోఁడుతను విభీషణు కీఁడె !
ఆరీతి మాయచే నలరినయట్టి । కౌరవుఁ జంపి భూకాంతఁ గైకొనుము.”
అని యిట్లు శ్రీకృష్ణుఁ డాడువాక్యములఁ । దనమది నుప్పొంగి ధరణీశ, నీదు
తనయు నుద్దేశించి ధర్మరాజపుడు । గొనకొని పేరెలుంగునఁ బిల్చి పలికె:

ధర్మరాజు మడుఁగున డాఁగియున్న దుర్యోధనుని దూఱనాడుట

“ఓకౌరవేశ్వర, యుడురాజవంశ! । నాకాధిపతి భోగ, నయగుణోద్యోగ!
బలువిడి పుత్త్రుల బంధుమిత్త్రాది । బలములఁ గలన నేర్పడఁగఁ జంపించి
కుల నాశనము చేసి కొలనిలోఁ జొచ్చి । జలములఁ గ్రుంకినఁ జావేల తప్పు!
నీ కేల పనిలేక నీళ్లను గ్రుంక ? । చేకొని నీవు చచ్చినమీఁద మాకు
నీళ్లను గ్రుంకంగ నిక్కంబు [3] వలయు. । వెల్లిరా యింతేల వేగంబుగాఁగ
నీకతంబున వచ్చి నిఖిలభూపతులు । చేకొని త్రుంగ వీక్షించి నీప్రాణ
మెంత మాధుర్యమో యీ నీటఁగ్రుంక ! । చింతించవైతివి చేటేల తప్పు ?
ఒనరంగ మాన మేయూరికిఁ బోయె ? । ఘనమైన కౌరవ కర్తవై యుండి

1. మట్టెలపడును. 2. మహిమ యెక్కుడిది. 3. వలసె. (మూ)

క్షత్రియ ధర్మంబు జాఱంగ విడిచి । ధాత్రిలో లెస్సగా దాఁగితి విచట?
పేరంబు వోఁకార్చి విధిదెచ్చి నీట । బోరనఁ జొర [1] ముంచిపోయెనే నిన్ను!
ఇస్సిరో నిందకు నిట రోయవైతి? । డస్సినవారికిఁ దప్పు సర్వంబు.
తూర్ణ వాక్యంబులఁ ద్రుళ్లుచునుండు । కర్ణుఁడెక్కడఁ బోయెఁ గావకనిన్ను?
దుశ్శాసనుండేడ దూఱినవాఁడు? । దుశ్శీలి శకుని యెందుల నున్నవాఁడు?
వీరి సత్త్వము నమ్మి వెసనీవు మమ్ము । నారయ గెలిచెద నని వెఱ్ఱివైతి.
నీ మగఁటిమియెల్ల నేఁడు నేఁగంటి; । బూమెకాఁడవు, ఎందుఁ బో నీకు వచ్చు?
భయనివారణ కేళిఁ బఱతెంచి నన్ను । రయమునఁ గదియంగరా నీకుఁబాడి."
అని యిట్లు పలుకంగ నహితేతుఁ డనియె: । "తనరంగ నన్నేల తప్పు నాడెదవు!

మడుఁగునుండి దుర్యోధనుఁడు ధర్మజున కుత్తరమొసఁగుట

దొరలను నిష్టబంధులఁ [2] బాయుటొకటి, । పర శత్రుసంపద వమ్మైన దొకటి,
కరి తురంగాదులు కడతేరుటొకటి, । యరయంగ బలమెల్ల హతమైనదొకటి,
సర్వంబు చెడిపోయి సమసిన దొకటి, । యుర్విలోపల భంగ మొదవిన దొకటి,
యిట్టి దుష్కీర్తుల నేఁ గన్న దొకటి, । గట్టిగా సమర గంగాప్రవాహమునఁ
బడఁ దీఱుఁగాక, యిప్పటి నీళ్లలోనఁ । బడినఁ దీఱునె! యేల పలికెదు పదరి?
కౌంతేయ, నన్నుఱుంగని వాని వలెనె । వింతమాటల నింత వీడనాడకుము.
పోటు మాటలుగాని పోనఁగ నీవంటి । పాటి మాలినమాట పలుక నే నేర.
సాంద్రవైఖరి హరిశ్చంద్రుండు రామ । చంద్రుండు నలుఁడిట్లు సంకట పడరె!
ఈ వన్నమాటల కెల్ల నూర్మాట । నీవలె నేనాడ నేరనుగాని
చండప్రతాప భుజాదండ కాల । దండంబు నా గదాదండంబుచేత
గనెలుగాఁ దునెలుగాఁ గదిసి మీతోడ । ననికివచ్చెదువాఁడనై యున్నవాఁడ.
చనిరండు మీఁద విశ్రాంతి వే తీర్చి । చెనకి మీమనను రాఁజేసెద." ననినఁ
బాండవాగ్రణి నవ్విపలికె: "రారాజ, । నిండిన మూదప్పి నినుఁ జూడఁ దీఱె;
నీట నున్నాఁడవు నీ దప్పి దీఱె; । పాటించి యేలెమ్ము బవరమ్ము సేయ"
అనిన ధర్మజున కిట్లనియె నీసుతుఁడు: । "[3] జనియించె నాకు విచార మీవేళ;
రణము నా కేటికి రాజ్యమేమిటికి? । తృణలీల నందఱుఁ దెగిన పిమ్మటను

---

1. మొత్తి. 2. జంపు. 3. జని యిల. (మూ)

మిమ్ము గెల్చిన వృథామేదిని బడవి. । పొమ్ము; ఎవ్వరితోడ భోగించువాఁడ?
తాతయు గురుఁడు రాధానందనుండు । జ్ఞాతులుఁ జావ [1] రాజ్యంబు నాకేల?
తమ్ములు ప్రజలు నందఱుఁ గల్గ నీకు । నెమ్మినిచ్చితి భూమి నీవేలుకొనుము.
రవణ వాతాంబు పర్ణములు భక్షించి । తపమాచరించెద దారుణాటవుల.
బలహీనమగు నీవు బయలావటించి । తొలఁగక న్యాత్రికాదుల భుక్తిగొనుము."
అనవుడు విని పాండవాగ్రణి యనియె: । "[2] అనఘ! మేల్మేలు మహాయిచ్చెదీవు!
శల్యుండు పడిన నీచావు దానెఱిఁగి । కల్యాంశభవ, పాఱఁగాఁజెల్లు నీరు
ద్రావఁబోసినరీతి ధరణి యిచ్చితివి । వావిరి నీవంటివాఁడెందు లేఁడు.
ధీర రాజులకుఁ బ్రతిగ్రహవృత్తి । నీరాదు గొనరాదు ఎఱుఁగవా నీవు?
మానవేశ్వర, నిన్ను మడియించి కాని । యేనేల యేలుదు నీ నేల యెల్ల?
కాదుపో మముగెల్చి కఱఁగి యీ భూమి । మేదనీశ్వర, యేల మేకొమ్మ రమ్ము.
ఏగతి వాఁడవై యిచ్చెదు భూమి? । బాగు దప్పిన నీచ పద్ధతి తగునె!
అవనీశ, యీమాట యాదికాలమున । శివమతి నాడక చెఱిచితి కులము.
రయమొప్పఁ గృష్ణుండు రాయబారంబు । దయతోడ రాఁగ నాతనిఁ బట్టఁదలఁచి
మైదూలైకాదు మా యవని లోపలను । ఆదట సూచ్యగ్రమంత యీ ననుచుఁ
బొమ్మని యాడవే భూప, దూషించి; । అమ్మాటలెల్ల నిన్నారడిఁ బెట్టె.
" ఆత్ర సన్న్యాసంబు " లవధరించెదవు । గోత్రసంహారంబు క్రూర, చేసితివి.
ఒప్ప నేరీతి మాకొసఁగెదు భూమి! । చొప్పడ నింకెందు నురిగి పోయెదవు?
పొలియ లాక్షాగృహంబునఁ జిచ్చువెట్టి, । సలిలంబులను ద్రోచి, సర్పాళిచేతఁ
గఱపించి, విషమును గబళింపఁజెట్టి, । తఱలక కల్లజూదమున నోడించి,
ద్రౌపది నీడ్పించి, తమరాజ్యమెల్ల । నేపునఁ గైకొని యిట వెళ్ళఁ ద్రోలి,
ఇడుమలఁ బదుమూఁడుఏఁడు లయ్యడవిఁ । బడరాని [3] పగలతోఁబడి యుండఁజేసి,
యెనయ నీనేలకై యేఁచిన యట్టి । చెనఁటి, మీమాయలఁ జిక్కకుండితిమి.
ఏఁటికి నీమాయ లిభపురాధీశ! । నాఁటిమాయలు నేఁడు నయమఁటె చూడ!
కోటి విద్యలు ధాత్రిఁ గూటికి రావు । కాటికిఁ గూర్చుండి గర్వమేమిటికి?
బంటవై యేతెమ్ము బవరమ్ము సేయఁ । గుంటిన విధియేల కుంటంగ నిచ్చు?"
అని ధర్మజుండాడ నందఱునిట్లు । వినరాని పల్కులు పెసఁ బల్క." రనిన

1. నాజ్ఞాని. 2. అన మేలు మేలు. 3. పగలలో. (మూ)

అనఘు సంజయుఁ జూచి యాంబికేయుండు : । "తనయున కిప్పాటు దైవంబె తెచ్చె ;
కానిమాటల నెంత కండెనో సుతుఁడు ! । దీనత వోకార్చి ధీరత గనెనొ !
చెప్పవే సంజయ, చీకాకుపడితి । దప్పి విదాహించెఁ [1]దనువు." నావుడును
నూత తనూజుఁ డాక్షోణీశు కనియె : । "ఈతెఱఁ వినవయ్య యిభపురీనాథ !
అట్టిమాటలకు నీ యాత్మసంభవుఁడు । చిట్టాడు మనసుతోఁ [2]జెయిగదల్చుచును
దైవంబు దూఱుచుఁ దగవిచారించి । భూవర, యనినేయ బుద్ధి నమర్చి
కౌంతేయుతోఁ బల్కెఁ గౌరవేశ్వరుఁడు : । "కుంతీకుమార, యేగురు మీరు పుత్ర
మిత్ర భటానీక మిళిత సద్బంధు । పాత్ర సామంత దీప్త ప్రచండోగ్ర
కరి రథ ఘోటక ఖడ్గశస్త్రాది । భరితులై యున్నారు పరఁగ నేనొకఁడ.
ఏరీతిఁ బోరుదు నిట నొచ్చినాఁడ. । అరయ నక్లిష్ట నయ్యెఁ గాకేమి ?
[3]పాసర నొక్కొక్కఁడె పోరెదరొటు ? । మునుమిడి దొమ్మిమైఁ బోరనున్నారొ ?
ఏదికారణము నా కెఱిఁగింపు." మనిన । మోదంబుతో ధర్మపుత్రుఁ డిట్లనియె :
"నిను దొమ్మి చంపము నృపకులోత్తంస ! । పనివడి నామీఁదఁబడి పోరు చాలు :
చూచెద నీలావు శూరక్రమంబు ; । ఏచిమాటలు వేయునేల వేరమ్ము."

## దుర్యోధనుఁడు మడుఁగు వెడలి వచ్చుట

అనవుడు నీసుతుం డతిభీకరముగ । ఘనకరాళాకార కలితమై రోఁజు
పుట్టలోపలి కాల భుజగేంద్రు పగిది । బిట్టు గోపించి యభేద్యోదకములు
వెడలి, యన్నిటిలో వీరరసంబు । కడురూపమైనట్టి కడిమి దీపింప
దారుణతర దండధర మహోద్దండ । చారుసన్నిభ మహాచండిమతోడఁ
బ్రలయకాలోత్తాల భైరవాకార । కలితప్రతాప విక్రాంతంబుతోడ,
సంహార భర్గోగ్ర చటులాగ్ని హూత్ర । సంహతి భీకరోజ్జ్వల మూర్తితోడ,
రమణీయ తారహారంబులతోడ । నమరు సుగంధ గంధాదులతోడ
గద కంధరంబునఁ గడుచడిఁ దాల్చి । విదితప్రతాపియై వెస వచ్చి నిలిచె.
నిలిచినఁ గనుఁగొని నృప, పాండుసుతులు । కలగొని సంతోష కలితాత్ములగుచు
బలములుఁ దారును బదిలమై నిలువఁ । దలఁకి నీసూనుఁడు ధర్మజుకనియె :
" ఒక్కఁడొక్కఁడె పోరుటొప్పఁగాకధిప ! । పెక్కండ్రు మీరు నేఁ జేర్మినొక్కరుఁడ.

1. తనుడు. 2. జెవి. 3. పానరంగ నొక్కఁడ (మూ)

నిన్ను నమ్మితి నిడె నీళ్ళలో నుండి । [1]యన్న, నీకిట్టు లన్యాయంబు దగునె!"
అనుటయు ధర్మజుండతని కిట్లనియె: । "ఎనయంగ వినుము నీకేటి ధర్మంబు ?
బాలుని నభిమన్యుఁ బదికోట్లుగూడి । మూల [2]ధర్మముమీఱి ముట్టి చంపితిరి.
ఇప్పుడు రణపాడి యెన్నెడినోరు । అప్పుడు నీ ధర్మమూడంగ వలదె!
అక్కటా యేమూన్య లభిమన్యుసరియె ? । కుక్కవై యూఱక కూపెట్టనేల!"
అనిన నిరుత్తరుండై యున్న విభునిఁ । గనుఁగొని మఱియు నక్కాంతేయుఁ డనియె:
"అదిచూచి యొకమాట యాడితిఁ గాని । యిది ధర్మహానియా యెఱుఁగనా యేను!
రయమున నాసేనరాడు నీ మీఁద; । భయమేల నీకింత ! పైఁబడనీను;
ధరణీశ, తలఁకకు తలఁగ డుచుకొమ్ము; । కరము దృఢంబుగాఁ గాసె బిగించు;
బీరువోవక లెస్సబిరుదువహించి । యెగుకో యొకని మా యేగురిలోన;
వానితోఁ బోరాడి వడి సాహసమున । వానిఁ జంపితివేని వసుధ నీసొమ్ము;
అదిగాక వాఁడు నిన్నాజిలోపలను । మదమున నీపెంపు మడియించెనేని
సురలోక మేలుకోఁ జొప్పడు నీకు; । ధరణి నేఁ గైకొందుఁ దగవు శోభిల్ల."
అనిచెప్పి సకల శస్త్రాదులు నతని । కెనసినప్రీతిమై నిచ్చిన నతఁడు
శ్రమ మొప్ప నవిదాల్చి గద కేలఁ బూని । యమతనూభవుఁ జూచి యర్థినిట్లనియె:
"గాలినందనుఁ డొండెఁ గవలు దారొండె । శూలితోఁ బోరిన శూరుండునొండె
నీవొండె గదగొని యేతెందు చాలు । శ్రీవిభవము మీఱఁ జెండివైచెదను."
అని పల్కునంత నేకాంతంబునందు । మనుజేశుఁ జూచి యా మాధవుఁడనియె:
"ఘనుఁడైన రారాజు గద కేలఁబూని । యెనసి యుద్ధమునకు నేతెంచెనేని
కవలేమిఁయుగుదురు! కవ్వడేమగును! । కువలయేశ్వర, నీవుగొన్న నేమగుదు ?
బాలవె మతిచెడి పలికితి వేల ? । చాలు నూతోడ విచారింపవైతి.
తగవైతి మే కాక ధాత్రీశ, నీకు; । మగతనమోయిది మఱచి యాడితివో ?
మాలోన నొక్కని మడియించితేని । యేలుకో సామ్రాజ్య మెల్లని యంటి.
అదిగాక శకునితో నాడి జూదమున । మది సర్వసామ్రాజ్యమానంబు లోడి
నుతికెక్కు తమ్ముల నోరెత్తనీక । చతురతఁ బదుమూఁడు సంవత్సరములు
ఆకలంబులు దిని యడవులలోనఁ । బ్రాకటంబుగ దుఃఖపడితివిగాదె!
అట్టివన్నిదము నేఁడాడంగఁ దగునె! । ఎట్టివెఱ్ఱివి! శత్రుకెక్కడిపాడి!

---

1. యన్ని. 2. కర్మజులార. 3. యెఱుఁగరు (మూ)

పాఱినఁ బోసీను బదిఁ[illegible] । [illegible] దలఁప
తాతయు గురుఁడు రాధా[illegible]దనుఁడు । [illegible] గూడి నీకుఁ గాఁబోరి
హతులైరి; పుత్రమిత్రాదులు దీఱి; । [illegible] నెత్తి మొక్కడికిఁ బోవచ్చు ?"
అనుటయు నీపుత్రుఁ [illegible] । [illegible] ద్రిప్పి కిట్లనియె:
"ఏలమారుతి, నీకు నింతగర్వంబు? । [illegible] దొడ్డ[illegible]నంబె!
ఎండఱువచ్చిన నేమగు; మిన్న । [illegible]
తగని మాటలను వృథాగర్వమేల? । [illegible] చూపుచు నేఁడు నీవు.
కోపంబుతో మొక్క గుణిఁ [illegible] । [illegible] యొకగవా భీమ!
వంటలవాఁడవై వండుచు [illegible] । నింటను [illegible] గుడిచి,
బకుఁడనువానికి బలిసురాళ్ళించి । [illegible] బుసుడిచి.
నాతోడి యుద్ధంబునకు నీవుగావు; । బాతఱి[illegible] నిల్వు [illegible] చంపెదను."
అనిన భీముఁడు నవ్వి "యట్లైన [illegible] । [illegible]బలాఢ్యఁ బూనినతెప్ప గలిగె;
కడఁకతో నన్ను [illegible]నవచ్చెడిని । కుడుముఁబోవు మొ నేల కూరాకులడుగ?"
అని పల్కుచున్నంత యమసుతనూభవుఁడు । [illegible] వాసవి కవలు
మొదలైన రథికులిమ్ముల నెడగలుగ । నదనుగాఁ గూర్చుండి యంట జూచుచుండ,
భీమ సుయోధనుల్ భీమప్రతాప । [illegible]లై గదలందు గవుసెనల్ దిగిచి
కాలదండంబులకైనడిఁ ద్రిప్పి । యా[illegible]కనంబుల నట దుస్సిపాఱఁ
గరికరి గిరిగిరి గ్రహము గ్రహంబు । [illegible]హతి గనుకనయట్ల యుద్ధమున

## భీమధుర్యోధనుల గదాయుద్ధమరయుటకై బలరాముఁడేతెంచుట

ఆయెడఁ బోరాడ నా యుత్సవంబైన । [illegible] వార్త యెఱింగి
కౌరవనాథుఁడు కరమర్థిఁ దనకు । గారాబు శిష్యుండు గాన నవ్విభుని
కదనంబు చూడను గౌతుకంబైనఁ । గదలి మహాతీవ్రగతి నేఁగుదేర,
ననతి దూరంబున నచ్యుతాగ్రజునిఁ । గనుఁగొని వేడుకఁ గౌరవేశ్వరుఁడు
నరవింద నయనుండు నా పాండుసుతులు । [illegible] భక్తితో నెదురుగాఁ బోయి
దండప్రణామముల్ దగఁ జేయ, వారి । నిండారు కౌఁగిట నీలాంబరుండు
నాపజ్జ నందఱ నక్కునఁ జేర్చి । శ్రీపతి దీవించి జిష్ణు దీవించి
కౌంతేయు దీవించి కవల దీవించి । యంతంతఁ బ్రీతి సాత్యకిని దీవించి
వారి నేమంబులు వలనొప్పఁ దెలిసి । వారికిఁ దన శుభవార్త చెప్పుచును
"భువిఁ దీర్థయాత్రకై పోయి యనేక । దినసంబులాయెను దర్శింపలేదు.

ధరణీశ, మిమ్ము నిందలఁ జూచుకొలకుఁ । జిరకీర్తియుతులు నాశిష్యులు వీరి
దారుణంబైన గదాయుద్ధకేళి । కోరికఁ జూచెడి కొఱకునై వేగ
వచ్చితి." ననవుడు వాయునందనుఁడు । నచ్చిన భక్తితో నాగకేతనుఁడు
గదల హస్తములెత్తి కరమర్థిమ్రొక్కఁ । బొదివి యిద్దఱఁ గృప పొసఁగ దీవించె.
అప్పుడు ధర్మజుఁ డారాముకనియె : । "తప్పక వీరి గదాయుద్ధ మిపుడు
చూడఁ డించుకసేపు సొరిదిమై" ననినఁ । బోఁడిమిమీఱ నిమ్ముల సమ్మతించి
యచ్చోటఁ గూర్చుండె నవనీశతిలక ! । చెచ్చెఱ నేమని చెప్పుదు !" ననిన
నాంబికేయుఁడు మది ననురాగమంది । "యంబుజాక్షుని మాయలణఁగెఁబో నేఁడు;
బలభద్రుఁడిదె మనపాలి భాగ్యమునఁ । దలరి వచ్చిన, సుయోధనునకు నేఁడు
టెక్కులు వచ్చె; నుర్వీతలం బేల । నెక్కుడి పాండవులింక ! రాముండు
ఆరూఢి నిరువాగు నాది కాలమునఁ । దోరమై యాజి కుద్యోగంబు సేయఁ
దానెన్నివిధములఁ దవిలి కృష్ణునకు । నూనిచెప్పిన వినకున్నఁ దాఁ జూచి,
"బలి [1] భేది పాండవ పక్షపాతుండు । తెలివితో న్రుచ్చుచేతికిఁ గోల యిచ్చు;
పాయదు పోరాని పాండవహాని; । నేయేల కన్నుల వీక్షింప నొల్ల;
ఆపాపమున శౌరి యటఁ బోవుఁగాని । యీపావ మేనొల్ల నిఁక." నని వారి
యనుమతితో నాతఁడరిగెఁ దీర్థముల । కని వింటి నాతఁ డత్యంతమోదమున
నేమి తీర్థములాడె? నెచ్చోటఁ దిరిగె? । నీమెయి నా కెఱింగఱిఁగింపు." మనుచు
సూతజు నడిగె నాక్షోణీశుఁ డనిన । నాతతంబుగఁ బ్రియమంది యమ్మునులు
అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్ప జెప్పవే యనియడుగుటయు
సర్వజ్ఞ, సర్వేశ, సర్వభూతాత్మ, । గీర్వాణపతివంద్య, కేశవ, యజర,
కలిత పారావార ఘనతరశయన, । నలినదళాక్ష, పినాకిసంస్తుత్య,
ఘనమాని హృద్గేహ కలితసందోహ । వినుతప్రకాశ, శ్రీవేంకటాధీశ !
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమై శల్యపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొప్పె రెండవది.

1. బట్టి (మూ)

# తృతీయాశ్వాసము



శ్రీగరుడాద్రీశ, సృష్టిప్రకాశ, । ఆగమ వినుత, శ్రీహరి, వాసుదేవ!
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
ఆరీతి రాముఁ డత్యాదరం బొప్పఁ । దోరమై నిఖిల వస్తువులెల్లఁ గొనుచుఁ
బ్రవిమలబుద్ధిఁ బ్రభాసతీర్థమున । నవగాహ మొనరించి యచట దేవర్షి
పితృతర్పణములు సంప్రీతిఁ గావించి । యతుల తేజోధనులగు విప్రవరులు
తనతోడ రాఁ బ్రమదంబునఁ గదలి । మొనయు నేనదుఃందు నేమిగావలెనొ
యట్టి సత్కర్మంబు లాచరించుచును, । నెట్టన సకల ముని ప్రకరముల
కాలయం బైనట్టి యాకురుక్షేత్ర । మోలిమై దర్శించె నొప్పుగా ననిన
జనమేజయుఁడు తీర్థసవిశేషఫలము । వినఁ గోరుటయు మౌనివిభుఁడిట్టులనియె:

## ప్రభాసతీర్థాభివర్ణనము

బలదేవుఁ డేఁగు ప్రభాస తీర్థంబు । అలఘుపుణ్యంబు మహాతీర్థమనియు;
శశి తన క్షయమందు సమయించి బ్రదికె । విశదమై యక్కథ వివరింతు వినుము.
దక్షునశ్విన్యాది తనయుల సరసి । జేక్షణలను జంద్రుఁ డిరువదేడ్గురను
బరిణయంబై మహాపరమ సంతోష । భరితుఁడై యందు లోపల నగ్రమహిషి
రోహిణి యనుదాని రూపరేఖలకు । మోహించి యప్పుడిమ్ములఁ జిక్కిచొక్కి
వలపించి యెంతయు వలరాజుకేళిఁ । దెలివొంది తెప్పలఁ దేలుచు నుండె.
తక్కినయింతులఁ దానొల్లమికిని । గ్రక్కునఁ దమతండ్రి కడ కేఁగి వారు
కన్నుల బాష్పాంబుకణములు దొరుగఁ । జన్నుగుబ్బలమీఁద జాఱుపయ్యంట
కొంగుల మోములకును మాటుచేసి । యంగన లేడ్చుచు నప్పు డిట్లనిరి:
"అక్కటా! తండ్రి, మహాప్రతాపమున । నొక్కట మముఁ జంద్రుఁ డొల్లమిచేసి
సాహసంబునఁ బుష్పసాయకు కేళి । రోహిణితోఁ గూడి యాఢి నున్నాఁడు.
మాకేటి జన్మంబు? మాకేటి బ్రదుకు? । ప్రాకటంబుగ" నని పలికిన దక్షుఁ
డాక్షణంబునఁ జంద్రు నటకు రప్పించి । వీక్షించి యిట్లనె వివరంబుగాఁగ:

"ఇది యేమి చంద్ర! నీకిట్టి దుర్బుద్ధి । మదిని బాటిలె? నిట్టి మాటలు గలవె?
వరఁగ రోహిణిమీఁదఁ బట్టినకూర్మి । సరిగాను బాటింపు సతుల నందఱను
తగవుతప్పక; కాక తప్పితివేని । నెగడంగ మఱి నీకు [1]నీవెఱుంగుదువు.
బుద్ధిహీనత్వమునఁ బో కాంచినాఁడ; । బుద్ధితోఁ బ్రదుకుము పొమ్ము పో." మ్మనిన
నాప్రజాపతి మాట [2]లాలనము చేసి । యప్రబుద్ధిని దోంటి యట్ల వర్తింప
నెఱిఁగి దక్షుఁడు తనయిచ్చఁ గోపించి । యఱుదెవుల్ [3]గొమ్మని యతని శపించె.
నలినారి యంతయు నాఁడునాఁటికిని । జెలువెల్ల నుడివోయి, చంద్రుఁ డిట్లుండె (?)
నతని రశ్మంబు చెడ సఖలౌషధులును । హతము గాఁ జొచ్చెను; అఖిలమానవులు
కడు డస్సియుండ లోకంబు లన్నియును । అడలెఁగాంతులు దక్కెనమృతాంశునొప్పి.
నదియెల్ల నెఱిఁగి యింద్రాది దేవతలు । కదలి యా చంద్రుని కడకేఁగుదెంచి :
"కుముదాప్త, యిదియేమి గ్రుస్సితి విపుడు? । తెమలక ధర్మంబు తెరువు దప్పితివో?
వేఁడినవారల వ్యర్థుఁ బంపితివో? । వాఁడి నీ తేజంబు వడిఁ గ్రుంగుటేమి?"
యనినను జంద్రుఁ డమ్మునులఁ జూచి । గొంకోని తన్ను దక్షుఁడు శపించుటయు
విన్నవించిన వారు వెఱవకు మనుచుఁ । గ్రన్నన చంద్రుఁ దక్కక గొనిపోయి
సుకచిర మూర్తి దక్షునికి మ్రొక్కించి । యరయంగ నపరాధి యైనను వీనిఁ
గరుణాదై నాఱఁగఁ [illegible]ని రక్షింపు । నిరతిమై మమ్ముమన్నించి" నావుడును
సంతోషచిత్తుఁడై చంద్రునిఁ జూచి । యింతుల యెడల నీ వింకనైన సమతఁ
బరఁగి సరస్వతీ ప్రవిమలాంబువుల । నరుదుగా [4]సమవస సముపనయందు
[5]స్నాన మొనర్చు పక్షంబున నీవు । పూని తేజోవృద్ధి పొందంగఁ గలవు."
అని చెప్పి యనిచిన నంబుజారాతి । యనిమిషవర్యుల యానతిఁ జేసి
యా సరస్వతిఁ దీర్థమాడి యంతయును । భాసురతేజః ప్రభావుఁడై యొప్పె.
అది కారణంబుగా నా తీర్థమిపుడు । సదమలంబుగఁ బ్రభాసంబనఁ బరఁగె.
ఆనదీచారిత్ర మటు విన్న నరుల । కానిన పాతకహరము భూనాథ!
కావున రాముఁడు ఘనకృతస్నాన । మావిమలానది నట్లాచరించి
యందుండి వేగిన యటు మఱునాఁడు । [6]సుందరంబగు చమసోద్భేద మనెడి

1. నీకెఱుంగదవు. 2. లాలిమి. 3. గమ్మని. 4. నవమస నవమస. 5. స్నానమై పక్షపక్షంబుల
6. సుందరంబుగ చమసోద్భవంబనెడి. (మూ)

## చమసోద్భేద తీర్థ ప్రభావము

వరతీర్థమున కేఁగి వాసన నారాత్రి । సరవిమైఁ గడపి [1]సుస్నానంబు కలిగె.
ఆతీర్థమాహాత్మ్య మటువిను మనఘ ! । యేతీర్థములకంటె నెక్కుడై పరఁగు
నాతీర్థ ; మందలి కనతిదూరమున । నాతతి నొక యగ్రహారంబు గలదు.
అందు బ్రహ్మసమాను లగ్రజోత్తములు । పొందుగా మువ్వురన్నదమ్ముల పవిత్రులు.
[2]త్రితుఁడును ద్వితుఁడు నేకతుఁడను వార । లతులులై యొకరాజు కట దీక్ష యిచ్చి
యతనిచే గోగణంబులఁ గాకుండఁ । బ్రతిగఁ గైకొని రాఁగఁ, బరిపాటిఁ [3]త్రితుఁడు :
"క్రోసి మువ్వురము గొని కట్టునట్టి । యాస బ్రాహ్మణుని" కన్న నధికమై పరఁగి
తక్కినతమ్ము లిద్దఱికిని గోవు । [4]నొక్కటైన నొసంగ కుసికొల్పుకొనుచుఁ
బోయెఁ; బోయిన వారు బుద్ధిలో వగచి । పాయక వెనువెంటఁ బఱవ, నాద్విజుఁడు
వికలతఁ [5]జనుచును విధివశంబునను । ఒకవృకంబును జూచి యురుభీతిఁ బొంది
పాఱిపోవఁగలేక పడె నొక నూఁతి । నారూఢి నంతలో నాయిరువురును
ఆగోగణంబుల నటఁగొని వేగ । రాగిలి యేఁగి రారటమెల్ల మాని.
తానొండు దలఁపంగ దైవ మొండొకటి । పూని తలంచిన పోల్కిమై నప్పుడు
నట్టి నూతను బడి వడి నాద్విజుండు : । "ఇట్టి పాపంబింక నేమిటఁ గడతు ?
మతినిఁ దమ్ముల నవమానించు నాకుఁ । గృతకమై యివ్విధిఁ గీడొందకున్నె ?
ఈవట్టికూపంబు నింపు సొంపారఁ । బావనోదకపూర్తిఁ బఱపి యిన్నిరు
సోమపానముచేసి శుభము వాటించి । యీమహాపాతకం బేఁ బాతు." ననుచు
యజ్ఞసాధనము లట్లమరఁ గల్పించి । విజ్ఞానధన్యుఁడా విప్రుండు కడఁగి
యమర తర్పణ యాగ మటుసేయ వారు । కమనీయ యాగభాగములఁ గైకొనుచు
నాకూపమున దివ్యమగు జలంబొసఁగి । యాఁకొని మఱి వరమడుగు నీవనిన
సురలతో ననియె భూసుర కులోత్తముఁడు : । "ధరణిలో నాసహోదరుల వంచించి
నట్టి పాపము వాయ, నవని నీజలము । నెట్టి వాఁడానిన నేప్రదీపించి
సోమపానఫలంబు సారిది సిద్ధింప । నోమహాత్మకులార, యొసఁగరే" యనినఁ
గానిమ్మనుచు నిచ్చి కడువడి సురలు । పూని పోవంగ, నప్పుణ్యకూపంబు

1. 'ఉదపాన' మని కవిత్రయ. భా. 2. కృతుఁడును ధ్రువుఁడు సుకేతుండుననఁగ. 3. గృతుఁడు.
4. నొక్కటైనను ఈక యుసి దెగ ననుచు. 5. జనుదేర. (మూ)

నమృతసంభవమైన నప్పాడాద్విజుని । కమరంగఁ బాతకహరమయ్యె; నంత
నందుఁ దీర్థంబాడి యారోహిణేయుఁ । డందంద వినశనం బందును గ్రుంకె.
కవలి యందులనుండి కడు శీఘ్రగతుల । సదయుఁడై[1] శంఖు నైసర్గికంబులను
నాగ[2]ధన్వంబను నామధేయముల । బొగుమించిన మూఁడు పటుదివ్యనదుల
నవగాహ మొనరించి, యంతటఁ బోక । నపభంగి జాహ్నవీనదిఁ దీర్థమాడి,
ఘనతరస్ఫూర్తి లోకస్తుత్యమహిమ । ననుపమంబగు నైమిశారణ్యమునకుఁ
జనియె ; నత్తఱి దీర్ఘసత్రముచొప్పట । నొనరించు మునులు ప్రత్యుత్థానమెలమిఁ
జేసివినమ్రులై సీరాయుధునకు । నాసనంబిడి పూజలర్థిఁగావించి.
రన్నిలపటుఁడు ప్రీతాత్ముఁడై యచటఁ । దన్నుగన్గొని సముత్థానప్రణామ
సన్నుతులుడిగి నిస్సంభ్రమవృత్తి । నున్నతాసనమున నున్నట్టిసూతు,
నతని సమీపస్థుఁగు భూమిదేవ । తతిని వీక్షించి క్రోధము నెలకొన్న
"హేతువేటిదియొకో ! యీప్రతిలోమ । జాతుఁడు మునిసభాస్థలమున నిట్లు
తానొకముఖ్యు చందమనను దురభి । మానియై యాశక్తి మనుమనివలన
దండిగాఁ గథలు గాథలు గొన్నినేర్చి । పండితమ్మన్యుఁడై పరగెడు; నిట్టి
చెనఁటివాఁ డభ్యసించిన విద్యలెల్ల । మనమునఁ జింతింప మదకారణములు
గాని సద్గుణహేతుకంబులు గావు । గాన ధర్మమునిల్పఁగాఁ బుట్టినట్టి
మాకు నీదృశ[3]దుష్ట మర్దనంబెపుడు । గైకొని [4]గావించఁగా నర్హ"మనుచు
భావించి కరధృత పటుకుశాగ్రమున । వావిరి నాసూతు వధియించె; నవుడు
అక్కడిమునులు హాహారవంబెనఁగ । నక్కామపాలున కనిరి : "యోదేవ !
యేము బ్రహ్మాసనంబిడినారమితని ; । కీమేర మున్న నీవెఱుఁగనియట్లు
తెగువమై వీని వధించితివలిగి । నిగమవాక్యస్థితి[5] నిజముగైకొనక.
పరమపావనుఁడవై పరఁగునీవిపుడు । కర మొప్ప నీపాతకమునకుఁ దగిన
యట్టిప్రాయశ్చిత్త మటు సేయకున్న । నెట్టిధర్మమునిల్చు నింక లోకముల?"
అనుటయు నారాముఁ 'డట్లకావింతు । మునులార ! దీనికి ముఖ్యపక్షంబు
వినిపింపుఁ; డదిగాక వీనికాయువును । ఘనతరసత్త్వంబు కరుణఁబాటవము
నెనఁగుట మీకిష్టమే యిటులైన । మసలక నాయోగమాయఁగావింతు."

1. గంగవిసర్జకంబనగ, 2. ధన్వంతర. 3. దృష్టి. 4. భావించఁగా. 5. నెపము, (మూ)

ననిన నమ్మునులు 'నయ్యగ్రసారస్వ్య । మునకు మృత్యువున కిమ్మలనట్లమాకు
నేగతి వైకల్యమొసఁగక యుండు । నాగతి యొసరింపు మఖిలేశ, నీవు."
నావుడు "తాన నంతనుఁడయి పురుషుఁ । డావిర్భవమునొందు" నని నిగమోక్తి
గలదటుగాన నక్కథకునిపుత్త్రుఁ । డలఘుసత్త్వాయ తానామయత్వములు
గలిగి వక్తృత్వ విఖ్యాతినెల్లందు । వెలయు; నోమునులార, వినుఁడిప్పుడేను
జింతింప కాచరించిన యీయవజ్ఞ । శాంతినొందఁగ నభీష్టమువిూకొనర్తు
నడుగుఁ డెయ్యదియైన" ననిన నమ్మునులు । కడుముదంబున సీరకరున కిట్లనిరి :
"ఇల్వలుఁడను దానవేంద్రుని సుతుఁడు । పల్వలుఁడనువాఁడు ప్రతిపర్వమునను
జనుదెంచి మాయాగశాలలలోన । మునుముగా రక్తశోణ్మూత్రపూరములు
[1]తరనఖండములు మద్యంబుల జల్లు । గురిసియేసుఖమును గొనసాఁగనీఁడు.
దురితాత్ముఁడైన యా [2]దుష్టాసురేంద్రుఁ । బరిమార్చుటిదిమాకుఁ బరమశుశ్రూష.
మఱియంతమీఁద నిర్మలమతి నీవు । వరమతి భారతవర్షంబునందుఁ
గల తీర్థవితతి సాంగముగఁ బంద్రెండు । నెలలొనర్చినఁ బాపనిష్కృతి వగుదు. "
వని రంతఁ బర్వసమాగమంబైన । మునులు యాగక్రియోన్ముఖులౌటెఱింగి
పెనుధూళియును బూలపెల్లలు నిసుము । మునుముగా సురగాలి ముందట విసరి,
కడురోఁతగాఁ బూతిగంధ మెల్లెడల । నడరఁగా యజ్ఞశాలావలి యందు
మలమూత్రములు కర్దమముగ నందందు । బలువిడిఁ గురియుచుఁ బల్వలాసురుఁడు
కఱుకు జుంజుఱు వెండ్రుకలును, బెన్నలుపు । గిఱికొనుమేను, నగ్నిజ్వాలలెసఁగు
తెఱనోరు, పవిదండతీక్ష్ణదంష్ట్రికలు, । కుఱువిప్పాలురలుచూడ్కులు, మిడిగ్రుడ్లు
మఁడిపడుబొమలును మొఱకుమీసములు । నిడుఁద జిహ్వాయుఁ గ్రొత్తనెత్తురువడియు
నరచర్మ[3]తలమున నాంత్రంబుఁ బెనఁచి । సిరలగ్రుచ్చిన వచ్చిశిరముల పేరుఁ
గలిగి క్రొమ్మెఱుఁగులు గగనమార్గమునఁ । దళతళ మెఱయు[4]నుద్ధత త్రిశూలంబు
కరమునఁ ద్రిప్పుచుఁ గర్ణకఠోర । ఘన నిస్వనమున నగ్గలికనార్చుచును
ఘోతగాఁ బఱతెంచు గతిచూచి బలుఁడు । దైతేయ హృదయభేదనములై మెఱయు
తన హల ముసలముల్ దలఁప నాక్షణము । చనుదెంచుటయు వానిఁ జయ్యనచూచి
హలమున గగనస్థుఁడైన యాదైత్యు । గళము [5]దగిల్చి భీకరముసలమున
నడునెత్తిమొత్తఁ, గర్ణంబునమొనడు । వెడలి వల్వలు నోరువిచ్చుచు గ్రుడ్లు

1. తనర 2. దుష్టాచ. 3. ఫలమున. 4. నుద్ధతి. 5. గదల్చి. (మూ)

వెలుపలికిఁ జుఱుకఁ బవిత్రహారమున । బలుకొండమహిఁ గూలు పరుసునఁ గూలె.
మునులెల్ల నప్పుడు మునలాస్త్రుఁ జెలఁగి । వినుతులు సేసి వేవేలు చందముల
దీవించి విబుధులు దేవేంద్రుఁ బోలె । శ్రీవెలయఁగ నభిషిక్తుఁ గావించి
యొప్పుడుఁ గైవ్రాల కెసఁగు వాసనల । నొప్పు నుత్ఫుల్ల సరోజ మాలికయు
నసదృశ దివ్యాంబ రాభరణములు । నొసఁగిన, నాహలాయుధుఁ డాదరమునఁ
జేకొని వారలచే ననుజ్ఞాతుఁ । డై కతిపయ భూసురాన్వితుఁ డగుచుఁ
జని కాశికిని గృతస్నానుఁడై, సరయు । వను నదిఁ గ్రుంకి, ప్రయాగ దర్శించి,
మఱి పులస్త్యుని యాశ్రమము ప్రవేశించి, । కరమర్థి గోమతీ గండకీ నదులఁ
బరఁత సేవించి, విపాశలో మునిఁగి, । నరనుతంబగు శోణనదిఁ దీర్థమాడి,
గయయు గంగాబ్ధిసంగమము నీక్షించి, । రయమార నమ్మహేంద్రధరాధరమున
కరిగి యందున్న లోకైకసన్నుతుని । బరశురామునిఁ గాంచి ప్రణమిల్లి కదలి,
ధరనొప్పు సప్తగోదావరి కేఁగి, । వరుసఁ బంపాసరోవరమును భీమ
రథిఁ గనుఁగొని, కుమారస్వామిఁ జూచి, । పృథివి యెల్లందును బేర్కొనఁ దగిన
శ్రీనగంబెలమి దర్శించి, విఖ్యాతుఁ । డైన వేంకట పర్వతాధీశుఁ గొలిచి,
కామాక్షి దేవిని గని, నిత్యసౌఖ్య । సీమయైనట్టి కాంచీపురినుండి
పావనంబై జగత్ప్రఖ్యాతి నెసఁగు । కావేరియం దవగాహంబు చేసి,
శ్రీరంగశాయి నాశ్రితపారిజాతుఁ । జేరి సేవించి, చెచ్చెఱ వృషభాద్రి
ననురక్తిఁ బొడగని, యాకురుక్షేత్ర । మున నిల్చి దక్షిణంబున మధురాఖ్యఁ
బొలుపారు పురిఁ జొచ్చి, భూరిపాపములఁ । దలఁగించు సేతుబంధము మెట్టి యచటఁ
బదివేల మొదవుల బ్రాహ్మణోత్తముల । కొదవిన భక్తిమై నొసఁగి, రామేశు
భుజగభూషణు భుక్తిముక్తిదాయకుని । భజియించి, యటఁ దామ్రపర్ణికిఁ బోయి,
మలయాచలం బెక్కి మహిమఁ బెంపొందు । నల యగస్త్యునికిఁ బ్రియంబుగ మ్రొక్కి
యతనిచేఁ బూజితుఁడై వార్ధికన్యక । సతతంబు నభిమత సంపదలిచ్చు
కన్యాసమాఖ్య దుర్గాదేవి నఖిల । మాన్య నుపాసించి, మహితప్రశస్తి
జరగు [1]పంచాప్సరసంబను తీర్థ । వరమునఁ దగనాప్లవం బాచరించి,
శ్రీకరంబై శివక్షేత్రమైనట్టి । గోకర్ణమున నిందుకోటీరుఁ గొలిచి,
మనుతీర్థమాడి, క్రమ్మఱఁ బ్రభాసమున । కనఘుఁడై చని భూసురావలివలనఁ

1. పంచాప్సరసంబను (మూ)

కౌరవ పాండవ కలహంబునందు । ధారుణీనాథులందఱు మడియుటయు,
ననిల తనూజుండు నాసుయోధనుఁడు । ఘన గదాయుద్ధ మొక్కట నొనరింప
సన్నద్ధులై యున్న చందంబుఁ దెలియ । విన్నవాఁడై వచ్చి వేవేగ." ననిన
నాంబికేయుఁడు విని యాత్మలో మెచ్చి । పంబిన విధిఁ నవ్వఁ బలికె సంజయుని :
" భీమ దుర్యోధనుల్ భీమవిక్రమము । తో మహామహిమ నుద్ధురవృత్తి నెట్లు
పోరి ? రత్తెఱఁగెల్లఁ బొందుగా నాకు । నారూఢిఁ జెప్పవే" యనిన నిట్లనియె :

## పాండవ దుర్యోధనులు రణరంగమునకుఁ బోవుట

దేవ, నీసుతుఁడు యుధిష్ఠిరుఁ జూచి । "భావింపఁగ శమంత పంచకంబజుని
యుత్తరవేదియై యొప్పారుఁ గాన । నత్తఱి నెవరైన నచ్చోటఁ బోరి
హతులైన ముక్తి పాయకసముకూరు । నతులితగతిఁ బోద మచ్చోటి." కనినఁ
గృష్ణానుమతితోడఁ గిమ్మీరవైరి । జిష్ణుండుఁ గవలును సేనలు నడవ
బలభద్రుఁడును దాను బౌరవేశ్వరుఁడు । కలితవేగంబునఁ గదలిరాఁ బోయి
సరవి శమంతపంచకమున నిలిచె । విరివి సేనలు పరివేష్టించి [1] కొలువఁ
దానును భీముండుఁ దరలక యెదురు । గా నిల్వ భూప, నీగాదిలిసుతుఁడు
నింగియు నేలయు నెఱి వ్రక్కలుగను । బొంగి యుప్పొంగి యార్పులఁ జెలరేఁగి
గద కేలఁబూనినఁ, గరువలిసుతుఁడు । గద తాను గైకొని ఘనతరస్ఫూర్తి
నార్పులు హృదయఁబు నావరింపంగ, । నూర్పులు ఘాతలై యుచ్చిపాఱంగఁ,
జూపులు తూపులై చుఱచుఱ మనఁగ । భూపాల, పలికె నీపుత్త్రునీక్షించి :
" రారాజ, నీవు పాఱక కొంతసేపు । పోరాడుమీ నీదు భుజశక్తి మెఱసి.
ఎక్కడఁ బోయిన నింకఁ బోనీను । ద్రొక్కి వైచెద నిన్ను ధూళీపటలిగ."
అనవుడుఁ గోపించి యధిప, నీసుతుఁడు । అనిలనందనుఁ జూచి యర్థితోఁ బలికె :
"పలికి పల్కించుకోఁ బనిలేదు భీమ ! । బలియురతో బంటు పంతంబుగలదె !
వంటలపనిగాదు వాఁడిమిపోరు ; । నంటైన బహ్వాశనముగాదు పోరు ;
గుఱ్ఱాల కెఱఁగి నిక్కుటగాదు పోరు ; । నఱ్ఱులఁ గాచుటన్నదిగాదు పోరు ;
పాత్రల దిద్దేడి పనిగాదు పోరు ; । ధాత్రిపై భట్టునేతలుగాదు పోరు

1. నిలిచి (మూ)

చపలారి తిమిర ప్రచండ మార్తాండ । నిపుణుండ నాకుఁ దా నీవన నెంత ?
పలుకుల వెఱచునే ఫణికేతనుండు ! । కలదు ఒకట్టి నన్ను గడునెన్న మీకుఁ
గొలను చొచ్చినయది కొఱగాదు గాక । అలసుఁగాఁ జూచెద వట్లు చూడకుము.
కలన నిన్నేటికిఁ గైకొందు భీము ! । కలితారి విక్రమ గర్వాపహారి
నాగదాదండంబునకు బలిగాఁగ । నీగర్వమణఁచి యెంతేనొంతు నిన్ను.
తగఁజోద్యపఱతు బృందారకావళిని ; । వగపు పుట్టింతు నీవారికి నెల్ల.
నీవనఁగా నెంత నిర్జరేంద్రాది । దేవతలును నన్ను దృష్టింపలేరు.
నీవెట్లు నాతోడ నెగడుదు గదను ? । ఈ వేళ నీ సత్త్వ మిదియెంత గలదు ?
అడరంగ నీకు ఫాలాక్షురశ్రేణి । తుడిచెద నాతోడఁ దొడరు మాజికిని."

## భీమదుర్యోధనులు గదలఁగొని ఘోరముగాఁ బోరుట

అని తనగద త్రిప్పి హాచూడు మనుచుఁ । గనుఁగవ నయ్యగ్నికణములు రాలఁ
గదిసిన, భీముఁడక్కదలు వీక్షించి । కదిసెఁ బోరాడ విక్రమలీల మెఱసి.
ఆతఁడు నీతఁడు నట నేమిసెప్ప । ఘాతమాటలు మీఱఁ గరలాఘవములఁ
బద తాడనంబులఁ బరఁగు హుంకృతుల । విదితాట్టహాస దోర్వీర్యంబు మెఱసి
తాఁకిన, నంతఁ బాతాళలోకంబు । కాఁకచే ఘూర్ణిల్లెఁ గడుబన్నిరించి ;
కాకోదరేంద్రుండు కరులపై నొరగె. । ... ... .. ... ...
అప్పుడు గొట్టుచు నదర మెట్టుచును । ద్రిప్పుచు భ్రమరిగాఁ దిరిగి వైచుచును,
అది మెచ్చుగాదని యంటఁగొట్టుచును, । 'అదెసుమీ తప్పుకో' మ్మని పలుకుచును,
'బాపు! మజ్జా!' యనిపరఁగ మెచ్చుచును, । కోపించికొట్టి "సాంగుబళా!" యనుచును,
కదలు నెమ్మోములఁ గదియఁ ద్రిప్పుచును । అదటునఁ గైకొన కంటఁ దప్పుచును,
గినియుచు డాయుచుఁ గ్రేళ్లుదాఁటుచును, । జొనిపి హాహా పోకు చూడుమనన్నుచు,,
మండిగాఁ గాలిడి మలసి మార్కొనుచు, । దండెముల్ పెట్టుచుఁ, దప్పఁ గ్రుంకుచును,
గదగద దాటించి గదిసి యిద్దఱును, । మదమునఁ జెలరేఁగి మార్మలయుచును,
బిడుగుల కెనయైన బెడిదంపు గదల । నడఁచియు మెచ్చుచు నఱనవ్వునగుచు
'నవుర ! నీకొట్టు పొల్లైపోయె' ననుచు । 'నవురిది పొల్లుగా' దని పలుకుచును,
గుప్పునఁ గొట్టుచుఁ గునిసి యాడుచును । గుప్పిగంతులు గొని క్రుంగి తప్పుచును,
గినియుచు నిద్దఱు గెలుపులాసించి । ఘన విక్రమ క్రమ కలితులై మించి,

తెఱుముచు మెఱుముచు దారుణక్రియల । నొఱయుచు మెఱయుచు నుబ్బిపాఱుచును,
పాయుచు డాయుచు బలిమిఁజూపుచును, । వేయుచు రాయుచు వెనుఁ దిరుగుచును
వాసిగాఁ బదియాఱు వన్నె కుందనము । ప్రాసున నొకటిగాఁ దగఁదూఁచినట్లు
ఒరకు వన్నెకువచ్చి యొక్కింతలుగను । ఉరుగతిఁ బోరంగ, నొడలిరక్తములఁ
గంకటంబులు దడిసి కాఱఁ జొచ్చుటయుఁ । బంకమై జోళ్లును భారమౌటయును
అవియూడ్చి తనులాఘవావళిఁ బొంది । కవియుచు నొకరికొక్కరు వట్రపడక
నడమోదుగులఁ బోలి నలిరక్తధార । లొడలి భూరజమెల్ల నొప్పారఁ గడుగ,
నుదయార్కు లనఁగ సముజ్జ్వలప్రభలఁ । బొదలిరి యప్పుడో భూపాలచంద్ర!
అంతట నీపుత్త్రుఁ డఖిలంబుచూడఁ । బంతంబుతో భీము బరియెమ్ము విఱుగ
నదరంట వ్రేసిన, నా బకవైరి । యది తప్పనొడ్డి తానాతని యురము
జెదరఁగాఁ గొట్టినఁ, జెదరక యతఁడు । గదచాఁచి పోనీక కడిమి వాటించి
గంధవాహజు మస్తకంబంత వ్రేయ, । బంధురంబుగ నది పటపట పగులఁ
జలన మించుకలేక చలమగ్గలించి । విలయకాలుని భంగి విభుని నెన్నుదురు
నదురుగాఁ గొట్టిన నసుకు నెత్తురులు । జొరజొర మోమున జొబ్బిల్లఁ గాఱఁ
దుడుచుచు నేతెంచి తుది భీముగదకు । నొడిసిన, నాతఁడాయొడుపు దప్పించి
వీఁగి పాఱఁగ నేయ, వీఁగక యతఁడు । లోఁగక భీముని లోఁబడ వ్రేసె.
వ్రేసినఁ గాళ్లును విలవిల మనఁగ । నాసమయంబున ననిలనందనుఁడు
పట్టుగా నాతని బాహుమధ్యంబు । గొట్టిన రారాజు కునికిలఁబడుచు,
నంతలోననె లేచి యతనిఫాలంబు । వింతగా వేసిన, వీఁగక భీముఁ
డతనితోఁ బోరాడు నంతటిలోనఁ । గృతమతితోఁ గ్రీడి కృష్ణునకనియె:
"రారాజు మారుతి రణబలోదగ్ర । భారులై యున్నారు బవరంబులోన.
వారకదోస్సార వహణి యెవ్వరిది । యారూఢి నధిక మీవది చెప్పు" మనిన

## భీమదుర్యోధనుల తారతమ్యంబు శ్రీకృష్ణుఁ డర్జునునితోఁ జెప్పుట

నమరేంద్ర సుతుతోడ నంబుజనాభుఁ । డమరంగ నప్పుడిట్లని చెప్పఁదొడఁగె:
"విపుల విద్యాశక్తి వీఁకిద్దఱికి । నుపదేశ గమ్యంబు నొక్కసమంబు.
వివిగా మిక్కిలి వీరలలోనఁ । గరువలితనయుండు ఘనబలాధికుఁడు;
నేర్పు మిక్కిలి కురునృపసింహమందు; । దర్పంబు [1] వాటంబు తగనెంచిచూడ

---

1. సాళంబు. (మూ)

సత్వంబు చేర్పుతో సరిగాదు వినుము. । సత్వంబు గలదని సాహసవృత్తి
ననిలసూనుఁడు సాచ్చియలయుచున్నాఁడు; । మును నొచ్చియున్నాఁడు మొగిసుయోధనుఁడు
తడయక యిటువలె ధర్మయుద్ధంబు । కడఁకతో నెన్నాళ్లు ఘనతఁ జేసినను
సరిపడునేగాని చావఁడు వీఁడు; । తరమిడి భీముఁడీతని గెల్వలేఁడు.
ఇంకొక్క సిద్ధాంత మెఱిఁగింతు వినుము । అంకిలేమియు లేక యన్యాయవృత్తిఁ
జంపుత భీముండు సందేహమేల ! । చంపక ధర్మంబు చదివితిరేని
ధృతి మీకుఁ బాటిల్లు దేశాంతరంబు. । కతలేల యిటువంటి కపటచిత్తులను
అన్యాయమునఁ జంపుటదియె ధర్మంబు. । ధన్యుఁడింద్రుండు వృత్రాసురుఁ దొల్లి
యేగతి నోరగించె నెఱుఁగరా కథలు ? । జాగేల యభిమన్యుఁ జంపరా వారు ?
దుష్టశిక్షణము సంతుష్టిగాఁ జేసి । శిష్టరక్షణమును జేయంగలేని
క్షత్రియులకు నేల సత్కీర్తి గలుగు ? । ధాత్రిపై నీ సుయోధనుఁ డల్లనాఁడు
కల్లజూదంబునఁ గాదె మీసిరులు । కొల్లలుగాఁగఁ జేకొనియె నాఁగావొ ?
అట్టి జూదంబున నతివఁ బాంచాలి । నెట్టన నీడ్పింప నీభీముఁ డతని
యూరుభగ్నంబు నేయుదునన్నవాఁడు. । ఆరీతి నేయక యతఁడేల మాను ?
మానెఁబో నేనేల మానంగనిత్తు ? । మానసనెట్టులు వచ్చు మాటాడి వెనుక ?
పలుకు ప్రతిజ్ఞ యేర్పడియున్నచోట । వెలయంగ మఱచుట వీరధర్మంబె ?
పగ నూతఁ బడ్డ నేర్పడ రోఁకలెత్తి । తగఁ గ్రుమ్మలేనట్టి ధర్మమదేల ?
అది గాక ధర్మజుఁ డాడరానట్టి । ముదుకమాటలు కొన్నిమున్నాడె వినుము
పుత్ర మిత్రక బంధుబుధులఁబోనాడి । యాత్రోవ నేకాకియై కౌరవుండు
వారిలో డాఁగిన వాని రావించి । యూరక 'మాలోన నొక్కనితోడ
ననిచేసి గెల్చి నీవఖిల రాజ్యంబు । గొను' మని పలుకుట గుణమె తలంప ?
తలపోయ నిది వెఱ్ఱితనము తాఁ గాదె ! । వెలయంగ రారాజు వీరుఁడుగాఁడె ?
దైవయోగంబునఁ దా భీమసేనుఁ । గావించి రమ్మనెఁగాక ; మీలోన
నెవ్వనిఁ బిలిచిన నిట వీనితోడ । రవ్వగాఁ బోరి మీరలు గెల్వఁ గలరె ?
మొదలనుండియుఁ బదుమూఁడు వర్షములు । గదసాము సాధించి కడఁక వహించి
హెచ్చి మదంబున నిభపురాధిపుఁడు । చెచ్చెర రణకేళి చేయుచున్నాఁడు.
కనుఁగొనఁగాఁ బెక్కుకాలంబునుండి । యనిలసూనునకు నభ్యాసంబు లేదు.
తలకొన నదిగాన ధర్మంబు దక్కి । కలన నీకురురాజుఁ గడ తేర్పకున్న

గాలిసూనుఁడు వృథా కడ తేరిపోవు. । ఓలి మీయన్నయు నర్వి యేమగును ?
రారాజె యిలకెల్ల రాజు దా నగును ; । తేరకాఁడును బోలెఁ దెగువ నేనుందు ;
ఇలలోన వెనుక మీరేమి సేయంగఁ । గలరు ? నావచ్చు సంకల్పితం బుడుగు.
ధర్మ మధర్మంబు దగ నేనెగాన । నిర్మూలముగ వీని నెఱిఁ ద్రుంపవలయు."
నన విని యర్జునుం డాకృష్ణుఁ జూచి । "విను దేవ, నీవన్నవిధ మట్టి దగును.
ప్రకృతి గుణంబునఁ బరఁగుచున్నట్టి । వికృతంబు లుడిగెను విశ్వేశజనక !
సారిదిఁ బుట్టఁగ, దాన సుఖము దుఃఖమును । ధరణిఁ బూసలలోని దారంబు పోలె
లలివచ్చు [1]కర్మఫలంబునఁ జేసి । వలసి దేహికి స్వభావములు గావునను
చైతన్యరూపమై సకల జీవులను । బ్రీతి నాడింపుచుఁ బేర్చి లోకములు
పుట్టింప రక్షింపఁ బొసఁగ శిక్షింప । నిట్టి నేర్పరివఁట యిది నీకు నెంత ?"
అనవు డయ్యోకాంత మట భీముఁడెఱిఁగి । యనిసేయఁ దివురుచో, నమరేంద్రసుతుఁడు
పౌనరంగఁ దనయూరువులు కనుసంజ్ఞఁ । గనిపించి కరములఁ గడునప్పళింప
నాసంజ్ఞ యెఱిఁగి తా నతివీరుఁ డగుచు । భాసుర భుజబలప్రౌఢి దీపించి
తనతండ్రిఁ బవమానుఁ దలఁచి శ్రీకృష్ణు । ననువార ధర్మజు నాత్మలో నిలిపి
దుర్యోధనుని జూచి: "తొడరి యుద్ధంబు । కార్యక్రమము దప్పఁ గడవఁ జేసెదవు.
వదరక పోరాడు బంటవై నిలువు. । పొదలుచుఁ బోయినఁ బోనీను నిన్ను."
అనుచు గదాఘాత మడరింప, నతఁడు । కినిసి వాయుజుఁ దాఁకెఁ గృతమతితోడ.
[2]కౌరవనాథుఁ డాగ్రహవృత్తితోడ । సారెసారెకుఁ బోరి [3]చలియింపకపుడు
బలువిడిఁ బోరాడు పవమానతనయు । 'లలిఁ జావఁగొట్టుదు లావొప్ప' ననుచు

## భీముగదాఘాతముచే దుర్యోధనుఁడు తొడలు విఱిగికూలుట

గదచేతఁ గొట్టి యుగ్గగనంబునకును । నెగసిన వడముడి యేపుదీపించి
యూరుద్వయము చూచి యురుగదాదండ । మారయ జడిపించి యపుడు గొట్టినను
పవిదాఁకి కూలిన పర్వతంబనఁగ । రవళితో భూమిపై రారాజుగూలె.
అపుడు నానందించె నఖిలలోకములు ; । తపనుండు వెలుఁగొందె ; ధర్మజకృష్ణు
లపుడు సంతోషించి ; రనిలజుఁడంతఁ । ... ... ... ... ...
గాలకాలానలాకారుఁడై మండి । తాలిమి కోపమంతట నిల్పలేక

---

1. నంశ 2. కౌరవ భీములా. 3. చాలింప (మూ)

ధారుణి వణఁక భూధరములు బెణఁక । వారిధుల్ గలఁగ దుర్వారుఁడై వచ్చి
మానమే తొడవుగా మన్నట్టిరాజు । మానంబుగాఁ దొడ యుర్విపై విఱిగి
పఱఁగ ఱెక్కలులేని పర్వతంబనఁగ । నొఱలుచునున్న, దుర్యోధనుఁ జూచి
వ్యాఘ్ర మల్పమృగంబు వడిఁ గన్నయట్లు, । శీఘ్రంబ యాతనిఁ జేరంగ వచ్చి
"రాశికెక్కినయట్టి రమణిఁ బతివ్ర । తాశిరోమణి ద్రుపదజఁ గోమలాంగిఁ
బాంచాలి నెగ్గులు పలికి, వస్త్రంబు । లెంచక దోపించి, యెల్లమాసిరుల
నూఁచముట్టుగఁగొని, యుదుటున మమ్ము । నేఁచిన యాఫలం బిదె యనుభవింపు."
అని బిట్టు వామపాదాహతి నుఱికి । తనరంగ వాని మస్తకమటు దన్నె.
తన్ని యంతటఁ బోక తసరౌద్ర మెసఁగఁ । గొన్ని మాటలఁ గురుకులున కిట్లనియె
లీల: "దుర్యోధన, లెస్సలా మీకు? । నోలిమైఁ బగదీఱెనో లేదొ చెపుమ!
ఇఁకనైన మాభాగ మీయంగరాదె! । ఇఁక నేమియిచ్చెద? పీకున్నమాను."
అనునంత బలభద్రుఁ డాగ్రహవ్యగ్ర । జనితకాలానల జ్వాలుఁడై మండి
యక్కడి వారల నందఱఁ జూచి । యొక్కట నెలుఁగెత్తి యొదరుచుఁ బలికె:
"కంటిరా పెద్ద లీ కష్టవర్తనము! । కంటిమే యెందైనఁ గటకటా యెపుడు!
పిఱుఁదుకు దిగువ నే భీమవిక్రములు । నుఱికివేయరు గదాయుద్ధంబునందు.
అది యెఱింగియు భీముఁ డాహవక్షోణి । నుదరి యాతని యూరువులు గొట్టఁదగునె!
కొట్టిన మాత్రమే కురుకులశ్రేష్ఠు । నెట్టనఁ దలదన్నె నెఱి నెంతవాఁడు!
రాజన్నమాత్రమే రాజు, రారాజు; । ఆజిలో నీనేత కర్హుఁడా చెప్పుఁడీ!
ఏ వీరులందును నేరాజులందుఁ । జేవమై నిటువలెఁ జేసినదెఋఁగ.
అటుగాన రణధర్మహాని గావించెఁ । గటకట! యెవ్వరుఁ గాదనరైరి.
పద్మాయతాక్షుండు పక్షీకరించె; । ధర్మంబు నే నెట్లు సహియింతునోర్చి?
తన బంటుతనమెంత! తనగదయెంత! । తనవార లన నెంత! దాక్షిణ్యమేల!
ఇప్పుడు భీముని నీరణకేళిఁ । జప్పుడుగాకుండ సమయింతు." ననుచుఁ

## శ్రీకృష్ణుఁడు బలరామునకుఁ గోపోపశమనంబు సేయుట

[1]గౌరవుఁ దలర లాంగలమును గొనుచు । మారుతిపై నేఁగ, మాధవుండపుడు
ఎడచొచ్చి బలభద్రు నెలమి హస్తములు । బెడిదంబుగాఁ బట్టి ప్రీతినిట్లనియె:

1. క్రూరుఁడై యదరి లాంగూలంబు గొనుచు. (మా)

"నిలు నిలు బలభద్ర! నీకేలపదర? । ఎలమి వారును వారు నెటుపోయిరేమి!
యూరక మనమేల యొప్పమి దలఁప । వారిలోపల వారు పగ పొందియుండ.
అన్ని నిందలు నాకు నటుసంభవించు । నన్ను, నీ వితనిపై నలిగినంతటనె.
అదిగాక భీమార్జునాదుల గెలువఁ । గొదలేని దేవతాకోటుల వశమె!
అది యెటులంటేని యంశయు వినుము, । విదితాత్మ, నీచేత వీరుచచ్చినను
'నలిన లోచనుఁడు పాండవులఁ జేపట్టి । కలకాలమును బ్రోచి కాపాడి తెచ్చి
కౌరవకులమెల్లఁ గడతేర్చి పిదప । దారుణక్రీడను దమ యన్నచేతఁ
బాండునందనులను బ్రథనోర్విలోన । ఖండించి రాజ్యంబు గైకొనె' ననుచు
నిలఁ గలవారెల్ల నిట్లు దూఱంగ । వలవని మనకపవాదంబు వచ్చు.
అటుగాకయుండ నీవది చిత్తమందుఁ । జటులత మాని విచారింపు దేవ!
మనము పెట్టినచెట్టు మనకేలమెఱుక । ననిచి వీరలతప్పు ననుజూచి కావు."
అనవుడు రాముఁ డాయచ్యుతుకనియె: । "వినుతిమై నీమాటవింటి శ్రీకృష్ణ!
కపటిరై యూరులు ఖండింపఁ దగునె! । చపలుండు! దుర్గాత్మ! శాస్త్రంబు తెలియఁగ!"
అనిపల్కు రాముతో నచ్యుతుఁ డనియె: । "వినవయ్య బలభద్ర, వీరావతార!
తలపోయ నిద్ది యధర్మంబుగాదు. । చలపట్టి పాంచాలి సభలోన నితఁడు
భంగపెట్టిన నాఁడు ప్రతినగావించె; । వెంగలి యామాట విన్నాఁడు మొదల;
అది యెఱిఁగియుఁ దొడలటుగావఁ [1]దగదె! । అదనుగా నాదోష మదియేల తప్పు?
వరికింప భీముని ప్రతినయుఁ గాక । సరిఁ దొల్లి మైత్రేయు శాపంబుఁ గలదు.
[2]గరిమ రాజక దైవికంబులు గూడఁ । గురుపతి ధాత్రిపైఁ గూలె; నిందులకు
నేమనఁ గల? దింక నీకోప ముడిగి । సామంబుతోను బ్రసన్నుండవగుము.
మేనత్తకొడుకుల మృదువచోధనుల । ... ... ... ... ...
నారూఢ సోమకులాభి రక్షకుల । వీరి రక్షించుట విహితంబు మనకు."
అనవుడు బలభద్రుఁ డచ్యుతు కనియె: । "కనుఁగొన ధర్మార్థకామంబులందు
నన్నిట సమవర్తియై యుండకున్న । నన్నుతింతురె వాని సర్వజనంబు!
సోమించి ధర్మార్థశుద్ధిగావించి । భీముఁడు కామంబుఁ బేర్చి వర్తించె.
కుపితులై కామంబు గోరు మానవులు । అపవాదములకెల్ల నాథులుగారె! ౦

1. దగునె. 2. గరిమెరాజక. (మూ)

ప్రతినయు మానిశాపము నున్న నేమి? । కతలేల ధర్మసంకటము గాకుండ
మెలఁగంగవలెఁ గాక మేటి భీముండు । సొలవ కిప్పని కెట్లు సొచ్చె?" నావుడును
గామపాలునితోడఁ గమలాక్షుఁ డనియె: । "వేమాఱు నెటువంటివిధమున నైనఁ
బ్రబలిన తా సాధించె బకవైరి నేఁడు; । ఇతరంబునై దోషహేతువుగాదు.
చరియించునపుడు నిశ్చలత నున్నపుడు । నరవడింపుచు నేయఁ దూరు దేశములు.
రారాజు దివికిని రయమున నెగసి । దారుణంబుగ భీము తలపట్టు వ్రేయఁ
దలఁచినఁ, గురురాజు తలఁపెల్ల నెఱిఁగి । బలశాలి భీముఁ డప్రతిమసాహసుఁడు
తనరక్షణమునకై తగ నొడ్డుటకును । జననుతంబుగఁ బ్రతిజ్ఞను దీర్చుకొఱకుఁ
గౌరవేశ్వరుని జంఘలు నుగ్గుసేసెఁ । దోసంబుగా నిందు దురితంబులేదు.
మన సుభద్రాసూను మహితప్రతాపు । నినకోటిసమతేజు నేపుదీపించి
చటుల మాయావృత్తిఁ జంపించినట్టి । కుటిలాత్ముఁ డీద్రోహి కూలుఁ గాకేమి!
విడువుఁడు మోహంబు విచ్చేయుఁ"డనిన । నడలుచు బలభద్రుఁ డనియె వెండియును,
"అది యెఱింగియె కాదె! యట్లూఱకుంటి; । నిదియు నేమనరాదు; ఏనిన్ను జూచి
కాచితి; [1]మఱి తానుగాఁ బోయెఁగాక; । చూచినఁ దలఁ దెగఁ జూడనే యొరుల!
మేనత్తసుతుని నేమియు ననరాదు । గాన "నోళ్ళొప్పుంటి" గతి యనవలసె.
ధరణిపై నిట్టి యధర్మయుద్ధమునఁ । జిరకీర్తి మారుతి చెందుఁ గాకేమి!
సురలుచూడఁగ ధర్మసుస్థితి మించి । దురముగావించిన దుర్యోధనునకు
నాకల్పపర్యంతమైన భోగములు । నాకలోకంబు నున్నతిఁ గల్గు." ననుచు
వరమతి రేవతీవల్లభుం డపుడు । సరసిజాక్షుండు నజాతశత్రుండు
పాంచాలురాదిగా బంధుజనంబు । ముంచిన చింత మోములు విన్నవోవఁ *
దేరెక్కి బలభద్రదేవుండు గదలి । ద్వారకాపురికి నెంతయు వేగఁ జనియె.
తదనంతరంబున దామోదరుండు । ముదమున ధర్మజుమోముఁ జూచుటయు,
నడరి చింతాక్రాంతుఁడైన, నాజముని । కొడుకుతో నెంతయు గోవిందుఁ డనియె:
"ధర నధర్మము సహోదరపాడి దలఁచి । ధరణీశ, నీమదిఁ దల్లడింపకుము.
ఎంతేసిపనులు చేయించినాఁడితఁడు! । వింతగా నెఱుఁగరే! విశ్వంబు జనులు.
కులనాశనుండగు కురురాజునాజి । నలుక భీముఁడుచంప కటనేలమాను?
కంసుఁడాదిగఁ బాపకర్ములఁ బట్టి । హింసించి యేఁ జంపుటెఱుఁగవా మున్న?

1 మరి. * 'చూచుచుండ' అనుట అధ్యాహార్యము.

దురితాత్ముఁడగు [1] పీనితోడలు గొట్టుటయు । శిరము [2] దన్నుటయు నిషిద్ధంబుగాదు;
సురలు నీగతి రక్కసుల గెల్చినారు ; । ఖరకరుఁ డపరాద్రికడఁజేరె మనకు
విడిదల కరుగంగ వేవేగ వలయు । నడలకు." మనిచెప్పి యంబుజాక్షుండు
హరుసించి పాంచజన్యం బొత్తెనంతఁ, । దరమిడి జయజయధ్వనులు చెలంగఁ
బాండవుల్ తమతమ ప్రథితశంఖంబు । లొండొండ యొత్తిరి యుకురాజవంశ!
భేరీధణంధణ పృథులరావములు । బోరుకలంగ నార్పులు నింగిముట్ట
వందిమాగధులు కైవారంబుసేయ । నందంద సకలసైన్యావలి గొలువఁ
గురురాజు శిబిరంబుకును వచ్చిరంత । నరదముల్ దిగుచోట హరి నరుకనియె :

అగ్నిదత్తంబైన యర్జునురథంబు కాలిపోవుట

"శరములు దొనలును జాపంబు మేని । మరువు వే గైకొని మఱియీరథంబు
దిగిపొమ్ము నీ." వన్న దేవేంద్రసుతుఁడు । అగుణంబుగాఁగొన కదియొప్పదనక
త్రాణ గాండివము కత్తళ మాదిగాఁగ । దూణీరయుగళంబుతోఁ దేరుడిగ్గె.
హరి పగ్గములఁ దేరునందొప్ప ముడిచి । యరుదార దిగునంత హరికేతనంబు
భూతగణాలితోఁ బోయె నద్దివికి; । ఆతఱిఁ దే రగ్నికాహుతియయ్యె.
ధవళాశ్వములతోడఁ దన తేరు మండి । భువిని నీఱైపోవఁ బురుహూతసుతుఁడు
అరుదంది శ్రీకృష్ణునకు నిట్టులనియె: । "సరసిజనాభ, కేశవ, హృషీకేశ,
హరి, జనార్దన, సచ్చిదానందమూర్తి! । అరుదుగా రథమునీఱై కాలిపోయె;
ఇది కడునద్భుతం బిట్టి తెఱంగు । విదితంబుగాఁ జెప్పవేనాకు" ననిన
హరిహయతనయుతో నంబుజాక్షుండు । కరుణారసార్ద్రతా కలితుఁడై పలికె :
"ఘనపరాక్రమకర్ణ గాంగేయగురుల । తనర బాహ్లికసోమదత్త సౌబలుల
శరవహ్ని నీ తేరు సమయుట మున్నె । యరుదార నెఱిఁగి నేనట్లుగాకుండ
నన్నిటి నగ్నికి సాధనంబగుట । నిన్నాళ్లు గాలనీకేఁ గాచుకొంటిఁ!
జెలిమిఁ బద్నెనిమిది దివసంబులందుఁ; । గలహంబు దీఱినఁ గాలనిచ్చితిని."
అనిచెప్పి వారల కద్భుతరసము । జనియింపఁగాఁ జేసి సమవర్తిసూనుఁ
గ్రమము దీపింపంగఁ గౌఁగిటఁజేర్చి : । "సమవర్తినందన, సమకూరెఁబనులు ;

1. కొడ్డమిచెప్ప. 2. దున్నుటయు. (మూ)

ఇందిరాశూన్యమా నీవీడుగాన । నిందునిక్క నామది యియ్యకోదిపుడు.
అతిపుణ్య కల్యాణమగు నెడకేఁగి । గతినిష్ఠ సల్లాపగతులచేఁ బ్రొద్దు
నలుపుట కార్య; మిచ్చట నుండవలదు । తలఁగిర." మ్మని పాండుతనయులఁ దనదు
తమ్మునిఁ దోడ్కొని దామోదరుండు । నిమ్ముల నొకమంచి యిరవునకేఁగఁ —
దలఁచినఁ, దలఁపెల్ల దారకుఁడెఱిఁగి । తెలివితో నరదంబు దెచ్చిననెక్కి
యరయఁ బాండవులు వాహనములమీఁద । నరుదేర నెంతయు నటవారిఁ గూడి
వరమతితో నోఘవతియనుపేరఁ । బరఁగిన నదిసమీపంబున విడిసె.
అంతనక్కడ కౌరవాధీశు వార్త । నెంతయువిని శోకమెసఁగ నవ్వేళఁ
గృపుఁడును ద్రౌణియుఁ గృతవర్మఁగూడి । యపుడయేతెంచి పాయక పొడగాంచి
దారుణశోకాగ్ని దరికొనిమండ । ఘోరంబుగా మదిఁ గోపించిద్రౌణి
"యెంతచేసెను భీముఁ డిమ్మహారాజుఁ ! । జింతింపకిటు సేయఁ జేతులెట్లాడె !
చెల్లఁబో నన్నైనఁ జింతింపఁడయ్యె ! । గొల్లఁబుచ్చెద నేను గుటిలుల ఖలుల."
అని రాజుపై వ్రాలి యవనిపైఁబొరలి । కనుఁగవ సోనలై కన్నీరు దొరుఁగ :
"హా మహారాజేంద్ర ! హాకులోద్ధార ! । హా మహిమాటోప ! యబ్ధిగంభీర !
తరణిరశ్మిలు మేను దాఁకకుండఁగఁ । బరఁగిన ముక్తాతపత్రంబు లెవ్వి ?
ఉభయ పార్శ్వములందు నొప్పు దిగ్దేశ । విభులు సేవించెడి విభవంబులెవ్వి ?
సవ్యాపసవ్య విస్తార మాణిక్య । దివ్యహారంబుల తేజంబులెవ్వి ?
హెగ్గడికత్తె లనేకమార్గముల । నుగ్గడించుచుఁజేయు హుంకృతులెవ్వి ?
ఎక్కడ నుడివోయె ? నెవ్వరుమాకు । దిక్కు కౌరవరాజ ! దినకరతేజ !"
అని వగుచుచున్న యాచార్యసుతునిఁ । గనువిచ్చిచూచి యా కౌరవేశ్వరుఁడు :
"అన్న యశ్వత్థామ, యడలెదవేల ? । ఎన్నంగ దైవికం బిదియేలతప్పు !
మీరేమిసేతురు ? మీరుప్రాణములు । పోరిలో దాఁచక పోరితిరట్లు.
నాభాగ్యహీనత నన్నిట్లుచేసె ; । .. ... ... ... ...
తొడలు గొట్టినయట్టి దోషమే గాదు । తడయక భీముండు తలయునుదన్నె.
అది నామనంబున నాఱని చిచ్చు ; । విదితమై ప్రాణముల్ విడువవుమేన.
సుతగతిఁ బాండుతనూజుల తలలు । తతభంగి ఖండించి తగవుతో మీరు
వచ్చినఁ బగదీఱు ; వరుసఁ బ్రాణములు । చెచ్చెఱవిడిచెద సిద్ధమీపలుకు."

అనవు డశ్వత్థామ యంగీకరించి । గొనకొని యా రథికులతోడఁ జనియె.
అని సంజయుఁడుచెప్పె నాంబికేయునకు । ననిముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగియమ్మీఁద । నెప్పాటఁ గథ చెల్లెనెఱిఁగింపు." మనిన
వైకుంఠనాయక, వాసుదేవాఖ్య, । నాకాధిపతివంద్య, నలినపత్త్రాక్ష,
పద్మాలయానాథ, పాపసంహార, । పద్మినీవల్లభ, భర్గసంస్తుత్య,
ఘనమాని హృద్గేహకలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమై శల్యపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొప్పెమూఁడవది.

# ప్రథమాశ్వాసము



శ్రీవనితాధీశ, చిన్మయావేశ, । భావనాతీత, ప్రభావ విజ్ఞాత,
ఘనతర భవనాశ, కరుణానివేశ, । విను నవధాను శ్రీ వేంకటాధీశ !
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె :
నరవిమై నారీతి సంజయుచేత । గురుసుతోత్సాహంబు గొనకొని వినిన
ధృతరాష్ట్రుఁడిట్లను : "ధీరవివేక ! । క్షితిలోన నతిరథ శ్రేష్ఠుండనంగఁ
జాలు నశ్వత్థామ సహాయాయురథికు । లాలోనఁ జేసినయది చెప్పు." మనిన
నాసూతసంభవుఁ డాంబికేయునకు । భాసుర [1]మహిత వాక్ప్రౌఢి నిట్లనియె :
"వినవయ్య ధృతరాష్ట్ర, విబుధేంద్రవిభవ, । ఘనశిబిసమదాన, గాంభీర్యధుర్య !
దుర్యోధనుం డట్లు దుఃఖితుఁడగుచు । శౌర్యంబుగల గురుసంభవు నంత
నభిషేక మొనరించి యత్యంతమహిమ । విభవంబు మెఱయంగ వేవేగ ననుపఁ
గృపుఁడును మఱియు నాకృతవర్మ తనకు । నపుడు సహాయులై యరుదేరఁ గదలి
గట్టిగా శౌర్యంబుగలిమి దక్షిణ ము । ముట్టిన పడమట మునుకొనియున్న
స్థిరతర పాండవ శిబిరంబునకును । అరయంగ నభిముఖుఁడై పోయి పోయి,
యలవడ నవ్వీటికనతి దూరమున । నిలిచి యాలించియు నిపుణతమీఱ
యందలివారు జయంబునఁ బొంగి । యందంద నవ్వంగ నార్వంగ దిశలు
పిక్కటిల్లఁగ విని బెదరి యెంతయును । వెక్కసంబుగఁ దమ్ము వెనుకంగ వెడలు
మూఁకగాఁ దలఁచుచుఁ, బోవుటచూచి । యా కృప కృతవర్మలరుదేర ద్రౌణి
తలఁగి కర్జంబులు తగఁ జూచుకొనుచుఁ । గొలఁదిగాఁ దూర్పుదిక్కునకయి యరిగె."
అనినఁ జింతించుచు నాంబికేయుండు : । "అనఘాత్మ, సంజయ ! యనిలజుచేత
బలశౌర్య ధైర్య సంపదఁ గురురాజు । కలన నజయ్యుండుగా నమ్మియుంటి.
తనయులు నూర్వురు ధరణిపైఁ బడుట । వినియును నుండినవాఁడ ; వెస నాడుగుండె
పలుఱాయి గాఁబోలు! పాండునందనుల । బలమఱి యాశ్రయింపఁగఁ జాల ; నేచటి

శ్రీ వేంకటేశ్వర ఓరియంటలు లైబ్రరీవారి ప్రతినుండి గ్రహించిన పాఠాంతరములు. చ. గుర్తు తోను, తంజావూరు లైబ్రరీ పాఠములు. క. గుర్తుతోను సూచింపఁబడినవి.

1. మహిమ. (చ)

కేని పోవుదుఁగాక యిటనుండఁ దగునె ! । పూనికతో వాయుపుత్త్రువాక్యములు
వినఁగ నోపను [1] దైన్యవృత్తికి నోప । ననఘాత్మ, తగుదు నే ?” యని పల్కి మఱియు
“ సూతతనూభవ, సుకృతస్వరూప, । చాతుర్యవాక్య, విచారణ విదిత !
కృతవర్మ గురుసుత కృప లివ్విధమునఁ । బ్రతిపక్షు వితతిపైఁ బడఁగ నూహించి
యేమికార్యము సేసి రెజ్జఁగింపు ” మనిన । [2] నామహాత్ముఁ డప్పుడనియె భూపతికి :
“ వినవయ్య ధృతరాష్ట్ర, విభవదేవేంద్ర, । యనుకొని రథికులు మువ్వురుఁ గడఁగి
తిర మొప్పఁగాఁ దూర్పుదెసకునై పోయి । పసనడి నడవిలోపల నొక్కమడుఁగు
సరసిజ కల్హార సరస మృణాళ । పరిచిత [3] నీరజపత్త్రశోభితము
కలహంస సారసక్రౌంచబలాక । కలిత భృంగాంచిత కలకలరవము
గలుగంగఁ గనుఁగొని కడుఁజోద్యమంది । కలయంగ దాహమగ్గలమైన యంత
సరదంబు డిగి యప్పు డంబుపానంబు । పరగునఁ జేసి యచ్చట వసియింపఁ
బ్రొద్దును గ్రుంకె; నప్పుడు [4] సాంధ్యవిధులు । తద్దయు నొనరించి తత్తీరభూమి
నాకు జొంపంబుల నంధకారంబు । చేకొని కొమ్మలఁ జెలువొందునట్టి
యొక వటభూజంబు నొప్పారఁ జూచి । ప్రకటితస్ఫూర్తి నారథికులు చలము
మిసిమి మీఱఁగఁ దత్సమీపంబునందు । వసియించి, రటవారి వదనముల్ పోలె
వారిజాళి మొగిడె ; వారలదైన । భూరిశోకముతోడఁ బొదలెఁ జీఁకట్లు ;
శాకినీ భూత పిశాచసంఘములు । భీకరంబుగ మించెఁ బృథివీతలేశ !
కలహంబు ద్రోణికిఁ గలుగు నిక్కముగ । వలనొప్ప ననిచూడ వచ్చినచూడ్కి
గగనస్థలమున నక్షత్రముల్ వొడిచె. । నగనొంది యాయోధవరు లంతలోనఁ
గొలఁదిగాఁ గౌరవకుల మకారణము । పొలియుటఁ దలఁచుచుఁ బొక్కుచు నంత
నా కృపాచార్యుండు యాదవోత్తముఁడు । చేకొని సుఖనిద్ర చెందియుండంగ
[5] గురు తనూజాతుండు గురుతరశోక । మరయ నగ్గలముగా నంతరంగమున
దావాగ్నిగతి మీఱఁ దలకొని సిమర । [6] వోవక యామఱ్ఱిఁ బొందుగాఁ జూడ

## ఉలూకము కాకములఁ జంపుట యశ్వత్థామ గాంచుట

దానికొమ్మలయందుఁ దగిలి కాకములు । మూనుగా నిద్రింప, మసలక యంత
మిణుగుర్లు గ్రమ్మెడి మిడిగ్రుడ్లతోడ । గణుతింప భీషణాకారంబుతోడ

1. ధైర్యవృత్తికి నోర్వ. (చ) 2. ఆమహామహుఁడు. (చ) 3. నిజతేజ. (క) 4. సంధ్య. (చ)
5. కొలఁదిగా గొతుండు (క) 6. వోవనామఱ్ఱి యుంపొందఁగాఁ జూచి (క)

జగతిపై నెగసిన శైలమో యనఁగఁ | బొగడొంద నామిషంబుల తావు లరసి
కొనుచు నున్నత[1]మయి ఘోరనాదంబు | ఘనముగా నొకయులూకము వచ్చి యపుడు
వటభూజమున నున్న వాయసంబులను | దటుకునఁ గనుఁగొని తగ నంటఁ జొచ్చి,
కొన్నింటి శిరములు కొన్నింటికాళ్ళు | కొన్నింటి పక్షముల్ గొనకొని చెండి,
కొన్నింటి నుఱుమాడి, కొన్నింటిఁ [2]ద్రుంచి | యన్నిటి నీరీతి నటు వధియించె
కౌశిక శత్రుల ఘనముగాఁ బొదిపి | భాసించినట్టి కేశ[3]వుఁడును బోలె.
ఈగతి నిద్రచే నెసఁగు కాకులను | వేగంబె యుడిచిన వీక్షించి ద్రోణి
యవ్విధం బొనరింతునని యుత్సహించి : | "యివ్విహంగము నాకు నిచ్చె ననుజ్ఞ;
నిద్రపోవఁగ శత్రునివహంబుఁ బట్టి | రుద్రుని మాడ్కిని రూపడంచెదను.
ఇది లెస్సయగు; మున్ను యిత్తెఱంగెల్ల | గడసి మనోవీథిఁ గానలేనైతి.
పాండుతనూజుల బంధుయుక్తముగఁ | జెండివైచెద నమ్మ క్షితినాథ! యనుచు
వచ్చితిఁ బోరిలో వారితో నెదిరి | తచ్చనఁ బోరుట తర్కించిచూడ
జడత వైశ్వానర జ్వాలలోఁ బడిన | మిడుత చందముగాదె మేదినిలోన.
పరఁగంగ నేఁ [4]డిట్టి పాండునందనులఁ | బరిమార్చకున్న భూపాలశేఖరుఁడు
గతజీవుఁడైన నా ఘనశౌర్యమహిమ | నితరుల కెవ్వరి కింత నెక్కొంతు ?
వసుధలో వారి గెల్వంగరాదనుచుఁ | బసఁగిప్పియుండంగఁ బక్షిచేష్టితము
కొనరక లోచన గోచరంబయ్యె. | అసమునఁ బ్రతుల నణఁగించుచొప్పు
వదలక కలదేని వరభుజాబలము | కదనరంగంబున ఖండింపవలయు.
అను [5]నీతివాక్యంబు లంగీకరించి | చెనసి విపక్షులఁ జెండివైచెదను.
అదిగాక పాండవు లాజిలోపలను | మదమునఁ గురుపితామహులతోఁ గడఁగి
తలకొని ధర్మయుద్ధము చేసినారె! | జలజాప్తసూనుని జగతివల్లభుని
బలువిడిఁ జంపిన భంగులు దలఁప | నిలలోనఁ గూడునే! యిట్టిపాతకుల
నడరి నిద్రాసమయంబునఁ బట్టి | [6]యడలంగఁ జంపుట యదియు ధర్మంబు."
అని నిశ్చయముచేసి యాద్రోణసూతి | కినుకతోఁ దమమామఁ గృతవర్మ మేలు
కొలిపి వారలతోడ గొనకొన్న వేడ్కఁ | బలికె : "నక్కట! రణపాడి దప్పితిమి!
రారాజు నొక్కని రణమునఁ బొందు | వీరులు పెక్కండ్రు వెసఁ జుట్టుముట్టి

---

1. మైన. (చ) 2. జెఁడి. (క) 3. పులిఁ బోలుచును. (చ) 4. డట్టి. (క) 5. శిబి. (క)
6. యడరంగ. (చ)

కడఁగి యధర్మవిక్రమము మముఁ బట్టి । తొడలు గొట్టించిరి తుది భీముచేత.
వరమతి నంతఁ బోవక సుయోధనుని । శిరము ద్ర[1]ప్పిడిఁదన్నెఁ జెలఁగి భీముండు.
గరిమ నెవ్వరికైన నకర్మఫలంబు । పరికింప ననుభవింపక పోవశమె!
ఇమ్మహావ్యసనంబు కేదికర్తవ్య । మిమ్ము నాకానతి యినసమతేజ!"
అనినఁ గృపాచార్యుఁ డా గురుసుతునిఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప:

## కృపాచార్యుఁ డశ్వత్థామకు నీతివిశేషంబు లెఱిఁగించుట

"[2] ప్రారంభములకెల్ల పౌరుష దైవ । సాహాయ్యములు గూర్చి సాధనంబు [3]లగు.
లోలత వినువాసిలోన నెంతయును । జాలంగ ఘనవృద్ధి జరగదొక్కటను,
వాన [4] కాలంబున వలనొప్పఁ గురియఁ । గా నేర్చునే కొల్చు కలిత విస్ఫూర్తి (?)
పొలుపొంద దున్నినపొలములో వాన । తలకొని లేకున్న ధాన్యంబులగునె!
పరికింప నదిగానఁ బౌరుషంబునకుఁ । గరుణతోడుత దైవగతి గల్గవలయు.
తుదిఁ దగుపనికి నుద్యోగంబుచేసి । యదనుగాఁ దద్జ్ఞుల యనుమతి [5] వడసి
తరమిడి ధర్మంబు దప్పక నీతి । వెరవున నడచిన వృద్ధిఁ బొందు.
ధర నీతి విడిచి క్రోధంబు నాగ్రహమును । వరఁగ లోభంబును భయమును గూడి
నట్టి చిత్తముతోడ నడరు దుర్జనుఁడు । గట్టిగా సిరిబాసి గడుదుఃఖ మొందు.
అదిగాక విను కౌరవాధీశ్వరుండు । విదితప్రతాప వివేకదూరుండు,
క్రోధలోభములకుఁ గుదురైనవాఁడు । బాధ నొందకయున్నె పలుకులేటికిని!
మనకుఁ గర్తవ్యంబు మనుజేశుతండ్రిఁ । గని, యాతఁడంపిన కార్యంబు సేయ
ఘనకీర్తిగలుగు; [6] నగ్గాంధారి యెట్టి । పనిఎంచె వినుచుఁ జేపని నిశ్చయించె
నదియ చేసిన మనకట నిందరాదు; । మదిలోనఁ గనుఁగొను, మాత్సర్యమేల ?
చెలిమివోనాడఁ జూచిన యత్తెఱంగు । వెలయు ధర్మం" బన్న వినియు నాద్రోణి
తా నెఱిచెడి శోకదందహ్యమాన । మానసుండగుచుఁ గ్రమ్మఱ నిట్టులనియె:

## అశ్వత్థామ తనపూన్కి స్థిరీకరించుట

"వలుతెఱంగుల విను పరబుద్ధికంటెఁ । బొలుపొందఁగా నాత్మబుద్ధియె మేలు.
ఆపదవచ్చినయపుడు సద్బుద్ధి । యూహింప నతఁడు విశ్రుతసిరిఁ బొందు (?)

---

1. పడి. 2. ప్రారంభములకెల్లఁ బౌరుషంబొదవ. 3. లను. (క) 4. పొలంబు)న్పచ. 5. వలయు.
6. నగ్గాంధారుఁడెట్టి. (క)

మగఁటిమి వాటించి మరణాదులందుఁ । దెగువ గల్గినవాఁడు దృఢబుద్ధియుతుఁడు.
కలకలె మీరెఱుంగని బుద్ధిలేదు; । మఱియును వినరయ్య మనకందఱకిని
సరవిగా శోకనాశనమగుదాని । విరివిగా మీకును విన్నవించెదను.
సరసిజ గర్భుండు జనులసృజించి । తరమిడి భూసురతతికి ధర్మమును
శూరత గలుగురాజులకుఁ దేజమును । గూరిమి వైశ్యులకును దక్షతయును
నరయ శూద్రులకు వర్ణానుకూలతయు । వలయు గుణములుగా వరుస విధించె.
కరమొప్ప శాంతుండుగాని విప్రుండు, । గరిమఁ దేజస్వియుఁగాని భూవిభుఁడు,
ఘనతర దక్షుండుగాని వైశ్యుండు । గొనకొని వర్ణానుకూలత లేని
శూద్రుండు నెప్పు డీ క్షోణిలోపలను । భద్రాత్మ, నిందింపఁబడును నిక్కంబు.
చనవొప్ప విప్రవంశమున నే నఖిల । జనపూజితేఁబుగా జనియించి తుదిని
ధరణి రాజోచిత ధర్మంబు చేసి । వరబుద్ధి నానిష్ఠ వదలి యీమీఁద
నెఱి విప్రకర్మంబు నిర్వహించెద నె! । అఱిముఱి వినవయ్య యదియునుగాక
దివ్యాస్త్రకోల్లు సుస్థిర శరాసనము । నన్యయంబుగఁ బూని యాజిలోనున్న
జనకుని వధియించి సాహసవృత్తి । ఘనముగా నున్నట్టి ఖలుఁజూచి యెట్లు
తలయెత్తి మెలఁగెదు? దారుణస్ఫూర్తిఁ । బొలియింతుఁ బగతుర భువనాద్భుతముగ.
ఒకవెరవెఱిఁగితి నొకఁడుప [1]లేక । సకలశాత్రవులును సమసిరాలమున.
[2]చలన మేమియులేక సరవి నిద్రింప । వలయును మనకని వారణాశ్వముల
రథములఁ [3]బఱపి నిద్రాసక్తులగుచు । నధికతనిద్రింతు రతివైభవమున.
ఇది వేళచంపంగ నెసఁగి శాత్రవుల; । మొదల ధృష్టద్యుమ్ను ముట్టి తద్గర్వ
మదనుగా నడఁచెద నతుల యుగాంత । మదనారిచందంబు మహిమదోఁపంగ.
పాండవులను నుపపాండవేయులను । జెండాడివైచి నిశ్చింతుండ నగుదు."
అనినఁ గృపాచార్యుఁ డతనివాక్యములు । విని ప్రీతి నిట్లను: "వినవయ్య ద్రౌణి!
దైవయోగంబునఁ దగినయుద్యోగ । మీపల నీయందు నేవు దీపించె.
మాకు నీపూన్కి సమ్మతి [4] మీవునేము । ప్రాకటంబుగఁ బోయి భంజింత మరుల.
క్రన్నన నీవు సంగరమున డస్సి । యున్నవాఁడవు; నిద్రయును లేదు వినుము.
వేవేగ నిద్రించి వేగినయంత । నావిరిఁ బోదము వైరుల గెలువ.
దివ్య మార్గణవేది తెలియహార్దిక్యుఁ; । డవ్యయుండని నన్ను నట నెఱుంగుదువు.

1. లేని. 2. చలమేమియును లేక. 3. మఱచి. (చ) 4. మగునేము.

అటుగాన ముగురు మూఁడగ్నులుపోలెఁ । దటుకునఁ బాండునందనులఁ జంపుదము.
నీతి విచారించు; నెఱయ నీరాత్రి । నీ తెంపుతో నీవు నేర్పుతో నేము
నిద్రవోద." మటన్న నెమ్మినిట్లనియె: । "భద్రాత్ములార, నా పలుకెల్ల వినుఁడు.
అలుకవచ్చినవాని కర్థచింతునకు । [1]నలిఁగామగోచరునకు నాతురునకు
నిదురవచ్చునె! [2] యిట్లు నీకు నన్నేఁప । నదనేది కృపలేక యక్కటా తగునె!
బాణాసనాచార్యుఁ బ్రథనరంగమునఁ । బాణంబులకు బాపఁ బరఁగఁ జూచితిని.
రాజిల్ల మనల సంరక్షించినట్టి । రాజుభంగంబు నుర్వరఁ గనుఁగొంటి.
నీవును జూడవే నృపతి దుఃఖంబు? । కావరంబున నెట్టి కఠినాత్ముకైన
నాతనిదెస చూచి యతుల శోకంబు । ఏ తెఱంగునరాదు? ఈ శోకవహ్నిఁ
బడి కాల నేఁ జాల భవ్యాత్ములార! । వడిఁ బాండవులఁ బోయి వధియించువాఁడ.
అతఁడు నాచెలికాఁడు హర్షంబులేక । క్షితిమీఁద శత్రులచే భంగమొంది
యున్నాఁడు గనుఁగొంటె; నొగిఁ బాండుసుతుల । సన్నుతవిభవంబు చక్కఁ జూచితిని.
వలనొప్ప విమతుల వధియించి కాక । మొలమిఁ గంటికి నిద్ర యేరీతి వచ్చు?
దొరకొని మీరు [3] నిద్దురవేరు చెప్పి । మరలుట తగునయ్య మామరో!" యనినఁ
గలశ తనూజాతు గారాబుఁ బట్టి । నలరంగఁ గనుఁగొని యర్థి [4] నిట్లనియె:
"అలుక మనంబున నధికమానసుఁడు । ఎలమి తోడుత నేమినెఱుఁగఁడుధాత్రి
ఒరులు చెప్పిన వినఁ డుచితజ్ఞలేక । పరమమిత్ర భ్రాత బాంధవబుద్ధి;
వినువానిఁ జేరును విభవసంపదలు । ఘనుఁడ, నా మాట తార్కాణగా వినుము.
వఱలి నిద్రించిన వాని నాయుధము । మఱచిన వానిని మనలక పూరిఁ
గఱచినవానినిఁ గడువడితోడఁ । బఱచినవాని దుర్బలుఁడైనవాని
శరణుచొచ్చినవానిఁ జంపినవాఁడు । సరవితో భాస్కర చంద్ర తారకము
లెంతకాలంబుండు నిలమీఁద వాఁడు । నంతకాలంబుండు నట నారకమున.
కావునఁ బాండవుల్ ఘన నిద్రచెంది । వావిరి నున్నారు వలవ దీవేళ.
నిదురయుఁ జావును నెఱి నొక్క [5] టరయ; । అదిగానఁ [6] బీనుఁగులైపడియున్న
వారిని వడిఁ బట్టి వధియించి మీఁద । నారకంబునఁ బడ నాయమా యకట!
కూరిమి దివ్యాస్త్రకోవిదులైన । వారిలో మిక్కిలి వన్నెదీపించి

1. తెలియ లజ్జించిన విద్యాతురునకు.(క) 2. యెట్లు నీకు నన్నేపము – కదనేది కృపలేక కటకటా(క)
3. మీదొర. 4. కర్త కృపాచార్యుఁడు అధ్యాహార్యము. 5. సమము. 6. పీనుఁగులైయున్నవారు. (క)

యింతకుముందట నేకిల్బిషంబు । చెంతలఁ జేరని చిరపుణ్యనిధికిఁ
గలిత దుష్కర్మంబు కర్తవ్యమగునె! । మలిన మేఘములేని [1] సుధాంశుఁ జీరకును
మసి దాఁకినట్లగు మార్తాండ తేజ! । హాసింపుచుందురు దిక్కులన్న యవనిలో జనులు.
కావున వేగిన ఘనపరాక్రమము । గావింపు." మనిన నక్కృతిరాత్ముఁ డనియె:
"నీ చెప్పినదియెల్ల నిజము, శాసింప । నో చతురాత్మక, యుక్తమి కాదేయు;
అదియెట్టులనిన, ఘోరాజిరంగమునఁ । బొదలు మజ్జనకుని భువనసన్నుతుని
శంకవోవిడిచి ధృష్టద్యుమ్నుఁ డడరి । కొంకక తలఁ బట్టుకొని వధియించె.
శూరతగల నదీసుతుని శిఖండి । పేర బీభత్సుండు పృథివిపైఁ గూల్చె.
అరదంబు గ్రుంగిన నతఁడెత్తుచుండఁ । దరణిసూనునిఁ జంపె ధర్మంబు దప్పి.
నరుఁడు హస్తము గ్రుంప నలినంతలోన । సరగఁ బ్రాయోపవేశవృత్తినున్న
భూరిశ్రవుని బట్టి పొలియించి మించె । శౌరిసోదరుఁడైన సాత్యకి యలిగి.
పలువురు కౌరవపతిఁ జుట్టుముట్టి । తలకొని వాయునందనుఁ బురికొల్ప
నూరుభగ్నము సేసియును దలదన్నె । ధారుణి నివియెల్ల ధర్మమార్గములె!
కావున వారలఁ గదనరంగమున । వేవేగ ఖండింతు విదితశౌర్యమున.
అడరి యిందులఁ బాపమైనఁ గానిమ్ము । తడయక యదిగాక తలఁగదీ నెగులు.
వసుధలో నన్ను నెవ్వరికి వారింప । వశమె! చెండాడెద వైరిసంఘముల."
అనుచు దిగ్గనలేచి యరద మెక్కినను । గనుఁగొని కృతవర్మ కనఁకనట్లనియె:
"మన మేకనిశ్చయ మతిని మువ్వురముఁ । జనుదెంచినారము జగతీశు పనికి.
ఈ చాయ మము డించి యొక్కటి కార్య । మాచరింపఁగ నీకు నక్కటా! తగునె!"
అనవుడు కృతవర్మ కాతఁ డిట్లనియె: । "అనఘాత్మ, కృతనిశ్చయాత్ముండనైతి;
చని ద్రుపదాత్మజుఁ జంపుదుఁ; బొందు । జననాథ తనయులఁ జక్కాడినైతు.
చెలరేఁగి మీరు వచ్చిన "రెండు మేలు" । అలవడ రాకున్న నట "మూఁడు మేలు."
అని పోవఁ బోనంగ నాకృపాచార్యుఁ । డును [2]యాదవుండు గడుఁగ రథసమున
నతనితోడనె గూడ నరదంబు లెక్కి । యతులిత గతిఁ జని." రని చెప్పుటయును
విని ధృతరాష్ట్రుండు వేడుకఁ బొంది । "అనఘాత్మ, సంజయ, యాయోధవరులు
కరమొప్పఁగా ద్రోణిఁ గలయుట మేలు. । దుర మేతెఱంగునఁ దొడరి కావించి?
రది యెఱింగింపు పాయక నాకు." ననిన, । నదనుగా సంజయుఁ డనియె భూపతికి:

---

1. మను కుంజరునకు (క) 2. యాద్రోణజుఁ డుఁ గడురథసమున. (క)

## శివుఁడు భూతాకృతియై యశ్వత్థామకుఁ బొడసూపుట

“జననాథ, విను ద్రోణి సరభసవృత్తిఁ । జన నుత్సహింపఁ దత్సమయంబునందుఁ
బులితోలు కటిఁ గట్టి భూతి మైఁ బూసి । యెలసి భోగీంద్ర యజ్ఞోపవీతములు
ధరియించి, సునిశిత దంష్ట్రముల్ మెఱయఁ, । గర మొప్పఁగా వేయికన్నులు దోఁప,
నూక్పుల వృక్షంబు లుయ్యాల లూఁగ, । దర్పించి సింహనాదంబు సేయుచును,
బొసఁగఁ జుక్కలు మొలపూసలు గాఁగ, । నస్వదృశబ్రహ్మాండ మటు తానయగుచు,
భూత మొక్కటి భయస్ఫురణ దీపింప । నాతఱి నిలిచిన, నద్భుతం బెసఁగ
ముఖమునఁ గన్నుల ముకుగ్రోళ్ళ నగ్ని । శిఖలు వెల్వడియె; హృత్కుక్షి కేశ లతుల
చక్రగదా ఖడ్గశార్ఙ్గముల్ పూని । విక్రమం బెసఁగంగ వికృత హుంకృతుల
లక్షలు కోట్లు పోలంగ నర్బుదము । లక్షయసంఖ్యల నన్నిటిఁ గడచి
యొక్కడచూచిన నిలయీనినట్లు । వెక్కసంబై నిండి వెడలినఁ, జూచి
భయమేమి లేక కుంభజ తనూభవుఁడు । రయమున వింటశరంబు సంధించి
పరువడి నేయంగ, బడబానలంబు । శరధి జలము గ్రోలు చాడ్పునఁ గ్రోలె.
గ్రోలినఁ గన్గొని కోపించి ద్రోణి । యాలోన శక్తిఁ బాయక నిగిడింప
నదివచ్చి భూతంబు నదరంటఁ దాఁకి । యదనుగా పిలయకాలార్క మండలము
నొదవంగఁ దాఁకు మహోల్కయుఁ బోలెఁ । దుది మొద లెఱుఁగక తునియలైయణఁగె.
అడఁగినఁ గోపించి యతఁడు [1]ఖడ్గంబు । నుడివడ నేసెఁ జూర్ణమై పోయె.
చయ్యనఁ దోమర సమితి చక్రంబు । నయ్యెడ గదయుఁ బ్రాసాసిజాలమును
వైచిన, నదియును వదలక మ్రింగఁ । జూచి నిర్విణ్ణుఁడై శోకంబు నిగుడఁ
“పేర్మితోఁ గృపుఁడు చెప్పినయట్టి విహిత । ధర్మోపదేశ మెంతయు విననైతి.
గోవు బ్రాహ్మణు బాలకుల వృద్ధు నంధు । భావింప సహజన్ము బాంధవు మిత్రు
నస్త్రవిహీనుని నార్యుని [2]గురుని । శాస్త్రోక్తవిధిఁ జూడఁ జంపంగరాదు.
మహిలోన నీధర్మమార్గంబు విడిచి । [3]బహు దుర్మతిని దైత్య భావంబుతోడ
వర్తింపఁ గార్యంబు వరసిద్ధి యగునె! । కీర్తియుఁ జెడు మహాకిల్బిషంబొదవు.”
అని పెక్కుభంగుల నాత్మలో వగచి । పనివడి తనమది పదిలంబుచేసి
దేవాది దేవునిఁ ద్రిభువనాధీశు । భావజసంహారు భవరోగదూరు

---

1 ఖండంబు (క)   2. నిఖిల.   3. బహుళ దుర్మతియైన. (క)

శివుని మహాదేవుఁ జిన్మయాకారు । భవుఁ జంద్రశేఖరు భక్తమందారు
సగుణ నిర్గుణరూపు సత్యప్రతాపు । నిగమగోచరు నీకు [1]నిత్యు నిశ్చింతు
గిరికన్యకానాథు గిరిచాపహస్తు । గిరివైరివందితుఁ గృతమతిఁ గొలిచి
గెలుపుమై నీ భూతకృత దురితంబు । తొలఁగింతు ననుచు బంధురభక్తియుక్తి
బలికె: "నిత్యాపద పాసినంతటనె । పొలుపుమీఱఁగ నిఖిల భూతోపహార
నవ్యార్చనల నీకు నాగకంకణుని । భవ్యుఁ బ్రీతునిఁ గాఁగ భక్తిఁ జేయుదును."
అని పల్కునంతలో నతని ముందటను । గనకపువేది చక్కఁగఁ దోఁచె; నందు
వీతిహోత్రుండును వెలిఁగె ; నంతటను । బ్రీతుఁడై ద్రౌణియుఁ బెంపగ్గలించె.
అప్పుడు ప్రజ్వలితాక్షులు మఱియుఁ । దప్పక యేకపాదస్థులు తురగ
కరి సూకరాస్యులుగ్రశరీరధరులు । పరఁగంగ వికృతరూపము గలవారు
కృశమూర్తులును బహు [2]కృతరూపధరులు । శశికళాధరులు నిశ్చలజటాధరులు
కనక భుజంగాస్థి కలిత భూషణము । లనఘులై ధరియించినట్టివారలును
బరశు ముద్గర కుంత పట్టిసప్రాస । ధరులు, మృదంగ వాద్యధ్వనుల్ మెఱయ
గుములు వాఱుచుఁ గూడి పాడుచును । బ్రమదంబు తోడుతఁ బలుబొబ్బ లిడుచు
హరిగర్జితములు శంఖారావములును । గరిబృంహితంబులు గల మెలుంగులను
మలయుచు, మఱియు బ్రహ్మద్వేషులగుచు । ఖలులైన వారిరక్తముల మాంసములఁ
బరిపూర్ణమైనట్టి బహు [3]కపాలములు । కరతలంబులఁ గొని కడఁకతో [4]నగుచు,
ధైర్యాఢ్యులై, శమదమ తపోబ్రహ్మ । చర్యాదులగు విశిష్టరీపుఁ గర్మములకు
భవుఁడు విస్మయమందు భవ్యులవ్వేళఁ । దివిరి యశ్వత్థామ తెంపెఱుంగుటకు
నిలిచినఁ, గనుఁగొని నిశ్చలత్వమును । బలమును మెఱయంగ భయమేమి లేక
చిఱునవ్వునవ్వుచుఁ జెలువంబుతోడ । [6]నరిగి ధైర్యవిహారుఁడై నిల్చి తేరు
[7]డిగ్గి చాపంబు ముష్టినమర్చి యప్పు । డగ్గలికంబున నగ్ని దేవునకు
ఘనదేహ మాహుతిగా నొనరింతు । ననిచూచి కాష్ఠంబు లందకయున్న
నరదంబుమీఁది శస్త్రాస్త్రసంఘములు । నరసుతంబుగ నింధనములుగాఁ బేర్చి

### శివుఁడు ప్రత్యక్షమై యశ్వత్థామకు ఖడ్గమొసఁగుట

పరమేశ్వరునిఁ గూర్చి " భవ, మహాదేవ, । హర ! నీకు నాత్మోపహార మిచ్చెదను.
ఖలులఁ జెండాడంగఁ గలిగిన శక్తి । వలనుగా నీవె యీశ్వర ! నాకు." ననుచు

---

1. నిత్య నిశ్చిత్యు. (క) 2. గూపధరులు. 3. కలాపములు. (క) 4. తినుచు (చ) 5. వ్యాప్తము లకు. (క) 6. అరలేని ధైర్యవిహారుఁడై (చ) 7. డిగ్గిపాపంబు...ష్టినమర్చియప్పు-డ. (క)

నుఱికిన, నంత నయ్యుగ్రుఁడాతనికి । నఱిముఱిఁ బ్రత్యక్షమై మహామహిమ
వఱలు తేజంబున వారిలోనున్న । తెఱఁగు దీపించు నా ధీరునిఁజూచి
కఱకంఠుఁ డెంతయుఁ గరుణార్ద్రై వాఱ । ... ... ... ... ...
'ననఘాత్మ, మెచ్చితి నడుగు మేమైన' । ననవుడశ్వత్థామ యధిక సంతోష
జనితాంగుఁడై వేది చయ్యన వెడలి । మనసిజ హరునకు మహిఁజాఁగి మ్రొక్కి
ముకుళిత హస్తుఁడై ముందట నిలిచి । "యకలంక, విశ్వేశ, యాద్యంతరహిత,
తేనమో నిటలాక్ష, తేనమోరుద్ర, । తేనమోవృషవాహ, తేనమోశర్వ,
తేనమో యీశాన, తేనమో[1]భర్గ, । తేనమో భూతేశ, తేనమో" యనుచు
వినుతింప నంత నవ్విశ్వేశ్వరుండు । ఘనమైన కృప [2]మీఱఁగా ద్రోణిఁజూచి,
"వినవయ్య గురుపుత్ర, విదితచారిత్ర, । యనుపమ పరమ రహస్యంబు నీవు
భవ్యంబులైన తపస్సత్యశౌచ । నవ్యార్చనముల నున్నత చిత్తవృత్తి
హరి నన్ను బూజించు; నాతని కేను । వరదుండ మిగుల; నవశ్యంబు [3]గాను
మలసి యాతనికి సన్మానంబుసేయు । తలఁపున నీభూతతతితోడఁ గూడి
వచ్చితి ; వచ్చి [4]నీ వర చిత్తవృత్తి । యచ్చుగాఁ దెలియుటకై మాయలెల్లఁ
గృతమతిఁ జేయుచుఁ గేలి సల్పితిని. । [5]ధృతిచెడకీవు సుస్థిరనిష్ఠ నిలువ
ధనువు శాసించితిఁ దదనంతరంబ. । గొనకొని నీధైర్యగుణమున కేను
మెచ్చితి నిచ్చెద మేలైనవరము; । నచ్చుగా వినుమొక్కటనఘాత్మ ! నీవు.
రౌద్రవిస్ఫూర్తి నీరాత్రెల్ల నీకు । భద్రంబులౌను ఏపని తలంచినను.
వారని కడఁక నీవసుధ నీశత్రు । వీరసంహారంబు వేడ్కతోఁ జేయు."
మని శక్తియొసఁగిన నంత వేగమున । మునుపు భూతంబుచే మొగి మ్రింగఁబడిన
యాయుధంబులు వేదియుం దిడినట్టి । యాయస్త్ర శస్త్రంబు లరదంబుమీఁద
రమణఁ బూర్వప్రకారంబున నుండె. । ప్రమదంబుతో నంతఁ బ్రమథగణంబు
[6]వెలి నదృష్టాకార విభవ విస్ఫూర్తిఁ । గొలుచుచు వెంటరాఁ, గుంభిని వణఁక
రథమెక్కి యిద్దఱు రథికులు దన్ను । బ్రథితంబుగాఁగొల్వఁ, బాండవశిబిర
మతిశీఘ్రగతిఁ జొచ్చి యాకృపాచార్యుఁ । గృతవర్మఁ గనుఁగొని "కృతకృత్యులార !

---

1. గిరిశ—(చ) 2. జూడఁగా (చ) 3. వినుము. (చ) 4. నవ్వర. (క) 5. అతులితవిస్ఫూర్తి నదియును గాక పాంచాలురకు జేరువయ్యెఁ గాలంబు, మించి నాకృపచేత మెఱయుమునీవు అనిపల్కి ఖడ్గంబు నవ్విప్రవరున కనయంబుతోనిచ్చి, యంతలో నతని తనువు ప్రవేశించె తదనంతరంబ, మునుపు భూతంబుచే.....(చ) 6. వెలయ దృష్టాకారవిభవవిస్ఫూర్తి. (క)

మీకృపాబలముచే మెఱసి శాత్రవులఁ । బ్రాకటగతిఁ గొట్టి పాఱవైచెదను.
వెలయఁ గన్నులుగల వేల్పులైచూడుఁ । డలవడ'' నని పల్కి యతిసాహసమున
వారల [1]నంతఁ దా వాకిట నిలిపి । ధీరుఁడై నిజఖడ్గ దీప్తులు మెఱయ
నవని నిద్రాక్రాంతులై యున్నఁజూచి । యవిరళగతిఁ జొచ్చి యటఁ బోయిపోయి
తాను మున్ను గతాగత జనమ్ముచేతఁ । బూని సద్మంబుల పొందులన్నియును
దలకొని వినిన కతంబునఁజేసి । పొలుపొంద భుజబల స్ఫూర్తి [2]దీపింప
నరవి ధృష్టద్యుమ్ను సదనంబుచేరి । హరి విక్రమోన్నతి నరదంబుకీగ్గి
యీశు నుద్దేశించి "యిభచర్మవసన ! । యీశాన, పూనితి సిద్ధప్రతిజ్ఞ.
హర, మహాదేవ, నీహార కర్పూర । హరిహయ ఘోటక హార్యక్ష జలజ
తారకా మందార తారాద్రి హార । శారదా డిండీర శరదభ్ర [3]పటల
విగ్రహ, విశ్వేశ, విమతులనెల్ల । నిగ్రహింపఁగఁ జేయు నీబంటుబంట."
ననుచు నొయ్యనఁ జని యమ్మహారథికుఁ । దనయంబు వెదకుచు హస్తపద్మములఁ

## అశ్వత్థామ నిద్రాపరవశుఁడగు ధృష్టద్యుమ్నునిఁ జంపుట

దడవుచుఁ బోయి యెంతయు మేలుకట్లు । కడఁకతోఁ దెరలును గలిగి దీపములఁ
బొలుపొందు చప్పరంబునఁ బాన్పుమీఁద । నెలకొన్న యలయిక నిశ్శేషశత్రు
నాశనంబయ్యె నెన్నఁగనని నిదుర । తో శయనించిన [4]తుష్ట శాంతాత్ము
గురువధకారు నగ్గురుతనూభవుఁడు । సరవితోఁగాంచి దోషంబు మోదంబు
సందడింపఁగ వానిఁ జరణఘాతమున । నందంద తెలిపిన, నాద్రుపదజుఁడు
దిగ్గన లేచిన, ధృతిఁ దన విల్లు । నగ్గురుపుత్రుండు నల్లన విడిచి
పుడమిపై నాతని ముందల వట్టి । పెడమర్లఁ ద్రిప్పుచుఁ బృథుల సత్త్వమున
రొదలేక యటవాని ఱొమ్మమోఁకాలఁ । గుదియించి మెడ ద్రొక్కి గొబ్బుననంత
బలు శరాసనమునఁ బాపి గుణంబు । వలను మీఱఁగ నది వాని కంఠమునఁ
దగిలించి పశువు విధంబు దీపింప । యగపడి తెందుఁ బోయెద వని నొంప,
గోళ్ళగిల్లియు నెలుంగును వెళ్ళకున్నఁ । దల్లడంబంది యాతనికి [5]నిట్లనియె :
"ఓగురునందన, యుగ్రశస్త్రముల । నీ గళం బిటు త్రుంపు మేఁగెద దివికి."

1. నంతలో (చ) 2. దీపించి 3. ధవళ (చ) 4. దుష్టచిత్తాత్ము (క) 5. పాంచాలుఁడు కర్త అధ్యాహార్యము.

అనిన నశ్వత్థామ యతని [1]మొగంబు । గని: "గురుద్రోహికిఁ గలుగునే పుణ్య
గతి? కుచ్ఛితంబునఁ గాదె మద్గురుని । నతులితంబుగఁ గూల్చి! తారీతి నిన్నుఁ
దెగఁజూతు" ననుచు [2]నుద్రేకంబు తోడ । నొగి [3]నొంప, నచ్చట నున్న వారెల్ల
నక్కలకలమున కట మేలుకాంచి । దిక్కులు సూచుచుఁ దీవ్రభూతంబు
గ్రక్కున నిట వచ్చెఁ గాఁబోలు ననుచు । మిక్కిలి భయమంది మేనులు మఱచి
యొదిఁగి యుండఁగ, వానినొగిఁ గేలఁగాలఁ । [4]జదిపియు గంధగజంబుఁ జెండాడు
హరివోలె ద్రుపదజు నదటణఁగించి, । వెరవొప్ప నాయిల్లు వెడలి శీఘ్రముగ
నరదంబుపై నెక్కి యధికశౌర్యమున । వరుసతోఁ బ్రతిపక్షవర్గ మున్నట్టి
సదనంబు లరయుచుఁ జక్కఁ బోయినను, । బదపడి పీనుఁగై పడి యున్నయట్టి
ద్రుపదజుఁ గాంచి బంధురగతి వారి । చపలలోచనలు [5]రక్షకులు సమగ్ర
శోకులై యేడ్చిరి క్షోణి చలింప. । ఆ కలకలమున నా కెలంకులను
సొరిదిమై నున్న రాజులు మేలుకాంచి । పరువడి దిక్కులు పాఱఁ జూచుచును
అది యేమికలకలంబని విచారింప । వదలక యచ్చటి వార లిట్లనిరి :
"ఘనులార, వినుఁడు అక్కసిరియొ మానిసియొ । మనుజేశతనయుని మడియించి వాఁడె
యరద మెక్కెడిఁ, బోయి యద్దురాత్మకుని । నిరవుగాఁ జంపుఁడు, ఏయుండు కడఁక."
నన విని తలలెత్తి యవ్వీరవరులుఁ । గనుఁగొని పోనీక కదిసి వేవేగ
నలనొప్ప నమ్ములవాన ముంచుటయు । నలుకతో ద్రౌణి సాయకపరంపరల
నవియెల్ల ఖండించి యంతట వారు । వివిధాయుధ వ్రాత వితతి యేయుటయుఁ,
ద్రిపురారి యిచ్చిన తీవ్రఖడ్గమున । నపుడు తుత్తునియలై యవని రాలంగ
నఱికి, వారల కంఠనాళముల్ ద్రుంచి, । యఱిముఱి మిక్కిలి యధిక శౌర్యమున
నుత్తమౌజుని యింటి నొయ్యన చొచ్చి । యత్తఱి మేల్కన్న యాతనిఁ బట్టి
తనర ధృష్టద్యుమ్ను ధరఁ గూల్చినట్లు । పనవంగఁ బనవంగఁ బశురీతిఁ జంపె.
చంపినఁ జేరువ చప్పరంబునను । సొంపుతో శయనించి సుఖనిద్ర నున్న
యతఁడు యుధామన్యుఁ డత్తెఱఁగెల్లఁ । జతురత నెఱిఁగి రాక్షసుఁడని కడఁగి
గదఁ[6]గొని వైచిన, ఖండించి ద్రౌణి । వదల కగ్రజుని భావనఁ దెగటార్చె.
ఈరీతి గురుపుత్రుఁ డేపుదీపించి । దారుణగతి ద్రుపదజులఁ గీటణఁచి,
మఱియుఁ బాంచాల భూమండలాధిపులు । వఱలు సద్మంబులు వదలక చొచ్చి

1. ఘోరంబు. 2. నుద్దీప్తంబుగాఁగ. 3. జంప. 4. జదిపెను. (క) 5. బంధుర (క) 6. బిట్టు (చ)

కోరి నిద్రారతిఁ గొంత మేల్కనిన । వారిని నిద్రించువారినిఁ ద్రుంచి,
గజశాల లోఁగఁ జొచ్చి గర్వంబు మీఱ । గజముల శిరములు ఖండించివైచి,
వనివడి [1]వాని కుంభస్థలంబులను । దనరిన మౌక్తికతతి పాఱఁజల్లి,
హయశాలలకుఁ బోయి యతిరభసమున । హయములఁ జెండాడి, యంతటఁబోక
ప్రళయకాలమునాఁటి ఫాలాక్షుపగిది । వలనుగా మృత్యుదేవతపోల్కిఁ గాల
కాలుని తెఱఁగున ఖండించి వైవ । నాలోన బీభత్సమై ధాత్రిలోనఁ
దునిసిన కరములుఁ ద్రుంగినభటులు । గనెలుగాఁ బడియున్న గజసమూహములు
పెనఁగొన్న [2]ప్రేవులుఁ బెను [3]దిబ్బలుగను । గనుపట్టు [4]నెమ్ములు ఘన రక్తనదులుఁ
గలిగిన సంగరాంగణము చూపఱకుఁ । బ్రళయకాలమురీతి రౌద్రమై [5]యుండె.
అంతటఁ దనివోక హరిపరాక్రముఁడు । సంతతోత్సాహ విస్తార విస్ఫూర్తిఁ
దన ఖడ్గధారచేఁ దళతళమనుచు । ఘనత విద్యుద్భాతిఁ గానుపింపంగ
సారెకుఁ జతురంగసమితి వారినను । బీరువోయినను బెంపెల్లఁ దక్కినను
మఱలినఁ [6]గదలిన మాటాడలేక । తెఱలిన దొఱలిన ధృతిగల్గి మఱియు
మురిసిన గిట్టిన ముట్టినవారిఁ । బొరిగొని పొరిగొని భువియెల్ల నదుర
గమలాకరము చొచ్చు ఘనలులాయంబు । క్రమమున, గేలిశృంగారవనంబు
దరిసిన ఘనమద దంతి చందమున । విరివి [7]మీఱిన మహావిపినమధ్యంబు
దరికొని చెలరేఁగు దావాగ్నిరీతి । మెఱయంగ విహరించి మిన్నక ద్రోణి
యరదంబు నెక్కుచు నాలోన దిగుచు । సరగున నటఁ బాదచారియై చనుచు
ఘనముగా రక్తసిక్తంబైనయట్టి । తనువు గాన్పింపంగ దారుణలీల
సకల జనంబులు సరవిమైఁ దన్ను । నకట రాక్షసుఁడు వీఁడని [8]తలంపంగ
రాజమందిరము పరాక్రమస్ఫూర్తిఁ । దేజంబుతోఁజొచ్చి ధీరత మెఱయఁ,
గలయంగ [9]వీడు మేల్కని యంతలోన । సొలయక యాద్రోణిఁ జూచి శంకించి
‘వీఁడు ధృష్టద్యుమ్ను విడువక చంపి । పోఁడిమి నతని తమ్ముల సంహరించి
రథముల విఱిచి వారణముల నణఁచి । రథికులఁ జెండాడి రథ్యాలి నొంచి
మఱియుఁ దక్కిన మహీమండలాధిపుల । సటికి వచ్చెడి, వీనినణుకంగ వలయు.”

1. దాఁటి (క) 2. ప్రోవులు. 3. తెట్టె. 4. నమ్ములు. (క) 5. మించె. 6. గలిగిన (చ) 7. మాలిన. 8. చంచలింప. 9. నిదుర. (క)

నని ముసలంబులు నస్త్రశస్త్రములు । ఘన భిండివాలముల్ ఖడ్గజాలములుఁ
దోమరంబులు సేయఁ, దునుకలు చేసి । యా మహావీరుఁ [1] డయ్యురదంబు డిగ్గి

## అశ్వత్థామ యుపపాండవుల నుఱుమాడుట

కరమున నుజ్జ్వల ఖడ్గంబుపూని । యరులపైఁ గవియంగ, నసుర పీఁడనుచుఁ
బరువడి దివ్యాస్త్రపంక్తు లేయంగ, । నరయుచు నట్టి సైన్యాస్త్రంబు లెల్లఁ
దునుమాడి ప్రతివింధ్యుఁడొడరిన, నాఁడు । మనమునఁ గోపించి మహనీయశక్తి
నిగిడింప ఖండించి నెఱి ద్రోణసుతుఁడు । నగధీరుఁడగు వాని నడుము ఖండింప,
ధరణిపై [2] ఘనరక్తధారలు దొరుఁగ । వెరవేది మఱి నోరువిచ్చుచుఁ బడియె.
పడినఁ గోపించి యప్పవమానసుతుని । కొడుకు ద్రోణజుమీఁదఁ గ్రూరాస్త్రసమితి
యేసిన, నవియెల్ల నిసుముగాఁజేసి । వాసిగా నతఁడొక్కవరుసఁ దోమరము
పరగింప, నదియును భంజించివైచి । కర [3] మొప్పఁగా ధృతఖడ్గుఁడై వాని
తలద్రెవ్వనేసెను ; దగ నంతలోన । బలభేది పౌత్రుఁ [4] డప్పాపునిఁ దాఁకి
వలనొప్ప నమ్ములవాన ముంచుటయు, । [5] నలవోక గురుసుతుఁ డవియుఁ గైకొనక
దునుకలుగాఁ జేయఁ, దొడనయతఁడు । ఘనతరలీల ముద్గరము వైచుటయు,
నడిమికి ఖండించినను, గోపమెసఁగ । వడి నిప్పులుఱల నవ్వాసవిసుతుఁడు
భీమచక్రంబేయఁ జెంపగ్గలించి । యా మహాచక్ర మయ్యాచార్యసుతుని
వక్షంబుదాఁకిన వరదలై రుధిర । మాక్షణంబునఁ గాఱ, నలుకతో [6] ద్రౌణి
కమల నాళముఁద్రెంచు గజముచందమునఁ । గ్రమమున వానిశిరంబు ఖండించె.
అంత శతానీకుఁడదిచూచి యార్చి । యంతకాకారుఁడై యతిరభసమునఁ
బరశుతోమర ఖడ్గ పట్టిసప్రాస । శరముల ముసలాది సమితిచే నేయ
నలిరేఁగి వానిఁ దృణంబుగాఁజూచి । మలహరుఁడిచ్చిన మహితఖడ్గమున
వాని ఖడించి, యుర్వర సంచలింపఁ । బూనిక సహదేవుపుత్రుపైఁ గడఁగె.
కడఁగిన నతఁడును ఖడ్గంబువైవ । నడిమికి ఖండించినను సాహసమున
శ్రుత[7]కీర్తి మిగుల విశ్రుతకీర్తియగుచు । సతని వక్షముగాఁట నైదమ్ములేయఁ

1. డిగ్గి. 2. లోపల. (చ) 3. మొప్పఁగామయుగ్రాక్షుఁడైవాని. 4. డప్పౌత్రుని. (క) 5. నలయక.
6. నలుక రెట్టింప. (చ) 7. శ్రుతసేనుఁడు అని కవిత్రయభారతము.

బ్రోదిగా మధుమాసమునఁ బూచినట్టి । మోదుగు తెఱఁగున మొనసి యాద్రౌణి
మేదిని వీఁడింతమెఱయునే యనుచు । నాదటఁ గోపించి యతులఖడ్గంబు
జళిపించి వానిమస్తకము ద్రుంచుటయుఁ । గలఁగె దత్సేనలు కౌరవనాథ!
తలఁగక కిరీటిని ద్రౌపదేయులను । గలహరంగంబున ఖండించిపైఁ
[1] దగఁగోపమునఁ బ్రభద్రకులు శిఖండి । మొగి గురుసుతుఁ జుట్టుముట్టి యెంతయును
శరములఁ గరవాల చక్రనారాచ । పరిఘ తోమర గదాప్రాసకుఠార
వివిధాయుధంబుల వెసఁగప్ప, నతఁడు । ప్రవిమలగతిఁ బ్రభద్రకులఁ జంపుటయుఁ,
జూచి శిఖండి నిష్ఠురవృత్తితోడ । నేచి వాలమ్ములనేకమ్ములేయ
నవియెల్లఁ జిదురుపలై రాలనేసి । తివిరి ఖడ్గము కేలఁ ద్రిప్పుచు వాని
తల తెగవ్రేసిన ధరణిపైఁగూలె; । అలవడ ధృతరాష్ట్ర, యదియేమిచెప్ప!
గురుసుతు శౌర్యంబు గొనియాడ వశమె! । ధరణి నెచ్చటనైనఁ దానయైమించె.
అంతట హతశేషు లతిదైన్యవృత్తి । నెంతయుఁ జింతించి యా శిబిరమున
"వరుస ధర్మజ భీమ వాసవుల్ కవలు । హరియు సాత్యకియు నెయ్యెడకేఁగినారొ (?)
వారలుండిన నీయవస్థలు గలవె? । సారెకు నితఁడశ్వత్థామ నిజము.
హరిశౌర్యుఁడవుఁ దప్పదన బుద్ధివాఁడమె, । నరయంగ." నదియెట్టులనినఁ జెప్పెదను
కురుపాండవులు రణక్షోణిలోపలను । దురమొనరింప, రాత్రులయందు నీల
తనువుగాన్పింప రక్తముఖంబు మెఱయ । ఘనరక్త నేత్రముల్ గలిగినయట్టి
తరలాక్షి యొక్కతె తమ వీటివార । లురవడి నిద్రవోవుచు నున్నవేళ
వదలక ముందలవట్టి యీడ్చుచును । జెదరంగవడిఁ బెడచేతులు విఱిచి
కట్టి గుఱ్ఱంబుల గజసమూహముల । నెట్టన బంధించి నెఱిఁదెచ్చి తెచ్చి
యాగురునందను కగ్రభాగమున । వేగంబె నిలిపిన, విదితశౌర్యమునఁ
దునుముట కలలు గాంతురు [2] దానఁజేసి । ఘనత నశ్వత్థామగా నిశ్చయించి,
సమరంబుసేయు, హస్తములును బాద । కమలముల్ నడుములుఁ గంఠదేశములుఁ
దునుకలై రాలి మేదోమాంసరక్త । ఘనశల్యమయములై కాన్పించె; నంత
గురుతరంబగునట్టి కోలాహలమునఁ । గరులు హయంబులుఁ గట్లనుదెంచు
కొని కలంగఁగఁ బాఱె; గోడిగలకును । దనరు హయంబులుద్ధతిఁ గ్రంచుకొనఁగ

1. కడు. (క) 2. గాన. (క) 3. 'అశ్వత్థామచే నటుకఁబడి' యనుట యథ్యాహార్యము.

మదము సహింపక మార్కొనునట్టి । మదగజవ్యూహమౌ [1]సమ్మర్దంబు వలన
శిరములు వగిలియుఁ జెక్కులువాసి । కరములు నలిగియుఁ, గాళ్లుకునిసియు
వెన్నులు నురములు విఱిగియు మఱియుఁ । గ్రన్నన పక్కలు కడికండలయ్యుఁ
జదిసియు నీరీతిఁ జాపకట్టుగను । బ్రిదులక పీనుఁగుపెంటలై [2]పడిన
నప్పుడు పలకయు నడిదంబుఁగొనుచుఁ । దప్పక ద్రోణిరథము డిగ్గనుఱికి
యుగ్గడాదులనాహవాటోప మొప్ప । స్రగ్గు మగ్గుడు గాఁగఁ జంపివైచినను,
గొందఱు మేల్కని గురుసాహసమునఁ । జిందఱవందరై చేష్టలుదక్కి
కడువడిఁ బాదముల్ గడగడ వడఁక । వెడలంగ లేక నివ్వెఱపాటు నొంది
కళవళించుచునుండఁ, గడఁకతోఁ గొంద । ఱలవోక జనకమిత్రాది బాంధవులఁ
బిలుచుచు మిక్కిలి [3]బిమ్మిటిగొనుచుఁ । దలకొని యంతలోఁ దమవారుగాని
వారిచట్టలు వట్టి వదలక చనఁగ, । వారక కొందఱుర్వర సంచలింపఁ
గన్నుల నిద్దుర గప్పుచు నుండ । నన్నదమ్ములు బాంధవాదులునవక
వలనేది తమతమ వారినెచంప, । మలయుచుఁ గొందఱు [4]మగిడినవారి
నలవడ 'నిదియేమి' యనియడిగినను । "సాలయ కశ్వత్థామ చొచ్చి చంపెడిని
ఎక్కడఁ జొత్తమింకెవ్వరు దిక్కు? । అక్కట వాసుదే[5]వార్జునుల్ లేరు;
ఏమిసేయుద!" మన్ననిట మఱికొంద । 'ఱాముహేంద్రతనూజుఁ డర్థనిత్తెఱఁగు
గనుఁగొని [6]కాచెడే! కడఁగి యాఘనుఁడు । వనివడ వైరులభజించువేళ
వెఱచినవారిని, [7]వెఱపుతోఁబారి । గఱచినవారిని, ఖడ్గాయుధములు
మఱచినవారిని, మఱి వాహనములు । [8]అఱిముఱి వికలంబులగువారి, నిదుర
వోయినవారిని [9]మొగి నెప్పుడైనఁ । బోయక చంపఁడు భవ్యుఁడాతండు!
కొలఁది మీఱఁగ విప్రకులమునఁ బుట్టి । బలిమితో నిట్టిపాపంబు సేయుదురె!
యక్కటా!' యనువారు, నైరంతఁగొంద । ఱక్కజంబగు భీతి నటనిల్లు వెడలి
కృపకృతవర్మలఁ గృతిమతిఁగాంచి । యపుడు రక్షింపరే యని మ్రొక్కుటయును,
రమణతో వారలు రాక్షసావేశ । సమధిక క్రూరు చర్చింపలేక
మదమేది యాత్మీయ మానుషహాని । యిది యని తలఁపక యేపుతో వారి

1. సమగ్రంబు. (క) 2. "ఎదుర్కొనినవారు" అనునది అధ్యాహార్యము. 3. బిమ్మట 4. మఱగిన వారి. (క) 5. వానుజాన్. 6. కోయఁడే. 7. ఔరవుతో. 8. అరివీరె వికలంబులై వారి. 9. నొగి (క)

శిరములు నరములు జీవనాళములు । కరములు నురములు ఖండించినైచి
పూని యొక్కనినైనఁ బోలుపొంద బ్రదికి । పోనీక చంపినఁ బోదివె భూతములు.

## అశ్వత్థామ పాండవ శిబిరంబు వెడలి కృప కృతవర్మలఁ గలియుట

అనమయంబున నా ద్రోణసుతుఁడు । గాసిల్ల రక్తసిక్తంబులైనట్టి
బాహాదండంబులు భయదముల్ గాఁగ । సాహసంబునను నిశ్శబ్దమైయున్న
శిబిరంబు వెడలి చెచ్చెరఁ గృపాచార్యుఁ । బ్రబలుని గృతవర్ముఁ బరికించి కాంచి
"సకల పాంచాలుర సకలసైన్యముల । సకల రాజన్యులఁ జంపి[1]వైచితిని.
పొలుపొంద నా పాండుపుత్త్రులేవురును । జలరుహదళ నేత్ర సాత్యకు లెచటి
కరిగిరో కానరాదా శిబిరమున. । హరునివరంబున నటు భవత్కృపను
సకల శాత్రవులను సంహరించితిని । బ్రకటిత శౌర్యసంపదఁ జెన్నుమీఱి."
అనిపల్క వారలు హర్షించి యపుడు । కొనియాడుచుండ నా క్రూరాత్ముఁ డనియె :
"పరగంగ నాచేతఁ బాండునందనులు । పరువడి సంహరింపఁగఁ బడిరేని
వినుతింపఁ దగుఁ గాక వెనక్రిత్తకాంద్రఁ । గొనకొని చంపుట కొనియాడనేల ?
అదియేమి పౌరుషం ?" బనవుడు వార । లదనుగా ద్రౌణితో నర్థి నిట్లనిరి :
"తలకొని పాంచాల తనయుల మఱియు । నిలఁ బ్రతివింధ్యాదు లేవురు సుతుల
సకలసైన్యంబులఁ జక్కఁజేసితివి । అలంక విస్ఫూర్తి యామద్వయమున.
మహిలోన నీకు సమానులు గలరె ! । బహుతర శౌర్య సంపత్ప్రభావుఁడవు."
అనిపల్కి కౌఁగిటనందంద చేర్చి । కొని" రని చెప్పినఁ, గురురాజుతండ్రి,
యనె సంజయునిఁ జూచి : "యక్కటా ద్రౌణి । మోసపోయెను; విధి మొగి నింతచేసె.
మనలక యుందఱు మడిసిన వెనుక । ననమునఁ దనశౌర్య మది యేలచూపె ?
నవడిమై నందఱు చావక మునుపు । కువలయాధిపుఁడైన కురురాజు మెచ్చఁ
బనివడి తనప్రతాపము చూపఁడయ్యె ; । [2]తను ననని[ఁ]క నేమి ? తప్పెఁ గార్యంబు ;
ఎనయ నీవృత్తాంత మెఱిఁగింపు." మనిన, । జననాథుఁ జూచి సంజయుఁ డిట్టులనియె :
"వినవయ్య ధృతరాష్ట్ర, విభవ దేవేంద్ర ! । పనివడి గురుతనూభవుఁడు పాండవుల
భూరి భుజాబల స్ఫూర్తికి నోడి । వారకయుండి, యవ్వల సుయోధనుని
తొడలు భగ్నముచేసి తుది వాయుసుతుఁడు । తడయ [3]కెంతయు వానితలదన్నుటయును

1. వచ్చితిని. (చ) 2. తనరంగ. 3. కంతటఁ బోక. (చ)

కుచ్చితమతిఁ దన గురునిఁ జంపుటయు । మచ్చికతోఁ గురుమనుజేశ్వరునకు
బాన యిచ్చుటయును బ్రథనరంగమున । నోసరింపక యిట్టులొనరించె వినుము.
సుతగతిఁ బాండుసూనులు లేమిఁ జేసి । ప్రతిపక్షవితతుల భంజించెఁ గాక.
వారున్న దేవతావర్గంబుకైన । వారక యెదిరింప వశమె భూనాథ!
విను మట్లు ద్రోణి దోర్వీర్యంబు మెఱసి । ఘన రథారూఢుఁడై కదలి యవ్వేళ
వరమతిఁ గృపకృతవర్మలఁ జూచి । "కరుణాత్ములార! యక్కౌరవేశ్వరుఁడు
తొడరి ప్రాణంబులతోడ నుండినను । ఎడపక యిత్తెఱం గెఱిఁగింపవలయు."

## అశ్వత్థామాది రథికత్రయము దుర్యోధనుని గనుఁగొనుట

నని పల్కి వేవేగ నచటికిఁ బోయి, । తనువున మిగుల రక్తంబు గాఱంగఁ
బొరలుచుఁ జేష్టలు పొందులడంగ । సరవిమై నూర్పులు సందడింపంగ
ధారుణిఁ గంఠగతప్రాణుఁడైన । రారాజుఁ బొడగని రథమునుడిగ్గి
(ధారుణి ధనువులు తలఁగిపోవైచి) । నీరు కన్నులఁగాఱ నెమ్మిగవాపోయి
"హా కురువల్లభ, హా మేరుధీర! । హా కరుణాకార! యబ్ధిగంభీర!
హా వైభవసురేంద్ర! హా కాంతిచంద్ర! । హా విశ్రుతోదార! హా కులోద్ధార!
దురమునఁ బెంపుతో దోర్విక్రమమునఁ । బరఁగి శమంతక పంచకంబునను
బడితివిగావున భవ్యసద్గతికిఁ । గడువేగఁ బోయెదు; కటకటా నీకు
నై పగవుట్టదా యవని వల్లభుని । దేవులఁజూచిన ధృతి తూల [1] కున్నె!
నీరి యెవ్వఁడుఁదన శిష్యులలోనఁ । గౌరవనాథుఁ డఖండ విక్రముఁడు
అని మన్ననలు సేయుటది కేలిచేసి । తనరంగఁ బవమానతనయున కర్థి
మఱి జయంబొసఁగెనే మాలవిధాత. । కటకటా నీభుజాకలిత విస్ఫూర్తిఁ
దగిలి నిల్వఁగలేక ధర్మంబుదప్పి । పగగొని యూరులు భగ్నంబుచేసి
యంతటఁబోవక యనిలనందనుఁడు । పంతంబుతో వామపదమునఁ దన్నె.
అదియును గనుఁగొని యమతనూభవుఁడు । నొదవిన వేడ్కతో నూఱకయుండె.
దానికి శాస్తి యధర్మండుగాక । వానికిఁ బెట్టంగవలదె! సత్కీర్తి
మాయదే! మిగుల మా మదికిదుఃఖంబు । సేయదే! కౌరవక్షితినాథ, వినుము
కుడువఁగట్టఁగ బంధుకోట్లకు నిడఁగ । నడరిన వేడ్కతో యజ్ఞముల్ సేయ

1. గలదొ. (క)

నెక్కుడు సిరియిచ్చి; తీవు చావంగ । నక్కటా! యున్నాఁడ నవసిలోపలను,
గూర్మి నేనొక సేవకుండనే!" యనుచు । నర్మిలి దుఃఖించి యవనిపైఁ బొరలి
వెండియు నిట్లను : "వినుమహీనాథ! । ఖండితారాతి యాఖండలు పురికి
ననఘవై ఖరిఁ బోయినపుడు మద్గురునిఁ । గనుఁగొని నా మాటలుగా విన్నవింపు
పాపకర్ముండైన పాంచాలుఁబట్టి । భూపాలురెల్ల నద్భుతముగాఁ బొగడ
నారూఢి సోమదత్తాది బాంధవుల । ... ... ... ... ...
నీ తనూజుఁడుచంపె నెమ్మితో ననుచు । ఖ్యాతిగా నెఱిఁగింపు ; కదనరంగమున
వైరివర్గంబును వసుధఁ జంపుటలు । ... ... ... ... ...
అఱిముఱి మిగుల మహావైభవమున । నెఱిఁగింపు ; చెప్పెద నింకొకమాట
శత్రుసైన్యంబుల సౌప్తికవేళఁ । జిత్రంబుగాఁ బ్రవేశించి యంతటను
బళు[1] హననంబునాఁ బాంచాలసూను । నసువులఁ బాపి చయ్యన వానిబంధు
వరులఁ గీటణఁగించి వరుసతోఁ బాండు । ధరణీశు పౌత్రుల ధరఁగూలనేసి
పీనుఁగుపెంటగాఁ బేర్చియందఱను । మానక చంపితి ; మధుసూదనుండు
వరుణ ధర్మజభీమ వాసవుల్ కవలు । నరనాథ, సాత్యకి నాబారిఁబడరు.
ఏమువోవుటగని యెక్కడ శౌరి । ప్రేమతో దాఁచెనో పెంపగ్గలించి?
యెందులఁబోయిరో యెఱుఁగలేనైతి. । అందఱ నీరీతి నందంద చంపి
వచ్చితి, నీకృతవర్మయుఁ గృపుఁడు । నచ్చుగాఁ దోడురా." ననిన వాక్యములు
ఎనయనాలుకకు లావిచ్చిన నంత । మనమున హర్షించి మనుజేంద్రుఁడనియె :
"ఎలమితో నీవును నీ యోధవరులుఁ । గలహరంగంబునఁ గడఁగి శాత్రవులఁ
బరువడిఁ బఱచినపాట్లు ద్రోణుండు । సురనదీ తనయుండు సూర్యనందనుఁడుఁ
జెలఁగి మద్రేశుండుఁ జేసిరేయకట! । కలితపుణ్యాత్ములు ఘనులు సజ్జనులు
మీరు సుఖస్థితి మేదినిలోన । నారూఢి వర్తింపుఁ డటమీఁద వేడ్క.
తరమిడి మీపునర్దర్శనం బర్థి । సురలోకమునఁగల్గు సురుచిరలీల ;
నడలక వేగఁబొం." డనుచుఁ బ్రాణములు । విడిచె. వారంత భూవిభుఁ గౌఁగిలించి
వలగొనివచ్చి భూవర, తేరులెక్కి । సలలితగతి యథేచ్ఛా విహారమునఁ
బొలివేది పోయిరి ; పూర్వశైలమున । జలజాప్తుఁ డుదయించె: జయ్యన." ననుచు

1. హననమ్ముగా. (క)

వినిపింపఁ దరువాతి వృత్తాంతమెల్ల । ననఘాత్మ, చెప్పవే యనియడుగుటయు
బలిదైత్యభంజన, భావజజనక, । జలజ గదాశార్ఙ్గ చక్రసుహస్త,
నీలాంబుదశ్యామ, నిత్యాభిరామ, । కైలాసపతిమిత్ర, కారుణ్యనేత్ర,
ఘనమౌని హృద్గేహ కలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనచరిత, । ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
విరచిత సౌప్తిక విపులపర్వమున । నరుగు మీఱఁగఁ బ్రథమాశ్వాసమయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ భుజగాద్రివర్తిత భువనస్థ, । వైభవనిలయ, శ్రీవర, హృషీకేశ,
వనగజ సంరక్ష, వరసురాధ్యక్ష, । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ !
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:
ఆరీతి సూర్యోదయంబైనయంత । శౌరి సాత్యకియు నా శ్వసనాత్మజుండు
మొదలైనతమ్ములి మ్ముల్లఁ గొలువంగ । సదయుఁడై యున్నట్టి శమనతనూజు
పాలికి శీఘ్రతఁ బఱతెంచి మ్రొక్కి । లోలత మిగుల నాక్రోశంబుతోడ
సరవి ధృష్టద్యుమ్ను సారథి పలికె: । "నరనాథ, వినవయ్య నగరాజధైర్య,
గురుతనూజాతుండు కుత్సితవృత్తి । నరసి కృపాచార్యుఁ డాకృతవర్మ
తనకుఁ దోడుగ మహోద్ధతిఁ బెచ్చుపెరిగి । మనమార నడురేయి మనవీడు చొచ్చి
చనవేది నిద్రావశంబుననుండఁ । గనుఁగొని యిదివేళ ఖండింప ననుచు
మునుపు ధృష్టద్యుమ్ను మట్టి వేచంపి, । యొనర యుధామన్యు నుత్తమౌజసుని
బుడమిపైఁ గూల్చి, విస్ఫూర్తి దీపింపఁ । దడవి తత్సోదర తనయాది బంధు
వరులఁ బాంచాలుర వధియించి మించి, । పరువడి నటఁ జేదిబలములఁ జెండి,
తగ మాత్స్యులను బ్రభద్రకుల శిఖండి । నగపడ శిక్షించి యంతటఁ బోక
యిటఁ బ్రతివింధ్యాదు లేవుర సుతుల । విటతాటముగఁ జంపి విదితశౌర్యమునఁ
గరులను జెండాడు కంఠీరవంబు । కరణి నొక్కనినైనఁ గదలి పోనీక
యఱచినఁ బఱచిన [1]నట బొట్లవ్రేల్గ । గఱచిన శరణన్నఁ గరుణింప కతఁడు
వీనుఁగుపెంటగాఁ బేర్చి పెల్లార్చి । జానొప్ప నందఱఁ జంపి పోవైచె.
కృత కృత్య, వినవయ్య కృతవర్మచేతఁ । బ్రతి మీఱ నేఁ బట్టువడి విడువంగ
వచ్చితి." ననవుడు వసుధేశ్వరుండు । క్రచ్చర నేలపై వ్రాలెను గవలు
భీమ సాత్యకులును బ్రిదులక పట్ట । నామనుజేశ్వరుండట మూర్ఛపోయి
కొంతసేపునకు గ్రక్కునఁ దెలివొంది । చింతా భరంబునఁ జెలఁగి యిట్లనియె:

1. నడనేది. (చ)

## తమవారశ్వత్థామచే నన్యాయంబుగాఁ దెగుటవిని ధర్మజాదులు చింతించుట

“ఎట్టివారికినైన నెఱుఁగంగనగునె । నెట్టన సర్వంబు, నీతి శౌర్యంబు
పరఁగ శాత్రవులఁ దద్బంధు మిత్రాది । వరులను జంపినవాఁడనై జయము
చేకొని యరుగుదెంచితి నిచ్చటికిని. । ప్రాకటంబుగఁ బుత్ర బాంధవయుక్త
ముగ మద్బలంబును బోనీక పట్టి । తెగటార్చెనే ద్రౌణి తీవ్రవేగమున!
అధికబలంబుల నవలీలఁ జంపి । యుద్ధములచేఁ జచ్చిరతికుత్సితముగ.
జలనిధి లంఘించి సన్నపుఁ గాల్వ । నలవడ మునిఁగి రూపణఁగిన ట్లయ్యె.
జనకుండు లేమి విషాదంబు నొందు । వనిత పాంచాలి యీ కరణిని భ్రాత
లును దనూభవులును లోనుగాఁ గల్గు । ఘనులు పోయిన నెట్టిగతిఁ జరించెడినో!
ఇంతకుమున్న తా నిట్టి దుఃఖంబు । నెంతయుఁ జెందదింకేమి గాఁగలదో!”
అనియని చింతించి యశ్రులు నించి । ఘనతర శోకాంధకారంబు పేర్మిఁ
దన్నుఁ దా నెఱుఁగక ధర మూర్ఛపోయి । క్రన్ననఁ దెలివొంది కాంత ద్రౌపదిని
రావింపఁ దలఁచి, వారక మున్న తాన । భావించి ద్రుపద భూపాల విరాట
మహీపతుల్ చచ్చిన మఱువాఁడు వారి । సహజాత్మజులయుఁ బత్నిజనముల శోక
ములు మాన్ప నంపిన, ముదిత సుభద్ర । తఱకొన్న భక్తితోఁ దనవెంట రాఁగ
విడిదలనుండి యవ్విరటుని పురికిఁ । గడఁక[1] తో వెడలి యక్కడ నామెయుంటఁ
(దలపోసి తనదు సోదరుఁడగు నకులుఁ । బిలిచి “నీ విప్పుడె వేవేగఁ బోయి)
పొసఁగ నుపప్లావ్య పురమున నున్న । కుసుమకోమలి రమ్యగురుకుచ మత్త
కరియాన ద్రుపదభూకాంతుని పుత్రి, । హరిసహోదరియైన యబల సుభద్ర,
మఱియుఁ దక్కిన నృప మానినీ మణుల । నఱలేని కడఁకతో నటఁ గొనితెమ్ము;
[2] బుధనుత, సంతతాభ్యుదయ, సోనకుల! । రథమెక్కు నేమును రమణ నా శిబిర
మునకుఁ బోయెద.” మన్న మొగినకులుండు । ఘన రథారూఢుఁడై కదలి శీఘ్రమునఁ
బొసఁగ నుపప్లావ్య పురవరంబునకు । నసదృశగతిఁ బోయె; నంతటిలోన
నిట ధర్మనందనుండెల్ల సోదరులుఁ । బటుగతి సాత్యకి పద్మనాభుండు
మొదలైనవారలు మునుకొని తన్ను । బొదివి చనంగ నప్పుడు నిజశిబిర
మరయుచుఁ జొచ్చి చయ్యన ద్రౌణిచేత । శిరములు గాళ్లను జేతులుఁ దలలు

---

1. తోడుతఁబోయి క్రమ్మఱఁబోయి. (క) 2. ప్రథమ మాద్రేయ, తప్పక పొమ్ము లెమ్ము. (చ)

తునుకలై రాలి మేదోమాంసరక్త । ఘనపడు లుబ్బి యొక్కటఁ బడియున్న
తనయుల మఱఁదులఁ దగినబాంధవుల । జననాథవర్యుల సఖులఁ బౌరులను
గనుఁగొని కన్నీళ్లు ఘనముగాఁ గాఱఁ । దను బాసె యెఱుఁగక ధరమీఁదఁ ద్రాలె.
తవిలి తద్భ్రాతలు దామోదరుండు । భువిమీఁద మూర్ఛలఁ బొంది [1]రంతటను.
తగ సాత్యకియుఁ బ్రయత్నంబున వారి । నగణితగతిఁ దెల్పనంత ధర్మజుఁడు
తెలిసియు వెండియుఁ దెలియక వగల । నెలకొని దుఃఖించి నిజతనూభవుల
తనువులపై వ్రాలి దందహ్యమాన । ఘన విషాదంబునఁ గలఁగి యేడ్వంగ
హరియును శ్వేతవాహనుఁడును జేరి । పరువడి సముచిత భాషణంబులను
దలకొని [2]బోధింపఁ దక్కటివారు । కొలఁదిగాఁ దెల్పంగఁ గొంతసేపునకు
క్షోణీశ్వరుండును శోకంబు దక్కి । యేణాంకధరుఁడిప్డు డీకొనఁ జేసె
నని పుత్రబంధు మిత్రాదుల కెల్ల । వెనుకొని పావక విధి యొనరించి,
యొకచోటఁ గూర్చుండి యుండి పాంచాలి । యకట వచ్చెడి నింక నను నంతలోన,
నకులుచేఁ బాంచాలనందన తనదు । ప్రకట తనూజులు బంధులుఁ దెగుట
విని దుఃఖమునఁ బలవించుచు వగలఁ । గనుఁగవ నొగి నీళ్లుగాఱ నోరెండఁ
జనుదెంచి యంత నజ్జనపాలుఁ గాంచి ॥ యెనయ శోకంబున నేడ్చుచు నుండఁ,
దొలఁగక యమ్మాద్రితొలిచూలు రథము । నలవడ నిలిపి యయ్యంగన డించె.
తక్కిన భామలు తమవాహనంబు ॥ లక్కజంబుగ డిగ్గి యటు చుట్టు ముట్టి
విడువక శోకాబ్ధి వీచుల మునిఁగి । కడువడిఁ బాదముల్గజగజ వడఁక
నడరి యేడ్చుచు నుండు నంతఁ బాంచాలి । తొడిఁబడ నిట్లని దుఃఖింపఁ దొడఁగె:
“హా కుమారకులార! యతి శౌర్యులార ! । హా కమనీయ మహా తేజులార !
హా మందహాస రమ్యక ముఖులార ! । హా మేరు మందరా చల ధైర్యులార !
పోయితిరే నేఁడు బొందితోఁ బాసి ! । పోయితిరే ప్రాణముల నన్నుఁ డించి !
మీ ముఖగరిమంబు మీ నేత్రగరిమ । మీ మందహాసంబు మీ వాక్యఫణితి
మీ భుజా గరిమంబు మీ దేహకాంతి । మీ భాగ్యరేఖయు మీ నడవడియు
నెక్కడ నడఁగె! నింకేమి నేయుదును! । అక్కటా! ” యనియేడ్చి యంతటఁబోక
తమతండ్రి ద్రుపదునిఁ దత్సోదరులను । దమయన్న శ్వేతునిఁ దలఁచి దుఃఖించి
తొలఁగక నాలుక తొట్రుపడంగ । నలవోక నొక కొన్ని యడుగులు వచ్చి

---

1. రంతటను. (చ) 2. వారింప. (క)

నేల వ్రాలఁగఁ, జూచి నెఱి వాయుసుతుఁడు । లోలాక్షి నెత్తి యాలోన ధర్మజుని
సన్నిధి [1]డించిన, సారస గంధి । క్రన్నన ధర వ్రాలి కన్నీరు నించి
మనసు ధైర్యము చేసి మఱియుఁ గోపంబు । పెనఁగొనఁ గూర్చుండి పృథివీశుఁ జూచి,
"యకట! నిద్రాసక్తులైన నాసుతులఁ । బ్రకటించి కుంభజుపట్టి వేచంపె.
క్షితినాథ, యాఱని చిచ్చు విధమున । వితతంబుగా మది వేగంగఁ దొడఁగె;
మఱియు నెందులకైన మాన్పంగ వశమె! । యెఱియుచు నున్న దింకేమన నేర్తు?
జగతి నిందులకు నాపద మేనుగంటి । జగడించి యాద్రౌణిఁ జంపినమాను.
భీమసేనునిఁ బంపి పేర్మితో వాని । భూమిఁ గూలింపుము భూపాలచంద్ర!
ఈయిడితో నిత్తెఱఁగు సేయకున్నఁ । బ్రాయోపవేశనపరత వహింతు."
అని యిట్లు పాంచాలి యాడు వాక్యములు । విని ధర్మరాజు భావించి యిట్లనియె:
"మదిరాక్షి, విను మనుమానంబులేక । కదలక ధర్మ వాక్యంబు చెప్పెదను.
రాజకుమారులు రణభూమిలోన । నోజమై మృతిఁబొందు టుత్తమోత్తమము.
పొలుపొంద వారలు పుణ్యలోకములు । గలిగి సుఖస్థితిఁ గదలకుండుదురు.
వగవకు మందుకు వనితాలలామ! । జగతిపై శోకంబు శమియింపవలయు;
రమణిరో, ద్రౌణి పరాభవంబునను । బ్రమదాతి రేకమై పట్టిన యలుక
సరవిమై వానినే చంపకపోదు; । మఱుఁగంగ వలదు నామనసు నట్టిదియె.
వాఁడు కాననభూమి వసియింపఁబోలు; । పోఁడిమి వానిఁ జంపుట నీకు నెట్టు
లెఱుఁగంగ నగు?" నన నిందీవరాక్షి । యఱలేని కడఁకతో నప్పుడిట్లనియె:
"రూఢిగా వాని శిరోమణి గలదు; । ప్రౌఢత్వమున నాకుఁ బరువడిఁ దెచ్చి
యిచ్చిన శోకంబు నెంతయు మాని । మెచ్చుగాఁ బ్రాణముల్ [2]మెయిని నిల్పెదను.
చెలఁగి [3]యంతటిపని సేయకయున్న । నలి మాటలేల ప్రాణంబులు విడుతు."
ననుచుఁ బాంచాల దేశావనీనాథు । తనయ దుఃఖించుచుఁ దద్దయు భీముఁ

## ద్రౌపదీప్రేరితుఁడై భీముఁడశ్వత్థామను బరిభవింప నేఁగుట

బాణిపద్మమున సంస్పర్శించి పలికె: । "ప్రాణేశ, [4]వినవె యో భాసుర తేజ!
తగ నుత్తమక్షత్రి ధర్మమార్గమునఁ । బగఁగొని దుర్జనుఁ బాపాత్ము ఖలుని

---

1. నుంచిన. (చ) 2. మేన. 3. యింతటి. 4. వినవయ్య. (చ)

గురుపుత్రు నవనిపైఁ గూల్చి నాశోక । మురుధార వారింపు మతులప్రతాప!
తలఁగి లాక్షాగృహ దాహాను శోక । నిలిపిన మాఁటిమి, నెఱి హిడింబాఖ్యు
నరుదారఁ జంపినయట్టి సాహసము, । నరుదుగా నేకచక్రాగ్రహారమున
బకునిఁ జెండాడిన పౌరుషస్ఫూర్తి, । ప్రకటించి యక్షుల భంజించుటయును,
మణిమంతుఁ జంపుట, మఱి జటాసురుని । గణుతించి నఱుకుట, ఘను సింహబలునిఁ
దొడరి దుర్యోధన దుశ్శాసనులను । బుడమిఁ గూల్చుటయును భువియెల్లఁబొగడె.
పాపాత్ము గురుపుత్రుఁ బట్టి వేచంపి । పాపు నాశోక తాపంబులు నేఁడు."
అన విని యుప్పొంగి యనిలనందనుఁడు । సునిశితమతి ధర్మసుతుఁ డాడినట్టి
చాతుర్య శోకోపశమన వాక్యంబు । లాతతంబుగఁ దనకనుమతి గాఁగ
నంతరంగంబున నంగీకరించి । యంతలో నిజరథం బాయిత్తపఱచి
చనవొప్ప నకులుని సారథ్యమునకు । నొనర నియోగించి యుజ్జ్వలస్ఫూర్తి
నరదంబుపై నెక్కి యతిశీఘ్రవృత్తి । నరయంగ గురుతనయాదుల చొప్ప
[1] గుఱుతుగా నటఁబట్టుకొనిపోయి పోయి । పరుసఁ గురుక్షేత్ర వాసులవలనఁ
"కృతమతి ద్రౌణియుఁ గృపుఁడును మఱియుఁ । గృతవర్మయును గురుక్షితిపతి వార్త
ధృతరాష్ట్రు కెఱిఁగించి తెఱఁగొప్ప మగిడి । ధృతిమీఱి భాగీరథీ తీరమునకు
వడిఁబోయి తమకును వలసినచోటి । కడరుచుఁ బోవంగ, నంతలో ద్రౌణి
వ్యాసాశ్రమంబున కనతి దూరమున । వాసిగా నెంతయు వసియించె" ననుచు
విని భీమసేనుండు వేగమె పోయె. । అనఘాత్మ, వినవయ్య యంతనిక్కడను,
యమతనూజాతుని నంతవీక్షించి । ప్రమదంబుతోడ నప్పద్మాక్షుఁ డనియె:
"వినవయ్య ధర్మజ, విభవదేవేంద్ర! । ధననాథ సమదాన. ధర్మసంధాన,
అనిలతనూభవుం డలుకయు శోక । మును బెనఁగొనఁ జిత్తమున నొంచిఁబోయెఁ;
దప్పదే కార్యంబు! తమ్ములలోన । నెప్పుడు దయఁజూతు వీతనిఁ; గానఁ
బొలుపుగా నందఱుఁ బోవుటమేలు; । కలహంబు బలువుగాఁగలుగు నిక్కమము.
సకల భూములుఁ గాల్పఁ జాలినయట్టి । ప్రకటిత బ్రహ్మశిరంబనుదివ్య
శరము కుంభజుఁడిచ్చె సరవిఁబుత్రునకు; । సరకమై నది ధనంజయునకు నొసఁగె.
అలవడ నట్టి దివ్యాస్త్రంబు తనకుఁ । గలుగుటఁజేసి యుత్కటగర్వుఁడగుచు,
దొరఁకొని విజయునితోడ వైరమునఁ । బరఁగుట యెఱిఁగి తప్పక చాపగురుఁడు

1. పరగంగఁబట్టి తప్పక. (చ)

పాండుతనూజులపైఁ బ్రయోగింప । కాండంబు వలెనని యొప్పుగాఁ దలఁచి,
నెలకొని [1] యీ మహనీయ సాధనము । పొలుపుకెంతయు మనుష్యులమీఁద నేయు
కోలఁదిగాకునికియుఁ గుంభినిలోనఁ । గలదుగావున ధర్మకలితుఁడై నట్టి
గురుఁడొకనాఁడు మక్కువ దలిర్పంగఁ । బరునడి శస్త్రసంభాషణవేళఁ
దనయున కిట్లను: "ధర్మప్రతాప! । మనుజులపై నీవు మచ్చరంబునను
జెలరేఁగి మఱి బ్రహ్మశిర మేసితేని । పొలుపేది యశుభంబు పొందంగఁగలవు.
పరికింప నెన్నియాపదలు వచ్చినను । జిరమతి నీ బ్రహ్మశిర మేయవలదు."
అని యిట్లుచెప్పిన నంతరంగమున । వెనుకొని నగచుచు విహరించుఁగాని
వెలయంగ నుపదేశ విఘ్నుఁడాధూర్తు; । నలిరేఁగి దురభిమానంబును గలదు.
అదియునెట్లన్నను యమతనూభవుఁడ, । విదితంబుగానీకు విన్నవించెదను.
కరమొప్ప వనవాసగతు [2] లయి మీరు । తిరిగెడినాఁడు సుస్థిరవృత్తితోడ
వాఁడు వేడుకకు మద్ద్వారకాపురికిఁ । బోఁడిమిఁ జనుదెంచి పొలుపుదీపింప,
వృష్ణిభోజాంధక వీరులతోడఁ । దృష్ణపాయఁగ వినోదించుచు నుండి,
యొక్కనాఁ డొంటిమై నున్ననాయొద్ద । కక్కజంబుగ వచ్చి యర్థినిట్లనియె:
"ఒనరంగ విను మగస్త్యుండు మాతండ్రి । ఘనతపోనియతికిఁ గడుఁబ్రీతిఁ బొంది
రమణమై బ్రహ్మశిరము కృపచేసె; । క్రమమున నాకిచ్చెఁ గడఁగి మద్గురుఁడు.
అట్టి బ్రహ్మశిరంబు ననఘు, నీకిత్తు । గట్టిగా నాకుఁ జక్రంబిమ్ము కృష్ణ!"
అని పల్కనెంతయు నద్గురాత్మకుని । మన సెనెఱింగి క్రమ్మఱను నిట్లంటి:
"తలకొని నా యాయుధములలో నీకు । వలసిన శస్త్రముల్ వడినిత్తుఁ గొనుము.
అలవడ నీకిచ్చినట్టి యస్త్రంబు । వలదు నాకీయంగ; వరున మిత్రునికిఁ
దగఁగోరినది యిచ్చి దానికిమాఱు । మగుడ నొక్కటి [3] గొన మహిలోనఁ [4] దగునె।
అనుమానమేల నీయాత్మలోనెద్ది । యొనయంగఁ దలఁచితి విచ్చెదనదియె."
అనుటయుఁ జక్రంబు నతఁడు వేడుటయు । మునుకొని యేనును బుచ్చుకొమ్మంటి.
అమ్మాటకును వాఁడు హర్షంబునొంది । క్రమ్మఱ వామకరంబునఁ జక్ర
మెత్తంగఁ దలపోసి యెత్తంగలేక । తత్తఱపాటున దక్షిణపాణిఁ
బట్టి నుంతయుఁ గదల్పఁగలేక మఱియు । ధట్టించి యుభయహస్తంబులఁ బట్టి
తివిచినఁ గదలమి ధృతిచెడి డస్సి । యవిరళగతినిల్వ నప్పు డిట్లంటి:

1. మహనీయ నిజసాధనములు. (క) 2. లైన. (చ) 3. గొన్న. 4. దగదా. (చ)

"ఏమి యశ్వత్థామ, యేలడస్సితివి! । ఈమెయి నీ చక్రమె త్త నీవశమె!
అతులిత బ్రహ్మచర్య వ్రతంబునను । సతతంబు రుక్మిణీసహితంబు తుహిన
గోత్రతటంబున గురుతరనిష్ఠ । ధాత్రిఁ బండ్రెండేండ్లు తపమొనరించి
ఎనయంగ రాత్రులెత్తిరాకుండ । ఘనమగు నిట్టి చక్రముఁ బడసితిని.
బలభద్ర సాత్యకి ప్రద్యుమ్నముఖ్యు । లలవడ దీనిని నడుగరెన్నఁడును.
అరయ గాండీవ ధవళాశ్వధ్వజములుఁ । బరమసాధనమైన పాశుపతంబు
ఘనతపోబలమునఁగాదె యర్జునుఁడు । గొనియె? నాతని కేనుగూర్తు; నద్దేవ
సముఁడు ధన్యుండైన సవ్యసాచియును । విమలాత్ముఁడై నన్ను వేడఁడెపుడేని?
నెఱిగల యిమ్మహనీయ సాధనము । లఱిముఱి నిఖిలదైత్యధ్వంసకరము.
భరత వంశాచార్య పట్టివై లోక । భరిత మాన్యుండవై బ్రాహ్మణోత్తముఁడ
వై యమలాత్ముఁడవై వేదవేత్త । వై యెఱుంగక యేలయడిగితిదీని?
బలసి యెవ్వరితోడ యుద్ధంబు సేయఁ । దలఁచితి?" యనిన నత్తఱివాఁడు ననియె:
"పద్మపత్రాక్ష! శ్రీపార్వతీ వరద! । పద్మాలయానాథ! పాపసంహార!
సరవి నాకిచ్చిన చక్రంబు చేత । ధరియించి నీసేవ తప్పకచేసి
నెలకొని పోరికి నిన్నియ్యకొలిపి । యలవడ గెలిచెద ననుచు వేడితిని.
లీల నీచక్రంబు లేకున్న నేమి । వాలాయముగ నిన్ను వరభుజ బలిమి
కడిమి యుద్ధము సేయఁగలవాఁడ." ననిన । నెడపక నవ్వుచు నేనియ్యకొంటి.
అనఘాత్మ, యమ్మహాహంకారమునకు । ననిశంబు కారణంబైనట్టి బ్రహ్మ
శిరము చేతను భీమసేనుండు మిగుల । ధరణి నొవ్వకయుండఁ దగఁ బోవవలయు."

## ధర్మజార్జునులఁ దోడ్కొని కృష్ణుఁడశ్వత్థామమీఁదికిఁ బోవుట

ననిచెప్పి సహదేవు నాశినివరుని । ననయంబు శిబిరంబు నందుండఁ బనిచి
రవికోటి సంకాశ రత్నశోభితము । వివిధాయుధవ్రాత విభవంబునైన
నలలితరథమున *సైన్యసుగ్రీవ । ములు మేఘపుష్పకంబును వలాహకము
నను నామములు గల యశ్వరత్నముల । ఘనముగాఁ బూన్పించి గరుడకేతనము
పరవొప్ప నెత్తించి వెసనొగలెక్కి । పరఁగ ధర్మతనూజుఁ బార్థుని రథము

* మాన్యరథమ్మున-సైన్యసుగ్రీవమ్ము, లను మేఘపుష్పవలాహకముల — పూన్పించి. ఆది. తిక్కన. భా. సౌ. 2—51

వరుసతో నెక్కించి వాయునందనుఁడు । పరఁగుతిఁ జనిత్రోవనె పోయిపోయి
భీమసేనుని గాంచి ప్రేమతో నతని । నేమించి నిలుపంగ, నిలువక యతఁడు
తెలియ భాగీరథీ తీరంబునందు । నలలిత విస్ఫూర్తి సంయముల్ గొలువ
నక్షత్రములలోని నలినారి పోలె । నక్షీణగతినున్న వ్యాసునిఁ జూచి,
యచ్చోటికరుగక యంతరంగమున । మచ్చికతో మ్రొక్కి మసలకపోయి
కెలఁకులు వరికించి గిరులు శోధించి, । పొలుపొంద వనములుఁ బొందుగాఁ జూచి,
ఘనతపో విభవంబు గైకొని భూతి । తనువున నందఁది [1]సుస్థైర్యంబు గలిగి
నలిమీఱఁ బద్మాసనమునఁ గూర్చుండి । యలవడ నున్నట్టి యాద్రోణిఁ గాంచి
మగఁటిమి దీపింప మహనీయ మహిమఁ । దగిలి చాపము గుణధ్వనిచేసి యార్చి,
"యోరి పాపాత్మక! యోరి దుర్మార్గ! । యోరి విప్రాధమ! యుగ్రత మీఱి
మఱి నిద్రచే నొడల్ మఱచినవారిఁ । దఱలక వే చంపి తాపసి వైతి.
ఈవిధంబున మూల నిట నొదిఁగినను । జావు తప్పునె! లెమ్ము చాలుఁ దపంబు."
అనియిట్లు కఠినోక్తులాడిన, ద్రౌణి । విని కోపమున వానివెనుక నేతెంచు
హరి ధనంజయులను యమతనూభవునిఁ । బరిపరి విధములఁ బరికించి చూచి
తెలియ దివ్యాస్త్ర వేదిత్వంబు మదిని । దలపోసి తలపోసి తలఁకి యంతటను
రాజితబ్రహ్మశిరంబను శరము । నోజతో వహియించి యుజ్జ్వలలీల
నపుడ యపాండవంబన చు నేయుటయు । విపరీతగతిమిన్ను విశ్వంభరయును
నిండినమంటలఁ నెఱయఁబ్రహ్మాండ । భాండంబు తానమై పరగినఁ జూచి
హరిహయసుతుతోడ హరియిట్టులనియె : । "సురరాజనందన, శోభితా,
యిదిబ్రహ్మశిరము సేవిందుకుఁదగిన । విదిత శరంబేయ వెసనొండు లేదు
రాజిత బ్రహ్మశిరంబును నీవు । నోజతో నిప్పుడేయుము శీఘ్రవృత్తి."
ననుచు సర్వేశ్వరుం డాదిదేవుండు । వనజదళాక్షుండు వాసుదేవుండు
తనకానతిచ్చిన, ధవళవాహనుఁడు । గొనకొని లోలోన గురునకు మ్రొక్కి
యరదంబు డిగ్గి పాయక సమంత్రముగ । శరము చాపంబున సంధించి యపుడు
'క్షితిలోన ద్రౌణికిఁ గీడొందకుండ । నతులితంబుగ వలె, నటు మత్సహోద
రులకు శుభంబును రూఢిగఁ గలుగ । వలయుఁ గావుత' మని వరభక్తియుక్తి

---

1, సుస్థిరమున నిలిపి (క)

అశ్వత్థామార్జునుల బ్రహ్మశిరోనామకాస్త్రము లొండొంటిఁ దాఁకుట

వలనుగా నస్త్రదేవతలకు మ్రొక్కి । జలజనాభునకును జయ్యన[1] మ్రొక్కి
శరము శరమ్మునే సమయించుఁ గాత । మిరవొందఁగా నని యేయంగ నదియుఁ
గల్పాంతహేతియై కల్య కృశాను । కల్పమై నెగడి యాకాశంబు తాన
యగుచు నాభీల భయంకర స్ఫూర్తి । నిగడి యశ్వత్థామ నిపుణశరంబుఁ
గ్రమ్మఱఁజేయఁగ, నది కడు రభసమున । నమ్మహాశరముపై నడరిన రెండు
శరములుఁ బోరెఁ; దత్సమయంబునందు । సరసిజాప్తుఁడు మాసె; జగములు వణఁకె;
జలధులు కలఁగె; నక్షత్రముల్ రాలె; । కులగిరు లూటాడెఁ; గూర్మంబు[2] మునిఁగె.
అప్పుడు ధర్మాత్ముఁడగు నారదుండు । తప్పక భక్తి వేదవ్యాసమునికి
నలవడ సన్నిధియయ్యె; నాటయును । దలకొని యతఁడు నితండును గూడి
యతి భయంకర మూర్తులై యున్న ద్రౌణి । శతమన్యుతనయుల శమియింపఁ జేయఁ
దలఁచి శీఘ్రముగ నిద్దఱకును నడుమ । నిలిచి వారలు విన నెమ్మినిట్లనిరి:
" పాపాత్ములార ! యీపటుదివ్యశరము । లేఘనమైఁ దొంటి వారేసిరే యకట !
ఇట్టి క్రూరత్వంబు నిట్టి దుర్గుణము । నిట్టియవజ్ఞత యిది తగునయ్య ?"
అనవిని యర్జునుఁ డప్పుడా దివ్య । ఘన శరవహ్ని యుల్కల మధ్యమునను
గారుణ్య ధర్మరక్షకులు సమాధి । ధీరులు గురుపుణ్య దేహులు నైన
యామహాత్ములఁ జూచి[3] యప్పుడిట్లనియె : । "ఓమహామహులార, యోపుణ్యులార,
యాశఁ జేసినయట్టి యస్త్రంబునకును । ఈశక్తి నీయస్త్రమేయంగ వలసెఁ
గాని యొండొకబుద్ధిఁ గాదు; మీరిపుడు । మానుపుఁడేనున మనుగిడింతు దీని.
శరము తీవ్రమ్ముగా సమయింపకుండఁ । గరుణతోఁ దుత మమ్ముఁ గావుఁడీ వేళ. "
ననుచు దివ్యాస్త్ర మయ్యమరేంద్రసూతి । యొనర నస్త్రమలీల నుపసంహరించె.
మెచ్చిరమ్మునులు నామిహిరప్రతాపు, । సచ్చరిత్రుని సవ్యసాచిఁ గడంగి.
విను కౌరవాధీశ, విజయుండు దక్క । ననుపమ దివ్యాస్త్రమది మగిడింప
జగతిలో నొరులకు శక్యంబుగాదు. । వగచెడి యిదిగాక వారించెనేని
యొనరంగ నట వారి యుత్తమాంగంబు । పనివడి ద్రుంచు నో పౌరవనాథ!
అదిగాక మునుల మాహాత్మ్యమంతయును । మదిలోన ద్రోణిసమ్మద మొప్ప నెఱిఁగి

1. నెఱిఁగి. 2. వణకె. 3. అర్థిని. (చ)

తెలివితోడుతఁ దన దివ్యశరంబు । [1] నెలకొని లోకముల్ నిండి కాల్పంగ
నాక్షణంబున నమ్మహాస్త్రంబు ద్రోణి । యాక్షేపించి యుపసంహరింపంగ నపుడు
తలపోసి తలపోసి ధాత్రిలోఁ దనకు । వలనొప్ప నెంతయు వశముగాకున్న
దీనభావంబున ధృతియెల్లఁ దఱిగి । పూని పరాశరపుత్రునిఁ జూచి,
"మునినాథ, వినవయ్య మును కొని వాయు । తనయుండు ధర్మంబుదక్కి రారాజు
నూరు భగ్నముచేసి [2] యును దలదన్ని । నారూఢి నందుకై యలుక దీపించి
యేనంత చేసియు, నీయెడనుండి । భానుసన్నిభ తేజ, ప్రాంభయమునఁ
జెలఁగి వివేకవర్జితుఁడనై కడఁగి । చలమున నిమ్మహాశరము నేసితిని.
అనఘ, దీనికిఁ బాపమైనఁ గానిమ్ము । మునుకొని." యనిన నమ్మునినాథుఁడనియె :
"వినుము నీజనకుఁడు విజయుని మీఁది । ఘనవత్సలత పెచ్చెఁ గడక నీశరము.
వరమతి నమ్మోఘవరుఁడును నీకు । ధరణిలోపలఁ గీడుదలఁపఁడు; నీవు
శరము శమింప నస్త్రము ప్రయోగించె; । నురువడిఁ గాదన్న నుపసంహరించె.
అడరంగ నస్త్రవిద్యాప్రభావమున । నడినన్న కవ్వడిఁ జంప నీవశమె !
ఈ [3] తఱి నీయస్త్రమిప్పుడు నితని । చేత వారితమయ్యెఁ జెప్పెద వినుము.
మఱియు నీయస్త్రంబు మనుజులమీఁద । నఱిముఱి నేసిన నశుభంబు నొందు.
తడయక కొక్కనిమీఁదఁ బ్రయోగింపఁ । బడి మఱి యన్యుని పటుతరాస్త్రమున
శమియించెనేని యీ జగతిలోపలను । రమణ [4] ద్వాదశవత్సరము లనావృష్టి
దోషంబు తొడరును దుది; నదిగాన । భాషలేటికి నిన్ను బొందు నూనలను
నెమ్మి నీదేశంబు నెఱయ రక్షింపఁ । గ్రమ్మఱఁ దలఁచి నిక్కముగఁ జెప్పితిని.
మచ్చికతోడుత మహిఁ దపంబునకుఁ । జొచ్చినవాఁడవు శుచివి గమ్మింక ;
ఒఱవు దీఱఁగ దీని నుపసంహరింపు; । మెరవు సేయక మది నీర్ష్యనుమాను.
మన మొప్పఁగా నధర్మంబున జయము । గొన నొల్లనట్టి ఫల్గునుఁడును బ్రీతుఁ
డై పోవవలయుఁ జయ్యన భవదీయ । రూపితంబైన శిరోమణియిమ్ము.
ఎలమితో నిచ్చిన నీ పాండుసుతులు । సలలిత విస్ఫూర్తి సంతసిల్లుదురు ;
ఇది సంధిమార్గ మిట్లొనరింపు నీవు । మద మేల ?" యనిన నుమ్మలికంబుతోడ
ద్రోణి పరాశర తనయు కిట్లనియె: । " త్రాణతోడుతఁ బొందుతనయుల కర్థిఁ

1. ఒలసి యాక్షణమున నుపసంహరింపఁ – దలపోసి (చ) 2. యుద్ధతిఁ దన్నె (క) 3. రీతి.
4. వరుణ. (క)

బరికింప నెంతయు భ్రాంతియె మణులు । పరఁగఁ గౌరవనాథు భండారమెల్లఁ
గైకొన్నవారు చక్కఁగ విను మనఘ! । ప్రాకటంబుగ సర్పభయమును జోర
భయము దానవదైత్య భయమును దేవ । భయము నిద్రారోగభయమును [1] బొరయ
నట్టి యీదివ్యమహామణి యీయ । నెట్టనంబుగ నేర్తు నే మునినాథ!
ధరణి నీవాక్యంబు దాటంగ [2] రాదు; । అరయంగ నీకుఁ బ్రియంబుగా దీని
నర్పించితిని; మదీయాస్త్రంబు కడిమి । నేర్పుతోడుతఁ [3]బాండు నృపజాతరాజ
పాత్రగర్భములకు బలిమి దీపించి । చిత్రంబుగా హానిచేసి సంతుష్టిఁ
బొంది తాను బ్రశాంతి పొందునుగాక । పొందుగా." ననిన నమ్మునిపుంగవుండు:
"నొనర నశ్లేసేయు మొక్కటి [4] యందుఁ । బనివడి నీపాపపడకుమీ" యనినఁ
బలుకులువినియు నప్పలుకు తప్పంగఁ । గలవడ ననుమతిగాఁగ భావించి
"ఘనత మీఱంగ సర్వగర్భ విధ్వంస । మొనరఁ గావింతు నిజోన్నతి" ననుచు
మనలకెంతయుఁ దనమది నిశ్చయించి । 'యసదృశ విస్ఫూర్తి నస్త్రై చేసెదను
వదలక' యనిపల్కె; వారిసంవాద । మదనుగా శ్రీకృష్ణుఁ డాత్మలో నెఱిఁగి
"యక్కటా! వీఁడు సంయమివరుమాట । తక్కక గీటునఁ దగఁ బుచ్చితనదు
వలసినట్టులుసేయువాఁ డాయె నేని । తొలఁగకీ కిల్బిషాత్ముని సేఁతలకును
బరికింప నే నడ్డపడి చూతుఁగాక । పురణింప నూరకపోనేల యిత్తు."
నని వితర్కింపంగ నంతవ్యాసుండు । ఎనయ నశ్వత్థామ హృదయమెఱింగి
హరి జనార్దను కృష్ణు నచ్యుతు మాట* । విరివిగా మనసున వినఁగోరి యపుడు
ఊఱకయున్న, నత్యుజ్జ్వలమూర్తి । శౌరి యశ్వత్థామఁ జర్చించి పలికె:

## శ్రీకృష్ణుఁ డుత్తరగర్భంబు దగ్ధంబుగాకుండఁజేయ నిశ్చయించుట

"పాపకర్మంబునఁ బాండు [5]పౌత్రులను । మాపుమాపితి వీవు; రూపింప గర్భ
ములు దునిమెదవు నమ్మదితుండ వగుచు; । తొలఁగింపు మొక్కటి దుర్దాంతముదుగు.
జగతిలోఁ బాండవ సంతతి కోకని । నగణిత క్రమశక్తి నలరంగ నిత్తు

---

1. బొరయు. (క) 2. జాల. 3. పాండుతనూభవులపౌత్త్రి గర్భములకు (చ) 4. కందు. (క)
5. పుత్రులను (క)

* యొక్కింతయును వినఁదుచితంబుదక్కి. । యనుచు నాశౌరి చయ్యన వారికడకుఁ
జనియున్నచో, నంత సంయమీశ్వరుఁడు । గరిమ ననేక మార్గమ్ములఁ దెలుప. (క)

దానధర్మంబులఁ దనరుయాగములఁ । బూని చేసెదువానిఁ బుణ్యప్రభావు
నెఱి నట్టి గర్భంబు నిలుచుఁ దక్కనవి । మఱియును నీయస్త్రమున దహింపంగఁ
జేయుము నీ" యనఁ జెలఁగి యాద్రౌణి । పాయక రుక్మిణీపతికి నిట్లనియె:
"పనివడి నీవిట్లు పక్షపాతమున । వెనుకొని పలికెదు వీఁకిఁ గాను.
చెలఁగి యే నట్లేల సేయుదు వినుము. । కలగొన నుత్తర గర్భంబు నీవు
సొలవక రక్షింపఁ జూచెదవేని । చలముతో దానినే సంహరించెదను
కావలె." ననిన నక్కంజనాభుండు । భావజజనకుఁ డుద్భటవృత్తిఁ బలికె:
"తిరముగా నభిమన్యు తేజంబు మాన్య । [1]తరమయి యిప్పుడుత్తరగర్భమందు
నున్నది; దాని [2]నత్యుగ్రతతోడఁ । గ్రన్నన దునుముట గలిగె నేనియును
వానికాయువు నిత్తు వరశక్తి పేర్మి । భూనుత సత్ప్రభాస్ఫూర్తి యొప్పార."
ననిన నశ్వత్థామ యంబుజనాభుఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప:
అతులితఖ్యాతి మదస్త్ర విదగ్ధు । బ్రతికించినను మహాభాగ్యంబు గాదె!
ఎఱిఁగెద నదియు నే నెందుఁబోయెదను । అఱలేక." యనిన నయ్యంబుజోదరుఁడు
అతనిఁ గనుంగొని యర్థి దీపించి । వితత వాగ్వైఖరి వెలయ నిట్లనియె:
"వినవయ్య యోద్రౌణి, విశదంబుగాఁగ । జననుత విజ్ఞాన సరస త్రికాల
వేదియయిన యొక్క విప్రోత్తముండు । ప్రోది నుపప్లావ్యపురి కేఁగుదెంచి
సతియైన యుత్తరఁ జతురుఁడై చూచి । క్షితిఁ బ్రాణములు పరిక్షీణంబులైన
పుత్త్రుఁడుట్టఁ గలండు పుణ్యవంతుండు । చిత్రవైఖరిఁ బరిక్షిన్నాముఁ డగుచుఁ
బొందుగా" ననుచు నా భూసురోత్తముఁడు । నందితుఁడై వల్కె నాతిముందటను.
అతని సద్వాక్యంబు లమృతముల్ గావు; । కృతమతి బాలుండు కీర్తిమంతుండు
గరిమఁ 'బాండవవంశ కరుఁడని' చెప్పి । పరువడిఁ బలికి కోపంబావహిల్ల
"బాలఘాతివి. నీవు పరఁగ నన్నంబు । నాలోన దుర్లభంబగుచు సహాయ
రహితుండవై కుంది రక్త దుర్గంధ । సహజ [3]ప్రసిక్త హస్తములు గాన్పింప
నిలలోన మూఁడు వేలేఁడులు తిరుగు. । చెలఁగి నాచే సురక్షితుఁడైన యట్టి
యక్కుమారుండు కృపాచార్యు వలనఁ । దక్కక యెంతయు ధనువభ్యసించి
సకల దివ్యాస్త్రముల్ చాలంగఁ బడసి । ప్రకటిత విఖ్యాతి బహు వత్సరములు

1. దరమయ్యె నిప్పు. 2, నత్యుగ్రతంబుగను. (క) అత్యున్నతంబుగను (చ) 3. ప్రసిద్ధ.(క)

బలయుతుఁడై భూమిఁ బాలింపఁ గలఁడు. । మలయక చూడుమీ మత్తపస్సత్య
మహిత ప్రభావముల్ మఱుక్కవ." ననినఁ । దహతపహ వ్యాసుండు ద్రౌణికిట్లనియె
"ధారుణీసురుఁడవై దయలేక మిగులఁ । గ్రూరుండవై తివి కుటిలాత్మ, నీవు.
ఈ రాక్షసారాతి యేరీతిఁ బల్కె । నారీతి నగుము నీ." వని శపియించె.
శపియించుటయు ద్రౌణి సంయమిఁ జూచి । [1]నిష్ఠురోక్తు లాలయుఁగ నిట్లని పలికె :
"రమణతో నన్ను అక శపించితివి; । కొమరొప్పఁ బెద్దలకును దగునయ్య !
అందు కేమాయె సంయమివర్య, నిన్ను । బొందుగా శపియింతు బోరన వినుము.
పుణ్యలోకమునకుఁ బోక యీధరనె । గణ్యుండవై యుండు గాంభీర్యమహిమ.
ఎలమి దీపింపంగ నేను సిక్కుడనె । పలుకు లేటికిఁ జరింపం గలవాఁడ.
పరఁగ నీబూమెలబయకాఁడు ముచ్చు । హరి నీవు సత్యాత్ము లైనఁ గానిమ్ము
మాటలే" లని శిరోమణి పాండవులకు । గాటంబుగా నిచ్చి ఘనతపోవృత్తిఁ
జనియెఁ; బాండవులును జక్రపాణియును । మునిశిఖామణికిని మ్రొక్కి 'యో వ్యాస !
పనివినియెద' మని భక్తితోఁ [3]జెప్పి । కనుఁగొని యా రత్నకలిత ప్రకాశ (?)
మైన రథంబెక్కి యాప్రొద్దె కదలి । జానొప్పఁగా నిజ సదనంబు చేరి
యరదంబు డిగ్గి యయ్యబలఁ బాంచాలి । నరుదారఁ గనుఁగొని యాసీనులగుచుఁ,
దలఁకొని ధర్మనందనుఁడు తన్ననుప । వలనుమీఱంగ నవ్వాయునందనుఁడు

## భీమసేనుఁ డశ్వత్థామ శిరోరత్నము ద్రౌపదికిచ్చుట

మసలక దేవి కమ్మణి సమర్పించి । "కుసుమకోమలి, విను గురుతరస్ఫూర్తిఁ
బరఁగిన విమతుని పని చక్కనయ్యె; । సురుచిర విఖ్యాతి శోకంబు మాను.
పనివడి జనపతి పనుపఁ గేశవుఁడు । పౌనరంగ సంధికిఁ బోయెడు నాఁడు
పెనుపొంద నీవు చెప్పినమాటలెల్ల । మనమునఁ [4]దలఁపు ముమ్మలికంబువలను.
పదపడి యనిలోనఁ [5]బగవారెదిర్చి । పొదవి చెండాడక పువ్వులకోల
చాతురే? ధృతరాష్ట్ర జనపతి సుతుల । నూతన శ్లోకంబు నూల్కొన్న యతని
కులమునఁగలుగు పుత్రుల నెల్లఁబట్టి । పొలియించి మించితి భుజబలప్రౌఢి
హరి కృపా గరిమయు నర్జును ప్రాపు । కరమొప్ప విరివిగాఁ గలిగిన కతన.

---

1. అపుడు ద్రోణాత్మజుండర్థి నిట్లనియె. (చ) 2, లనఁగ. 3. మ్రొక్కి. (చ) 4. నిలుపు.
5. పగవారు పేర్చి (చ)

విగతభయుండనై విబుధులు పొగడ । నగణిత విస్ఫూర్తి నా దుస్ససేను
రుధిరంబు ద్రావితి రూఢి పెంపొంద । నధికుండనై వాని యగ్రజు తొడలు
వడి నుగ్గుచేసి యూర్వర చలింపంగ । దడయక మకుటంబు దన్నితి నంతి!
మును కొన్న సంతోషమున కిది వేళ । పనివడి దుఃఖింపఁ బాడియే నీకు?
అరయంగ గురుపుత్రుఁడగుటఁ బ్రాణంబు । హరియింపఁ జొరక పాయని సిగ్గుపుచ్చి
తెలివిఁ జూడామణి తెచ్చితి; మింక । వలను మీఱఁగ ధాత్రి వైరియన్ పేరు
లేకుండఁ జేసి బల్లిదుఁడు ధర్మజుఁడు । ప్రాకట కీర్తి సంపన్నుఁడై మించె.
ఊరడిల్లుము చాలు [1]నుత్పలనేత్ర! । కూరిమితో నన్ను గొనకొని చూడు."
మని పెక్కుభంగుల ననిలనందనుఁడు । మనుజేశు వనుపున మసలి బోధింపఁ
గొంత సేపునకు నక్కోమలి తెలిసి । సంతోషమునఁ బొంది సరగున లేచి
పద్మబాంధవ నిభప్రభ మీఱి యున్న । పద్మరాగపుమణి వరఁగంగఁ జూచి
యమతనూజాతుని సందంద చూచి । ప్రమదంబు దీపింప భామాలలామ
పరగ దుఃఖంబును బాసి యెంతయును । 'ధరనిట్టి దివ్యరత్నము ధరింపంగ
నీతఁ డర్హుండని యిచ్చిన, నృపతి । యాతత విస్ఫూర్తి నది ధరియించి
యుదయరాగ సముజ్జ్వలోన్నత[2] మహిత । సదమల పూర్ణిమా చంద్రబింబమునఁ
బొలుపొందునట్టి యాపూర్వశైలంబు । పొలుపు వహించి యాపుష్పసుగంధిఁ
బ్రియమున మన్నించి పేర్మిదీపించి । నయమునఁ బవమాననందనుఁ దర్థి
గురుతనూభవుఁ[3] గనుఁగొనుట యాదిగను । బరఁగు వృత్తాంతముల్ భామకుఁ జెప్పి,
నలి మీఱఁ బాండవ నాశకంబైన । యల బ్రహ్మశిరము మహత్వమూహించి
వదలక మదిలోన వగచుచు మఱియుఁ । బదపడి కేశవ ప్రతివిధానంబు
నలవోక దెలిసియు నంతరంగమునఁ । జెలఁగి [4]యెట్టులొయని చింతించుచుండె.
ఉత్తరాంగన గర్భమొక్కటి దక్క । నత్తఱిఁ బాండు ధరాధి నాయకుల
కులవధూమణులలోఁ గురుకులాధీశ, । యలవడ నొక్కర్తుకైన గర్భంబు
ధరలేకయుండె; నుత్తర గర్భమునకుఁ । బొరి విఘాతము సేయఁ బుండరీకాక్షుఁ
[5]డఱలేక ద్రౌణితో నాడు వాక్యములఁ । దఱలక యస్త్రవేదన లేకయుండఁ
దనచిత్తవృత్తిని దయ పెంపుమీఱి । యొనరంగ నిలిపెఁ గావున నవ్విశేష

1. సుజ్జ్వలనేత్ర. (చ) 2. మహిమ. 3. నొలి. (క) 4. యట్లొనని, 5. డభిమానమునఁ గాచెనర లేక యొవరు – రభటి...(క)

మభిమన్యువల్లభయాదిగా నెవరు । రభటి నెఱుంగ సర్వార నటులుఁడె.
తలకొని వగచుచు ధర్మనందనుఁడు । జలశాయిఁ గనుఁగొని చయ్యనఁ బలికె:
" జలజాక్ష, బలమును శౌర్యసంపదయుఁ । గల ద్రౌపదేయుల ఖండించి శిక్ష-
గలుగు పాంచాలుర ఘనులఁ బెక్కండ్రఁ । గలఁగఁ జెక్కఁజెఱచెఁ గదా నద్భుతంబు.
ధరలోన నిట్టిప్రతాపియుఁ గలఁడె? । హరిపరాక్రముఁడు ద్రోణాచార్యసుతుఁడు;
ఇట్టి ప్రభావంబు నేరీతిఁ బడసె? । నెట్టన నెఱిఁగించు నీరజాక్ష ?"
అనిన మురాంతకుఁ డాధర్మరాజుఁ । గనుఁగొని పల్కె వేడ్కలు తొంగలింప:

## కృష్ణుఁడు ధర్మజునకు శివప్రభావంబెఱిఁగించుట

" వినవయ్య ధర్మజ, విదితచారిత్ర, । కనకాద్రి సమర్థ చక్ర కమలాప్తనేత్ర,
శంకరు సర్వేశు శాశ్వతు నభవు । శాంకరీ ప్రాణేశుఁ జంద్రార్ధజూటు
భూతనాయకు భక్తమునిజనరక్షుఁ । జేతోజ సంహారు శివు ఖండపరశు
భక్తవత్సలు భర్గుఁ బరమేశు నీశు । ముక్తిప్రదాయకు ముక్కంటిఁగొలిచి
యొకరుండె యధికుఁడై యుజ్జ్వలస్ఫూర్తి । ప్రకటించి యీరీతిఁ బగదీర్చె వినుము.
నగజాధినాథుండు నాగభూషణుఁడు । తగఁబ్రసన్నుండైన, దైవతాధీశు
నైన గెల్వఁగ నోపునట్టి దర్పంబు । పూనికతో నిచ్చు భువనంబు లెఱుఁగ;
ఎనయ నీ కొంచెపుటీగి చోద్యంబె! । వనజాప్త శశధర వహ్ని నేత్రుండు
సర్వేశ్వరుఁడు భూతసమితి జనింప । నుర్వర నిలుపంగ నుక్కణఁగింపఁ
జేయు నాతఁడు చంద్రశేఖరుఁ డచల । సాయకాసనుఁడు నిశ్చలుఁ డగమ్యుండు.
కౌరవనాథ, యకాలకంధరుని । మారసంహారుని మహనీయదివ్య
లీలలు చెప్పెద లెస్సగా నీకు, । తూలని భక్తియుక్తుండవై వినుము.
భూతసంచయ సృష్టి బుద్ధిఁ దలంచి । భూతేశుఁగన బ్రహ్మ ముదముతోఁ బోయి
తనదు వృత్తాంత[1] మత్తఱి నెఱిఁగింపఁ । దనరంగ నీశుండు తదభిముఖంబు
కరుణార్ద్రవాఱంగఁ గావింపఁ బూని । పరువడిఁ దపమొట్టి పనులకు నైనఁ
బ్రథమ సాధనముగాఁ బరికించిచూచి । ప్రథితాంబువులలోఁ దపంబాచరించె.
అంత నాధాతయు నద్దేవు రాక । వంతంబుతోడుక బహు సహస్రాబ్ద
ములు చూచి మఱియుఁ దపోమహామహిమ । కొలఁది మీఱంగ దక్షుని సృజియించి

1. వంతయు. (చ)

యతని నాలోకించి "యనఘాత్మ, ప్రజల । మతిగల్గి పుట్టింపుమా" యని యనుప,
"భారతీ నాయక, పాపసంహార, । నీరజాసన, దేవ, నిగమాంతవేద్య,
పెనుపొంది ధాత్రిలోఁ బెద్దవారౌదులు । ఎనయు లేరైరేని సృజియింతు" ననినఁ
బరమేష్ఠి యిట్లనుఁ "బరమేశ్వరుండు । గురుజలతర నిమగ్నుండైనవాఁడు ;
నేనియోగించెద నింక సృజింపఁ । బూనుము పెద్ద యీ భూమిలో లేఁడు."
అనవుడు నౌఁ గయనుచు దక్షుండు । ఘనతరంబుగ దైవగణమును దైత్య
మనుజ పన్నగపక్షి [1] మహిషాది జంతు । జనిత భూతంబుల సనడిమైనంతఁ
బుట్టించుటయు నవి బోరన నప్పుడు । ధట్టించి యాఁకటఁ దక్షు భంజింపఁ
గవిసిన, భయమంది కంజజుకడకు । నవిరళగతిఁ బోయి యర్థి నిట్లనియె :
"వారిజాసన, భక్తవరద, లోకేశ, । భూరి భూతంబులు [2] పొదువక యుండ
నీతతి నీవాఁగి యీభూత [3] తతికి । ఖ్యాతి నాహారంబు గల్పింపు." మనిన
నవుఁగాక యని బ్రహ్మ యాక్షణంబునను । దివిరి యోషధులును దృణలతాగుల్మ
వృక్షసంతతులును వేవిధంబులుగ । నక్షయ కందమూలాంబు పర్ణములఁ
గరుణ నాహారముల్ [4] గాఁగఁ గల్పించి, । ధరణి సద్బలభూతతతికి దుర్బలుల
నాహారములు గాఁగ నజుఁడు సేయుటయు, । బాహుబలంబునఁ బ్రబలి భూతములు
రమణ సంతాన పరంపరల్ వలన । సమధిక తేజులై చరియింపఁదొడఁగి ;
రంత సర్వేశ్వరుం డాదిదేవుండు । కంతుహరుఁడు పెద్దకాలంబునకును
వచ్చి, భూతంబుల వలనొప్పఁజూచి । చెచ్చెరఁ గోపించి శీఘ్రంబుగాఁగ
నిజలింగమును బుచ్చి నేలఁబెట్టినను, । అజుఁడు ప్రశాంత వాక్యముల నయ్యభవుఁ
జేరంగఁజని "యేలచేసితివిట్లు? । మేరుకోదండ, సమిద్ధకారుణ్య,"
యనుడు "భూతంబులనది సృజించుటకు । ఘనముగాఁగాక [5] లింగము తనకేల?"
యనియేఁగి మాల్యవంతావనీ [6] ధరము । కనయంబు చని యంత నగ్గిరిమీఁద
జననుత ధ్యాననిష్ఠావృత్తిఁ దపము । పెనుపొందఁ గావించెఁ బెద్దకాలంబు.
అంతలోఁ సురలు మహాధ్వరంబొకటి । యెంతయుఁ జేయంగ నిచ్ఛలోఁ దలఁచి
యాగసంభారంబు లన్నియుఁ గూర్చి । యాగమోక్తక్రియ నగ్నిసంధించి
మారసంహారుని మహనీయ మహిమ । నారూఢి నెఱుఁగమి నమ్మహాత్మునకు
గౌరవంబున భాగకల్పంబొనర్ప । రైరి ; దాని నెఱింగి యభవుఁడీశ్వరుఁడు

1. మహిషాది. 2. పొదలక 3. పతికి. 4. గా సమర్పించి. (క) 5. లింగంబు దలంకె. 6. రథము. (క)

## రుద్రుఁడు దేవతలు సేయు యజ్ఞము చెఱుచుట

బాలార్క సన్నిభ ప్రభా తేజరిల్ల । నాలోలతర దీర్ఘమైనట్టి విల్లు
సృజియించి దానికి శింజినీప్రముఖ । విజయాంగకమ్ముల వేగసర్చించి
కోపమగ్గలముగా ఘూర్ణాయమాన । చాపుఁడై చనుదెంచె జన్నంబుకడకు;
ధృతిచెడి వసుమతి దర్దరఁ దిరిగె; । తతమహీధరము లుద్ధతిఁ బెల్లగిల్లె;
సప్తసాగరములు సలసలఁ గ్రాఁగె; । సప్తాశ్వరుచి మాసె; జగములు వణఁకె;
గ్రహతారకంబు [1]లుగ్రంబుగా వ్రాలె; । తహతహపడి భూతతతి పెల్లగిల్లె.
అప్పుడు కోపించి యంధకారాతి । తప్పక క్రతువు డెందము గాడ నేయ
నదిమృగంబై యాహుతాశనుతోడఁ । బవపదమని చీరి పాఱిపోయినను
జెదరి దేవతలు నిశ్చేష్టితులైరి. । వదలక యంతట వామదేవుండు
పొదలంగ సవితృని భుజములుఁ బూషు । రదనముల్ భగుని నేత్రంబులుఁ దునియ
నేయంగఁ దొడఁగిన, నిటసురవరులు । నాయెడ యజ్ఞాంగకావలితోడఁ
గూడఁ బాఱిన, వారి గురుతరస్ఫూర్తిఁ । బ్రోడమై కోదండమున వాఁగి యాఁగి
పయనొల్లక రుద్రుఁడివ్విధంబునను । బాయక పొదిపినఁ, బసచెడి సురలు
"శరణు సర్వేశ్వర, శాంభవీరమణ, । శరణు హాలాహల సంహారకార,
శరణు భాస్కరవహ్ని శశధరనేత్ర, । శరణు భూతేశ్వర, చంద్రావతంస,
శరణు మృత్యుంజయ, శర్వ, సర్వజ్ఞ, । శరణు మూఢులము ప్రసన్నుండ వగుము
నేమెంతవారము నిన్ను దర్శింప? । నేమెంతవారము నీతత్త్వమెఱుఁగ?
నేమెంతవారము నినుఁగొనియాడ? । సామగానప్రియ, సర్వేశ, యీశ!"
అనుచుఁ బ్రార్థించిన నాత్మకోపంబు । మనసిజహరుఁ డుచ్చి మడుఁగునవైచి
తనరంగ సురల నాదరమునఁ జూడ । ననలమై [2]యింకించె నది యంబువులను.
గొనకొని సవితృనకును బూషునకును । ఘనముగా భగునకుఁ గరములు దంత
ములు నయనంబులుఁ బొందుగా నొసఁగి । యొలమితో యాగంబు నెప్పటియట్ల
చేయుఁడు మీరని శ్రీమహాదేవుఁ । డాయెడఁ బ్రీతితో నానతిచ్చినను
దేవతలెల్ల సద్దేవదేవునకు । భావజహారునకు బరమేశ్వరునకుఁ
గరమొప్ప యాగభాగంబు కల్పింపఁ । బరితోషమునఁ బొందె; పరఁగ నద్దేవు

---

1. ఉగ్రంబుగా. (చ) 2. కీలిఁజే. (క)

దివ్యలీలలు మహాదివ్యముల్ భువన । భవ్యముల్; మిగుల నాభవుఁడుకోపింప
నఖిలలోకంబులు [1] నస్వస్థకములు; । సుఖవృత్తి నాతండు సుప్రసన్నత్వ
కరుఁడైన శుభములు గలుగు లోకముల. । పరికింపఁగానట్టి పరమేశ్వరుండు
పరఁగంగ ద్రోణికిఁ బ్రత్యక్షమగుచు । వరమిచ్చెఁ గావున వడినొక్కరుండె
యగణిత క్రమశక్తి నందఱఁజంపె. । వగవంగఁ బనిలేదు వనజారివంశ!
కడఁక భీష్మద్రోణ కర్ణశల్యాదు । లడరిన నెదిరించి యమ్మహామహుల
ధరణిలోఁ గూల్చి యెంతయుధృతరాష్ట్ర । ధరణీశ సూనులఁ దద్దయుఁజంపి
తెలియంగ మీ మీ ప్రతిజ్ఞలు తీర్చి । [2] వెలసితి రెంతయు విధవంబుతోడ.'
అనియిట్లు గోవిందుఁ డా ధర్మరాజుఁ । బనివడి బోధించె భక్తితో." ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె నెంతయు విశదంబుగాఁగ
శ్రీధవ, కేశవ, చిన్మయాకార, । సాధిత దానవసంఘ, గోవింద,
[3] యిందుశేఖరమిత్ర, యిద్ధచారిత్ర, । మందర గిరిధర, మనసిజజనక,
అంజనాచలవాస, యచ్యుత, యజర, । యాంజనేయప్రియ, [4] హరిహర రూప,
ఘనమాని హృద్గేహ కలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
విరచిత సౌప్తిక [5] విపులపర్వమున । నరుదుమీఱఁగ ద్వితీయాశ్వాసమయ్యె.

1. నశ్వస్థకములు. 2. తెలసి రెంతేనియు. (క) 3. ఇందుభాస్కరనేత్ర. 4. హరివర. 5. విమల. (చ)

# ప్రథమాశ్వాసము



శ్రీ వేంకటాధీశ, సృష్టిప్రకాశ, । భావనాతీత ప్రభావ, సర్వేశ,
అలమేలు మంగాంగనా మనోహార (?) । తిలకించి విను దేవదేవ, విన్నపము.
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:
ధరణీశ, పుత్రశతంబు సైన్యములు । నిరవశేషంబైన నెఱి చెడి యపుడు
దొరకొని కొమ్మలు [1]మునుచు మ్రోడ్వడిన । ధరణీరుహంబు పోలె ధర [2]సంధనృపతి
చింతాభరంబునఁ జేష్టలు దక్కి । యంతంత వగచుచు నట మూర్ఛవోయి
కొంతసేపునకు డగ్గుత్తిక వెట్టి । యంతయుఁ దెలిసిన, ధృతరాష్ట్రుఁ జూచి
సూతజుఁ డిట్లను: "క్షోణీశవర్య, । యీతఱి వనరెద వెవరికిఁ గాఁగ ?
సుమహితాష్టాదశాక్షౌహిణీబలము । సమసెఁ; బితామహ [3]సఖి పితృ భ్రాతృ
పుత్ర భృత్యామాత్య బుధ గురు బంధు । పౌత్రాదులెల్లను బవరంబులోనఁ
బడిరి; [4]శోకింపఁగాఁ బనిలేదు వారు । ఎడపక యందులో నెవరైనఁ గలరె?
లలి నిట్టి దుఃఖమెల్లను గట్టిపెట్టి । చెలఁగి దేహమ్ము లస్థిరమని నమ్మి
యందఱి కొనరింపు మగ్నికార్యములు ! । పొందుగా విచ్చేయు భూనాథ !" యనిన
నమితశోకంబున [5]సంధ భూవిభుఁడు । క్రమమేది [6]ధృతి చెడి ఘన [7]చండపవన
పతితమై పడిన పాదపము చందమున । క్షితిఁబడి యేడ్చెను శిరము దోర్చుచును.
ఏమిచెప్పఁగ వచ్చు నిందువంశేంద్ర ! । ఆమహామహుఁడైన యాంబికేయుండు
పుత్రవర్గంబెల్లఁ బొలిసిన కతన । ధాత్రిపైఁ [8]బొరలుచుఁ దన్నుదా మఱచి
దీకొని యెవ్వరు తెలిపినఁ దెలివి । లేక యెంతేనియుఁ గ్లేశంబుతోడఁ
"పుత్రరత్నములార ! పుణ్యాత్ములార ! । చిత్రవిక్రములార ! శ్రీయుతులార !
చాతుర్య మందరాచల ధైర్యులార ! । నూతనమతులార! నుతగుణులార!
ఎక్కడఁబోయితి ! రేమి సేయుదును ! । దిక్కెవ్వరున్నారు తెలివితో నాకు ?
"[9]కన్నులు గానని కపతిని" విడిచి । యెన్నంగ నెచ్చటి కేఁగితి రింక !
అన్యులు పరికింప మార్గంబులేక । శూన్య భావంబునఁ జొప్పడవశమె !

---

1. మునిమి. 2. నంద. (క) 3. సఖ. 4. నిక్కంబుగా. 5. నంద. 6. మతి. 7. దండ (క)
8. బడియుండి. (చ) 9. 'కన్నులులేని కపోతి' అనికానోపు.

విరివైన తెక్కలు విఱిగినయట్టి । గరుడుని విధమున, ఘన తేజమెల్లఁ
జెడినసూర్యునిరీతిఁ, జెలఁగి బాంధవులు । పడిన సౌఖ్యములేని బ్రదుకేమి బ్రదుకు !
చనవొప్ప శ్రీహరి సన్నిధిగాఁగఁ । జనుదెంచి మిక్కిలి సామవాక్యములఁ
దెలిపె; శాంతనవుండు ధృతి నెఱిఁగించె ; । కలశసంభవుఁడును ఘనుఁడగు కృపుఁడు
విదురుండు హితవృత్తి వెలయంగఁ జెప్పె. । మొదలను జమదగ్నిముని యాదిగాఁగ
భువి మునులెల్లను బుద్ధులేర్పఱచి. । రవియెల్ల దుర్బుద్ధినైనట్టి నాకు
హితవులు గావాయె ; నెఱుఁగలేనైతి ; । మతిదప్పి యీరీతి మఱుఁగంగ వలసె.
పరఁగలోభంబునఁ బొందునిపాలు । నరయఁగాఁ జూచెదనను నాశనుండితిని.
[1]సుతులరండని పాండుసూను రాజ్యంబు । హితవొప్పఁగాఁ బంచి యీయకయున్న
నాకతంబునఁ జేసి నందనుల్ హితులుఁ । బ్రాకటస్ఫూర్తి దురంబులోఁ బడిరి.
పొలుపొంద లౌకికమున కెట్లు మనసు ॥ గొలుపు ? నప్పాండునికొడుకులు నన్ను
రక్షింప నేరీతి బ్రదుకంగ నేర్తు ? । నీక్షణంబునఁ బ్రాణ మిట విడిచెదను. ”
అనవిని సంజయుఁడపుడు భూవిభుని । మనసు శాంతముగాఁగ మఱియు నిట్లనియె :
“ శ్రుతులు శాస్త్రంబులు సుకృతవైఖరులు । మతిమంతులైనట్టి [2]మానులు చెప్ప
క్షితిలోన వినియును సృష్టీశ, నీవు । మృతికి దుఃఖింతువే మిన్నక యకట !
ధరణి ‘జాతస్య మృతంధ్రువ’ మ్మనుచు । నురువడి మ్రోయుచు నుండు వేదములు.
జగదీశ, తొల్లి సృంజయుఁడను నృపతి । యగ్గణితపుత్రశోకార్తుఁడై యుండఁ
జెలిమి నారదమౌని చెప్పిన [3]యట్టి । కలితేతిహాస, మాఖండలసూతి —
తనయుఁడీల్గిన ధర్మతనయుండు దుఃఖ । మునను గుందంగను మునుపు వ్యాసుండు
చెప్పినకథయెల్లఁ జెప్పితిఁ గాదె । తప్పక నీకు నో ధరణీతలేశ !
మునుపు సుహృజ్జనంబులు చెప్పినట్టి । వినుత వాక్యంబులు విననైతి ననుచు
నటు నీవె చెప్పెద వడలంగఁ దగునె ! । పటుగతి నీత భవునకు మంత్రు
లరయంగ దుశ్శాసనార్కజ శకును । [4]లిరవొందిరఁట ! మఱి యేమి చెప్పెడిది?
పరువడిఁ గొఱుకెనె పమఁగాని సుతుఁడు । హరిశౌర్య, బ్రదుకుఁ గార్యములకుఁ జొరఁడు;
నలిరేఁగి నీవు మాన్పఁగ నొల్ల వతని; । నిలలోన నింక నిన్నేమన వచ్చు !
పనివడి జన్ను దెప్పరపుఁ జోటునను । ఘనముగా నుండినఁ, గనుఁగొని తివియు

1. సుతుఁడు రమ్మని పాండుసూను సౌఖ్యంబు. (క) 2. మంత్రులు (చ) 3, యట్లు. (క) 4. లిరవు లున్నవె (క)

కడఁక నుఱుకు తిండికాఁడును బోలె । విడువక వడితిని విఱుగంగ నీవు.
గౌరవస్ఫూర్తిచేఁ గడచిన పనికి । నారయ వగచిన నయ్యెడిదేమి?
వాలాయ మిలలోన వగవు సద్గతికి । నాలమే? వగపేల భూపాలచంద్ర!
తానె చిచ్చుదగిల్చి దరికొన్నపిదప । దాని నార్పఁగలేఁ దైన్య మొందినను
అవనిలో నన్యుల [1] కాడఁ బట్టుగును; । [2]నివిడి భవ తృష్ణా నిష్ఠురాలాప
ఘన పవమానంబు గడువడిఁ బర్వఁ । బనవడు క్రీడి [3] కోపంబను వహ్ని
పాలైరి; వగవంగఁ బనిలేదు నీకు । నీ లోన." ననుచు ననేక భంగులను
బలికిన సంజయుపలుకులెంతయును । దలపోసి చెవియొగ్గి ధైర్యంబు నిలిపి

## విదురుఁడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు సేయుట

యంకిలి తేరు నయ్యంధ భూవిభుని । నంకించి విదురుఁ డిట్లను: "నేల నీవు
పొరలెదు? లేలెమ్ము; భూమిలోపలను । బెరుగుట ప్రగ్గుట [4] పిదపఁబుట్టుటయుఁ
దరమిడి నైజంబు; తప్పింపఁ దగునె! । బిరుసుల నైనను బిఱుసులనైనఁ
జంపుచోఁ గడవఁడు శమనుండు; నేర్పు । సొంపును లావును జూపి మాన్పంగ
రాదు; పోరునఁ గాని [5] రాదె పంచత్వ! । మాదట నెల్లవారవనిలోపలను
గసిమసిఁ దెగువారె కాకది గడవ । వసముగా; దీరీతి వగవంగ నేల?
అదియును గాక నీ యాత్మనందనులు । కదనంబు చేసి యాఖండలు కడకుఁ
జనిరి; [6] యాగంబుల సకల దానముల । ఘనతపో మహిమలఁ గనినట్టిగతుల
సరవి యుద్ధంబులఁ జచ్చినవార । లరిగిన గతికిఁ జయ్యన నరిగాపు
పెను పొంద నది గానఁ బితురు మాత్రాది । తనయాదు లెల్లను ధరణిలోపలను
పరికింపగ ఋణాను బంధరూపమున । గరిమతోఁ దుది ఋణక్షయమైనఁ జెదును.
నెఱిమీఱ [7] నిందెవ్వఱికి వగచెదవు? । మఱియును జవ్వనమును మహితరూపంబు
ప్రాణంబులును మహాద్రవ్యసంచయము । త్రాణతో నెను [8] ననిత్యంబులు గావె!
వగపేల యిందుకై వసుధాతలేశ? । వగవ [9] వివేకమా వసుధలోపలను?
తలఁకొని పండితోత్తము [10] లేల వగవఁ? । గలితపాండిత్యమ్ము గలసేకుఁ దగునె?"

---

1. కాట. (క) 2. కవగూడి యెంతయుఁ గఠినతతోడ. (చ) 3. కోపంబు సువహ్ని. 4. పెద్ద. 5. రాజా. (క) 6. దానంబుల. (క) 7. నిట్టిపనికి. 8. మ నిత్యంబు గావు.(చ) 9. వివేకమి. 10 లెల్ల (క.)

అని యిట్లు[1] బుద్ధి యయ్యంధభూపతికి । ఘనముగాఁ దెలిపినఁ, గడఁగి యవ్విభుఁడు
నలవడ నతని మొగంబుగా నిలిచి । “చెలువగు నీ సుభాషితముల వలన
ఘనతరంబైన శోకము డిందువడియె. । అనఘ, పండితులు ప్రియంబ ప్రియమ్ము
గని వస్తునాశయోగంబుల వలన । జనియించు మానస చటుల దుఃఖంబు
పుడమి నేమిటఁ జేసి[2] పొరయకుండు నొకొ? । తడయక యెఱిఁగింపు దయతోడ” ననిన
జనపాలకునిఁ జూచి సంజయుఁడపుడు । వినుమని చెప్పెఁ దద్వృత్తాంత మెల్ల :
“అనఘాత్మ, యీలోక[3]మర్త్యసారంబు । [4]ననఁటియట్టుల యని యట మమత్వంబు
చెందని పురుషుండు చెలిమి దీపించి । పొందుగా[5] శోకంబు పొందఁడు వినుము.
ఒకయింటినుండి వేఱొక గృహమునకు । వికటితగతిఁ బోవు విధమున, మఱియు
వస్త్రంబు విడిచి పావనవృత్తి నొందు । వస్త్రంబు గట్టిన వడువున నుండు
నురుతరంబైనట్టి యొడలు[6] దొఱంగి । తరమిడి యొండొక్కతనువు గైకొనుట.
కడఁకతో[7] సారెపైఁ గడవకై మంటి । నిడినచో విరియుట, యొలమిఁ బట్టంగఁ
జెడుటయు, వాని సుస్థితి నెత్తు నెడను । ఉడుగక ప్రయ్యుటయును, ఎత్తిదింప
నెడలుటయును, ఎండి యిడియుట, గాఱియు । నెడపకెంతయు నావమిడినఁ బోవుటయుఁ
జలముతో వాడిన[8] జనములచేతఁ । బొలియుటయును[9] బోలెఁ బొలియు దేహములు.
అదియటులుండె గర్భాధాన వేళ । మొదలఁ బిండావస్థ, మును,[10] ప్రసవమున
నరయ బాల్యంబున యౌవనంబునను । సరవితోఁ బ్రౌఢత్వ సమయంబునందు
భూపాల, వార్ధక్యమునను గర్మాను । [11]రూపమా నాశంబు రూఢితోఁ గల్గు ;
తిరముగా నిదియని తెలియంగరాదు ; । పొరిదమైఁ దమశమ సుకృతపాపముల
తెరువునఁ బోయిన దీనికి వగవ । సరవి[12]తోడుతఁ బ్రయోజన మేమిలేదు.”
అనిచెప్ప విని యంత నాంబికేయుండు : । “ఘనుఁడ, సంసారదుఃఖబహుళతయును
ఎనయఁ దద్గహనత్వ మెఱిఁగింపు.” మనిన । వెనుకొని రాజుతో విదురుఁ డిట్లనియె :
“పొరిది సక్తంబులై శుక్లరక్తములు । కరుడుగఁ గట్టి తక్కక యమేధ్యమున
సరవితో నెంతయు సంవృద్ధిఁ బొంది । వరమతిమైఁ గాలవశత నప్పిండ
మంగముల్గలిగి పాయక శిశువగుచు । సంగతి వెడలెడు సమయంబు నందుఁ

1. విదురుఁడ(చ) 2. పాయ. 3. మర్త్య. 4. ఎన నెట్టులన విని. 5. లోకంబు. (క) 6. పెరింగి.
7. సారెకుఁ గడవపై. 8. జలముల. 9. గల్గఁ బుణ్యదేహికిని. 10. బ్రసూతియును.(క) 11. రూపమై.
12. తోడఁ బ్రయోజనమ్మేమి.

బెనుపొందఁగా గాఢపీడల నొచ్చి । యొనరంగ మిక్కిలి యోనియొత్తులను
బడి యొకభంగి యేర్పడి వెలుంగఁ । బుడమి బాలగ్రహ భూతముల్ దొడఁగి
పట్టి ఘోరంబైన బాధలఁ [1] బెట్టు. । అట్టు జనించి పాయక మనుజుండు
పొలుపొంద బాలత్వమున నవివేక । [2] ముల శుచి నశుచియు నొగి సమంబగుచుఁ
జెలసి యొంతయు [3] జుగుప్సిత విధంబునను । జనవేది దుర్విచేష్టలఁ [4] జయించు.
భువిలోన [5] యౌవనంబును విషయాను । భవ దుఃఖకారియై పరగ నిందలకుఁ
దావలంబై యుండుఁ; [6] దగ వార్ధకమున । భావంబు వీఁకయు బలమును దఱుఁగఁ
బొలుపెల్లఁ దక్కి దుర్బుద్ధి వాటిల్లఁ । జలితేంద్రియములు [7] విశక్తతఁ బొంద
రుజ లుద్భవిల్లంగ రూపంబు దక్కి । [8] భజనేది యమ పాశ [9] బద్ధుఁ డౌఁ దుదిని ;
కాన సంసారదుఃఖము బహుళంబు. । పూని కామక్రోధ [10] మోహబాధలను
అంది యొండొరులను నటు చెఱుపంగ । నందంద తలఁచి చయ్యన ధర్మపథము
క్రమమును దక్కి దుర్మదవృత్తులగుచు । యమకింకరులచేత నధికంపుబాధ
పడుదురు; నిర్మలభావ సన్మార్గ । మడరి చేకొన్న పుణ్యాత్ములు పుణ్య
కలితాత్ములగుదురు గాంభీర్యధుర్య ! । వెలయఁ దద్గహనత్వవిధము చెప్పెదను.

విదురుఁడు ధృతరాష్ట్రునకు సంసారగహనము తెఱఁగెఱిఁగించుట

అనఘాత్మ, వినవయ్య యతిదుర్గమైన । వనమున భూసురవర్యుఁ డొక్కరుఁడు
చనుచుండి శార్దూలశరభ మదేభ । సనలులాయ మృగేంద్ర వారాహఖడ్గ
వివిధమృగంబులు వెనువెంటఁ దిరుగ । నవిరళ సాధ్వసం బధికంబు గాఁగ
దిక్కేమియును లేక దెసలెల్లఁ జూచి । గ్రక్కునఁ జని కనుగానక తిరిగె.

... ... ... ... ... ... ... ...

ఒనరంగ నొడ్డిన యురులును దోఁచె ; । మునుకొని యత్యుగ్రమూర్తియైనట్టి
వనిత యొక్కతె తనవక్షస్థలమునఁ । దనరంగఁ జొచ్చె ; నంతట భీకరముగఁ
బంచశిరంబులఁ బ్రబలునాగంబు । లంచితస్ఫూర్తితో నలమిన, నతఁడు
తలకొని యాలోనఁ దత్ప్రదేశమున । నలనుగా మిక్కిలి [11] వల్లీవితాన

1. బెట్టి. 2. ములు. 3. జిగీప్సిత. 4. జనియించు. 5. యౌవనంబున విషయాన. 6. దవ్వార్ధికముగ
7. విశత. 8. భజనదియను. 9. బంధుడా. 10. లోభమోహాదు. (క) 11. వచ్చి.

ములఁ సంవృతంబయి మునుకొని మీఁద । నలిమీఱి గాఢతృణంబులు పెరిగి
కడఁగి [1] గూఢంబయి కనరాని నూఁతఁ । బడి యొక్కఁ బలుతీఁగె బలువిడిఁదగిలి
వెనఁదలక్రిందుగా వ్రేలుచుఁ గొమ్మఁ । బసనారఁ బండిన పనసపండనఁగ
[2] నుండె; నట్లుండియు నొకభుజంగంబు । వండి కాల్కులు గ్రోయఁ, దద్దయునంతఁ
బరఁగ షట్కిరములు పండ్రెండుమోళ్లు । ధరఁగలిగిన మదదంతి యుత్తరువు
[3] చేరియుండంగ, నాక్షితిజశాఖలను । వారక బహువిధ వర్ణంబులగుచు
సదమలమైనట్టి షట్పదంబులను । [4] మధుధారలాగిఁ [5] గ్రోలి మత్తిల్లి తిరుగ,
[6] నలుపువెల్ల నెలుక లా మహీరుహము । విలసితమూలంబు వెసనఱకంగ,
ధరణీశ, విను [7] మధుధార లేఁప్రొద్దు । నొరఁగుచునుండంగ దోహలంబొని
పరికింపఁ బొరఁడుఁడు పరితృప్తి; [8] నద్ది । గురు దుస్తరంబైన ఘోరంపుటునికి.
అవనీశ, యిట్లున్నయాతండు నట్టి । వివిధనాగంబుల విరివైన యురగల
మెఱసిన యగ్ర [9] కామిని కారణమునఁ । గఱకఱిఁ బంచముఖములున్న యట్టి
గజముల నందడిఁ, గడఁగికూపమున । నజగరంబుండుట, నాదగనున్న
మదగజభయమున, మఱిమూషికముల । పదపడి భూరుహ పతనహేతువున
భావింప నాభృంగపంక్తి గారింప । భావంబు వికలమై [10] వడి జీవితాశ
విడువఁడో ధృతరాష్ట్ర, వినుము నీవలెను । మడవక." యనిన నమ్మనుజేశుఁడనియె :
"కటకటా! యీకీతిఁ గష్టంపుటునికి । నెటువలె వేగించె? నెన్నాళ్లకతఁడు
విడువంగనయ్యె? నీవృత్తాంత మెల్లఁ । దడయక [11] వినిపింపు ధన్యవివేక!"
యనవుడిట్లను నాతఁడాంబికేయునకు : । "అనఘాత్మ, కైవల్య మవని మర్త్యులకుఁ
బుట్టుటఁగోరి యద్భుతముగా మెలఁగి । నట్టి యుత్తెఱఁగు వ్యక్తంబుగావినుము [12] (?)
మహిలోన నాదుర్గమంబు సంసార । గహనంబు; వాలుమృగములు రాగములు;
ముదిత తా జర; పంచముఖములఁ బోల్చు । మదగజంబులు వినుమహితేంద్రియములు;

---

1. గూఢంబయి గానక. 2. నుండిన మఱియు వేకొనిభుజంగంబు (క) 3. బెరయంగ బరుసున. 4. మద. 5. గ్రాలు మహనీయమహిమ. (క) 6. సితాసితంబులగు మూషికంబులని తిక్కన భారతము. 7. మద. 8. నట్టి. 9. కామి. (క) 10. పరగుజీవంబు. (చ) 11. వివరింపు. (చ)
12. కవిరాజ విరాజితము :–

అనవుడు నిట్లను నన్నరపాలున కాతఁడు మోక్షము నర్థిజగ
జ్జనులకుఁ బుట్టుట సన్మతిఁగోరి విశారదు లాదరసంభృతులై
యనఘ, సుదుస్తరమైనభవంబునకచ్చగు నీయుటివాసము బో
ననమహనీయ విధంబునఁ జెప్పిరుదాత్తగుణాశ్రయతా మహితా. స్త్రీ॰ ప. 1-51

నలిమీఱఁ గూపంబు నందున్న పాము । కాలదండధరుండు ; లతజీవితాశ;
వృక్షమాయువు ; దాని వెసఁ డాయు గజము । నీ క్షోణిఁ గోపల నెసఁగు హాయనము ;
నుతికెక్కునట్టి తన్ముఖసులు నాఱు । ఋతువులు ; పాదముల్ సృష్టిఁ బన్రెండు
మాసముల్ ; భూజంబు మనలక నఱకు । భాసుర మూషికప్రవరంబు లెల్ల
సరిసహోరాత్రముల్ ; షట్పదవితతి । సరవిఁ గామంబులు జననాథతిలక !
ఘనమధుధారలు కామరసములు ; । మనమార నాయువు మధుసంచయంబు ;
వలనొప్పఁ గా వానివలన మానవులు । పొలుపొంద నాసక్తిఁ బొందుదు ; రట్టి
సంసారచక్రంబు జగతిలో బుధులు । కంసారికృపవల్ల ఘనముగా నెఱిఁగి
తెలివితో నెంతయు దీనిపాశములు । చలమునఁ దెంపఁగఁ జాలుదు." రనిన
విని యాంబికేయుండు విదురుకిట్లనియె : । "ఎనయంగ నాకిట్టి హితవు చెప్పితివి ;
వరధృతి కారక వాక్యపద్ధతుల । నెఱిఁగింపు." మనుటయు నిట్లని పలికె :
"అనఘాత్మ, విషయసంహతి కర్దమమున । మునుకొని తేలుచు మునుఁగుచునుండ
రూఢిఁ గాలము ముట్టి రాజయును జరయుఁ । గూడంగఁ, జెలువును గొవ్వును బాపి
భావంబులోన సపాత్రమైనట్టి । చావొనరించు, నిశ్చలవృత్తి వినుము.
తేరు శరీరము ; దీనికిఁ దగిన । సారథి సత్త్వంబు ; చటులాశ్వసమితి
యింద్రియములు ; ధరనిట్టివిధమున । సాంద్రతఁ జరియించు జనుఁడు తా వివశ
భావభరప్రాప్తిఁ బరఁగఁగ వాని । నేవిధిఁ బోనీక యొలమి వర్తించు
పురుషుండు సంసారమున జరామరణ । నిరుపమ భయమును నెఱి నుజ్జగించి,
గరిమతోఁ బరమ సుఖంబును బొందు । నిరవుగా నిత్తెఱంగెఱిఁగి ప్రశాంతిఁ
బొంది బాంధవులకుఁ బుత్రుల కిపుడు । అందంద నెంతయు నౌర్ధ్వదైహికము
గావించి [1]సుఖియింపు క్ష్మానాథ." యనిన । 'భావించి వాక్యముల్ పరఁగఁ బోవిడిచి
సొలపుతోఁ [2]మదిఁ జెవినూడినట్లైనఁ । దెలివి[3]లే కాతండు ధృతి మూర్ఛవోయె.
ఆసమయంబున నమల మానసుఁడు । వ్యాసు లేతెంచిన వసుధేశ్వరునకు
శిశిరోపచారముల్ [4]చేసిన యంత । వశముగాఁ దెలివొంది వ్యాసుల రాక
యొఱిఁగింప నతనికి నిల జాఁగి మ్రొక్కి । వఱలుచు గద్గద స్వరమున ననియె :
"మానుషజన్మంబు మహిత వివేక ! । [5]మానస దుఃఖ [6]సమ జంబుఁ జేయు ;
తాపంబు [7]నొందించు ; దైన్యంబు దెచ్చు ; । పాపంబు [8]సంధించు. బాంధవతనయ

1. సుఖివిగా. 2. దూది చెవిఁ జొచ్చిన రీతిన. 3. గాక యాతండు. 4. 'విదురాదు' లనుట అధ్యాహార్యము
5. మానుష. 6. కర్మంబు ఖండించు. 7. నొందుచు. 8. సిద్ధించు.(క)

మిత్రాదులెల్లను [9]మృతులైన కతన । గాత్రంబు మిక్కిలి కందంగఁ జొచ్చె;
శోకమగ్గల మయ్యె శోభితాకార! । ఏక్రియ వర్తింతు నెఱిఁగింపవయ్య॥"
అనిన వేదవ్యాసుఁ డాత్మసంభవునిఁ । గనుఁగొని పలికెః "నఖండప్రతాప!

## వ్యాసుఁడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు సేయుట.

తఱల కౌంతేయు నీవు ధర్మవర్తనకు । తెఱఁగంగ నేరుతు; వే భవచ్ఛోక
ముడుపంగ వచ్చితి నుడుగు మింతటను; । తొడరంగఁ దనువులు ధ్రువములు గావు.
క్రచ్చఱ నీవెఱుంగకయ యుండంగ । వచ్చెనే యీరీతి వైరబంధంబు
పరికింపఁ గౌరవ పాండుసూనులకు? । నరయ నీపుత్రుఁడే యనికిఁ గారణము;
నెఱయంగ నిది [10]విధినిర్మితంబైన । తెఱఁగు; వారలు నాజిఁ దెగి మోక్షపదవిఁ
బడసిరి; వారికిఁ బనిలేదు వగవ; । విడువకెంతేనియు; విమల చిత్తమునఁ
జెలరేఁగి విదురుండు చెప్పినబుద్ధి । వెలయంగ నీవును విననొల్లవైతి.
దేవకృతంబులు ధీరులకైన । భూవర, మాన్పంగఁ బోలునె యెందు?
లలిమీఱ దేవతలకుఁ [11]గృత్యమైన । కలితవర్తన [12]వింటిఁ గడఁకతో వినుము.
[13]ఎందైనఁ జరియింతు నే నశ్రమమునఁ; । బొందుగా నొకనాఁడు పురుహూతు సభను
[14]క్రమముతో వింటి భూకాంత హరిఁజేరి । "ప్రమదంబుతోడ మద్భారంబుఁ బాప
ననయంబుఁ బనిపూని యేకారణమునఁ । దనర మీరిప్పుడు తడసితి రిట్లు?
ఏమిటఁ బాయుదు నిమ్మహాభరము । ప్రేమతో" ననిన యాపృథివిని జూచి
నారాయణుండు తానవ్వుచు ననియెః । "ధారుణి, ధృతరాష్ట్ర ధరణీవిభుండు
తరమిడి పుత్రశతంబును బడయు; । నరయంగ నందులో నగ్రజుఁడైన
దుర్యోధనుండు నీ దుస్తరంబైన । కార్యభారము మాన్పఁగలఁడు. పో" మ్మనుచు
నద్దేవి వీడ్కొల్పె; నంతటిలోన । గద్దరియై నాశకారణంబుగను
గలియంశమునఁ బుట్టె ఘనుఁడు నీసుతుఁడు; । బలిమిని నొరుల సంపద చూడలేఁడు;
చెలఁగి యెవ్వరు బుద్ధి చెప్పిన వినఁడు; । [15]వలనేది కడుఁగ్రొవ్వి వైరంబు విడఁడు;
తమ్ములు శకునియుఁ దరణినందనుఁడు । నమ్మానవేంద్రున కనుచర [16]వరులు;

---

9. మృతమైన, (క) 10. ధర్మనిందిత. (చ) 11. గృత. 12. వింటె. 13. ఎంతైన. (క) 14. బోయిన నారదముఖ్యులే తెంచి యాయెడనున్నచో నవనియే తెంచి రమణమీఱంగ మీరలు బ్రహ్మసభను. (చ) ప్రమదంబు 15. వలనెంది. 16. పరులు. (క)

తమతమ తప్పులఁ దారెరిఁగియుంగ । వినులాత్మ, శోకింప వీరికిఁ గాఁగఁ
బనిలేదు పనిలేదు; పాండునందనులు । ఘనపుణ్యవంతు లకల్మషాత్మకులు;
నొగి వారివలనఁ గీడొక్కటి లేదు. । జగతి ప్రియంకరి నీను సత్పుత్రకులు ;
ఇంతకు మున్న నేనెఱుఁగుదు దీని । నెంతయు; నదిగాక యిత్తెఱంగెల్ల
నారదుఁ డా ధర్మనరలోకపతికి । ధీరత నెఱిఁగించెఁ దెలివిగా మున్ను.
అదిగాన హింసకు నాతండు చొరక । కొదలేక కౌరవకులముతోఁ బొందు
సేయఁ దలంచి నిశ్చింతుఁడై మున్ను । పాయక యొడఁబడెఁ బరితాపమేల?
నీవిట్లు దుఃఖింప నెఱి ధర్మసుతుఁడు । భావంబులోపల[1] వలవింపకున్నె !
దైవకృతంబును దనర నాపంపు । నావిరి మనసున వదలక నిలిపి
పాండుసూనులు నిన్ను భక్తి సేవింప । నుండుము; ధైర్యంబు నొప్పుగా నిలుపు.
అలపడ నెన్నాళ్ళకైనఁ జావంగ । వలయు ధారుణి నెంతవారలకైన.
ఎఱిఁగి యెఱింగియు నెఱుఁగనివాని । తెఱఁగున వర్తింపఁ దేఁకువ గలదె !
పొలవక యెంతయు శోకపావకము । నలరంగ సుజ్ఞానమను నీట నార్పు.
మాటి మాటికి నిట్టి మమత పోవిడువు ; । నేఁటినుండియు ధర్మనిత్యుండవగుము ;
తనువునఁ బ్రాణముల్ ధరియింపు.'' మనుచు । మునినాథుఁడెఱిఁగింప మునుకొని కొంత
తడవు మిన్నకయుండి తదనంతరంబు । తడయక యత్తపోధనున కిట్లనియె :
“మునినాథ, వినవయ్య మునుశోకతాప । మునుబొంది యారక పొగులంగ[2]వలసె.
ధనమును సుతులును దల్లిదండ్రులును । వనజాత ముఖులును వసుధయు ననుచుఁ
జలమున నెఱుఁగక జాలిఁబొందితిని; । నెలకొని తెలిసితి నీకృప నిపుడు.
అదిగానఁ బాండుపుత్రావళి తోడ । వదలని సద్బాంధవమున వర్తింతు.
మనసు దృఢంబయ్యె; మహితసుజ్ఞాన । ఘనుఁడనైతి.'' నటన్నఁ గడు సంతసిల్లి
“ధృతరాష్ట్ర, చిత్తంబు తిరుగకు'' మనుచు । నతనిఁ బ్రబోధించి యరిగె నెందేని.
అటు ప్రబోధితుఁడైన యాంబికేయుండు । చటుల బుద్ధులు మాని సంజయు కనియె:

## ధృతరాష్ట్రుఁడు సపరివారముగాఁ బొలికలనికిఁ బోవుట

“[3] పొలికలనికి నింకఁ బోవంగ వలయు । నెలమితోఁ బయన మాయత్తంబు సేయు.
గాంధారిఁ గుంతిఁ దక్కటి పద్మముఖుల । బంధురగతిఁ గొని పదఁడు వేవేగ.

---

1. పరికింపకున్నె (క) 2. వికవెం 3. పొలని. (క)

విదుర, తామసమేల వెలువడుం" మనిన । నదనుగా నిరువురు నట్టుల సేయఁ
బుత్రశోకంబునఁ బొగిలి గాంధారి । గాత్రంబు ధూళిచేఁ గదిసి [1] వర్తింప
గరిమఁ గుంతీప్రముఖులయిన వృద్ధ । తరుణీ జనంబులు తనవెంట రాఁగ,
నందంద దొరఁగెడు నశ్రుబిందువులు । క్రందుగా ముఖమునఁ గప్పి నిండంగ,
విరిసిన వెండ్రుకల్ వెన్నునఁ గటిని । [2] నిరతమై దృష్టులు నీఱుసేయంగ,
నలిరేఁగి హస్తముల్ నడుతల యందు । బలువడిఁ జేర్చి తప్పక తనూభవులఁ
దలపోసి పోసి గాంధారి యేతేరఁ, । బలు దుఃఖములఁ గుంది పైపయిఁ బఱచుఁ
బతులను హితులను బంధు వర్గులను । మతిఁ జేరుకొని శోక [3] మగ్నలై యంతఁ
గురుకుమారక సతీ కోటి యేతేర, । సొరిది వయస్కులుఁ జూడఁ బయ్యెదలు
తొలఁగిన సిగ్గులఁదొడరు భామినులు । తలఁకొని యేకవస్త్రముతోడ నడువ,
విదురుఁ డంతటిలోన వెలఁదుల నెల్ల । వదలక యూరార్చి వరవాహనముల
నునిచి యేతేరంగ నుర్వీశ్వరుండు । నొనరంగ నట నిజసౌగ్య [4] యానమునఁ
జనియె, గాంధారియు [5] సతియైన కుంతి । యును మొదలయినట్టి యుత్పలనేత్ర
లను దోడుకొని దిశల్గలఁగి ఘూర్ణిల్లఁ । జనుదెంచె విదురుండు సంజయుఁ గూడి.
మఱియును [6] బురిగల మనుజులందఱును । వఱలు బ్రహ్మ క్షత్త్ర వైశ్య శూద్రులును
నరవి శిల్పకులును స్వర్ణకారులును । గుఱుతు మించిన యట్టి కుంభకారకులు
రజకులు క్షౌరక ప్రముఖ వర్ణములు । నజితలీలలఁ బెద్దలనఁ బిన్నలనక
చనిరి యివ్విధము క్రోశం బంతలోనఁ । దనరంగఁ గృపవర్మ ద్రౌణియుఁ గృపుఁడు
వరమతి నెదురుగా వచ్చి యల్లంత । నరదముల్ డిగ్గి శోకార్తి నంగములు
తూల బాష్పంబులు తొరఁగుచునుండ । నోలిమై నాబింకేయునిఁ గాంచి యనిరి :
"వినవయ్య ధృతరాష్ట్ర, వెలయంగ నీదు । తనయుండు భుజబలదర్పంబు మెఱసి
యురువడి సంగర మొనరించి దివిజ । వరుల మెప్పించి పావనమైన పదవి
కలవడఁ జనియె సైన్యములతోఁ గూడి, । పొలుపొందఁగా నేము ముగ్గుర మర్థి
బ్రదికితి మతుల దోర్బలవృత్తి" ననుచు. । తదనంతరంబునఁ దప్పక కృపుఁడు
సొలవక గాంధారి శోకంబు మాన్పఁ । దలపోసి యిట్లను: "తరుణీలలామ !

---

1. వర్ణింప. (క) 2. నిరతమై తనదృష్టి. (చ) 3. మగ్నులై. 4. మానము 5. సతి.
6. బరిగల. (క)

## కృపుఁడు గాంధారి నూఁదార్చుట

భవదీయ పుత్రులు బవరంబులోన । వివిధాస్త్రవహ్నిచే విమతులఁ బొదివి
దివిజులు వినుతింప దివ్యాస్త్రవృష్టి । సవడిమై నాఁగి నిశ్చలదివ్యపదము
గైకొనియున్నారు; కడఁకతో వారి । కై కాంత, శోకింపఁగాఁ బనిలేదు ;
సకల దానంబుల జపతపంబులను । సకల యాగంబుల సరి గాంచు పదవి
ఘనతర సంగరాంగణమునఁ దెగిన । యనుపమ పుణ్యాత్ము లరిగినగతికి
సరిగాదు; కావున సంభావ్య[1] తరము । ఉరువడి నదియటులుండె; పాండవుల
కలవడ 'గెలిచితి' మనిన సంతోష । ములు[2] లేవు చెప్పెద ముదముతో వినుము.
పవనతనూజుండు పార్థివు గదను । అవిరళగతిఁ గూల్చినట్టి యారాత్రి
యెలమి దీపింపంగ నేను మువ్వురము । చెలరేఁగి పాండవశిబిరంబు చొచ్చి
సకల రథంబుల సకల నాగముల । సకల రాజన్యుల సకలయోధులను
సకలాశ్వముల మఱి సకలాయుధముల । నకలంకగతిఁ ద్రుంచి యంతటఁ బోక
శ్వేతునిఁ జెండాడి సేనల నఱికి । యాతపత్రంబుల నవనిపైఁ గూల్చి
ద్రౌపదీపుత్రులఁ దక్కటి దొరల । నేపుమైఁ జంపి యేమిటకు వచ్చితిమి.
అదిగాన సంతోష మాపాండవులకు । హృదయ నిర్మలము లేదించుకంతైన.
తరమిడి మాకును దప్పిపోవలయు । నరయ ననుజ్ఞయిం" దని మహీపతికిఁ
గృతమతి గాంధారికిని బ్రదక్షిణము । లతులితగతిఁ జేసి యరదంబులెక్కి
యిలలోన భయమున నించుకతడవు । నిలువక వేచని నెఱి సంతలోన
పొసఁగ గంగాతీరమున నొక్కచోట । వసియించి యన్యోన్య వచన పద్ధతులఁ
బాసిరి ; కృతవర్మ పరువడి నంత । భాసుర ద్వారకాపట్టణంబునకుఁ
జనియెఁ; గృపుండును సామజపురికి । ఘనముగా నేతెంచెఁ; గడఁకనాద్రౌణి
వ్యాసాశ్రమంబున కనతి దూరమున । నోసరిల్లక చేసె నుగ్రతపంబు.
తదనంతరంబున ధర్మజార్జునులు । వదలక దాడిమై వచ్చి యా ద్రౌణి
వెలయంగఁ దాఁకిన వృత్తాంతమెల్ల । నెలకొన్న ప్రీతితో నీవు విన్నదియె.
ఘనతతోఁ దరువాతికథ విను మనఘ! । మునుకొని రథికులు మువ్వురు చనిన
నాంబికేయుఁడు క్రొత్తయైన నెవ్వగలఁ । బంబి పోవుచు నుండెఁ; బరఁగంగ నచట

1. దనము. 2. లేపు. (క)

శమనశూనుండు పాంచాలికి ద్రౌణి । విమల శిరోమణి వెలయంగనిచ్చి
యూరార్చి యడుకార్చి [1] యున్నంతలోన । వారక ధృతరాష్ట్ర వసుధీశ్వరుండు
మునుకొని కలనికిఁ బోయెడువార్త । విని శోకమునఁ జాలవిహ్వలుఁడగుచుఁ
దనతమ్ములందఱు ద్రౌపదీదేవి । తన వెంటరాఁగ నద్ధరణీతలేశుఁ
గనుఁగొన నేతేరఁగా, దవ్వులందె । పనివడి ధర్మజుఁ బరికించిచూచి
కౌరవ కాంతలు కన్నీరునించి । యీరసంబునఁ జేతులెత్తి యేడ్చుచును
"ధర్మవేదిత్వ మీధణీశ్వరునకు । నర్మిలినెక్కడి! దక్కటా తగునె!
దయలేక మామలఁ దండ్రుల సుతుల । జయ [2] మొన్ని తాతల సచివులగురులఁ
దమ్ముల మిత్రులఁ దగినబాంధవుల । నిమ్ములఁ జంపించె నిట్టిదిగలదె?
నాశనంబుగఁజేసి నవ్యదుఃఖముల । వాసిలేకెంతయు వచ్చుచున్నాఁడు."

## ధర్మరాజు తమ్ములతో ధృతరాష్ట్రునొద్దకుఁ బోవుట

అని బహువిధముల నందఱుఁబలుక । విని ధర్మసూనుండు వేదనఁబొంది
పుత్రశోకంబునఁ బొగులుచున్న । ధాత్రీశుకడకేఁగి తత్పార్శ్వవర్తు
లైనవారలచేత నటనెఱిఁగించి । భూనాథు పాదాబ్జములకు మ్రొక్కుటయుఁ,
బెనుపొంద నల్లమప్రియమంద వగల । వనరుచు నట దీనవక్త్రుఁడై నృపతి
యాలింగనముచేసె; నంతభీముండు । శైలభేదినుతుండు సరవిమైఁగపలు
నెఱిఁగిన వారల [3] నెఱిఁగించుటయును । మఱి భీముఁ డనునట్టిమాట కర్ణముల
సోఁకిన మిక్కిలి శోకరోషముల । భీకరంబుగనున్న పృథివీశుఁ జూచి
మనమున నెఱిఁగి యమ్మధుసూదనుండు । తనర 'నిసీపీని తలఁపొప్ప' దనుచుఁ
జెలరేఁగి ధృతరాష్ట్రుచిత్తంబు మున్నె । వలనొప్ప నెఱిఁగినవాఁడు గావునను
అనుపమ మాయామయంబుగా వాయు । తనయుని రూపంబు ధరణిలోహమునఁ
గొనకొని సేయించి గూఢప్రకార । మున నచ్చటికిని నిమ్మగ మహామహిమ
వరుసఁ దెప్పించినవాఁడు గావునను । బరఁగ నాలోహరూపము జగదీశు
ముందట నిలిపిన, బోరన నతఁడు । పొందుగా మారుతపుత్రుఁగా దలఁచి
యాలింగనము సేయ నదిపొడియయ్యె. । ఆలోన హర్షించి [4] యంధభూవిభుఁడు
మెఱమెచ్చునై భీమునెఱి పేరుకొనుచుఁ । దఱలక బహుశరోదనము సేయంగఁ

1. యున్నతిలోన. 2. మేది. 3. 'అచ్చటివారు' అనుకర్త అధ్యాహార్యము. 4. యంత. (క)

జిఱునవ్వు నవ్వుచుఁ [1] జెలఁగియాశౌరి । మఱియు నా ధృతరాష్ట్రు మనుజేశుకనియె :
"అడలంగ నేటికి నసిలనూనుండు । బడిబడి నీచేతఁ బడఁడు నిక్కువము.
పదపడి నీచేత ఖండింపఁబడిన । యది యినుమింతెపో యవనీశతిలక !
గానఁగాని యే నీదు కోపమెఱుంగఁ । బెనుపొంద భీముని వెనుకకుఁ దిగిచి
యేను నీముందట నిడితిని దీని. । పూని యెవ్వండు నీ భుజశాఖలెదుట
నిలువంగఁ గలవాఁడు నిక్కమూహింప. । పోలుపేది మిక్కిలి పుత్రశోకాతు
రుండవై ధర్మంబుఁ బాఢిఁ బోకార్చి । దడిగా బాపంబు దలఁచితి వకట !
వేదశాస్త్రంబులు వింటివి మిగుల ; । నాదిపురాణంబు లఖిలధర్మంబులు
నెఱుఁగుదు ; వీ విప్పుడీతప్పు దలఁప । నఱలేని వగపొంద నక్కటా తగునె !
వెలయు గురుండును విదురుండు భీష్ముఁ । డల సంజయుండు నే నాదిగాఁ గూడి
చెప్పిన బుద్ధులు చెవిఁబెట్టవైతి ; । చెప్పుమా యిఁక నేమి సేయంగవచ్చు ?
పోల్కి యెఱుంగక పొదివికోపమున । నూల్కొని భీమార్జునుల సత్త్వమెఱిఁగి
వలుకులేటికి నేలపన్నిరి రణము । ... ... ... ... ...
గిరికొని ద్యూతంబు గెలుచుకతమున । ధరణినుత్తమసాధ్విఁ దలపట్టి యీడ్చి
యొనగంగవస్త్రంబు లొలుచుట యెఱిఁగి । [2] యును దనూజులఁజంపె నొగిభీముఁడనుచుఁ
దెంపుమై సుజ్ఞానధీరత్వ మెడలి । చంపంగఁ దలఁచితి సరవియెయకట !
నెఱకొని నీయవినీతియు సుతుల । కలితనంబును జూచి ఘనతరరోష
శోకముల్ మాని మెచ్చుగ శాంతబుద్ధిఁ । గైకొను" మనిన నక్కమలాక్షుకనియె :
"నీదు సద్వాక్యముల్ నిత్యంబు లనఘ ! । ఆదట నేఁ గ్రోధి నదిచెప్పనేల ?
నెగడంగఁ దెలిసితి నీదువాక్యముల । వగపెల్లమానెఁ బావనుఁడ నేనైతి.
నాత్మజుండగు పాండునరపతి సుతులు । ప్రీతియొనర్పంగఁ జేస్మవర్తింతు."
ననుటయు శౌరి భీమార్జునయముల । ఘనముగాఁ గ్రమమునఁ గానుపించుటయుఁ
గరమొప్ప వారలఁ గౌఁగిటఁజేర్చి । వరుసతో దీవించె ; వారిజోదరుఁడు
తగయుయుత్సునిఁ జూపఁ దద్దహర్షమునఁ । బిగియఁ గౌఁగిటఁజేర్చి ప్రియములు పలికి
ధర్మనందనుతోడ "ధర్మాత్ములార ! । యర్మిలి గాంధారి నటపోయి కనఁడు,

---

1. శ్రీవిభుండపుడు. (చ)
2 మనమునఁ గలుగు నుమ్మలికదీఱంగ.
దెంపుమై ... ... ... ... ... (క)

## ధర్మజుని శపింపఁబూనిన గాంధారిని వ్యాసుఁ డుపశమింపఁజేయుట

అరయుంగ నీవేళ." ననినఁ బాండవులు । హరిపురస్సరముగా నటఁజని మ్రొక్కి
కరములుఁ బాదముల్ గజగజవణఁకఁ । గరములు మొగిడింప గాంధారివారి
దీవింపనొల్లక తీవ్రకోపమున । భావంబులోన శాపంబీయఁ దలఁచి
యున్నచో, వ్యాసుఁ డత్యుదారు కృపావాసుఁ । డున్నతాజినవాసుఁ డొగిఁ జనుదెంచి,
సకలజనంబులు సాష్టాంగ మెఱఁగి । ప్రకటనమస్కృతుల్ పరఁగంగఁజేయఁ
గనుఁగొని, యప్పు డా గాంధారిఁజూచి । 'యెనయ నోపకు శపియింపక వినుము.
[1] పాండవే యాగ్రజుపై నల్క నూను ; । చండతర స్ఫూర్తి చనునమ్మ నీకు ?
ధర్మ తనూజుండు ధర్మాత్ముఁ డతుల । నిర్మల విజ్ఞాని నీకుఁ జెప్పెదను.
కౌరవనాథుండు కదనరంగమున । కారయఁ బోవుచు నంబ దీవింపు
జయమగుఁ గాకని సరవితోఁ బలుక । రయమున నీవు 'ధర్మము గల చోటఁ
గలుగు జయం' బని కడఁకతో ననవె ! । పొలుచు ధర్మంబునఁ బొడవైన పాండు
తనయుల వీరిని దయఁ జూడ వలయును ; । మనమున మానుము మాత్సర్య మబల !"
అనవుడు గాంధారి వ్యాసమునీంద్రుఁ । గనుఁగొని పల్కె : "దుఃఖంబునఁ జేసి
కలఁగితిఁ గాక యీ కౌంతేయవర్గ । మలవడఁ గుంతి కె ట్లట్టులె నాకు.
తులువతనంబున దుర్యోధనుండు । కలనిలోఁ బోరాడఁగాఁ బాండుసుతులు
సరవిఁ గయ్యంపుఁ బాడిఁ జంపి రందఱిని । [2] గురుమతి నందు కేఁ గోపింపఁగాని
హరిచూడ భీముఁడన్యాయమార్గమునఁ । గురురాజు తొడలు నుగ్గులు చేసె నకట !"

## భీముఁడు వినీతుఁడై గాంధారికిఁ బ్రత్యుత్తర మొసఁగుట

అన విని వాయుజుఁ డతి భయంబునను । ఘన కంపితాంగుఁడై గాంధారికనియె :
"తలకొని చూడంగ ధర్మమె యైన । [3] నలి నధర్మంబె యైనను బ్రాణభీతిఁ
జేసితి నీతప్పు క్షితియెల్ల నెఱుఁగ । వాసిగా సైరింపు వనజాతవదన !
ఎలమితో ద్రౌపది నీడ్చి తేఁ బనిచి । తలకొని యూరుల త్తరుణికిఁ జూపఁ
గనుఁగొని 'యూరు భగ్నము సేతు' ననుచుఁ । బనివడి యే నాఁడు ప్రతిన చేసితిని.
తఱి ను త్తమక్షత్ర ధర్మజ్ఞు లెల్ల । నెఱిఁ బ్రతిజ్ఞాహాని నిందింతు రెపుడు.

1. పాండవ యగ్రజు. 2. గరమతి నందుకై కపటమి లేమ. 3. నెలమి నధర్మమైన. (క)

కావునఁ బూనికి కడఁగి చేసితిని । సావధానమతితో విచారింపు." మనిన
నద్దేవి యిట్లను: "నానిచుఁబట్టి । తద్దయుఁ [1]ఒప్పులు తగవు ధర్మంబు.
అరయంగ వైరిని రణిలోనఁ జంపు । దురునాఁడు వచ్చి నెత్తురుఁగాని క్రోలు
నట్టి క్రూరాత్ము లెవ్వైన నైనఁగలరె (?) । గట్టిగా." నవుడు గాంధారికనియె:
"ఆసభలోని కయ్యాబలఁ బాంచాలి । గాసిగా నీడ్చి తెక్కలికై చీరలొలువ
నలుకన్మెఁ జేసిన యా బాసలొలుకుఁ । గలఁకలోఁ బట్టి యాఖలు దుస్ససేను
రక్తంబు ప్రావుచు రణములో ననుచుఁ । బ్రాక్తన స్ఫురణచేఁ బట్టితిఁ బ్రతిన;
యనిలోనఁ ద్రావితి; నవ్వనాఁవుల । మదములో నుతఁ బట్టి మఱి శీఘ్రవృత్తి
శోణితం బానుట నూఁతఁ బాతకము । క్షోణిలోపల నని శ్రుతి వినఁబడును.
తరమిడి యనుజరక్తం బానునంత । దురిత చిత్తుఁడనే! ద్రోహినే!" యనిన
"నొగి నూఱుకొడుకుల నొక్కని నైన । జగతిలో నిల్పక సనడి నూఱ్వరను
ద్రుంగితి; నందులో మీకెవ్వఁడైన । సంగతి [2]నెగ్గులాచరియింప నట్టి
వాఁడు లేఁడయ్యెనే! వదలక [3]యొకనిఁ । బోఁడిమి దీపింపఁ భువిఁ జంపకున్న
నంతటఁ దప్పునే యొకట నీప్రతిన! । ఎంతయు మీయన్న నిల యేలనీఁడె?
ఎటువంటి వారైన నీరీతిఁ జంపు । కుటిల చిత్తులు గలుగుదురె ధారుణిని?"
అని యని చింతించి యనసూతిమీఁద । ఘనమైన కోపంబు గదుర 'నారాజ
నెచ్చట నున్నవాఁ డేమిచేసెడిని । ప్రచ్ఛల?' ననవుడు కంపించి ధర్మ
సుతుఁడు చేతులు మోడ్చి సువినయంబెసఁగఁ । గృతమతితోఁ బ్రదక్షిణ మొనరించి
మృదుభాషణంబుల మెల్లనఁ గదిసి । పదముల కెఱఁగి యప్పాండవాగ్రజుఁడు
"కుంభిని నీ పుత్రకులఁ జంపినట్టి । సంభుండ శపియింపఁ దగదె యోతల్లి!
తమ్ముల బంధులఁ దాతల సుతులఁ । గ్రమ్మఱ చంపించిన ఖలునకు నాకు
నేటికి జీవనం బేటికి రాజ్య । మేటికి భోగంబు లేటికి?" యనిన
మఱుమాట లాడంగ మాని గాంధారి । దొఱఁకొని నాలుక తొట్రుపడంగ
నెట్టన నిట్టూర్పు నిగిడించె; నేత్ర । [4]పట్టంబు సందునఁ బయవడి వెడలి
యా పతివ్రత దృష్టి యందంద పోయి । భూపాలు పదనఖంబులఁ జెందుటయును
గందినఁ జూచి యాఖండలసూతి । యందంద చనియె శ్రీహరి వెనుకకును;

---

1. జేసిన. (క) 2. నెగులార్పఁ జాలినయట్టి. 3. పట్టి. (క) 4. పట్టావృత స్రుసంగు. (మా)

మారుతసూనుండు మాద్రినందనులు । వారక తిరుగుచుపడి; రంతలోనఁ
దలకొన్న క్రోధంబు దక్కి గాంధారి । యలపడ ధర్మపుత్రాదులయందు
మాతృభావంబున మసలక వలికెః । 'మీ తల్లిఁ గనుఁగొన మెలఁపుఁ బొండు.'

## పాండవులు కుంతియొద్ద కేఁగుట

అనునంత నందఱు నంతరంగమున । ననిచిన కలఁక తామొయ్యన డిందు
పఱచి యచ్చట వోయి పరఁగంగఁ గుంతి । చరణాబ్జములమీఁదఁ జయ్యనఁ వ్రాలి
కన్నీరు నిగిడింపఁగా, నేడ్చి కుంతి । యెన్నిక వారలనెత్తి వేర్వేఱఁ
దనువులు నిమురుచు దారుణశస్త్ర । ఘనతర వ్రణములు గాంచి, నిట్టూర్పు
నిడిగించి, యందఱ నెఱిఁ గౌఁగిలించి । వెగులుచుఁ బొగులుచు విహ్వాల యయ్యె.
ఆసమయంబున నతివ పాంచాలి । యాసమీపముఁజేరి యధిక దుఃఖమునఁ
బదములపై వ్రాలి బాష్పంబులురల । నదనుగా వికలాంగియై త్రుంచివైవ
ధృతి నెండతాఁకిన తీఁగచందమున । క్షితిమీఁదఁ బొరలుచుఁ జెలఁగి యేడ్చుచును
'అకట! సౌభద్రాదులైన నీమనుమ । లకలంక వృత్తి నెందరిగిరో!' యనుచుఁ
బలవింపఁ బలవింప, భామకుంతియును । బలు రోదనమ్మున భామలుఁదాను
నొనరంగ గాంధారి యున్న చోటికిని । బనవుచుఁ జనెఁ; దన పాదపద్మముల
కెఱఁగి పాంచాలియు నేడ్చుచు నున్న । తఱి, నడలుచును గాంధారి యిట్లనియె :
"పుత్రశోకంబునఁ బొగులు నీదైన । గాత్రంబు కృశమయ్యెఁ; గంనువాటిల్లె ;
పుత్రవర్గముచావఁ *బొందె దుఃఖంబు । పౌత్రహీనతఁగుంతి పాయునే వగవు!
నిన్ను నూరార్చెద నీరజవదన, । నన్ను నూరార్పు ; మున్నతి నిద్దఱకును
సమమయ్యె దుఃఖంబు ; జగతిలో నీవు । శమియింపు మింక విచారింపఁదగదు.
పుడమి 'నవశ్యమనుభోక్తవ్య' మనుచు । నుడుగక మ్రోయుచు నుండు వేదములు.
వసుమతి నొసటను వ్రాసిన[1] వ్రాలు । నుసిగినఁబోవునే యోకంబుకంఠి!"
అని యిట్లు భాషించె నర్థితో ననుచు । వినిపించుటయు మునుల్ వేడుకఁబొంది
యనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయుఁ
బద్మపత్రాక్ష, గోపాలక, కృష్ణ, । పద్మాలయానాథ, పాపసంహార,

* 'పాండవవర్గము' అనుకర్త అభ్యాపాఠ్యము. 1. వ్రాఁత. (చ)

హరిహరబ్రహ్మాత్మ, హరనుతచరిత, । హరిముఖ్యాదిక్పాలకానీక వంద్య
చరణ సరోరుహ, సత్యస్వరూప, । పరమాత్మ, పరమేశ, భక్తమందార,
అణురూప, ఘనరూప, యాద్యంతరహిత, । మణివక్ష, కేశవ, మధుదైత్యహరణ,
ఘనమాని హృద్గేహకలిత సందోహ । వినుతప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమనసుకవీంద్ర వర్య
రచితమా స్త్రీపర్వ రమ్యకావ్యమున । నుచితమై యాశ్వాస మొక్కటి యయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీభోగిగిరివాస, చిరతరోల్లాస । వైభవనిలయ, శ్రీవర, వాసుదేవ,
ఆదినారాయణ, యాద్యంతరహిత, । వేదాంతవేద్య, శ్రీవేంకటాధీశ !
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె :
"ఆరీతి గాంధారి యబల ద్రౌపదిని । నూఱడఁ బల్కి యత్యంత సత్స్ఫూర్తి
వ్యాసమునీంద్రుని వరలబ్ధమగుచు । భాసుర దివ్యవైభవదృష్టి తనకు
నాపొద్దు నిజవ్రత హాని లేకుండఁ । బ్రాపింప సంగరావని యఖిలమును
గొలఁదితో లోచన గోచరంబైన । బలువిడిఁ దెగిపడ్డ భద్రేభములును,
దెలియంగ నడుములు తెగిపడ్డ హయులు, । నలవోక నుగ్గునూచైనట్టి బండ్లు,
ఘనశరములు గాడఁగాఁ గాలుఁగాలుఁ । బెనఁచుక పడియున్న పృథుపదాతులును,
దోకొని యప్పదాతుల నేమి గాన । రాక మీఁదను జాలఁ గ్రమ్ముకపడిన
కేతనంబులు, విఱిగియుఁ గాలిఁదూలు । నాతపత్రములు, నుగ్గైయున్న జోళ్లు,
గొడుగులపైఁ దమగుఱుతులు వారసి (?) । విడువకపడియున్న వింజామరములుఁ,
కేతనంబుల మీఁదఁ గ్రిందను నిండి । జాతిగాఁ బడియున్న శస్త్రాస్త్రచయము,
నొదవుశస్త్రములచే నుక్కఱఁడునిసి । నెదగాఁగఁ బడియున్న వీరహస్తములు
నలిసిరపదములు, నలినలియైన । తలలును, జెదరిన దంతతండములు,
బొరలు మొండెములును, బొట్టలవెలికి । నుఱికిన ప్రేగులు, నొగిఁబడ్డ మాంస
ఖండములును, బెనుకాల్వలై పాఱు । చుండు శోణితముల నొడ్డొండ దొరఁగు
మకరకుండల హార మంజీరవలయ । మకుట కేయూరాది మణిభూషణములుఁ,
బలల ఖాదనములఁ బరితృప్తిఁబొంది । చెలఁగి నర్తనములు సేయుచునున్న
శాకినీ భూత పిశాచ వేతాళ । డాకినీ కరతాళ డమరు ఘాంకృతులు,
కాక జంబుక వృక కంక గృధ్రాది । భీకరస్వరములు పెల్లుగాఁ గలిగి
కడు ఘోరమైయుండు కదనరంగంబు । పడఁతి గాంధారి తప్పక కనుఁగొనియె.
తదవసరమున సాత్యవతేయమౌని । విదితంబుగాఁ బాండవేయులఁజూచి,
"సరవిమై బాంధవశవములకెల్ల । విరివిఁ గాలోచితవిహితంబు గాఁగ

ననల సంస్కారంబు నటసేయుఁ డనుచుఁ । బనిచి యంతర్ధానపరుఁడైన, వారు
దేవదేవుని సర్వదేవతామయుని । భావజజనకు శ్రీపతి హృషీకేశు
నారాయణుని జగన్నాథు ముకుందు । వారిజోదరు భక్తవత్సలుఁ గృష్ణుఁ
గూడి యాధృతరాష్ట్రుఁ గూర్మితోఁ బొదివి । యాడకుఁ జనుచు నత్యంత వేగమునఁ
గడకతోఁ గౌరవ కామినీమణుల । నడపింప, నప్పుడన్నాతులు, పతులు
సుతులును మిత్రులు సోదరచయము । క్షితిమీఁద నెంతయుఁ జేష్టలుదక్కి
శవములై యుండంగ సవడిమైఁ జూచి । ప్రమదలమతిలేక పలవించువారు,
నురుపడి ధరమీఁద నొరఁగెడివారు, । పురపురమనుచును బొగిలెడువారు,
పొరలాడువారును బొక్కువారలును । మఱచి దేహంబులు మ్రాన్పడువారు,
కచభారములువీడఁ గమనీయరత్న । ఖచిత నానావిధ ఘనభూషణములు
చెదరంగ ముత్యాలసేసలురాలఁ । దుదమొదలెఱుఁగక దుఃఖించువారు,
మునుకొని తలలును మోములు మోఁదు । కొనువారు నైరంత గోవిందుఁ జూచి
యతివ గాంధారి రమ్మని చేరఁబిలిచి । యతుల శోకాక్రాంతయై యిట్టులనియె:

### గాంధారి పొలికలనుజూచి కృష్ణునితోఁ జెప్పి దుఃఖించుట

"హరి, జనార్దన, కేశ, వానంత, కృష్ణ, । మురహార, నగధర, పుండరీకాక్ష,
యనఘ, పరాకు సేయకచూడు వారె । గొనకొని ధృతరాష్ట్రుకోడండ్రు, మిగులఁ
గన్నీరు మున్నీరుగాఁగ నేడ్చుచును । గ్రన్నన యుద్ధరంగంబునఁ దెగిన
తమ పురుషులమీఁదఁ దగిలి కాకములు । ప్రమదంబుతోనెక్కి బలువిడిఁ [1] బొడువ
నడఁపంగ మఱి చేతులాడక చేష్ట । లుడిగియున్నారు దామోదర, కంటె!
అవని నిచ్ఛామృతుండనఁ బొగడొంది । వివిధ శౌర్యప్రభా విస్ఫూర్తి మెఱసి
పరశురాముని భుజాబలమున గెలిచి । పరమవైష్ణవుఁడనఁ బ్రజ్ఞదీపించి
శరతల్పగతుఁడయ్యె సకవిఁబ్రాణములు । ధరియించినాఁడు శాంతనవునిఁ జూడు.
కురుకుమారులకు మక్కువ ధనుర్విద్య । వరఁగంగ నేర్పిన భవ్యవిక్రముఁడు
ద్రోణునిఁ జూచితే రూపెల్లఁ బాసి । క్షోణిపైఁ బడినాఁడు గోపికారమణ!
తొలఁగ కెంతయు హంసతూలికాతల్ప । ములమీఁద శయనించి పొలఁతులు వేడ్కఁ
బాదపద్మములొత్త భాగ్యభోగముల । నాదట వర్తిల్లినట్టి యా ఘనుల

1. బొడవ - నడచుకో. (క)

తనువులు చూచితే! ధరణిపైఁగూలి । యొనరంగ నున్నవి యుల్లంబులుడుక.
చెవులకునింపుగా శ్రీరాగముఖ్య । వివిధగానంబులు వీణారవములు
నిత్యంబు వినుచుండు నృపులసన్నిధిని । అత్యంతమునగ నక్కలఱచు చున్నవియు.
కర్పూర కస్తూరికాగంధ మెలమి । నేర్పుతోఁబూసెడి నిఖలభూపతులు
తెలియ శోణితపంక దిగ్ధాంగులగుచు । బలమఱి భూమిపైఁ బడియున్నవారు.
ప్రాణముల్ విడిచియుఁ బరఁగహస్తములఁ । ద్రాణఁ గృపాణముల్ తగవిడువకయుఁ
బ్రధనరంగమున సప్రాణులువోలెఁ । బ్రథితులై యున్న సద్భటులను గంటె!
అట్టలకడ నుత్తమాంగంబు గాన । కట్టిట్టు దిక్కుల కరిగెడువారు,
తలలు చేతులఁగొని తనువులఁబొదివి । పొలుపఱి ధరమీఁదఁ బొరలెడువారు,
శిరములు మేనులఁజేర్చి భావించి । గురుతర శోకాబ్ధిఁ గ్రుంగెడువారు,
తునియలుపైకొ నఁ దొడిఁబడఁగూర్చి । జనితశోకముల మూర్ఛలఁ బొందువారు
హాయని యెలుఁగెత్తి యందందవగలఁ । బాయక మిక్కిలి పలవించువారు,
'ఇదేశిర మిదేపాద మిదేహస్తమనుచు । వెదకెడువారు నిర్విణ్ణులౌవారు
నైయున్నవారల నంబురుహాక్షు! । వేయువిధంబుల వీక్షింపవయ్య.
నాపూర్వకర్మంబు నన్నింతసేయఁ । బాపపుఁగన్నులఁ బరికింపవలసె."

### దుర్యోధనుని కళేబరము గాంచి గాంధారి విలపించుట

అనిపల్కి దుర్యోధనావనీశ్వరుని । ఘనకళేబరము దృగ్గతమైనఁ దరుణి
యురుదార నఱికిన యనఁటియుఁబోలె । ధరమీఁదఁబడి మూర్ఛ తద్దయుఁబొంది
కొంతసేపునకు నక్కోమలి దెలిసి । యంతటఁ బరిచారికాంగన లూఁది
కొనిపోవఁ బోయి యక్కురుపతిఁ జేరి । కనుఁగవ సోనలై కన్నీరుదొరఁగఁ
బరఁగ నాతని కళేబరముపై వ్రాలి, । "కురురాజశేఖర! గురు [1] మూర్తిధార!
హా మేరుసమధీర! హా రణశూర! । హా మానినీమార! హాభుజసార!
నీవిక్రమము పెంపు నీప్రతాపంబు । నీవైభవస్ఫూర్తి నీభోగమహిమ
నేఁ డెందుఁబోయెనో నృపసార్వభౌమ! । పోఁడిమిచెడి యిట్లు పొరలంగ వలసె.
తలఁగొని నూర్వురు తనయులలోన । వెలసినవాఁడవు వీరాగ్రగణ్య!

---

1. కీర్తిధామ. (చ)

పుత్రశోకంబునఁ బొరలుచున్నాఁడు । ధాత్రి నీ ధృతరాష్ట్రుఁ దగఁ జూడవయ్య !
నీ కులకాంతలు నేఁ డింత వంత । దాఁకొని తమ తమ తనువులు మఱచి
యిలమీఁద నెలుఁగెత్తి యేడ్చుచున్నారు । వలదని వారల వారింపవయ్య !
పనివడి యెంతయుఁ బరలోకవిధులు । తనయులు సేతురు తల్లిదండ్రులకు ;
కలఁగొని యదియెల్లఁ గల్లగాఁజేసి । యెలమి నేలోకంబు కేఁగితి తండ్రి !
జగతి ' దుర్యోధనసంపద ' యనఁగఁ । బొగడొంది యెంతయు భూమిలోఁ గలుగు
రాజులు నీపంపు రమణఁజేయంగ । రాజరా జనుపేరఁ బ్రజ్ఞ దీపించి
కడపట నీరీతిఁ గష్టంబునొంది । పుడమిపైఁ గూలితే భువనైకవీర !
దిక్కెవ్వ రిట మాకు ! తెలిచిన ;యిల్లు । కుక్క చొచ్చినయట్లు కురుభూమి నింక
నెవ్వరు రక్షింతు రేమనఁగలము ! । ఎవ్వరిఁ జేరుదు ? మేమిసేయుదుము ! ”
అని బహువిధముల నధికశోకాబ్ధి । మునుఁగుచు మఱియు న మ్మురవైరిఁ జూచి
“అన్న, ముకుంద, దైత్యాంతక, కృష్ణ, । పన్నగపర్యంక, పద్మపత్రాక్ష,
ఈతఁడు రణమున కేత్తిపోవుచును । ఆతత భక్తి సాష్టాంగ దండంబు
వెట్టి చేతులు మోడ్చి ప్రేమ రెట్టింప । “ గట్టిగా జయసిద్ధి గలుగ దీవింపు”
మని పల్క ' ధర్మ మెయ్యెడఁ గల దచట (?) । ఘనతర జయసిద్ధి గలిగెడు ' మంటి.
అది యెటులనినఁ బాయక జూద మెపుడు । గదనహేతువు ; భూపగణముల [1] కెపుడు
మృత్యువు గావున మేదినిలోన । నత్యంతభక్తితో నాత్మజుఁ డనుచుఁ
బ్రియములు పలికినఁ బెంపెల్లఁ జెడదె ! । నయమొప్ప నదిగాన నందనుఁ బ్రేమ
దీవింపఁ జేరక సుస్థిర ధర్మయుక్తి । భావించి మధ్యస్థ భావలాడితిని.
మఱియు నాతనితోడ “ మహితాహవమున । నెఱిమీఱ నెంతయు నిలిచి పోట్లాడి
వెలయంగ శత్రు జీవితఁ బరలోక । కలిత సౌఖ్యస్ఫూర్తి గనుఁగొను మనఘ ! ”
యని చెప్పి పనిచిన నంబురుహాక్ష ! । పనివడి యతఁడు నావనిసేసి యరుల
దండిగా నెదిరించి తఱిమి ఖడ్గమున । ఖండించి పుణ్యలోకమునకుఁ బోయె
ననియుండఁగా నోప దంతరంగంబు । ఘనతర శోక సంకలితమైనదియు.
తక్కక ధృతరాష్ట్ర ధరణివల్లభుఁడు । దిక్కులేమి తలంచి ధృతి పొక్కకున్నె !
చెలిమితో నవరత్నసింహాసనమునఁ । గలకంఠు లెంతయుఁ గరకంకణముల

1. కెల్ల. (చ)

ఝణఝణత్కారముల్ సంఘటింపంగఁ । బ్రణుతిమై వింజామరమ్ములు వీవ
సుమహితాష్టైశ్వర్య శోభితుఁ డగుచుఁ । గ్రమము దీపించిన కౌరవేశ్వరుఁడు
ఘన జంబుకంబులుఁ గాకగృధ్రములుఁ । దను బరివేష్టింప ధరఁ బడినాఁడు.
విదురుండుఁ దండ్రియు వేయిచెప్పినను । సుదమున వినక యున్మత్తుఁడై కూలె.
అనఘాత్మ, విధిమూఁడినట్టి మర్త్యుండు । వినునె హితోక్తులు విశదంబు గాఁగ?
కొలఁది నేకాదశాక్షౌహిణీ బలము । గలుగు మహారాజు కౌరవేశ్వరుఁడు
గద చేత నూరు భగ్నంబయ్యె నేల । నిదె యొంటిమైఁ జిక్కి యీల్గినవాఁడు.
మఱియును వినవయ్య మధుదైత్యహరణ, । గుఱి గలిగిన యట్టి కొడుకు మృతంబు
కంటెఁ గోడండ్రదుఃఖంబులు చూడ । నంటునే చిత్తంబు! హా విధి గడవ
రాదెవ్వరికినైన; రారాజు కొంత । నాదటఁ జూడుమో యంబుజనాభ!
సొలపుతో నీఁవల సుతుఁజూచి వదన । జలజ మల్లాడంగ సరవిఁ బ్రాణేశు
పైఁ దనచూడ్కి దప్పక నిల్పి మొగము । మోఁదుకొనుచుఁ బుత్రు మోమున మోము
మోపి ప్రాణేశ్వరు మోమును జూచి । తాప మగ్గలమైన ధరణిపైఁ ద్రెళ్లి
తెలివొంది కన్నీరు దేహంబు నిండఁ । జెలులతో నెంతయుఁ జేష్టలు దక్కి
యున్నది యకట యీ యుగ్మలిఁ జూడు! । పన్నగతల్ప, యీపట్టునఁ బుత్రు
మనుమనిఁ జూచి నామది నీఱుగాదు. । గొనకొని యెంత ఱాగుండె నాగుండె!"
అని యిట్లు గాంధారి యధికశోకమున । మునుఁగుచు మఱియు నమ్మురవైరికనియె:
"కమలాక్ష, భీముని గద [1] బెట్టుదగిలి । ప్రమద మిసుమియు లేక ప్రాణముల్వోయి
ఆతనిచేత సర్వాంగ రక్తంబు । ప్రీతిఁ ద్రావఁగఁ బడి పెంపెల్లఁ దక్కి
పడియున్నవాఁడు; ద్రౌపది నీడ్చి తెచ్చి । పుడమీశ్వరుఁడు భానుపుత్త్రుండుఁ బొగడ
దూరవివేకి యీ దుశ్శాసనుండు । చీరలొల్చుచు గాసి చేసెడువాఁడు
ఉరువడి నేను దుర్యోధను కంటి: । "హరిచేత రక్షితయైన పాంచాలిఁ
బరిభవ దుఃఖంబుపాలు సేయంగఁ । బరికింపఁగాఁ గీడు పాటిల్లకున్నె!
అరిగజ పంచాస్యుఁడైన వాయుజుని । సురుచిరప్రతినలు చూడ భయంబు;
వెరవేది వేవేగ విడువు వీరలను । బరువడి మన్నింపు బ్రతికింపు కులము."
అని పెక్కుభంగుల నాత్మజు కేను । వినిపించుటయు వాఁడు విధివశంబునను

1. పెట్టు గదలి. (మూ)

వినవొల్లఁడయ్యె; నెవ్విధినైన నాఁటి । ఘనమైన పగనాటి కసువలిపట్టి
పగదీర్పఁదగును; ఇప్పురుసునఁ బట్టి । తగవె నెత్తురుద్రావ ధరణీశులకును!
గొనకొని శుభ్రాంశుకులమునఁ బుట్టి । కనలుచు మిగుల దుష్కార్యంబు నెఱపె.
వీఁడె వికర్ణుండు విశ్వేశ, చూడు । వాఁడి శౌర్యంబున బ్రాలినవాఁడు.
మహిలోన నెదిరికి మార్కొనరాని । విహిత ప్రతాపుఁడు వీఁడె దుర్ముఖుఁడు.
భూరజంబున బ్రుంగి పొలుపఱినాఁడు । శూరసేనుని వీనిఁజూడు శ్రీకృష్ణ!
అంగజకోటులఁ దతిసాహసుండు । సంగతిగా వివింశతి యున్నవాఁడె!
ఘనముగా నప్సరోగణములు గొంద్రుఁ । జనవునఁ గొలిచెడి చాడ్పున సతులు
చందనాద్యుపలేప శాలినుల్ గొలువ । నందంద వర్తిల్లుఁజుట్టి దుష్ప్రహుఁడు
కాకులు గ్రద్దలుఁ గదిసి కారింప । నీ కష్ట దుర్దశ నిట్లున్నవాఁడు.
విందానువిందులు వీరె శ్రీకృష్ణ, । సుందరరథికులు సుహితవిక్రములు.
వాఁడె దుర్ధముఁ డల్లవాఁడె వృథుండు । వాఁడె జలాసంధుఁ వాఁడె సహుండు
వాఁడె [1]ప్రశాంతుండు వాఁడె దీర్ఘుండు । వాఁడె చిత్రాఖ్యుండు వాఁడె వర్ముండు.
తనయులు నూర్వురు ధర వాయుపుత్రు । ఘన గదాహతిచేత ఖండింపఁబడిరి.
తనరంగ నీరీతి ధర్మసూనునకుఁ । జనవేని యుండఁటఁ జంపింపఁ దగునె!

## గాంధారి యభిమన్యు కళేబరముఁ గాంచి దుఃఖించుట

కరితురగాదులుఁ గర్ణుండు కృపుఁడు । గురుఁడు మద్రేశుండు గురుతనూభవుఁడు
మొదలైన రథికులిమ్ములఁ జుట్టుముట్టి । వదలక శౌర్య సత్ప్రౌఢిమ మెఱయఁ
బలువురు పొదవినఁ, బ్రథనరంగమునఁ । గలఁగించి యుగ్రసంగర మొనరించి
యుత్తర విలపింప నుర్విపైఁ బడిన । యుత్తము నభిమన్యు నోకృష్ణ, కంటె!
విరస భగజుఁడును వినుత ప్రతాపి । విరటభూపాలుండు వీఁడె ముకుంద!
ఘనుఁ డుత్తరుండును, కాంభోజవిభుఁడు, । తనరు బాలకు లద్భుతంబుదీపింప
విమతులఁ జెండాడి పెను రక్తసిక్త । సమధిక దేహులై సరిఁ బడినారు.
పాండుపుత్రుల భుజాబలగర్వమునను । మండలేశ్వరులెల్ల మహిమతోఁ బొగడఁ
గురురాజు సంగరక్షోణి నుద్వృత్తిఁ । బరఁగి యే వీరునిప్రాపున నెదిరె,
దాపైన యర్థార్థి తతులకు నెల్ల । నేపుణ్యుఁ డిచ్చె నభీప్సితార్థములు,

1. విక్రాంతుండు (చ)

మహిలోన సూర్యసమానప్రకాశ । విహిత తేజంబున వెలసె నేఘనుఁడు,
అంగదేశంబున కధినాథుఁ డగుచు । సంగతిగాఁగ నే [1]వరసుండు మించె,
అదనుగా ధాత్రిలో యమతనూజునకు । హృదయశల్యంబుగా నెప్పుఁడు నెగడె,
అనిమిషవల్లభుఁ డర్థియై [2]వచ్చి । ఘనముగా నడిగినఁ గవచకుండలము
లడె కొనుమని మహాహర్షంబుతోడ । వదలక యే దానవంతుఁ డొసంగె,
సమరంబులో జరాసంధుని గెలిచి । సమధిక విస్ఫూర్తి సఖ్యంబు చేసి
మమత దీపింపంగ మాలినీనగర । మమరంగ వేడుక నాతఁడీయంగ
నేలుచుఁ గీర్తిఁ బెంపెక్కిన దాన । శాలియై వెలసిన చతురుఁ డీఘనుఁడు.
అట్టి భాస్కరపుత్రు నతిశుభగాత్రు । నెట్టన చూచితే నీరజనాభ !
సతులెల్లఁ దివిరి రా సనడి శోకింప । సతుల రజశ్శోణితాంగుఁ డైనాఁడు.
నలిమీఱ మేనఁ బ్రాణంబు వాసియును । వెలయు మొగంబున విలసిల్లువాఁడు
వర శరచాపముల్ వదలనివాఁడు । కురువృద్ధుఁడగు బాహ్లీకునిఁ గనుఁగొంటె !

## సైంధవు కళేబరముఁ జూచి గాంధారి దుఃఖించుట

పలికి తప్పమి నెఱపంగఁ దలంచి । బలభేదిసూనుండు బలువిడిఁ బొదువ
నారయ దుర్యోధనాది భూపతులు । తారడ్డపడఁగ నుద్ధత భుజాబలిమిఁ (?)
దల ద్రెవ్వనేయ సైంధవుఁడు కబంధ । కలితుఁడై యున్నాఁడు ; కౌంతేయు లెలమిఁ
దొల్లి ద్రౌపదిఁబట్టి తోడిఁ బడఁ బోవ । "[3]బల్లిదంబునఁ జంపఁ బాడిగా దితఁడు
మన దుస్సలకు భర్త మన్నింపవలయు । ననుమాన మింకేల ?" యని దయతోడఁ
గాచిరి నాఁడు; సంగ్రామ రంగమున । నేచి చంపిరి నేఁడు ఇభరాజవరద !
నాఁటి కారుణ్య మీనాటికిఁ బోయె ! । నేటికిఁ జింతింప నిది దైవకృతము.
వలనొప్ప మనమున వగలేనియట్లు । తెలియక యటునిటు తిరుగుచున్నదియు.
కలయంగ నఖిల దుఃఖముల నడంచి । జలజపత్రాక్ష, దుస్సలఁ గనుఁగొంటె !
చెలరేఁగి పార్థుండు చేసిన ప్రతిన । వలనుగా వేగుల వారిచే నెఱిఁగి
సరవితోఁ బతికి దుస్సల చెప్పినట్టి । విరివైన బుద్ధులు వినుము శ్రీకృష్ణ !
"త్రిజగంబులోపల [4]దీప్తమైనట్టి । విజయు ప్రతిజ్ఞకు విను [5]మడ్డమెద్ది ?
కురురాజు సైన్యంపుఁగోట్ల [6]నమ్మకుము ; । గురుఁ డర్జునుని మారుకొనఁడు నిక్కంబు ;

1. సరగున. 2. మెచ్చి. (క) 3. బల్లిదుండై. (క) 4. తీవ్ర. 5. మడ్డపెట్టి. 6. నమ్మకయు. (చ)

సమరంబు నీకు నసాధ్యంబు; వేగ । యమతనూజుఁడు గాచు [1]నటకును బొమ్ము;
నామాట వినఁగదే! నాథ, సర్వజ్ఞ, । భామినీ పాంచాల, భానుప్రతాప!
శరణాగతార్తరక్షణ ధురీణుండు । కరుణ గల్గినవాఁడు గాంభీర్య జలధి,
ధర్మతనూజుండు ధర్మాత్ముఁ డతుల । నిర్మలవిజ్ఞాని నృపచక్రవర్తి
మఱఁదివిగాయని మన్నింపఁగలఁడు । అఱలేనిభక్తితో నని పలుమాఱు
చెప్పినబుద్ధులు చెవిఁ బెట్టవైతి! । విప్పాట నింక నేనేమిసేయుదును!
పరికింప నానోముఫల మిట్టిదయ్యె! । ధరణి విశ్వస్తగాఁ దలఁచి యీ పాండు
ధరణీశతనయులు దయమాలి యకట! । దురములోఁ గూల్చిరే దుర్గామశౌర్య!”
అనిపాండునృపానుల నటద్భూతిఁదొడఁగెఁ, । గనుఁగొంచు దుస్సల కంజదళాక్షు!

శల్యుని కళేబరము గాంచి గాంధారి దురపిల్లుట

మొగిఁ గపోలము నేలమోవ బోరగిల । వగచెడి పడియున్నవాఁ డుత్తముండు
పూని యంబాలికాపుత్ర సూనులకు । మేనమామయ్యును మెఱసి రారాజుఁ
జేపట్టి శౌర్యసుస్థితి విలసిల్లి । ప్రాపుగాఁ గర్ణసారథ్యంబుచేసి
కర్ణశల్యంబులుగాఁ బల్కినట్టి । యర్ణవగంభీరుఁ డదే మద్రవిభుఁడు
మఱవక యిటువంటి మహీపతినాల్క । యుఱక కాకులు తినుచున్నవి కృష్ణ!
భగదత్తుఁ జూచితే! ప్రాగ్జ్యోతిషేశు । మగఁటిమిగల మహామహు శౌర్యధుర్యు.
బలమునఁ దనపాటి పార్థివుల్గలరె! । కలితయశోరాశి కారుణ్యజలధి
భూరిశ్రవుని జూడు పుండరీకాక్ష! । వారక గ్రద్దలు వానిపై మునరె.” *
అనియిట్లు వేర్వేఱ నఖిలభూవిభుల । వనజాక్షి గాంధారి వారిజాక్షునకుఁ
జూపుచు నందంద శోకంబునిగుడఁ । గోపించి శ్రీకృష్ణుఁ గుత్సితవృత్తి

గాంధారి శ్రీకృష్ణునకు శాపంబొసఁగుట

పరఁగ వీరల కడ్డపడక యీరీతి । సరసి చంపించితి వక్కటాతగునె!
నిన్నేమిచేసిరి నిఖిలకౌరవులు? । పన్నగాధిపతల్ప, భావింపవైతి!
అన్నదమ్ములలోన నటపదివేలు । ఎన్నికఁ గలహంబు లిలవచ్చుఁబోవు.
అఱిముఱి వారలేమైనఁగానిమ్ము; । అఱలేకమనక నీవాజిలోపలను

1. నకట పోనిమ్ము. (క) * భీష్మాదులఁజూచ్చి చెప్పు విషయ మిట లుప్తము.

విదితంబు గాఁ గౌరవేయులకెల్ల । చెదరక పట్టి చంపించితి గాన
* నవనిలో ముప్పదియాఱవ యేఁట । భవదీయపుత్రులుఁ బౌత్రులు సఖులు
భ్రాతలు జ్ఞాతులు బంధువర్గంబులు । ఖ్యాతిగా నన్యోన్య కలహంబుచేసి
మడియుంగలవారు మాధవ, వినుము ; । ఎడపక నీవు దిక్కెవ్వరు లేక
ధరఁ గూలువాఁడవు ; తథ్యంబు గాను । గురుభామినులరీతిఁ గుందంగఁ గలరు."
అని శాపమిచ్చిన మానవతి యపుడు । ఘనముగా గాంధారిఁ గనుఁగొని పలికె :
"ఏమమ్మ గాంధారి, యిట్లు కోపించి । భీమంబుగాఁ బల్కఁ బెద్దకోఁ దగునె !
తెలియవు మున్నె గాదే యాదవులకుఁ । గలదు శాపము ; మునిగణ నర్యుఁ డొసఁగె.
సరవిమైఁ [1] జర్విత చర్వణ మిట్లు । నిరతిఁ జేసితి విందు నీకేమి గూడె !
చలముతో యదువంశ జాతులకెపుడుఁ । గలదు [2] నాశము ; వారిఁ గదనరంగమున
మద [3] మెత్తి సురలును మార్కొనలేరు. । అది కారణంబుగా నన్యోన్యహతుల
మడియుట నిక్కంబు మచ్చరంబేల ! । కడు వేగిరపడంగ గాంధారి !" యనిన
పలుకులెంతయు విని పాండునందనులు । కలగొని దేహముల్ కంపించుచుండ
నవనిలో బ్రదికెడియాస వోకార్చి । తవిలి యేతెంచి యత్యంతదుఃఖమున
నచటఁ గూర్చుండ, నయ్యంబికేయుండు । సుచరిత్రుఁడగు ధర్మసూను కిట్లనియె :
"ధర్మతనూభవ, ధర్మస్వరూప, । నిర్మలవిజ్ఞాన, నీతి ప్రసిద్ధ,
లీలఁ జచ్చినవారి లెక్క యంతయును । నీలోన నాకు నీ వెఱిఁగింపు." మనిన
"వినుము [4] తలనాథ, విన్నవించెదను ; । ఎనయంగ నిప్పు డీ నెఱిఁగినవారు
ధారుణిలోన నుత్తర మిపతులు । కోరి ముప్పదియారుకోటులు మఱియు
నిరువది వేలును ; ఇక్కడి మూఁక । యిరువదినాల్గు వేలిన్నూటఁబదియుఁ
దెగి" రని చెప్పిన ధృతరాష్ట్రుఁ డనియె : । "పొగడంగ నే గతి పొందంగఁ గలరు
వీర లా తెఱఁగెల్ల [5] వివరింపు". మనిన । నాయూధ విస్ఫూర్తి నాతఁ డిట్లనియె :
"చెలఁగి శరాగ్ని వ్రేల్చినవారు దివికిఁ । జలమునఁ బోయి యచ్చరలు సేవింపఁ
బ్రాజ్య కల్మషులయి యాఖండలునకుఁ । బూజ్యులై యుందురు భూలోకనాథ !

---

* 'నేఁడాదిగా ముప్పదాఱగు నేఁడైన యుద్దినమున.' అని. టిక్కన. 1. జర్వణచర్విత. (క)
2. శాపము. 3. మేది. (చ) 4. భూపాలకా. 5. వినిపింపు. (చ)

పొందుగా శస్త్రాస్త్రములు తమ్ముఁ గాడ । నందంద భయపడినట్టి భూపతులు
పొగడ గుహ్యక లోకమున కేఁగి సౌఖ్య । మగణితంబుగఁ గాంచి యతిశయిల్లుదురు.
స్వామికార్యార్థమై చచ్చినవారు । ఆ మహేంద్రసమానులగుచు [1] సుందురు.
విదితంబుగా నెట్టివిధమున నైన । గదనరంగంబునఁ గాయముల్ విడిచి
వెలసినధన్యులు విశ్వసన్నుతులు । కలితగాంభీర్యులు ఘనపుణ్యనిధులు."
అనవిని ధృతరాష్ట్రుఁడనె: "సనాథులకు । ననఘ! యనాథుల కగ్నికార్యములు
నేయంగవచ్చునే! చెప్పవే!" యనినఁ । బాయక పలికె నప్పాండవాగ్రజుఁడు:
"నరనాథ, నిఖిలజనంబులు వీర । లరుసుమీరఁగ నాహితాగ్నుల" ట్లనుచుఁ
జెప్పి పురోహితు శేష సగుణునఁ । దప్పక ధౌమ్యుని దగ నిరీక్షించి
సరవితో విదురసంజయ యుయుత్సులను । బరికించి యిట్లను: "భరతవంశ్యులకుఁ
దలఁగక నాథ యుక్తముగ సందఱకుఁ । గలఁగక యగ్ని సంస్కారముల్ సేయుఁ"
డని యానతిచ్చిన యంతట వారు । పనిఁబూని సామముల్ బ్రాహ్మణుల్ చదివి
పనివడి ఋగ్యజుఃపఠనంబు [2] సేయ । ననఁ గొని రారాజు మొదలుగాఁ గల్గు
వారికి నగ్ని సంప్రవృత్తి నీయ । భూరితరంబుగాఁ బొగ లుప్పతిల్లఁ
బనిగొని బ్రహ్మాండ భాండమంతయును । ఘనమైన మంటలు గప్ప నాలోన
యమతనూజాతుండు నంధభూపతినిఁ । గ్రమమొప్ప ముందఱఁ గదలించి తాను
వెనుకొని సతులతో వేగంబె కదలి । చని గంగలోపల స్నానంబు చేసి
పొనఁగఁ దిలోదకంబులు పోయునంతఁ । గనుగొంది పృథయును గన్నీరు గ్రమ్మ
నల్లంత నెలుఁగెత్తి హా కర్ణ! యనుచు । నెల్లవారును విన నిట్లని పలికె:

### కర్ణుఁడు తన కొడుకని కుంతి ధర్మజున కెఱిఁగించుట

"ధర్మనందన, వీను తరణితనూజుఁ । డర్మిలి మీకును నగ్రజుం; డతఁడు
కరమొప్ప నాకు భాస్కరుని యంశమున । సరవితోఁ బుట్టిన సత్యసంధుండు
పోయు తిలోదకంబులు వేగ." యనుచు । నాయెడ నంతయు నతని జన్మంబు
వివరింప నంతయు విని ధర్మజుండు । చెవులు సూడినయట్లు చేష్టలు దక్కి
ఘనశోకమునఁ బొంది కన్నీరునించి, । "యినకోటి సమతేజ! యినతనూజాత!

---

1. చుందురవరు! 2. [illegible]. (చ)

యెనయ నీవృత్తాంత మెఱుఁగలేనైతి ! । ... ... ... ...
[1]పాండుని వరాఱుగాఁ బరికించి కొలిచి । యుండలేనైతిగా యుర్విఁ బో నిన్ను !"
అని ధర్మజుఁడు గుంద ననిలనందనుఁడు । ఘనుఁడైన విజయుండుఁ గవలుఁ బాంచాలి
కన్నీరు దొరఁగ గద్గద కంఠులగుచు । విన్ననై తలవాంచి వెలవెల నగుచుఁ
దల్లిని దూఱుచు ధరఁ బొరలుచును । ... ... ... ...
"హా భానునందన ! హాకులోద్ధార ! । హా భుజబలశూర ! యబ్ధిగంభీర !
నిత్యదానవినోద ! నీతిప్రసంగ ! । సత్యసంధుఁడ ! వైరి సంహారకార !"
యని వారు శోకింప, నంత ధర్మజుఁడు । కనుఁగొని తల్లితోఁ గనలుచు ననియె :
"అనిల జార్జునుల ఘోరాహవంబునను । గొనకొని మిగుల మార్కొన నెవ్వఁడోపు;
పనివడి వైదేహ [2]పౌండ్రాధిపతులు । అసిశంబు నెవ్వని కరిగాపులైరి,
పరఁగంగ నెవ్వని బలశౌర్యములకు । నురువడి మనసేన లోదుఁగుచునుండు,
అట్టి మార్తాండజు నగ్నిఁ గొంగునటు । లెట్టుదాఁచితివమ్మ ! యేమిసేయుదును !

1. పాండునిమాఱుగాఁ బరికించి నిన్ను । నిండు వేడుకఁ గొల్చి నీపంపుచేసి
మెలఁగంగ నెంతయు మేదినిలోన । కలయంగ నాపాలి విధియాయె నిట్లు.
ఎఱుఁగంగ వచ్చునే! యేమిసేయుదును ! । కఱకటి నృపజాతి కాల్పనా యకట !
క్షితిలోనఁ బితృసమోజ్యేష్ఠయన్ వాక్య । మతులితంబుగఁ జెప్ప నామ్నాయమందు.
అటువంటివాని నే నాహవభూమిఁ । దటుకునఁ జంపుమో ధవళాక్ష్వ, నీవు
నెఱిఁజంపకున్నను నీ ముఖంబర్థి । నతిముఱిఁజూడ నేనంచుఁ బల్కితిని.
భ్రాతృఘాతకమును బంధుఘాతకము । మాతృఘాతకమును మఱి పితృఘాత
మును గురువధయును మొగిఁ జేసినట్టి । ఘన కల్మషండ, నాశతమునఁ గూలె.
పరగంగ నేనిటు పాపంబుచేసి । ధరలోన నున్నాఁడ దైవమా యనుచు.
హా విక్రమాకార, హాకులోద్ధార, । హావార్ధిగంభీర, హా కురుధీర,
పోయితే రాధేయ, పుణ్యవిధేయ, । పోయితే భానుజ, పోయితే యకట ;
నీ దయావిభవంబు నీవిక్రమంబు । నీ దానచాతురి నీ ప్రతాపంబు
కొలఁది ధాతకునైనఁ గొనియాడ వశమె! । జల ......విపత్ప్రదీపుఁడవు
అని యని దుఃఖింప నా వాయుసుతుఁడు । ననిమిషేశ్వరపుత్త్రుఁ డట మాద్రిసుతులు
తెలఁగంది బాపురే విధి గడవంగ । ధరణిలోపల రాదు తథ్య మెంతయును.
ఇట్టివృత్తాంతంబు లెఱుఁగక యుఱక । పట్టిపోరితి మింత పాపంబు గలదె !
అని వారుశోకింప. (అదిగా మూలము)
2. పాత్రాది. (క)

ధర నభిమన్యుండు ద్రౌపదేయులును । సరవితో దురమునఁ జచ్చినయపుడు
ఇంతదుఃఖము గాదు ; ఇఁక నేటి బ్రదుకు ! । వంతమై [1]మాటికి వగవంగ వలసె. ”
అని పలుతెఱఁగుల యమతనూభవుఁడు । పనవించి పనవించి భానుసూనునకు
నుదక ప్రదానంబు [2]లొనరించునంత, । వదలక వాయుజ వాసవుల్ కవలు
పౌనఃగఁ దిలోదకఁబులు పోసి ; రంత । మసలక ధృతరాష్ట్ర మండలేశ్వరుఁడు
తానును నుదకప్రదానంబు చేసె. । చూనక మఱియు ధర్మజుఁడు దుఃఖించి
రవిపుత్రువలన సౌభ్రాత్రమ్ము పొసఁగఁ । బ్రవిమలమతి వాని భార్యలఁ బిలిచి
పొలుపుగా బహువిధంబుల గారవించి । వెలఁదుఁ గర్ణునికిఁగా వివిధ [3]పుణ్యాములు
గావించి విప్రసంఘమ్ములనెల్ల । రావించి దానముల్ రమణతోఁ జేసె. ”
అనియిట్లు జనమేజయ క్షితీశునకు । ముని చెప్పెననిచెప్ప మోదించి మునులు
“ అనఘాత్మ, తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే” యని యడుగుటయు,
నిరవద్య, సర్వేశ, నీరజనాభ, । పరమేశ, పరమాత్మ, భక్తమందార,
ఫణిరాజశయన, గోపాలక, శార్ఙ్గి, । మణివక్షు, కేశవ, మాధవ, కృష్ణ,
ఘనమాని హృద్గేహకలిత సందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీక,
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్య తనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమా స్త్రీపర్వ రమణ కావ్యమున । నుచితమై యాశ్వాసమొప్పె రెండవది.

1. నిమ్మాడ్కి... 2. లొసఁగ నంతంత. 3. దానములు. (చ)